

వాడపల్లి పట్టాభిరామశర్మ.



స్వయంప్రకాశ బ్రహ్మానందాశ్రమస్వామి.

# Vrittiprabhakara.

OR

The science of realisation of the Supreme Being

A comprehensive treatise on Vedanta Philosophy

composed in Hindi by

Sadhu Nischala Dasu Yogin Author of Vicharasagara

and containing

a lucid and scientific exposition of Metaphysics

in all its aspects,

translated into Telugu

**by Vadapalli Pattabhirama Sarma**

Retired Tahsildar Bezwada Kistna District

With the assistance of **Brahmacharin Pandit Anantanarayana Sastri of Simoga, Mysore Province**

'What shall it profit a man if he shall gain the whole world and lose his own soul?' Christ s saying in the Bible

The end of religion is to unite man with God till he thinks God s thought, which is Truth feels God's feeling which is Love, wills God's will which is Eternal Right

Theodore Parkar

PRINTED AT THE JYOTISMATI PRESS MADRAS

Under the superintendence of the proprietor, the well known Brahmasree Vedam Venkataraya Sastry Avergal

*1 st Edition*
*1000 copies*



**Price Rs 6-0-0**

EXCLUDING POSTAGE ETC

**1912 A D**

హరిః ఓమ్.

శ్రీ గురుచరణసరోజాభ్యాం నమః.

# వృత్తిప్రభాకరము.

విచారసాగరాదిగ్రంథకర్త యగు శ్రీ సాధునిశ్చలదాసయోగీంద్రులచే
హిందీభాషను రచింపఁబడినదియు, సమస్త వేదాంతవిషయములను
కరతలామలక మగునట్లు ప్రబలయుక్తులతో శాస్త్రీయ
మార్గానుసారముగ ప్రతిపాదించునదియు, నగు
సర్వతోముఖ మహావేదాంతగ్రంథము.

కృష్ణామండలమున తహశ్శీల్దారుపనిచేసి యుపకారవేతనము
నందినవాడును, శ్రీ స్వయంప్రకాశబ్రహ్మానందాశ్రమస్వామి
నామకసంయమీంద్రుల యంతేవాసియు
బెజవాడ పురవాస్తవ్యుఁడు నగు

## వాడపల్లి-పట్టాభిరామశర్మచే

కర్ణాటకదేశీయులును, నైష్ఠికబ్రహ్మచారులు, నగు శ్రీ అనంతనారాయణ
శాస్త్రిలవారను పండితవరులసాహాయ్యమున దెనిఁగింపబడినది.

" యోఽన్యథాసంత మాత్మాన మన్యథా ప్రతిపద్యతే ।
కిం తేన న కృతం పాపం చోరేణాఽఽత్మాపహారిణా॥ "

" తావ ద్గర్జంతిశాస్త్రాణి జంబుకా విపినే యథా ।
న గర్జతి మహాశక్తి ర్యావ ద్వేదాంతకేసరీ ॥ "

ఇది,

సుప్రసిద్ధులగు బ్రహ్మశ్రీ, వేదము వేంకటరాయశాస్త్రిలవారి యధ్యక్షత
క్రింద వారి స్వకీయమగు జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందు
చెన్నపట్టణమున ముద్రింపఁబడినది.

1912

ప్రథమముద్రణము 1000-ప్రతులు. { పునర్ముద్రణాద్యధికారము రాజకీయ శాసనానురోధిగ స్వాయత్తము చేసికొనబడినది.

పుస్తకము వెల రు. 6—0—0. పోస్టేజీ వగైరా గాక.

శ్రీగురుభ్యోనమః.

## ఆం ధ్రీ క ర ణ క ర్త

# యు పో ద్ఘా త ము.

---

ప్రపంచమునంగిల పదార్థములు చేతనములు నచేతనములు నని రెండుతెఱఁగుల నున్నవి. వీనిలోఁ జేతనములకుఁ దమ కేపదార్థ మనుకూలమనియు నేపదార్థము ప్రతికూలమనియుఁ దెలిసికొను తెలివికలదు. అందుచేత నవి యెల్లప్పుడు ననుకూలపదార్థములను వెదకి సంపాదించుకొనుటకును బ్రతికూలపదార్థములఁ దొలఁగించుకొనుటకును బ్రయత్నించుచుండును. అయిన నేపదార్థముగాని యొక్కటేరీతిగా ననుకూలముగాఁ గాని ప్రతికూలముగాఁగాని యుండుటలేదు. ఒకప్పు డనుకూల మయినది యొకప్పుడు ప్రతికూల మగుటయుఁ దద్విపరీతమును దటస్థించుచుండును. ఒక కాలమున గరళ మమృత మగుచున్నది. వేఱొకకాలమున నన్నము విషమగుచున్నది. మఱియు ననుకూల పదార్థమునుఁ బ్రయాసపడి సాధించితెచ్చినను అది నిలవరముగా నుండుటలేదు. కొలఁదికాలమునకుఁ గాని గొప్పకాలమునకుఁగాని తప్పక దానితోడ వియోగము కలుగుచున్నది. ఇది యత్యల్పజంతువు మొదలు మనుష్యునివఱకుఁ గల సర్వప్రాణులకును సహజమై యున్నది.

అయినను ప్రాణికోటికిఁగల తెలివిలోఁ దారతమ్య మున్నది. అన్ని ప్రాణులకంటె మనుష్యులకుఁ దెలివి యెక్కువకలదు. అందుచేత నతఁడు తక్కిన ప్రాణులవలె ననుకూలపదార్థాన్వేషణము చేయుచున్నను నాశములేక యెల్లప్పుడు నేకరూపముగాఁ బ్రియముగానుండు పదార్థ మేది. అది నా కెట్లు లభించునని విచారించుచుఁ దద్విషయమునఁ బ్రయత్నము చేయుచు నుండును.

ఇట్లు అనాదినుండి జరుగుచున్నది. మనదేశపు జనులీ విషయమున నెక్కుడు కృషిచేసి యున్నారు. ఈవిషయము విమర్శించుటకు రాజాధిరాజులు తమరాజ్యైశ్వర్యముల వదలి యడవుల కేగుచుండిరి.

ఈకృషి యుక్తమేకదా. కొలఁదికాలము మాత్రమేయుండి యున్నకాలములో నైత నొక్కరీతిగా నుండనిపదార్థముల విషయముననే యధికకృషిసల్పఁబడుచుండఁగా నిత్యముగా నేకరూపముగా నుండు పదార్థము విషయమున నెంతకృషిసల్పినను సల్పవచ్చును. కనుకనే ముఖపత్రముల నింగ్లీషునను దెనుఁగునను ముద్రింపఁబడిన వాక్యములలో మొదటివాక్యము లీయుద్దేశముతోనే చెప్పఁబడినవి. అవి మనదేశములందును విదేశములందును బూర్వకాలమునందుండిన మహనీయుల వాక్యములై యున్నవి. అందుచేత సర్వజనసమాదరణీయము లనుటకు సందియములేదు.

ఇట్టి విచారము పెట్టుకొనియే మన దేశస్థులు ప్రస్తుతపు దీనదశకువచ్చిరని కొందఱు విద్యాధికులు తలఁచుచున్నారు. వారివాక్య మవిచారమూలకమై యున్నది. ఈపూట భుక్తికి

శేషప్పదెప్పుడో రాజ్యాధిపత్యము సహింపఁగ్రహిసిల్వఁ గూడదమునంశమునందు సర్వజనులకును నేకాభిప్రాయమే యున్నది. కాని యీపూట తిండికిమాత్రమే యెల్లప్పుడును విచారించుకొనుచు రేపటి సంగతి యాలోచించుకొనక పోవుట తెలివి తక్కువయగును. మఱియుఁ దొల్తఁ జెప్పినట్లె నిత్యపదార్థమున న్వేషింపనిచో మనుష్యులకును పశుపక్ష్యాదులకును భేదములేక పోవును.

అట్టి నిత్యప్రియపదార్థమును దెలుపుశాస్త్రమే వేదాంతశాస్త్రమై యున్నది. ఆశాస్త్రము సంబంధి గ్రంథములు పూర్వము సంస్కృతమున వ్రాయఁబడుచుండినవి. అందువలన సర్వజనులకును దెలియనివై యుండెను. ఇప్పుడు లోకముయొక్క పుణ్యపరిపాకవశంబున శ్రీనాథునిశ్చలదాస నామకులగు నుత్తర హిందూస్థాన యోగీంద్రులచే దేశభాషలందు వెలయఁజేయఁబడినవి.

ఈ యోగీంద్రుఁ డుత్తరహిందూస్థానమున డెబ్బది సంవత్సరములకుఁ బైకాలము జీవించి యుండినట్లును క్రీ॥ శ॥ 1854 వ సంవత్సరమున విదేహకైవల్యము నందినట్లును దెలియవచ్చెడిని.

మూడువందల సంవత్సరములలోపల నింతసర్వతోముఖపాండిత్యము గలిగిన గ్రంథకర్త వేఱొకఁడుండి యుండలేదన్న వివేకానందుని వాక్యమునందతిశయోక్తి యెంతమాత్రమునులేదు. అనుక్తిమాత్రమున్నది. ఏలయన ప్రాచీనులలో సైతమింతకూలంకషపాండిత్యముగలవారు కొలఁది మందిమాత్రమే కలరు. మఱియు నీయనగ్రంథముల దేశభాషలో వ్రాయుటచే వారికంటెఁ బూజనీయుఁడు.

ఈయన హిందీలో వేదాంతమునఁ బ్రథమశిక్షాగ్రంథము (Elementary text book)గ విచారసాగరమును వ్రాసి ప్రౌఢశిక్షాగ్రంథము (Advanced text book)గ వృత్తిప్రభాకరమును వ్రాసియున్నాఁడు. మఱియు బాలశిక్షాగ్రంథముగ యుక్తిప్రకాశమను చిన్న గ్రంథమును గొన్ని చిల్లరగ్రంథములనుసైతము వ్రాసియున్నాఁడు. వీనిలో విచారసాగర మనేక దేశభాషలలోనికిని ఇంగిలీషు మొదలగు విదేశభాషలలోనికిని మార్పఁబడి సుప్రసిద్ధముగా నున్నది. ప్రౌఢగ్రంథమగుటచేఁ గాఁబోలు వృత్తిప్రభాకర మెంతవరకు దేశభాషలలోనికి మార్పఁబడినట్లగ పడదు—దీనిలో విచారసాగరములో సూక్ష్మముగాఁ దడవఁబడిన యంశములు విపులముగాఁ జర్చింపఁబడినవి. అందు విడువఁబడిన యంశము లన్నియు నిందుఁ జేర్పఁబడినవి. ఇందులేని వేదాంత శాస్త్రవిషయ మెందును లేదనిచెప్పవచ్చును. అట్టి గ్రంథమును దమభాషను గాంచఁగలుగుట యాంధ్రజనుల భాగ్యంబకాదె.

పూర్వోక్తలక్షణములు అనఁగా నిత్యత్వము. ప్రియత్వముగల పదార్థ మాత్మయనియు శాస్త్రసిద్ధాంతము. అది యెట్లైనది పూర్వోక్తగ్రంథమునందు నిరూపింపఁబడి యున్నది. మఱియు నాయాత్మకొఱకు వేఱొకచోటికిఁ బోవనక్కరలేక నిత్యసిద్ధమై యున్నదనియును జ్ఞానము చేతనే పొందఁదగుననియును సిద్ధాంతము. వృత్తియనఁబడునట్టి జ్ఞానమునుఁ బ్రకాశింపఁజేయుటచేతనే యీగ్రంథము వృత్తిప్రభాకర మనఁబడినది.

ఈగ్రంథమును మైసూరురాష్ట్రము శివమొగ్గల కాపురస్థుఁడగు. పరమోత్కృష్ట నైష్ఠిక బ్రహ్మచారియు నగు అనంత నారాయణశాస్త్రి సహాయంబున నాచే యాంధ్రీకరింపబడినది.

వాడపల్లి-పట్టాభిరామశర్మ.

శ్రీరస్తు.

# వృత్తిప్రభాకరము.

## విషయసూచిక.

### ప్రథమప్రకాశము-ప్రత్యక్షప్రమాణనిరూపణము.


| ఉపన్యాససంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| | మంగళాచరణములు. ... ... | 1 |
| ౧ | వృత్తిసామాన్య లక్షణము-తద్భేదములు ... ... | 2 |
| ౨ | ప్రమాణభేదనిరూపణము ... ... | 5 |
| 3 | కరణలక్షణము ... ... | 6 |
| ౪ | ప్రత్యక్షప్రమాభేదనిరూపణము ... ... | 7 |
| ౫ | శ్రోత్రజప్రత్యక్షప్రమానిరూపణము ... ... | 8 |
| ౬ | త్వాచప్రత్యక్ష ప్రమానిరూపణము ... ... | 13 |
| ౭ | చాక్షుషప్రత్యక్ష ప్రమానిరూపణము ... ... | 17 |
| ౮ | రాసనప్రత్యక్ష ప్రమానిరూపణము ... ... | 20 |
| ౯ | ఘ్రాణజప్రత్యక్ష ప్రమానిరూపణము ... ... | 21 |
| ౧౦ | మానసప్రత్యక్ష ప్రమానిరూపణము ... ... | 22 |
| ౧౧ | ప్రత్యక్ష ప్రమాకరణవిచారము ... ... | 25 |
| ౧౨ | జ్ఞానాశ్రయనిరూపణము ... ... | 26 |
| ౧3 | న్యాయమతానుసారముగా భ్రమనిరూపణము ... | ,, |
| ౧౪ | వస్తుజ్ఞానమును గూర్చివిశేషణ జ్ఞానమునకు హేతుత్వము ... | 27 |
| ౧౫ | విశేషణ విశేష్యస్వరూపనిరూపణము ... ... | 29 |
| ౧౬ | విశేషణ విశేష్యజ్ఞానభేదకథన పూర్వకముగ న్యాయమతానుసారముగ భ్రమజ్ఞానవర్ణన సమాప్తి ... ... | 30 |
| ౧౭ | వేదాంత సిద్ధాంతానుసారముగా నింద్రియాజన్య భ్రమజ్ఞాన నిరూపణము | 33 |
| ౧౮ | న్యాయవేదాంతముల యన్యోన్యవిలక్షణత ... ... | 34 |
| ౧౯ | మనస్సింద్రియమనుశ్రీవాచస్పతి మిశ్రమతమును సారగ్రాహిదృష్టిచే సంగీకరించుట. ... ... ... | 35 |
| ౨౦ | న్యాయవేదాంతముల యందలి ప్రత్యక్షవిచారములలో భేదము ... | 38 |
| ౨౧ | ప్రత్యక్ష ప్రమోపసంహారము ... ... | 39 |

| ఉపన్యాససంఖ్య. | | పుట సంఖ్య. |
|---|---|---|

## ద్వితీయప్రకాశము - అనుమానప్రమాణ నిరూపణము.

| | | |
|---|---|---|
| ౨౨ | అనుమితిసామగ్రియొక్క లక్షణము-స్వరూపము. ... | 41 |
| ౨౩ | అనుమితిలింగజ్ఞానమునందు వ్యాప్తిజ్ఞానాపేక్షయొక్క నిరూపణము ... | 43 |
| ౨౪ | సకలనైయాయికుల మతములందు ననుమితిక్రమము ... | 45 |
| ౨౫ | అనుమితివిషయమున మీమాంసకమతము ... ... | 46 |
| ౨౬ | అద్వైతమతానుసారముగా ననుమితిక్రమము ... ... | „ |
| ౨౭ | వ్యాప్తిస్మృతియొక్క-వ్యాపారత్వము-సంస్కారముయొక్క యవ్యాపారత్వము. | 47 |
| ౨౮ | స్వార్థానుమిత్యనుమానముల స్వరూపము ... ... | 49 |
| ౨౯ | పరార్థానుమిత్యనుమానముల స్వరూపము ... ... | „ |
| ౩౦ | వేదాంతమతమునందుఁ దర్కసహితపదార్థానుమానముయొక్క స్వరూపము. | 51 |
| ౩౧ | వేదాంతమతమునం దనుమానమునకుఁ బ్రయోజనము ... | 52 |

## తృతీయప్రకాశము - శబ్దప్రమాణ నిరూపణము.

| | | |
|---|---|---|
| ౩౨ | శాబ్దప్రమాభేదములు ... ... | 53 |
| ౩౩ | శాబ్దప్రమాప్రకారము ... ... | „ |
| ౩౪ | శబ్దశక్తివృత్తినిరూపణము ... ... | 55 |
| ౩౫ | శాబ్దప్రమారీతి కథనపూర్వకముగ శక్తివిషయక వివాదకథనము ... | 56 |
| ౩౬ | వాక్యముయొక్క భేదములు ... ... | 61 |
| ౩౭ | శబ్దశక్తిలక్షణావృత్తుల సంక్షేపనిరూపణము ... ... | „ |
| ౩౮ | వాక్యార్థజ్ఞానక్రమము ... ... | 62 |
| ౩౯ | లక్షణాప్రకార నిరూపణము ... ... | 64 |
| ౪౦ | శబ్దముయొక్క తృతీయవృత్తియగు గౌణవృత్తినిరూపణము ... | 72 |
| ౪౧ | చతుర్థవృత్తియగు వ్యంజనావృత్తినిరూపణము ... | „ |
| ౪౨ | లక్షణాభేద కథనము. ... ... | 74 |
| ౪౩ | శాబ్దబోధ హేతుత్వవిచారము. ... ... | 78 |
| ౪౪ | మహావాక్యమునందు లక్షణ కుపయోగము-దానియందు శంకాసమాధానములు. | 80 |
| ౪౫ | లక్షణలేకయే శక్తివృత్తిచేత మహావాక్యమున కద్వైత బ్రహ్మబోధకత్వము. | 82 |
| ౪౬ | మీమాంసక మతము ... ... | 89 |
| ౪౭ | ప్రాచీనవృత్తికారులగు బోధాయనాచార్యుల మతము. ... | 90 |
| ౪౮ | వైదికవాక్య తాత్పర్యనిర్ణాయకములగు షడ్విధలింగములు. ... | 93 |
| ౪౯ | శాబ్దబోధమందు సహకారులగు నాకాంక్షాదులు నాలుగింటి నిరూపణము. | 94 |
| ౫౦ | ఉత్కటజిజ్ఞాసాబోధహేతుత్వనిరూపణము ... | 101 |
| ౫౧ | వేదాంతముల తాత్పర్యము-వేదము-శబ్దము-వీని విచారము ... | 103 |

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.

చతుర్థప్రకాశము - ఉపమానప్రమాణ నిరూపణము.


౫౨. క్రమభంగము చెయుట యందలి యభిప్రాయము - ద్వివిధన్యాయ మతరీతిగా నుపమానోపమితుల ద్వివిధస్వరూపము ... ... 110
౫౩. వేదాంతమతరీతిగా నుపమానోపమితుల స్వరూపము. ... 111
౫౪. విచారసాగరమునందు న్యాయమతరీతిగా నుపమితిని జెప్పుటయందలి యభిప్రాయము. ... ... 112
౫౫. పూర్వోక్త న్యాయవేదాంతరీతులకంటె విలక్షణమయిన యుపనిషత్యుపమాన లక్షణము. .. ... 113
౫౬. వేదాంతపరిభాషా తట్టీకోక్తుల ఖండనము. ... ... ,,
౫౭. కరణలక్షణ నిర్ణయము. ... ... 115


పంచమప్రకాశము - అర్థాపత్తిప్రమాణనిరూపణము.


౫౮ న్యాయమతమునందర్థాపత్తియొక్క యనంగీకారము-త్రివిధానుమానవర్ణనము. 120
౫౯ వేదాంతమతరీతిగా నేకాన్వయ్య (నన్వయవ్యతిరేక్య) నుమానార్థాపత్తుల స్వీకారము ... ... ... 122
౬౦ అర్థాపత్తి ప్రమాణప్రమల స్వరూపభేదమును, దదుదాహరణములును 123
౬౧ జిజ్ఞాసువున కనుకూలములగు నర్థాపత్త్యుదాహరణములు ... 126


షష్ఠప్రకాశము - అనుపలబ్ధి ప్రమాణనిరూపణము.


౬౨ అభావముయొక్క సామాన్యలక్షణము - తద్భేదములు ... 129
౬౩ ప్రాచీన న్యాయమతప్రకార మభావములకుఁ బరస్పర విలక్షతా సాధకమగు ప్రతీతి ... ... 131
౬౪ నవీన న్యాయమతప్రకార మభావములకుఁ బరస్పర విలక్షణతాసాధక ప్రతీతి 132
౬౫ అభావ ద్వితీయలక్షణ విలక్షణప్రతీతి ... ... ,,
౬౬ అన్యోన్యాభావలక్షణము-దానియందు శంకాసమాధానములు ... 133
౬౭ నవీనరీతిగా సంసర్గాభావముల చతుర్విధ భేదములు-వానిలక్షణము-పరీక్ష 137
౬౮ నాలుగు సంసర్గాభావములకును బ్రతియోగితో విరోధము-అన్యోన్యాభావమున కవిరోధమను దాని నిరూపణము ... ... 142
౬౯ చతుర్విధ సంసర్గాభావములకును బరస్పర విరోధము, అన్యోన్యాభావమునకు వానితో నవిరోధము ... ... 145
౭౦ ప్రాచీనమతప్రకార మభావముల కొండొంటితోడను బ్రతియోగులతోడను విరోధావిరోధముల విస్తరప్రతిపాదనము ... ... 146
౭౧ నవీనతార్కిక మతప్రకారము సామయికాభావస్థానమునం దత్యంతాభావము యొక్క యంగీకారము-అందు శంకాసమాధానములు ... 160
౭౨ ఉక్తనవీనతార్కిక మతఖండనము. ... ... 162

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.

౨౩ న్యాయసంప్రదాయ మతప్రకారము ఘటప్రధ్వంసముయొక్క ప్రాగభావమునకు ఘటఘటప్రాగభావరూపత్వము ... ... 165

౨౪ ఉక్తపక్షఖండనము—ఘటప్రధ్వంసముయొక్క యభావప్రతియోగిక ప్రాగభావముయొక్క సిద్ధి ... ... ... 166

౨౫ సామయికాభావముయొక్క ప్రాగభావమున కభావ ప్రతియోగిత్వము ,,

౨౬ ప్రాచీనమతప్రకారము ప్రాగభావముయొక్క ప్రధ్వంసమునకుఁ బ్రతియోగిప్రతియోగియొక్క స్వరూపమునందును - బ్రతియోగి ప్రతియోగియొక్క ధ్వంసమునందును - అంతర్భావమునకు నవీనమతప్రకారము ఖండనము - దానియొక్క యభావప్రతియోగిత్వము ... ... 167

౨౭ ఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావముయొక్క ఘటత్వరూపత్వము-అందు దోషము ... ... ... 168

౨౮ అత్యంతాభావాత్యంతాభావమునకుఁ బ్రథమాత్యంతాభావ ప్రతియోగిరూపత్వ ప్రతిపాదనము—తత్ఖండనము ... ... 169

౨౯ అభావప్రతియోగికాన్యోన్యాభావమున కుదాహరణము—ఉక్తార్థానువాదము 172

౩౦ ఉక్తన్యాయమతమునందు వేదాంతమతవిరుద్ధాశంకా ప్రదర్శనము—అనాదిప్రాగభావఖండనము ... ... ... 173

౩౧ అనంతప్రధ్వంసాభావఖండనము ... ... ... 178

౩౨ అన్యోన్యాభావమునకు సాదిసాంతత్వానాదిత్వముల యంగీకారము 179

౩౩ అభావప్రమకు హేతువగు ప్రమాణముయొక్క నిరూపణము - అభావజ్ఞానమునందు భేదములు - న్యాయమతప్రకారము భ్రమ ప్రత్యక్షమునందు విషయముయొక్క యపేక్షలేమి ... ... ... 182

౩౪ సిద్ధాంతమునందుఁ బరోక్షభ్రమయందు విషయముయొక్క యపేక్షలేమి—అపరోక్షభ్రమయందు గలిమి ... ... 182

౩౫ సిద్ధాంతమునం దభావభ్రమాదిస్థానములం దన్యథాఖ్యాతియొక్క యంగీకారము 183

౩౬ ప్రత్యక్షపరోక్ష యథార్థభ్రమరూపాభావ ప్రమ కింద్రియానుపలంభాది సామగ్రియొక్క వర్ణనము ... ... ... 185

౩౭ స్తంభమునందు బిశాచముయొక్క దృష్టాంతముచేత శంకాసమాధాన పూర్వకముగా ననుపలంభముయొక్క నిర్ణయము ... ... 189

౩౮ ఉపలంభమున కారోపముగాని యనారోపముగాని యుండినపు డభావమునకు బ్రత్యక్షత్వముగాని యప్రత్యక్షత్వముగాని కలుగుటయం దుదాహరణము 198

౩౯ ఏ యింద్రియముచే నుపలంభముయొక్క యారోపముకల్గినదో, యా యింద్రియముచే నుపలంభారోపమువలన నభావప్రత్యక్షము కలుగుట 201

౪౦ న్యాయమతప్రకారము సామగ్రీసహితాభావ ప్రమానిరూపణము 205

౪౧ అభావప్రమాసామగ్రియందు న్యాయమతమునకును భాట్టవేదాంతములకును విలక్షణత్వము. ... ... ... ... 207

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.

౯౨ వేదాంతరీతిగా నిరింద్రియాజన్య ప్రత్యక్షమునకు లక్షణనిర్ణయము 209

౯౩ ప్రత్యభిజ్ఞాప్రత్యక్షజ్ఞానముయొక్కయు నభిజ్ఞాప్రత్యక్షజ్ఞానముయొక్కయు నిర్ణయమును సామగ్రియు ... ... ... 210

౯౪ ఇంద్రియ జన్యతానియమ రహితప్రత్యక్షజ్ఞానానుసంధానము... 214

౯౫ ఎల్లచో నభావజ్ఞానమునకుఁ బరోక్షతయొక్క నిర్ణయము ... 216

౯౬ అనుపలబ్ధి ప్రమాణాంగీకారమునందు నైయాయికశంకకు సిద్ధాంతి సమాధానము 220

౯౭ జిజ్ఞాసువున కనుపలబ్ధిప్రమాణనిరూపణముయొక్క యుపయోగము 229

---

## సప్తమప్రకాశము.

### వృత్తిభేదములు - అనిర్వచనీయఖ్యాతిమండనము.

### అన్యఖ్యాతిఖండనము - స్వతఃప్రమాత్వనిరూపణము.

౯౮ ఉపాదాన (సమవాయి) కారణము - అసమవాయికారణము - నిమిత్తకారణము వీనియొక్కయు సంయోగముయొక్కయు లక్షణము ... 230

౯౯ కారణద్వయాంగీకారము - తృతీయ మగు నసమవాయికారణముయొక్క ఖండనము ... ... ... 236

౧౦౦ వృత్తిజ్ఞానముయొక్క యుపాదాన నిమిత్తకారణముల సామాన్యలక్షణము 241

౧౦౧ ప్రత్యక్షముయొక్క లక్షణము ప్రమా-అప్రమా రూపవృత్తిజ్ఞానముయొక్క భేదములు ... ... ... 248

౧౦౨ సంశయరూపభ్రమయొక్క లక్షణము-దానియందు భేదములు 253

౧౦౩ నిశ్చయ రూపభ్రమజ్ఞానముయొక్క లక్షణము ... 257

౧౦౪ అధ్యాస లక్షణము-తద్భేదములు ... ... 258

౧౦౫ అన్యోన్యాధ్యాస విషయక శంకాసమాధానములు ... 260

౧౦౬ అనాత్మయం దధ్యస్తమగు నాత్మకుఁ బారమార్థిక సత్త చెప్పుటయందలి తాత్పర్యము ... ... 262

౧౦౭ అధ్యాసమునకు మఱియొక లక్షణము ... ... 264

౧౦౮ ఏకాధికరణమునందు భావాభావములకు విరోధశంకయు సమాధానమును ,,

౧౦౯ అధ్యాస ప్రసంగమునందు గలుగు నాలుగు శంకలు ... 265

౧౧౦ ఆనాలుగు శంకలకును సమాధానము ... ... 267

౧౧౧ పూర్వోక్తములగు నధ్యాసభేదముల యనువాదము వాని కుదాహరణములు 270

౧౧౨—౧౧౩. సిద్ధాంత సమ్మతమైన యనిర్వచనీయ ఖ్యాతియొక్క నిరూపణము. ,,

౧౧౨ సాంప్రదాయిక మతము ... ... 273

౧౧౩ ఉక్తానిర్వచనీయ ఖ్యాతిరూపమతమునందు శంక-సంక్షేపశారీరకకారుల సమాధానము ... ... 275

౧౧౪ కవితార్కిక చక్రవర్తి నృసింహభట్టోపాధ్యాయుని మతముయొక్క యనువాదము - దానియం దనాదరము ... ... 276

| ఉపన్యాససంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౧౩౮ | సత్ఖ్యాతివాదము ... ... | 318 |
| ౧౩౯ | సత్ఖ్యాతివాదఖండనము ... ... | 319 |
| ౧౪౦ | శుక్తియందు సత్యరజత సామగ్రియొక్క యంగీకారము - తత్ఖండనము | ,, |
| ౧౪౧ | ఉక్తదోషమునకు సత్ఖ్యాతివాది కృతపరిహారము - తత్ఖండనము ... | 321 |
| ౧౪౨ | రజజ్ఞాననివృత్తిచేఁ బ్రాతిభాసికవ్యావహారిక రజతములనివృత్తి—తత్ఖండనము | ,, |
| ౧౪౩ | సత్ఖ్యాతివాదమునందుఁ బ్రబలదోషము ... ... | 323 |
| ౧౪౪—౧౪౭. | త్రివిధాసత్ఖ్యాతివాదరీతి - తత్ఖండనము | |
| ,, | శూన్యవాదిసమ్మతమగు నసత్ఖ్యాతివాదముయొక్క ఖండనము ... | 324 |
| ౧౪౫ | కొందఱు తాంత్రికులరీతిగా నసత్ఖ్యాతివాదము ... | 325 |
| ౧౪౬ | న్యాయవాచస్పత్యకారసమ్మతమైన యసత్ఖ్యాతివాదము ... | 326 |
| ౧౪౭ | చివర రెండసత్ఖ్యాతివాదములయు ఖండనము ... ... | 327 |
| ౧౪౮—౧౫౩. | ఆత్మఖ్యాతిక్రమము తత్ఖండనము | |
| ,, | ఆంతరపదార్థముల నంగీకరించు నాత్మఖ్యాతివాది యభిప్రాయము | 328 |
| ౧౪౯ | ఆంతరపదార్థముల నంగీకరించు నాత్మఖ్యాతివాదిమతముయొక్క ఖండనము | 329 |
| ౧౫౦ | ద్వివిధసౌగతులలో బాహ్యపదార్థవాది చేసిన యాత్మఖ్యాతివాదముయొక్క యనువాదము ... ... ... | ,, |
| ౧౫౧ | బాహ్యపదార్థముల నంగీకరించు నాత్మఖ్యాతిమతముయొక్క ఖండనము. | 330 |
| ౧౫౨ | ఆత్మఖ్యాతివాదముకంటె విలక్షణమగు నద్వైతవాద సిద్ధాంతము. | 331 |
| ౧౫౩ | సిద్ధాంతమునందుఁ జూపఁబడిన గౌరవదోషమునకుఁ బరిహారము—ద్వివిధవిజ్ఞానవాదములయు నసంభవము ... ... | 333 |
| ౧౫౪—౧౬౧. | అన్యథాఖ్యాతిక్రమము తత్ఖండనము | |
| ,, | అన్యథాఖ్యాతివాది తాత్పర్యము ... ... | 334 |
| ౧౫౫ | విచారసాగరమందు జెప్పఁబడిన ద్వివిధాన్యథాఖ్యాతివాదములలో బ్రథమమగు ప్రాచీనమతమురీతి-తత్ఖండనము ... ... | 335 |
| ౧౫౬ | పూర్వోక్తాన్యథాఖ్యాతి ఖండనము ... ... | 336 |
| ౧౫౭ | ప్రత్యక్షజ్ఞానమునకు హేతువులగు షడ్విధలౌకిక త్రివిధాలౌకిక సంబంధములు | 337 |
| ౧౫౮ | న్యాయమతమునం దలౌకికసంబంధముచే శుక్తియందు దేశాంతరస్థ రజతత్వముయొక్క ప్రత్యక్ష భానము—ఆ భానముకంటె సుగంధి చందనముయొక్క భానమునకు వైలక్షణ్యము ... ... | 343 |
| ౧౫౯ | అనిర్వచనీయ ఖ్యాతియందు న్యాయోక్త దోషము ... | 345 |
| ౧౬౦ | సామాన్య లక్షణాద్యలౌకిక సంబంధములకుఁ బ్రత్యక్షజ్ఞాన హేతుత్వము సంభవింపనందున భ్రమజ్ఞానమున కింద్రియాజన్యత్వము ... | 347 |
| ౧౬౧ | అనిర్వచనీయ వాదమునందు న్యాయోక్త దోషముల యుద్ధారము. | 357 |
| ౧౬౨—౧౬౫. | అఖ్యాతి వాదక్రమము తత్ఖండనము | |
| ౧౬౨ | అఖ్యాతివాది యభిప్రాయము ... ... | 361 |

| ఉపన్యాససంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౧౬౩ | అఖ్యాతివాది మతమునందు పరస్పరాశ్రితశంక కుద్ధారము ... | 362 |
| ౧౬౪ | అఖ్యాతివాద ఖండనము ... ... | 366 |
| ౧౬౫ | భ్రమజ్ఞానవాది మతమునందు ముక్తదోషముల కసంభవము ... | 371 |
| ౧౬౬——౧౭౧. | ప్రమాత్వాప్రమాత్వముల స్వరూపము నుత్పత్తియును జ్ఞానముయొక్క ప్రకాశమును | |
| .. | ప్రమాత్వాప్రమాత్వముల స్వరూపము ... | 373 |
| ౧౬౭ | న్యాయవైశేషిక మతములయందు జ్ఞానోత్పాదక సామగ్రిచేతను బాహ్యసామగ్రి చేతను ప్రమాత్వాప్రమాత్వముల యుత్పత్తియు (పరతఃప్రామాణ్యవాదమును స్వతోఽప్రామాణ్యవాదమును) ... | 375 |
| ౧౬౮ | జ్ఞానజ్ఞానత్వముల సామగ్రికంటె నన్యమగు సామగ్రిచేతఁ బ్రమాత్వజ్ఞానమున కుత్పత్తి (పరతఃప్రామాణ్యగ్రహవాదము) ... ... | 376 |
| ౧౬౯ | మీమాంసక మతమునందును సిద్ధాంతమతమందును సమ్మతమగు స్వతఃప్రామాణ్యవాదమునందు దోషము ... ... | 381 |
| ౧౭౦ | ప్రాభాకరమతమునందు సకలజ్ఞానముచేతను త్రిపుటియొక్క ప్రకాశము. | 382 |
| ౧౭౧ | మురారి మిశ్రమతము ... ... | ,, |
| ౧౭౨ | భాట్ట సిద్ధాంతము ... ... | ,, |
| ౧౭౩ | న్యాయవైశేషిక మతముల నిష్కర్ష ... ... | 383 |
| ౧౭౪ | న్యాయవైశేషిక మతముల ఖండనము ... ... | 386 |
| ౧౭౫ | మురారి మిశ్రమతఖండనము ... ... | 388 |
| ౧౭౬ | భాట్ట మతఖండనము ... ... | ,, |
| ౧౭౭ | ప్రాభాకర మతఖండనము ... ... | ,, |
| ౧౭౮ | స్వతఃప్రామాణ్య వాదాంగీకారమగు సిద్ధాంతమతమునందుఁ జెప్పబడిన సంశయానుపపత్తిరూప దోషమున కుద్ధారము ... ... | 389 |
| ౧౭౯ | న్యాయమత (పరతఃప్రామాణ్యవాద)మునందు దోషము ... | 390 |
| ౧౮౦ | అఖ్యాతివాదివచనమునకు బరిహారము ... ... | 392 |
| ౧౮౧ | భ్రమజ్ఞానత్రైవిధ్యము - వృత్తిభేదముల యుద్ధారము ... | 393 |


## అష్టమప్రకాశము.

### జీవేశ్వర స్వరూపనిరూపణము - వృత్తిప్రయోజననిరూపణము - కల్పితనివృత్తి స్వరూపనిరూపణము.


| | | |
|---|---|---|
| ౧౮౨——౧౮౬. | అజ్ఞానవిషయక విచారము. | |
| .. | వృత్తిప్రయోజన కథనప్రతిజ్ఞ ... ... | 395 |
| ౧౮౩ | అజ్ఞానమున కాశ్రయమును - విషయమును ... ... | ,, |
| ౧౮౪ | అజ్ఞాననిరూపణము ... ... | ,, |
| ౧౮౫ | అజ్ఞానముయొక్క యనాదిభావరూపత్వమందు శంక ... | 396 |

ఉపన్యాససంఖ్య. ... పుటసంఖ్య.

౧౮౬ ఉక్తశంకకు సమాధానము ... ... 397

౧౮౭—౨౦౨ జీవేశ్వరవిషయక విచారము.

,, మాయావిద్యలు - జీవేశ్వరుల స్వరూపమునందు నాలుగుపక్షములు 398

౧౮౮ పైనాలుగు పక్షములందును ముక్తజీవునకు శుద్ధచేతనముతో నభేదము 400

౧౮౯ ఉక్తపక్షచతుష్టయమునందు నా అనాదిపదార్థములను జెప్పి త్రివిధచేతనముల నంగీకరించుట ... ... 400

౧౯౦ చిత్రదీపమునందు విద్యారణ్యస్వాములచే జెప్పబడిన చేతన భేదములునాలుగు 400

౧౯౧ బింబప్రతిబింబవాదముకంటె నాభాసవాదమునకు భేదము ... 401

౧౯౨ ఆభాసవాదరీతిగా జీవబ్రహ్మభేదవాక్యములందు బాధసామానాధికరణ్యము 402

౧౯౩ కూటస్థునకును బ్రహ్మమునకు నభేదస్థలమునందభేద(ముఖ్య) సామానాధికరణ్యము 402

౧౯౪ ఉక్తబాధసామానాధికరణ్యమునందు వివరణకార వచనముతో నవిరోధము 402

౧౯౫ జీవునకు బ్రహ్మముతో వివరణోక్త ముఖ్యసామానాధికరణ్యము ... 403

౧౯౬ విద్యారణ్యోక్త చతుర్విధచేతనభేదముల యనువాదము ... 404

౧౯౭ బుద్ధివాసనయందుండు ప్రతిబింబమునకు విద్యారణ్యస్వామిచేఁ జెప్పఁబడిన యీశ్వరత్వముయొక్క ఖండనము ... ... 404

౧౯౮ ఆనందమయకోశమునకు విద్యారణ్యస్వామిచేఁ జెప్పఁబడిన యీశ్వరతయొక్క ఖండనము ... ... 405

౧౯౯ ఆనందమయకోశమునకు మాండూక్యోపనిషత్తునందుఁ జెప్పఁబడిన సర్వజ్ఞత్వాదికమునకు నభిప్రాయము ... ... 406

౨౦౦ ఆనందమయకోశమున కీశ్వరత్వమునందు విద్యారణ్యస్వాములకు దాత్పర్యములేమి 408

౨౦౧ చేతనముయొక్క త్రివిధభేదములకును విద్యారణ్యస్వామి ప్రభృతులెల్లరయొక్క యనంగీకారము ... ... 409

౨౦౨ మోక్షయదశయందు జీవునకు క్తపక్షములందు శుద్ధబ్రహ్మముతోడను వివరణపక్షమం దీశ్వరునితోడను నభేదము ... ... 409

౨౦౩—౨౦౯ వేదాంతసిద్ధాంతమునందు ప్రక్రియాభేదము.

,, వివరణకార మతప్రకారము జ్ఞానప్రతిబింబు డగు జీవునియొక్కయు బింబభూతుడగు నీశ్వరునియొక్కయు నిరూపణము ... ... 410

౨౦౪ అవచ్ఛేదవాదికృతాభాసవాద ఖండనమును స్వమత నిరూపణమును 411

౨౦౫ అవచ్ఛేదవాద కథనము ... ... 413

౨౦౬ అంతఃకరణావచ్ఛిన్న చేతనము జీవు డనియు ననవచ్ఛిన్న చేతన మీశ్వరు డనియు ననునీపక్షముయొక్క ఖండనము ... ... 413

౨౦౭ తృప్తి దీపమునందు విద్యారణ్యస్వాములచే నంతఃకరణముయొక్క సంబంధమునకును దదభావమునకును జెప్పబడిన యుపాధిత్వముయొక్క యభిప్రాయము 414

౨౦౮ అవచ్ఛేదవాదమునందు భేదములు-ఆవాదముయొక్క సమాప్తి... 414

౨౦౯ సిద్ధాంతముక్తావళ్యాది గ్రంథములందుఁ జెప్పఁబడిన యేకజీవ (దృష్టిసృష్టి) వాదముయొక్క నిరూపణము ... ... 415

౨౧౦—౨౧౫ వేదాంతసిద్ధాంతముయొక్క నానాప్రక్రియలయు దాత్పర్యము. 417

,, సకలాద్వైతగ్రంథములకును దాత్పర్యవిషయము ... 417

౨౧౧ జీవేశ్వరులవిషయమై సర్వగ్రంథకారులయు సమ్మతిని గోడీకరించుట 417

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.

౨౫౮ సృష్టిదృష్టివాద (వ్యావహారిక పక్ష) కథనము ... ... 451

౨౫౯—౨౬౫. మిథ్యాప్రపంచముయొక్క మిథ్యాత్వమునందు శంకాసమాధానములు. 452

,, ఉక్తోభయ పక్షములందును మిథ్యాపదార్థముల మిథ్యాత్వ విషయమున ద్వైతవాదుల యాక్షేపము ... ... 452

౨౬౦ పయి యాక్షేపమునకు అద్వైతదీపికోక్త సమాధానము ... 453

౨౬౧ మిథ్యాప్రపంచముయొక్క మిథ్యాత్వ ధర్మమునందు ప్రకారాంతరముగా ద్వైతవాదుల యాక్షేపము ... ... 454

౨౬౨ ఉక్తాక్షేపమునకును యుక్తసమాధానమే ఘటించుట ... 454

౨౬౩ అద్వైతదీపికోక్తసమాధానమునకు సత్తాభేదము నంగీకరించినయెడల సంభవమును నేకసత్త నంగీకరించినయెడల నసంభవమును ... 455

౨౬౪ ఉక్తాక్షేపమునకు గ్రంథకర్త నిశ్చలదాసునిచే జెప్పఁబడిన సమాధానము 455

౨౬౫ ఉక్తాక్షేపమునకు అన్యగ్రంథకారులచే జెప్పబడిన సమాధానము ... 456

౨౬౬—౨౭౦. మతభేదముచే నానావిధములుగా ప్రపంచ సత్యత్వముయొక్క ప్రతిక్షేపము (తిరస్కారము.) 457

,, తత్త్వశుద్ధికార రీతిగా ప్రపంచ సత్యత్వముయొక్క ప్రతిక్షేపము 457

౨౬౭ అన్యగ్రంథకార రీతిగా ప్రపంచ సత్యత్వ ప్రతిక్షేపము ... 458

౨౬౮ న్యాయసుధాకర రీతిగా ప్రపంచసత్యత్వ ప్రతిక్షేపము ... 459

౨౬౯ అన్యాచార్యరీతిగా ప్రపంచసత్యత్వ ప్రతిక్షేపము ... 459

౨౭౦ సంక్షేపశారీరక రీతిగా ప్రపంచసత్యత్వ ప్రతిక్షేపము ... 460

౨౭౧—౨౭౮. కర్మముయొక్క జ్ఞానసాధనత్వ విషయమున విచారము. 460

,, మిథ్యాప్రపంచ నివృత్తియందు కర్మయొక్క యనుపయోగముయొక్క యనువాదము—సిద్ధాంతగ్రంథములయం దుదాహరింపఁబడిన ద్వివిధ సముచ్చయముల యుద్ధారము ... ... 460

౨౭౨ భాష్యకారోక్త సాధనత్వము ... ... 461

౨౭౩ వాచస్పత్యుక్త జిజ్ఞాసా సాధనత్వము ... ... 462

౨౭౪ కర్మకు వివరణకారోక్త జ్ఞానసాధనత్వము ... ... 462

౨౭౫ వాచస్పతిమతమునకును వివరణకార మతమునకును విలక్షణతయందు శంక 463

౨౭౬ ఉక్తశంకకు సమాధానము ... ... 463

౨౭౭ కొందఱాచార్యులమతము ప్రకారము వర్ణమాత్ర ధర్మమునకు విద్యయం దనుపయోగము ... ... 464

౨౭౮ కల్పతరుకారమతప్రకారము సకలనిత్య కర్మలకును విద్యయం దుపయోగము 464

౨౭౯ సంక్షేప శారీరకకార మతప్రకారము కామ్యనిత్య సకలశుభకర్మలకును విద్యయం దుపయోగము ... ... 465

౨౮౦—౨౮౨. సన్న్యాసముయొక్క జ్ఞానసాధనత్వ విషయమున విచారము. 465

,, పాపనివృత్తి ద్వారమున జ్ఞానమునకు హేతువులయినందున క్రమముగా కర్మకును సన్న్యాసమునకును కర్తవ్యత్వము ... ... 465

౨౮౧ కొందఱు మతరీతిగా సన్న్యాసమునకు ప్రతిబంధక పాపనివృత్తియును ఋణోన్ముక్తి ద్వారమున శ్రవణసాధనత్వమును ... ... 466

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.

౨౮౨ వివరణకార మతమునందు సన్న్యాసమునకు జ్ఞాన ప్రతిబంధక విక్షేపనివృత్తి రూపదృష్టఫల హేతుత్వము ... ... 466

౨౮౩—౨౯౦. క్షత్త్రియులకును వైశ్యులకును సన్న్యాసమునందును శ్రవణమునందు నధికారము విషయమున విచారము ... ... 467

„ క్షత్త్రియ వైశ్యులకు సన్న్యాసమునందును శ్రవణమందు నధికారముయొక్క— విచారమునకు బ్రతిజ్ఞ ... ... ... „

౨౮౪ కొందఱు గ్రంథకారులరీతిగా సన్న్యాసమందును బ్రహ్మశ్రవణమందును బ్రాహ్మణులకే యధికారము—క్షత్త్రియ వైశ్యుల కనధికారము „

౨౮౫ అన్యగ్రంథకారరీతిగా సన్న్యాసమందు కేవలము బ్రాహ్మణులకు నధికారము — క్షత్త్రియ వైశ్యులకు సన్న్యాసమును విడిచి కేవల బ్రహ్మశ్రవణమునం దధికారము ... ... ... „

౨౮౬ వారికంటె నన్యులగు గ్రంథకారులు చెప్పినరీతిగా క్షత్త్రియవైశ్యులకు బ్రహ్మ శ్రవణాధికారమువలె విద్వత్సన్న్యాసమందు నధికారము „

౨౮౭ వార్తికారమతమున వివిదిషాసన్న్యాసమందును క్షత్త్రియవైశ్యుల కధికారము 468

౨౮౮ మఱికొందఱు గ్రంథకారులరీతిగా బ్రాహ్మణులకు జ్ఞానమునందు సన్న్యాసాపేక్ష—క్షత్త్రియవైశ్యులకు సన్న్యాసమునం దధికారము—విద్యోపయోగి కర్మమునందును వేదాంతశ్రవణమునందు నధికారము „

౨౮౯ కొందఱు గ్రంథకారుల మతమునందు శూద్రులకు శ్రవణమం దనధికారము 470

౨౯౦ అన్యగ్రంథకారరీతిగా శూద్రులకుగూడ వేదభిన్నపురాణేతిహాసరూపాధ్యాత్మికగ్రంథ శ్రవణమం దధికారము ... ... „

౨౯౧—౨౯౨. మనుష్యమాత్రులకు భక్తిజ్ఞానాధికారము ... 471

„ అంత్యజాతిమనుష్యులకు దత్త్వజ్ఞానాధికారము ... „

౨౯౨ తత్త్వజ్ఞానమునందు దైవీసంపదపేక్ష—మనుష్యమాత్రులకు భగవద్భక్తియందును దత్త్వజ్ఞానమునందు నధికారముయొక్క నిర్ధారణ „

౨౯౩—౨౯౪. తత్త్వజ్ఞానముచేత స్వహేత్వజ్ఞాననివృత్తివిషయమునశంకాసమాధానములు 472

„ అజ్ఞానకార్యమగు నంతఃకరణముయొక్క వృత్తిరూపమగు తత్త్వజ్ఞానముచేత దానికిఁ గారణమగు నజ్ఞానమునకు నివృత్తివిషయమున శంక „

౨౯౪ ఉక్తశంకకు సమాధానము ... ... „

౨౯౫—౩౦౨. అవిద్యాలేశసంబంధివిచారము ... ... 473

„ తత్త్వజ్ఞానముచేత నవిద్యారూపోపాదానమునకు నాశముకలిగినయెడల జీవన్ముక్త విద్వాంసుల దేహస్థితియందు శంక ... ... „

౨౯౬ ఉక్తశంకకుఁ గొందఱాచార్యులుచెప్పిన సమాధానము ... 474

౨౯౭ ఉక్తసమాధానమున కసంభవము ... ... „

౨౯౮ అవిద్యాలేశమునకు ద్వైవిధ్యము ... ... „

౨౯౯ ప్రకృతార్థమునందు సర్వజ్ఞాత్మమునులమతము ... „

౩౦౦ ఉక్తమతమునకు జ్ఞానియనుభవమందు విరోధము ... 475

౩౦౧ అవిద్యానివృత్తికాలమందు దత్త్వజ్ఞానవృత్తిరీతి ... „

౩౦౨ ప్రకృతార్థమున బంచపాదికాకారులమతము ... „

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.

౩౦౩—౩౦౮. తత్త్వజ్ఞానకారణ సహకారిసాధన విషయవిచారము. 476
,, ఉత్తమ మధ్యమాధి కారిభేదముచేఁ దత్త్వజ్ఞానమునకు ద్వివిధ సాధన కథనము 476
౩౦౪ ఉక్తపక్షద్వయమునందును ప్రసంఖ్యానమునకుఁ దత్త్వజ్ఞాన కరణతారూప ప్రమాణత ... ... 476
౩౦౫ భామతీకారవాచస్పతి మతమునందు ప్రసంఖ్యానమునకు మనస్సహకారిత్వమును మనస్సునకు బ్రహ్మజ్ఞాన కారణత్వమును ... ... 477
౩౦౬ అద్వైతగ్రంథములయొక్క ముఖ్యమతము-(ఏకాగ్రతా సహిత మనస్సునకు సహకారిత్వమును-వేదాంతవాక్యరూప శబ్దమునకు బ్రహ్మజ్ఞాన కరణత్వమును) 477
౩౦౭ శబ్దముచే సపరోక్ష జ్ఞానోత్పత్తియందు శంకాసమాధానములు ... 478
౩౦౮ అన్యగ్రంథకారరీతిగా శబ్దమున కపరోక్షజ్ఞాన జనకత్వము ... 479
౩౦౯—౩౨౫. విషయముయొక్కయు జ్ఞానముయొక్కయు సపరోక్షత్వమునందు విచారము.
,, అన్యగ్రంథకారరీతిగా జ్ఞానమునందును విషయమునందును సపరోక్షత్వ వ్యవహారముయొక్క కథనము ... ... 479
౩౧౦ ఉక్తార్థమునందు శంకాసమాధానములు ... ... 480
౩౧౧ విషయమునందు బరోక్షత్వాపరోక్షత్వ సంపాదకము లగు ప్రమాతృచేతన భేదాభేదములతోఁ గూడిన విషయమందలి పరోక్షత్వా పరోక్షత్వముల కధీనమయిన జ్ఞానగత పరోక్షత్వా పరోక్షత్వముల నిరూపణము 481
౩౧౨ ఉక్తమతమునం దవాంతరవాక్యజన్య బ్రహ్మజ్ఞానమున కపరోక్షత్వాప్రాప్తి యను దోషము ... ... 481
౩౧౩ ఉక్తదోషముచే సపరోక్షత్వమున కన్యలక్షణము ... 482
౩౧౪ అపరోక్షజ్ఞానమునందు సర్వజ్ఞాత్మమునుల మతముయొక్క యనువాదము. 488
౩౧౫ జ్ఞానగతాపరోక్షత్వము విషయగతాపరోక్షత్వమున కధీనమై యున్నది యను మతముయొక్క యనువాదము ... ... ,,
౩౧౬ అద్వైతవిద్యాచార్యులరీతిగా విషయగతజ్ఞానగతములగు సపరోక్షత్వములకు ప్రకారాంతరకథనము - ఇదివఱకే దూషింపబడిన యామతమునందు దూషణాంతరము ... ... 484
౩౧౭ అపరోక్షముయొక్క యుక్తలక్షణమున కసంభవముయొక్క యనువాదము. ,,
౩౧౮ ఉక్తదోషరహితమగు సపరోక్షలక్షణము ... ... 485
౩౧౯ వృత్తిరూపప్రత్యక్షజ్ఞానమునం దుక్తాపరోక్షలక్షణమున కవ్యాప్తి... 486
౩౨౦ ఉక్తావ్యాప్తి కద్వైతవిద్యాచార్యరీతిగా నుద్ధారము ... ,,
౩౨౧ ఉక్తపక్షమందు శంక ... ... 487
౩౨౨ ఉక్తశంకకు సమాధానము ... ... ,,
౩౨౩ ఉక్తపక్షమం దన్యశంక ... ... ,,
౩౨౪ ఉక్తశంకకు సమాధానము ... ... 488
౩౨౫ శబ్దముచే సపరోక్షజ్ఞానోత్పత్తియందు జెప్పబడిన మూఁడుమతములలో ప్రథమమతముయొక్క సమీచీనత్వము .. ... 489

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.


౩౨౬—౩౪౨. వృత్తిప్రయోజన కథనము. 489

,, గ్రంథారంభమందు జేసిన ప్రశ్నత్రయముయొక్కయు, నందులో రెంటికి జెప్పిన యుత్తరములయొక్కయు ననువాదము... ... 489

౩౨౭ వృత్తిప్రయోజనసంబంధి తృతీయప్రశ్నమున కుత్తరమునకారంభము 489

౩౨౮ వృత్తిప్రయోజనకథనావసరమున జాగ్రత్తలక్షణము ... 490

౩౨౯ కొందఱు గ్రంథకారుల రీతిగా నావరణాభిభవము వృత్తికి బ్రయోజనమై యున్నది యనునది ... ... ,,

౩౩౦ సమష్ట్యజ్ఞానమునకు జీవోపాధిత్వము చెప్పు పక్షమునందు బ్రహ్మముయొక్కగాని యీశ్వరునియొక్కగాని జీవచేతనముయొక్కగాని సంబంధముచేత నావరణాభిభవమున కసంభవము ... ... 490

౩౩౧ ఈపక్షమం దపరోక్షవృత్తిచేతగాని యపరోక్షవృత్తి విశిష్టచేతనముచేతగాని యావరణాభిభవమునకు సంభవము ... ... 491

౩౩౨ ఉక్తపక్షరీతిగా వృత్తి కావరణనాశరూప ప్రయోజనముయొక్క కథనము 491

౩౩౩ ద్వితీయపక్షరీతిగా వృత్తికి బ్రయోజనము జీవచేతనమునకు విషయముతో సంబంధము ... ... 492

౩౩౪ అంతఃకరణ విశిష్టచేతనము జీవుఁడను పక్షమునందు విషయసంబంధార్థము వృత్త్యపేక్ష ... ... 493

౩౩౫ పై రెండు పక్షములకును వైలక్షణ్యము ... ... 493

౩౩౬ మతభేదముచే సంబంధమునందు వైలక్షణ్యకథనమ్మునకు నసంగతత్వము 493

౩౩౭ నాలుగు చేతనములయు వర్ణనము - ఉక్తార్థసిద్ధి ... 494

౩౩౮ జాగ్రత్కాలమందుండు వృత్తియొక్క యనువాదము ... 495

౩౩౯ సుషుప్త్యవస్థాలక్షణము ... ... 495

౩౪౦ సుషుప్తి సంబంధియగు నర్థముయొక్క నిరూపణము ... 496

౩౪౧ ఉక్తావస్థాభేదములకు వృత్త్యధీనత్వము ... ... 496

౩౪౨ వృత్తిప్రయోజన కథనము ... ... 496

౩౪౩—౩౫౨. కల్పిత నివృత్తివిషయమున విచారము.

,, కల్పితముయొక్క నివృత్తి కధిష్ఠానరూపత - మోక్షమునందు ద్వైతాపత్తి దోష కథనమున కయుక్తత్వము ... ... 496

౩౪౪ అధిష్ఠాన రూపకల్పిత నివృత్తిపక్షమున న్యాయమకరందకారోక్త దూషణము 497

౩౪౫ న్యాయమకరంద కారరీతిగా నధిష్ఠానముకంటె భిన్నమగుకల్పిత నివృత్తియొక్క నిరూపణము ... ... 498

౩౪౬ న్యాయమకరంద కారరీతిగా గల్పితనివృత్తి స్వరూపముయొక్క నిరూపణము కొఱ కనేక వికల్పముల లేఖనము ... ... 499

౩౪౭ న్యాయమకరందరీతిగా నుక్తచతుర్విధప్రకారములకంటె విలక్షణమై బ్రహ్మము కంటె భిన్నమగు పంచమప్రకారరూప కల్పితనివృత్తియొక్క స్వరూపము 501

౩౪౮ న్యాయమకరందకారమతముయొక్క యసమీచీనత్వము ... 501

ఉపన్యాససంఖ్య. పుటసంఖ్య.

౩౪౯ జ్ఞాతాధిష్ఠానరూప కల్పితనివృత్తి పక్షమునందు న్యాయకరంద కారోక్త దోషమున కుద్ధారము - ఈప్రసంగమున విశేషణోపాధులయు నుపలక్షణము యొక్కయు లక్షణము ... ... 502

౩౫౦ అధిష్ఠానరూపనివృత్తి పక్షమందు బంచమప్రకార వాదిశంక ... 504

౩౫౧ ఆశంకకు సమాధానము ... ... 504

౩౫౨ న్యాయమకరంద కారోక్తరీతికంటె నన్యరీతిగా నధిష్ఠానముకంటె భిన్నమగు కల్పితనివృత్తి స్వరూపము ... ... ,,

౩౫౩ ఉక్తమతమునందు బురుషార్థస్వరూపము (దుఃఖాభావము-లేక కేవలసుఖము.) 506



శ్రీ

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

అవిఘ్న మస్తు.

శ్రీమద్గురుచరణారవిందాభ్యాం నమః.

# వృత్తిప్రభాకరము.

సీ. కమలజుఁ డీమాని గాఁబోలుఁ గాకున్నఁ బద్మాసనాభ్యాసపటిమ గలదె
విష్ణుఁడీ మునిలోక జిష్ణుండు గాఁబోలుఁ గాకున్న సత్కృపాగరిమ గలదె
స్మరహరుం డీలోక గురుఁ డయ్యెఁ గాఁబోలుఁ గాక సర్వజ్ఞత్వ ఘనత గలదె
ప్రకటాబ్జమిత్రుఁడీ భవ్యుండు గాకున్న పరమ హంసాఖ్య వైభవము గలదె
గీ. యంద్రు కవులు స్వయంప్రకాశాఖ్య గాంచి
మహిని బ్రహ్మైక తానంద మహిమ వెలయు
రమ్య శ్రీకర పట్టాభిరామగురుని
సాధు కవివిప్ర రక్షణోత్సాహధరుని.

శ్రీసాధునిశ్చలదాసు శిష్టాచారపరంపరాప్రాప్తమంగళాచరణము నిర్విఘ్నపరిసమాప్త్యర్థమై యనుష్ఠించుచు శిష్యశిక్షార్థమై గ్రంథరూపోల్లేఖనము చేయుచున్నారు.

శ్లో. అస్తిభాతి ప్రియసింధు మైనామరూపజంబాల।
లషితిః ఆత్మస్వరూప నిజహ్యైవతత్కాల నిహాల॥

ఈ హిందూస్థానీశ్లోకార్థ వివరణము:—సచ్చిదానందరూపసముద్రమందు నామరూపా (శరీర) త్మకనౌక యున్నది; దానియం దధిష్ఠాత ఆత్మస్వరూపమున నెప్పుడు సాక్షాత్కరించుకొనునో యప్పుడె ముక్తుడగును.

దీని యభిప్రాయ మేమనగా, సముద్రము ఏప్రకారము నౌకాశ్రయమో ఆప్రకారముననే కల్పితనామరూపాత్మక శరీరమునకు జ్ఞాయమాన సచ్చిదానందాంశము ఆశ్రయ మనియు, నావికుడు ఏలాగున నౌకకు నధిష్ఠాతయో. ఆ

నాపిఃకాభావమందు గాని క్షణమాత్ర మైన నియతవ్యాపారవిరహిత మై సము ద్రముగ నుం మునిగి పోవునో ఆలాగుననే ఈశరీరమునకు నధిష్ఠాతయగు నఖండ రూపాత్మను స్వాభేదరూపముగ నెవ్వఁడు సాక్షాత్కరించుకొనునో యప్పుడే సర్వానర్థ నివృత్తి రూప మోక్షప్రాప్తి యగును. ఇందువలన నధ్యాసకారణ మగు నాశ్రయాధిష్ఠానరూపాంశద్వయముచే వస్తునిర్దేశాత్మక మంగళాచరణము గూడ సూచిత మయినది.

## ౧. వృత్తిసామాన్యలక్షణము. భేదము.

అహం బ్రహ్మాస్మి యను నీ వృత్తివలన కార్యసహితాజ్ఞాననివృత్తియు పర మానందప్రాప్తియు నగును. ఇదియ వేదాంతసిద్ధాంతము. దీనియందే విచారము కలుగుచున్నది.

(౧) వృత్తి యన నేమి.
(౨) వృత్తికి కారణ మేమి.
(౩) వృత్తికి ప్రయోజన మేమి.

ఏతద్విషయప్రకాశనము వృత్తిప్రభాకరనామకగ్రంథమందు వివరింప బడుచున్నది.

వృత్తి యన నంతఃకరణముయొక్క లేక అజ్ఞానముయొక్క పరిణామము.

యద్యపి క్రోధసుఖాదికమును అంతఃకరణపరిణామ మైయే యున్నది, ఆకాశాదికముకూడ అజ్ఞానపరిణామ మయియున్నది, వానినికూడ వృత్తి యని యనవచ్చునా యనుచో, విషయప్రకాశ మగు నంతఃకరణముయొక్క లేక అజ్ఞానముయొక్క పరిణామమునుమాత్రమే వృత్తి యని చెప్పెదరు. క్రోధసుఖాదిరూప మగు నంతఃకరణపరిణామ మేది ఉన్నదో దానివలననే పదార్థమునకు ప్రకాశము సంభవించదు. ఆలాగుననే ఆకాశాదికమువలనను కూడ ప్రకాశము సంభ వింపదు. అందువలన వానిని వృత్తి యనరాదు మఱియు నే మనగా జ్ఞానరూప పరిణామముచే నవి ప్రకాశ మగుచున్నవి గాన వానికి వృత్తి యని పేరు.

## పూర్వపక్షము.

యద్యపి సుఖ, దుఃఖ, కామ, తృప్తి, క్రోధ, క్షమా, ధృతి, అధృతి, లజ్జా, భయాదికరూప మయిన యంతఃకరణపరిణామ మేది గలదో ఆ యంతఃకరణపరి ణామమును అనేకస్థలములందు వృత్తిశబ్దముచే వ్యవహరించుచున్నారు; తథాపి తత్త్వానుసంధా నాద్వైతకౌస్తుభాది గ్రంథములయందు ప్రకాశక పరిణామమునే

వృత్తి యని చెప్పుచున్నారు. అంశమువలన మాయ, లేక అంతఃకరణముయొక్క ఇతరప్రకాశక మగు జ్ఞానరూపపరిణామమే అద్వైతశాస్త్రమందు వృత్తిశ పారిభాషికార్థముగా నున్నది

ఈ వృత్తిజ్ఞానము (౧) ప్రమ (౨) అప్రమ యని ద్వివిధము.

ప్రమాణజన్యజ్ఞానమునకు ప్రమ యని పేరు.

తద్వ్యతిరిక్త మప్రమ యనబడును.

ప్రమాజ్ఞానము యథార్థము. మఱియు నప్రమాజ్ఞానము (౧) అయథార్థము, (౨) భ్రమ యనియు ద్విప్రకారము.

దోషజన్య మగునది భ్రమ, దోషజన్యము కాక ఇంద్రియానుమానాది ప్రమాణమువలన అథవా ఏదయిన నొకకారణమువలన జన్యమగునది అయథార్థ ప్రమ. ఏలాగున ననగా, శుక్తియందు రజతజ్ఞానము సాదృశ్యదోషజన్యమైనందున భ్రమ. శర్కరయందు కటుతాజ్ఞానము పిత్తదోషజన్య మగును; చంద్రునందు ప్రాదేశికతాజ్ఞానము, అనేకవృక్షంబులం దేకతాజ్ఞానము, దూరతారూపదోషజన్యము; అందువలన భ్రమ యని చెప్పుదురు. మఱియు విచారసాగరమునందు దోషము అధ్యాసహేతువు కా దని నిర్ణయింపబడినది. దీని యభిప్రాయ మేమనగా— ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయముల యొక్క దోషము అధ్యాసమునకు హేతువు కాదనియును, ఏయొకదోష మయినను అధ్యాసమునకు కారణ మగుచున్న దనియును, మఱియు దోషాభావమువలన నేయధ్యాసము చెప్పంబడియున్నదో అది ప్రౌఢివాద మనియును, ఎచ్చట నొక్క దోషముగాని లేదో అచ్చట అవిద్య ఒక్కటియే దోష మనియును అందువలననే దోషజన్యజ్ఞానము భ్రమ యనియును జెప్పుదురు. మఱియును స్మృతిజ్ఞానము, సుఖదుఃఖవిషయకప్రత్యక్షజ్ఞానము, ఈశ్వర వృత్తిజ్ఞానము, ఇవి దోషజన్యములు కావు. అందువలన భ్రమలు కావు. మఱియు ప్రమాణజన్యమును కానందున ప్రమయును కాదు, ప్రమావిలక్షణ మయి యున్నది గనుక యథార్థజ్ఞాన మన వచ్చును. ఎందువలన ననగా, ఏజ్ఞానముయొక్క విషయమునకు సంసారదశయందు బాధ కలుగదో ఆజ్ఞానము యథార్థ మనబడును.

స్మృతిజ్ఞానమునకు సంస్కార ద్వారమున పూర్వానుభవము హేతువై యున్నది. ఎచ్చట యథార్థానుభవముచేత స్మృతి కలుగుచున్నదో అచ్చట స్మృతి యథార్థము. మఱియును భ్రమరూపానుభవముయొక్క సంస్కారముచే స్మృతి కలిగినచో నది యయథార్థమై యున్నది.

ధర్మాది నిమిత్తద్వారమున అనుకూల ప్రతికూల పదార్థములయొక్క సంబంధ మగునెడల నంతఃకరణముయొక్క సత్త్వరజోగుణ పరిణామములు సుఖ దుఃఖము లగుచున్నవి.

సుఖదుఃఖములయొక్క యేనిమిత్త మున్నదో అదే నిమిత్తమువలన సుఖ దుఃఖములను విషయీకరించు నంతఃకరణ వృత్తి కలుగు చున్నది. ఆ వృత్త్యారూఢసాక్షి సుఖదుఃఖ ప్రకాశకుఁడై యున్నాఁడు. గనుక సుఖదుఃఖాకారాంతః కరణ వృత్తి ప్రమాణజన్యము కాదు. అందువలన ప్రమయును కాదు.

విశేషించి ఈశ్వరునియొక్క జ్ఞానము ఇచ్ఛయు ప్రయత్నము న్యాయ మతానుసారముగా నిత్యమై యున్నవి గాని శ్రుతియందు ఈశ్వరునియొక్క జ్ఞానాదికమునకు నుత్పత్తి చెప్పఁబడియున్నది. అందువలన నిత్యము కాజాలదు. మఱియు ప్రాణులయొక్క కర్మానుసారముగా సృష్ట్యాదికాలమందు సర్వపదార్థవిషయక మగు నీశ్వరజ్ఞాన ముత్పన్న మగుచున్నది.

ఆజ్ఞానము భూతభవిష్య ద్వర్తమాన సకల పదార్థములయొక్క సామాన్య విశేషభావమును విషయీకరించుచున్నది. మఱియు ప్రళయ పర్యంత స్థాయి యై యున్నది. అందువలన నేకమని నిత్యమని చెప్పెదరు. ఆలాగుననే ఇచ్ఛ ప్రయత్నము ఉత్పత్తిగలవియై స్థాయులై యున్నవి. అందువలననే ప్రళయ పర్యంతము ఏకైకవ్యక్తియై యున్నది. ఈ విషయమం దొక శంక.—ఈశ్వరుని యిచ్ఛ ప్రళయ పర్యంతస్థాయి యయిన యెడల వర్షాతపశీతము లీశ్వరేచ్ఛవలన కలుగుచున్నవి గాన ప్రళయ పర్యంతము వర్షము గాని యాతపము గాని శీతము గాని కావలయును. ఈశంక సరికాదు, ఎందువలన ననగా ఈశ్వరునియొక్క ఇచ్ఛావ్యక్తి అనేకమై నిత్యమై యుండినయెడల పయిని జెప్పిన దోషోద్భవము కావచ్చును. ఈశ్వరుని యొక్క ఆప్రళయ పర్యంత స్థాయి యగు నిచ్ఛావ్యక్తి అనేక మయినది కాదు. ఏక మయి యున్నది. ఆ యే కేచ్ఛానుసారముగా పదార్థము ఏరీతిగా విషయ మగు చున్నదో ఆరీతిగానే జరుగుచున్నది. ఇంతకాలము వర్షము ఇంతకాలము శీతము ఇంతకాలము ఆతపము కావలయు నని యీరీతిగా నీశ్వరునియొక్క ఇచ్ఛ పదార్థములను విషయీకరించుచున్నది. తదనుసారముగా పదార్థము లాయాకాలములయందు జరుగుచున్నవి. ప్రళయ పర్యంత స్థాయి యగు నిచ్ఛ ఏకమై యున్నది. ఈపక్షమందు దోష మేమియును లేదు. శ్రుతియందు జ్ఞానేచ్ఛా ప్రయత్నముల కుత్పత్తి శ్రూయమాణ మగుచున్నది. అందువలన ఈశ్వరజ్ఞానాది

కము జన్యము, మఱియు నాకాశాదికమువలెనే మహాప్రళయ పర్యంతస్థాయి యై యున్నది. మఱియు నీశ్వరునియొక్క జ్ఞానమునకు ప్రపంచస్థితి కాలమునందు అనంతావృత్తులు (అనేకపర్యాయములు) ఉత్పత్తినాశమును జెప్పవాని నడుగ వలసిన దేమనగా, ఈశ్వరునియందు ఏదైనను ఒకటే జ్ఞానవ్యక్తి ప్రపంచము యొక్క స్థితి కాలమునందు సర్వదా ఉత్పన్న మగుచున్నదా అథవా ప్రపంచ ముండినను ఏదైనను ఒక కాలమందు జ్ఞానహీనుడై ఈశ్వరు డున్నాడా. ఎవరయి నను ఏదైన నొక కాలమందు ఈశ్వరుడు జ్ఞాన హీను డగుచున్నా డనినయెడల ఆకాలమం దీశ్వరు డజ్ఞుడు కావలెను గదా. మఱియు నేదైన నొకజ్ఞానవ్యక్తి ఈశ్వరునియందు సర్వదా ఉత్పన్న మగుచున్నది, అని చెప్పినచో ననంతజ్ఞాన ముల కనంతోత్పత్తి నాశములయంగీకారము నిష్ఫల మగును. ఏకటయినజ్ఞానము సృష్ట్యాదికాలమందు నుత్పన్నమై మహాప్రళయపర్యంత స్థాయియై యున్నది. అట్టు ఈశ్వరుని జ్ఞానేచ్ఛాకృతులు విసంవాదులు కావు గాని సంవాదులై యున్నవి. నిష్ఫలప్రవృత్తికి జనకమయిన జ్ఞానాదికమును విసంవాదియందురు. జీవునియొక్క జ్ఞానేచ్ఛాకృతులు సంవాదు లని విసంవాదు లనియును ద్విప్రకారములుగా నున్నవి. ఈశ్వరునియొక్క జ్ఞానేచ్ఛాకృతులు నిష్ఫలప్రవృత్తి జనకములు కా నందున విసంవాదులు కావు, సంవాదులే అయి యున్నవి.

విసంవాదిజ్ఞానమును భ్రమ మందురు.

సంవాదిజ్ఞానమును యథార్థ మందురు.

ప్రమాణజన్యయథార్థజ్ఞానమును ప్రమ యందురు.

ఏ ప్రకారము జీవునియొక్క జ్ఞానము అంతఃకరణమునొక్క వృత్తిరూప మై యున్నదో అదే ప్రకారముగా ఈశ్వరునియొక్క జ్ఞానము మాయావృత్తిరూప మయి యున్నది. జీవునియొక్క జ్ఞానము అదృష్టజన్యమై ప్రమాణజన్యమై యుండ నందున ప్రమ కాదు, దోషజన్యమును కాదు; మఱియు నిష్ఫల ప్రవృత్తిహేతు వును కానందున భ్రమయును కాదు, గాని యథార్థమై యున్నది.

ప్రమాణజన్య జ్ఞానమును ప్రమాణ మని చెప్పుదురు.

## ౨ ప్రమాణభేద నిరూపణము.

ప్రమాణము షడ్విధము.

(౧) ప్రత్యక్షము.

(౨) అనుమానము.

(3) శబ్దము.

(౪) ఉపమానము.

(౫) అర్థాపత్తి.

(౬) అనుపలబ్ధి.

ప్రత్యక్షప్రమనుగూర్చి యెద్ది కరణమగునో యది ప్రత్యక్షప్రమాణము.

అనుమితి ప్రమకు కరణ మనుమానము.

శాబ్దప్రమకు కరణము శబ్దప్రమాణము.

ఉపమితి ప్రమకు కరణ ముపమానము.

అర్థాపత్తి ప్రమకు కరణము అర్థాపత్తి ప్రమాణము.

అభావప్రమకు కరణము అనుపలబ్ధి ప్రమాణము.

ప్రత్యక్షము అర్థాపత్తి యను నీ రెండు శబ్దములును ప్రమాణమును ప్రమను గూడ చెప్పునవి.

భట్టమతమందు షడ్విధ ప్రమాణముల యంగీకారము.

యద్యపి సూత్రకారులును భాష్యకారులును ప్రమాణ సంఖ్యను వ్రాయ లేదు, తథాపి సిద్ధాంతమతమున కవిరోధి యగు నేభాట్టమత మున్నదో అది అద్వైతవాదమందు సమ్మతము. అందువలన వేదాంత పరిభాషాదిగ్రంథముల యందు షట్ప్రమాణముల యంగీకారము.

3 - కరణలక్షణము.

న్యాయ శాస్త్రానుసారముగా నాలుగు ప్రమాణముల యంగీకారము. అర్థాపత్తి, అనుపలబ్ధి అంగీకారము లేదు. ఈ విషయమై న్యాయ సిద్ధాంత ప్రక్రియ.

ఏది ప్రమాకరణమో యది ప్రమాణము.

ప్రత్యక్ష ప్రమాకరణము నేత్రాదీంద్రియములు. అందువలన నేత్రాదీంద్రియములు ప్రత్యక్షప్రమాణములు.

వ్యాపార సహిత మగు నసాధారణకారణము. కరణము.

ఈశ్వరుడు, తజ్జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము (కృతి), దిక్కు, కాలము, అదృష్టము, ప్రాగభావము, ప్రతిబంధకాభావము, ఇవి సాధారణ కారణములు. వీనికంటె భిన్నమగు కారణము అసాధారణకారణము.

అసాధారణకారణము ద్వివిధము.

(౧) వ్యాపార సహితము.

(౨) వ్యాపార రహితము.

వ్యాపార మనగా కారణజన్యమై కార్యజనకమై యుండునది.

ఏలాగున ననగా కపాలము ఘటకారణమై యున్నది, కపాలద్వయ సంయోగమును ఘటకారణమై యున్నది. కపాలమునకు కారణత్వము చెప్పు నెడల సంయోగము వ్యాపార మగుచున్నది. కపాల సంయోగము కపాలజన్యమై కపాలకార్య మగు ఘటమునకు జనకమై యున్నది అందువలన సంయోగరూప వ్యాపార సహితకారణము కపాలమై యున్నది.

ఏది కార్యమునకు సాక్షాత్కారణమై యున్నదో అది వ్యాపార రహిత కారణ మని ప్రసిద్ధము గదా. ఈశ్వరాది నవవిధ సాధారణ కారణములకంటె భిన్నమై వ్యాపారసహితమై యుండు కారణమును కరణ మందురు గాని కపాలము కరణ మని ప్రసిద్ధము. కపాల సంయోగము అసాధారణ కారణ మని చెప్పిన యెడల అది వ్యాపార సహితము కాదు, అందువలన కరణ మని చెప్ప వలను కాదు. కేవలఘట కారణ మనియే చెప్పవలెను.

౪ - ప్రత్యక్షప్రమాభేద నిరూపణము.

ప్రత్యక్షప్రమకు నేత్రాదీంద్రియములు కరణము లై యున్నవి. ఏలాగున ననగా, నేత్రాదీంద్రియములకు స్వస్వవిషయములతో సంబంధము గానియెడల ప్రత్యక్షప్రమ కలుగ నేరదు. ఇంద్రియవిషయములకు సంబంధము గలిగినచో ప్రత్యక్షప్రమోద్భవ మగుచున్నది; అందువలన ఇంద్రియవిషయములయొక్క సంబంధము ఇంద్రియజన్యమై ప్రత్యక్షప్రమా జనకమై యుండుటచే నది వ్యాపార మయి యున్నది. విషయ సంబంధరూప వ్యాపార సహితమై ప్రత్యక్షప్రమకు అసాధారణకారణ మయి ఇంద్రియ ముండుటచే నింద్రియమునకు ప్రత్యక్ష ప్రమాణ మని పేరు, ఇంద్రియజన్య యథార్థ జ్ఞానమునకు న్యాయమతమందు ప్రత్యక్ష ప్రమ యని పేరు.

ప్రత్యక్ష ప్రమకు కరణ మగు నింద్రియము షడ్విధము.

అందువలన ప్రత్యక్షప్రమ షడ్విధభేదయుక్తమై యున్నది.

(౧) శ్రోత్రము.

(౨) త్వక్కు.

(3) నేత్రము.
(౪) రసన.
(౫) ఘ్రాణము.
(౬) మనస్సు.

అను నీయాఱును షడ్విధేంద్రియములు. వీనిలో శ్రోత్రజన్య యథార్థజ్ఞానము శ్రోత్రప్రమ యనియును (౨) త్వగింద్రియజన్యయథార్థజ్ఞానము త్వాచప్రమ యనియును (3) నేత్రేంద్రియ జన్య యథార్థ జ్ఞానము చాక్షుష ప్రమ యనియును (౪) రసనేంద్రియజన్య యథార్థ జ్ఞానము రాసనప్రమ యనియును (౫) ఘ్రాణేంద్రియజన్య యథార్థ జ్ఞానము ఘ్రాణజప్రమ యనియును (౬) మనోరూపేంద్రియజన్యయథార్థజ్ఞానము మానసప్రమ యనియును లోకవ్యవహారము.

న్యాయమతమునందు శుక్తిరజతాదిభ్రమయును ఇంద్రియజన్యమై యున్నది గాని కేవలేంద్రియజన్యము మాత్రము కాదు. దోషసహితేంద్రియ జన్యమైనందున విసంవాదియై యున్నది, యథార్థము కాదు. అందువలన శుక్తియందు రజతజ్ఞానము చాక్షుషజ్ఞానమాత్రమే కాని చాక్షుషప్రమ కాదు. ఈ రీతిగా ఇతరేంద్రియములచేతను భ్రమ కలిగిన యెడల నది ప్రమ కానేరదు.

౫. ప్రత్యక్షప్రమలలో జేరిన శ్రోత్రజప్రమానిరూపణము.

శ్రోత్రేంద్రియముతో శబ్దముయొక్క జ్ఞానము, శబ్దమందుండు శబ్దత్వజాతియొక్కజ్ఞానము, శబ్దత్వవ్యాప్య మగు కఠినత్వతారత్వాదులయొక్కజ్ఞానమును, శబ్దాభావ, తారత్వాద్యభావజ్ఞానమును కలుగుచున్నవి. శ్రోత్రేంద్రియముతో నెట్టి విషయముయొక్క జ్ఞానము కలుగుచున్నదో అట్టి విషయముతో శ్రోత్రేంద్రియమునకు సంబంధము విధాయకముగా జెప్పవలెను. న్యాయమతమునందు నాలుగింద్రియములు వాయ్వగ్నిజల పృథివులవలన క్రమముగా జన్యములై యున్నవి. మఱియు శ్రోత్రము మనస్సు నిత్యమై యున్నవి. శ్రవణగోళకమందున్న యాకాశమునకు శ్రోత్ర మని పేరు. వాయ్వాదికముచే త్వగాదీంద్రియములు ఎట్లు జన్యములో అట్లు ఆకాశముచేత శ్రోత్రము జన్యమై యున్నది. అయినప్పటికి ఈసిద్ధాంతము నైయాయికాంగీకారము కాదు. మఱియు కరణమందుండు ఆకాశమో శ్రోత్ర మనియెదరు. మఱియు గుణమునకును గుణికిని సమవాయసంబంధ మున్నది. శబ్దము ఆకాశగుణమై యున్నది. అందువలననే ఆకాశరూప శ్రోత్రేంద్రియముచేత శబ్దమునకు సమవాయ సంబంధ మున్నది.

యద్యపి భేర్యాదిదేశమందు ఏయాకాశ మున్నదో ఆయాకాశమందు శబ్దము జన్యమై యున్నది. శ్రవణోపహితాకాశము శ్రోత్ర మని చెప్పుటవలన భేర్యాద్యుపహితాకాశమునందు శబ్దముయొక్క సంబంధ మున్నదే గాని శ్రవణోపహితాకాశమునందు లేదు; తథాపి భేరీదండ సంయోగముచేత భేర్యుపహితాకాశమునందు శబ్ద ముత్పన్న మగుచున్నది; దానికి శ్రవణోపహితాకాశమునందు సంబంధము లేనందున ప్రత్యక్షము కా జాలదు. అయినను శబ్దముచే శబ్దాంతరము దశదిగుపహితాకాశమునం దుత్పన్న మగు చున్నది. ఈరీతిగా కర్ణోపహితాకాశమునందు ఏశబ్ద ముత్పన్నమయినదో దానియొక్క ప్రత్యక్షజ్ఞాన మగుచున్నదే గాని ఇతరమునకు లేదు. శబ్దమునకు ప్రత్యక్షప్రమ ఫలమై యున్నది. శ్రోత్రేంద్రియము కరణమై యున్నది. మఱియు త్వాచాదిప్రత్యక్షజ్ఞానానుసారముగా విషయమునకు ఇంద్రియములతో సంబంధము వ్యాపార మయి యున్నదే గాని శ్రోత్రజప్రమయందు విషయముతో నింద్రియమునకు సంబంధము వ్యాపారము కాదు. ఎందుల కనగా శబ్దమునకు శ్రోత్రేంద్రియముతో సమవాయ సంబంధ మున్నది. మఱియు నితరస్థలమందు విషయమునకు నింద్రియముతో సంయోగ సంబంధ మున్నది. న్యాయమతమునం దయిననో సంయోగము జన్యమై సమవాయము నిత్యమై యున్నది. త్వగాదీంద్రియములకు ఘటాదివిషయములతో సంయోగసంబంధము త్వగాదీంద్రియ జన్యమై ప్రమకు జనకమై యుండుటవలన వ్యాపార మయి యున్నది. ఇదే ప్రకారముగా శబ్దమునకు శ్రోత్రేంద్రియముతో సమవాయ సంబంధము శ్రోత్రజన్యము కానందున వ్యాపారము కానేరదు గాని శ్రోత్రమనస్సులయొక్క సంయోగమే వ్యాపారమై యున్నది. సంయోగము ఉభయాశ్రితమై యున్నది. సంయోగ మెద్దాని నాశ్రయించుకొని యున్నదో ఆ యుభయము సంయోగమునకు నుపాదానకారణమై యున్నది. శ్రోత్ర మనస్సులయొక్క సంయోగమునకు నుపాదాన కారణము శ్రోత్ర మనస్సు లగుటవలన శ్రోత్ర మనస్సంయోగము శ్రోత్రజన్యమై శ్రోత్ర జన్యజ్ఞానమునకు జనకమై యుండుటవలన వ్యాపార మని చెప్పబడును. ఈవిషయమం దొక శంక.-శ్రోత్రమనస్సంయోగము శ్రోత్రజన్యమై యుండినను శ్రోత్రజన్యప్రమకు ఏప్రకారము జనక మగుచున్నది? ఇందులకు సమాధానము. ఆత్మమనస్సంయోగము సర్వజ్ఞానమునకు సాధారణ కారణము గాన జ్ఞానమునకు సామాన్య సామగ్రి ఆత్మ మనస్సంయోగము. మఱియు ప్రత్యక్షాదిజ్ఞానమునకు విశేషసామగ్రి ఇంద్రియాదిక

మై యున్నది. అందువలన శ్రోత్రజన్య ప్రత్యక్షజ్ఞానమునకు పూర్వభావి యగు నాత్మ మనస్సంయోగ ముండి తీరవలెను. ఆలాగుననే మనశ్శ్రోత్ర సంయోగ మును ఉండవలెను. మనశ్శ్రోత్ర సంయోగము లేని యెడల శ్రోత్రజన్య జ్ఞానము కలుగ నేరదు. ఏలాగుననగా అనేకేంద్రియములకు స్వస్వవిషయములతో నేకకాలమందు సంబంధము కలిగినను ఏకకాలమునందు స్వస్వవిషయములకు ఇంద్రియములచే జ్ఞానము కలుగ నేరదు గాన నిది యహేతువై యున్నది.

మనస్సంయోగసహిత మగు నింద్రియమునకు విషయసంబంధము కలిగినచో జ్ఞానోద్భవ మగుచున్నది. మనస్సు అసంయుక్త మగునింద్రియమునకు స్వస్వవిషయముతో గూడ సంబంధము కలిగినను జ్ఞానము గలుగనేరదు. న్యాయమత రీతిచే మనస్సు పరమాణురూపమై యున్నది. అందువలన నేకకాలమం దనేకేంద్రియములతో మనస్సంయోగము సంభవింపదు. ఈహేతువువలన అనేకవిషయముల కనేకేంద్రియములతో నేకకాలమందు జ్ఞానము కలుగదు. ఏ జ్ఞానమునకు హేతువగు నింద్రియమనస్సంయోగము లేక పోయినను ఏకకాలమం దనేకేంద్రియములకు విషయముతో సంబంధ ముండినయెడల ఏకకాలమం దనేకజ్ఞానము కలుగవలయును గదా. ఈరీతిగానే చక్షురాదీంద్రియ మనస్సంయోగము చాక్షుషాదిజ్ఞానమునకు అసాధారణకారణమై, త్వాచప్రత్యక్షమునకు త్వఙ్మనస్సంయోగము కారణమై, చాక్షుష జ్ఞానమునకు నేత్రమనస్సంయోగము కారణమై, ఘ్రాణజన్యజ్ఞానమునకు ఘ్రాణమనస్సంయోగము కారణమై, శ్రోత్రజన్య జ్ఞానమునకు శ్రోత్రమనస్సంయోగము కారమై యున్నది. ఈప్రకారముగానే శ్రోత్రమనస్సంయోగము శ్రోత్రజన్యజ్ఞానమునకు జనకమై యుండుటవలన వ్యాపారమై యున్నది. ఆత్మమనస్సంయోగము సకలజ్ఞానమునుగూర్చి కారణ మగుటవలన ప్రథమతః ఆత్మమనస్సంయోగ ముండవలెను. అనంతరము ఏయింద్రియముచేత జ్ఞాన మగుచున్నదో ఆయింద్రియమునకు ఆత్మసంయుక్తమనస్సంయోగము కలుగుచున్నది. తదనంతరము మనస్సంయుక్తేంద్రియమునకు విషయముతో సంబంధము కలిగినచో బాహ్యప్రత్యక్షజ్ఞాన మగుచున్నది. విషయేంద్రియసంబంధము లేక బాహ్యప్రత్యక్షము కలుగ నేరదు.

విషయమునకు ఇంద్రియముతో సంబంధము అనేకవిధములుగా నున్నది. ఎప్పుడు శ్రోత్రేంద్రియముతో శబ్దప్రత్యక్షజ్ఞానము కలుగుచున్నదో అప్పుడు కేవలశబ్దమే శ్రోత్రజన్యజ్ఞానమునకు విషయము కాదు. మఱియు నేమనగా

శబ్దముయొక్క ధర్మ మగు శబ్దత్వాదికము కూడ ఆ జ్ఞానమునకు విషయ మగు చున్నది. శబ్దమునకు శ్రోత్రేంద్రియముతో సమవాయ సంబంధము; శబ్దము యొక్కధర్మ మగుశబ్దత్వాదికమునకు శ్రోత్రేంద్రియముతో సమవేతసమవాయ సంబంధమై యున్నది. అదే ప్రకారముగా శ్రోత్రమునందు శబ్దముయొక్క ప్రతీతి కానియెడల శబ్దాభావముయొక్క ప్రత్యక్ష మగుచున్నది. అప్పుడు శబ్దాభావము నకు శ్రోత్రముతో విశేషణతాసంబంధ మున్నది. ఏయధికరణమునందు పదార్థముయొక్క అభావ మున్నదో ఆయధికరణమునందు పదార్థముయొక్క అభావమునకు విశేషణతా సంబంధ మగును. అదే ప్రకారముగా వాయువునందు రూపము లేదు. అందువలన వాయువునందు రూపాభావవిశేషణతాసంబంధ మున్నది. ఏపృథివియందు ఘటము లేదో ఆపృథివియందు ఘటాభావమునకు విశేషణతా సంబంధ మున్నది. ఈరీతిగా శబ్దశూన్యశ్రోత్రమునందు శబ్దాభావ మునకు విశేషణతాసంబంధ మున్నది. ఇందువలన శ్రోత్రముతో శబ్దాభావము యొక్క విశేషణతా సంబంధము శబ్దాభావప్రత్యక్ష జ్ఞానమునకు హేతు వై యున్నది. ఈలాగుననే శ్రోత్రముతో కకారాదిశబ్దముయొక్క ప్రత్యక్ష మయిన యెడల సమవాయసంబంధ ముండును. ఆలాగుననే కకారాదులయందు కత్వాది యేజాతియున్నదో దానిప్రత్యక్షము సమవేతసమవాయ సంబంధముచేత నగుచున్నది. మఱియు శ్రోత్రమునందు శబ్దాభావమునకు విశేషణతాసంబంధ ముచేత ప్రత్యక్ష మగుచున్నది. ఆలాగుననే శ్రోత్రసమవేత కకారమం దుండు ఖత్వాభావప్రత్యక్ష మయినయెడల శ్రోత్రమునకు ఖత్వాభావముతో సమవేత సమవేత విశేషణతాసంబంధ మున్నది. ఎట్లనగా, శ్రోత్రమునందు సమవేత కకారమునందు సమవాయసంబంధముతో నుండెడి యే ఖత్వ మున్నదో దాని యందు ఖత్వాభావమునకు విశేషణతాసంబంధ మున్నది. ఈమొదలగు స్థల ములయందు అభావముయొక్క ప్రత్యక్షమునందు శ్రోత్రముతో ననేకసంబంధము లున్నవి. అయినను విశేషణతాభావములకు సంబంధ మున్నది. అందు వలన అభావముయొక్క ప్రత్యక్షమునందు శ్రోత్రమునకు ఒకటియే విశేషణతా సంబంధము. ఈరీతిగా శ్రోత్రజన్యప్రమకు హేతుభూత మగు సంబంధము త్రివిధ మై యున్నది.

(౧) శబ్దజ్ఞానమునకు హేతువు సమవాయ సంబంధము;

(౨) శబ్దముయొక్క ధర్మమగుశబ్దత్వ కత్వాదికముయొక్క జ్ఞానమునకు హేతువు సమవేతసమవాయసంబంధము;

(౩) అభావముయొక్క శ్రోత్రజన్యజ్ఞానమునుగూర్చి విశేషణతా సంబంధము హేతువై యున్నది. ఆవిశేషణత నానాప్రకారముగా నున్నది.

శబ్దాభావముయొక్క ప్రత్యక్షమునందు శుద్ధవిశేషణతాసంబంధ మున్నది. కకారమందు ఖత్వాభావప్రత్యక్ష మున్నది. సమవేతవిశేషణత యున్నది విశేషణతాసంబంధమునకు అనంతప్రభేద మున్నది. అదియును విశేషణతాంతర్గత మగుటచే విశేషణత యొకటి యని చెప్పబడెను.

శబ్దము ద్వివిధము.

(౧) భేర్యాదిదేశమందు గలుగునది ధ్వనిరూపశబ్దము.

(౨) కంఠాదిదేశమునందు వాయుసంయోగమువలన గలుగునది వర్ణరూపశబ్దము.

శ్రోత్రేంద్రియముతో నాద్విప్రకారశబ్దముయొక్క ప్రత్యక్ష మగుచున్నది. వర్ణరూపశబ్దమునందు ఏకత్వాదిరూపజాతి యేది యున్నదో దానికి ఏలాగున సమవేతసమవాయముచే శ్రోత్రజప్రత్యక్ష మగుచున్నదో ఆలాగుననే ధ్వనిరూపశబ్దమునందు ఏతారత్వమంద్రత్వాది ధర్మ మున్నదో అది కూడ శ్రోత్రముచేత ప్రత్యక్ష మగుచున్నది. అయినను కత్వాదికము వర్ణముయొక్క జాతిరూపధర్మమై యున్నది. అందువలన కత్వాదికమునకు కకారాదిరూపశబ్దముతో సమవాయసంబంధ మున్నది. ధ్వనిరూపశబ్దముయొక్క తారత్వాదిధర్మము జాతిరూపము కాదు. న్యాయమతమునందు ఉపాధిరూప మయి యున్నది. అందువలన తారత్వాదికమునకు ధ్వనిరూపశబ్దమునందు సమవాయసంబంధము లేదు, స్వరూపసంబంధ మున్నది. ఎట్లనగా, న్యాయమతమునందు జాతిరూపధర్మమునకు, గుణమునకు, క్రియకు, తనయొక్క యాశ్రయమునందు సమవాయసంబంధ మున్నది. జాతి, గుణ, క్రియలకన్న భిన్న మగుధర్మమునకు ఉపాధి యని పేరు. ఉపాధికిని, అభావమునకును ఆశ్రయముతో నేసంబంధ మున్నదో దానికి స్వరూపసంబంధ మని పేరు. స్వరూపము కూడ శేషణతాసంబంధ మని చెప్పుదురు. అందువలన జాతికంటె భిన్నమై ఏతారత్వాదిధర్మ మున్నదో దానికి ధ్వనిరూపశబ్దముతో స్వరూపసంబంధ మున్నది. దానికిని విశేషణత యని పేరు. అందువలన

శ్రోత్రమునందు సమవేత మగు నేధ్వని యున్నదో దానియందు తారత్వమంద్ర త్వముయొక్క విశేషణతాసంబంధ ముండినయెడల శ్రోత్రమునకు తారత్వమంద్ర త్వముయొక్క శ్రోత్రసమవేతవిశేషణతాసంబంధ మున్నది. ఈరీతిగా శ్రోత్రేం ద్రియము శ్రోత్రజప్రత్యక్షప్రమాకరణ మై యున్నది. శ్రోత్రమనస్సంయోగము వ్యాపారమై యున్నది. శబ్దాదికముయొక్క ప్రత్యక్షప్రమారూపజ్ఞానము ఫలమై యున్నది.

ఽ. త్వాచప్రత్యక్షప్రమానిరూపణము.

త్వగింద్రియముతో స్పర్శముయొక్క జ్ఞానము, స్పర్శాశ్రయముయొక్క జ్ఞానము, స్పర్శాశ్రితస్పర్శత్వరూపజాతియొక్కజ్ఞానము, స్పర్శాభావముయొక్క జానము కూడ కలుగుచున్నవి. ఎట్లనగా ఏయింద్రియముతో ఏయేపదార్థము యొక్క జ్ఞాన మగుచున్నదో ఆయాపదార్థాభావముయొక్కయు, దానియం దుండు జాతియొక్కయు, జ్ఞానమును, ఆయింద్రియముతో కలుగుచున్నది. పృథివి, జలము, తేజస్సు, ఈమూడుద్రవ్యములయొక్క ప్రత్యక్షజ్ఞానము త్వగింద్రియ ముతో కలుగుచున్నది, వాయువుయొక్క ప్రత్యక్షజ్ఞానము కలుగ నేరదు. ఎందుల కనగా, ప్రత్యక్షయోగ్యరూపము, ప్రత్యక్షయోగ్యస్పర్శము, ఈరెండును ఏద్రవ్య మం దుండునో ఆ ద్రవ్యముయొక్క త్వాచప్రత్యక్ష మగును. వాయువునందు స్పర్శ ముండినను రూపము లేదు. అందువలన వాయువుయొక్క త్వాచప్రత్య క్షము కలుగదు. వాయువుయొక్క స్పర్శమునకు త్వగింద్రియముతో ప్రత్యక్షము కలుగును. స్పర్శముయొక్క ప్రత్యక్షముచేత వాయువుయొక్క యనుమితిజ్ఞాన మగుచున్నది. ఇది తర్కమతప్రక్రియ.

మీమాంసకమతరీతిగా వాయువు ప్రత్యక్ష మగుచున్నది వీరియభిప్రా యమే మనిన, ప్రత్యక్షయోగ్యస్పర్శము ఏద్రవ్యమం దున్నదో ఆద్రవ్యము యొక్క త్వాచప్రత్యక్ష మగుచున్నది. త్వగింద్రియజన్యద్రవ్యప్రత్యక్షమునందు రూపముయొక్క అపేక్ష లేదు. కేవలస్పర్శముయొక్క అపేక్ష యున్నది. ద్రవ్య చాక్షుషప్రత్యక్షమునందు ఉద్భూతరూపాపేక్ష యున్నదే కాని స్పర్శాపేక్ష లేదు. ఎందుల కనగా ద్రవ్యముయొక్క చాక్షుషప్రత్యక్షమునందు ఉద్భూతస్ప ర్శాపేక్ష యున్న దన్న యెడల దీపముయొక్క లేక చంద్రునియొక్క ప్రభ యందు ఉద్భూతస్పర్శము లేదు. దానికి చాక్షుషప్రత్యక్షము కలుగకపోవలెను. అనుభవము గాన వచ్చుచున్నది. మఱియు త్ర్యణుకమునందు స్పర్శ మున్నది,

ఉద్భూతస్పర్శము లేదు. అందువలన త్వాచప్రత్యక్ష మగుట లేదు. కేవలచాక్షుషప్రత్యక్ష మగుచున్నది. అందువలన కేవలోద్భూతరూపసహితద్రవ్యముయొక్క చాక్షుషప్రత్యక్ష మగుచున్నది. ఇదే ప్రకారముగా కేవలోద్భూతస్పర్శసహితద్రవ్యముయొక్క త్వాచప్రత్యక్ష మగుచున్నది. వాయువునందు రూపము లేదు. ఉద్భూతస్పర్శ మున్నందున చాక్షుషప్రత్యక్షము కలుగుట లేదు. త్వాచప్రత్యక్ష మయినను కలుగుచున్నది. మఱియు సర్వలోకమునకును నిదే రీతిగా ననుభవ మున్నది.

“వాయువు నాత్వగింద్రియముచేత ప్రత్యక్ష మయినది” అందువలన వాయువునకు త్వగింద్రియముతో ప్రత్యక్ష మగుచున్న దని మీమాంసకమత ప్రక్రియ.

న్యాయసిద్ధాంతరీతిగా వాయుప్రత్యక్షము లేదు. పృథివీ జల తేజస్సుల యందు కూడ ఎక్కడ నుద్భూతరూపోద్భూతస్పర్శము లున్నవో అక్కడ త్వాచప్రత్యక్ష మగుచున్నది, లేనియెడల లేదు. ప్రత్యక్షయోగ్యము లగునేరూపస్పర్శము లున్నవో వానిని ఉద్భూతము లని యందురు. ఘ్రాణరసనేంద్రియము లయందు రూపస్పర్శములు రెండును ఉన్నవి. అయినను ఉద్భూతములుగా నుండనందున పృథివీజలతేజస్సులీరూపములుగా నుండినను ఆయా ఇంద్రియములయొక్క త్వాచప్రత్యక్షము చాక్షుషప్రత్యక్షము కలుగనేరదు మఱియు జాల సూర్యకిరణములయందు ఏపరమసూక్ష్మరజః ప్రతీతి యగుచున్నదో యది త్ర్యణుకరూపపృథివై యై యున్నది. దానియం దుద్భూతరూప మున్నది. అందువలన దానియొక్క చాక్షుషప్రత్యక్ష మగుచున్నది. ఉద్భూతస్పర్శము లేనందున త్వాచప్రత్యక్ష మగుట లేదు. అణువునందు స్పర్శము కూడ నున్నది గాని అది ఉద్భూతస్పర్శము కాదు. వాయువునం దుద్భూతస్పర్శ మున్నది, రూపము లేదు, గనుక వాయువునకు త్వాచచాక్షుషప్రత్యక్షములు లేవు.

సిద్ధాంతవివరణము.

ద్రవ్యముయొక్క చాక్షుషప్రత్యక్షమునకు ఉద్భూతరూపము కారణము. త్వాచప్రత్యక్షమునకు ఉద్భూతరూపస్పర్శములు రెండును కారణములు. ఏద్రవ్యమునం దుద్భూతరూపోద్భూతస్పర్శము లున్నవో దానికే త్వాచప్రత్యక్ష మగుచున్నది. ఏద్రవ్యము త్వాచప్రత్యక్షమగునో ఆద్రవ్యముయొక్క ప్రత్యక్షయోగ్యజాతియు త్వాచప్రత్యక్ష మగును. ఎట్లనగా ఘటముయొక్క త్వాచప్రత్యక్ష

మయినప్పుడు ఘటమునందుండు ప్రత్యక్షయోగ్య మగు ఘటత్వరూపజాతికిని త్వాచప్రత్యక్ష మగుచున్నది. ఇదే రీతిగా ద్రవ్యమునం దుండు స్పర్శ, సంఖ్యా, పరిమాణ, సంయోగ, విభాగాదిక మగు నేయేయోగ్యగుణము లున్నవో వానికిని స్పర్శాదికమం దుండు స్పర్శత్వాదిజాతికిని త్వాచప్రత్యక్ష మగుచున్నది. మఱియు కోమలద్రవ్యమం దుండు కఠినస్పర్శాభావమును, శీతజలమం దుండు నుష్ణస్పర్శాభావమును త్వాచప్రత్యక్ష విషయము లగుచున్నవి. అచ్చట ఘటాదిద్రవ్యముతో నింద్రియమునకు సంయోగసంబంధ మున్నది. సంయోగము క్రియాజన్యము. ద్రవ్యములకే సంయోగమున్నది. త్వగింద్రియము వాయువుయొక్క పరమాణుజన్య మై యున్నది అందువలన నది వాయురూపద్రవ్య మై యున్నది. ఘటము పృథివీరూపద్రవ్య మై యున్నది శరీరక్రియవలన త్వగ్ఘట సంయోగ మగును. ఘటక్రియవలనను కూడ అట్టి సంయోగము కావచ్చును. కొన్ని స్థలములయందు ఉభయక్రియలవలనను ఆసంయోగము కలుగును. నేత్రమునందు గోళకము గాక యే కేవలేంద్రియమునందు క్రియ కలుగుచున్నది. త్వగింద్రియమందు శరీరము లేక క్రియ కలుగ నేరదు. అందువలన త్వగింద్రియముయొక్క గోళక మగు శరీర క్రియవలన ఘటాదివిషయముయొక్క క్రియవలనను ఈరెండింటి క్రియలవలనను త్వగ్ఘటాదిద్రవ్యముతో సంయోగము కలుగుచున్నది. అప్పుడు త్వాచప్రత్యక్ష మగును. ఈత్వాచప్రత్యక్షప్రమయే ఫల మగుచున్నది. త్వగింద్రియము కరణమై యున్నది. త్వగింద్రియఘటసంయోగము వ్యాపారమై యున్నది. త్వగింద్రియఘటములయొక్క సంయోగమునకు నుపాదానకారణము త్వగ్ఘటములు రెండును అగుచున్నవి. ఆసంయోగము త్వగింద్రియజన్యమును త్వాచప్రమకు జనకమును నగుటవలన త్వగ్ఘట సంయోగము వ్యాపారమై యున్నది. ఎచ్చట త్వగింద్రియముచే ఘటత్వజాతియొక్కయు స్పర్శాదిగుణముయొక్కయు త్వాచప్రత్యక్ష మగుచున్నదో యచ్చట త్వగింద్రియము కరణ మగుచున్నది, ప్రత్యక్షప్రమ ఫల మగుచున్నది. సంయుక్త సమవాయ సంబంధము వ్యాపార మగుచున్నది ఎట్లనగా త్వగింద్రియముతో సంయుక్త మగు ఘటమందు ఘటత్వజాతికి స్పర్శాదిగుణములకును సమవాయ మున్నది. ఇదే ప్రకారముగా ఘటాది నిష్ఠస్పర్శాది గుణమందు నుండు స్పర్శత్వాది జాతికిని త్వాచప్రత్యక్షప్రమ యగుచున్నది. అక్కడ త్వగింద్రియము కరణ మై స్పర్శత్వాది ప్రత్యక్షప్రమ ఫలమై సంయుక్తసమవేత సమ

వాయు సంబంధము వ్యాపార మై యున్నది. ఎట్లనగా త్వగింద్రియముతో సంయుక్త మయిన ఘటమునందు సమవేత మయిన స్పర్శాదియందు స్పర్శత్వాది జాతిసమవాయసంబంధ మున్నది. సంయుక్త సమవాయము సంయుక్త సమవేత సమవాయము ఈరెంటి సంబంధమం దుండు సమవాయ భాగము నిత్యమై యుండుటవలన ఇంద్రియజన్యము కాదు. అయినను సంయోగము జన్య మగుట వలన త్వగింద్రియ సంయోగము త్వగ్జన్యమైనందున త్వక్సంయుక్త సమవాయము, త్వక్సంయుక్త సమవేత సమవాయము కూడ త్వగింద్రియజన్య మై యున్నది, త్వగింద్రియజన్య త్వాచప్రమకు జనక మై యుండుటవలన వ్యాపార మై యున్నది. పుష్పాదికోమలద్రవ్యమునందు కఠిన స్పర్శముయొక్క యభావమునకును శీతలజలమందు నుష్ణస్పర్శా భావమునకును త్వాచప్రత్యక్ష మగుచున్నదో అక్కడ త్వగింద్రియము కరణమై అభావముయొక్క త్వాచప్రమ ఫలమై ఇంద్రియముతో అభావమునకు త్వక్సంయుక్త విశేషణతా సంబంధము వ్యాపార మయి యున్నది. ఎట్లనగా త్వగింద్రి యమునకు ఘటాదిద్రవ్యముతో సంయోగ ముండుటవలన త్వక్సంయుక్త కోమల ద్రవ్యమునందు కఠిన స్పర్శాభావమునకు విశేషణతా సంబంధము త్వక్సంయుక్త శీతల జలమం దుండు నుష్ణస్పర్శాభావమునకు విశేషణతా సంబంధ మున్నది. ఎప్పుడు ఘటస్పర్శమునందు రూపత్వాభావముయొక్క త్వాచప్రత్యక్ష మగుచున్నదో అప్పుడు త్వక్సంయుక్త ఘటమునందు సమవేత స్పర్శమునందు రూపత్వాభావమునకు త్వక్సంయుక్త సమవేత విశేషణతాసంబంధ మున్నది. ఈరీతిగా త్వాచప్రత్యక్షమునందు నాలుగు సంబంధములు హేతువు లై యున్నవి.

(౧) త్వక్సంయోగము.
(౨) త్వక్సంయుక్త సమవాయము.
(3) త్వక్సంయుక్త సమవేత సమవాయము.
(౪) త్వక్సంబద్ధ విశేషణత (త్వక్కుతో సంబంధము గలదానికి త్వక్సంబద్ధ మనిపేరు).

ఈనాలుగు సంబంధములు. ఎచ్చట కోమలద్రవ్యమునందు కఠిన స్పర్శాభావ మున్నదో అచ్చట త్వక్సంయుక్తము కోమలద్రవ్యమై యున్నది. ఆత్వక్సంయుక్త కోమలద్రవ్యమునందు కఠినస్పర్శా భావమునకు విశేషణతా సంబంధము స్పష్టమై యున్నది. ఎక్కడ స్పర్శమునందు రూపత్వాభావ ప్రత్యక్ష

మగుచున్నదో అక్కడ త్వక్కునకు స్పర్శముతో సంయుక్త సమవాయ సంబంధ మున్నది. ఆత్వక్సంయుక్త సమవేత స్పర్శమునందు రూపత్వాభావమునకు విశేషణతాసంబంధ మున్నది. ఈరీతిగా త్వాచప్రమకు హేతువులు సంయోగాదులు నాలుగు సంబంధము లై యున్నవి.

౭. నేత్ర (లేక చాక్షుష) ప్రత్యక్ష ప్రమా నిరూపణము.

పై జెప్పినప్రకారముగా చాక్షుషప్రమకు కూడ

(౧) నేత్రసంయోగము,

(౨) నేత్రసంయుక్త సమవాయము,

(3) నేత్రసంయుక్త సమవేత సమవాయము,

(౪) నేత్ర సంబంధవిశేషణత,

అను నాలుగు సంబంధములు గలవు. వీనికే వ్యాపారము లని సంజ్ఞ. ఎక్కడ నేత్రముచేత ఘటాదిద్రవ్య చాక్షుషప్రత్యక్ష మగునో అక్కడ నేత్రముయొక్క క్రియచేత ద్రవ్యముతో కూడ సంయోగము కలుగుచున్నది. ఆసంయోగము నేత్రజన్యమై నేత్రజన్యచాక్షుషప్రత్యక్షమునకు జనకము కూడ అగుటవలన వ్యాపార మై యున్నది. మఱియు నేత్రముచేత ఘటత్వాది జాతియొక్కయు, రూపసంఖ్యాదిగుణములయొక్కయు, ప్రత్యక్ష మగుచున్నది. అక్కడ నేత్రసంయుక్త ద్రవ్యమునందు ఘటత్వాదిజాతికిని రూపాదిగుణములకును సమవాయ సంబంధ మున్నది. అందువలన ద్రవ్యసంబంధు లగు జాతి గుణములయొక్క చాక్షుష ప్రత్యక్షమునందు నేత్రసంయుక్త సమవాయ సంబంధ మున్నది. ఎక్కడ గుణమునం దుండు జాతికి చాక్షుషప్రత్యక్ష మగుచున్నదో అక్కడ రూపత్వాది జాతితో కూడ నేత్రమునకు సంయుక్తసమవేతసమవాయసంబంధ మున్నది. అది ఎట్లనగా, నేత్రముతో సంయుక్త మగు ఘటాదికమునందు సమవేత మయిన రూపాదులయందు రూపత్వాదికమునకు సమవాయసంబంధ మున్నది. యద్యపి నేత్రముతో సంయోగము సకలద్రవ్యమున కున్నది, తథాపి ఉద్భూతరూపసహిత ద్రవ్యముతో నేత్రసంయోగము చాక్షుషప్రత్యక్షహేతువై యున్నది. మఱియు ద్రవ్యముతో నైన. సంయోగమువూత్రమే చాక్షుషప్రత్యక్షహేతువుగా లేదు. పృథివీ, జల, తేజస్సు లనుమూడుద్రవ్యములును రూపసహితము లై యున్నవి. ఇతరము రూపసహిత మై లేదు. అందువలన పృథివీ, జల, తేజస్సులకు, చాక్షుష ప్రత్యక్ష మగుచున్నది. దేనియందు నెప్పుడు ఉద్భూతరూప మున్నదో దానికి .చా

క్షుషప్రత్యక్ష మగుచున్నది. దీనియం దనుద్భూతరూప ముండినయెడల చాక్షు
ష ప్రత్యక్షము కాదు. ఏలాగున ననగా, ఘ్రాణరసనానేత్రములు మూడును క్రమ
ముగా పృథివీ, జల, తేజో, రూపములై యున్నవి. వానియందు రూప ముండినను
ఉద్భూతము కానందున చాక్షుష ప్రత్యక్షము కాదు. అందువలన నుద్భూతరూప
సహిత పృథివీ జల తేజస్సులుమాత్రమే చాక్షుషప్రత్యక్షవిషయములై యున్నవి.
వీనియందు కొన్నిగుణములు చాక్షుషప్రత్యక్షయోగ్యములై యున్నవి. కొన్ని
గుణములు చాక్షుషప్రత్యక్షయోగ్యములు కావు. ఎట్లనగా.—

పృథివియందు

(౧) రూప, (౨) రస, (3) గంధ, (౪) స్పర్శ, (౫) సంఖ్యా,
(౬) పరిమాణ, (౭) పృథక్త్వ, (౮) సంయోగ, (౯) విభాగ,
(౧౦) పరత్వ, (౧౧) అపరత్వ, (౧౨) గురుత్వ, (౧3) ద్రవత్వ,
(౧౪) సంస్కారము

లని పదునాలుగు గుణము లున్నవి. వీనియందు గంధమును త్యజించి స్నే
హమును చేర్చి చతుర్దశగుణములు జలమునం దున్నవి. వీనియం దుండు రస,
గంధ, గురుత్వ, స్నేహములను త్యజించి ౧౧ గుణములు తేజమునం దున్నవి.
వీనిలో రూప, సంఖ్యా, పరిమాణ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వ, అపర
త్వ, ద్రవత్వము లను నీగుణములు చాక్షుషప్రత్యక్షయోగ్యము లయి యున్నవి.
ఇతరములు కావు. అందువలన నేత్రసంయుక్తసమవాయ రూపసంబంధము
సకల గుణములకు ఉన్నను నేత్రయోగ్యములు కావు. ఎన్నిగుణములు నేత్ర
యోగ్యములో వానికిమాత్రము నేత్రసంయుక్త సమవాయ సంబాధమువలన
ప్రత్యక్ష మగుచున్నది. స్పర్శమునందు త్వగింద్రియముయొక్క యోగ్యత
యున్నదే కాని నేత్రమునకు లేదు. రూపమునందు నేత్రముయొక్క యోగ్యత
యున్నదే కాని త్వగింద్రియముయొక్క యోగ్యత లేదు. సంఖ్యా, పరిమాణ
పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వ, అపరత్వ, ద్రవత్వములయందు త్వక్
నేత్రముల, రెంటియొక్క యోగ్యత యున్నది. త్వక్సంయుక్త సమవాయము,
నేత్రసంయుక్త సమవాయము, ఈరెండు సంబంధములు సంఖ్యాదులయొక్క
త్వాచప్రత్యక్షమును గుఱించి చాక్షుషప్రత్యక్షమును గుఱించి కూడ హేతు
వులై యున్నవి. రసమందు కేవల రసనేంద్రియయోగ్యత యున్నది, ఇతరేంద్రి
యములకు లేదు. గంధమునందు ఘ్రాణయోగ్యత యున్నది, ఇతరములకు

లేదు. ఏయింద్రియముయొక్క యోగ్యత యేగుణమం దున్న దో ఆయింద్రియము చేత నాగుణము ప్రత్యక్ష మగుచున్నది. ఇతరేంద్రియ సంబంధ ముండినను ప్రత్యక్షము కాదు.

ఘటాదికమం దుండు రూపాదికము చాక్షుష జ్ఞానమునకు విషయమై యున్నది. దానియొక్క రూపత్వాదిజాతియు నేత్రసంయుక్తసమవేత సమవాయ మువలన చాక్షుషప్రత్యక్షవిషయ మగుచున్నది. రసాదికము చాక్షుషజ్ఞానము నకు విషయ మగుట లేదు. దీనియం దుండు రసత్వాదిజాతికి నేత్రసంయుక్త సమవేతసమవాయ ముండినను చాక్షుషప్రత్యక్షము కలుగదు. అందువలన నీ క్రింద నుదాహరించు సిద్ధాంత మేర్పడు చున్నది. ఉద్భుతరూపసహిత ద్రవ్యము నకు నేత్రసంయోగముతో చాక్షుషప్రత్యక్ష మగుచున్నది. ఉద్భూతరూప సహిత ద్రవ్యముయొక్క నేత్రయోగ్య జాతికి నేత్రయోగ్య గుణమునకును సంయుక్తసమవాయ సంబంధముతో చాక్షుషప్రత్యక్ష మగుచున్నది. నేత్ర యోగ్యగుణముయొక్క రూపత్వాదిజాతి నేత్రసంయుక్తసమవేత సమవాయ సంబంధమువలన చాక్షుషప్రత్యక్షవిషయ మగుచున్నది. అభావము నేత్రసంబం ధమువలన చాక్షుషసంయుక్తవిషయ మగుచున్నది. ఏభూతలమందు ఘటాభావ చాక్షుషప్రత్యక్ష మగుచున్నదో ఆభూతలమందు నేత్రసంయోగ ముండుట వలన నేత్రసంబద్ధభూతలమునందు ఘటాభావమునకు విశేషణతాసంబంధ మున్నది. నీలఘటమునందు పీతరూపాభావ ప్రత్యక్ష మగుచున్నదో అక్కడ నేత్రముతో సంయోగసంబంధ మున్నది. నేత్రసంబద్ధ నీలఘటమునందు పీత రూపాభావమునకు విశేషణతా సంబంధమున్నది. ఘటనీలరూపమునందు పీత త్వజాతియొక్క యభావము చాక్షుషప్రత్యక్ష విషయ మగుచున్నది. నేత్రసం యుక్తసమవాయ సంబంధసహిత మగునీలరూపము, ఆనీలరూపమునందు పీత త్వాభావముయొక్క విశేషణతా సంబంధ మున్నది. ఈరీతిగా,

(౧) నేత్రసంయోగము,
(౨) నేత్రసంయుక్తసమవాయము,
(౩) నేత్రసంయుక్తసమవేత సమవాయము,
(౪) నేత్రసంబద్ధవిశేషణత,

యను నీనాలుగుసంబంధములు చాక్షుషప్రమకు హేతువులై యున్నవి. అవియ వ్యాపారములు నై యున్నవి. చాక్షుషప్రమ ఫలమై యున్నది. ఈప్రకార

ముగా త్వక్శ్రోత్రములచేత ద్రవ్యప్రత్యక్షము లగుచున్నవి.

(౮) రాసనప్రత్యక్ష ప్రమానిరూపణము.

రసనేంద్రియముచేత ద్రవ్యప్రత్యక్షము కాదు. రసము, రసత్వమధుర త్వాదిరసనిష్ఠ జాతి, రసాభావము, మధురాది రసములయం దుండు నామ్లత్వాది జాత్యభావము రాసనప్రత్యక్షవిషయ మగుచున్నవి.

(౧) రసనాసంయుక్త సమవాయము.

(౨) రసనాసంయుక్త సమవేత సమవాయము.

(3) రసనాసంబద్ధ విశేషణత.

ఈమూడు సంబంధములు రాసనప్రత్యక్షమును గుఱించి హేతువులై యున్నవి. ఎక్కడ ఫలమందు మధురరసము రసనేంద్రియముచేత రాసనప్రత్యక్ష విషయ మగుచున్నదో, ఆఫలమునందు రసనేంద్రియ సంయోగ ముండుటవలన రసనాసంయుక్తము ఫల మగుచున్నది. దానియందు రసమునకు సమవాయ సంబంధ మున్నది. రసముయొక్క రాసనప్రత్యక్షమునందు సంయుక్తసమవాయము ప్రత్యక్షవ్యాపార మై యున్నది. ఎట్లనగా, సంయుక్తసమవాయ సంబంధమునందు ఏసమవాయాంశ మున్నదో అది నిత్య మగుటవలన రసనా జన్యము కాదు. అయి నను సంయోగాంశము రసనాజన్యమై యున్నది. అది రసనేంద్రియజన్యమై రాసన సాక్షాత్కారమునకు జనక మై యుండుటవలన వ్యాపార మై యున్నది. ఈ వ్యాపారసహిత మగు రాసనప్రత్యక్షమునకు అసాధారణకారణ మై యుండుట వలన రసనేంద్రియము కరణమై యున్నది, రాసనప్రమ ఫల మై యున్నది. ఆరస మునందు రసత్వజాతి, మధుర, త్వామ్లత్వ, లవణత్వ, కటుత్వ, కషాయత్వ, తిక్తత్వ రూపపడ్ధర్మములు రాసనప్రత్యక్షవిషయమై యున్నవి. ఆ రసనేంద్రియ ముతో ఫలాదిద్రవ్యమునకు సంయోగ మున్నది. ఆద్రవ్యమునందు రసము సమ వేత మై యున్నది. అందువలన రసము రసనాసంయుక్తద్రవ్యమునందు సమవేత మై యున్నది. దానియందు రసత్వ, రసత్వ వ్యాప్యమధురత్వాదిజాతికి రసనాసంయుక్త సమవేతసమవాయసంబంధ మున్నది. ఫలమునం దుండు మధురరసమునందు ఆమ్ల త్వాభావమునకు రాసనప్రత్యక్ష మగుచున్నది. ఆ రసనేంద్రియమునకు ఆమ్లత్వా భావముతో స్వసంబద్ధవిశేషణతాసంబంధ మున్నది. ఎట్లనగా సంయుక్త సమ వాయ సంబంధముచేత రసనాసంబంధము మధురరస మగుచున్నది. దానియందు ఆమ్లత్వా భావమునకు రాసనప్రత్యక్ష మగుచున్నది. ఆ రసనేంద్రియమునకు

నామ్లత్వాభావముతో స్వసంబద్ధవిశేషణతా భావసంబంధ మున్నది. ఎట్లనగా, సంయుక్తసమవాయసంబంధముచేత రసనాసంబంధము మధురరస మగుచున్నది. దానియం దామ్లత్వాభావమునకు విశేషణతాసంబంధ మున్నది. అందువలన రసనేంద్రియమునకు ఆమ్లత్వాభావముతో సంయుక్తసమవేత విశేషణతాసంబంధ మగుచున్నది. ఈరీతిగానే రసనేంద్రియజన్యరాసనప్రత్యక్షమును గుఱించి యీ మూడు సంబంధములు హేవుతులై యున్నవి.

(౮) ఘ్రాణజప్రత్యక్షప్రమానిరూపణము.

ఘ్రాణజ ప్రత్యక్ష ప్రమయందు ఘ్రాణమునకు విషయముతో మూడు సంబంధములు హేతువులై యున్నవి. అవి యేవనగా.—

(౧) ఘ్రాణ సంయుక్త సమవాయము,

(౨) ఘ్రాణసంయుక్త సమవేత సమవాయము,

(3) ఘ్రాణ సంబద్ధ విశేషణత,

అనునవి. ఘ్రాణేంద్రియముచేత ద్రవ్యమునకు ప్రత్యక్ష మగునది లేదు. మఱియును గంధగుణము ప్రత్యక్ష మగుచున్నది. గంధమునకు ఘ్రాణముతో సాక్షాత్సంబంధము లేదు, పుష్పాదికమునందు గంధమునకు సమవాయసంబంధ మున్నది. ఘ్రాణమునకు పుష్పాదికముతో సంయోగసంబంధ ముండుటవలన ఘ్రాణసంయుక్తసమవాయసంబధముచేత గంధముయొక్క ఘ్రాణజప్రత్యక్ష మగుచున్నది. అన్యగుణముయొక్క ప్రత్యక్షము ఘ్రాణముచేత కలుగనేరదు. గంధమునందు గంధత్వజాతి, గంధత్వవ్యాప్యసుగంధత్వదుర్గంధత్వరూపజాతియును గూడ ఘ్రాణజప్రత్యక్షవిషయమై యున్నవి. అటులనే గంధాభావము గూడ ఘ్రాణజప్రత్యక్షవిషయమై యున్నది. ఎటుల ననగా, ఏ యింద్రియముచేత నేపదార్థమునకు జ్ఞాన మగుచున్నదో ఆ పదార్థముయొక్క జాతి, దానియభావము కూడ, ఆయింద్రియముచేతనే ప్రత్యక్ష మగుచున్నవి. ఎక్కడ గంధత్వ, సుగంధత్వ, దుర్గంధత్వములయొక్క ప్రత్యక్ష మగుచున్నదో అక్కడ ఘ్రాణసంయుక్త సమవేత సమవాయసంబంధము హేతువై యున్నది. ఎటుల ననగా, ఘ్రాణసంయుక్త మగు పుష్పాదికమునందు గంధము సమవేతమై యున్నది. దానియందు గంధత్వమునకు సమవాయ మున్నది. ఎక్కడ పుష్పముయొక్క సుంగధమందు దుర్గంధత్వాభావముయొక్క ఘ్రాణజప్రత్యక్షము కలుగుచున్నదో అక్కడ ఘ్రాణమునకు దుర్గంధత్వాభావముతో స్వసంబద్ధవిశేషణతాసంబంధ మున్నది. ఎటుల

ససహా సంయుక్త సమవాయ సంబంధముచేత ఘ్రాణసంబద్ధ సుగంధమునందు దుర్గంధత్వాభావమునకు విశేషణసంబంధ మున్నది. ఎక్కడ పుష్పాదికము దూరముం దుండినను గంధప్రత్యక్ష మగుచున్నదో అక్కడ యద్యపి పుష్పము నందు క్రియ చూడబడనందున పుష్పాదికమునకు ఘ్రాణముతో సంయోగము లేనందున ఘ్రాణసంయుక్త సమవాయము సంభవింపదు. తథాపి గంధము గుణమై యుండుటవలన కేవలగంధమునందు క్రియ కలుగుట లేదు గాన గంధాశ్రయ మైన పుష్పాదికముయొక్క సూక్ష్మావయవమునందు క్రియ కలిగి ఘ్రాణముతో సంయోగ మగుటవలన ఘ్రాణసంయుక్త మగుపుష్పాదికముయొక్క అవయవము నందు గంధమునకు సమవాయసంబంధ ముండుటవలన ఘ్రాణసంయుక్తసమ వాయ సంబంధమే గంధముయొక్క ఘ్రాణజప్రత్యక్షమును గుఱించి హేతు వై యున్నది. ఈరీతిగా ఘ్రాణజప్రత్యక్షమును గుఱించి యీమూడు సంబంధములు హేతువు లై యున్నవి. ఇవే వ్యాపారము లై యున్నవి. ఘ్రాణేంద్రియము కరణ మై యున్నది. ఘ్రాణజప్రత్యక్షప్రమ ఫల మై యున్నది.

ఇదే ప్రకారముగా శ్రోత్రాదిపంచేంద్రియములచేత బాహ్య పదార్థముల జ్ఞానము కలుగున్నది.

(౧౦) మానసప్రత్యక్షప్రమానిరూపణము.

ఆత్మగుణ మగు సుఖాదిధర్మము, ఆత్మత్వజాతి, సుఖత్వాదిజాతియు; వీనికి ప్రత్యక్షము శ్రోత్రాదీంద్రియముచేత కలుగనేరదు. మఱియు నేమనగా, ఆత్మా ద్యాంతర పదార్థములకు మనస్సు హేతువై యున్నది. ఆత్మ తన్నిష్ఠసుఖాదిగుణ ములు గాక భిన్నపదార్థములు బాహ్యము లనబడును. ఆత్మకును తన్నిష్ఠధర్మ ములకు నాంతరము లని పేరు. ఎటుల బాహ్యప్రత్యక్షప్రమకు శ్రోత్రాదీంద్రియ ములు కరణము లై యున్నవో అటులనే ఆంతరము లైన యాత్మాదుల ప్రత్యక్షప్ర మకు మనస్సు కరణమై యుండుటవలన మనస్సుకూడ ఇంద్రియ మని చెప్పబడును, ప్రమాణ మనియును చెప్పుదురు. మనస్సునందు క్రియ కలిగి ఆత్మతో సంయోగ మయినపుడు ఆత్మయొక్క మానసప్రత్యక్ష మగుచున్నది. ఆ యాత్మయొక్క మానసప్రత్యక్షరూపప్రమ ఫల మై యున్నది. ఆత్మమనస్సంయోగము వ్యాపార మై యున్నది. ఎటుల ననగా, ఆత్మమనస్సంయోగము మనోజన్య మై మనోజన్యాత్మ విషయక ప్రత్యక్ష ప్రమకు జనక మై యుండుటవలన వ్యాపార మై యున్నది. ఈ సంయోగరూప వ్యాపార సహిత మనస్సు ఆత్మవిషయక ప్రత్యక్షప్రమకు అ

సాధారణకారణ మై యుండుటవలన ప్రమాణ మై యున్నది.

జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము, సుఖము, దుఃఖము, ద్వేషము, ఇవి ఆత్మగుణములు.

వీనియొక్క సాక్షాత్కారమును గురించి కూడ మనస్సే కరణ మై (ప్రమాణమై) యున్నది అక్కడ మనస్సుతో కూడ జ్ఞానాదికమునకు సాక్షాత్సంబంధము లేదు గాని పరంపరా సంబంధ మున్నది. తనయొక్క సంబంధియొక్క సంబంధము పరంపరా సంబంధ మనబడును. జ్ఞానాదికమునకు ఆత్మయందు సమవాయసంబంధ ముండుటవలన జ్ఞాదికమునకు సంబధి ఆత్మ. దానితో మనస్సునకు సంయోగము గనుక మనస్సుతో జ్ఞానాదికమునకు పరంపరాసంబంధ మున్నది. ఆజ్ఞానాదికమునకు మనస్సుతో స్వసమవాయి సంయోగ సంబంధ మున్నది. స్వ మనగా జ్ఞానాదికము; దానికి సమవాయి యనగా సమవాయసహితాత్మ; దానికి మనస్సుతో సంయోగ ముఁన్నది. అలాగుననే మనస్సునకు జ్ఞానాదికముతో కూడ పరంపరాసంబంధ మున్నది. అది మనస్సంయుక్త సమవాయము. మనస్సంయుక్తము ఆత్మ; దానియందు జ్ఞానాదికమునకు సమవాయ సంబంధ మున్నది. అలాగుననే జ్ఞాన, త్వేచ్ఛాత్వ, ప్రయత్నత్వ, సుఖత్వ, దుఃఖత్వ, ద్వేషత్వములకు మనస్సుతో ప్రత్యక్ష మయినపుడు మనస్సుతో జ్ఞానత్వాదికమునకు స్వాశ్రయ సమవాయి సంయోగ సంబంధ మయి యున్నది. స్వ మనగా జ్ఞానత్వాదికము, దానికి ఆశ్రయము జ్ఞానాదికము. దానికి సమవాయి ఆత్మ దానికి మనస్సుతో సంయోగ మున్నది. అలాగుననే మనస్సునకు జ్ఞానత్వాదికముతో మనస్సంయుక్తసమవాయసంబంధ మున్నది. ఎటుల ననగా, మనస్సంయుక్తాత్మయందు జ్ఞానాదికము సమవేతమై యున్నది, దానియందు జ్ఞానత్వాదికమునకు సమవాయ సంబంధ మున్నది. అలాగుననే ఆత్మయందు సుఖాభావ దుఃఖాభావములయొక్క ప్రత్యక్ష మగుచున్నది. అప్పుడు మనస్సంబద్ధవిశేషణతాసంబంధ మున్నది. మనస్సంబద్ధ మేది యనగా, మనస్సంయోగసహితాత్మ దానియందుసుఖాభావదుఃఖాభావములకు విశేషణతాసంబంధ మున్నది. సుఖమునందు దుఃఖత్వాభావమునకు ప్రత్యక్ష మయినయెడల మనస్సంయుక్తసమవేత విశేషణతాసంబంధ మున్నది. ఎటుల ననగా ఆత్మయందు సమవేత మయిన సుఖమునందు దుఃఖత్వాభావమునకు విశేషణతాసంబంధ మున్నది. ఈరీతిగా నభావముయొక్క మానసప్రత్యక్షమునకు హేతు వగు మనస్సంబద్ధవిశేషణతా

సంబంధము హేతువై యున్నది. ఎపుడు ఆత్మయందు సుఖాభావమునకు ప్రత్యక్ష మగుచున్నదో అపుడు సంయోగసంబంధముతో మనస్సంబద్ధ మగునాత్మయందు సుఖాభావాధికరణమునకు విశేషణతాసంబంధ మున్నది. సుఖాభావమునందు దుఃఖత్వాభావము ప్రత్యక్ష మయినయెడల సంయుక్తసమవాయసంబంధముతో మనస్సంబద్ధ మైన అట్లాగా సుఖాదికమందును సాక్షాత్సంబంధముచేత మనస్సంబద్ధమునందును పరంపరాసంబంధముచేత మనస్సంబద్ధమునందును అభావమునకు విశేషణతాసంబంధ మున్నది. ఈరీతిగా మానసప్రత్యక్షమును గుఱించి మనస్సంయోగము, మనస్సంయుక్తసమవాయము, మనస్సంయుక్తసమవేతసమవాయము, మనస్సంబద్ధవిశేషణత, యని యీనాలుగుసంబంధములు హేతువు లై యున్నవి. మానసప్రత్యక్షమునకు హేతువైన యీనాలుగుసంబంధములు వ్యాపారము లై యున్నవి.

సంబంధరూపవ్యాపార సహితాసాధారణకారణమనస్సు కరణ మై యున్నది; అందువలన ప్రమాణము ఆత్మసుఖాదికముయొక్క మానససాక్షాత్కారరూపప్రమ ఫల మై యున్నది. ఆత్మగుణము లగుసుఖాదికములయొక్క ప్రత్యక్షమునకు సంయుక్త, సమవాయ, సంబంధము లెటుల హేతువులో అటులనే ధర్మాధర్మసంస్కారాదికము గూడ ఆత్మయొక్క గుణ మైనందున వానితో మనస్సునకు సంయుక్త సమవాయ సంబంధ మున్నది. అయినను ధర్మాదిగుణములు ప్రత్యక్షయోగ్యము కానందున వానియొక్క మానసప్రత్యక్షము కలుగనేరదు. ప్రత్యక్షయోగ్యత దేనియందు లేదో అది ప్రత్యక్షగోచరము కాదు, మఱియు నేయాశ్రయముయొక్క ప్రత్యక్ష మగుచున్నదో దానియొక్క సంయోగమునకు ప్రత్యక్ష మగుచున్నది. రెండువ్రేళ్లు సంయోగమునకు ఆశ్రయమై యున్నపుడు ఆరెండంగుళులచాక్షుషప్రత్యక్ష మయినపుడు సంయోగముయొక్క చాక్షుష ప్రత్యక్ష మగుచున్నది. మఱియు నంగుళియొక్క త్వాచప్రత్యక్ష మయినపుడు అంగుళులసంయోగముయొక్క త్వాచప్రత్యక్షము కూడ అగుచున్నది. ఆలాగుననే ఆత్మమనస్సంయోగముచేత నాత్మకు మానసప్రత్యక్ష మగుచున్నది. అప్పుడు సంయోగమునకు ఆశ్రయము ఆత్మ యైనందున సంయోగమునకు కూడ మానసప్రత్యక్షము కావలెను. తథాపి సంయోగమున కాశ్రయములు రెండు; ఎప్పుడు సంయోగాశ్రయము లగు రెంటికి ప్రత్యక్ష మగుచున్నదో అప్పుడు సంయోగము కూడ ప్రత్యక్ష మగును, ఎప్పుడు రెండును ప్రత్యక్షము గాక

ఒకటిమాత్రమే ప్రత్యక్ష మగునో అప్పుడు సంయోగమునకు ప్రత్యక్షము కాదు. ఎటుల ననగా, ఘటము ప్రత్యక్ష మగుటవలన దానిసంయోగము కూడ ప్రత్యక్ష మగును. మఱియు ఘటక్రియచేత ఘటాకాశమునకు సంయోగ మయినపుడు సంయోగమున కాశ్రయము ఘటాకాశములు రెండును అయి యున్నవి. అందులో ఘటము ప్రత్యక్షమై ఆకాశము ప్రత్యక్షము కానందున వానిసంయోగము కూడ ప్రత్యక్షము కాదు. ఈరీతిగా నాత్మమనస్సంయోగమునకు ఆశ్రయము ఆత్మమనస్సులు. వానిలో నాత్మ, ఆత్మవిషయకమానసప్రత్యక్ష విషయమగుచున్నది, అనగా మనస్సుచేత ఆత్మప్రత్యక్ష మగుచున్నదే గాని మనస్సు ప్రత్యక్షము కాదు. అందువలన నాత్మమనస్సంయోగమానసప్రత్యక్ష మగుటలేదు. ఆత్మయు, జ్ఞానసుఖాదికము మానసప్రత్యక్షము లగుచున్నవి. గాని, జ్ఞానసుఖాదికములను విడిచి కేవలాత్మ ప్రత్యక్ష మగుటలేదు. మఱియు నాత్మను విడిచి కేవలజ్ఞానసుఖాదికములును ప్రత్యక్షము కావు. జ్ఞా, నేచ్ఛా, కృతి, సుఖ, దుఃఖ, ద్వేషములలో నే దైన నొకగుణసహిత మగునాత్మయొక్క ప్రత్యక్షము మనస్సుచేత నగును. నేను తెలిసికొనుచున్నాఁడను, నేను ఇచ్ఛించుచున్నాడను, నేను ప్రయత్నించుచున్నాడను, నేను సుఖినై యున్నాడను, నేను దుఃఖినై యున్నాడను, నేను ద్వేషి నై యున్నాడను, ఈరీతిగా నేదైన నొక గుణమును విషయీకరించుకొనియే ఆత్మ ప్రత్యక్ష మగుచున్నది. ఇంద్రియజన్యప్రత్యక్షప్రమకు నింద్రియసంబంధము హేతువై యున్నది. అదియ వ్యాపార మై యున్నది. ఇంద్రియము ప్రమాణ మై యున్నది. ఇంద్రియజన్యసాక్షాత్కారమే రూపప్రత్యక్షప్రమ ఫల మై యున్నది. ఇది న్యాయశాస్త్రసిద్ధాంతము.

## ౧౧. ప్రత్యక్షప్రమయొక్క కరణనిరూపణము.

గౌరీకాంతభట్టాచార్యుల యభిప్రాయ మేమనగా.—ప్రత్యక్షప్రమకు నింద్రియము కరణము కాదు. ఏయింద్రియముయొక్కసంబంధము వ్యాపారమని చెప్పబడుచున్నదో అది కరణమై యున్నది. ఇంద్రియము కారణమై యున్నదే కాని కరణము కాదు. వారియభిప్రాయ మేమనగా, వ్యాపారసహిత కారణము కరణము కా దనియు ఏది యుండిన కార్యమునందు విలంబము కాక అవ్యవహితోత్తరక్షణమందు కార్య మగునో ఆకారణమును కరణ మని చెప్పుదురు. ఇంద్రియముయొక్క సంబంధ మయినయెడల ప్రత్యక్షప్రమారూపకార్యమునందు విలంబముగాక ఇంద్రియసంబంధముచేత అవ్యవహితోత్తరక్షణము

సంబంధము ఏక మై యున్నది. ఎపుడు ఆత్మయందు సుఖాభావమునకు ప్రత్యక్ష మగుచున్నదో అపుడు సంయోగసంబంధముతో మనస్సంబద్ధ మగునాత్మయందు సుఖాభావాదికమునకు విశేషణతాసంబంధ మున్నది. సుఖాభావమునందు దుఃఖత్వాభావము ప్రత్యక్ష మయినయెడల సంయుక్తసమవాయసంబంధముతో మనస్సంబద్ధ మైన అగా సుఖాదికమందును సాక్షాత్సంబంధముచేత మనస్సంబద్ధమునందును పరంపరాసంబంధముచేత మనస్సంబద్ధమునందును అభావమునకు విశేషణతాసంబంధ మున్నది. ఈరీతిగా మానసప్రత్యక్షమును గుఱించి మనస్సంయోగము, మనస్సంయుక్తసమవాయము, మనస్సంయుక్తసమవేతసమవాయము, మనస్సంబద్ధవిశేషణత, యని యీనాలుగుసంబంధములు హేతువు లై యున్నవి. మానసప్రత్యక్షమునకు హేతువైన యీనాలుగుసంబంధములు వ్యాపారము లై యున్నవి.

సంబంధరూపవ్యాపార సహితాసాధారణకారణమనస్సు కరణ మై యున్నది; అందువలన ప్రమాణము ఆత్మసుఖాదికముయొక్క మానససాక్షాత్కారరూపప్రమ ఫల మై యున్నది. ఆత్మగుణము లగుసుఖాదికములయొక్క ప్రత్యక్షమునకు సంయుక్త, సమవాయ, సంబంధము లెటుల హేతువులో అటులనే ధర్మాధర్మసంస్కారాదికము గూడ ఆత్మయొక్క గుణ మైనందున వానితో మనస్సునకు సంయుక్త సమవాయ సంబంధ మున్నది. అయినను ధర్మాదిగుణములు ప్రత్యక్షయోగ్యము కానందున వానియొక్క మానసప్రత్యక్షము కలుగనేరదు. ప్రత్యక్షయోగ్యత దేనియందు లేదో అది ప్రత్యక్షగోచరము కాదు, మఱియు నేయాశ్రయముయొక్క ప్రత్యక్ష మగుచున్నదో దానియొక్క సంయోగమునకు ప్రత్యక్ష మగుచున్నది. రెండువ్రేళ్లు సంయోగమునకు ఆశ్రయమై యున్నపుడు ఆరెండంగుళులచాక్షుషప్రత్యక్ష మయినపుడు సంయోగముయొక్క చాక్షుషప్రత్యక్ష మగుచున్నది. మఱియు నంగుళియొక్క త్వాచప్రత్యక్ష మయినపుడు అంగుళులసంయోగముయొక్క త్వాచప్రత్యక్షము కూడ అగుచున్నది. అలాగుననే ఆత్మమనస్సంయోగముచేత నాత్మకు మానసప్రత్యక్ష మగుచున్నది. అప్పుడు సంయోగమునకు ఆశ్రయము ఆత్మ యైనందున సంయోగమునకు కూడ మానసప్రత్యక్షము కావలెను. తథాపి సంయోగమున కాశ్రయములు రెండు; ఎప్పుడు సంయోగాశ్రయము లగు రెంటికి ప్రత్యక్ష మగుచున్నదో అప్పుడు సంయోగము కూడ ప్రత్యక్ష మగును, ఎప్పుడు రెండును ప్రత్యక్షము గాక

౧౪. వస్తువుయొక్క జ్ఞానమును గుఱించి విశేషణజ్ఞానమునకు హేతుత్వ నిరూపణము.

ఎప్పుడు దోషరహితేంద్రియముచేత యథార్థజ్ఞానము కలుగునో అప్పుడు విశేషణజ్ఞానము హేతువై యున్నది. అందువలన రజ్జుజ్ఞానమునకు పూర్వము రజ్జుత్వజ్ఞాన మున్నది. తెల్లతలగుడ్డ, తెల్లచొక్కా, కఱ్ఱ, వీనితో కూడుకొనిన బ్రాహ్మణునితో నేత్రమునకు సంయోగము కలిగినవుడు ఒకప్పుడు మనుష్యుడనియును, ఒకప్పుడు బ్రాహ్మణుడనియును, ఒకప్పుడు యష్టిధర బ్రాహ్మణుడనియును, ఒకప్పుడు కంచుకసహిత బ్రాహ్మణుడనియును, ఒకప్పుడు శ్వేత కంచుక సహితబ్రాహ్మణుడనియును, ఒకప్పుడు ఉష్ణీషసహిత బ్రాహ్మణుడనియును, ఒకప్పుడు శ్వేతోష్ణీష సహితబ్రాహ్మణుడనియును, మఱియొకప్పుడు, ఉష్ణీష, కంచుక, యష్టి, సహితబ్రాహ్మణుడనియును, ఒకప్పుడు, శ్వేతోష్ణీష, శ్వేతకంచుక, శ్వేతయష్టిసహిత బ్రాహ్మణుడనియును జ్ఞానము కలుగును. అప్పుడు నేత్రసంయోగము జ్ఞానమునకు సాధారణకారణమై యున్నది. జ్ఞానముయొక్క వైలక్షణ్యమునందు కారణ మేమనగా, ఎప్పుడు మనుష్యత్వరూప విశేషణముయొక్క జ్ఞానము నేత్రసంయోగము కలుగునో అప్పుడు మనుష్యుడని చాక్షుషజ్ఞానము కలుగుచున్నది. బ్రాహ్మణత్వజ్ఞానము నేత్రసంయోగము కలిగినప్పుడు బ్రాహ్మణుడని చాక్షుషజ్ఞానము కలుగుచున్నది. యష్టిబ్రాహ్మణత్వములకు నేత్రసంయోగమును కలిగినప్పుడు యష్టిధరబ్రాహ్మణుడనెడి జ్ఞానము కలుగుచున్నది. కంచుకబ్రాహ్మణత్వ రూప విశేషణముల జ్ఞానముచేత నేత్రసంయోగము కలిగినప్పుడు కంచుక సహిత బ్రాహ్మణుడనెడిచాక్షుష జ్ఞాన మగుచున్నది. శ్వేతతావిశిష్ట కంచుక రూప బ్రాహ్మణత్వరూప విశేషణముయొక్క జ్ఞానము నేత్రసంయోగము కలిగినప్పుడు శ్వేతకంచుక సహిత బ్రాహ్మణుడనియు, ఉష్ణీషసహిత బ్రాహ్మణత్వరూప విశేషణములయొక్క జ్ఞానము నేత్ర సంయోగమును కలిగినప్పుడు ఉష్ణీషసహిత బ్రాహ్మణుడనియును, శ్వేతత్వ విశిష్టోష్ణీషబ్రాహ్మణత్వరూపము లగు నీరెండువిశేషణములజ్ఞానము నేత్రసంయోగము కలిగినప్పుడు, శ్వేతోష్ణీషసహితబ్రాహ్మణుడనియును, ఉష్ణీష, కంచుక, యష్టి, బ్రాహ్మణత్వము లను నీనాలుగు విశేషణముల జ్ఞానము నేత్రసంయోగము కలిగినప్పుడు, ఉష్ణీషకంచుక సహితయష్టిధరబ్రాహ్మణుడనియును, శ్వేతతా విశిష్టోష్ణీష, శ్వేతతావిశిష్టకంచుక, శ్వేతతావిశిష్టయష్టి, బ్రాహ్మణత్వరూపవిశేషణ

జ్ఞానము నేత్రసంయోగము కలిగినప్పుడు, శ్వేతోష్ణీష, శ్వేతకంచుక, యష్టిధర బ్రాహ్మణు డనియును చాక్షుషజ్ఞానము కలుగుచున్నది. ఈరీతిగా ఎన్ని విశేషణ ములయొక్క జ్ఞానము పూర్వమునం దున్నదో అన్ని విశేషణములతో విశిష్ట మగుదానియొక్క జ్ఞానము ఇంద్రియములచేత కలుగుచున్నది. అప్పుడు ఇంద్రియ సంబంధము తుల్యమై యున్నది. విశిష్టప్రత్యయమునకు వైలక్షణ్యకారణము విలక్షణవిశేషణజ్ఞానమై యున్నది. విలక్షణవిశేషణజ్ఞానము కారణ మని అంగీక రించినయెడల నేత్రసంయోగముతో బ్రాహ్మణునియొక్క జ్ఞానము సమానముగా నుండవలయును. ఎప్పుడు ఘటముతో నేత్రమునకును, త్వక్కునకును సంయోగ మున్నదో అప్పుడు ఘట మనియును పృథివి యనియును, ఒకప్పుడు ఘటపృథివి యనియును, జ్ఞానము కలుగుచున్నది. ఎప్పుడు ఘటత్వరూపవిశేషణము యొక్క జ్ఞానము, ఇంద్రియసంయోగమును ఉన్నవో అప్పుడు ఘట మనియును, పృథివీత్వ రూపవిశేషణముయొక్క జ్ఞానము ఇంద్రియసంయోగము కలిగినప్పుడు పృథివి యనియును, ఘటత్వ, పృథివీత్వరూపవిశేషణములయొక్క జ్ఞానము ఇంద్రియ సంయోగము కలిగినప్పుడు ఘటము పృథివి యనియును ప్రత్యక్ష మగుచున్నది. ఈరీతిగా ఘటముతోడను ఇంద్రియమునకు సంయోగ రూపకారణము ఏకమై యున్నది. మఱియును విషయ మగు ఘటమును ఏకమై యున్నది. ఘటత్వ, పృథివీత్వ రూప జాతి ఘటమందు సర్వదా యున్నది. ఒకప్పుడు ఘటత్వ సహిత ఘటమాత్రమును జ్ఞానము విషయీకరించుచున్నది. ద్రవ్యత్వ, పృథివీత్వాది జాతిరూపాదిగుణము ఘట మున్నది యనుజ్ఞానమునందు విషయ మగుట లేదు. ఒకప్పుడు పృథివి యనుఘటజ్ఞానమునందు ఘటత్వము విషయ మగుట లేదు. అయిన పృథివీత్వేన ఘటమును, పృథివీత్వముయొక్క సంబంధమును విషయీ కరించుచుచున్నది. ఒకప్పుడు పృథివీత్వఘటత్వ రూపజాతి ఘటమందుండు దాని యొక్క సంబంధమును ఘటమును విషయీకరించుచున్నది. ఈరీతిగా జ్ఞానభే దము సామగ్రీభేదము లేక సంభవింపదు. విశేషణజ్ఞానరూప సామగ్రీభేదమే జ్ఞానవిలక్షణతయందు హేతువై యున్నది. ఎక్కడ ఘట మున్నది యను జ్ఞాన మగుచున్నదో అక్కడ ఘటము, ఘటత్వము, ఘటమునందుండుఘటత్వము యొక్క సమవాయసంబంధమును ప్రతీత మగుచున్నవి. పృథివి యున్నది యను జ్ఞానము కలుగు నప్పుడు, ఘటము, పృథివీత్వము, ఘటమునం దుండు పృథివీ త్వముయొక్క సమవాయ సంబంధము కూడ భాసించుచున్నది.

౧౫. విశేషణ విశేష్యములయొక్క స్వరూపనిరూపణము.

ఘటత్వ, పృథివీత్వములు విశేషణములు, ఘటము విశేష్యము. ఎట్లనగా, సంబంధమునకు ప్రతియోగి విశేషణమై యున్నది. సంబంధమునకు అనుయోగి విశేష్యమై యున్నది. దేనియొక్క సంబంధమున్నదో అది సంబంధమునకు ప్రతియోగి. దేనియందు సంబంధమున్నదో యది యనుయోగి యని వివేకము. ఘటత్వ, పృథివీత్వములయొక్క సమవాయసంబంధము ఘటమునందు భాసించుచుండుట వలన ఘటత్వ పృథివీత్వములు సమవాయ సంబంధమునకు ప్రతియోగు లగుట వలన విశేషణము లై యున్నవి. సంబంధమునకు అనుయోగి ఘట మగుట వలన విశేష్యమై యున్నది. ఎక్కడ దండి యగు పురుషు డున్నా డని జ్ఞానము కలుగుచున్నదో అక్కడ దండత్వవిశిష్టదండము సంయోగసంబంధముచేత పురుషత్వ విశిష్టపురుషునియందు భాసించుచున్నది. కాష్ఠసహితమనుష్యు డున్నా డనుజ్ఞాన మయినయెడల కాష్ఠత్వవిశిష్టదండము మనుష్యత్వ విశిష్టపురుషుని యందు సంయోగసంబంధముచేత భాసించుచున్నది. ప్రథమజ్ఞానమునందు దండత్వవిశిష్టము దండసంయోగమునకు ప్రతియోగిగా నుండుటవలన విశేషణము, పురుషత్వవిశిష్ట పురుషుడు సంయోగమునకు ననుయోగి యై యుండుటవలన విశేష్య మై యున్నది. ద్వితీయజ్ఞానమునందు కాష్ఠత్వ విశిష్టదండము ప్రతియోగి యై యున్నది, మనుష్యత్వ విశిష్టపురుషు డనుయోగి యై యున్నాడు. ఈరెండుజ్ఞానములయందును దండము విశేషణముగాను పురుషుడు విశేష్యముగాను ఉండినను, ప్రథమజ్ఞానమునందు దండమందు దండత్వము భాసించుచున్నది, కాష్ఠత్వము భాసించుటలేదు, పురుషునియందు పురుషత్వము భాసించుచున్నదే గాని మనుష్యత్వము భాసించుట లేదు. అలాగుననే ద్వితీయ జ్ఞానమునందు దండమునందుకాష్ఠత్వము భాసించుచున్నదే గాని దండత్వము భాసించుటలేదు. పురుషునియందు మనుష్యత్వము భాసించుచున్నదే గాని పురుషత్వము భాసించుట లేదు. దండత్వకాష్ఠత్వములు దండమునకు విశేషణము లై యున్నవి. ఎట్లనగా దండత్వాదికమునకు దండమం దేసంబంధ మున్నదో దానికి ప్రతియోగి దండత్వాదికము. దండత్వాదికముయొక్క సంబంధము దండమం దున్నది. సంబంధమున కనుయోగి దండ మగుటవలన దండము విశేష్యము. ఈరీతిగా దండత్వమునకు దండము విశేష్యమై పురుషునికి దండము విశేషణ మైయున్నది. ఎట్లనగా, పురుషునియందు దండముయొక్క యే సంయోగ మున్నదో దానికి

ప్రతియోగి దండ మై యున్నది. అందువలన పురుషునికి విశేషణమై యున్నది. ఆసంయోగమునకు పురుషు డనుయోగిగా నుండుటవలన విశేష్యమై యున్నాడు. ఎట్లు పురుషునికి దండము విశేషణమో అట్లు పురుషత్వ, మనుష్యత్వములు కూడ పురుషునియందు విశేషణములై యున్నవి. ఎట్లనగా దండమునకు పురుషునితో సంయోగసంబంధ మెట్లు భాసించునో అట్లు పురుషత్వాదిజాతియొక్క సమవాయసంబంధము భాసించుచున్నది. ఆసంబంధమునకు పురుషత్వాదికము ప్రతియోగి యై యుండుటవలన విశేష మై యున్నది. అనుయోగి యగుటవలన పురుషుడు విశేష్య మై యున్నాడు అయినను ఇటువంటిభేద మున్నది; పురుషునియొక్క ధర్మ మగు నే పురుషత్వ మనుష్యత్వాదికము లున్నవో అది కేవల పురుషవ్యక్తియందు విశేషణము లై యున్నవి. మఱియు పురుషత్వాది ధర్మ విశిష్టపురుషవ్యక్తియందు దండాదికము విశేషణ మై యున్నది. దండాదికము, దండత్వాదిధర్మమునకు విశేష్యమై యున్నది. పురుషత్వాదికము పురుషునకు విశేషణ మయి యున్నది. పరంతు దండత్వాది విశేషణముయొక్క సంబంధమును ధరించు కొనిన పిమ్మట పురుషాది విశేష్యముయొక్క సంబంధిదండాదికమగుచున్నది. ఈరీతిగా కేవలవ్యక్తియందు పురుషత్వ మనుష్యత్వవిశేషణము లున్నవి. పురుషత్వ మనుష్యత్వ విశిష్టపురుషవ్యక్తియందు దండత్వ కాష్ఠత్వ విశిష్టదండము విశేషణమై యున్నది. మఱియు కేవలదండ వ్యక్తియందు దండత్వము, కాష్ఠత్వము విశేషణమై యున్నవి.

ఈరీతిగా జ్ఞానముయొక్క విషయతావిచారము చాయగా బహుసూక్ష్మముగా తెలియును. చక్రవర్తి గదాధరభట్టాచార్యులచేత సంగతిగ్రంథమునందు విస్తారము వ్రాయఁబడియున్నది. మఱియు జయరామ పంచాననభట్టాచార్యులచేతను, రఘునాథభట్టాచార్యులచేతను, విషయతా విచారాత్మక గ్రంథము చేయబడియున్నది. ఈవిషయములు వానియందు సుస్పష్టములుగా నున్నవి. సూక్ష్మపదార్థ విచారము సంస్కృతవాణి వినా వ్రాయుటకు సుసాధ్యము కాదు గనుక దుర్బోధమైనందున నిచ్చట నతిస్థూలముగా నీప్రచారము వివరింపబడినది.

౧౬ - విశేషణవిశేష్యజ్ఞానభేదపూర్వక మగున్యాయ మత భ్రమజ్ఞానసమాప్తి.

పై జెప్పిన రీతిగా విశిష్టజ్ఞానమునకు విశేషణజ్ఞానము హేతువై యున్నది. ఆ విశేషణజ్ఞాన మొకప్పుడు స్మృతిరూప మై, మఱియు నొకప్పుడు

నిర్వికల్పరూపమై, యొకప్పుడు విశిష్టజ్ఞానరూప మై యున్నది. విశేష్యవిశేష ములకంటె పూర్వము విశేషణమాత్రముతో ఇంద్రియసంబంధ మగు నప్పుడు అవిశేషమాత్రముతో ఇంద్రియసంబంధజన్యజ్ఞానము విశిష్టప్రత్యక్ష మై యున్నది. పురుషునితో సంబంధము లేక కేవలదండముతో నింద్రియసంబంధ మగునప్పుడు ఉత్తరక్షణమునందు పురుషునితో సంబంధ మగునెడల దండ రూపవిశేషణముయొక్క జ్ఞానము విశేషణమాత్రముయొక్క సంబంధముచేత జన్య మై యున్నది. దానివలన నుత్తరక్షణమునందు దండి పురుషుడని ఈవిశిష్ట జ్ఞానము కలుగు చున్నది. ఘటము అని ప్రథమ మగు నే విశిష్టజ్ఞాన మున్నదో దానికి పూర్వమందు ఘటత్వరూపవిశేషణముయొక్క యింద్రియసంబంధము చేత నిర్వికల్పజ్ఞాన మగుచున్నది. ఉత్తరక్షణమునందు ఇది ఘట మని ఘటత్వ విశిష్టఘటజ్ఞాన మగుచున్నది. ఏ యింద్రియసంబంధముచేత ఘటత్వనిర్వికల్ప జ్ఞానము కలుగునో ఆయింద్రియసంబంధముచేతనే ఘటత్వవిశిష్టఘటముయొక్క సవికల్పకజ్ఞానము కలుగుచున్నది. ఘటత్వముయొక్క నిర్వికల్పకజ్ఞానమునందు ఇంద్రియము కరణమై యున్నది. ఇంద్రియసంయుక్తసమవాయ సంబంధము వ్యాపార మై యున్నది. ఘటత్వవిశిష్టఘటముయొక్క సవికల్పకజ్ఞానమునందు ఇంద్రియసంయుక్తసమవాయ సంబంధము కరణ మై యున్నది. నిర్వికల్పక జ్ఞానము వ్యాపారమై యున్నది. ఈరీతిగా ఒకానొక యాధునిక నైయాయికునిచేత నిర్వికల్పకజ్ఞానము సవికల్పకజ్ఞానమునందును కరణభేదముగా చెప్పబడియున్నది. ఇది సంప్రదాయవిరుద్ధముగా నున్నది. ఎట్లనగా,—వ్యాపారసహితాసాధారణకార ణము కరణ మని చెప్పబడియున్నది. ఈమతమునందు ప్రత్యక్షజ్ఞానమునకు కరణ మై యుండునింద్రియమునకే ప్రత్యక్షప్రమాణ మని పేరు. ఆధునికరీతిగా సవి కల్పజ్ఞానమునకు కరణ మై యుండునింద్రియసంబంధము కూడ ప్రమాణ మని చెప్పవలెను. సంప్రదాయజ్ఞులచేత సంబంధము ప్రమాణ మని అంగీకారము లేనందువలన ఆరెండుప్రత్యక్షజ్ఞానములకును ఇంద్రియమే కరణమై యుండుట వలన ప్రత్యక్షమే ప్రమాణమై యున్నది. అయిన నిర్వికల్పకజ్ఞానమునందు ఇంద్రి యసంబంధము మాత్రము వ్యాపారమై యున్నది. సవికల్పకజ్ఞానమం దయిననో ఇంద్రియసంబంధము, నిర్వికల్పకజ్ఞానమును, ఈరెండును వ్యాపారమై యున్నవి. ఈద్వివిధప్రత్యక్షజ్ఞానములకును కరణ మై యుండునింద్రియము ప్రత్యక్షప్రమాణ మై యున్నది. ధర్మధర్ములయొక్క సంబంధమును విషయీకరించినజ్ఞానము. సవి

కల్పకజ్ఞాన మని చెప్పుదురు. ఘట మున్నది యనుజ్ఞానముచేత ఘటమునందు ఘటత్వ సమవాయము భాసించుచున్నది. అందువలన సవికల్పకజ్ఞానమునకు ధర్మము, ధర్మి, సమవాయము, ఈమూడు విషయములై యున్నది అందువలన ఘటము అనునివిశిష్టజ్ఞానము సంబంధమును విషయీకరించుటవలన సవికల్పక మని చెప్పుదురు. తద్భిన్నజ్ఞానమును నిర్వికల్ప మని చెప్పుదురు. సవికల్ప, నిర్వికల్పకజ్ఞానముయొక్క లక్షణము శితికంఠీయమునందు విస్తృతముగా నున్నది. తదర్థము సూక్ష్మముగా నుండుటచే విస్తర మిచ్చుట వ్రాయ లేదు. ఈరీతిగా ప్రథమవిశిష్టజ్ఞానమునకు జనక మగు విశేషజ్ఞానము నిర్వికల్పకజ్ఞాన మై యున్నది. ఘట మున్నది యని విశిష్టజ్ఞానానంతరమున ఘటముయొక్క విశిష్టజ్ఞానము తిరిగి రైయినప్పుడు ఘటముతో నింద్రియమునకు సంబంధ మున్నది గాన తత్సంబంధముచేత పూర్వానుభవజన్యఘటత్వస్మృతి యున్నది. దానిచేత నుత్తరక్షణము నందు ఘట మున్నది యని విశిష్టజ్ఞానము కలుగుచున్నది. ఈరీతిగా ద్వితీయాదివిశిష్టజ్ఞానమునకు స్మృతిరూపవిశేషణజ్ఞానము హేతు వై యున్నది. ఎప్పుడు దోషసహిత నేత్రమునకు రజ్జువుతో నైనను శుక్తితో నైనను సంబంధము కలుగునో అప్పుడు దోషబలముచేత సర్పత్వరజతత్వములయొక్క స్మృతి యగుచున్నది. రజ్జుత్వశుక్తిత్వములయొక్క స్మృతి యగుట లేదు. విశిష్టజ్ఞానమునకు హేతు వైన విశేషణజ్ఞానము ఏధర్మమును విషయీకరించియున్నదో ఆ ధర్మము విశిష్టజ్ఞానముచేత విషయమునందు భాసించుచున్నది. సర్పత్వ రజతత్వముల యొక్క స్మృతిరూపజ్ఞానము రజ్జుత్వశుక్తిత్వములను విషయీకరించుట లేదు. సర్పత్వ రజతత్వములను విషయీకరించుటవలన సర్ప మని రజ్జువుయొక్క విశిష్టజ్ఞానముచేత రజ్జువునందు సర్పత్వభాన మగుచున్నది. రజత మని ఈశుక్తియొక్క విశిష్టజ్ఞానముచేత శుక్తియందు రజతత్వభాన మగుచున్నది. సర్ప మని ఈవిశిష్టభ్రమయందు విశేష్యము రజ్జువు, సర్పత్వము విశేషణము, అయి యున్నవి. ఎట్లనగా, సర్పత్వముయొక్క సమవాయసంబంధము రజ్జువునందు భాసించుచున్నది. ఆ సమవాయమునకు సర్పత్వము ప్రతియోగి యై రజ్జువు అనుయోగి యై యున్నవి. రజతము అని ఈభ్రమచేత శుక్తియందు రజతత్వముయొక్క సమవాయము భాసించుచున్నది. ఆ సమవాయమునకు ప్రతియోగి రజతత్వము వలన నది విశేషణమై యున్నది. శుక్తి అనుయోగి యై యుండుటవలన విశేష్య మై యున్నది. ఈరీతిగా భ్రమజ్ఞానముచేత విశేషణాభావ సహితమునందు విశే

షణభావ మగుచున్నది. అందువలన న్యాయమతమునందు విశేషణాభావ సహిత మునందు విశేషణప్రతీతి భ్రమ మని చెప్పబడెను. దానికి అయథార్థజ్ఞాన మని పేరు. అన్యథాఖ్యాతి యనియును నామాంతరము కలదు. భ్రమజ్ఞానమునందు సూక్ష్మవిచారము అన్యథాఖ్యాతివాదనామకగ్రంథమునందు చక్రవర్తి గదాధరభట్టాచార్యులచేత వివరణముగా నున్నది. అది దుర్బోధముగా నున్నందున నిచ్చట వ్రాయ లేదు. న్యాయమతమునందు సర్పాదిభ్రమకు విషయము రజ్జ్వాదికమై యున్నది. సర్పాదికము కాదు. ప్రత్యక్షరూపభ్రమజ్ఞానము కూడ ఇంద్రియజన్యమై యున్నది.

౧౭ వేదాంతసిద్ధాంతానుసారముగా నింద్రియాజన్య మగు భ్రమజ్ఞాన నిరూపణము.

వేదాంతసిద్ధాంతమునందు రజ్జువు సర్పభ్రమకు విషయము కాదు. అనిర్వచనీయసర్పమే విషయమై యున్నది. భ్రమజ్ఞానము ఇంద్రియజన్యము కాదు. మఱియు న్యాయమతమునందు జ్ఞానమునకు నాశ్రయ మాత్మ. వేదాంతమునందు జ్ఞానోపాదానకారణము అంతఃకరణమై యున్నందున అంతఃకరణమే జ్ఞానాశ్రయమై యున్నది. న్యాయమతమునందు ఏ సుఖాదిక మాత్మగుణముగా చెప్పబడెనో అది వేదాంతమునందు అంతఃకరణపరిణామ మని చెప్పుటవలన నంతఃకరణ ధర్మమే కాని యాత్మధర్మము కాదు. అయిన వేదాంతమతమునందు భ్రమజ్ఞాన మంతఃకరణపరిణామము కాదు. అవిద్యాపరిణామమై యున్నది. ఇది విచారసాగరమునందు వివరించియుండుటచే నిచట విరమింపఁబడినది.

౧౮. భ్రమజ్ఞానముయొక్క సంక్షేప నిరూపణము.

సర్పసంస్కారసహితము, పురుషునియొక్క దోషసహితమును, నగునేత్రమునకు రజ్జువుతో సంబంధమైనప్పుడు రజ్జువుయొక్క విశేషధర్మమగురజ్జుత్వమునకు భానము కలుగదు. రజ్జువునందుండు (ముంజి) రూపావయముకూడ భాసించుట లేదు. రజ్జువునందు సామాన్యధర్మ మగునిదంత్వము మాత్రము భాసించుచున్నది. ఆలాగుననే శుక్తియందు శుక్తిత్వము నీలపృష్ఠత్వము త్రికోణత్వమును భాసించుట లేదు. మఱియును సామాన్యధర్మ మగునిదంత్వము మాత్రము భాసించుచున్నది. అందువలన నేత్రద్వారమున అంతఃకరణము రజ్జువును బొంది ఇదమాకారపరిణామమును బొందుచున్నది. ఆ యిదమాకారవృత్త్యుపహితచేతనని ష్ఠావిద్య (౧)సర్పాకార(౨)జ్ఞానాకారము లనెడు రెండుపరిణామముల నొందుచున్నది. దండ

సంస్కారసహిత మగు పురుషునియొక్క దోషసహిత నేత్రము రజ్జువుతో సంబంధ పడినప్పుడు వృత్తి యగును. అప్పుడు (౧) దండము (౨) దానిజ్ఞానమును అ విద్యాపరిణామము లై యున్నవి. మాలాసంస్కారసహిత మగు పురుషునియొక్క సదోష నేత్రమునకు రజ్జువుతో సంబంధ మైనప్పుడు ఇదమాకారవృత్తి యగు చున్నది. ఆవృత్త్యుపహితచేతనమందుండు నవిద్య (౧) మాలారూపమునను (౨) దానిజ్ఞానరూపమునను పరిణామమును బొందును. ఎప్పుడు ఏకరజ్జువుతో నాము గ్గురు పురుషులయొక్క సదోషనేత్రసంబంధ మగుచున్నదో అప్పుడు (౧) సర్పము, (౨) దండము, (౩) మాల యను నీ మూడువృత్తులు ప్రత్యేకముగా గలుగు చున్నవి. ఎవనియొక్క వృత్త్యుపహితమునందు ఏవిషయము జన్యమై యున్నదో అది ఆయనకు ప్రతీత మగుచున్నది. ఇతరులకు లేదు. ఈరీతిగా భ్రమజ్ఞాన మింద్రి యజన్యము కాదు. అవిద్యావృత్తిరూప మై యున్నది. ఏవృత్త్యుపహితచేతనము దుండెడి యవిద్యయొక్క పరిణామము భ్రమ మై యున్నదో ఆయిదమాకారవృత్తి నేత్రములకు రజ్జ్వాదివిషయములతో కలుగుసంబంధముచేత నగుచున్నది. అందు వలన భ్రమజ్ఞానమునందు ఇంద్రియజన్యతాప్రతీతి యగుచున్నది. అనిర్వచనీయ ఖ్యాతినిరూపణము, అన్యథాఖ్యాత్యాది ఖండనమును గౌడబ్రహ్మానందకృత ఖ్యాతి విచారణమునందు విస్తరముగా నున్నది. అది అతికఠినముగా నున్నందున నిచ్చట వ్రాయ లేదు.

## న్యాయవేదాంతముల యన్యోన్యవిలక్షణత.

వేదాంతసిద్ధాంతమునందు అభావజ్ఞానముకూడ ఇంద్రియజన్యము కాదు. అనుపలబ్ధినామకపృథక్ప్రమాణముచేత అభావజ్ఞానము కలుగుచున్నది. అందు వలన అభావప్రత్యక్షమునకు హేతు వైనవిశేషణతాసంబంధాంగీకారము నిష్ఫ లము. మఱియును జాతివ్యక్తులకును, సమవాయసంబంధము లేదు. అయినను తాదాత్మ్యసంబంధ మున్నది. ఆలాగుననే గుణగుణులకు, క్రియాక్రియావంతులకు, ఉపాదానకార్యములకును, కూడ తాదాత్మ్యసంబంధ మున్నది. అందువలన సమవాయస్థానమునందు తాదాత్మ్య సంబంధము వేదాంత మతరీతిచే చెప్పి యున్నారు.

ఎట్లు త్వగాదీంద్రియములు భూతజన్యము లై యున్నవో అట్లు శ్రోత్రేం ద్రియము కూడ ఆకాశజన్య మై ఆకాశరూపము కాదు. మఱియును మీమాంసక మతమునందు శబ్దము ద్రవ్య మై యున్నది. వేదాంతమతమునందు గుణ మై

యున్నది. అయిన న్యాయమతమునందు శబ్దము ఆకాశమాత్రముయొక్క గుణమై యున్నది. వేదాంతమతమునందు శ్రీవిద్యారణ్యస్వాములవారిచేత పంచభూతగుణ మని చెప్పబడి యున్నది. వేదాంతమతమునందు శ్రీవాచస్పతిమిశ్రులవారిచేత మనస్సు ఇంద్రియముగా నంగీకరింపబడినది. ఇతరగ్రంథకారులచేత మనస్సు ఇంద్రియముగా నంగీకరింపబడ లేదు. ఎవరిమతమందు మనస్సు ఇంద్రియము కాదో వారిమతమందు సుఖదుఃఖాదిజ్ఞానము ప్రమాణజన్యము కానందున ప్రమ కాదు. సుఖమును దుఃఖమును, సాక్షిభాస్యము లై యున్నవి. శ్రీవాచస్పతిమిశ్రమతానుసారముగా సుఖదుఃఖాదిజ్ఞానము మనోరూపప్రమాణజన్య మై యున్నది, అందువలన ప్రమ యై యున్నది. బ్రహ్మాపరోక్షజ్ఞానము రెండుమతములయందును ప్రమారూప మైయే యున్నది. శ్రీవాచస్పతిమిశ్ర మతానుసారముగా మనోరూపప్రమాణజన్య మై యున్నది. ఇతరమతమునందు శబ్దరూపప్రమాణజన్య మై యున్నది.

౧౫. శ్రీవాచస్పతిమిశ్రమతానుసారముగా మనస్సుయొక్క యింద్రియత్వమునకు సారగ్రాహిదృష్టిచేత నంగీకారము.

ఎవరిమతమునందు మనస్సు ఇంద్రియము కాదో వారియొక్క మతమునందు ఇంద్రియజన్యత్వము ప్రత్యక్షజ్ఞానలక్షణము కాదు విషయచేతనమునకు వృత్తిచేతనముతో నభేదమే ప్రత్యక్షజ్ఞానలక్షణ మై యున్నది. వృత్తిచేతనమునకును విషయచేతనమునకును అభేద మని విచారసాగరమందు వర్ణితము. శ్రీవాచస్పతిమతము సరి యయినది కాదు. ఆమతమందు దోషములు —

(౧) మనస్సునకు అసాధారణవిషయమే లేనందున మనస్సు ఇంద్రియము కానేరదు.

(౨) గీతావచనవిరోధము. గీత 3 అధ్యాయమునందు ఇంద్రియములకంటె మనస్సు భిన్నముగా జెప్పబడియున్నది. మనస్సు ఇంద్రియముగా నుండు నెడల ఇంద్రియములకంటె మనస్సు పర మని చెప్ప కూడదు గదా. మఱియును మానసజ్ఞానము బ్రహ్మవిషయము కాదని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. శ్రీవాచస్పతిచేత మనస్సు ఇంద్రియ మనియంగీకరించి బ్రహ్మసాక్షాత్కారము కూడ మనోరూపేంద్రియజన్య మగుటవలన మానస మని చెప్పబడి యున్నది. ఇది విరుద్ధము.

అంతఃకరణముయొక్క యవస్థావిశేషణము మనస్సు గదా. ఆయంతః కరణము ప్రత్యక్షజ్ఞానమునకు నాశ్రయ మగునెడల కర్త యగుచున్నది. ఏది కర్తయో అది కరణము కాదు. అందువలన మనస్సు ఇంద్రియము కాదు. ఏదోషము మనస్సునకు ఇంద్రియత్వపక్షమునందు చెప్పబడినదో అది సూక్ష్మవిచారణ మీద దోషము కాదు. ఎట్లనగా, మనస్సునకు అసాధారణవిషయము సుఖదుఃఖేచ్ఛాదికమై యున్నది. అంతఃకరణవిశిష్ట జీవుడును విషయమై యున్నాడు. గీతయందు ఇంద్రియములకంటె మనస్సు పర మని చెప్పియున్నది. అచ్చట నింద్రియశబ్దముచేత బాహ్యేంద్రియగ్రహణము చేయుటవలన బాహ్యేంద్రియములకంటె మానసేంద్రియము పర మని గీతాగూఢాభిప్రాయ మగుటవలన విరోధము లేదు. మానసజ్ఞానమునకు బ్రహ్మ విషయము కా దని చెప్పువారి యభిప్రాయ మేమనగా, శమదమాది సంస్కారసహిత విక్షిప్తమనస్సుచేత జన్య మయిన జ్ఞానమునకు బ్రహ్మ విషయము కాదు. మఱియును మానసజ్ఞానముయొక్క ఫలవ్యాప్యత్వము బ్రహ్మమునందు లేదు. వృత్తియందు చిదాభాసము ఫల మని చెప్పబడును దానికి విషయము బ్రహ్మము కాదు. ఘటాద్యనాత్మపదార్థములను వృత్తి పొందుచున్నది. ఆవృత్తి, చిదాభాసము ఈరెంటికిని వ్యాప్యము అనగా విషయము పదార్థ మగుచున్నది. మఱియును బ్రహ్మాకారవృత్తియందు ఏచిదాభాసుడున్నాడో అతనివ్యాప్యము అనగా విషయము బ్రహ్మము కాదు ఆవృత్తిమాత్రమునకు విషయమై యున్నది. ఇది విచారసాగరమునందు చతుర్థతరంగమునందు స్పష్టము.

ఎటుల మానస విషయత్వము బ్రహ్మమునందు నిషిద్ధమో యటుల శాబ్ద విషయత్వమును నిషిద్ధము. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" ఇది శ్రుతినిషేధవచనము. ఇచ్చట శబ్దజన్యజ్ఞానమునకు బ్రహ్మము విషయము కా దను నర్థము నంగీకరించునెడల మహావాక్యము కూడ శబ్దరూపమై యున్నందున తజ్జన్యజ్ఞానమునకు కూడ బ్రహ్మము విషయము కాక పోవలయును. ఇది వేదాంత సిద్ధాంతభంజకము కాగలదు. అందువలన పై నిషేధవచనమునకు ఈక్రింద నుపవర్ణితార్థ మంగీకారము.

శబ్దశక్తిరూప వృత్తిజన్యజ్ఞానమునకు బ్రహ్మము విషయము కాదనియును శబ్దముయొక్క లక్షణావృత్తి జన్యజ్ఞానమునకు బ్రహ్మము విషయ మనియును అర్థము. లక్షణావృత్తి జన్యజ్ఞానమునందును, చిదాభాసరూపఫలవిషయము

బ్రహ్మము కా దనియును, ఆవరణభంగరూపవృత్తి మాత్రము యొక్క విషయత్వము బ్రహ్మమునం దున్న దనియును చెప్పవలయును. ఎట్లు శబ్దజన్యజ్ఞానము యొక్క విషయత్వమునకు సర్వథా నిషేధము లేదో అట్లు మానసజ్ఞానము యొక్క విషయతకును సర్వథా నిషేధము లేదు. సంస్కారహితమనస్సునకు బ్రహ్మజ్ఞానమును గుఱించి హేతుత్వము లే దనియును, మానసజ్ఞానమునందుండు చిదాభాసాంశము యొక్క విషయత్వము లే దనియును నభిప్రాయము. ఎవరు బ్రహ్మజ్ఞానమును గుఱించి మనస్సునకు కరణత్వము చెప్పుచున్నారో వారిమతమునందు బ్రహ్మజ్ఞానము ద్వివిధప్రమాణజన్య మని చెప్పవలయును. మహావాక్యమునందు, బ్రహ్మజ్ఞానమును గుఱించి కరణత్వము శ్రీభాష్యకారాదులచేత సర్వత్ర ప్రతిపాదితమై యున్నది గనుక దానిని నిషేధించుటకు వీలు లేదు. మనస్సునకు కరణత్వము చెప్పినయెడల ప్రమాకరణము ప్రమాణము గాన బ్రహ్మప్రమను గుఱించి శబ్దము, మనస్సును, ఈ రెండు ప్రమాణములును సిద్ధించుచున్నవి. ఇది దృష్టవిరుద్ధమై యున్నది. ఎట్లనగా, చాక్షుషాదిప్రమకు నేత్రాద్యేకైకప్రమాణ మున్నది కాని ఏప్రమకును హేతువు లయిన రెండుప్రమాణములను చూడ లేదు, వినను లేదు. నైయాయికులు కూడ చాక్షుషాదిప్రమను గుఱించి మనస్సునకు సహకారిత్వము నంగీకరించి నేత్రాదికమునకే ప్రమాణత్వము నంగీకరించినారే కాని మనస్సునకు లేదు. సుఖాదిజ్ఞానమును గుఱించి కేవలము మనస్సునకు ప్రమాణత్వము నంగీకరించియున్నారే కాని యితరమునకు లేదు. అందువలన నొకప్రమను గుఱించి రెండు ప్రమాణములను జెప్పుట దృష్టవిరుద్ధమై యున్నది. ఎక్కడ ఏకపదార్థమునందు రెండు ఇంద్రియములకు యోగ్యత యున్నదో (ఘటమునందు నేత్రత్వక్కులకు రెంటికిని యోగ్యత యున్నది) అక్కడ రెండుప్రమాణములతోను ఏకప్రమ కాదు. నేత్రప్రమాణముచేత ఘటముయొక్క చాక్షుష ప్రమ యగుచున్నది. త్వక్ప్రమాణముచేత త్వాచప్రమ కలుగుచున్నది. రెండు ప్రమాణములచేత నేకప్రమ చూపబడ లేదను శంక కవకాశము లేదు. ప్రత్యభిజ్ఞాప్రత్యక్షస్థలమునందు పూర్వానుభవమును, ఇంద్రియమును, ఈ రెండు ప్రమాణముల చేతను ఏకప్రమ కలుగుచున్నది. అందువలన దృష్టవిరుద్ధము కాదు. ఎక్కడ ప్రత్యభిజ్ఞ యగుచున్నదో అక్కడ పూర్వానుభవము సంస్కారద్వారమున హేతు వై యున్నది. సంయోగాది సంబంధద్వారమున ఇంద్రియము హేతువై యున్నది. అందువలన సంస్కారరూపవ్యాపారసహితకారణము పూర్వాను

భవము, సంబాధరూప వ్యాపారసహితకారణము ఇంద్రియ మై యుండుటవలన ప్రమకు కరణమై రెండు ప్రమాణము లున్నవి.

ఆలాగుననే బ్రహ్మసాక్షాత్కారరూప ప్రమకు
(౧) శబ్దము, (౨) మనస్సు,

ఈ రెండు ప్రమాణము లని చెప్పు నెడల దృష్టవిరోధము లేదు. మఱియును బ్రహ్మసాక్షాత్కారమునకు మనోరూపేంద్రియ జన్యత్వము నంగీకరించు నెడల ప్రత్యక్షత్వము నిర్వివాదముగా సిద్ధించుచున్నది.

బ్రహ్మజ్ఞానమునకు కేవలశబ్దజన్యత్వ మంగీకరించు నెడల వివాదముచేత ప్రత్యక్షము సిద్ధింపవలయును. దశమదృష్టాంతవిషయమునందును ఇంద్రియజన్యత్వమునకు శబ్దజన్యత్వమునకును వివాద మున్నది. ఇంద్రియజన్యజ్ఞానమునకు ప్రత్యక్షత్వము చెప్పుటకు వివాదము లేదు. ప్రత్యభిజ్ఞాప్రత్యక్షమును గుఱించి పూర్వానుభవజన్యసంస్కారము సహకారి యనియును, కేవలేంద్రియము ప్రమాణ మనియును ఎవరు చెప్పెదరో వారికి సమాధానము. బ్రహ్మసాక్షాత్కారరూపప్రమయందును శబ్దము సహకారి యై కేవలమనస్సు ప్రమాణమై యున్నది మఱియును వేదాంతపరిభాషాది గ్రంథములయందు ఇంద్రియజన్య జ్ఞానమునకు బ్రత్యక్షత్వము జెప్పు నెడల వేదోషము చెప్పబడియున్నదో దానికి నుత్తమసమాధానము న్యాయకౌస్తుభాది గ్రంథములయం దున్నవి. ఈవిషయవిస్తరమాగ్రంథమునందు దొరకును. మఱియు మనస్సునకు నింద్రియత్వపక్షమునందు జ్ఞానమున కాశ్రయమై యంతఃకరణము కర్త యై యుండుటవలన జ్ఞానమునకు కరణము కా దని యేదోషము వక్కాణింపబడినదో ఆదోషము కూడ లేదు. ఎట్లనగా ధర్మి యగునంతఃకరణము జ్ఞానమున కాశ్రయమై కర్త యగుచున్నది. అంతఃకరణపరిణామ రూపమనస్సు జ్ఞానమునకు కరణ మై యున్నది. ఈరీతిగా మనస్సే జ్ఞానమునకు కరణమై యుండుటవలన ప్రమాణమై యున్నది.

౨౧. న్యాయవేదాంతములయొక్క ప్రత్యక్షవిచారభేదము.

ఎక్కడ నింద్రియముచేత ద్రవ్యము ప్రత్యక్ష మగుచున్నదో అక్కడ న్యాయవేదాంతములయందు వైలక్షణ్యము లేదు. మఱియు ద్రవ్యమునకు ఇంద్రియముతో సంయోగమే సంబంధమై యున్నది. ఇంద్రియముచేత ద్రవ్యమునకును, జాతికిని, గుణమునకును, ప్రత్యక్ష మయినప్పుడు న్యాయమతమునందు సంయుక్తసమవాయసంబంధ మున్నది. వేదాంతమతమునందు సంయుక్తతాదా

త్మ్యసంబంధ మున్నది. ఎట్లనగా న్యాయమతమునందు దేనియొక్క సమవాయ మున్నదో వేదాంతమతమునందు దానియొక్క తాదాత్మ్య మున్నది. మఱియును గుణములో నుండు జాతియొక్క ప్రత్యక్షమునందు న్యాయమతరీతిచే సంయుక్త సమవేతసమవాయ సంబంధ మున్నది. వేదాంతమునందు సంయుక్తతాదాత్మ్యవత్తాదాత్మ్యం సంబంధ మున్నది. దీనికే సంయుక్తాభిన్నతాదాత్మ్యమని పేరు. ఇంద్రియ ముతో సంయుక్తమయిన యేఘటాదిక మున్నదో దానియొక్క తాదాత్మ్యము నందు అనగా తాదాత్మ్యసంబంధసహితమైన రూపాదిక మున్నదో దానియందు తాదాత్మ్య సంబంధము రూపత్వాదిజాతికి ఉన్నది. ఎట్లు ఘటాదికమునందు రూపాదికము తాదాత్మ్యసహితమో అట్లు ఘటాదికముతో నభిన్న మనియును చెప్పబడును. ఆయభేదమునకే తాదాత్మ్యముసంబంధ మగుచున్నది. ఎక్కడ శ్రోత్రముచేత శబ్దసాక్షాత్కార మగుచున్నదో అక్కడ న్యాయమతమునందు సమవాయసంబంధ మున్నది. వేదాంతమతమునందు శ్రోత్రేంద్రియము ఆకాశ కార్యమై యున్నది. అందువలన జాతికంటె భిన్నమయినది ఉపాధి యని న్యాయ మతముయొక్క న్యాయము కాదు. శబ్దత్వజాతికి శ్రోత్రముచేత నేసంబంధ మున్నదో ఆసంబంధము తారత్వ మంద్రత్వమున కున్నది. విశేషణతాసంబంధము లేదు. అభావముయొక్క జ్ఞానము అనుపలబ్ధిప్రమాణముచేత కలుగుచున్నది. ఏ యింద్రియముచేతను అభావముయొక్క జ్ఞానము కలుగదు. అందువలన నభావ మునకు నింద్రియముతో సంబంధాపేక్ష లేదు. ఇది న్యాయవేదాంతమతముల ప్రత్యక్షవిచారమునందలి భేదము.

౨౧ ప్రత్యక్షప్రమోపసంహారము.

ఈరీతిగా ప్రత్యక్షప్రమకు షడ్విధభేదము లున్నవి. దానికరణమును షడ్విధమై యున్నది. అందువలన నేత్రాదిషడింద్రియములును ప్రత్యక్షప్రమాణము లని ప్రసిద్ధమై యున్నది. న్యాయమతమునందును శ్రీవాచస్పతిమతానుసారముగాను ఆఱవప్రత్యక్షప్రమాణము మానసమై యున్నది. పంచపాదికాకర్త యగు శ్రీపద్మ పదాచార్యమతానుసారులు మనస్సును ప్రమాణముగా నంగీకరింప లేదు. సుఖదుఃఖ ములు సాక్షిభాస్యములై యున్నవి. అందువలన సుఖదుఃఖజ్ఞానము ప్రమ కాదు. మఱియును విశిష్టజీవునందుండెడి యంతఃకరణభాగము సాక్షిభాస్యమై యున్నది. తనభాగము స్వయంప్రకాశమై యున్నది. అందువలన జీవునియొక్క జ్ఞానము కూడ మనోజన్యము కాదు. బ్రహ్మవిద్యారూపాపరోక్షజ్ఞానము ప్రమరూపమయి

యుండినను దానికి కరణము శబ్దమై యున్నది. అందువలన మనస్సు ప్రమాణము కాదు. అయిన పంచపాదికానుసారముగా ఏసిద్ధాంత మున్నదో దానియందు కూడ ప్రత్యక్షప్రమ షడ్విధమై యున్నది. శబ్దజన్యబ్రహ్మవిషయకప్రత్యక్షప్రమ యాఱవదియై యున్నది. అభావముయొక్క జ్ఞానము అనుపలబ్ధిప్రమాణజన్య మై యుండినను ప్రత్యక్ష మై యున్నది. ఈవిషయము అనుపలబ్ధిప్రమాణనిరూపణావసరమున చెప్పబడును. అందువలన ప్రత్యక్షప్రమకు సప్తవిధత్వము సంభవించినను సీగ్రంథరీతిచేత అభావజ్ఞానమునందు ప్రత్యక్షత్వము లేదు గాన ప్రత్యక్షప్రమకు షడ్విధభేదములే గాని సప్తవిధభేదములు లేవు. ఇది ప్రత్యక్షప్రమాణ సంక్షేపము.

ఇది శ్రీ సాధునిశ్చలదాసుచే రచితమయిన వృత్తిప్రభాకరమందు
ప్రత్యక్షప్రమాణనిరూపణ మను ప్రథమప్రకాశము సంపూర్ణము.
శ్రీ. శ్రీ. శ్రీ.

## అనుమానప్రమాణనిరూపణ మను ద్వితీయ ప్రకాశ ప్రారంభము.

౨౨. అనుమితిసామగ్రియొక్క లక్షణము, స్వరూపము.

అనుమితిప్రమకు ఏది కరణమై యున్నదో యది అనుమితిప్రమాణము. లింగజ్ఞానజన్య మయినయేజ్ఞాన మున్నదో అది అనుమితి యని చెప్పబడును. ఎప్పుడు పర్వతమునందు ధూమప్రత్యక్షజ్ఞానమై వహ్నిజ్ఞాన మగుచున్నదో అప్పుడు ధూమప్రత్యక్ష జ్ఞానము లింగజ్ఞాన మని చెప్పబడును. దానివలన వహ్నిజ్ఞానము జన్యమై యుండుటవలన పర్వతమునందు వహ్నిజ్ఞానము అనుమితి యై యున్నది. దేనియొక్క జ్ఞానముచేత సాధ్యజ్ఞాన మగుచున్నదో అది లింగ మని చెప్పబడును. అనుమితిజ్ఞానమునకు విషయ మైనది సాధ్య మనబడును. ప్రకృతమునందనుమితికి విషయము వహ్నియై యుండుటవలన వహ్ని సాధ్యమై యున్నది. ధూమజ్ఞానముచేత వహ్నిరూపసాధ్యజ్ఞానము కలుగుచున్నది. అందువలన ధూమము లింగమై యున్నది. వ్యాప్యముయొక్క జ్ఞానముచేత వ్యాపకముయొక్క జ్ఞాన మగుచున్నది. అందువలన వ్యాప్యమునకు లింగ మని పేరు. వ్యాపకమునకు సాధ్య మనిపేరు. వ్యాప్తిసహిత మైనది వ్యాప్యమనబడును. వ్యాప్తినిరూపకము వ్యాపక మనబడును. అవినాభావరూప సంబంధము వ్యాప్తి యనబడును. ధూమమునందు వహ్నియొక్క అవినాభావరూప మగు సంబంధము ఏది యున్నదో అది ధూమమునందు వహ్నియొక్క వ్యాప్తి యై యున్నది. అందువలన ధూమము వహ్నికి వ్యాప్యమై యున్నది. ఆవ్యాప్తిరూపసంబంధమునకు వహ్ని నిరూపక మై యున్నది. అందువలన ధూమమునకు వ్యాపకము వహ్నియై యున్నది. ఏది లేక యేది ఉండదో దానికి దానితో అవినాభావరూపసంబంధము చెప్పబడును. వహ్నివినాగా ధూమ ముండదు, అందువలన వహ్నియొక్క అవినాభావరూపసంబంధము ధూమమునం దున్నది. వహ్నియందు ధూమముయొక్క అవినాభావము లేదు. ఎట్లనగా తప్తలోహపిండమునందు ధూమము వినాగా వహ్ని యున్నది. అందువలన వహ్ని ధూమవ్యాప్యము కాదు. వహ్నికి ధూమము వ్యాప్య మై యున్నది. అటులనే రూపమునకు రసము వ్యాప్యమై యున్నది. పృథివీ, జల, తేజస్సులయందు రూప మున్నది. పృథివీజలములయందు రస మున్నది. అందువలన రూపముయొక్క అవినాభావరూపసంబంధము రసమునం దుండుటవలన రూపమునకు రసము వ్యాప్యమై యున్నది. మఱియును రూపము

నందు రసముయొక్క వ్యాప్తి లేదు. తేజస్సునందు రసము లేదు, రూప మున్నది. అందువలన రసమునకు రూపము వ్యాప్యము కాదు. ఏది దేనితో వ్యభిచారి యగుచున్నదో అది దానికి వ్యాప్యము కాదు. అధికదేశమం దేది యున్నదో అది వ్యభిచారి యనబడును. ధూమముకంటె నధికదేశమునం దుండు నేవహ్ని యున్నదో అది ధూమమునకు వ్యభిచారి యనబడును. రసముకంటె నధికదేశమునందు రూప మున్నది. అందువలన రసమునకు రూపము వ్యభిచారి. ఏది న్యూనదేశమునం దున్నదో దానియం దవినాభావసంబంధ మున్నది. అది వ్యాప్యమై యున్నది. వహ్నికంటె న్యూనదేశము నందు ధూమ మున్నది. అందువలన ధూమమునందు వహ్నియొక్క అవినాభావరూప వ్యాప్తి యున్నది. ఆ ధూమము వ్యాప్యమై యున్నది. రూపముకంటె న్యూనదేశమునందు రసముండుటవలన రసమునందు రూపముయొక్క వ్యాప్తియున్నది. తాదృశమయిన రసము వ్యాప్యమై యున్నది. ఎట్లు న్యూనదేశమునం దుండుపదార్థమునందు నధికదేశమునం దుండుపదార్థముయొక్క వ్యాప్తి యున్నదో అట్లు రెండుపదార్థములు సమానదేశమునందుండు నెడల పరస్పరవ్యాప్యము లగుచున్నవి. గంధగుణము పృథివీత్వ జాతియు కూడ కేవలపృథివియం దున్నవి. అక్కడ గంధముయొక్క వ్యాప్తి పృథివీత్వమునందును, పృథివీత్వముయొక్క వ్యాప్తి గంధమునందును ఉన్నవి. స్నేహగుణము, జలత్వజాతియును జలమునం దున్నవి. జలము వినా స్నేహము జలత్వమును ఉండుట లేదు. అందువలన సమానదేశవృత్తులయినందున రెండును పరస్పరవ్యాప్తిసహితములై వ్యాప్యములై యున్నవి. ఎట్లు న్యూనదేశవృత్తియందు అవినాభావరూప సంబంధ మున్నదో అట్లు సమానదేశవృత్తిపదార్థములకు పరస్పరావినాభావ మున్నది. యద్యపి పృథివీత్వముకంటె గంధము న్యూనదేశవృత్తియై యున్నది, జలత్వముకంటె స్నేహము న్యూనదేశవృత్తియై యున్నది. ప్రథమక్షణమునందు నిర్గుణద్రవ్య ముత్పన్న మగుచున్నది, ద్వితీయక్షణమునందు గుణ ముత్పన్న మగుచున్నది, జాతి ప్రథమక్షణమునందే ద్రవ్యమునం దున్నది; అందువలన ఘటముయొక్క ప్రథమక్షణమునందు గంధమునకు వ్యభిచారి యగు పృథివీత్వ ముండుటవలన దానికి గంధముయొక్క అవినాభావ సంబంధరూపవ్యాప్తి లేదు. మఱియును ఉత్పత్తిక్షణవృత్తిజలమునందు స్నేహముయొక్క వ్యభిచారి యగు జలత్వ ముండుటవలన దానియందు స్నేహముయొక్క అవినాభావరూపసంబంధము లేదు. అందువలన స్నేహముయొక్క

వ్యాప్తి జలత్వమునందు లేదు. స్నేహమునకు వ్యాప్యము జలత్వము కాదు. ఈరీతిగా పృథివీత్వమునకు వ్యాప్యము గంధ మై యున్నది. గంధమునకు వ్యాప్యము పృథివీత్వము కాదు. జలత్వమునకు వ్యాప్యము స్నేహమై యున్నది. స్నేహమునకు జలత్వము వ్యాప్యము కాదు, తథాపి గంధవత్త్వ పృథివీత్వములు పరస్పరవ్యాప్తి సహితము లై యుండుటవలన పరస్పరవ్యాప్యము లై యున్నవి. స్నేహవత్త్వజలత్వములు రెండును పరస్పరవ్యాప్యము లై యున్నవి. గంధాధికరణమునకు గంధవత్త్వ మని పేరు. స్నేహాధికరణమునకు స్నేహవత్త్వ మని పేరు. ఏపదార్థమునందు నే పదార్థము కదాచిత్తుగా నున్నదో యా పదార్థమునందు ఆ పదార్థముయొక్క యధికరణత సర్వదా యున్నది. ఇట్లు వ్యాప్తినిరూపణము నందు జగదీశ భట్టాచార్యులు వ్రాసియున్నారు. దీని యభిప్రాయ మేమనగా అవ్యాప్యవృత్తి పదార్థముయొక్క అధికరణత వ్యాప్యవృత్తి యై యున్నది కాని అవ్యాప్యవృత్తి కాదు. అవ్యాప్య వృత్తి రెండుప్రకారములు కలదిగా నున్నది.

(౧) దేశకృతావ్యాప్యవృత్తి. (౨) కాలకృతావ్యాప్యవృత్తి.

ఏది పదార్థైకదేశమునం దుండి మఱియొక దేశమునందు లేదో దానిని దేశకృతావ్యాప్యవృత్తి యని యందురు. పదార్థముయొక్క ఏకదేశమునందు సంయోగ మున్నది, అది దేశకృతావ్యాప్యవృత్తి యనబడును. సంయోగముయొక్క యధికరణత పదార్థమునం దున్నది, ఏకదేశమునందు లేదు. అందువలన నవ్యాప్యవృత్తిసంయోగముయొక్క అధికరణత వ్యాప్యవృత్తి యై యున్నది, అవ్యాప్యవృత్తి కాదు. ఇది సిద్ధాంతము. మఱియు నొక కాలమునం దుండి మఱియొక కాలమునందు లేనియెడల దానిని కాలికావ్యాప్యవృత్తి యని యందురు. పూర్వము చెప్పినప్రకారముగా మధురాదిగుణము కాలికావ్యాప్యవృత్తి యై యున్నది. దానియొక్క అధికరణత ద్రవ్యముయొక్క ఉత్పత్తిక్షణ మందున్నది. అందువలన గంధవత్త్వరసవత్త్వములు పృథివీత్వజలత్వములయొక్క సమదేశకాలములం దున్నవి. ఇది న్యాయమతరీతిగా సమాధానము. మఱియును ఏకాంతమతమునందు నిర్గుణద్రవ్య ముత్పన్నము కాదు. ప్రథమక్షణమునందే సగుణమై పుట్టుచున్నది. అందువలన గంధరసములకును పృథివీత్వ జలత్వములు వ్యాప్యము లై యున్నవి.

౨౩. అనుమితిజ్ఞానమునందు వ్యాప్తిజ్ఞానముయొక్క అపేక్షానిరూపణము.

ఉపవర్ణితరీతిగా అవినాభావరూపసంబంధము వ్యాప్తియై యున్నది. తత్సహిత మైనది వ్యాప్యము. వ్యాప్య మయినధూమమునకు పర్వతాదులయందు ఎవరికి ప్రత్యక్షజ్ఞాన మైనను శాబ్దజ్ఞాన మైనను కలుగుచున్నదో వారికి పర్వతాదులయందు అగ్నియొక్క అనుమిత్యాత్మకజ్ఞానము కలుగుచున్నది. రసముయొక్క జ్ఞానముచేత రూపజ్ఞానము కలుగుచున్నది. అయిన ఏపురుషునకు ధూమము వహ్నివ్యాప్యమని జ్ఞానము పూర్వమందు కలిగియున్నదో ఆయనకు ధూమజ్ఞానముచేత వ్యాప్యతాస్మరణము కలిగి వహ్నివిషయకానుమితి కలుగుచున్నది. వ్యాప్తికి వ్యాప్యత్వ మని పేరు. అలాగుననే రసము రూపవ్యాప్యము అనిఎవరికి పూర్వము జ్ఞాన మున్నదో వారికి రసజ్ఞానముచేత రసమునందు రూపముయొక్క వ్యాప్తిస్మరణము కలిగి రూపముయొక్క అనుమితి కలుగుచున్నది. ఎవరికి వ్యాప్తిజ్ఞానము పూర్వము లేదో వారికి ధూమాదిజ్ఞానమువలన వహ్న్యాది విషయకానుమితి కలుగదు. అందువలన వ్యాప్తియొక్క జ్ఞానము అనుమితికరణమై యున్నది. వ్యాప్తిసహిత మైనది వ్యాప్య మనబడును. వ్యాప్తికి వ్యాప్యత యని పేరు. ఆ వ్యాప్తియొక్క జ్ఞానము కూడ సందేహరూప మయినయెడల కారణము కాదు. ఎట్లనగా—

ధూమము వహ్నికి వ్యాప్యమా కాదా ?

అని ఎవరికి పూర్వమునందు సంశయాత్మకజ్ఞాన మున్నదో వారికి ధూమజ్ఞానముచేత వహ్నిజ్ఞానము కలుగనేరదు. మఱియు నేమనగా, ధూమము వహ్నివ్యాప్యము అని ఎవరికి నిశ్చయరూపజ్ఞాన మున్నదో వారికి ధూమజ్ఞానముచేత వహ్న్యనుమితిరూపజ్ఞానము కలుగుచున్నది అందువలన వ్యాప్తినిశ్చయము అనుమితికారణ మై యున్నది. ఆవ్యాప్తినిశ్చయము సహచారజ్ఞానముచేత కలుగుచున్నది. మహానసాదులయందు పునఃపునః ధూమ వహ్నులయొక్క సహచారమును చూచుటచేత ధూమము వహ్నివ్యాప్య మని విజ్ఞాన మగుచున్నది. మఱియును వహ్ని ధూమవ్యాప్య మని జ్ఞానము కాదు. మహానసాదులయందు ఎట్లు వహ్నియొక్క సహచారము ధూమమునందు చూడబడియున్నదో అట్లు ధూమముయొక్క సహచారము వహ్నియందును జూడబడియున్నది. తథాపి ధూమముయొక్క వ్యభిచారము కూడ వహ్నియందు చూడబడియున్నది. అందువలన నిటుల చెప్పవలయును. ఏపదార్థమునందు వ్యభిచారము ప్రతీతము కా లేదో మఱియు సహచారము ప్రతీతమై యున్నదో ఆపదార్థము

యొక్క వ్యాప్తినిశ్చయము ఆపదార్థమునందు కలుగుచున్నది. వహ్నియొక్క వ్యభిచారము ధూమమునందు ప్రతీతము కాలేదు. సహచారమే ప్రతీత మై యున్నది. అందువలన వహ్నియొక్క వ్యాప్తి ధూమమునందు నిశ్చిత మై యున్నది. వహ్నియందు ధూమముయొక్క సహచారము ప్రతీత మైనను వ్యభిచారము కూడ ప్రతీతమై యున్నది. అందువలన వహ్ని ధూమవ్యాప్య మని నిశ్చయము కలుగనేరదు. సహచార మనగా కూడ నుండుట, వ్యభిచార మనగా వదలి యుండుట, యద్యపి జలమునం దుండెడి ధూమమునందు వహ్నియొక్క వ్యభిచార మున్నది, మఱియు నగ్ని శాంత మై యుండెడి మహానసమునందు ఏధూమ మున్నదో దానియందు వహ్నియొక్క వ్యభిచార మున్నది, తథాపి దేనియొక్కమూలమునకు విచ్ఛేదము కాలేదో ఆయవిచ్ఛిన్నమూల మయిన ధూమరేఖయందు వహ్నివ్యాప్తియొక్క ప్రత్యక్షరూపనిశ్చయ మగుచున్నది. విలక్షణధూమరేఖ పర్వతాదికమునందు ప్రత్యక్షమయినపిమ్మట ధూమము వహ్నివ్యాప్య మని కలుగు ననుభవము జన్యసంస్కారమున కుద్బోధక మగుచున్నది. తదనంతరమున "పర్వతో వహ్నిమాన్" అని అనుమితి కలుగుచున్నది.

౨౮. సకలనైయాయికమతమునందును అనుమితిక్రమము.

యద్యపి న్యాయమతమునందు అనుమానప్రసంగమునందు ననేకపక్షములున్నవి. అవి ఆయాగ్రంథములయందు స్పష్టము లై యున్నవి. అయిన సకలనైయాయిక మతములందును అనుమితియొక్క క్రమ మేలాగున ననగా:—.

ప్రథమతః మహానసాదులయందు హేతుసాధ్యములయొక్క సహచారదర్శనమై తదనంతరమున పర్వతాదులయందు హేతుప్రత్యక్ష మై తదనంతరము సంస్కారమునకు నుద్బోధక మైనతర్వాత వ్యాప్తిస్మృతి కలుగుచున్నది. తదనంతరమునందు సాధ్యవ్యాప్తివిశిష్టహేతువునకు పక్షమునందు ప్రత్యక్షము కలుగుచున్నది. దానికి పరామర్శ మని పేరు. "వహ్నివ్యాప్యధూమవాన్ పర్వతః" అను ప్రసిద్ధానుమానమునందు పరామర్శముయొక్క ఆకార మై యున్నది. "సాధ్యవ్యాప్యహేతుమాన్ పక్షః" అని పరామర్శముయొక్క సామాన్యరూప మై యున్నది. తదనంతరము "వహ్నిమాన్ పర్వతః" అని అనుమితిజ్ఞానము కలుగుచున్నది. ఈక్రమముచేత ననుమితిజ్ఞాన మగుచున్నదీ. అయిన ప్రాచీనమతమునందు అనుమితికరణము పరామర్శ మై యున్నది. మఱియును సకలజ్ఞానము అన్యథాసిద్ధమై యున్నది. వారియొక్క మతమునందు పరామర్శమే అనుమానమై యు

న్నది. యద్యపి పరామర్శమునకు వ్యాపారము దొరకలేదు. తథాపి ఆమతము నందు వ్యాపారహీనకారణమే కరణ మనబడును. అందువలన పరామర్శమే అనుమితికరణమై అనుమానమై యున్నది. నైయాయికులు జ్ఞానహేతువును కనుమాన మని చెప్పెదరు. కొందఱుపక్షమునందు హేతుజ్ఞానమునకు అనుమాన మని పేరు. వ్యాప్తిస్మృతి పరామర్శ మనబడును. వ్యాప్తియొక్క స్మృతిజ్ఞానమునకు అనుమాన మని కొందఱు చెప్పెదరు. పరామర్శమునకు వ్యాపార మని చెప్పెదరు. ఈలాగున న్యాయమతమునందు ననేకమతము లున్నవి. అయిన సర్వమతములయందును పరామర్శాంగీకార మున్నది. కొందఱు పరామర్శమును కరణ మని చెప్పెదరు, కొందఱు వ్యాపార మని చెప్పెదరు. పరామర్శ లేక యనుమితి కలుగనేరదు. ఇది సకలనైయాయికమతము

౨౫. అనుమితియందు మీమాంసామతము.

మీమాంసకమత మేమనగా:—ఎప్పుడు ధూమముయొక్క ప్రత్యక్షముచేత వ్యాప్తిస్మరణము కలిగి వహ్న్యనుమితి యగుచున్నదో అప్పుడు పరామర్శము లేకయే అనుమితి యనుభవసిద్ధమై యున్నది. అందువలన నెక్కడ పరామర్శానంతరమునందు అనుమితి యగుచున్నదో అక్కడ కూడ పరామర్శము అనుమితి కారణము కాదు. మఱియు నేమనగా పరామర్శము అన్యథాసిద్ధ మని చెప్పబడును. ఎట్లు రాసభము కులాలపత్నియు ఘటమునందు అన్యథాసిద్ధమో (కరణసామగ్రికంటె ఏది భిన్నమో అది అన్యథాసిద్ధ మనబడును) ఆలాగుననే మీమాంసకమతమునందు పరామర్శము కారణము కాదు మీమాంసకమతానుసారులుకూడ పరామర్శమును విడిచి నైయాయికునివలెనే అనేకపదార్థములను అనుమాన మని చెప్పెదరు. కొందఱు వ్యాప్తిస్మృతిని, కొందఱు మహానసాదులయందు వ్యాప్త్యనుభవమును, కొందఱు పక్షమునందు హేతుజ్ఞానమును అనుమాన మని చెప్పెదరు.

౨౬. అద్వైత మతానుసారముగా ననుమితిక్రమము.

అద్వైతగ్రంథములం దెక్కడ విరోధము లేదో అక్కడ మీమాంసాప్రక్రియానుసరణమున్నది. అందువలన నద్వైతమతమందును పరామర్శము కారణము కాదు. మఱియు నేమనగా, మహానసాదులందు గలిగిన యేయేవ్యాప్తి ప్రత్యక్షరూపానుభవ మున్నదో యది అనుమితికరణమై యున్నది. ఆవ్యాప్త్యనుభవముయొక్క ఉద్బుద్ధ సంస్కారము, వ్యాపారమై యున్నది. మఱియును పర్వత

మునందు కలిగినధూమముయొక్క యేప్రత్యక్ష మున్నదో యది సంస్కారమున కుద్బోధక మై యున్నది. మఱియు నెక్కడ వ్యాప్తిస్మృతి కలిగి యున్నదో అక్కడను కూడ స్మృతియొక్క యుత్పత్తి గలుగుచుండుటవలన సంస్కారమునకు నాశము కాదు. అందువలన స్మృతి, సంస్కారము ఈరెండును వ్యాప్తిస్మరణ మగుచోట నెల్ల నున్నవి. అనుమితికి వ్యాపారరూపకారణము సంస్కారమై యున్నది. వ్యాప్యస్మృతి కారణము కాదు. ఎట్లనగా, అనుమితినిగుఱించి వ్యాప్తిస్మృతి వ్యాపారరూపకారణ మని అంగీకరించినప్పటికిని స్మృతికారణము సంస్కార మని యంగీకరింపవలయును. స్మృతియందు అనుమితికరణత నంగీకరింపవలయును, అందువలన రెంటియందును కారణతాకల్పనారూప గౌరవదోషము సంభవించును. స్మృతికారణ మగు నేసంస్కార మున్నదో దానికి అనుమితికారణత నంగీకరించినయెడల స్మృతికారణత్వానంగీకారరూపలాఘవ మున్నది. ఈరీతిగా వ్యాప్త్యనుభవము కరణమై యున్నది. సంస్కారము వ్యాపారమై యున్నది. అనుమితి ఫలమై యున్నది. ఇది వేదాంతపరిభాషాద్యద్వైతగ్రంథములయొక్క క్రమము. నైయాయికమతమునందుం బోలె పరామర్శము అనుమితికారణము కాదు.

### ౨౭. వ్యాప్తిస్మృతికి వ్యాపారత్వము సంస్కారమున కవ్యాపారత్వము.

సంస్కారమునకు అనుమితిని గుఱించి వ్యాపారత్వము నంగీకరింపక స్మృతికి వ్యాపారత్వము నంగీకరించినయెడల అదియును సిద్ధాంతమునకు హాని కాదు. యద్యపి వేదాంతపరిభాషాదిగ్రంథములనుబట్టి విరోధము కనిపించుచున్నది, తథాపి యుక్తిచేత నర్థనిర్ణయము చేయునెడల నాధునికగ్రంథములను బట్టి విరోధము లేదు. (స్మృతివ్యాపార మని యంగీకరించునెడల శ్రుతిస్మృత్యాదివిరోధ మగుటచే శాధిత మగును.) అనుమితినిగుఱించి వ్యాపారరూపకారణము స్మృతియై యున్నది, అథవా సంస్కారమైయున్నది,యనుపక్షమునందు శ్రుతిస్మృతులకు విరోధము లేదు. సిద్ధాంతమునకును విరోధము లేదు. వ్యాప్తిస్మృతికి వ్యాపారత్వము చెప్పుపక్షమున విరోధము లేదు. మఱియును సాధకయుక్తిసహిత మున్నది. ఎట్లనఁగా, వ్యాప్తిసంస్కారము అనుమితికి కారణ మనినయెడల అనుద్బుద్ధసంస్కారముచేత ననుమితి యగుచున్నపక్షమున పర్వతమునందు ధూమప్రత్యక్షము లేకయే యెప్పుడును అనుమితి కావలయును. అందువలన నుద్బుద్ధ

సంస్కారము ననుమితి హేతువుగా నంగీకరింపక తప్పదు. మఱియు నుద్బుద్ధ సంస్కారముచేతనే స్మృతి యగుచున్నది. ఎక్కడ ననుమితి సామగ్రి యున్నదో యక్కడ నియమముగా స్మృతిసామగ్రియు నుండును. ఈరెంటిసామగ్రి యుండిన యెడల దేనియొక్క (యే) జ్ఞానము కలుగును? ఈసందేహమును ధర్మరాజు తీర్ప వలెను. పరస్పరప్రతిబధ్యతాప్రతిబంధకత నంగీకరించినయెడల గౌరవరూపదోష మగును. వినిగమనావిరహము, అనుభవవిరోధము నగును. పర్వతమునందు ధూమదర్శనముచేత ధూమమునందు వహ్నివ్యాప్తి స్మరణము కలిగి యుత్తర కాలమునందు అనుమితి యగు నని బుద్ధిమంతులయొక్క యనుభవమై యున్నది. అనుమితిచేత వ్యాప్తిస్మృతి ప్రతిబంధింపఁబడు ననునది యనుభవ విరుద్ధమై యున్నది. రెండుజ్ఞానములయొక్క రెండుసామగ్రు లెక్కడ నున్నవో యక్కడ నొకసామగ్రి కారెండవసామగ్రి ప్రతిబంధకమై యున్నది. అనుమితి స్మృతికి సంస్కారరూపసామగ్రి యేకమై యున్నది. దానికి ప్రతిబధ్యప్రతిబంధకభావము సంభ వింపదు. మఱియు ననుమితి స్మృతికి ప్రతిబంధక మని చెప్పునెడల అనుమితి పుట్ట వలసియున్నది. ఇంక నుత్పన్నము కాలేదు. అందువలన దానికి ప్రతిబంధకత సంభ వింపదు. మఱియును వేదాంతపరిభాషయందు దానిటీకయందును అనుమితి స్మృ తికి ప్రతిబంధక మని వ్రాయలేదు. టీకాసహిత వేదాంతపరిభాషయందు ఈలాగున వ్రాసియున్నది. "ధూమదర్శనముచేత సంస్కార ముద్బుద్ధ మగుచున్నది. దాని వలన నొకప్పుడు స్మృతి యగును. ఒకప్పుడు కాదు. సంస్కారమువలన స్మృతి యయినను సంస్కారమునకు నాశము లేదు. సంస్కారము స్మృతియును రెండు నున్నవి. స్మృతిశూన్యమైన స్థలమునందు ఎట్లు సంస్కారము వ్యాపారమై యున్నదో అట్లు స్మృతిసద్భావస్థలమునందును సంస్కారమే వ్యాపారమై యున్నది, స్మృతి కాదు. ఇది ధర్మరాజగ్రంథమునందు వ్రాయబడియున్నది. ఆవిషయము నందు బుద్ధిమంతులకు నాశ్చర్యము కలుగుచున్నది. ఉద్బుద్ధసంస్కార మయినప్పుడు స్మృతిశూన్య మెట్లగును? స్మృతియొక్క ఉత్పత్తిచేత సంస్కారముయొక్క నాశ మగుచున్నది. స్మృతిచేత నన్యసంస్కారము కలుగుచున్నది. ఇది నయు క్తికపక్షమై యున్నది. దానియొక్క యుపపాదనము గ్రంథాంతరమునందు ప్రసిద్ధమై యున్నది. ఈపక్షమునందు స్మృతిసంస్కారములకు రెంటికిని కారణత్వ యుక్తి సర్వాత్మనా విరుద్ధమై యున్నది. అందువలన వ్యాప్త్యనుభవము కరణ మై యున్నది. వ్యాప్తిస్మృతి వ్యాపారమై యున్నది యనుపక్షము నిర్దోషము.

౨౮. స్వార్థానుమితి మఱియు ననుమాన స్వరూపము.

ఏయనుమితి తనకు పర్వతమునందు ధూమప్రత్యక్షానంతరమునందు కలుగుచున్నదో అది స్వార్థానుమితి యనబడును, అయిన న్యాయమతమునందు ధూమప్రత్యక్షము, వ్యాప్తిస్మరణము కూడ అయినప్పటికిని వహ్న్యనుమితి కలుగదు. రెండుజ్ఞానముల యనంతరమున పరామర్శనామక మగు మూడవజ్ఞానము కలుగుచున్నది. దానివలన అనుమితి కలుగుచున్నది. వహ్నివ్యాప్య మగు నేధూమమున్నదో తద్విశిష్ట మయినది పర్వతము అను జ్ఞానము పరామర్శ మనబడును. దానికి వేదాంతమతమునం దనుమితికారణత్వ మంగీకరింప లేదు. ఈరీతిగా వాక్యప్రయోగము లేక యేవ్యాప్తిజ్ఞానముచేత నే యనుమితి కలుగుచున్నదో యది స్వార్థానుమితి యనబడును. దానికి కరణ మైన యేవ్యాప్తిజ్ఞాన మున్నదో యది స్వార్థానుమాన మనబడును.

౨౯. పరార్థానుమానానుమితి, తర్కములయొక్క స్వరూపము.

ఎక్కడ నొకపురుషుఁడు అనుమానప్రమాణముచేత వహ్ని పర్వతమునందు నిర్ణీతమై యున్న దనియును మఱియు నెక్కడ లే దనియును ఉభయులకు వివాద మున్నదో అక్కడ వహ్నినిశ్చయసహితపురుషుఁడు తనయొక్క ప్రతివాదికి సంశయనివృత్తికొఱకు వాక్యప్రయోగమును చేయుచున్నాఁడో దానికి పరార్థానుమాన మని పేరు. ఆవాక్యము వేదాంతమతమునందు అవయవత్రయాత్మకమై యున్నది.

(౧) ప్రతిజ్ఞ. (౨) హేతువు. (3) ఉదాహరణము.

ఈ వాక్యములకు నవయవము లని పేరు.

"(౧) పర్వతో వహ్నిమాన్.

(౨) ధూమాత్.

(3) యో యో ధూమవాన్ స సోఽగ్నిమాన్ యథా మహానసః"

ఇది మహావాక్యమై యున్నది. దీనియందు మూడవాంతరవాక్యములున్నవి. దీనికే ప్రతిజ్ఞాదికము క్రమముగా నామమై యున్నది. సాధ్యవిశిష్టపక్షబోధకవాక్యము ప్రతిజ్ఞావాక్య మనబడును. 'పర్వతో వహ్నిమాన్' అనెడివాక్యము వహ్నివిశిష్టము పర్వతము అనెడిబోధను పుట్టించుచున్నది. అక్కడ వహ్నిసాధ్యమై యున్నది. పర్వతము పక్షమై యున్నది. ఎట్లనగా, అనుమితికి

నేది॰ విషయమో అది సాధ్య మనబడును. అనుమితికి విషయము వహ్నియై యున్నది, అందువలన సాధ్యమై యున్నది. యద్యపి 'పర్వతో వహ్నిమాన్' అను ననుమితియందు పర్వతము విషయమై యుండుటవలన అదికూడ సాధ్య మని చెప్పవలయును, తథాపి వేదాంతమతమునందు "పర్వతో వహ్నిమాన్" అను నీజ్ఞానము ఏక మైనదే యున్నది. అయిన పర్వతాంశమునందు ఇంద్రియజన్యమై యున్నది, వహ్న్యంశమునందు ధూమజ్ఞానరూపానుమానజన్య మై యున్నది. ఏకజ్ఞానమునందు చాక్షుషత్వ, అనుమితిత్వ, యని రెండుధర్మము లున్నవి. చాక్షుషీయవిషయత పర్వతమునం దున్నది. అనుమితీయవిషయత వహ్నియం దున్నది. అందువలన ననుమితికి విషయము పర్వతము కాదు. కేవలవహ్నియై యున్నది. ఏయధికరణమునందు సాధ్యవిషయకజిజ్ఞాస కలిగి సాధ్యముయొక్క అనుమితిరూపనిశ్చయ మగుచున్నదో అది పక్ష మనబడును. ప్రతిజ్ఞావాక్యముయొక్క యుత్తరమునందు లింగబోధక మగు నే వచన మున్నదో అది హేతువాక్య మనబడును. ఈవాక్య మెట్లనగా—"ధూమాత్" అనునది. యద్యపి "ధూమాత్" "ధూమేన" ఈరెంటికిని అర్థము ఏకమై యున్నది, తథాపి "ధూమేన" అనెడి ప్రయోగము సంప్రదాయసిద్ధముగా లేదు, అని అవయవగ్రంథమునందు భట్టాచార్యులు వ్రాసియున్నారు. అందువలన "ధూమాత్" అనెడివాక్యము హేతువాక్య మనబడును. హేతుసాధ్యములయొక్క సహచారబోధక మయ్యును, దృష్టాంతప్రతిపాదకమయ్యు, నుండెడి యేవచన మున్నదో యది ఉదాహరణవాక్య మనబడును. ఉభయవాదులకు వివాదము లేనిచోటను, ఉభయులకును నిర్ణీతమైన యర్థ మున్నప్పుడును నది దృష్టాంత మనబడును. "అది మహానసము." ఈరీతిగా ప్రతిజ్ఞాదిత్రయముయొక్క సముదాయరూప మహావాక్యముచేత వివాదికి భ్రమనివృత్తి కలుగుచున్నవి. మహావాక్యమును వినియును కూడ ఆగ్రహము కలుగుచున్నచో, ఎట్లనగా, మహానసాదులయందు ధూమము వహ్నికి సహచారియై యున్నది, పర్వతమునందు ధూమము వహ్నికి సహచారియై యున్నది, అందువలన పర్వతమునందు ధూమ మున్నది, వహ్ని లేదు, అని ఈలాగున ప్రతివాదికి ఆగ్రహము కలుగుచున్నయెడల, అథవా వ్యభిచారశంక కలుగుచున్నచో తర్కముచేత ఆగ్రహశంకలయొక్క నివృత్తి యగుచున్నది. అనిష్టాపాదనము తర్క మనబడును. పర్వతమునందు వహ్ని లేకయే ధూమ ముండినయెడల ధూమము వహ్నికార్యము కాకపోవలయును. అనునది తర్కమై యున్నది.

అందువలన ధూమమునందు వహ్నియొక్క వ్యభిచారసందేహనివృత్తి యగుచున్నది. వహ్నిధూమములకు కార్యకారణభావము ఇష్టమై యున్నది, దానియొక్క అభావము అనిష్టమై యున్నది, అందువలన కార్యకారణభావభంగము ఆపాదనము చేయబడినది, ఆకార్యకారణభావభంగము అనిష్టమై యున్నది, అందువలన తర్కము అనిష్టాపాదనరూపమై యున్నది. ఈతర్కముచేత ప్రతివాదియొక్క శంకానివృత్తి యగుచున్నది. ఎట్లనగా, వహ్నిధూమములకు కారణకార్యభావము ఉభయవాదులకు ఇష్టమై యున్నది. దానియొక్క భంగము ఉభయులకు ననిష్టమై యున్నది. వహ్నియొక్క వ్యభిచారము ధూమమునందు జెప్పినయెడల ననిష్టసిద్ధి యగును. ఈభయముచేత ధూమము వహ్నివ్యభిచారి యని ప్రతివాది చెప్పడు. ఈరీతిగా మూడవయవములయొక్క సముదాయరూప మగు నే మహావాక్యమున్నదో దానికి పరార్థానుమాన మని పేరు. తదనంతరము ఏయనుమితి యగుచున్నదో అది పరార్థానుమితి యనబడును. అనుమానప్రమాణముచేత నే నిర్ణయించునపుడు వ్యభిచారశంక కలిగిన యెడల దానినివృత్తి తర్కముచేత కలుగుచున్నది. అందువలన తర్కము ప్రమాణమునకు సహకారియై యున్నది.

### 30. వేదాంతమతమునందు తర్కసహితపరార్థానుమానముయొక్క స్వరూపము.

వేదాంతవాక్యముచేత జీవునియందు బ్రహ్మాభేదము నిర్ణీతమై యున్నది. అది అనుమానముచేత నీ రీతిగా సిద్ధ మగుచున్నది. "దేవో బ్రహ్మాభిన్నః." "చేతనత్వాత్." "యత్ర యత్ర చేతనత్వం తత్ర తత్ర బ్రహ్మాభేదః." "యథా బ్రహ్మణి." ఈమూడు అవయవములయొక్క సముదాయము మహావాక్యమై యున్నది. అందువలన నది పరార్థానుమాన మనబడును. ఇచ్చట జీవుడు పక్షమై యున్నాడు. బ్రహ్మాభేదము సాధ్యమై యున్నది. చేతనత్వము హేతువై యున్నది. బ్రహ్మము దృష్టాంతమై యున్నది. ఇక్కడ ప్రతివాది శంకించున దే మనగా, జీవునియందు చేతనత్వరూపహేతు వుండినను బ్రహ్మాభేదరూపసాధ్యము లేదు. ఈరీతిగా పక్షమునందు చేతనత్వరూపహేతువునకు బ్రహ్మాభేదరూపసాధ్యముచేత వ్యభిచారశంక కలిగినప్పుడు తర్కముచేత శంకను నివృత్తి చేయవలయును. తర్కముయొక్క స్వరూప మె ట్లనగా. జీవునియందు చేతనత్వరూపహేతువును అంగీకరించి బ్రహ్మాభేదరూపసాధ్యము నంగీకరింపనియెడల చేతనమునకు నద్వితీయత్వప్రతిపాదకశ్రుతివిరోధము కలుగును.అనిష్టాపాదనతర్కమేది యనగా, | శ్రుతి

విరోధము ఆ స్తికు లందఱకును అనిష్టమై యున్నది. "వ్యావహారికః ప్రపంచో మిథ్యా జ్ఞాననివర్త్యత్వాత్; యత్ర యత్ర జ్ఞాననివర్త్యత్వం తత్ర తత్ర మిథ్యాత్వం; యథా శుక్తిరజతాదా." ఇక్కడ వ్యావహారికప్రపంచము పక్షమై యున్నది, మిథ్యాత్వము సాధ్యమై యున్నది, జ్ఞాననివర్త్యత్వము హేతువై యున్నది, శుక్తిరజతాదికము దృష్టాంత మై యున్నది. "వ్యావహారికప్రపంచో మిథ్యా" అనునది ప్రతిజ్ఞావాక్యము. "జ్ఞాననివర్త్యత్వాత్" అనునది హేతువాక్యము. "యత్ర యత్ర జ్ఞాననివర్త్యత్వం తత్ర తత్ర మిథ్యాత్వం; యథా శుక్తిరజతాదా" అనునది యుదాహరణవాక్య మై యున్నది. ఇచ్చటను ప్రపంచమునకు జ్ఞాననివర్త్యత్వము నంగీకరించి మిథ్యాత్వము నంగీకరింపనియెడల సత్పదార్థమునకు జ్ఞానముచేత నివృత్తి కలుగనేరదు. అందువలన జ్ఞానముచేత సకలప్రపంచముయొక్క నివృత్తిప్రతిపాదకశ్రుతిస్మృతులకు విరోధ మగును. ఈతర్కముచేత వ్యభిచారశంకా నివృత్తి యగుచున్నది.

౩౧. వేదాంతమతమునందు అనుమానముయొక్క ప్రయోజనము.

ఈరీతిగా వేదాంతార్థమునకు అనుసారు లయిన యనేకానుమానము లున్నవి. అయిన వేదాంతవాక్యముచేత నద్వితీయ బ్రహ్మవిషయక మగు నే నిశ్చయము సిద్ధ మగుచున్నదో దానియొక్క సంభావనమాత్రమునకు అనుమాన ప్రమాణము హేతువై యున్నది. స్వతంత్రానుమానము బ్రహ్మనిశ్చయమునకు హేతువు కాదు. ఇది సిద్ధాంత మై యున్నది. ఈరీతిని సంక్షేపముగా అనుమాన ప్రమాణము రచిత మైనది.

ఇతి శ్రీమన్నిశ్చలదాసాఖ్యసాధు విరచిత మగు
వృత్తిప్రభాకరమునందు అనుమానప్రమాణరూపణ మను
ద్వితీయప్రకాశము సమాప్తము.

## అథ శబ్దప్రమాణనిరూపణ మను తృతీయప్రకాశప్రారంభము.

---

### ३२. శాబ్దప్రమయొక్క భేదము.—

శాబ్దప్రమయొక్క కరణము శబ్దప్రమాణ మనబడును. శాబ్దప్రమ రెండు ప్రకారములై యున్నది. ఒకటి వ్యావహారిక మనియు మఱి యొకటి పారమార్థిక మనియు నున్నది. వ్యావహారిక శాబ్దప్రమకూడ రెండువిధములుగా నున్నది. ఒకటి లౌకికవాక్యజన్యమై యున్నది. మఱి యొకటి వైదికవాక్యజన్యమై యున్నది. ''నీలో ఘటః'' ఇత్యాదికము లౌకికవాక్యము. ''వజ్రహస్తః పురందరః.'' ఇత్యాదికము వైదికవాక్యము. పదములయొక్క సముదాయము వాక్య మనబడును. అర్థసహిత మగు నే వర్ణ మున్నదో, అథవా వర్ణములయొక్క సముదాయ మున్నదో, అది పద మనబడును. అకారాదిక వర్ణము కూడ విష్ణ్వాద్యర్థ సహితమై యున్నది. నారాయణాది పదమునం దుండెడి వర్ణసముదాయము అర్థసహితమై యున్నది. వ్యాకరణరీతిగా ''నీలో ఘటః.'' అనునీవాక్యమునందు రెండు పదము లున్నవి. న్యాయరీతిగా నాలుగుపదము లున్నవి. మఱియు వ్యాకరణ మతమునందును అర్థబోధకత్వము నాలుగుపదములు గలసముదాయమునందున్నది. పదములు నాలుగు లేవు.

### 33. శాబ్దప్రమా ప్రకారము.

శాబ్దప్రమయొక్క ప్రకార మెట్లనగా. ''నీలో ఘటః'' ఈవాక్యమును విని నప్పుడు శ్రోతకు సకలపదములయొక్క శ్రవణసాక్షాత్కారము కలుగుచున్నది. పదముయొక్క సాక్షాత్కారముచేత పదార్థస్మృతి కలుగుచున్నది. ఇచ్చట నొక్కశంక యున్నది.

(౧) పదముయొక్క అనుభవము పదార్థస్మృతికి హేతువై యున్నదా?

(౨) అథవా పదార్థానుభవము పదార్థస్మృతికి హేతువై యున్నదా ?

పదముయొక్క సాక్షాత్కారము పదార్థస్మృతికి హేతువు కాదు. ఎట్లన గా ఏవస్తువుయొక్క అనుభవము కలుగునో అవస్తువుయొక్క స్మృతి కలుగు చున్నది. అన్యానుభవముచేత నన్యస్మృతి కలుగనేరదు. అందువలన పదము యొక్క జ్ఞానముచేత పదార్థస్మృతి కలుగనేరదు.

సమాధానము.

యద్యపి సంస్కారద్వారమున పదార్థానుభవమే పదార్థస్మృతికి హేతువై యున్నది. తథాపి ఉద్భూతసంస్కారముచేత స్మృతి కలుగుచున్నది. అనుద్భూతసంస్కారముచేత స్మృతి కలుగనేరదు. అనుభూతపదార్థముయొక్క స్మృతి యెల్లప్పుడు కావలయును. ఆపదార్థముయొక్క సంస్కారమునకు ఉద్బోధకహేతువు పదజ్ఞానమై యున్నది. ఎట్లనగా సంబంధియొక్క జ్ఞానముచేతను సదృశపదార్థముయొక్క జ్ఞానముచేతను, అథవా చింతనముచేతను సంస్కారము ఉద్భూత మగుచున్నది. దానివలన స్మృతి కలుగుచున్నది. ఎప్పుడు పుత్త్రుని జూచి పితయొక్కయు, పితను జూచి పుత్త్రునియొక్కయు స్మృతి కలుగు చున్నదో అప్పుడు సంబంధిజ్ఞానము సంస్కారమునకు నుద్బోధకహేతువై యున్నది. అట్లనే యొకతపస్విని జూచి పూర్వమునందు చూడబడిన అన్యతపస్వియొక్క స్మృతి యైనప్పుడు సంస్కారమున కుద్బోధకము సదృశదర్శనమై యున్నది. ఎక్కడ ఏకాంతమునందు కూర్చుకొని భూతపదార్థముయొక్క చింతనమును జేసినప్పుడు దానివలన అనుభూతపదార్థముయొక్క స్మృతి కలుగుచున్నదో అక్కడ సంస్కారమున కుద్బోధకము చింతనమై యున్నది. ఈరీతిగా సంబంధ్యాదిజ్ఞానాదికము సంస్కారమున కుద్బోధద్వారమున స్మృతికి హేతువై యున్నది. మఱియును సంస్కారముయొక్క యుత్పత్తిద్వారమున సమానవిషయక పూర్వానుభవము స్మృతిహేతువై యున్నది; అందువలన పదార్థముయొక్క పూర్వానుభవము పదార్థవిషయక సంస్కారముయొక్క యుత్పత్తిద్వారమున హేతువై యున్నది. మఱియును పదార్థముయొక్క సంబంధి పదమై యున్నది. అందువలన పదార్థముయొక్క సంబంధి యే పద మున్నదో దానియొక్క జ్ఞానము సంస్కారముయొక్క ఉద్బోధద్వారమున పదార్థస్మృతికి హేతువై యున్నది. అందువలన పదజ్ఞానముచేత పదార్థస్మృతి కలుగుచున్నది. ఎక్కడ ఏకసంబంధిజ్ఞానముచేత అన్యసంబంధియొక్క స్మృతి కలుగుచున్నదో అక్కడ రెండుపదార్థములయొక్క సంబంధజ్ఞానము ఎవరికి నున్నదో వారికి ఏకజ్ఞానముచేత నన్యస్మృతి కలుగుచున్నది. ఎవరికి సంబంధజ్ఞానము లేదో వారికి ఏకజ్ఞానముచేత అన్యస్మృతి కలుగనేరదు. పితాపుత్త్రులకు జన్యజనకభావసంబంధ మున్నది. ఎవరికి జన్యజనకభావసంబంధజ్ఞాన మున్నదో వారికి ఏకజ్ఞానముచేత నన్యస్మృతి కలుగుచున్నది. ఎవరికి జన్యజనకసంబంధజ్ఞానము లేదో వారలకు ఏకజ్ఞానముచేత నన్యస్మృతి

కలుగనేరదు. అట్లుగానే పదార్థములకు ఏసంబంధ మున్నదో అది వృత్తి యనబడును. వృత్తిరూప మగుపదార్థములయొక్క యే సంబంధ మున్నదో దానియొక్క జ్ఞానము ఎవరికి కలిగియున్నదో వారికి పదజ్ఞానముచేత అర్థస్మృతి కలుగుచున్నది. పదార్థములయొక్క యే వృత్తిరూపసంబంధమున్నదో తజ్జ్ఞానరహితులకు పదజ్ఞానముచేత నర్థస్మృతి కలుగనేరదు. అందువలన వృత్తిసహితపదజ్ఞానము అర్థస్మృతికి హేతువై యున్నది.

౩౮. శబ్దముయొక్క శక్తివృత్తినిరూపణము. శబ్దవృత్తి రెండుప్రకారములై యున్నది.

(౧) శక్తిరూపవృత్తి, (౨) లక్షణారూపవృత్తి, యని.

న్యాయమతమునందు శక్తి యీశ్వరేచ్ఛారూపమై యున్నది. మీమాంసకమతమునందు శక్తి భిన్నపదార్థమై యున్నది. వ్యాకరణమతమునందు పాతంజలమతమునందును వాచ్యవాచకభావమునకు మూలభూతమైన పదార్థములయొక్క యే తాదాత్మ్యసంబంధ మున్నదో అది శక్తి యనబడును. మఱియును విచారసాగరమునందు యోగ్యతారూపశక్తియు వ్యాకరణమతానుసారముగా వ్రాసియున్నది. అది భూషణకారమతము. వ్యాకరణగ్రంథమునందు యోగ్యభాష్యరీతిగా వాచ్యవాచకభావమునకు మూలభూతమైన తాదాత్మ్యసంబంధమె శక్తి యని చెప్పబడినది. మఱియును అద్వైతసిద్ధాంతమునందు తనయొక్క కార్యకరణసామర్థ్యమె శక్తి యని చెప్పబడినది. ఎట్లు తంతువునందు పటకరణసామర్థ్యరూప శక్తి యున్నదో, వహ్నియందు దాహజనక సామర్థ్యరూప శక్తి యున్నదో, అట్లే పదమునందు తనయొక్క అర్థజ్ఞానజనక సామర్థ్యరూప శక్తి యున్నది. అయిన ఇంత భేద మున్నది. వహ్న్యాది పదార్థములయందు నా సామర్థ్యరూప మగునే శక్తి యున్నదో దానికి జ్ఞానముయొక్క అపేక్ష లేదు. శక్తి జ్ఞాత మయినప్పుడును అథవా అజ్ఞాత మయినప్పుడును రెండుస్థానములయందు వహ్న్యాదికములచేత దాహాదికార్యము లగుచున్నది. మఱియును పదముయొక్క శక్తిజ్ఞాన మయినప్పుడే అర్థస్మృతిరూపకార్య మగుచున్నది శక్తిజ్ఞానము లేనికాలమునందు అర్థస్మృతిరూపకార్యము కలుగనేరదు. అందువలన పదముయొక్క సామర్థ్యరూపశక్తి జ్ఞాత మయినప్పుడు పదార్థస్మృతిరూపకార్య మగుచున్నది. దీనియం దొకశంక. ఎప్పు డతీతపదముయొక్క స్మృతి కలుగుచున్నదో అప్పుడు పదముయొక్క స్మరణరూపజ్ఞానముఖ్యాతచే నర్థస్మృతి యగుచున్నది.

అది కాకపోవలయును. ఎట్లనగా, సామర్థ్యరూప శక్తివిశిష్ట పదమునకు నాశము కలిగియున్నది. అందువలన నర్థస్మృతికి హేతు వైన యే పద మున్నదో దాని కభావ మున్నది.

### సమాధానము.

మీమాంసకమునందు పదము నిత్యమై యున్నది. దానికి ఉత్పత్తియును నాశమును లేదు. అందువలన పదమునకు ధ్వంసము లేదు. మఱియును పదము నిత్య మని యంగీకరించినయెడల ఈసమాధానము. పదార్థస్మృతియొక్క సామర్థ్యము పదమునందు లేదు. అయిన పదజ్ఞానమునందు పదార్థస్మృతియొక్క శక్తి యున్నది. ఎక్కడ పదముయొక్క ధ్వంసము కలిగినదో అక్కడ నాపదముయొక్క స్మరణరూపజ్ఞాన మున్నది. ఎక్కడ వర్తమానపద మున్నదో అక్కడ పదముయొక్క శ్రవణసాక్షాత్కారరూపజ్ఞాన మున్నది. ఆజ్ఞానమునందు పదార్థస్మృతియొక్క సామర్థ్య మున్నది. అది శక్తి యనబడును. ఈపక్షమునందు శక్తిసహితపదము లేదు. పదముయొక్క జ్ఞానము మాత్ర మున్నది. ఈపక్షము గదాధరభట్టాచార్యులచేత శక్తివాదగ్రంథమునందు జ్ఞానశక్తివాద మని వ్రాయబడి యున్నది ఈరీతిగా పదముయొక్క సామర్థ్య మైనను, పదజ్ఞానముయొక్క సామర్థ్య మైనను శక్తి యనబడును. రెండవ ఆవృత్తిపక్షము. పదము శక్తిసహితమై యున్నది, అని యీవ్యవహారముయొక్క సిద్ధికొఱకు పదముయొక్క ధర్మ మయిన శక్తి అపేక్షిత మయినప్పుడు ఏపదముయొక్క జ్ఞానము ఏయర్థముయొక్క స్మృతియందు సమర్థమై యున్నదో ఆపదమున కాయర్థమునందు శక్తి చెప్పబడును.

### ౩౫. శాబ్దప్రమా రీతిపూర్వక శక్తివిషయమునందు వివాదము.

ఈరీతిగా శక్తిసహితపదజ్ఞానముచేత పదార్థస్మృతి కలుగుచున్నది. ఎంతపదార్థస్మృతి యగునో అంత పదార్థజ్ఞానము అథవా సంబంధసహిత సకల పదార్థజ్ఞానమును వాక్యార్థజ్ఞాన మని చెప్పబడును. దానికి శాబ్దప్రమ యని పేరు. ఎట్లనగా "నీలో ఘటః" అను వాక్యమునందు నాలుగుపదము లున్నవి.

(౧) నీలపదము; (౨) ఓకారపదము; (౩) ఘటపదము; (౪) విసర్గపదము.

నీలరూపవిశిష్టమునందు నీలపదమునకు శక్తి యున్నది. ఓకారపదము నిరర్థకము. ఈవిషయము వ్యుత్పత్తివాదాదిగ్రంథములయందు స్పష్టమై యున్నది. అథవా ఓకారపదమునకు అభేదము అర్థము. ఘటపదమునకు ఘటత్వవిశిష్టమందు

శక్తి యున్నది. విసర్గమునకు ఏకత్వసంఖ్యయందు శక్తి యున్నది. శక్తిజ్ఞానము కోశవ్యాకరణాదికమువలన నగుచున్నది. పీతాదిపదమునకు వర్ణమం దైనను వర్ణసహితమం దైనను శక్తి యున్నది. ఇది కోశమందు వ్రాసియున్నది. విసర్గమునకు ఏకత్వసంఖ్యయందు శక్తి యున్నది అనునది వ్యాకరణముచేత తెలియవలసినది. ఘటపదమునకు ఘటత్వవిశిష్టమందు శక్తి యున్నది, అని వ్యాకరణమునందు శక్తివాదాది తర్కగ్రంథములయందును వ్రాసియున్నది. మఱియును న్యాయసూత్రమునందు గౌతములు కూడ చెప్పియున్నారు. జాత్యాకృతివ్యక్తులయందు సకలపదములకు శక్తి యున్నది. అవయవములయొక్క సన్నివేశమునకు ఆకృతి యని పేరు. అనేకపదార్థములయందు నిత్యమై ఏకమైయేధర్మ మున్నదో దానికి జాతి యని పేరు. అనేకఘటములయందు నిత్యమై ఏకమై యుండుఘటత్వము జాతి యై యున్నది.జాతికి ఆశ్రయము వ్యక్తి యనబడును. ఈమతమునందు ఘటపదమునకు కపాలసంయోగసహిత ఘటత్వవిశిష్ట ఘటమునందు శక్తి యున్నది. మఱియును దధీతికార శిరోమణిభట్టాచార్యమతమునందు సకలపదములకు వ్యక్తిమాత్రమునందు శక్తి యున్నది. జాత్యాకృతులయందు లేదు. ఈమతమునందు ఘటపదమునకు వాచ్యము కేవలవ్యక్తియై యున్నది. ఘటత్వము, కపాలసంయోగము ఈ రెండును కూడ ఘటపదమునకు వాచ్యము కావు. ఎట్లనగా ఏపదమునకు ఏయర్థమునందు శక్తియున్నదో ఆపదమునకు ఆయర్థము వాచ్య మనబడును, శక్య మనియును చెప్పబడును. కేవలవ్యక్తియందు శక్తి యున్నది. అందువలన కేవలవ్యక్తియే వాచ్య మై యున్నది. దీనియం దొకశంక.—

ఘటపదముయొక్క యుచ్చారణముచేత ఘటత్వమునకును, గోపదముయొక్క యుచ్చారణముచేత గోత్వమునకును, బ్రాహ్మణపదోచ్చారణముచేత బ్రాహ్మణత్వమునకును ప్రతీతి యగుచున్నది. అది ఈమతమునందు కాకపోవలయును. ఎట్లనగా అవాచ్యార్థమునకు లక్షణ లేకయే పదముచేత నర్థప్రతీతి యగుట లేదు. అవాచ్యార్థమునకు లక్షణ లేకయే పదముచేత నర్థప్రతీతి నంగీకరించినయెడల ఘటపదమునకు అవాచ్య మయినఘటత్వమునకు ఘటపదముచేత నెట్లు ప్రతీతి యగునో యట్లు ఘటపదమునకు అవాచ్య మయినపటాదికమునకు కూడ ఘటపదముచేత ప్రతీతి కావలయును.

సమాధానము.

వాచ్యముయొక్క ప్రతీతి పదముచే నగుచున్నది. మఱియును వాచ్యవృత్తి యగుజాతికిని ప్రతీతి యగుచున్నది. అందువలన నీనియమ మేర్పడుచున్నది. జాతిభిన్నావాచ్యమునకు ప్రతీతి కాదు. మఱియును వాచ్యవృత్తిజాతి అవాచ్యమయినను ప్రతీత మగుచున్నది. అందువలన ఘటత్వాదికము అవాచ్య మైనను జాతిభిన్నావాచ్యము కానందున ఘటాదిపదముచేత ప్రతీత మగుచున్నది. పటాదికము జాతిభిన్నావాచ్య మైనందున ప్రతీత మగుట లేదు. మఱియు నొకశంక.

వాచ్యవృత్త్యవాచ్యజాతికి పదముచేత ప్రతీతి సంగీకరించినయెడల ఘటపదముచేత పృథివీత్వజాతికిని ప్రతీతి కావలయును. ఎట్లనగా, ఘటపదవాచ్యమునందు ఎట్లు ఘటత్వజాతి యున్నదో అట్లు పృథివీత్వము కూడ నున్నది. అందువలన రెండును వాచ్యవృత్తులై యున్నవి. అవాచ్య మయ్యు ఉన్నవి. అందువలన ఘటత్వమునకుంబోలె పృథివీత్వమునకును ప్రతీతి కావలయును. గోపదవాచ్యమునం దుండుగోత్వమునవలెనే పశుత్వము కూడ ఉన్నది. ఈరెండును అవాచ్యములై యున్నవి. అట్లనే బ్రాహ్మణపదముచేతను బ్రాహ్మణత్వమువలె మనుష్యత్వమునకు కూడ ప్రతీతి కావలయును.

సమాధానము.

వాచ్యతావచ్ఛేదక మగు నేయవాచ్య మున్నదో దానికిని వాచ్యమునకును పదముచేత ప్రతీతి యగుచున్నది. అన్యమునకు ప్రతీతి యగుట లేదు. ఎట్లు ఘటపదవాచ్యఘటవ్యక్తికిని వాచ్యతావచ్ఛేదకఘటత్వమునకును ఘటపదముచేత ప్రతీతి యగునో అట్లు పృథివీత్వము వాచ్యము కాదు, వాచ్యతావచ్ఛేదకమును కాదు. వాచ్యత్వముకంటె న్యూనవృత్తియు నధికవృత్తియును కాక ఎంతదేశమునందు వాచ్యత యున్నదో అంత దేశమునం దుండునది వాచ్యతావచ్ఛేదక మనబడును. ఘటపదముయొక్క వాచ్యత సకలఘటవ్యక్తులయం దున్నది. ఘటత్వము కూడ సకలఘటవ్యక్తులయం దున్నది. అందువలన ఘటపదముయొక్క వాచ్యత్వముకంటె న్యూనవృత్తియును కాదు, అధికవృత్తియును కాదు. మఱియు నే మనగా సమానదేశవృత్తి యై యుండుటవలన ఘటత్వము ఘటపదముయొక్క వాచ్యతావచ్ఛేదక మై యున్నది. ఘటపదముయొక్క వాచ్యత పటపదమునందు లేదు. పృథివీత్వము పటమునం దున్నది. అందువలన నధికదేశవృత్తి యైనందున పృథివీత్వము ఘటపదముయొక్క వాచ్యతావచ్ఛేదక

ము కాదు. గోపదముయొక్క వాచ్యత సకలగోవ్యక్తులయం దున్నది. గోత్వ మును సకలగోవ్యక్తులయం దున్నది. అందువలన గోత్వము గోపదవాచ్యతా వచ్ఛేదకము. అశ్వమునందు గోపదవాచ్యత లేదు. దానియందు పశుత్వ మున్న ది. అందువలన గోపదవాచ్యత్వముకంటె నధికదేశవృత్తియైనందున పశుత్వము గోపదవాచ్యతావచ్ఛేదకము కాదు. అట్లుగానే బ్రాహ్మణపదవాచ్యత సకలబ్రా హ్మణవ్యక్తులయందు నున్నది. బ్రాహ్మణత్వము కూడ సకలబ్రాహ్మణవ్యక్తులయం దున్నది. అందువలన బ్రాహ్మణపదవాచ్యతావచ్ఛేదకము బ్రాహ్మణత్వమై యు న్నది. మఱియును, క్షత్రియాదికమునందు బ్రాహ్మణపదవాచ్యత లేదు. అక్కడ మనుష్యత్వ మున్నది. అందువలన నధికదేశవృత్తియై యుండుటచేత మనుష్య త్వము బ్రాహ్మణపదవాచ్యతావచ్ఛేదకము కాదు. ఈరీతిగా ఘటాదిపదముచేత ఘటత్వాదికమునకు ప్రతీతి యగుచున్నది. మఱియును శక్తి లేనందున ఘటపదము యొక్క వాచ్యము కాదు. ఇక నేమనగా, వాచ్యతావచ్ఛేదకమై యున్నది. ఇది శిరోమణిభట్టాచార్యులమతము,

ఘటాదిపదమునకు జాతిమాత్రమునందు శక్తి యున్నది, వ్యక్తియందు లే దని మీమాంసకమతప్రక్రియ. ఇచ్చట నొకశంక. ఏయర్థమునందు ఏపద ముయొక్క శక్తిజ్ఞాన మున్నదో ఆయర్థమునకు ఆపదముచేత స్మృతి కలిగి శాబ్దప్రమ యగుచున్నది. పదముయొక్క శక్తి లేకయే వ్యక్తికి పదముచేత స్మృతియును శాబ్దప్రమయును కూడ కాకపోవలయును.

సమాధానము.

శబ్దప్రమాణముచేత జాతియొక్క మాత్రము జ్ఞాన మగుచున్నది. తథాపి అర్థాపత్తిప్రమాణముచేత వ్యక్తిజ్ఞాన మగుచున్నది. ఎట్లు దినమునందు భోజన ము చేయని పురుషునకు రాత్రిభోజనము వినా స్థూలత్వము సిద్ధింపదో అట్లు వ్యక్తి వినా కేవలజాతియం దేక్రియయును సంభవింపదు. అందువలన నర్థాపత్తి ప్రమాణముచేత వ్యక్తియొక్క బోధ మగుచున్నది. "గా మానయ" అనువాక్య ముచేత గోత్వమునకు ఆనయనముయొక్క బోధ మగుచున్నది. అది గోవ్యక్తి యొక్క ఆనయనము వినా సంభవింపదు. గోవ్యక్తియొక్క ఆనయనము సంపా దకమై యున్నది. గోత్వముయొక్క ఆనయనము సంపాద్యమై యున్నది. సంపా దకజ్ఞానమునకు హేతువైన సంపాద్యజ్ఞానము అర్థాపత్తిప్రమాణ మనబడును. సంపాదకజ్ఞానము ప్రమయై యున్నది.

ఈస్థానమునందు జాతియొక్క జ్ఞానము ప్రమాణమై యున్నది. వ్యక్తియొక్క జ్ఞానము ప్రమ యై యున్నది. ఇది భట్టమీమాంసకమతరీతి. మఱియు నొకానొక జాతిశక్తివాది అనుమానముచేత వ్యక్తిబోధము నంగీకరించుచున్నాడు. అది గ్రంథాంతరమునందు వివరింపబడినది. కఠినప్రసంగ మైనందున నిచట విరమించవలెనది.

కేవలజాతియందు శక్తి నంగీకరించువానిమతమునందు వ్యక్తియొక్క బోధము శబ్దప్రమాణముచేత కలుగుట లేదు. మఱియు నే మనగా, అర్థాపత్తి చేత నైనను, అనుమానముచేత నైనను, వ్యక్తియొక్క బోధ మగుచున్నది. అయిన కొందఱు గ్రంథకారులు జాతియందు కుబ్జశక్తి నంగీకరించి యున్నారు. వారిమతమునందు వ్యక్తిజ్ఞానము కూడ శబ్దప్రమాణముచేత కలుగుచున్నది. వారి యభిప్రాయ మే మనగా, సకలపదములయొక్క శక్తియు జాతివిశిష్టవ్యక్తియం దున్నది. అయిన శక్తిజ్ఞానము ఎవరికి ఉన్నదో వారికి పదముచేత నర్థస్మృతి శాబ్దబోధము కూడ నగుచున్నది, ఇతరులకు కాదు. అచ్చట ఘటపదమునకు ఘటత్వమందు శక్తి యున్నది. ఈరీతిగా జాతిశక్తియొక్క జ్ఞానము అర్థస్మృతికిని శాబ్దబోధమునకును హేతువై యున్నది. మఱియును వ్యక్తియందు శక్తి జ్ఞానమునకు ఉపయోగము లేదు. మఱియును వ్యక్తు లనంతము లై యున్నవి. అందువలన సకలవ్యక్తియొక్క జ్ఞానము సంభవింపదు. ఈకారణముచేత వ్యక్తి శక్తిస్వరూపముచేత పదార్థస్మృతికిని శాబ్దబోధమునకును హేతువై యున్నది. దానియొక్క జ్ఞానము హేతువు కాదు. ఈరీతిగా ఘటపదమునకు ఘటత్వవిశిష్ట మందు శక్తి యుండుటవలన పదముయొక్క వాచ్యము ఘటత్వము ఘటము ఈ రెండును అయి యున్నది. అందువలన ఘటపదముయొక్క వాచ్య మయిన యేఘటత్వము ఘటము నున్నవో వానియొక్క శాబ్దబోధమునకు ఘటత్వము నందు శక్తిజ్ఞానము హేతువై యున్నది. ఈపక్షమునకు కుబ్జశక్తివాద మని పేరు. మఱియును ప్రకారాంతరముగా కుబ్జశక్తివాదము గదాధరభట్టాచార్యులచేత శక్తి వాదముయొక్క అంత్యభాగమునందు వ్రాయబడియున్నది. అది కఠిన మైనందున నిచ్చట వ్రాయ లేదు. మఱియును ఘటాదిపదములచేత నెట్లు జాతివిశిష్టవ్యక్తి బోధ మగుచున్నదో అట్లు జాతియొక్క వ్యక్తియం దుండెడి సమవాయాది సంబంధ మున్నదో దానికిని బోధ మగుచున్నది. అందువలన జాతి వ్యక్తి సంబంధము ఈ మూడింటియందును ఘటాదిపదముయొక్క శక్తి యున్నది. ఇది గదాధర

భట్టాచార్యులమతము. సర్వమతములయందును జాతివిశిష్టవ్యక్తియందు ఘటాది పదములకు శక్తి యున్నది. ఈమతము గ్రంథకారు లందఱును బహుధా యంగీకారము. అందువలన ఘటపదమునకు ఘటత్వవిశిష్టమందు శక్తి చెప్పబడియున్నది.

౩౬. వాక్యముయొక్క భేదము.

నీలాభేదసహిత మయిన యొక్క ఘట మున్నది. అది "నీలో ఘటః" అను నీవాక్యముయొక్క అర్థమై యున్నది. అట్లనే 'వజ్రహస్తః పురందరః'' ఇది వైదిక వాక్యము. ఎట్లు "నీలో ఘటః" అనువాక్యమునందు విశేషణబోధక నీలపదము విశేష్యబోధకఘటపదము నున్నవో అట్లు వజ్రహస్తపదము విశేషణబోధక మై పురందరపదము విశేష్యబోధకమై యున్నది. విశేషణపదముయొక్క అగ్రమునం దుండెడి విసర్గము నిరర్థకమై యున్నది. అథవా అభేదబోధకమై యున్నది. విశేష్యబోధకపదముయొక్క అగ్రమునం దుండెడి విసర్గమునకు ఏకత్వ మర్థమై యున్నది. వజ్రహస్తునియొక్క అభేదసహితుఁడు ఒకపురందరుఁడు అని యీవాక్యముయొక్క అర్థము. ఈరీతిగా లౌకికవైదికవాక్యములకు సమానార్థము కలిగి యున్నది. అయిన వైదికవాక్యము రెండుప్రకారములు కలదై యున్నది.

(౧) వ్యావహారికార్థబోధకము.

(౨) పారమార్థికతత్త్వబోధకము.

బ్రహ్మముకంటె భిన్న మగు సర్వము వ్యావహారిక మనియును, బ్రహ్మము పారమార్థికతత్త్వ మనియును చెప్పబడును. బ్రహ్మబోధక మగువాక్యము కూడ రెండువిధములుగా నున్నది. తత్పదార్థత్వంపదార్థములయొక్క స్వరూపబోధకము అవాంతరవాక్యమై యున్నది. ఎట్లనగా, 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' ఈవాక్యము తత్పదార్థబోధకమై యున్నది 'య ఏష హృద్యంత ర్జ్యోతిః పురుషః'' ఈవాక్యము త్వంపదార్థముయొక్క స్వరూపబోధకమై యున్నది. తత్పదార్థ త్వంపదార్థములకు అభేదబోధకము లగుతత్త్వమస్యాది వాక్యములు మహావాక్యములై యున్నవి.

౩౭. శబ్దముయొక్క శక్తివృత్తి లక్షణావృత్తులయొక్క సంక్షేప నిరూపణము.

ఏయర్థమునం దేకపదమునకు వృత్తి యున్నదో ఆయర్థమునకు ఆపదముచేత ప్రతీతి యగుచున్నది. ఆ వృత్తి శక్తిలక్షణాభేదమువలన ద్విప్రకారమై యున్నది ఈశ్వరునియొక్క ఇచ్ఛ అథవా వాచ్యవాచకభావ సంబంధ

ముల తాదాత్మ్యము, అథవా పదార్థబోధ హేతువైనసామర్థ్యము శక్తి యనబడును. ఏపదార్థమునందు పదమునకు శక్తి యున్నదో ఆయర్థము పదముయొక్క శక్య మనబడును. శక్యసంబంధమునకు లక్షణ యని నామము. గంగాపదమునకు ప్రవాహమునందు శక్తి యున్నది. అందువలన గంగాపదముయొక్క శక్యము ప్రవాహమై యున్నది. దానితో సంయోగసంబంధము తీరమునకున్నది. ఈరీతిగా పదమునకు అర్థముతో నేపరంపరాసంబంధ మున్నదో అది లక్షణ యనబడును. ఉ. గంగాపదమునకు తీరముతో పరంపరాసంబంధ మున్నది. ఆసంబంధము తీరమునందు గంగాపదముయొక్క లక్షణ యనబడును. ఎట్లనగా, సాక్షాత్సంబంధసహితముతో నేసంబంధ మున్నదో అదిపరంపరాసంబంధ మనబడును. గంగాపదమునకు శక్తిరూపసంబంధము ప్రవాహమునం దున్నది. ఆప్రవాహముతో సంయోగసంబంధము తీరమున కున్నది. అందువలన స్వశక్య సంయోగరూప పరంపరాసంబంధము గంగాపదమునకు తీరమం దున్నది. అది లక్షణ యని చెప్పబడును. ఇందువలన నిది సిద్ధ మగుచున్నది. ఏయర్థముచేత నేపదమునకు శక్తిరూపసాక్షాత్సంబంధ మున్నదో ఆయర్థము ఆపదమునకు శక్య మనబడును. ఏ యర్థముతో నేపదమునకు శక్యసంబంధ మున్నదో ఆయర్థము ఆపదమునకు లక్ష్య మనబడును. ఉ. గంగాపదముయొక్క శక్య మైనయే ప్రవాహ మున్నదో దానికి తీరరూపార్థముతో సంయోగసంబంధ మున్నది. అందువలన గంగాపదమునకు ప్రవాహము శక్యమై యున్నది, తీరము లక్ష్యమై యున్నది. ఈరీతిగా పదమునకు సాక్షాత్సంబంధము పరంపరాసంబంధ మని శక్తి లక్షణాభేదమువలన వృత్తి ద్విప్రకార మై యున్నది. ఏపదముయొక్క వృత్తి ఏ పురుషునకు అజ్ఞాతమో ఆపదముయొక్క సాక్షాత్కారము ఆపురుషున కయినప్పటికిని పదార్థస్మృతి శాబ్దబోధము ఈరెండును కావు. అందువలన శక్తిలక్షణారూప వృత్తియొక్క జ్ఞానము అర్థస్మృతికిని శాబ్దబోధమునకును హేతువై యున్నది.

38. వాక్యార్థజ్ఞానముయొక్క క్రమము.

శాబ్దబోధక్రమ మెట్లనగా, ఏపురుషునికి పదముయొక్క వృత్తి జ్ఞాతమై యున్నదో ఆపురుషునికి వాక్యము (సకలపదముల) యొక్క సాక్షాత్కారమై యేపదమున కేయర్థమునందు వృత్తి పూర్వము జ్ఞాత మై యున్నదో ఆపదముచేత నాయర్థమునకు స్మృతి కలుగుచున్నది. తదనంతరము పరస్పరసంబంధ సహిత సకలపదార్థములయొక్క లేక సకలపదార్థములయొక్క పరస్పరసంబంధ

జ్ఞానము, వాక్యార్థజ్ఞాన మనబడును. 'గా మానయ త్వం' ఈవాక్యమునందు గవాదిపదము లున్నవి. గోపదమునకు గోత్వవిశిష్ట పశువిశేషమునందు శక్తి యున్నది. ద్వితీయావిభక్తికి కర్మత్వమునందు శక్తి యున్నది "ఆఙ్" ఉపసర్గ పూర్వక నఞ్ పదమునకు ఆనయనమునందు శక్తి యున్నది. యకారోత్తర అకారమునకు కృతియందును ప్రేరణయందును శక్తి యున్నది. సంబోధన యోగ్య చేతనమునందు త్వంపదమునకు శక్తి యున్నది. ఈరీతిగా శక్తిజ్ఞాన సహిత పురుషునకు "గా మానయ త్వమ్" అనెడియీవాక్యమునకు శ్రోత్రముతో సంబంధమై ఆ గవాది సకలపదములయొక్క సాక్షాత్కార మై ఆపదములశక్యార్థ స్మృతి యగుచున్నది. ఎట్లు హస్తిపాలకునియొక్క జ్ఞానముచేత తత్సంబంధి హస్తిస్మృతి యగుచున్నదో అట్లు పదముయొక్క జ్ఞానముచేత. తత్సంబంధి శక్యార్థమునకు స్మృతి యగుచున్నది. వీఁడు హస్తిపాలకుఁడు అని హస్తియొక్క సంబంధజ్ఞాన మెవరికి లేదో, మనుష్యుఁడు అనుజ్ఞానము మాత్ర మున్నదో వారికి హస్తిపాలకుని చూచినప్పటికిన్ని హస్తిస్మృతి కాదు. అట్లనే ఈపదమునకు ఇది శక్యము లేక లక్ష్యము అని శక్తిలక్షణారూప సంబంధములయొక్క జ్ఞానము పూర్వమునందు ఎవరికి లేదో మఱియును అజ్ఞాతార్థపదముయొక్క శ్రవణసాక్షాత్కార మున్నదో వారికి పదశ్రవణ మయినప్పటికిని అర్థస్మృతి కాదు. అందువలన ఆవృత్తిసహితపదముయొక్క జ్ఞానము అర్థస్మృతికి హేతువై యున్నది కేవలపదముయొక్క జ్ఞానము హేతువు కాదు. పదముయొక్క జ్ఞానముచేత సకలపదార్థములకు స్మృతి కలిగి సకలపదార్థములయొక్క పరంపరా సంబంధజ్ఞానము కలుగుచున్నది; లేక పదజ్ఞానముచేత పరస్పరసంబంధసహిత మగు నెంత పదార్థమునకు స్మరణమై యున్నదో అంతపదార్థముయొక్క పరస్పరసంబంధసహితజ్ఞాన మగుచున్నది. పదార్థముయొక్క అసంబంధజ్ఞానము లేక సంబంధసహిత పదార్థములయొక్క జ్ఞానము వాక్యార్థజ్ఞాన మనబడును. లేక శాబ్దప్రమ యనబడును. పైవాక్యమునందు గోపదార్థముయొక్క ద్వితీయార్థ కర్మత్వమునందు ఆధేయతాసంబంధ మున్నది. ఆధేయతకు వృత్తిత్వ మని పేరు. ఆఙ్ పూర్వక నఞ్ పదమునకు అర్థమైన యానయనమునందు కర్మత్వము యొక్క నిరూపకతాసంబంధ మున్నది. యకారోత్తర అకారమునకు కృతిప్రేరణ లేక ప్రేరణ యని రెండు అర్థము లున్నవి. ఆకృతియందు ఆనయనముయొక్క అనుకూలతాసంబంధ మున్నది. కృతియొక్క త్వంపదార్థమునందు ఆశ్రయతాసం

బంధ మున్నది. ప్రేరణమునకు త్వంపదార్థమునందు విషయతాసంబంధ మున్నది. అందువలన "గోవృత్తికర్తృతా నిరూపక ఆనయనానుకూలకృత్యాశ్రయః ప్రేరణావిషయ స్త్వం పదార్థః." ఈజ్ఞానము వాక్యశ్రోతలకు కలుగుచున్నది. అప్పుడు వృత్తివిశిష్టసకలపదములయొక్క జ్ఞానము శబ్దప్రమాణమై యున్నది. పదముయొక్క జ్ఞానముచేత ఆయర్థస్మృతి వ్యాపారమై యున్నది. వాక్యార్థజ్ఞానము ఫలమై యున్నది. ఈరీతిగా లౌకికవైదికవాక్యములచేత ననేకస్థలములయందు పదార్థసంబంధముయొక్క లేక సంబంధసహితపదార్థముయొక్క జ్ఞానమే ఫలమై యున్నది. అయిన త్వంపదార్థముయొక్క సంబంధి తత్పదార్థమునకు, తత్పదార్థముయొక్క సంబంధి త్వంపదార్థమునకును మహావాక్యముచేత బోధము నంగీకరించునెడల "అసంగో హ్యయం పురుషః" ఇత్యాదిశ్రుతివచనములచేత బ్రహ్మమున కసంగత చెప్పబడియున్నది. దానికి బాధ కావలయును. అందువలన మహావాక్యముచేత ప్రతిపాద్యము అఖండబ్రహ్మమై యున్నది. వాక్యమునకు అఖండార్థబోధకత్వమునందు దృష్టాంతము సంక్షేపశారీరకమునందు స్పష్టమై యున్నది. గ్రంథవిస్తరభయముచే నిచ్చట వ్రాయలేదు.

## ౩౯. లక్షణాప్రకారనిరూపణము.

మహావాక్యమునందు లక్షణయొక్క ప్రకారము విచారసాగరమునందు విశదముగా నున్నది. పదముయొక్క శక్యముతో సంబంధము లక్షణ యన బడును. అందువలన పదముయొక్క పరంపరాసంబంధము లక్షణ యై యున్నది. ఎట్లనగా, పదమునకు సాక్షాత్సంబంధము శక్యముతో నున్నది. ఆశక్యముయొక్క సంబంధము లక్ష్యముతో నున్నది. అందువలన శక్యద్వారా పదముయొక్క సంబంధము కలిగినప్పుడు పరంపరాసంబంధరూపలక్షణావృత్తి యున్నది. ఈకారణమువలన గ్రంథకారులచేత లక్షణావృత్తి జఘన్య మని చెప్పబడినది. ఎక్కడ పదమునకు సాక్షాత్సంబంధరూప శక్తివృత్తి సంభవించుట లేదో అక్కడ పరంపరాసంబంధరూప లక్షణావృత్త్యంగీకారము. ఈకారణముచేత గ్రంథకారులు వ్రాసిన దేమనగా, ఎక్కడ శక్యార్థమునందు వక్తకు తాత్పర్యము లేదో అక్కడ లక్షణావృత్తిని అంగీకరించి పదమునకు లక్ష్యార్థము నంగీకరించవలసినది. ఎక్కడ శక్యార్థమునందు వక్తకు తాత్పర్య మున్నదో అక్కడ లక్ష్యార్థము నంగీకరింపఁగూడదు. ఆ లక్షణ

(౧) కేవలలక్షణ యనియు, (౨) లక్షితలక్షణ యనియును
భేదముచేత ద్విప్రకారమై యున్నది.

(౧) పదమునకు శక్యముయొక్క యేసాక్షాత్సంబంధ మున్నదో అది కేవలలక్షణ యనబడును. ఉ. గంగాపదమునకు తీరమునందు లక్షణ యున్నది. అచ్చట గంగాపదమునకు శక్య మైన యే ప్రవాహ మున్నదో దానికి తీరముతో సాక్షాత్సంబంధ మున్నది. అచ్చట గంగాపదమునకు తీరమునందు కేవలలక్షణ యున్నది.

(౨)లక్షితలక్షణయొక్క ఉదాహరణము 'ద్విరేఫో రౌతి' ఈవాక్యమునకు రెండురేఫములు ధ్వనిచేయుచున్నవి అని యర్థము. ఈయర్థము పదముయొక్క శక్తిచేత ప్రతీత మగుచున్నది. అది ఆవర్ణరూపమునందు ధ్వని చేయుట సంభవింపదు, అందువలన శక్యార్థమునందు వక్తకు తాత్పర్యము లేదు. రెండు రేఫములతో కూడిన యేభ్రమరపద మున్నదో దానియొక్క శక్యమునందే ద్విరేఫ పదమునకు లక్షణ. అది కేవలలక్షణ కాదు. ఏయర్థమందు పదమునకు శక్యము యొక్కసాక్షాత్సంబంధ మున్నదో దానియందు కేవలలక్షణ యున్నది. ద్విరేఫ పదమునకు శక్యము రెండురేఫములు, దానికి అవయవితాసంబంధము భ్రమర పదమం దున్నది. ఆపదశక్తిరూపసంబంధము స్వవాచ్య మయిన మధుపమునం దున్నది. అందువలన శక్యసంబంధి యగునేభ్రమరపద మున్నదో దానియొక్క సంబంధము శక్యముయొక్క పరంపరాసంబంధ మై యున్నది. అందువలన నది లక్షితలక్షణ యనంబడును. యద్యపి రెండురేఫములు ద్విరేఫము కావు, మఱియు నేమనగా రెండురేఫములతో కూడినది ద్విరేఫ మనబడును. రెండురేఫ ములతో కూడినది భ్రమరపదమై యున్నది. అందువలన ద్విరేఫపదమునకు శక్య మగునేభ్రమరపద మున్నదో దానికి మధుపముతో సాక్షాత్సంబంధ ముండుట వలన కేవలలక్షణ సంభవించు చున్నది. తథాపి వ్యాకరణమతమునందు అది సమాసముయొక్క శక్తియై యున్నది. అందువలన ద్విరేఫపదమునకు శక్యము రెండురేఫములతోఁ గూడిన భ్రమరపద మై యున్నది. న్యాయవైశేషికాదిమతము లందు సమాస (సముదాయ) మునకు శక్తి నంగీకరింపలేదు. ఇంకే మనగా సమాససముదాయముయొక్క యే యవయవ మున్నదో దానికి లక్షణావృత్తి చేత నధికార్థము సమాసమునందు ప్రతీత మగుచున్నది. ఎట్లనగా, 'ద్విరేఫ'— ఈ సమాససముదాయ మున్నది. ఆసముదాయమునకు అర్థమునందు శక్తి

లేదు. అచ్చట ద్విత్వసంఖ్యావిశిష్టము ద్విపదమున కర్థమై యున్నది. రేఫత్వజాతివిశిష్టాక్షరము రేఫపదమున కర్థము. ద్విపదముయొక్క శక్యమునకు రేఫపదముయొక్క శక్యమునకును అభేదసంబంధము వాక్యార్థమై యున్నది. ద్విత్వసంఖ్యాసహిత రేఫము అనునర్థము శక్యమై యున్నది. రెండు రేఫములతోఁ గూడిన పదము ద్విరేఫ మనబడును. అది లక్షణావృత్తి నంగీకరించి చెప్పబడినది. అయితే యింత భేద మున్నది. న్యాయవైశేషికమతములయందు వాక్యమునకు లక్షణాంగీకారము లేదు. ఎట్లనగా, శక్యసంబంధమునకు లక్షణ యని పేరు. పదసముదాయరూపవాక్యమునకు ఏయర్థమునందును శక్తి లేదు, అందువలన వాక్యమునకు శక్యము లేనందున శక్యసంబంధ రూప లక్షణ వాక్యమునకు సంభవించుట లేదు. మఱియు నే మనగా పదమునకు లక్షణ యున్నది. ఈమతములందు రేఫపదమునకు రేఫసహితమందు లక్షణ యున్నది. మఱియును మీమాంసకమతమునందును వేదాంతమతమునందును వాక్యమునకు లక్షణాంగీకారమున్నది. వాక్యమునకు లక్షణ నంగీకరించినయెడల యేదోషము చెప్పబడినదో దానికి సమాధానము ఈక్రింద వ్రాయ బడినది.

పదసముదాయము వాక్యమనబడును. ఆసముదాయము ప్రత్యేకముకంటె భిన్నము కాదు. అందువలన పదముయొక్క శక్యమే వాక్యముయొక్క శక్యమై యున్నది, లేదా లక్షణ శక్యసంబంధరూపము కాదు. బోధ్యసంబంధము లక్షణ యనబడుచున్నది. ఎట్లు పదముయొక్క శక్యత శక్తివృత్తిచేత బోధ్యమై యున్నదో అట్లు పరస్పరసంబంధసహిత పదార్థరూపము లేక పదార్థముయొక్క సంబంధరూప వాక్యార్థము కూడ వాక్యబోధ్యమై యున్నది. అందువలన పదబోధ్యసంబంధరూప లక్షణ యెట్లు పదమున కున్నదో అట్లు వాక్యబోధ్యసంబంధరూప లక్షణ వాక్యమున కున్నది. ఈమతమునందు ద్విరేఫసముదాయమునకు రేఫద్వయముతోఁ గూడినపదమునందు లక్షణ. ఈరీతిగా ద్విరేఫపదముచేత లక్షితభ్రమర పదమునకు మధుపమునందు లక్షణ యుండుటవలన లక్షితలక్షణ యనబడును. అదియును లక్షణయం దంతర్భూతమై యున్నది. ఎట్లనగా ద్విరేఫపదమునకు శక్య మైనయేరెండు రేఫము లున్నవో వానికి భ్రమరపదముతో సాక్షాత్సంబంధ మున్నది. మఱియును భ్రమరముతో భ్రమరపదముద్వారా పరంపరాపంబంధ మున్నది. అందువలన శక్యసంబంధరూపలక్షణకంటె లక్షితలక్షణ వేఱు కాదు. వ్యాకరణమతమునందు ద్విరేఫపదమునకు శక్యమైన రెండు రేఫములతోఁ గూడిన

యేభ్రమరపద మున్నదో దానికి భ్రమరముతో సాక్షాత్సంబంధ మున్నది. అందువలన నీయుదాహరణము లక్షితలక్షణకు కాదు, కేవలలక్షణకై యున్నది. లక్షితలక్షణ కుదాహరణ మే మనగా, "సింహో దేవదత్తః." ఈస్థలము నందు సింహముకంటె దేవదత్తు డభిన్నుఁడై యున్నాడు. ఈవాక్యముయొక్క అర్థము పదమునకు శక్తివృత్తిచేత ప్రతీతి యగుచున్నది. అది సంభవించుట లేదు. ఎట్లనగా పశుత్వజాతియును, మనుష్యత్వజాతియును, పరస్పర విరుద్ధములై యున్నవి. రెండును ఒకవ్యక్తియం దుండవు. అందువలన సింహ శబ్దమునకు శూరతా, క్రూరతా, ధర్మవిశిష్టపురుషునియందు లక్షణ. ఆ పురుషునితో సింహ పదశక్యమునకు సాక్షాత్సంబంధము లేనందున కేవలలక్షణ కాదు. మఱియు నే మనగా, శూరతాదికముతో సింహశబ్దముయొక్క శక్యమునకు ఆధేయతాసంబంధ మున్నది. శక్యసంబంధిశూరతాదికమునకు పురుషునియందు ఆశ్రయతాసంబంధ మున్నది. అయిన సింహముయొక్క శూరత్వము పురుషునియొక్క శూరత్వము అభిన్న మని యంగీకరించినప్పుడు సింహముయొక్క శూరత్వమునకు దేవదత్తునియందు అధికరణతాసంబంధ మున్నది. మఱియును రెండుశూరత్వములకును పరస్పరభేద మంగీకరించినయెడల, సింహముయొక్క శూరత్వమునకు పురుషునియందు స్వజాతీయశూరతాధికరణత యున్నది. సింహముయొక్క శూరత్వము స్వశబ్దముయొక్క అర్థము. ఈరీతిగా వాక్యమునకు పరంపరాసంబంధ ముండుటవలన సింహశబ్దమునకు శూరతాదిగుణవిశిష్టమునందు లక్షితలక్షణ యై యున్నది. శక్యముయొక్క పరంపరాసంబంధము లక్షితలక్షణ యనబడును. యద్యపి లక్షితలక్షణాశబ్దముచేత ఉక్తార్థముయొక్క సిద్ధి క్లిష్టమై యున్నది; ఎట్లనగా లక్షితలక్షణాశబ్దమునకు రూఢి శక్యముయొక్క పరంపరాసంబంధముచేత కోశాదిగ్రంథమునందు చెప్పబడలేదు. యోగవృత్తిచేత లక్షణాశబ్దముయొక్క ఉక్తార్థము ప్రతీతి యగుట లేదు. ఎట్లనగా, 'లక్షితస్య లక్షణా, లక్షితలక్షణా' ఈరీతిగా షష్ఠీసమాసము చేసి లక్షిత మనగా లక్షణావృత్తిచేత నది ప్రతీత మగుచున్నదో దానియొక్క లక్షణ లక్షితలక్షణా శబ్దమునకు అర్థ మని సిద్ధించుచున్నది. "ద్విరేఫో రౌతి" "సింహో దేవదత్తః" ఇత్యాదిలక్షితలక్ష్యముయొక్క యేయుదాహరణము చెప్పబడియున్నదో అక్కడ నుక్తస్వరూప మగు లక్షితలక్షణ సంభవించుట లేదు. ఎట్లనగా "ద్విరేఫో రౌతి" ఈవాక్యమునందు ద్విరేఫపదముచేత భ్రమరపదము లక్షితమై దానికి

మధుపమునందు లక్షణ కలిగి ఉక్తార్థమునకు సంభవ మగుచున్నది. ఆరెంపు ఉదాహరణములును సరి కావు. యద్యపి ద్విరేఫపదముయొక్క శక్యసంబంధము భ్రమరపదముతో నున్నది, తథాపి ద్విరేఫపదముతో లక్షితము భ్రమర పదము కాదు. ఎట్లనగా వక్తయొక్క తాత్పర్యమునకు విషయ మైనశక్య సంబంధి లక్షిత మగుచున్నది, కేవలశక్యసంబంధి లక్షితము కాదు. కేవలశక్య సంబంధి లక్షిత మైనయెడల గంగాపదముయొక్క శక్యసంబంధము మీనాదిక మ నేక మున్నది. అదియును గంగాపదముచేత లక్షితము కావలయును. అందువలన వక్తృతాత్పర్యమునకు విషయమైనశక్యసంబంధి లక్షిత మగుచున్నది. గంగాపద శక్యసంబంధు లనేకము లుండినను "గంగాయాం గ్రామః" అనునీవాక్యమునందు శ్రోతకు గంగాపదముచేత తీరబోధ మగుచున్నది. ఇట్లు తాత్పర్య విషయ శక్య సంబంధి కేవలతీరమై యున్నది. అందువలన గంగాపదముచేత తీరమే లక్షితమై యున్నది. మీనాదికము కూడ శక్యసంబంధి యై యున్నది గాని ఉక్తతాత్పర్య మునకు విషయము కాదు. అందువలన గంగాపదముచేత లక్షితము కాదు. ఈరీతిగా ద్విరేఫపదముయొక్క శక్యసంబంధి భ్రమరపదమై యున్నది. అయిన ద్విరేఫపదముచేత భ్రమరపదముయొక్క బోధము శ్రోతకు గలుగుచున్నది. వక్తయొక్క తాత్పర్యవిషయము కాదు. మఱియు నేమనగా ద్విరేఫపదము చేత భ్రమరపదముయొక్క శక్య మయినమధుపముయొక్క బోధము శ్రోతకు కలుగుచున్నది. అది వక్తయొక్క తాత్పర్యవిషయమై యున్నది. అందువలన ద్విరేఫపదముయొక్క శక్యసంబంధియు భ్రమరపదమై యున్నది. వక్తయొక్క ఉక్తతాత్పర్యమునకు విషయము కానందున ద్విరేఫపదముచేత భ్రమరపదము లక్షితము కాదు. మఱియు నేదైన నొకరీతిచేత ద్విరేఫపదముచేత భ్రమర పదము లక్షితమై యున్నది, అని చెప్పినప్పటికిని భ్రమరపదమునకు మధుపము నందు శక్తి యున్నది. అందువలన దానికి లక్షణాకథన మసంగతమై యున్నది. ఈరీతిగా "లక్షితస్య భ్రమరపదస్య లక్షణా లక్షితలక్షణా" ఈరీతిగా షష్ఠీసమా సముయొక్కయర్థము ఉక్తోదాహరణమునందు సంభవింపదు. ఆలాగుననే "సింహో దేవదత్తః" అనెడి యీ యుదాహరణమందును ఉక్తార్థము సంభవించుట లేదు. సింహవృత్తి శూరతాదికము, సింహశబ్దముయొక్క శక్యసంబంధియై యున్నది. అయిన సింహశబ్దముచేత శూరత్వాదికబోధ శ్రోతకు గలుగుచు న్నది. అది వక్తృతాత్పర్యవిషయము కాదు. మఱియు నేమనగా సింహశబ్ద

ముచేత సింహాసదృశపురుషబోధము శ్రోతకు కలుగుచున్నది. అది వక్తృతాత్పర్యవిషయమై యున్నది. అందువలన శక్యసంబాధి యైనను శూరతాదిగుణములు ఉక్తతాత్పర్యవిషయములు కానందున సింహాశబ్దముచేత లక్షితములు కావు, మఱియు నేదైన నొకరీతిగా సింహాశబ్దముచేత శూరత్వాదికము లక్షితమై యంగీకరించినను దానికి లక్షణాకథనము విరుద్ధమై యున్నది. ఎట్లనగా, శక్తి, లేక లక్షణ వర్ణాత్మకశబ్దమున కున్నది. శూరతాదికము గుణమే కాని శబ్దరూపము కాదు. అందువలన దానికి శక్తి, లేక, లక్షణ సంభవింపదు. ఈరీతిగా "లక్షితస్య భ్రమరపదస్య లక్షణా లక్షితలక్షణా" లేక "లక్షితస్య శూరతాదిగుణసముదాయస్య 'లక్షణా లక్షితలక్షణా.' ఈవిధ మైనయర్థము షష్ఠీసమాస మంగీకరించినప్పుడు కలుగుచున్నది. ఈయర్థమునందు శక్యముయొక్క పరంపరాసంబంధముయొక్క బోధము లక్షితలక్షణాశబ్దముచేత కలుగుట లేదు. పూర్వోక్తములగు రెండుదాహరణములందును శక్యముయొక్క పరంపరాసంబంధము మధుపమునందును, లేక, పురుషునియందును ఉన్నది. పూర్వోక్తరీతిగా లక్షితలక్షణాశబ్దముయొక్క యోగార్థము సంభవించుట లేదు. తథాపి, ఈదిగువను వర్ణించురీతిగా లక్షితలక్షణాశబ్దముయొక్క యోగార్థము షష్ఠీసమాసము నంగీకరించినను శక్యముయొక్క పరంపరాసంబంధ మైయే సంభవించుచున్నది. యద్యపి వక్తయొక్క తాత్పర్యవిషయ మైనశక్యసంబంధి లక్షితసంబాధముయొక్క యర్థమై యున్నది. తథాపి భాగత్యాగలక్షణచేత వక్తృతాత్పర్యవిషయము అనెడి యింతభాగమును త్యజించి యిచ్చట "శక్యసంబంధిమాత్రము" లక్షితశబ్దముయొక్క అర్థమై యున్నది. అట్లనె లక్షణాశబ్దముయొక్క అర్థము కూడ శక్యసంబంధియై యున్నది. దానియందు శక్యముయొక్క భాగమును త్యజించి భాగత్యాగలక్షణవలన సంబాధముమాత్రము లక్షణాశబ్దముయొక్క అర్థ మని యంగీకరింపబడియున్నది. అందువలన లక్షిత మనగా "శక్యసంబంధి." లక్షణ యనగా "దానియొక్క సంబంధము" అని లక్షితలక్షణాశబ్దముయొక్క అర్థమై యున్నది. ఈరీతిగా శక్తిసంబంధియొక్క సంబంధము లక్షితలక్షణాశబ్దముచేత యోగవృత్తిచేతనే సిద్ధ మగుచున్నది. లేక, లక్షితశబ్దమునకు శక్యసంబంధియందు భాగత్యాగలక్షణ యున్నది. లేక, లక్షణాశబ్దమునకు శక్యసంబాధి అర్థమై యున్నది. దానికి సంబంధమాత్రమున లక్షణ లేదు. లేక, "లక్షితేన లక్షణా లక్షితలక్షణా" ఈరీతిగా తృతీయాసమాసము నంగీకరించిన టయిన

ముచేత సింహసదృశపురుషబోధము శ్రోతకు కలుగుచున్నది. అది వక్తృతాత్ప ర్యవిషయమై యున్నది. అందువలన శక్యసంబంధి యైనను శూరతాదిగుణములు ఉక్తతాత్పర్యవిషయములు కానందున సింహశబ్దముచేత లక్షితములు కావు, మఱియు నేదైన నొకరీతిగా సింహశబ్దముచేత శూరత్వాదికము లక్షితమై యం గీకరించినను దానికి లక్షణాకథనము విరుద్ధమై యున్నది. ఎట్లనగా, శక్తి, లేక లక్షణ వర్ణాత్మకశబ్దమున కున్నది. శూరతాదికము గుణమే కాని శబ్దరూపము కాదు. అందువలన దానికి శక్తి, లేక, లక్షణ సంభవింపదు. ఈరీతిగా "లక్షి తస్య భ్రమరపదస్య లక్షణా లక్షితలక్షణా" లేక "లక్షితస్య శూరతాదిగుణసము దాయస్య లక్షణా లక్షితలక్షణా." ఈవిధ మైనయర్థము షష్ఠీసమాస మంగీకరిం చినప్పుడు కలుగుచున్నది. ఈయర్థమునందు శక్యముయొక్క పరంపరాసంబంధ ముయొక్క బోధము లక్షితలక్షణాశబ్దముచేత కలుగుట లేదు. పూర్వోక్తము లగు రెం డుదాహరణములందును శక్యముయొక్క పరంపరాసంబంధము మధుపము నందును, లేక, పురుషునియందును ఉన్నది. పూర్వోక్తరీతిగా లక్షితలక్షణా శబ్దముయొక్క యోగార్థము సంభవించుట లేదు. తథాపి, ఈదిగువను వర్ణిం చురీతిగా లక్షితలక్షణాశబ్దముయొక్క యోగార్థము షష్ఠీసమాసము నంగీకరిం చినను శక్యముయొక్క పరంపరాసంబంధ మైయే సంభవించుచున్నది. యద్యపి వక్తయొక్క తాత్పర్యవిషయ మైనశక్యసంబంధి లక్షితసంబంధముయొక్క యర్థ మై యున్నది. తథాపి భాగత్యాగలక్షణచేత వక్తృతాత్పర్యవిషయము అనెడి యింతభాగమును త్యజించి యిచ్చట "శక్యసంబంధిమాత్రము" లక్షితశబ్దము యొక్క అర్థమై యున్నది. అట్లనె లక్షణాశబ్దముయొక్క అర్థము కూడ శక్యసంబం ధియై యున్నది. దానియందు శక్యముయొక్క భాగమును త్యజించి భాగత్యాగ లక్షణవలన సంబంధముమాత్రము లక్షణాశబ్దముయొక్క అర్థ మని యంగీకరింప బడియున్నది. అందువలన లక్షిత మనగా "శక్యసంబంధి." లక్షణ యనగా "దానియొక్క సంబంధము" అని లక్షితలక్షణాశబ్దముయొక్క అర్థమై యున్నది. ఈరీతిగా శక్తిసంబంధియొక్క సంబంధము లక్షితలక్షణాశబ్దముచేత యోగవృత్తి చేతనే సిద్ధ మగుచున్నది. లేక, లక్షితశబ్దమునకు శక్యసంబంధియందు భాగత్యాగ లక్షణ యున్నది. లేక, లక్షణాశబ్దమునకు శక్యసంబంధి అర్థమై యున్నది. దానికి సంబంధమాత్రమున లక్షణ లేదు. లేక, "లక్షితేన లక్షణా లక్షితలక్షణా" ఈరీతిగా తృతీయాసమాసము నంగీకరించిన ట్లయిన ఇష్టార్థసిద్ధి యగుచున్నది.

"లక్షితేన" అనగా "శక్యసంబంధిద్వారా" లక్షణ యనగా శక్యసంబంధము. ఇది లక్షితలక్షణాశబ్దముయొక్క అర్థము. శక్యసంబంధము ఒకప్పుడు సాక్షాత్తుగా నున్నది, మఱియు నొకప్పుడు శక్యసంబంధముద్వారా యున్నది. ద్విరేఫో రౌతి ఇత్యాదిస్థలములయందు ద్విరేఫపదముయొక్క శక్యమయినయే రెండు రేఫము లున్నవో వానికి మధుపమునందు సాక్షాత్సంబంధము లేదు. మఱియు నెట్లనగా శక్యసంబంధి భ్రమరపదమై యున్నది. దానియొక్క సంబంధి మధుపమై యున్నది. అందువలన ద్విరేఫపదమునకు శక్యము లైనయే రెండురేఫము లున్నవో వానికి భ్రమరపదద్వారా మధుపముతో సంబంధ మున్నది. అట్లు సింహశబ్దముయొక్క శక్యసంబంధి యగునేశూరతాదిగుణము లున్నవో వాని ద్వారా సింహశబ్దముయొక్క శక్యసంబంధము శూరతాదిగుణవిశిష్టమునందున్నది. అందువలన సింహశబ్దమున లక్షితము అనగా శక్యసంబంధి యైనయే శూరతాదిగుణ మున్నదో దానిద్వారా లక్షణ యనగా సింహశబ్దముయొక్క సంబంధము పురుషునియం దున్నది. షష్ఠీసమాసము నంగీకరించునెడల లక్షితశబ్దము లేక లక్షణాశబ్దమునందు భాగత్యాగలక్షణ యంగీకరింపవలసినది. మఱియును తృతీయాసమాసము సంగీకరించినప్పుడు లక్షణాశబ్దమునకు ముఖ్యార్థమున్నది. ఒకలక్షితశబ్దమునందు భాగత్యాగలక్షణ నంగీకరింపవలసినది. లేక, లక్షితలక్షణాశబ్దమునందు కర్మధారయసమాస మంగీకరించినప్పుడు లక్షితశబ్దమునకు లక్షణాశబ్దమునకును రెంటికిని ముఖ్యయోగికార్థము సిద్ధించును. భాగత్యాగలక్షణ సంగీకరించుట సంభవించదు. అవయవముయొక్క శక్తిచేత యేశబ్దము తనయొక్క అర్థమును బోధించునో అది యౌగికశబ్ద మనబడును. ఉ. 'పాచకః' ఈశబ్దమునందు 'పచ్' అనెడి యవయవమునకు పాకము అర్థము, 'అక' అనెడి యవయవమునకు కర్త యర్థము. ఈరీతిగా నవయవశక్తిచేత పాకకర్త పాచకశబ్దముయొక్క అర్థమైనందున పాచకశబ్దము యౌగికమై యున్నది. అవయవశక్తికి యోగ మని పేరు. శాస్త్రముయొక్క అసాధారణసంకేతము పరిభాష యనబడును. పరిభాషచేత నర్థబోధక మైనశబ్దము పారిభాషికశబ్ద మనబడును. లక్షితశబ్దమునకు "లక్ష్" "ఇత" అని రెండు అవయవము లున్నవి. లక్ష్ శబ్దముయొక్క అర్థము లక్షణ, ఇతశబ్దముయొక్క అర్థము సంబంధియై యున్నది. అందువలన లక్షణా సంబంధ్యర్థమునకు బోధక మైన లక్షితశబ్దము యౌగికమై యున్నది. అందువలన లక్షణాసహితము లక్షితశబ్దముయొక్క అర్థ

మై యున్నది. అట్లనే, శక్యసంబంధమునకు "లక్షణ" యని పేరు. ఇది శాస్త్రసంకేత మై యున్నది. అందువలన "లక్షణా" శబ్దము పరిభాషచేత శక్యసంబంధరూపార్థబోధక మై యుండుటవలన పారిభాషికమై యున్నది. 'లక్షితా చాసౌ లక్షణా లక్షితలక్షణా' ఇది కర్మధారయసమాసమై యున్నది. "లక్షణసహిత లక్షణ" ఈయర్థము కర్మధారయసమాసముచే సిద్ధించుచున్నది. అసాధారణధర్మము "లక్షణ" మని చెప్పబడును. శక్యసంబంధము లక్షణ యనబడును. అందువలన "లక్షణా" అనుదానికి అసాధారణధర్మము, శక్యసంబంధత్వమై యున్నది. అది దానికి లక్షణమై యున్నది. యద్యపి శక్యసంబంధము సాక్షాత్పరంపరాభేదములవలన ద్విప్రకారకమై యున్నది. మఱియు ననేకస్థలములయందు "శక్యము" నకు సాక్షాత్సంబంధరూపలక్షణ మున్నది. "ద్విరేఫో రౌతి" "సింహో దేవదత్తః" ఇత్యాదిస్థలములందు శక్యమునకు సాక్షాత్సంబంధము లేదు. తథాపి లక్షణకు సాధారణధర్మము శక్యసంబంధత్వమై యున్నది. సంబంధమునందు సాక్షాత్పదము లక్షణయొక్క "లక్షణ" మునందు ప్రవిష్టము కాలేదు. ఎక్కడ శక్యముయొక్క పరంపరాసంబంధ మున్నదో యక్కడ కూడ శక్యసంబంధత్వరూప స్వలక్షణసహిత లక్షణ యున్నది. "గంగాయాం గ్రామః" ఇత్యాద్యుదాహరణములయందు యద్యపి "శక్యము" యొక్క సాక్షాత్సంబంధరూపలక్షణ యున్నది. తథాపి సంబంధమునకు సాక్షాత్త్వము లక్షణయొక్క లక్షణమునందు ప్రవిష్టము కాలేదు. మఱియు నెటుల ననగా, సాక్షాత్పరంపరా సాధారణ సంబంధత్వరూపముతో లక్షణయొక్క లక్షణమునందు సంబంధమాత్రము ప్రవిష్టమై యున్నది దీనికొఱకు "శక్యసంబంధో లక్షణా" అని చెప్పబడి యున్నది, "శక్యసాక్షాత్సంబంధో లక్షణా" యని చెప్పబడలేదు. ఈరీతిగా "లక్షిత" యనగా శక్యసంబంధత్వరూప స్వలక్షణాసహిత మైన "లక్షణా" "లక్షిత లక్షణా" శబ్దముయొక్క అర్థమై యున్నది. అది పరంపరాసంబంధస్థలమునందు సంభవించుచున్నది. యద్యపి "లక్షిత లక్షణా" శబ్దమునకు యుక్తార్థము సాక్షాత్సంబంధస్థలమునందును సంభవించుచున్నది, అచ్చటను గూడ "లక్షితలక్షణా" యని చెప్పవలసి యుండును; తథాపి "లక్షితా + లక్షణా లక్షితలక్షణా." ఇట్లు చెప్పుటకు అభిప్రాయ మే మనగా "శక్యసాక్షాత్త్వ విశిష్ట సంబంధత్వరహితా + కేవలశక్యసంబంధత్వ రూప లక్షణసహితా + లక్షణా"="లక్షిత లక్షణా." ఇందువలన కేవలలక్షణయొక్క సంగ్రహము కలుగనేరదు. ఈరీతిగా కర్మధారయ

సమాసము కొన్ని గ్రంథములయందు నీక్రింద నుదాహరించిన ప్రకారము వ్రాయఁబడి యున్నది.

౪౦. తృతీయ మగుశబ్దముయొక్క గౌణవృత్తి నిరూపణము.

"సింహో దేవదత్తః" ఇత్యాది వాక్యములయందు "సింహాది" శబ్దము "గౌణీ"వృత్తిచేత "పురుషాదికమునకు" బోధకమై యున్నది. ఎట్లు "శక్తి" లేక "లక్షణా" పదముయొక్క వృత్తియై యున్నదో అట్లు మూఁడవది "గౌణీ" వృత్తి యున్నది. పదముయొక్క "శక్యార్థము" నందు ఏ గుణ మున్నదో తద్గుణసహిత మగు నశక్య మైన యర్థమునందు పదమునకు "గౌణీ" వృత్తి యని చెప్పబడును. ఉ. సింహపదముయొక్క "శక్య" మునందు శూరతాదిగుణము ఉన్నది. దానితోఁగూడిన "సింహ" పదమునకు అశక్య మైన యే పురుషు మన్నాఁడో వానియందు "సింహ" శబ్దమునకు "గౌణీ" వృత్తి యున్నది. అది పూర్వప్రకారముగా "లక్షణ" యం దంతర్భూతమై యున్నది.

౪౧. చతుర్థ మగు వ్యంజనావృత్తియొక్క నిరూపణము.

మఱియును నాలుగవది యగు "వ్యంజనా" వృత్తి అలంకారగ్రంథముల యందు వ్రాయఁబడియున్నది. అందులకు ఉదాహరణము: శత్రుగృహమునందు భోజననిమిత్తమై ప్రవృత్తుఁ డగు పురుషుని గూర్చి మఱియొక ప్రియపురుషుఁడు చెప్పుచున్నాఁడు "విషం భుంక్ష్వ." ఇచ్చట విషమును భుజింపుము అని శక్తివృత్తిచేత వాక్యమునకు నర్థ మగుచున్నది మఱియును భోజనముయొక్క అభావమునందు వక్తయొక్క తాత్పర్య మున్నది. ఆ భోజనమునందును "శక్తి" సహితపదమునకు అభావమునందును సంబంధముయొక్క యభావముచేత "లక్షణ" కూడ సంభవింపదు. అందువలన శత్రుగృహమునందుండి భోజన నివృత్తియు వాక్యముయొక్క "వ్యంగ్యార్థమై" యున్నది. "వ్యంజనా" వృత్తి చేత నేయర్థము ప్రతీత మగుచున్నదో యది వ్యంగ్యార్థ మనబడును. అన్యోదాహరణము: సంధ్యాకాలమునందు అనేక పురుషులకు అనేక కార్యములయందు ప్రవృత్తినిమిత్తమై యొకానొక పురుషునిచేత "సూర్యోఽస్తం గతః" అను నీవాక్య ముచ్చరింపబడినది. దానిని విని యనేకులు పురుషులు ఆకాలమునందు తమతమయొక్క కర్తవ్యములను దెలిసికొని ప్రవృత్తు లైనారు. అచ్చట ననేక పురుషులకు వివిధకర్తవ్యతాబోధము "వ్యంజనా" వృత్తిచేత కలుగుచున్నది. ఈరీతిగా "వ్యంజనా" వృత్తికి అనేకోదాహరణములు "కావ్యప్రకాశ"

"కావ్యప్రదీపా"ది గ్రంథములయందు "మమ్మటభట్ట" "గోవిందభట్టా" దులచేత వ్రాయబడి యున్నవి. ఆ యనేకోదాహరణములు "శృంగారరస" సంబంధము లైనందున నిచట వ్రాయ నవసరము లే దని విరమించితిమి.

న్యాయగ్రంథమునందు "వ్యంజనా" వృత్తికిని "లక్షణా" వృత్తియందు నంతర్భావము చెప్పంబడియున్నది. మఱియు నేయాలంకారికులు ఈక్రింద నుదాహరించిన ప్రకారము చెప్పునో—" శక్య " సంబంధి యైన యర్థము నకు "లక్షణా" వృత్తిచేత బోధ మగుచున్నది, మఱియును శక్యార్థముయొక్క సంబంధి యైన యర్థమునందు "లక్షణ" సంభవించుట లేదు, దానికి శబ్దము చేత ప్రతీతికొఱకు వ్యంజనావృత్తి నంగీకరింపవలసియున్నది, అని; వానికి చెప్పు సమాధాన మే మనగా, సాక్షాత్పరంపరాభేదములతో సంబంధమది ద్విప్రకార మై యున్నది. దానియందు సాక్షాత్సంబంధము పరస్పర మొక్కదానికే కలుగు చున్నది. అన్నిటికిని కలుగదు. మఱియును పరంపరాసంబంధము సర్వపదార్థము నకు పరస్పరము సంభవించుచున్నది, విస్తరించి చెప్పవలసిన దేమి యున్నది ? గోత్వమునకును, అశ్వత్వమునకును, పరస్పరవ్యధికరణతాసంబంధ మున్నది. ఘటాభావఘటములు, పరస్పరవిరోధియై యున్నవి. ఆఘటాభావమునకు గూడ ఘటమునందు ప్రతియోగితాసంబంధ మున్నది. ఘటమునకు తనయొక్క యభావ మునందు"స్వవృత్తిప్రతియోగితా నిరూపకతాసంబంధ" మున్నది. ఈరీతిగా సర్వ పదార్థంబులకును దమతో గూడ పరంపరాసంబంధము సంభవించుచున్నది. అందువలన వ్యంగ్యార్థము కూడ శక్యసంబంధి యైనందున లక్ష్యమునం దంత ర్భూతమై యున్నది. మఱియును " వ్యంజనా " వృత్తియొక్క ప్రతిపాదనము "కావ్యప్రకాశిక"యందును దానిటీకయందును, "జయరామభట్టాచార్యాదుల" చేత వ్రాయబడియున్నది. అట్లే " కావ్యప్రదీపమందును" దానిటీక యగు "ఉద్యో తనము" నందును "నాగోజీ" భట్టులచేత వ్రాయబడినది. దానిఖండనము కూడ న్యాయగ్రంథమునందును వ్రాయబడియున్నది. మఱియును వ్యాకరణగ్రంథము నందు కొన్నిచోట్ల ఖండనము వ్రాయబడియున్నది. కొన్నిచోట్ల ప్రతిపాదనము వ్రాయబడియున్నది. అద్వైతసిద్ధాంతమునందు ఖండనముయొక్క గాని ప్రతి పాదనముయొక్క గాని దురాగ్రహము లేదు. అందువలన ప్రతిపాదనముయొక్క రీతిమాత్రమే తెలియవలసి యున్నది.

### ౭౨. లక్షణాభేదకథనము.

“శక్తి” యనియును “లక్షణ” యనియును రెండువృత్తులు సర్వమతములందు నున్నవి. మఱియును, మహావాక్యముయొక్క యర్థనిరూపణమందును గూడ నారెంటికే యుపయోగ మున్నది. దానిలో “శక్తి” నిరూపణము చేయబడియున్నది. మఱియును “శక్యము” యొక్క సాక్షాత్సంబంధము, లేక, పరంపరాసంబంధముయొక్క భేదమువలన “కేవలలక్షణ” “లక్షితలక్షణ” యని లక్షణ ద్వివిధమై యున్నది. మఱియు నా లక్షణ (౧) “జహల్లక్షణ,” (౨) “అజహల్లక్షణ,” (౩) “భాగత్యాగలక్షణ” యనుభేదములచేత త్రిప్రకారమై యున్నది. ఎచ్చట శక్యముయొక్క ప్రతీతి కలుగుట లేదో కేవలశక్యసంబంధి ప్రతీతి కలుగుచు నున్నదో అచ్చట (౧) “జహల్లక్షణ” యున్నది. ఉదాహరణము “విషం భుంక్ష్వ.” ఈస్థలమునందు శక్య మైనయేవిషభోజన మున్నదో దానిని త్యజించి శక్యసంబంధి యైన భోజననివృత్తికి ప్రతీతి కలుగుటవలన “జహల్లక్షణ” యున్నది. యద్యపి, యెచట శక్యార్థముయొక్క సంబంధము సంభవించుట లేదో అచట “అజహల్లక్షణ” యంగీకారము. ఉదాహరణము: “గంగాయాం గ్రామః.” ఈస్థలమునందు పదముయొక్క శక్యార్థమునకు పరస్పర సంబంధము సంభవించుట లేదు. మఱియును “విషం భుంక్ష్వ” యనెడి స్థలమునందు శక్యార్థముయొక్క అన్వయము సంభవించుచున్నది. విషము మరణమునకు హేతు వయ్యు నున్నది. ఆభోజనమునందును విషమునకు నన్వయము సంభవించుచున్నది. తథాపి, అన్వయానుపపత్తి “లక్షణ” యందు బీజము కాదు, మఱియు నే మనగా, తాత్పర్యానుపపత్తి లక్షణయందు బీజమై యున్నది. ఇది గ్రంథమునందు వ్రాయబడియున్నది. దానియభిప్రాయ మే మనగా, అన్వయ మనగా శక్యార్థముయొక్క సంబంధము, దానికి అనుపపత్తి యనగా అసంభవము, ఇది యెచ్చట నున్నదో యచ్చట “లక్షణ” యున్నది; అని యీనియమము లేదు. ఈనియమము నంగీకరించినయెడల “యష్టీః ప్రవేశయ” ఈ వాక్యమునందు “యష్టి” పదమునకు “యష్టిధరునియందు లక్షణ కాకపోవలెను, ఏల యనగా, “యష్టి” పదముయొక్క శక్యమునకు ప్రవేశమునందు నన్వయము సంభవించుచున్నది. అందువలన తాత్పర్యానుపపత్తి “లక్షణా” బీజమై యున్నదే గాని అన్వయానుపపత్తి కాదు. తాత్పర్య మే మనగా, వక్తయొక్క ఇచ్ఛ, దానికి అనుపపత్తి యనగా, శక్యార్థమునం దసంభవము, “లక్షణ” యని

యంగీకరించుటకు "బీజము" అనగా హేతువై యున్నది. "యష్టీః ప్రవేశయ" అను నీవాక్యమునందు తాత్పర్యానుపపత్తి యున్నది. ఎట్లన, యష్టిగ్గొక్క ప్రవేశ మయిన యేశక్యార్థ మున్నదో దానియందు వక్తయొక్క తాత్పర్యవిషయమైన భోజనముయొక్క యన్వయము సంభవించుట లేదు. అందువలన యష్టి పదమునకు "యష్టిధరపురుషుని" యందు "లక్షణ" యై యున్నది. అట్లే, మరణహేతు వైనవిషభోజనమునందు నితని తాత్పర్యము లేదు. అందువలన భోజననివృత్తియందు "జహల్లక్షణ" యున్నది. "గంగాయాం గ్రామః"—ఈస్థానమునందు తాత్పర్యానుపపత్తి కూడ నున్నది. అందువలన నెచ్చట తాత్పర్యానుపపత్తి యున్నదో అచ్చట "లక్షణ" నంగీకరింపవలసియున్నది; అని నియమము సిద్ధించుచున్నది. "గంగాయాం గ్రామః"—ఈస్థానమునందును "గంగా పదముయొక్క" శక్య మైన యేదేవనదీప్రవాహ మున్నదో దానిని త్యజించి శక్యసంబంధి యయిన తీరమునకు ప్రతీతి యగుచున్నది. అందువలన "జహల్లక్షణ" సిద్ధించుచున్నది. ఎచట సామాన్యతీరబోధమునందు వక్తయొక్క తాత్పర్యము కాదో మఱియు నే మనగా గంగాతీరముయొక్క బోధమునందు వక్తృతాత్పర్య మున్నదో అచట "గంగా" పదమునకు గంగాతీరమునందు "అజహల్లక్షణ" యని సిద్ధించుచున్నది. "అజహల్లక్షణకు" అసాధారణోదాహరణము "కాకేభ్యో దధి రక్ష్యతామ్" ఇత్యాదిక మై యున్నది. సహితశక్యా సంబంధికి ఎచట ప్రతీతి యగుచున్నదో అచట "అజహల్లక్షణ" సిద్ధించుచున్నది. భోజనముకొఱకు దధిరక్షణమునందు వక్తృతాత్పర్య మున్నది. అది బిడాలాదికము చేత గూడ దధిరక్షణము చేయబడనియెడల (వక్తృతాత్పర్యము) సంభవింపదు. అందువలన "కాక" పదమునకు దధ్యుపఘాతుకమునందు "అజహల్లక్షణ" సిద్ధించుచున్నది. ఈరీతిగా "ఛత్రిణో యాంతి"—ఈస్థలమునందు "ఛత్రి" పదమునకు ఛత్రిసంయుక్త మగు నొకసముదాయమునందు "అజహల్లక్షణ" యున్నది. న్యాయమతమునందు "నీలాది" పదమునకు గుణమాత్రమునందు శక్తి యున్నది. "నీలో ఘటః" ఇత్యాదివాక్యమునందు నీలరూపసహితమునకు "లక్షణ" చేత బోధకము "నీల" పదమై యున్నది. అచ్చట శక్యసహితసంబంధికి ప్రతీతి యగుచున్నది. అందువలన "నజహల్లక్షణ" సిద్ధించుచున్నది. మఱియును కోశకారునియొక్క మతమునందు "నీలాది" పదము లాక్షణిక మై యున్నది. అచ్చట శక్యసహితసంబంధికి ప్రతీతి యగుచున్నది. అందువలన "అజహల్ల

తుణ” సిద్ధించుచున్నది. మఱియును కోశకారునియొక్క మతమునందు “నీలా ది” పదమునకు “గుణ” మందును “గుణి” యందును శక్తి యున్నదే కాని లక్షణ లేదు. వేదాంతపరిభాషాగ్రంథమునందు “నీలా” దిపదమునకు గుణి యందు అజహల్లక్షణ చెప్పబడియున్నది. అది న్యాయమతమై యున్నది. మఱి యును, శక్యార్థముయొక్క యేకదేశమును త్యజించి యేకదేశముయొక్క బోధ మునందు వక్తకు తాత్పర్య ముండునప్పుడు భాగత్యాగలక్షణ యగుచున్నది. ఉ. “సోఽయం దేవదత్తః” ఈస్థలమునందు భాగత్యాగలక్షణ యున్నది. ఇచ్చట పరోక్షవస్తువు తత్పదముయొక్క అర్థమై యున్నది. మఱియును అపరోక్షవస్తువు ఇదంపదముయొక్క అర్థమై యున్నది. దకారాదివర్ణవిశిష్ట నామసహిత పురుష శరీరము దేవదత్తపదముయొక్క అర్థమై యున్నది. తత్పదార్థమునకు ఇదంపదార్థ ముతో నభేదము తత్పదోత్తరవిభక్తియొక్క అర్థమై యున్నది. ఇదంపదార్థ మునకు దేవదత్త పదార్థముతో నభేదము ఇదంపదోత్తరవిభక్తియొక్క యర్థమై యున్నది. అథవా తత్పదముకంటె లేక ఇదంపదముకంటె ఉత్తరమం దుండెడి విభక్తియు నిరర్థకమై యున్నది. సమానవిభక్తి సహితపదముయొక్క సన్నిధాన ముచేత పదార్థమునకు అభేదము ప్రతీత మగుచున్నది. అందువలన పరోక్షవస్తువు కంటె నభిన్నమైన యపరోక్షవస్తుస్వరూపము దేవదత్తనామవిశిష్ట శరీర మై యున్నది. ఇది పదముయొక్క శక్యార్థమై యున్నది. అది ఉష్ణము శీతల మై యున్నది యనుదానివలె బాధితమై యున్నది. బాధితార్థమునందు వక్తయొక్క తాత్పర్యము సంభవింపదు. అందువలన తత్పదేదంపదములయొక్క శక్యమునం దుండెడి పరోక్షతాపరోక్షతాభాగములను త్యజించి వస్తుభాగమునందు లక్షణ యుండుటవలన భాగత్యాగలక్షణ సిద్ధించుచున్నది. ఈరీతిగా లక్షణ త్రివిధమై యున్నది. మఱియును లక్షణ, (౧) “ప్రయోజనవల్లక్షణ,” (౨) “నిరూఢలక్షణ” యను భేదముచేత ద్విప్రకారకమై యున్నది. ఎక్కడ శక్తిసహిత పదమును త్యజించి లాక్షణికశబ్దప్రయోగమునందు ప్రయోజనము (ఫలము) ఉన్నదో అది “ప్రయోజనవల్లక్షణ” యనబడును. ఉ. గంగాపదమునకు తీరమునందు ప్రయో జనవల్లక్షణ యగుచున్నది. “తీరే గ్రామః” ఇట్లు చెప్పినయెడల తీరమునందు శైత్య పావనతాదికమునకు ప్రతీతి కలుగుట లేదు. గంగాపదముచేత తీరముయొక్క బోధమును చేయగా గంగయొక్క ధర్మమైనశీతపావనతాదికము తీరమునందు ప్రతీత మగుచున్నది. దీనికొఱకు “వ్యంజనా” వృత్తిని ఆలంకారికులు అంగీక

ఱించుచున్నారు. న్యాయమతమునందు శీతపావనతాదికము శాబ్దబోధమునకు విషయము కాదు. మఱియు నే మనగా అనుమితికి విషయమై యున్నది. ఎట్లనగా—గంగాతీరమ్ శీతపావనత్వాదిమత్, గంగాపదబోధ్యత్వాత్ గంగావత్; అనియిది అనుమాన మై యున్నది. సర్వథా ప్రయోజనవల్లక్షణ యై యున్నది. మఱియును పదమునకు ఏయర్థమునందు శక్తివృత్తి సంభవించుట లేదో శక్యమువలె నేయర్థముయొక్క ప్రతీతి యేపదముచేత ఎల్లవారికి ప్రసిద్ధ మై యున్నదో ఆయర్థమునందు ఆపదమునకు ప్రయోజనశూన్యలక్షణ "నిరూఢలక్షణ" యనబడును. ఉ. "నీలా " ది పదమునకు కోశరీతిచేత గుణగుణులయందు శక్తిని అంగీకరించునెడల గౌరవదోష మున్నది మఱియును శక్యతావచ్ఛేదక మయిన యేకైకధర్మమునకు లాభము సంభవించుట లేదు. అందువలన గుణమాత్రమునందు శక్తి యున్నది. మఱియును "నీలో ఘటః" ఇత్యాదివాక్యమును విని సర్వపురుషులకు గుణికి ప్రతీతి యత్యంతప్రసిద్ధమై యున్నది. అందువలన నీలాది పదమునకు గుణియందు ప్రయోజనశూన్యలక్షణ యుండుటవలన "నిరూఢలక్షణ" యై యున్నది. "నిరూఢలక్షణ" శక్తిసదృశ మై యున్నది. ఒకానొక విలక్షణ మగు ననాది తాత్పర్య ముండినప్పుడు "నిరూఢలక్షణ" సిద్ధించుచున్నది. మఱియు నెక్కడ ప్రయోజనము, అనాదితాత్పర్యమును రెండును లేవో గ్రంథకారులు తమయిచ్ఛచేత లాక్షణిక శబ్దముయొక్క ప్రయోగమును ప్రయోజనము లేకయే చేయుచున్నారో అచ్చట మూడవదియగు నైచ్ఛికలక్షణ సిద్ధించుచున్నది. అయిన అనాదితాత్పర్యము ప్రయోజనము లేకయే లాక్షణిక శబ్దముయొక్క ప్రయోగమును విద్వాంసులు మంచి దని యంగీకరించుట లేదు. ఈకారణముచేత కావ్యప్రకాశాదిసాహిత్య గ్రంథమునందు, "నిరూఢలక్షణ" యొక్కయు "ప్రయోజనవల్లక్షణ" యొక్కయు భేదము ఉదాహరణసహితముగా వ్రాయబడియున్నది. "ఐచ్ఛికలక్షణ" వ్రాయబడలేదు. గదాధరభట్టాచార్యులచేత "నైచ్ఛికలక్షణ" వ్రాయబడియున్నది. వారియొక్క తాత్పర్యము "ఐచ్ఛికలక్షణ" యొక్క సంభావనయం దున్నది. మఱియును "ఐచ్ఛికలక్షణా" సహితపదముయొక్క ప్రయోగము సాధువై యున్నది. ఈయర్థమునందు తాత్పర్యము లేదు. లక్షణయొక్క యవాంతరభేదము మమ్మటభట్టాదికులచేత బహుధా వ్రాయబడి యున్నది. అయినను వేదాంతగ్రంథములం దెచ్చ

టను వ్రాయబడలేదు. అందువలన జిజ్ఞాసువునకు దానియొక్క లేఖనప్రయోజనము లేదు.

౮౩. శాబ్దబోధముయొక్క హేతుత్వవిచారము.

ఎట్లు శక్యతావచ్ఛేదకమునందు శక్తి యున్నదో అట్లు లక్ష్యతావచ్ఛేదకమయినతీరత్వాదికమునందు గంగాపదముయొక్క లక్షణ లేదు. మఱియు నే మనగా వ్యక్తిమాత్రము నందు లక్షణావృత్తి యున్నది. మఱియును పదముయొక్క వృత్తి లేకయే లక్ష్యతావచ్ఛేదకమునకు స్మృతియును, శాబ్దబోధమును కలుగుచున్నవి. ఈవిషయము శబ్దార్థనిర్ణాయక మైన గ్రంథమునందు వ్రాయబడి యున్నది. మఱియును మీమాంసకమతమునందు లాక్షణికశబ్దముచేత లక్ష్యార్థముయొక్క స్మృతి కలుగుచున్నది. లక్ష్యార్థముయొక్క శాబ్దబోధమునకు హేతువు లాక్షణికపదము కాదు. మఱియు నే మనగా లాక్షణికపదముయొక్క సమీపమునం దుండు నేయుత్తరపద మున్నదో అది తనయొక్క శక్యార్థముయొక్క శాబ్దబోధమునకును, లక్ష్యార్థముయొక్క శాబ్దబోధమునకును హేతువై యున్నది. ఉ. "గంగాయాం గ్రామః." ఈవాక్యము నందు గంగాపదము తీరమునందు లాక్షణికమై యున్నది. అది తీరస్మృతికి హేతువై యున్నది. మఱియును తీరవిషయశాబ్దబోధమునకు హేతువు కాదు. మఱియు నే మనగా, తీరవిషయకశాబ్దబోధమునకు హేతువు, తనయొక్క శక్యవిషయశాబ్దబోధమునకును హేతువు గ్రామపదమై యున్నది. ఈమతమునకు సాధక మయినయుక్తియే దనగా, లాక్షణికశబ్దమునకు శాబ్దబోధజనకత్వము నంగీకరించినయెడల సకలశాబ్దబోధజనకతావచ్ఛేదకధర్మమునకు లాభము లేకపోవలయును. ఎట్లనగా, మీమాంసకమతమునందు శాబ్దబోధజనకత లాక్షణికపదమునందు లేదు. శక్తపదమునం దున్నది. అందువలన శాబ్దబోధజనకతావచ్ఛేదకము శక్తి యైయున్నది. లాక్షణికపదమునకు కూడ శాబ్దబోధజనకత్వము నంగీకరించినయెడల ఆజనకత్వముకంటె శక్తియు న్యూనవృత్తి యైనందున దానికి అవచ్ఛేదకత్వము కాకపోవలయును. న్యూనదేశవృత్తి గాని, అధికదేశవృత్తి గాని యేది కాదో దేనియొక్క సమానదేశవృత్తి యేది యున్నదో దానియొక్క అవచ్ఛేదకము అదియగుచున్నది. శాబ్దబోధజనకత సకలశక్యపదమునం దున్నది. దానియొక్క సమానదేశమునందు శక్తి యున్నది. అందువలన శాబ్దబోధజనకతావచ్ఛేదకము శక్తి యగుచున్నది. లాక్షణికపదమునందును శాబ్దబోధజనకత్వము నంగీకరించిన

మొడల లాక్షణికపదమునందు శక్తి లేదు, శాబ్దబోధజనకత యున్నది. అందువలన న్యూనదేశవృత్తి యైనందున శక్తి శాబ్దబోధజనకతావచ్ఛేదకము కాదు. మఱియును శక్తలాక్షణిక ములైన రెంటుపదములం దుండెడి యేకధర్మము లేదు. అందువలన శాబ్దబోధజనకత నిరవచ్ఛేదకము కావలయును. ఆ నిరవచ్ఛేదకజనకత యలీకమై యున్నది. దండకులాలాదికమునందు ఘటాదిజనకతయొక్క అవచ్ఛేదకము దండత్వకులాలత్వాదిక మై యున్నది. అందువలన నిరవచ్ఛేదకజనకతయు అప్రసిద్ధ మై యున్నది. ఈరీతిగా లాక్షణికపదమునకు శాబ్దబోధజనకత్వము లేదు. ఇది మీమాంసకమత మై యున్నది. అద్వైతమతమునకు అది విరోధి యై యున్నది. ఎట్లనగా, మహావాక్యమునందు సకలపదములు లాక్షణికములై యున్నవి. దానివలన శాబ్దబోధమునకు అనుపపత్తి కావలయును. ఈమతముయొక్క ఖండన మవశ్యము కర్తవ్య మై యున్నది. దానియందు దోష మే మనగా "గంగాయాం గ్రామః" అను నీవాక్యమునందు గ్రామపదముచేత తీరవిషయకబోధమును అంగీకరించు నెడల గ్రామపదమునకు తీరమునందును శక్తి కావలయును. ఎట్లనగా ఏపదము లక్షణ లేకయే యే యర్థవిషయకశాబ్దబోధజనకమయి యున్నదో ఆపదమున కాయర్థమునందు శక్తి యున్నది అను నీ నియమ మున్నది. మీమాంసకమతమునందు గ్రామపదము లక్షణ లేకయే తీరవిషయకశాబ్దబోధమునకు జనకమైనందున తీరమునందు శక్తి నంగీకరింపవలసివచ్చును. ఏపదమునం దేయర్థముయొక్క వృత్తి యున్నదో ఆపదముచేత ఆయర్థముయొక్క స్మృతి యగుచున్నది. ఆయర్థముయొక్క శాబ్దబోధము కూడ ఆపదముచేత కలుగుచున్నది, అని మఱియు నొకనియమము. మీమాంసకమతమునందు ఈనియమమునకు భంగము కలుగవలయును. ఎట్లనగా మీమాంసకమతమునందు గంగాపదమునకు తీరమునందు లక్షణావృత్తి యున్నది. తీరమునకు స్మృతియును, శాబ్దబోధమును గంగాపదముచేత కలుగుట లేదు. తీరవిషయకశాబ్దబోధము గ్రామపదముచేత కలుగుచున్నది. ఆగ్రామపదమునకు తీరమునందు శక్తి యైనను లక్షణావృత్తి యయినను లేదు. గ్రామపదముచేత తీరవిషయకస్మృతియును లేదు. అందువలన నీమతము బుద్ధిమంతులకు పరిహాసయోగ్యమై యున్నది. మఱియును గ్రామపదముచేత తీరవిషయకశాబ్దబోధము నంగీకరించు నెడల గ్రామవిషయకశాబ్దబోధము కాకపోవలయును. ఎట్లనగా నెచ్చట హర్యాద్యేకపదమునకు అనేకార్థము లందు శక్తి యున్నదో అక్కడను కూడ ఏకకాలమునందు ఏకపురుషు

నక్షు హరిపదముచేత ఏకార్థముయొక్క బోధ మగుచున్నది. అనేకార్థములకు ఏకపదముచేత బోధము నంగీకరించునెడల, హరి యని చెప్పుటవలన గగనమధ్యమునందు సూర్యుఁ డున్నాడు, అని ఈరీతిగా శాబ్దబోధము కావలయును. ఎట్లు ఒక గ్రామపదముచేత పరస్పరసంబంధు లయిన గ్రామతీరములయొక్క శాబ్దబోధము కలుగుచున్నదో అట్లు ఏకహరిపదముచేత పరస్పరసంబంధు లయిన వానర సూర్యులయొక్క శాబ్దబోధము కూడ కావలయును. దీనియం దొకశంక. ఏక పదముచేత రెండుశక్యములయొక్క శాబ్దబోధము కలుగుట లేదు. ఆ యేకపదముచేత తనయొక్క శక్యముయొక్క మఱియును అశక్యాలక్ష్యములయొక్క సంబంధవిషయకశాబ్దబోధ మత్యంతదూర మై యున్నది. అందువలన "లాక్షణికం నానుభావకం" అను మీమాంసకవచనము అసంగతమై యున్నది. లాక్షణికశబ్దమునకు శాబ్దానుభవజనకతయందు శాబ్దబోధజనకతావచ్ఛేదకము సంభవింపదు, అని యేదోషము చెప్పబడియున్నదో, దానికి సమాధానము ఈదిగువ నుదాహరింప బడుచున్నది. శబ్దమునందు శక్తిలక్షణలయొక్క భేదముచేత రెండువృత్తు లున్నవి. ఒకప్పుడు అర్థముయొక్క శక్తివృత్తి యున్నది. ఒకప్పుడు అర్థమునకు లక్షణావృత్తి యున్నది. శాబ్దబోధజనకత శబ్దమాత్రమునం దున్నది, వృత్తియు శబ్దమాత్రమునం దున్నది. అందువలన ఆజనకతయొక్క సమానదేశమునం దుండుటవలన వృత్తిజనకతావచ్ఛేదకమై యున్నది. లేక శాబ్దబోధజకతావచ్ఛేదకయోగ్యము శబ్దత్వమై యున్నది. ఈరీతిగా లాక్షణిక పదముచేతను శాబ్దబోధము కలుగుచున్నది.

౪౪. మహావాక్యమునందు లక్షణయొక్క ఉపయోగము. దాని యందు గల శంకాసమాధానములు.

మహావాక్యమునందు "జహల్లక్షణ" "అజహల్లక్షణ" యను లేవు. "భాగత్యాగలక్షణ" యున్నది. దానిక్రమము విచారసాగరమునందు వ్రాయబడియున్నది. మహావాక్యమునందు "లక్షితలక్షణ" లేదు. "కేవలలక్షణ" యున్నది. లక్ష్యమైనచేతనముతో వాచ్యమునకు సాక్షాత్సంబంధ మున్నది, పరంపరాసంబంధము లేదు. ఎచ్చట "భాగత్యాగలక్షణ" యున్నదో అచ్చట వాచ్యముయొక్క యేకదేశము లక్ష్యమై యున్నది. ఆ వాచ్యముయొక్క యేకదేశముతో వాచ్యమునకు సాక్షాత్సంబంధ మున్నది. అందువలన "కేవల లక్షణ" సిద్ధించుచున్నది. మఱియును మహావాక్యముచేత జిజ్ఞాసువునకు అఖండ

బ్రహ్మవిషయకబోధము కావలయు నని ఈశ్వరునియొక్క యనాదితాత్పర్యమై యున్నది. అందువలన "నిరూఢలక్షణ" యున్నదే కాని "ప్రయోజనవల్లక్షణ" సిద్ధింపదు. ఇచ్చట నొకశంక. "వాక్యార్థమునకు లక్ష్యచేతనముతో సంబంధము నంగీకరించినప్పుడు లక్ష్యార్థమునం దుండునసంగతమునకు హాని సంభవింపవల యును. సంబంధము నంగీకరింపనియెడల లక్షణ సంభవింపదు. శక్యసంబంధము లేక బోధ్యసంబంధము లక్షణ యని చెప్పబడుచున్నది.అది అసంగమందు సంభవింపదు."

దీనికి సమాధానము.

వాచ్యార్థమునందు చేతనము, జడము అని రెండుభాగము లున్నవి. ఆచేతనభాగమునకు లక్ష్యార్థమునందు తాదాత్మ్యసంబంధము ఉన్నది. సకల పదార్థమునకు స్వరూపమునందు తాదాత్మ్యసంబంధము ఉన్నది. • వాచ్యభాగ మయినచేతనముయొక్క స్వరూపమే లక్ష్యచేతన మై యున్నది. అందువలన వాచ్యమునం దుండెడిచేతనభాగమునకు లక్ష్యచేతనమునందు తాదాత్మ్యసంబంధ మున్నది. వాచ్యమునం దుండుజడభాగమునకు లక్ష్యచేతనముతో నధిష్ఠానతా సంబంధ మున్నది. కల్పితముయొక్కసంబంధముచేత అధిష్ఠానస్వభావము చెడదు. మఱియును తనయొక్క తాదాత్మ్యసంబంధముచేత స్వభావమునకు హాని కలుగ నేరదు. అందువలన లక్ష్యార్థముయొక్క యసంగత్వము చెడలేదు. మఱియు నొక శంక. తత్పదమునకు నఖండచేతనమునందు లక్షణ నంగీకరించి త్వంపదమునకును అఖండచేతనమునందు లక్షణ నంగీకరించినయెడల పునరుక్తిదోషము సంభవిం చుటవలన 'ఘటో ఘటః' అనువాక్యమువలె వాక్య మప్రమాణము కావలయును. రెండుపదములకు లక్ష్యార్థము నంగీకరింపనియెడల అభేదబోధకత లేకపోవల యును. సమాధానము. మాయావిశిష్టము, అంతఃకరణవిశిష్టము, తత్పద త్వం పదములయొక్క శక్యములై యున్నవి; ఉపహితము లక్ష్యమై యున్నది. బ్రహ్మ చేతనము రెండుపదములయొక్క లక్ష్య మైనప్పుడు పునరుక్తిదోషము సంభ వించును. ఆబ్రహ్మచేతనము లక్ష్యము కాదు, మఱియు నే మనగా, మాయోప హితము, అంతఃకరణోపహితము, లక్ష్యమై యున్నవి. అది ఉపాధిభేదమువలన భిన్నమై యుండుటవలన పునరుక్తి లేదు. మఱియును ఉపహితము లైన రెంటికిని పరమార్థముగా నభేద మున్నది. అందువలన వాక్యమునకు అభేదబోధకత్వము సంభవించు చున్నది. ఈరీతిగా తత్పదార్థ త్వంపదార్థములకు ఉద్దేశ్య విధేయ భావము నంగీకరించి అభేదబోధకత్వము నిర్దోష మై యున్నది. తత్పదార్థము

నందు పరోక్షతాభ్రమనివృత్తికొఱకు తత్పదార్థము నుద్దేశించి త్వంపదార్థత్వము విధేయముగా నున్నది. త్వంపదార్థమునందు పరిచ్ఛిన్నతాభ్రమనివృత్త్యర్థము త్వంపదార్థము నుద్దేశించి తత్పదార్థత విధేయముగా నున్నది. మఱియును పునరుక్తియొక్క పరిహారార్థమై కొందఱు గ్రంథకారులయొక్క తాత్పర్య మే మనగా, రెంకుపదములకును భిన్నభిన్నలక్షకత నంగీకరించునెడల పునరుక్తిశంక కలుగుచున్నది. ఆ వేఱు వేఱు లక్షకత లేదు. మీమాంసకరీతిగా రెండుపదములు చేరి అఖండబ్రహ్మమునకు లక్షకమై యున్నవి. దీనికొఱకు ప్రాచీనాచార్యులచేత మహావాక్యమునకు ప్రాతిపదికార్థమాత్రము బోధకత్వము చెప్పబడియున్నది. యద్యపి, ఉద్దేశ్య విధేయభావశూన్య మయిన యర్థమునకు బోధక మయిన వాక్యము లోకమునం దప్రసిద్ధమై యున్నది; తథాపి, మహావాక్యముయొక్క అర్థము అలౌకికమై యుండుటవలన అప్రసిద్ధదోషము లేదు. ఇం కే మనగా భూషణ మైయే యున్నది. అప్రసిద్ధదోష ముండినయెడల అసంగార్థబోధకత్వము కూడ వాక్యమునకు లోకమునందు అప్రసిద్ధమై యున్నది. అందువలన అసంగబ్రహ్మబోధకత్వము కూడ మహావాక్యమునకు లేకపోవలయును. ఎట్లు లోకమునందు అప్రసిద్ధ మైనయసంగబ్రహ్మబోధకత్వము అంగీకరింపబడినదో అట్లు ఉద్దేశ్యవిధేయభావశూన్య మయిన అఖండార్థబోధకత్వము సంభవించుచున్నది. ఈరీతిగా లక్షణాప్రసంగమునందు విశేషవిచారము ప్రాచీనాచార్యులచేత చేయబడియున్నది.

౭౫. లక్షణా, లేక, శక్తివృత్తిచేత మహావాక్యమునకు అద్వైతబ్రహ్మబోధకత్వము.

కొంద ఱాధునికగ్రంథకారులు లక్షణ లేకయే శక్తివృత్తిచేతనే మహావాక్యమునకు నద్వితీయబ్రహ్మబోధకత్వము నంగీకరించియున్నారు. దానియభిప్రాయ మే మనగా, విశిష్టవాచకపదముయొక్క యర్థమునకు, నన్యపదముయొక్క విశిష్టార్థముతో సంబంధము ఎచట సంభవింపదో అచట పదశక్తిచేతనే విశేషణమును త్యజించి విశేష్యమునకుఁ బ్రతీతి కలుగుచున్నది. ఉ. "అనిత్యో ఘటః." ఈవాక్యమునందు "ఘట" పదము ఘటత్వవిశిష్టవాచకమై యున్నది. దానికి ననిత్యత్వవిశిష్టానిత్యపదార్థముతో నభేదసంబంధబోధము కలుగుచున్నది. మఱియును ఘటత్వజాతి నిత్యమై యున్నది. అందువలన ఘటత్వవిశిష్టమునకు అనిత్యపదార్థముతో నభేదము బాధితమై యుండుటవలన దానికి అనిత్యపదార్థము

చేత నభేదసంబంధము సంభవించుట లేదు. అచ్చట ఘటత్వరూపవిశేషణమును త్యజించి వ్యక్తిమాత్రమునకు ఘటపదముచేత స్మృతియును అనిత్యపదార్థముతో సంబంధవిషయక బోధరూప శాబ్దబోధము కలుగుచున్నది. అట్లే "గేహే ఘటః" ఈవాక్యమునందు "ఘటత్వరూపవిశేషణము" ను త్యజించి విశేష్య మగువ్యక్తి మాత్రమునకు ఘటపదముచేత స్మృతియును శాబ్దబోధమును కలుగుచున్నవి. ఇట్లే "ఘటే రూపం" అనువాక్యమునందును ఘటత్వమును త్యజించి వ్యక్తి మాత్రప్రతీతి కలుగుచున్నది. ఎట్లం టేని, "గేహే ఘటః" అను నీవాక్యముచేత గృహముయొక్క యాధేయత ఘటపదార్థమునందు ప్రతీత మగుచున్నది. ఘటత్వ జాతియందు స్వాశ్రయవ్యక్తియొక్క యాధేయత యున్నది. గృహముయొక్క యాధేయత బాధితమై యున్నది. అందుచేత ఘటత్వమును త్యజించి వ్యక్తిమా త్రమునందు గృహముయొక్క యాధేయత సంబంధవిషయకబోధమును గలిగించు చున్నది. అట్లే, గేహపదార్థమునం దుండుగేహత్వమునకు త్యాగ మున్నది. "ఘటే రూపం" అను నీవాక్యమునందును ఘటత్వమును త్యజించి ద్రవ్యరూప వ్యక్తిమాత్రమునందు అధికరణతయును, మఱియును రూపత్వమును త్యజించి గుణమాత్రమునందు ఆధేయతయును ప్రతీత మగుచున్నవి. ఎట్లన, ఘటపదార్థ ముయొక్క యాధేయతాసహిత మైనరూపము పదార్థమై యున్నది. ఇది వాక్యము యొక్క యర్థమై యున్నది. అచ్చట ఘటత్వముయొక్క యాధేయత దేనియందును లేదు. అందుచేత, ఘటత్వమును త్యజించి వ్యక్తిమాత్రము ఘటపదముయొక్క యర్థమై యున్నది. దానియొక్క యాధేయత రూపత్వజాతియందు లేదు. ఏల యనగా: రూపవ్యక్తియొక్క యాధేయత రూపత్వమునం దున్నది. అందుచేత రూప పదార్థమునం దుండురూపత్వమునకు త్యాగము ఉన్నది. అట్లే "ఉత్పన్నో ఘటః" "నష్టో ఘటః" ఇత్యాదివాక్యములయందును జాతిరూపవిశేషమును త్యజించి వ్యక్తిమాత్రము ఘటాదికము పదముయొక్క యర్థమై యున్నది. ఎట్లన, జాతి నిత్యమై యున్నది. దానికి ఉత్పత్తినాశములు సంభవింపవు. ఎట్లు పూర్వ వాక్యమునందు విశిష్టవాచకపదముచేత శక్తిబలముచేతనే విశేష్యమాత్రము యొక్క బోధము కలుగుచున్నదో అట్లే మహావాక్యమునందును విశిష్టవాచక పదముయొక్క శక్తిబలముచేతనే మాయాంతఃకరణరూప విశేషణములను త్యజించి చేతనరూపవిశేష్యమాత్రములకు ప్రతీతి కలుగుచున్నది. లక్షణాంగీ కారము నిష్ఫలమై యున్నది. కాని యింతభేదము ఉన్నది. విశిష్టవాచకపదవాచ్య

మునకుయొక్క ఏకదేశము విశేష్యమై యున్నది. ఏకదేశము విశేషణమై యున్నది. జాతి విశేషణమై యున్నది. వ్యక్తి విశేష్యమై యున్నది. దానియందు విశేష్య భాగముయొక్క బోధము శక్తిచేత కలుగుచున్నది. కేవలవిశేషణముయొక్క బోధము కలుగుట లేదు. వాచ్యముయొక్క విశేషణమాత్రమునకు విశిష్ట వాచకముయొక్క శక్తిచేత బోధ మైనయెడల "అనిత్యో ఘటః" అనువాక్యమువలె "నిత్యో ఘటః" అనువాక్యముకూడ "ఘట" పదముచేత జాతిమాత్ర బోధమును జేసి సాధువు కావలయును. అందువలన విశిష్టవాచక పదముయొక్క శక్తిచేత విశేష్యమాత్రప్రతీతి కలుగుచున్నది. "సోఽయం దేవదత్తః" అను వాక్యమునందును "పరోక్షత్వా పరోక్షత్వ" రూపవిశేషణములను త్యజించి విశేష్యమాత్రప్రతీతి శక్తివృత్తిచేతనే కలుగుచున్నది. భాగత్యాగలక్షణ కుదాహరణ మేమియును లేదు. అందువలన జహల్లక్షణాజహల్లక్షణా భేదమువలన "లక్షణ" ద్విప్రకారమై యున్నదని యంగీకరింపవలసి యున్నది. భాగత్యాగ లక్షణ యలీకమై యున్నది. మఱియును వేదాంతపరిభాషాది గ్రంథమందు ధర్మ రాజాధ్వరిచేత పూర్వప్రకారము మహావాక్యమునందు "లక్షణ"ను ఖండించి "భాగత్యాగలక్షణ" యొక్క స్వరూపమును ఉదాహరణమును ఈరీతిగాం జెప్పబడియున్నవి. సాంప్రదాయికరీతిగా వాచ్యముయొక్క యేకదేశమునం దుండువృత్తి "భాగత్యాగలక్షణ" యొక్క స్వరూపమై యున్నది. ఈమతము నందు వాచ్యముయొక్క యేకదేశమునం దుండు వృత్తి శక్తియొక్క స్వరూపమై యున్నది. అది భాగలక్షణయొక్క స్వరూపము కాదు. మఱియు నే మనగా శక్యమందు, లేక, అశక్యమం దుండు నేవృత్తి యున్నదో అది భాగత్యాగలక్షణ యనబడును. యద్యపి అజహల్లక్షణ కూడ శక్యాశక్యములం దుండెడు వృత్తియై యున్నది. తథాపి ఎచ్చట శక్యార్థమునకు విశేషణత్వముచేత బోధము కలుగునో అచ్చట "అజహల్లక్షణ" చెప్పబడియున్నది. ఉ. "నీలో ఘటః" అనువాక్యము నందు నీలపదశక్యము రూపమై యున్నది. దానికి విశేషణత్వముచేత బోధము కలుగుచున్నది. 'నీల' రూపమునకు ఆశ్రయమైనద్రవ్యము అశక్యమై యున్నది. దానికి విశేష్యత్వముచేత బోధము కలుగుచున్నది. అందుచేత "నీలపదమునకు నీలరూపాశ్రయమునందు "అజహల్లక్షణ" సిద్ధించుచున్నది. ఇట్లే "మంచాః క్రోశంతి" అనువాక్యమునందు "మంచ" పదశక్యము విశేషణమై యున్నది. అశక్య పురుషుండు విశేష్యుండై యున్నాడు. అందువలన "అజహల్లక్షణ" సిద్ధించు

చున్నది. మఱియు నెచ్చటశక్యాశక్యములు రెండును విశేష్యములై యుండునో, మఱియును "శక్యతావచ్ఛేదకము" కంటె వ్యాపకమైన లక్ష్యతావచ్ఛేదక ధర్మము విశేషణమై యున్నదో అచ్చట 'భాగత్యాగలక్షణ' చెప్పబడును. ఉదాహరణము. "కాకేభ్యో దధి రక్ష్యతామ్" అనువాక్యమునందు కాకపదశక్యమైన వాయసమును అశక్యమైనబిడాలాదికమును విశేష్యములై యున్నవి. మఱియును, శక్యతావచ్ఛేదకమైనకాకత్వముకంటె వ్యాపకమైనదధ్యుపఘాతకత్వము లక్ష్యతావచ్ఛేదకవిశేషణమై యున్నది ఎట్లన, దధికి ఉపఘాతకమగుకాకబిడాలాదికముచే దధిరక్షణమును జేయుము అని యీవాక్యముయొక్క యర్థము. అచట కాకత్వవిశిష్టవ్యక్తి కాకపదశక్యమై యున్నది. దానియందు కాకత్వమును త్యజించి దధ్యుపఘాతకత్వవిశిష్టకాకబిడాలాదికమునకు 'లక్షణా" వృత్తిచే బోధమగుట చేత కాకపదవాచ్యముయొక్క యేకభాగమైనకాకత్వమునకు త్యాగమున్నది. వ్యక్తిభాగమునకు బోధము కలుగుచున్నది. అట్లనే బిడాలత్వాదికమునకు త్యాగమున్నది, వ్యక్తిబోధమును కలుగుచున్నది. అందుచేత "భాగత్యాగలక్షణ" సిద్ధించుచున్నది. ఆలాగుననే 'ఛత్రిణో యాంతి' అనువాక్యమునందును భాగత్యాగలక్షణ యున్నది. ఎట్లన, ఛత్రిసహితులును, ఛత్రిరహితులును గలసముదాయము నడుచుచున్నది, అని యీవాక్యముయొక్క యర్థము. ఇచ్చట "ఛత్రి" పదశక్యము "ఛత్రిసహితుఁడు." ఛత్రిపదాశక్యము 'ఛత్రిరహితుఁడు' ఈరెండును విశేష్యములై యున్నవి. మఱియును, శక్యతావచ్ఛేదకమైనఛత్రిత్వము కంటె వ్యాపకమైనయేకసార్థవాహత్వము 'లక్ష్యతావచ్ఛేద'కవిశేణమై యున్నది. ఈస్థలమునందును ఛత్రిముయొక్క సంబంధవిశిష్ట "ఛత్రి" పదముయొక్క యేశక్య మున్నదో దానియందుండుఛత్రిసంబంధరూపశక్యతావచ్ఛేదకమును త్యజించి యేకసార్థవాహత్వవిశిష్ట ఛత్రులకును తదన్యులకును 'లక్షణా వృత్తి' చేత బోధమగుటవలన వాచ్యముయొక్క యేకభాగమైనఛత్రిసంబంధమును త్యజించి యేకదేశులగుపురుషులకు బోధము కలుగుచున్నది. అందువలన భాగత్యాగలక్షణా సిద్ధించుచున్నది. ఈవిధముననే వేదాంతపరిభాషయందు భాగత్యాగ లక్షణకు ఉదాహరణము చెప్పఁబడియున్నది. అది సాంప్రదాయికమతమునందు అజహల్లక్షణకు ఉదాహరణమై యున్నది. ఒకవేళ అజహల్లక్షణయందలి యుదాహరణమునందు శక్యార్థము విశేషణమై యున్నది; ఒకప్పుడు విశేష్యమై యున్నది; శక్యసహితాశక్యమునకు ప్రతీతి సమానమై యున్నది. స్వల్ప

భేదమును బట్టి లక్షణాభేదాంగీకారము నిష్ఫలమై యున్నది. ఆచార్యు లందఱ చేతను అజహల్లక్షణకు ఏయుదాహరణము చెప్పఁబడినదో దానినే భాగత్యాగ లక్షణకు ఉదాహరణముగా జెప్పుట ఆచార్యులయొక్క వచనములకు విరోధమే ఫల మగుచున్నది. మఱియును శక్యార్థముయొక్క విశేషణత్వ విశేష్యత్వముల యందు అజహల్లక్షణాభాగత్యాగలక్షణలయొక్క భేదము నంగీకరించి యెచ్చట శక్యార్థమునకు విశేషణత్వ మున్నదో అచ్చట భాగత్యాగలక్షణ సిద్ధించుచున్నది. ఎచట శక్యాశక్యార్థములకు విశేష్యత్వ మున్నదో అచ్చట 'అజహల్లక్షణ' యగును. ఈరీతిగా, విపరీతముగా నంగీకరించునప్పుడు ఏబాధకమును లేదు. అందువలన మహావాక్యమునందును "సోఽయం దేవదత్తః" అనువాక్యమునందును "లక్షణ" ను నిషేధించి భాగత్యాగలక్షణయొక్క స్వరూపము మఱియు నుదాహరణ కథనము ధర్మరాజాధ్వరికి నిష్ఫలమై యున్నది. మఱియును మహావాక్యము నందు "లక్షణ" లేకయే యేనిర్వాహము చెప్పబడినదో అది కూడ యసంగతమై యున్నది. ఎట్లనగా ఘటాదిపదమునకు జాతివిశిష్టమునందు శక్తి నంగీకరించి లక్షణ లేకయే కేవలవ్యక్తికి పదముచేత బోధకథనము నిర్యుక్తికమై యున్నది. కేవలవ్యక్తియందు శక్తి నంగీకరించి జాతివిశిష్టవ్యక్తియందు అంగీకరింపని యెడల కేవలవ్యక్తిబోధము ఘటాదిపదములచేత సంభవించుచున్నది. కాని దాని నంగీకరింపగూడదు. మఱియు నేల యనగా, విశిష్టవాచకపదముయొక్క శక్తిచేత విశేష్యమాత్రముయొక్క బోధము కలుగుచున్నది. ఇది ధర్మ రాజాధ్వరిచే వ్రాయబడినది. అది శక్తివాదాదిగ్రంథములయందు నిపుణమతు లగుపండితులకు ఆశ్చర్యజనకమై యున్నది. శక్తివాదమునందు నీప్రసంగము స్పష్టమై యున్నది. ఒకానొక శబ్దము ఏకధర్మవిశిష్టధర్మికి వాచకమై యున్నది. కొన్ని శబ్దములు అనేకధర్మవిశిష్టధర్మికి వాచకమై యున్నవి. మఱికొన్ని శబ్ద ములు, అనేకధర్మవిశిష్టధర్ములకు వాచకములై యున్నవి. ఏపదమునకు ఏయర్థ మునందు శక్తి యున్నదో ఆపదము ఆయర్థమునకు వాచక మనబడును. ఉదాహార ణము—ఘటపదమునకు ఘటత్వరూపైక ధర్మవిశిష్టధర్మియందును, గోపదము నకు గోత్వరూపైకధర్మవిశిష్టధర్మియందును శక్తి యున్నది. ఆపదము దానికి వాచకమై యున్నది. మఱియును "ధేను" పదమునకు ప్రసవగోత్వరూపానేక ధర్మవిశిష్టైక ధర్మియందు శక్తి యున్నది. అది దానికి వాచకమై యున్నది. "పుష్పవత్" పదమునకు చంద్రసూర్యత్వ రూపానేకధర్మ విశిష్టానేకధర్మ

లగు చంద్రసూర్యులయందు శక్తి యున్నది. ఆ "పుష్పవత్" పదము సూర్య చంద్రు లిద్దఱకును వాచకమై యున్నది. ఏధర్మవిశిష్టమందు శక్తి యున్నదో ఆధర్మమును త్యజించి కేవలాశ్రయముయొక్క బోధము "లక్షణా" వృత్తిచేత కలుగుచున్నది. "లక్షణ" లేక కలుగనేరదు. అందువలన ఘటాదిపదములచేత కేవలవ్యక్తిబోధము లక్షణావృత్తిచేత నగుచున్నది. మఱియు ననేకవిశిష్టధర్మికి వాచక మైన యేధేనుపద మున్నదో దానిచేత ఏకధర్మమును త్యజించి యేక ధర్మవిశిష్టధర్మియొక్క బోధము లక్షణ లేకయే కలుగనేరదు. అందువలన ధేనుపదముచేత అప్రసూత గోవుయొక్కయు ప్రసూత మహిషియొక్కయు బోధము శక్తిచేత కలుగనేరదు. మఱియును ఒకప్పుడు గోమాత్రబోధము ధేనుపదముచే కలుగుచున్నది. అది "భాగత్యాగలక్షణా" వృత్తిచేత కలుగు చున్నది. కాని శక్తిచేత కాదు. అట్లనే "పుష్పవత్" పదముచేత చంద్రుని త్యజించి సూర్యునియొక్కయు, లేక సూర్యుని త్యజించి చంద్రునియొక్కయు బోధము శక్తిచేత కలుగనేరదు. ఈరీతిగా "శక్తి" "వాదమునందు" వ్రాయ బడియున్నది. అది అసంభవమై యున్నది. విశిష్టమునందు శక్తియున్నది. శక్తి చేత విశేష్యముయొక్క బోధకథనము సర్వథా నిర్యుక్తికమై యున్నది. ఏధర్మ సహితార్థమునందు పదమునకు శక్తి యున్నదో దానికంటె న్యూనాధికార్థములు లక్షణచేత ప్రతీతము లగుచున్నవి. శక్తిచేత ఆధర్మవిశిష్టార్థముననే ప్రతీతి కలుగు చున్న దనునియమము ఉన్నది. మఱియును వ్యక్తిమాత్రమునందు శక్తి యున్నది. విశిష్టమునందు లేదు, అని చెప్పుధర్మరాజాధ్వరియొక్కయభిప్రాయము సంగతము కాదు. ఎట్లన విశిష్ట వాచకపదముయొక్క శక్తిచేత విశేష్యము యొక్క బోధము కలుగుచున్న దని ధర్మరాజాధ్వరిచే జెప్పబడియున్నది. ఏవ్యక్తి మాత్రమునందు శక్తి వాంఛితమై యున్నదో ఆవ్యక్తిమాత్రమునం దుండు పదముయొక్క శక్తిచేత దానికి బోధము కలుగుచున్నది అని చెప్పుచున్నారు. విశిష్టవాచకపదము లే దనియు చెప్పుచున్నారు. మఱియును వ్యక్తిమాత్రము నందు శక్తి యెవరియొక్క మతమునందును లేదు. సర్వమతవిరుద్ధమై యున్నది. యద్యపి శిరోమణి భట్టాచార్యులచేత వ్యక్తిమాత్రమునందు శక్తి యంగీకరింప బడియున్నది, తథాపి పదముచేత అర్థముయొక్క స్మృతియును జాతివిశిష్టము యొక్క శాబ్దబోధమును, వారియొక్క మతమునం దున్నది. వ్యక్తిమాత్రము యొక్క శాబ్దబోధము శక్తిచేత నెవరి మతమునందును లేదు. మఱియును,

ఘటాదిపదమునకు జాతివిశిష్టమునందును శక్తియున్నది. కేవలవ్యక్తియందును శక్తి యున్నది. ఒకప్పుడు జాతివిశిష్టమునకు బోధము కలుగుచున్నది. మఱి యొకప్పుడు కేవలవ్యక్తియొక్క బోధము కలుగుచున్నది ఎట్లు హరిపదము నానార్థకమై యున్నదో అట్లు సకలపదమును నానార్థమై యున్నది. ఈయర్థ మత్యంతాశుద్ధమై యున్నది. మఱియును వారియొక్క గ్రంథములయందు ఈయర్థము లేదు. అశుద్ధతయందు హేతు వే మనఁగా: లక్షణావృత్తిచేత నెచ్చట నిర్వాహము కలుగుచున్నదో అచ్చట నానార్థములయందు శక్తిని స్వీకరింప వలసినది. ఏకార్థమునందు శక్తియు, మఱియొక యర్థమునందు లక్షణయు నంగీకరింపవలయును; ధర్మరాజాధ్వరిచేతనే యీయర్థము వ్రాయబడి యున్నది. "నీలాదిక" శబ్దమునకు గుణమునందు శక్తి యున్నది, గుణియందు లక్షణ యున్నది. ఈరెంటియందును శక్తి చెప్పబడలేదు. అందువలన లక్షణావృత్తియొక్క భయముచేత నానార్థత్వమునకు నంగీకారము లేదు. మఱియు నే మనగా నానార్థత్వభయముచే లక్షణాంగీకార మున్నది. అందువలన విశిష్టమునందు శక్తి యున్నది. వ్యక్తిమాత్రమునందును శక్తి యున్నది. ఈయశుద్ధార్థమునందు ధర్మరాజాధ్వరియొక్క యభిప్రాయము కాదు. మఱియును విశిష్టమునందు సకలపదమునకును శక్తి యున్నది. అవిశిష్టమం దుండెడి శక్తియొక్క మహత్త్వముచే నొకప్పుడు విశిష్టమున కన్యపదార్థముతో నన్వయ మగుచున్నది. ఒకప్పుడు విశేష్యమునకు అన్యపదార్థముతో నన్వయ మగుచున్నది. ఎచ్చట విశిష్టమునందు అన్వయముయొక్క యోగ్యత యున్నదో అచ్చట విశిష్టమునకును, ఎచ్చట విశిష్టమునందు అన్వయముయొక్క యోగ్యత లేదో అచ్చట విశేష్యమాత్రమునకును, శక్తిచేత నన్వయబోధ మగుచున్నది, అనెడి ధర్మరాజాధ్వరి మతము అసంగతము. ఎట్లనగా, శక్తి విశిష్టమునం దున్నది. లక్షణ లేకయే వ్యక్తిమాత్రముయొక్క అన్వయబోధము అంగీకరించినయెడల ధేనుపదముచేతను అప్రసూతగోవునకు, అథవా ప్రసూతమహిషికిని లక్షణ లేకయే ప్రతీతి కావలయును. మఱియును "పుష్పవత్" పదముచేత లక్షణ లేకయే యేకసూర్యునకును, లేక, యేకచంద్రునకును ప్రతీతి కావలయును. మఱియును అది సంభవించుట లేదు. అందువలన "అనిత్యో ఘటః" ఇత్యాదివాక్యమునందు ఘటాది పదమునకు వ్యక్తిమాత్రమునందు భాగత్యాగలక్షణ సిద్ధించుచున్నది. బహుప్ర

యోగమునందు వ్యక్తిమాత్రబోధ మగుటవలన శక్తిచేతనే బోధ మగుచున్నది అని యెవరు చెప్పెదరో వారికి సమాధాన మే మనగా.—

ప్రయోగబాహుళ్యముచేత అర్థమునందు శక్యత్వము నంగీకరించిన యెడల "నీలాది" పదమునకు ప్రయోగబాహుళ్యము గుణియం దున్నది అది యును శక్యము కావలయును. మఱియును నీలాదిపదమునకు గుణి శక్యము కాదు. లక్ష్యమై యున్నది. ఇది ధర్మరాజాధ్వరిచేతను వేదాంతచూడామణిటీక యందు వారిపుత్త్రులచేతను వ్రాయబడియున్నది. అందువలన నెచ్చట విశిష్టవాచ కపదముచేత విశేష్యమాత్రము బోధ మగుచున్నదో యచ్చట భాగత్యాగ లక్షణ సిద్ధించుచున్నది. మఱియును అదే "నిరూఢలక్షణ" యై యున్నది. నిరూ ఢలక్షణకు శక్తికింటె నీషన్మాత్రభేద మున్నది. దానికి ప్రయోగబాహుళ్యమును ఉన్నది. ఏయర్థమునందు శబ్దప్రయోగబాహుళ్య మున్నదో ఆయర్థమునందు శక్తి నంగీకరించినయెడల జాతిశక్తివాదమునందు వ్యక్తిబోధము లక్షణావృత్తి చేత నగుచున్నది. అది యసంగత మగును. న్యాయమతమునందు "రాజపురుషః" ఇత్యాదివాక్యమునందు రాజపదమునకు రాజసంబంధియందు లక్షణ యున్నది. అదియు నసంగత మగును. ఈరీతిగా విశిష్టవాచకపదముచేత విశేష్యమాత్ర బోధము లక్షణ లేకయే కలుగనేరదు. అందువలన మహావాక్యమునందు లక్షణ సిద్ధించుచున్నది. ఇది సాంప్రదాయికమతమై యున్నది. జిజ్ఞాసులకు ఉపాదేయమై యున్నది. వేదాంతవాక్యముచేత నసంగబ్రహ్మముయొక్క యాత్మస్వరూపసాక్షా త్కారము కలుగుచున్నది. అందువలన ప్రవృత్తి నివృత్తి శూన్య బ్రహ్మరూప ముతో స్థితిరూప ఫలము కలుగుచున్నది. ఇది అద్వైతవాదసిద్ధాంత మై యున్నది.

## ౮౭. మీమాంసకమతము.

దీనియందు మీమాంసకమతానుసారి యగునొకశంక యున్నది. సకల వేదము ప్రవృత్తి బోధకము లేక నివృత్తిబోధకము ఐయున్నది. ప్రవృత్తి నివృత్తి రహితార్థమును వేదము బోధింపదు. అట్లు బోధించు నెడల యనిష్టార్థబోధక మైనవేద మప్రమాణము కావలయును. అందువలన విధినిషేధశూన్య వేదాంత వాక్యమునకు విధివాక్యముతో నంబంధ మైనందున విధివాక్యమునకు వేదాంత వాక్యము శేషమై యున్నది. కొన్ని వాక్యములు కర్మకర్తృస్వరూప బోధకము లై యున్నవి. ఉ. త్వంపదార్థబోధకము పంచకోశవాక్యమై యున్నది. కొన్ని

వాక్యములు కర్మశేషభూత దేవతాస్వరూప బోధకము లై యున్నవి. అది తత్పదార్థబోధకవాక్యమై యున్నది. జీవబ్రహ్మాభేద బోధకవాక్యమునకు అర్థ మే మనగా, కర్మకర్త యగుజీవుడు దేవభావమును బొందును. అందువలన కర్మ మవశ్యకర్తవ్యము. ఈరీతిగా కర్మఫలస్తుతివలన అభేదబోధకవాక్యము అర్థ వాదరూపమై యున్నది. యద్యపి మీమాంసక మతమునందు "మంత్రమయీ దేవతా" యని యున్నది. విగ్రహవంతుడును, ఐశ్వర్యసహితుడునై యుండిన దేవత ఒకటియును లేదు. అందువలన దేవభావప్రాప్తిని జెప్పుట సరి కాదు. తథాపి సంభావనామాత్రముచేత కర్మఫలస్తుతియై యున్నది. కృష్ణునియొక్క ప్రభకు కోటిసూర్యప్రభ ఉపమానముగాఁ జెప్పబడుచున్నది. ఇచ్చట కోటి సూర్యప్రభ యలీకపదార్థమై యున్నది. అదియును సంభావనచేత నుపమ చెప్ప బడియున్నది. కోటిసూర్యప్రభ యేకత్ర యుండినయెడల కృష్ణప్రభకు నుపమ సంభవించుచున్నది. ఈరీతిగా సర్వజ్ఞత్వాదిగుణవిశిష్ట పరమైశ్వర్యసహితుఁ డగు నొక యద్భుతదేవు డుండినయెడల ఆయనయొక్క స్వరూపము కర్మకర్తలకు కలుగుచున్నది. ఈరీతిగా సంభావనచేత దేవభావప్రాప్తి చెప్పంబడి యున్నది. ఈరీతిగా సాక్షాత్తుగా గాని లేక పరంపరగా గాని ప్రవృత్తి నివృత్తి బోధకము సకలవేద మై యున్నది. ప్రవృత్తియందు నుపయోగి యగు బ్రహ్మబోధము వేదవ్యాకముచేత సంభవించుట లేదు.

బోధాయనాచార్యులు. 47. ప్రాచీనవృత్తికారమతము, ప్రాచీనవృత్తి కారు లయినవేదాంతి చెప్పిన దే మనగా :—

కర్మవిధియొక్క ప్రకరణమునందు వేదాంతవాక్యము లేదు. అందువలన భిన్నప్రకరణమందు పఠిత మయినవేదాంతవాక్యము విధిశేషము కాదు. ఉపా సనావిధియు వేదాంతప్రకరణమునం దున్నది. అందువలన సకలవేదాంతవాక్యము ఉపాసనావిధిశేషమై యున్నది. త్వంపదార్థబోధకవాక్యము ఉపాసకునియొక్క స్వరూపబోధకమై యున్నది. తత్పదార్థబోధకవాక్యము ఉపాస్యునియొక్క స్వరూపబోధకమై యున్నది. త్వంపదార్థతత్పదార్థములకు అభేదబోధకవాక్యము లకు అర్థ మీలాగున నున్నది. "సంసారదశయందు జీవబ్రహ్మములకు భేదము ఉన్నది. ఉపాసనయొక్క బలముచేత మోక్షదశయం దభేద మగును. అద్వైత వాదమునందు సర్వథా అభేద మున్నది. భేదప్రతీతి సంసారదశయందును భ్రమ రూపమై యున్నది. ఈమతమునందు సంసారదశయందు భేదము, మోక్షదశయం

దభేదము ఉన్నవి. మోక్షదశయందును జీవబ్రహ్మాభేదమును అంగీకరించువాడు ఈమతమునందు దోష మే మనుచున్నాడనగా, జీవునియందు బ్రహ్మయొక్క భేదము స్వరూపముతో నున్నదా లేక ఉపాధికృతమై యున్నదా? స్వరూపముతో భేద మంగీకరించునెడల యెంతస్వరూప మున్నదో అంత భేదముయొక్క నివృత్తి యగుట లేదు. మోక్షదశయందు భేదనివృత్తికొఱకు జీవస్వరూపమునకు నివృత్తి నంగీకరించునెడల సిద్ధాంతత్యాగ మగును. మఱియును మోక్షమునకు అపురుషార్థత్వ మగును. ఎట్లనగా మోక్షదశయందు స్వరూపనివృత్తియును వృత్తికారులచేత నంగీకరింపబడలేదు. ఎవరియొక్క సిద్ధాంతమునందును స్వరూపనివృత్తియు మోక్షమునందు కలుగుట లేదు. ఎవరయినను స్వరూపనివృత్తిని మోక్షమునం దంగీకరించినయెడల స్వరూపనివృత్తియందు ఏపురుషునకును అభిలాష కలుగుట లేదు. అందువలన మోక్షమునందు పురుషార్థత్వాభావము కావలయును. పురుషునియొక్క యభిలాషకు విషయము పురుషార్థ మనబడును. అందువలన జీవునియందు బ్రహ్మముయొక్క భేదము స్వరూపముగా నున్న దని యంగీకరించినయెడల మోక్షదశయందును అభేదము సంభవించుట లేదు. జీవునియందు బ్రహ్మముయొక్క భేదము ఉపాధికృతమై యున్నదని చెప్పినయెడల ఉపాధినివృత్తిచేత మోక్షదశయం దభేదము సంభవించుచున్నది. అయిన అద్వైతమతముకంటె నీమతమునకు భేదము సిద్ధించుట లేదు. ఎట్లనగా, అద్వైతవాదమునందును ఉపాధికృతభేదాంగీకార మున్నది. మఱియును ఉపాధికృతభేదము మిథ్య కావలయును. దానియొక్క నివృత్తియు అద్వైతవాదమువలె కేవలజ్ఞానముచేత నంగీకరించుట యోగ్యమై యున్నది. మోక్షనిమిత్తమైనయుపాసనాక్రియ నిష్ఫల మగును. వృత్తికారమతమునందు నైయాయికాదులు ఈకుతర్కమును జెప్పినయెడల అది సంభవించుట లేదు. ఎట్లనగా, జీవునియందు బ్రహ్మముయొక్క భేదము స్వాభావముగా లేదు. ఉపాధికృతమై యున్నది. ఉపాధి మిథ్యయై యుండుటవలన ఉపాధికృతభేదమును మిథ్యయై యున్నది. దానిని కేవలజ్ఞానమే నివృత్తి చేయుచున్నది. వృత్తికారులమతమునందు ప్రళయపర్యంతస్థాయి యను నాకాశాదిపదార్థము మిథ్య కాదు. ఆలాగుననే జీవునియొక్క యుపాధి యయిన యంతఃకరణాదికము సత్యమై యున్నది. జ్ఞానమాత్రమున దానికి నివృత్తి కలుగుట లేదు. యద్యపి మోక్షదశయందు నంతఃకరణాదికమునకు నాశము కలుగుచున్నది. అందువలన ధ్వంసశూన్యతా

రూపనిత్యత్వము వృత్తికారమతమందును సంభవింపదు. తథాపి జ్ఞానముచేత అబాధ్యతారూపనిత్యత్వము వృత్తికార మతమునందు సకల పదార్థమునకును సంభవించుచున్నది. ఈరీతిగా ఉపాధి సత్యమై యున్నది. సత్యోపాధికృతభేదము సత్యమై యున్నది. ఎట్లనగా, జలసంయోగరూ పోపాధికృత శీతలత్వము పృథివియందు సత్యమై యున్నదో అట్లు సత్యోపాధికృతభేదము సత్యమై యున్నది. అసత్యభేదమునకును ఉపాధికిని జ్ఞానమాత్రముచేత నివృత్తి కలుగ నేరదు. ఇక నేమనగా, నిత్యకర్మ లేక ఉపాసనాసహితజ్ఞానముచేత ఉపాధినివృత్తి వలన మోక్షదశయందు భేదమునకు నివృత్తి కలుగుచున్నది. మఱియును అద్వైతమతమునందు సకలోపాధియును, భేదము కూడ మిథ్యయై యున్నవి. దానికి జ్ఞానమాత్రముచేత నివృత్తి కలుగుచున్నది. మఱియును సంసారదశయం దును గూడ మిథ్యాభూతోపాధిచేత పారమార్థికాద్వైతమునకు చ్యుతి లేదు. అందువలన నద్వైతమతముకంటె వృత్తికారమతమునకు భేద మున్నది. వృత్తి కారమతమునందు భేదబోధకాభేదబోధకవాక్యములకు గతి సంభవించుచున్నది. జీవునియందు బ్రహ్మముయొక్క భేదబోధకవాక్యము సాంసారికజీవస్వరూప బోధక మైయున్నది. అభేదబోధకవాక్యము ముక్త జీవస్వరూప బోధక మై యున్నది. ముక్తదశయందును భేద మంగీకరించినయెడల వృత్తికారమతము నందు అభేదబోధకవాక్యము బాధిత మగును. అద్వైతవాదమునందు సర్వథా యభేదాంగీకార మున్నది. ఆమతమునందు జీవబ్రహ్మాభేదబోధక వాక్యము బాధిత మగును. అందువలన సంసారదశయందు భేదము ముక్తిదశయం దభే దము అంగీకరించుట యుక్తమై యున్నది. ఈమతము కూడ సరి యయినది కాదు. ఎట్లనగా, సకలవేదాంతవాక్యము అహేయానుపాదేయబ్రహ్మబోధక మయి యున్నది. విధిశేష మయిన యర్థబోధకము కాదు. ఈయర్థము ప్రథమాధ్యాయ ముయొక్క చతుర్థసూత్రవ్యాఖ్యానమునందు భాష్యకారులచేత విస్తారముగా వ్రాయబడి యున్నది. మందమతిపురుషులకు మీమాంసక వృత్తికారాది మతములయందు అధికశ్రద్ధ కలిగి అశాస్త్రములప్రవేశము కలిగినయెడల, భామతీ, నిబంధన, బ్రహ్మవిద్యాభరణాదివ్యాఖ్యానసహితభాష్యవిచారముచేత బుద్ధిదోషము నివృత్తి కావలయును. సూత్రభాష్యాదివిచారమునందు ఎవరికి బుద్ధిసామర్థ్యము లేదో వారు భాష్యకారులయొక్క వ్యాఖ్యానసహితోపనిష ద్గ్రంథవిచారణ చేయవలయును, దానియొక్క తాత్పర్యము అహేయానుపా

దేయబ్రహ్మబోధమునం దున్నది. ఉపాసనావిధియందు తాత్పర్యము లేదు. లౌకికవాక్యతాత్పర్యము ప్రకరణాదికముచేత తెలియవలయును. ఆప్రకరణాదికము "కావ్యప్రకాశ," "కావ్యప్రదీప" దిగ్రంథములందు వ్రాయబడి యున్నది.

48. షడ్విధలింగములు వైదికవాక్యతాత్పర్యనిర్ణాయకములై యున్నవి.

వైదికవాక్యతాత్పర్యజ్ఞానమునకు ఉపక్రమోపసంహారాదిషట్కము హేతువై యున్నది.

(1) ఉపక్రమోపసంహారములకు ఏకరూపత్వము. (2) అభ్యాసము.
(3) అపూర్వత్వము. (4) ఫలము (5) అర్థవాదము (6) ఉపపత్తి.

ఈ యాఱును వైదికతాత్పర్యలింగములు, వీనివలన వైదికవాక్యతాత్పర్యమును దెలియవలయును. అందువలన తాత్పర్యమునకు ఇవి లింగము లని చెప్పబడుచున్నది. ఎట్లు, ధూమముచేత వహ్ని తెలియబడుచుండుటవలన వహ్నికి ధూమము లింగ మని చెప్పబడుచున్నదో అట్లు ఉపనిషత్తుకంటె భిన్న మగు కర్మకాండబోధక వేదవాక్యతాత్పర్యము కర్మవిధియం దున్నది. ఎట్లు ఉపక్రమోపసంహారాదికము పూర్వవేద మయిన కర్మవిధియం దున్నదో అట్లు జైమినికృత ద్వాదశాధ్యాయమునందు స్పష్టమై యున్నది. మఱియును, ఉపనిషద్రూప వేదముయొక్క ఉపక్రమోపసంహారాదికము అద్వితీయబ్రహ్మమునం దున్నది. అందువలన నద్వితీయబ్రహ్మమునందు దానియొక్క తాత్పర్య మున్నది. ఉ. ఛాందోగ్యషష్ఠాధ్యాయముయొక్క ఉపక్రమమునందు అద్వితీయబ్రహ్మ మున్నది. ఉపసంహారమునందును అద్వితీయ బ్రహ్మ మున్నది. ఏయర్థము ఆరంభమునం దున్నదో ఆయర్థము సమాప్తియందు నుండవలయును. అచ్చట నుపక్రమోపసంహారముల కేకరూపత్వము చెప్పబడుచున్నది.

(2) పునఃపునఃకథనమునకు అభ్యాస మని పేరు.

ఛాందోగ్యషష్ఠాధ్యాయమునందు నవవారము తత్త్వమసివాక్యము ఉన్నది. అందువలన నద్వితీయబ్రహ్మమునం దభ్యాస మున్నది.

(3) ప్రమాణాంతరముచేత అజ్ఞాతత్వమునకు నపూర్వత యని పేరు.

ఉపనిషద్రూపశబ్దప్రమాణముకంటె భిన్నమైనప్రమాణమునకు అద్వితీయబ్రహ్మము విషయము కాదు. అందువలన నద్వితీయబ్రహ్మమునందు అజ్ఞాతతారూపాపూర్వత్వ మున్నది.

(4) అద్వితీయబ్రహ్మముయొక్క జ్ఞానముచేత మూలసహితశోకమోహములకు నివృత్తి ఫలమై కలుగుచున్నది.

(5) స్తుతి బోధకవచనము లేక నిందాబోధకవచనము అర్థవాదమనబడును. అద్వితీయ బ్రహ్మబోధముయొక్క స్తుతి ఉపనిషత్తుల యందు స్పష్టమై యున్నది.

(6) వక్తవ్యార్థమునకు అనుకూలమైనయుక్తి యుపపత్తి యనబడును.

ఛాందోగ్యమునందు సకలపదార్థములకు బ్రహ్మతో గూడ నభేదము చెప్పుటకు కార్యమునకు కారణముతో కూడ నభేదప్రతిపాదనము అనేకదృష్టాంతములచేతఁ జెప్పబడియున్నది. ఈరీతిగా షడ్విధలింగములచేత సకలోపనిషత్తుల తాత్పర్యము అద్వితీయబ్రహ్మమునం దున్నది. ఆయాయుపనిషద్వ్యాఖ్యానముల యందు భాష్యకారులచే షడ్విధలింగములు స్పష్టముగా వ్రాయంబడియున్నవి. దానివలన వేదాంతవాక్యమునకు అద్వితీయబ్రహ్మమునందు తాత్పర్యనిశ్చయమగుచున్నది. ఏయర్థమునందు వక్తయొక్క తాత్పర్యజ్ఞాన మున్నదో ఆయర్థముయొక్క బోధము శబ్దముచేత శ్రోతలకు కలుగుచున్నది. ఎట్లనగా, శబ్దముయొక్క శక్తివృత్తియొక్క లేక లక్షణావృత్తియొక్క జ్ఞానము శాబ్దబోధమునకు హేతువై యున్నది.

### 49. శాబ్దబోధమునకు సహకారు లయిన యాకాంక్షాది చతుష్టయ నిరూపణము.

ఆకాంక్షాజ్ఞానము, యోగ్యతాజ్ఞానము, తాత్పర్యజ్ఞానము, ఆసత్తి యనునీనాలుగు సహకారు లయి యున్నవి. ఒకపదార్థమునకు పదార్థాంతరముతో నన్వయబోధాభావము ఆకాంక్ష యనబడును. "కి మేతి పుత్రో రాజ్ఞః పురుషోపసార్యతాం" ఈవాక్యమునందు రాజపదార్థమునకు పుత్రపదార్థముచేత అన్వయబోధ మయినతరువాత పురుషపదార్థముతో ఆకాంక్షయొక్క యభావమువలన శాబ్దబోధము కలుగుట లేదు. ఎట్లనగా, ఏకపదార్థముచేత నన్వయమయిన తరువాత అన్వయబోధాభావరూపాకాంక్ష లేదు. ఇది స్థూలరీతి యై యున్నది. ఆకాంక్ష యనగా ఇచ్ఛ. అది (యద్యపి) చేతనమం దుండినను, (తథాపి) పదార్థమునకు నెంతకాలము పదార్థాంతరముతో నన్వయజ్ఞానము కలుగుట లేదో అంతకాలము స్వార్థముయొక్క యన్వయముకొఱకు పదాంతరము

యొక్క ప్రతీత మగుచున్నది. అన్వయబోధ మయినతరువాత ప్రతీత మగుట లేదు. అది యాకాంక్ష యనబడును. ఆకాంక్షాస్వరూపము సూక్ష్మరీతిగా నిగ్రంథము నందు వ్రాయబడినది. అది కఠిన మయినది. అందువలన రీతిమాత్రము తెలియ వలయును. ఈ రాజపుత్త్రుడు వచ్చుచున్నాడు.— ఈ రీతిగా రాజపదార్థమునకు పుత్త్రపదార్థముచేత నన్వయబోధ మయిన తరువాత పురుషపదార్థముచేత నన్వయబోధమునకు హేతు వైనయాకాంక్ష రాజపదార్థమందు లేదు. అందువలన రాజపురుషుని విడిచి బోధము కలుగుట లేదు. మఱియు నేమనగా, పురుషుని విడిచి యీబోధము కలుగుచున్నది. ఆయాకాంక్షాజ్ఞానము శాబ్దబోధమునకు హేతువు కానియెడల రాజపుత్త్రుడు వచ్చుచున్నాడు; రాజపురుషుని విడిచి యీబోధము కావలయును. అందువలన నాకాంక్షాజ్ఞానము శాబ్దబోధమునకు హేతువై యున్నది. ఏకపదార్థమునకు పదార్థాంతరమునం దుండెడి సంబంధము "యోగ్యత" యనబడును. ఎచ్చట యోగ్యత లేదో యచ్చట శాబ్దబోధ మగుట లేదు. ఉ. "వహ్నినా సించతి" ఈవాక్యమునందు వహ్నివృత్తి యగు కరణతారూపతృతీయాపదార్థమునకు సేచనరూపపదార్థము నందు నిరూపకతాసంబంధరూపయోగ్యత లేదు. అందువలన శాబ్దబోధము కాదు. శాబ్దబోధమునందు యోగ్యత హేతువు కానియెడల "వహ్నినా సించతి" ఈవాక్యముచేత శాబ్దబోధము కావలయును. వక్తయొక్క ఇచ్ఛకు తాత్పర్య మని పేరు. ఏయర్థమునందు తాత్పర్యజ్ఞానము లేదో దానికి శాబ్దబోధము కలుగుట లేదు. ఉ "సైంధవ మానయ" అను నీవాక్యముచేత భోజనసమయమునందు అశ్వమునందు వక్తయొక్క యిచ్ఛారూపతాత్పర్యము సంభవించుట లేదు. అందువలన నశ్వబోధ మగుట లేదు. అట్లే గమన సమయమునందు లవణముయొక్క శాబ్దబోధము కలుగుట లేదు. తాత్పర్యజ్ఞానము శాబ్దబోధమునకు హేతువు కానియెడల "సైంధవ మానయ" అను వాక్యముచేత భోజనసమయమునందు అశ్వబోధము, గమనసమయమునందు లవణబోధము కూడ కావలయును. ఇచ్చట నొకశంక, వక్తయొక్క యిచ్ఛకు తాత్పర్య మని పేరు. శుకవాక్యమునందు వక్తయొక్క యిచ్ఛ లేదు. మఱియును శుకవాక్యముచేత శాబ్దబోధము కలుగుచున్నది. అందువలన తాత్పర్యజ్ఞానము శాబ్దబోధమునకు హేతువు కాదు. మఱియును మీమాంసకుడు వేదమును నిత్య మని యంగీకరించియున్నాడు. ఆయనమతమునందు ఈశ్వరుడు లేడు.

జీవుఁడును వేదకర్త కాఁడు. మఱియు నేమనగా, వేదము నిత్యమై యున్నది. దాని వక్తయొక్క యిచ్ఛారూపతాత్పర్యజ్ఞానము వైదికవాక్యమునందు సంభవించుట లేదు. ఈశంకాసమాధానము మంజూషాగ్రంథమునందు నాగోజీభట్టులచేత నిట్లు వ్రాయబడియున్నది. సకలశాబ్దబోధమునకును తాత్పర్యజ్ఞానము హేతువు అయిన యెడల యీదోషము సంభవించుచున్నది. సకలశాబ్దబోధమునకు తాత్పర్యజ్ఞానము హేతువు కాదు. నానార్థక పదసహిత వాక్యజన్య శాబ్దబోధమునకు తాత్పర్యజ్ఞానము హేతువు అయియున్నది. అందువలన దోషము లేదు. వివరణగ్రంథమునందు ప్రకాశాత్మశ్రీచరణులచేత తాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధకారణత్వము సర్వథా నిషేధింపబడియున్నది. ఆరెండువచనములును సరి యయినవి కావు. ఎట్లనగా, యీరెండుమతములయందును వేదవాక్యముయొక్క తాత్పర్యనిర్ణయమునకు హేతు వైనపూర్వోత్తరమీమాంసలు వ్యర్థములు కావలయును. అందువలన తాత్పర్యనిశ్చయము సకలశాబ్దబోధమునకును హేతువై యున్నది. శుకవాక్యమునందు మీమాంసకునికి తాత్పర్యజ్ఞానము సంభవించుట లేదు. దానికి సమాధానము మీమాంసకునికి వేదకర్తయొక్క తాత్పర్యజ్ఞానము సంభవించుట లేదు. అయిన వేదవక్తకు పైని యేపాఠకు డున్నాఁడో ఆయనయొక్క తాత్పర్యజ్ఞానము సంభవించుచున్నది. శుకవాక్యమునందు యద్యపి తాత్పర్యజ్ఞానము సంభవించుట లేదు. తథాపి శ్రోతకు బోధేచ్ఛవలన ఏ వాక్యము ఉచ్చరింపబడియున్నదో ఆవాక్యము బుబోధయిషాధీన మని చెప్పబడును. శుకవాక్యము బుబోధయిషాధీనము కాదు. మఱియును వేదవాక్యము కూడ పాఠకునియొక్క బుబోధయిషాధీనమై యున్నది. బుబోధయిషాధీనవాక్యజన్యజ్ఞానమునందు తాత్పర్యజ్ఞానము కారణమై యున్నది. బోధేచ్ఛకు బుబోధయిష యని పేరు. శుకమునకు బోధేచ్ఛ లేదు. అందువలన శుకవాక్యజన్యజ్ఞానమునందు తాత్పర్యజ్ఞానము కారణము కాదు. మఱియు, వేదాంతపరిభాషయందు శుకవాక్యమునందును తాత్పర్య మంగీకరింపబడియున్నది. అది వక్త్రిచ్ఛారూపతాత్పర్యము కాదు. ఇక నే మనగా, ఇష్టార్థముయొక్క బోధము కావలయు ననుచోట యోగ్యతకు తాత్పర్య మని పేరు. దీనిమీద శంకాసమాధానములు తిరిగి వ్రాయబడియున్నది. అది నిష్ఫలమై యున్నది. అందువలన దాని నిచట వ్రాయలేదు. తాత్పర్యశబ్దమున కర్థము వక్త్రిచ్ఛారూప మని ప్రసిద్ధమై యున్నది. దానిని త్యజించి పారిభాషికార్థ మైనతాత్పర్యము నంగీకరించి శుకవాక్యమునందు తాత్పర్య ప్రతిపాద

నమునకు లోకప్రసిద్ధివిరోధమే కాని వేఱుఫలము లేదు. ఎట్లనగా, 'శుకవాక్యం న తాత్పర్యవత్.' ఇది సర్వత్రానుభవసిద్ధమై యున్నది. 'శుకవాక్యం తాత్పర్యవత్' అని యెవరును జెప్పుట లేదు. అందువలన బుబోధయిషాధీనవాక్యజన్యశాబ్దబోధమునందు తాత్పర్యజ్ఞానము హేతువై యున్నది: బోధరహితపురుషునిచేత నుచ్చరింపబడినవాక్యముచేత శాబ్దబోధము కలుగుచున్నది. అయిన నావాక్యము బుబోధయిషాధీనము కాదు. అందువలన నర్థబోధమునందు తాత్పర్యజ్ఞానము హేతువు కాదు. మానివిరచితశ్లోకమునందు వక్తయొక్క యిచ్ఛారూపతాత్పర్యము సంభవించుట లేదు. ఎట్లనగా నుచ్చారణకర్త వక్త యనబడును. మాని యుచ్చారణమును జేయడు. అందువలన మానియొక్క యిచ్ఛ వక్త్రిచ్ఛ కాదు. ఇది వేదాంతపరిభాషాటీకయందు ధర్మరాజపుత్రులచే వ్రాయబడియున్నది. అది శబ్దరత్ననామకవ్యాకరణగ్రంథముచేత ఖండితమై యున్నది. అచ్చట ప్రసంగమే మనగా, ఉచ్చరింపబడినశబ్దముచేత బోధ మగుచున్నది గాని ఉచ్చారణము లేకయే శాబ్దబోధము కలుగుట లేదు. ఈయర్థబోధకమైనమహాభాష్యము యొక్క వచనమును వ్రాసి యాశంక వ్రాయబడి యున్నది. ఉచ్చారణము లేక శాబ్దబోధము కానియెడల నేకాంతమునం దుచ్చారణము లేకయే పుస్తకమును చూచువారికి శాబ్దబోధము కాకపోవలయును. దానికి సమాధానము. అచ్చటను గూడ పుస్తకమును చూచువాడు సూక్ష్మోచ్చారణము చేయుచున్నాడు. ఈరీతిగా మానిలిఖితశ్లోకమునకు ఉచ్చారణకర్త మానియై యున్నాడు. అభేదరత్నకారులయొక్క మత మే మనగా, ఎచ్చట తాత్పర్యసందేహ మున్నదో అచట శాబ్దబోధము కలుగుట లేదు. ఎచట తాత్పర్యాభావనిశ్చయమున్నదో అచ్చటను గూడ శాబ్దబోధము కలుగుట లేదు. ఎచ్చట ప్రథమమునందు తాత్పర్యసందేహము గాని, లేక తాత్పర్యాభావనిశ్చయము గాని, కలిగి యుత్తరకాలమునందు తాత్పర్యనిశ్చయ మగుచున్నదో యచట శాబ్దబోధము కలుగుచున్నది. అందువలన తాత్పర్యసందేహముకంటె నుత్తరకాలభావి యగు శాబ్దబోధమునందును, తాత్పర్యాభావనిశ్చయముకంటె నుత్తరకాలభావి యగు శాబ్దబోధమునందును తాత్పర్యజ్ఞానము హేతువై యున్నది. శాబ్దబోధమునందు హేతువు కాదు. ఈమతమునందు దోషము వేదాంతశిఖామణియందు వ్రాయబడినది ఈఖండనమునందు ఆగ్రహము లేనందున దోషము వ్రాయబడలేదు. వివరణకార, మంజూషాకారులయొక్క మతములందు ఎట్లు పూర్వోత్తర

మీమాంసలు నిష్ఫలము లగునో అట్లు ఈమతమందు మీమాంస నిష్ఫలము కాదు. ఎట్లనగా, ఈమతమునందు తాత్పర్యసందేహోత్తర శాబ్దబోధమునకు తాత్పర్యజ్ఞానము హేతువై యున్నది. మఱియును వేదవాక్యమునందు తాత్పర్య సందేహము కలుగుచున్నది. దానికి నివృత్తి మీమాంసవలన గలుగుచున్నది. వేదవాక్యమునందు సందేహమును, దాని నివృత్తియును ఎట్లు కలుగుచున్నవో ఆక్రమము పూర్వోత్తరమీమాంసలయందు స్పష్టమై యున్నది.

ఈరీతిగా "ఆకాంక్షా" "యోగ్యతా" "తాత్పర్యములు" శాబ్దబోధ మునకు హేతువై యున్నవి. అయిన నాకాంక్షాదిజ్ఞానము హేతువై యున్నది. కాని స్వరూపముచేత నాకాంక్షాదికము హేతువు కాదు. ఎట్లనగా, ఎచ్చట నాకాంక్షాదిశూన్యవాక్యములయందు నాకాంక్షాదిభ్రమము కలుగుచున్నదో యచ్చట శాబ్దబోధము కలుగుచున్నది. స్వరూపముచేత నాకాంక్షాదికమునకు హేతుత్వ మంగీకరించినయెడల నాకాంక్షాదిభ్రమస్థలములయందు శాబ్దబోధము కాకపోవలయును, మఱియు నాకాంక్షాదిజ్ఞానమునకు హేతుత్వ మంగీకరించిన యెడల శాబ్దబోధముయొక్క కారణభ్రమరూపజ్ఞానము కలుగుటవలన శాబ్ద బోధము సంభవించుచున్నది. మఱియును స్వరూపముచేత నాకాంక్షాదికమునకు హేతుత్వ మంగీకరించినయెడల నాకాంక్షాదికము లుండినను శ్రోతకు నీవాక్య మాకాంక్షాదిశూన్య మని యెచ్చట భ్రమము కలుగుచున్నదో యచ్చట శాబ్ద బోధము కావలయును; అయిన నట్లగుట లేదు. దానిచేత నాకాంక్షాదిక జ్ఞానము హేతువై యున్నది. ఆజ్ఞానము "భ్రమ" మైనను, లేక "ప్రమ"మై నను కావలయును. శాబ్దబోధమునకు భ్రమ, ప్రమా, సాధారణాకాంక్షాదిక జ్ఞానము హేతువై యున్నది. భ్రమసామగ్రిచేత శాబ్దబోధభ్రమ కలుగుట లేదు. ఇంకే మనగా, విషయముయొక్క అభావమువలన శాబ్దబోధభ్రమము కలుగు చున్నది. ఉ. "వహ్నివ్యభిచారి" యైనపృథివీత్వమునందు "వహ్నివ్యాప్యతా భ్రమము" కలిగి పృథివీత్వరూపహేతువువలన వహ్నిసహిత పర్వతమునందు వహ్న్యనుమితిజ్ఞానము కలుగుచున్నది. అది విషయముయొక్క సద్భావమువలన ప్రమయై యున్నది. విషయశూన్యదేశమునందు వ్యభిచారిహేతువువలన అను మితిభ్రమము కలుగుచున్నది. అందువలన విషయ ముండుటచేత నెట్లు భ్రమ సామగ్రిచేత ననుమితిప్రమ కలుగుచున్నదో యట్లు శాబ్దబోధమునకు సామగ్రి యైన యాకాంక్షాదికజ్ఞానము భ్రమ మైనను ప్రమ యైనను అయియుండును.

ఎచ్చట విషయసద్భావ ముండునో యచట శాబ్దబోధము ప్రమయై యున్నది. ఎచ్చట విషయాభావ మున్నదో యచట శాబ్దబోధము భ్రమయై యున్నది. అయిన నెచ్చట యోగ్యతాజ్ఞానము భ్రమయై యున్నదో యచట నియమముగా శాబ్దబోధము కలుగుచున్నది. అది ప్రమ కాదు. ఎట్లన, ఎచ్చట శాబ్దబోధ విషయ మున్నదో యచ్చట నియమముగా యోగ్యతాజ్ఞానము ప్రమయై యున్నది. ఎచట యోగ్యతాజ్ఞానము భ్రమయై యున్నదో అచట నియమముగా శాబ్దబోధవిషయము లేదు. అందువలన నీనియమము సిద్ధించుచున్నది. విషయ సద్భావమువలన శాబ్దబోధము ప్రమ, విషయాభావమువలన భ్రమ మగు చున్నది. ఎట్లు, ఆకాంక్షాదికజ్ఞానము శాబ్దబోధమునకు హేతువై యున్నదో అట్లు ఆసత్తి కూడ శాబ్దబోధమునకు హేతువై యున్నది. న్యాయగ్రంథముల యందు పదములయొక్క సామీప్యము "ఆసత్తి యని చెప్పబడియున్నది. వ్యవహితపదముయొక్క యర్థమునకు నన్వయబోధము కలుగుట లేదు. ఉ. "గిరి ర్భుక్తం వహ్నిమాన్ దేవదత్తేన" యను వాక్యముచేత నన్వయబోధము కలుగుట లేదు. మఱియు నేమనగా "గిరి ర్వహ్నిమాన్, భుక్తం దేవదత్తేన" అనినచో శాబ్దబోధము కలుగుచున్నది. అందువలన పదములయొక్క సామీప్యరూపాసత్తియు శాబ్దబోధమునకు హేతువై యున్నది. ఎచ్చట సామీప్యము లేక సామీప్యభ్రమ మున్నదో యచ్చట శాబ్దబోధము కలుగుచున్నది. అందువలన భ్రమ, ప్రమా, సాధారణ మయిన యాసత్తిజ్ఞానము హేతువై యున్నది. స్వరూపముచేత నాసత్తి హేతువు కాదు. మఱియును గ్రంథములయం దిట్లు వ్రాయుంబడి యున్నది. ఎచ్చట వ్యవహితపద మున్నదో ఆశ్లోకాదికమునందు శాబ్దబోధము కలుగుచున్నది. అందువలన "ఉక్తాసత్తి" శాబ్దబోధమునకు హేతువు కాదు. ఇక నే మనగా, శక్తి లక్షణాన్యతరరూప పదముయొక్క సంబంధముచేత పదార్థములకు వ్యవధానరహిత స్మృతి కలుగుచున్నదో యా యాసత్తి శాబ్దబోధమునకు హేతువై యున్నది. పదములకు వ్యవధానము కాని, అవ్యవధానము కాని యున్నది. ఏపదార్థమునకు కేపదార్థముతో నన్వయబోధము కలుగు చున్నదో యాపదార్థముయొక్క స్మృతి వ్యవధానము లేకయె కావలసి యున్నది. పదార్థస్మృతిమాత్రముచేత శాబ్దబోధ మయినప్పుడు ఏవిధముగా నేపదార్థముయొక్క స్మృతి కలుగుచున్నదో దానికి శాబ్దబోధము కావలయును. పదముయొక్క సంబంధముచేత పదార్థస్మృతి శాబ్దబోధము

నకు హేతు నని చెప్పినెడల సకలపదములకు ఆకాశముతో సమవాయ సంబంధము ఉన్నది. మఱియును ఆత్మయందు సకలపదములకు స్వానుకూల కృతిమత్త్వ సంబంధము ఉన్నది. అందువలన ఘటాదిపదముయొక్క సమ వాయ సంబంధముచేత నాకాశమునకు నెచట స్మృతి కలుగుచున్నదో, మఱి యును, స్వానుకూలకృతి సంబంధముచేత నాత్మకెచ్చట స్మృతి కలుగుచున్నదో యచ్చట నారెంటికిని "ఘట మానయ" ఇత్యాది వాక్యములచేత బోధము కలుగవలయును. అందువలన శక్తి లక్షణాన్యతరవృత్తిరూప పదముయొక్క సంబంధముచేత కలుగుచున్న పదార్థ స్మృతి శాబ్దబోధమునకు హేతువై యున్నది. "ఘటా"ది పదములయొక్క సమవాయసంబంధము ఆకాశమునం దున్నది; స్వానుకూల కృతిమత్త్వ సంబంధము ఆత్మయం దున్నది; కాని శక్తి, లక్షణాన్యతరవృత్తి రూపసంబంధము ఘటాదిపదమునకు నాకాశమునందును, ఆత్మయందును లేదు. "ఆకాశ, గగనాది" పదములయొక్క శక్తిరూప సంబం ధము ఆకాశమునం దున్నది. స్వపదాత్మపదములయొక్క శక్తి సంబంధము ఆత్మయం దున్నది. అందువలన నాకాశ సహితవాక్యముచేత నాకాశము యొక్క శాబ్దబోధము, ఆత్మసహితవాక్యముచేత నాత్మయొక్క శాబ్దబోధమును కలుగుచున్నది. ఈవిధముగా నేపదముయొక్క వృత్తిరూప సంబంధముచేత నేపదార్థమునకు స్మృతి కలుగుచున్నదో యట్టి పదముచేత నాయర్థమునకు శాబ్ద బోధము కలుగుచున్నది. ఇట్లు చెప్పినను, 'ఘట మానయ' యను వాక్యముచేత నేబోధము కలుగుచున్నదో యాబోధమున కుత్పత్తియు, "ఘటః" "కర్మత్వం" 'ఆనయనం' "కృతిః" యను పదములచేతను గలుగవలయును. ఎట్లన, రెండు వాక్యములయొక్క పదములకు శక్తి సమానమై యున్నది. ప్రథమ వాక్యము చేత శాబ్దబోధము కలుగుచున్నది; రెండవ వాక్యముచేత కలుగుట లేదు. ఇందులకు కారణ మే మనగా 'యోగ్యపదముయొక్క వృత్తిచేత పదార్థ స్మృతి కలిగి దానికి శాబ్దబోధము కలుగుచున్నది. ప్రథమవాక్యముయొక్క పదము యోగ్యమై యున్నది. ద్వితీయవాక్యముయొక్క పదములు యోగ్యములు కావు. యోగ్యతాయోగ్యతలు అనుభవానుసారముగా 'అనుమేయములై' యున్నవి. ఏపదములచేత శాబ్దబోధము అనుభవసిద్ధమై యున్నదో ఆపదముల యందు 'యోగ్యత' యున్నది. ఏపదములచేత శాబ్దబోధాభావము అనుభవసిద్ధ మై యున్నదో దానియందు యోగ్యత లేదు. ఈరీతిగా "యోగ్య" పదము

యొక్క వృత్తిరూప సంబంధముచేత వ్యవధాన రహితపదార్థ స్మృతి "ఆసత్తి" యని చెప్పఁబడుచున్నది. ఈవిధముననే ఆసత్తియు స్వరూపముచేత శాబ్దబోధమునకు హేతువై యున్నది. దానియొక్క జ్ఞానము హేతువు కాదు. ఈప్రకారముగా 'ఆకాంక్షాజ్ఞానము', 'యోగ్యతాజ్ఞానము', 'తాత్పర్యజ్ఞానము', 'ఆసత్తి' యీ నాలుగును శాబ్దబోధమునకు హేతువులై యున్నవి. ఈనాలుగును శాబ్దబోధసామగ్రి యని వాడబడుచున్నవి.

౫౦. ఉత్కట జిజ్ఞాసయొక్క బోధహేతుత్వ నిరూపణము.

"అనుమితి సామగ్రి" వ్యాప్తిజ్ఞానమై యున్నది. ప్రత్యక్షసామగ్రి ఇంద్రియ సంయోగాదికమై యున్నది. ఎచ్చట నీద్వివిధసామగ్రి యున్నదో యచ్చట రెంటియొక్క ఫలము కలుగుట లేదు. ఎట్లన ఏకక్షణమునందు రెండు జ్ఞానములుత్పన్నము లగుట లేదు. యద్యపి, రెండుజ్ఞానములకు నొకక్షణ మాధారమై యున్నది. తథాపి, జ్ఞానద్వయోత్పత్తికి ఏకక్షణ మాధారము కాదు. అట్టి యుత్పత్తియును గూడ వ్యధికరణము లగు రెండుజ్ఞానములకు నేక క్షణమునందు కలుగుచున్నది. ఉ. దేవదత్తునియొక్క జ్ఞానము యజ్ఞదత్తునియొక్క జ్ఞానము కూడ వ్యధికరణము లై యున్నవి. వానికి నుత్పత్తియు నొకక్షణమునందు కలుగుచున్నది. తథాపి, సమానాధికరణములగు రెండుజ్ఞానములకు నేకక్షణమునందు నుత్పత్తి కలుగుట లేదు. ఇది సిద్ధాంతమై యున్నది.

సామగ్రీద్వయముయొక్క ఫలము ఏకకాలమునందు కలుగుట లేదు. అందువలన ప్రబల సామగ్రియొక్క ఫలము కలుగుచున్నది. దుర్బలమునకు బాధ కలుగుచున్నది. ప్రబలత, దుర్బలతలు అనుభవానుసారముగా ననుమేయములై యున్నవి. ఉ. భూతల ఘటములకు నేత్ర సంయోగము ఉండినప్పుడు "ఘటవ ద్భూతలమ్" అను వాక్యముయొక్క శ్రవణము కలుగుచున్నది. అచ్చట భూతలము ఘటసహితమై యున్నది, అని ప్రత్యక్షజ్ఞానముయొక్కయు శాబ్దజ్ఞానముయొక్కయు సామగ్రి యున్నది. తథాపి, ప్రత్యక్షజ్ఞానము కలుగుచున్నది, శాబ్దజ్ఞానము కలుగుట లేదు. అందువలన సమానవిషయక ప్రత్యక్షజ్ఞానముయొక్కయు, శాబ్దజ్ఞానముయొక్కయు రెండు సామగ్రు లెచట నున్నవో అచట ప్రత్యక్షజ్ఞాన సామగ్రి ప్రబలమై యున్నది, శాబ్దజ్ఞానసామగ్రి దుర్బలమై యున్నది. మఱియును, ఎచట భూతలసంయుక్త ఘటముతో నేత్రసంయోగమున్నదో మఱియు నాకాలమునందే "పుత్త్రస్తే జాతః" అను వాక్యశ్రవణము

కలుగుచున్నదో యచట భూతలమునందు ఘటప్రత్యక్షము కలుగుట లేదు. మఱియు నే మనగా, పుత్రజన్మవిషయక శాబ్దబోధము కలుగు మన్నది. అందు వలన భిన్నవిషయకజ్ఞానములయొక్క ప్రత్యక్షసామగ్రియును శాబ్దసామగ్రియును నెచట నున్నవో యచట శాబ్దసామగ్రి ప్రబలమై యున్నది. ప్రత్యక్షసామగ్రి దుర్బలమై యున్నది. ఈవిధముగా బాధ్యబాధకభావములను విచారించి సూక్ష్మదర్శి యగునట్టి పురుషుడు ప్రబలదుర్బల భావముల నెఱుంగవలయును. అయిన, జిజ్ఞాసాకొూన్య స్థలములయందు పూర్వోక్త బాధ్యబాధకభావము లున్నవి. ఎచ్చట నేకవస్తువుయొక్క జిజ్ఞాస యుండి, అన్యవస్తు జిజ్ఞాస లేదో, మఱియు ద్వివిధబోధసామగ్రులు ఉన్నవో యచ్చట జిజ్ఞాసిత బోధముకలుగు చున్నది కాని యజిజ్ఞాసితబోధము కలుగదు. అందువలన జిజ్ఞాసితముయొక్క బోధసామగ్రి ప్రబలమై యున్నది. అజిజ్ఞాసితముయొక్క బోధసామగ్రి దుర్బల మై యున్నది. జ్ఞానముయొక్క యిచ్ఛ జిజ్ఞాస యనబడును. దానికి విషయము జిజ్ఞాసిత మనబడును. జిజ్ఞాసాసహితసామగ్రి ప్రబలమై యున్నది. ఎచ్చట నుభయ జిజ్ఞాస యున్నదో యచ్చట నుత్కట జిజ్ఞాస బాధకమై యున్నది. ఈ కారణముచేత నధ్యాత్మ గ్రంథములయందు ఉత్కట జిజ్ఞాసులకు బ్రహ్మబోధము కలుగుచున్నది. ఉత్కట జిజ్ఞాసారహితులకు బ్రహ్మబోధము కలుగ దని వ్రాయ బడి యున్నది. ఎట్లన, జిజ్ఞాస్యపదార్థముయొక్క జిజ్ఞాసాసహితబోధసామగ్రి యుండినప్పుడు ఆయుత్కట జిజ్ఞాసాసహిత బోధ సామగ్రులచేత దానియొక్క బోధము కలుగుచున్నది. అన్యథా, జిజ్ఞాసాసహితబోధసామగ్రిచేత అన్యసామగ్రు లకు బాధ కలుగుచున్నది. లౌకిక పదార్థముయొక్క జిజ్ఞాస, దానియొక్క ప్రత్య క్షాదిబోధ సామగ్రులకును సర్వదా జాగ్రత్కాలమునందు సంభవ మున్నది. దానిచేత జిజ్ఞాసారహిత బ్రహ్మబోధసామగ్రికి బాధ కావలయును. అందువలన లౌకికపదార్థముయొక్క జిజ్ఞాసాసహిత ప్రత్యక్షాది బోధసామగ్రుల బాధకొఱకు బ్రహ్మముయొక్క యుత్కట జిజ్ఞాస కావలసియున్నది. ఉత్కట జిజ్ఞాసాసహితబ్రహ్మ బోధసామగ్రిచేత లౌకిక పదార్థముయొక్క బోధసామగ్రులకు బాధ కలుగు చున్నది. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా," ఈ సూత్రమునకును ఈ యర్థమునందే తాత్పర్యము. యద్యపి, వ్యాఖ్యానకారులచేత విచారమునందు జిజ్ఞాసా పదమునకు లక్షణ చెప్పబడియున్నది. కర్తవ్యపదముయొక్క యధ్యాహారమును చెప్పబడి యున్నది. అందువలన బ్రహ్మజ్ఞానముకొఱకు వేదాంతవాక్యముయొక్క విచారము

కర్తవ్యము అని సూత్రముయొక్క యర్థము. తథాపి, విచార వాచకపదమును త్యజించి లాక్షణిక జిజ్ఞాసా పదముయొక్క ప్రయోగముతో సూత్రకారులకు వాచ్యము, లక్ష్యము, అనునీరెంటి యర్థమునందును తాత్పర్యము ఉన్నది. బ్రహ్మ జిజ్ఞాసయును బ్రహ్మబోధమునకు హేతువై యున్నది. ఇది వాచ్యార్థమై యున్నది. ఏకశబ్దముచేత లక్షణావృత్తి, శక్తివృత్తులచేతను, రెండర్థములయొక్క బోధము కలుగుట లేదు. ఇది ప్రాచీనోక్తి. ఈ ప్రాచీనోక్తికి ''గంగాయాం మీనఘోషౌ'' అను నీవాక్యమునందు వ్యభిచారము ఉండుటవలన శ్రద్ధాయోగ్యము కాదు. ''గంగా యాం మీనఘోషౌ'' అను నీవాక్యార్థమునందు గంగాపదముయొక్క వాచ్యార్థమునకు మీనముతో సంబంధము ఉన్నది. మఱియును లక్ష్యార్థమునకు ఘోషముతో సంబంధము ఉన్నది. అందువలన గంగాప్రవాహమునందు మీనము ఉన్నది, తీరమునందు ఘోషము ఉన్నది అని యీవాక్యముయొక్క యర్థము గ్రంథకారులచేత వ్రాయబడి యున్నది. యద్యపి, సూత్రమునకు అనేకార్థములు వ్రాయబడి యున్నవి. తథాపి, అనేకార్థములు సూత్రకారులకు భూషణములై యున్నవి. విచారమువలె జిజ్ఞాసయందును విధి సంభవించుచున్నది. ఒకవేళ సంభవింపదు. గ్రంథవిస్తరభీతిచే విరమించితిని.

## ౫౧. వేదాంతముయొక్క తాత్పర్యము.

వేదము, శబ్దము, వీని విచారమునుగుఱించి యాకాంక్షాజ్ఞానాదికము శాబ్ద బోధమునకు హేతువై యున్నది. దానియందు తాత్పర్యజ్ఞానమున్నది. వేదముయొక్క తాత్పర్యజ్ఞానమునకు ఉపక్రమాదికము హేతువై యున్నది. ఆయుపక్రమాదికముచేత వేదాంతవాక్యముయొక్క తాత్పర్యము అద్వితీయబ్రహ్మమునందున్నది. ఉపాసనావిధియందు తాత్పర్యము లేదు. ఈయర్థము భాష్యకారులచేత సమన్వయ సూత్రమునందు విస్తారముగా వ్రాయబడి యున్నది. అందువలన, మీమాంసకవృత్తికారులయొక్క మతములు సరి కావు. ఆమతముల ఖండనమునకు అనుకూలమయినతర్కము శ్రోతలకు దుర్విజ్ఞేయమైనందున నిచ్చట వ్రాయబడలేదు. ఈవాక్యముచేత శ్రోతలకు ఈయర్థబోధము కావలసినదని వక్తయొక్క తాత్పర్యమని చెప్పబడును. మీమాంసకమతమునందు వేదము నిత్యమైయున్నది. దానియందు వేదకర్తయొక్క యిచ్ఛ సంభవించుట లేదు. అధ్యాపకుని యిచ్ఛ యున్నది. నైయాయికమతమునందు శబ్దము మూడవక్షణమునందు నాశమగుచున్నది. వేదము కూడ శబ్దరూపమయినందున క్షణికమై యున్నది. మూడవక్షణ

మునందు దేనికి నాశ మున్నదో యది క్షణిక మని చెప్పబడును. నైయాయికమతమునం దుచ్చారణయొక్క భేదమువలన వేదమునకు భేద మున్నది. ఒకపర్యాయముచ్చరించి తిరిగి యేది యుచ్చరింపబడునో ఆవాక్యము పూర్వవాక్యముకంటె భిన్నమై యున్నది. పూర్వవాక్యముయొక్క సజాతీయ ముత్తరవాక్యమై యున్నది. అందువలన సభేదభ్రమము కలుగుచున్నది. నైయాయిక మతమునందు భారతాదికమువలె వేదము పౌరుషేయమై యున్నది. క్షణికమైయు నున్నది. వర్ణసముదాయమునకంటె భిన్నమగు వేదము లేదు. వర్ణసముదాయమే వేద మని చెప్పబడుచున్నది. ఆసముదాయము ప్రత్యేకవర్ణముకంటె భిన్నము కాదు. వేదము వర్ణరూపమై యున్నది. ఆవర్ణము శబ్దరూపమై యున్నది. శబ్దము ఆకాశగుణమై యున్నది. నానాశబ్దములకు నేకకాలమునందు ఉత్పత్తి కలుగుట లేదు. ఎట్లు ఆత్మయొక్క విశేషగుణము జ్ఞానాదికమై యున్నదో యట్లు ఆకాశముయొక్క విశేషగుణము శబ్దమై యున్నది. మఱియును విభువుయొక్క యేవిశేషగుణము ఉన్నదో ఆవిశేషగుణద్వయము ఏకకాలమునందు నుత్పన్నమగుట లేదు. యద్యపి, దేవదత్తునియొక్క శబ్దమును యజ్ఞదత్తునియొక్క శబ్దమును ఏకకాలమునందు కలుగుచున్నవి. మఱియును భేరియొక్క శబ్దము, తాళముయొక్క శబ్దమును కూడ ఏకకాలమునందు కలుగుచున్నవి. యద్యపి సమానాధికరణము లగు రెండు శబ్దములకు నేకకాలమునందు ఉత్పత్తి యగుట లేదు. ఆశబ్దముయొక్క సమవాయము ఏకాకాశమునం దున్నది. శబ్దము సమవాయసంబంధముచేత ఆకాశవృత్తి యగుటవలన సమానాధికరణమై యున్నది. ఏశబ్దము వ్యధికరణము కాదు. తథాపి యెట్లు ఆకాశమునందు శబ్దముయొక్క సమవాయ సంబంధ మున్నదో అట్లు కంఠము, తాలువు, దంతము, నాసిక, ఓష్ఠము, జిహ్వామూలము, ఉరస్సు, శిరస్సు, యీయష్టాంగములయందును వర్ణరూపశబ్దములయొక్క అవచ్ఛేదకతా సంబంధ మున్నది. ధ్వనిరూపశబ్దముయొక్క యవచ్ఛేదకతాసంబంధము భేరీతాళాదికమునం దున్నది. ఏకాధికరణమునందు వృత్తికి సమానాధికరణ మని పేరు. సమవాయసంబంధముచేత శబ్దము ఆకాశవృత్తి యైనందున సమానాధికరణ మైనను, అవచ్ఛేదకతా సంబంధముచేత దేవదత్త యజ్ఞదత్త శబ్దములు వ్యధికరణములై యున్నవి. అట్లే భేరీతాళ శబ్దములు కూడ అవచ్ఛేదకతా సంబంధముచేత వ్యధికరణములై యున్నవి. అవచ్ఛేదకతా సంబంధముచేత ఏకాధికరణమునందు రెండు శబ్దములకు నేకకాలమునందు ఉత్పత్తి కలుగుట

లే దనునియమము సిద్ధించుచున్నది. దానియర్థ మేమనఁగా, ఏకావచ్ఛేదకము నందు శబ్దమున కుత్పత్తి కలుగుట లేదు. అందువలన వాక్యముయొక్క యవ యవరూప వర్ణమునకు ఏకకాలమునం దుత్పత్తి కలుగుట లేదు. మఱియును ఏమనగా వర్ణము క్రమముగా నుత్పన్న మగుచున్నది. క్రమముగా నుత్పన్నమైన వర్ణమునకు నిమిత్తము లేకయే నాశనము నంగీకరించినయెడల సకలవర్ణముల కును ప్రథమక్షణమునందు ఉత్పత్తియును, ద్వితీయక్షణమునందు నాశమును కావలయును. అందువలన ఉత్పత్తినాశములు లేకయె శబ్దమునందు ఒకప్రత్యక్ష త్వాదిక వ్యాపారము సిద్ధము కాకపోవలయును. అందువలన శబ్దముయొక్క నాశమునకు ఏదైన ఒకనిమిత్తము నంగీకరింపవలసినది ఏ నిమిత్తము లేక ద్వితీయక్షణమునందు శబ్దనాశము కలుగుట లేదో ఆనిమిత్తమును జెప్పుటకు వీలు లేదు. పూర్వశబ్దనాశమునకు హేతువు స్వోత్తరవర్తి శబ్దమై యున్నది. "గౌః" అనువాక్యమునందు పురుషకృతివలన నాభిదేశముచేత వాయువునందు క్రియ గలిగి గకారజనక మైనజిహ్వామూలమునందు వాయుసంయోగము కలిగి "ఔ" కారజనక కంఠోష్ఠములచేత వాయుసంయోగము కలుగుచున్నది. తదనంతరము విసర్గజనక మైనకంఠముతో వాయుసంయోగము కలుగుచున్నది. ఏవిధముగా నీత్రివిధసంయోగము కలుగుచున్నదో ఆవిధముగానే "గకార" "ఔకార" "విసర్గ" రూప మయినత్రివిధవర్ణములు కలుగుచున్నవి. యద్యపి, కౌముద్యాదిగ్రంథములయందు కవర్గమును కంఠస్థానము వ్రాయబడియున్నది. తథాపి, "పాణినీ" కృతశిక్షయందు 'క' వర్గమునకు జిహ్వామూలస్థానము వ్రాయబడియున్నది. ఆశిక్షావచనానుసారముగ జిహ్వామూలమునందు వాయు సంయోగముచేత 'గ' కారమునకు నుత్పత్తి చెప్పబడినది. వ్యాకరణమతము నందు యద్యపి "గౌః" అనువర్ణము వాక్యరూపముగా లేదు. తథాపి, న్యాయ మతమునందు వాక్య మని చెప్పబడినది. ప్రథమక్షణమునందు 'గ' కారమునకు, ద్వితీయక్షణమునందు 'ఔ' కారమునకు, తృతీయక్షణమునందు "విసర్గము" నకు నుత్పత్తి కలుగుచున్నది. అచ్చట 'గ' కారనాశమునకు 'ఔ' కారము హేతువై యున్నది. 'ఔ' కారనాశమునకు 'విసర్గము' హేతువై యున్నది. తృతీయక్షణమునందు శబ్దములకు నాశము కలుగుచున్నది గాని స్వోత్పత్తి ద్వితీయక్షణమునందు లేదు. ఎట్లనగా నాశమునకు హేతువు స్వోత్తరశబ్దమై యున్నది. అది ద్వితీయక్షణమునందు నుత్పన్న మగుచున్నది. కారణసిద్ధి లేక

కార్యము కలుగదు. ప్రథమక్షణమునందు ద్వితీయశబ్దము అసిద్ధమై యున్నది. అందువలన ద్వితీయక్షణమునందు సిద్ధమైనద్వితీయశబ్దముచేత తృతీయక్షణము నందు ప్రథమశబ్దమునకు నాశము కలుగుచున్నది. ఈవిధముగా తృతీయశబ్దము చేత ద్వితీయశబ్దమునకు నాశము కలుగుచున్నది. ఈరీతిగా నుపాంత్యశబ్దపర్యం తము శబ్దమునకు నాశము కలుగుచున్నది. మఱియు నంత్యశబ్దమునకు నుపాంత్య శబ్దముచేత "సుందోపసుందుల" న్యాయముగ నాశము కలుగుచున్నది. సుందో పసుందు లిరువురు సహోదరులు. వారికి పరస్పరనాశము భారతమునందు ప్రసిద్ధమై యున్నది. కాని దీనియందీ దోష మున్నది. ఉపాంత్యశబ్దముచేత నంత్యశబ్దంబునకు నాశ మంగీకరించినయెడల ద్వితీయక్షణమందె అంత్యశబ్దం బునకు నాశము కలుగవలయును. అందువలన నుత్పత్తినాశములకంటె నన్య వ్యాపారరహితాంత్యశబ్దము అప్రత్యక్షము కావలయును. జగదీశభట్టాచార్యుల చేత నంత్యశబ్దం బప్రత్యక్ష మని చెప్పంబడినది. అందుచేత నప్రత్యక్షమునకు అపాదానము ఇష్టమై యున్నదే కాని దోషము కాదు. తృతీయక్షణము నందు శబ్దమునకు నాశము కలుగుచున్న దనునియమమునకు భంగము కలుగ వలయును. అందువలన నంత్యశబ్దముయొక్క నాశమునందు ఉపాంత్యశబ్దము యొక్క నాశము హేతువై యున్నది. ఉపాంత్యశబ్దము హేతువు కా నేరదు. ఈపక్షములో నంత్యశబ్దముయొక్క నాశమునందు ద్వితీయక్షణమునందు నాశా పత్తి లేదు. ఎట్లనగా: ఉపాంత్యశబ్దముయొక్క నాశము అంత్యశబ్దముచేత కలుగుచున్నది. అందువలన అంత్యశబ్దముయొక్క ద్వితీయక్షణమునందు ఉపాం త్యనాశమును, తదుత్తరక్షణమునందు అంత్యనాశమును కలుగుచున్నవి. ఈవిధ ముగా సమస్తశబ్దంబులకు నాశము తృతీయక్షణమునందు కలుగుచున్నది. దీనికి మఱియొక యాక్షేప మే మనగా, ఎచ్చట నొక్కవర్ణరూపశబ్ద మున్నదో యచ్చట శబ్దముయొక్క నాశమునకు హేతువు మఱియొక శబ్ద మేదియును లేదు. ఇందులకు సమాధాన మే మనగా, ఎట్లు కంఠాదికముతో వాయుసంయోగము వర్ణరూపశబ్దమునకు హేతువై యున్నదో, మఱియును 'భేర్యాదికము'తో దండాది' సంయోగము ధ్వనిరూపశబ్దమునకు హేతువై యున్నదో మఱి యును వంశముయొక్క దళద్వయవిభాగము ధ్వనిరూపశబ్దంబునకు హేతువై యున్నదో అట్లు శబ్దము కూడ శబ్దంబునకు హేతువై యున్నది. భేరీదండముల సంయోగముచేత భేరీదేశమునందు నేశబ్దము కలుగుచున్నదో దానివలన నుత్పన్న

మైన యేశబ్దముయొక్క సాక్షాత్కారము శ్రవణేంద్రియంబులచేత గలుగుచున్నదో అట్లే కంఠాదిదేశమునందు వాయుసంయోగముచేత నేవర్ణరూపశబ్దము ఉత్పన్న మగుచున్నదో వానికి శ్రోత్రేంద్రియముచేత సాక్షాత్కారము కలుగుట లేదు. మఱియు నే మనగా, వర్ణరూపశబ్దముచేత నన్యశబ్ద ముత్పన్న మగుచున్నది. దానికి సాక్షాత్కార మగుచున్నది. ఈప్రకారముగా అన్యశబ్దరహితైకశబ్దము అలీకమై యున్నది; కాని, యీమతమునందు వర్ణసముదాయరూపపదమునకు నేకకాలమునందు సంభవము లేదు. అందువలన పదసాక్షాత్కారము సంభవించుట లేదు. తథాపి, ప్రత్యేకవర్ణముయొక్క సాక్షాత్కారము వలన సమస్తవర్ణములను విషయీకరించు నొకస్మృతి కలుగుచున్నది. స్మృతి పదముచేత పదార్థమునకు స్మృతి కలుగుచున్నది. అలాగుననే శాబ్దబోధము కలుగుచున్నది. అథవా, పూర్వపూర్వవర్ణములయొక్క యనుభవముచేత సంస్కారము కలుగుచున్నది. సంస్కారసహితాంత్యవర్ణముయొక్క యనుభవమే పదానుభవ మనఁబడును. దానివలన పదార్థస్మృతి కలుగుచున్నది. దానివలన శాబ్దబోధ మగుచున్నది ఇది న్యాయమతము. మీమాంసకమతమునందు వర్ణము నిత్యమై యున్నది. అందువలన వర్ణసముదాయరూపవేదము కూడ నిత్యమై యున్నది. "వర్ణము విభువై" యున్నది. ఎచ్చట కంఠాదిదేశమునందు నధ్యాత్మవాయువుయొక్క సంయోగము కలుగుచున్నదో అచ్చట వర్ణాభివ్యక్తి కలుగుచున్నది. నైయాయికమతమునందు వర్ణోత్పత్తికి ఏది హేతువై యున్నదో అది మీమాంసకమతమునందు వర్ణాభివ్యక్తికి హేతువై యున్నది. ఈప్రకారముగా వర్ణసముదాయరూపవేదము నిత్యమై యున్నది. అందువలన నపౌరుషేయమై యున్నది. మఱియును, వేదాంతమతమునందు వర్ణమును దానిసముదాయరూపవేదమును నిత్యములు కావు. ఎట్లనగా: వేదమున కుత్పత్తియు శ్రుతియందు చెప్పబడినది. చేతనముకంటె భిన్నమై సమస్తమును అనిత్యమై యున్నది. అందువలన వేదము నిత్యము కాదు; క్షణికమును కాదు. మఱియు నే మనగా సృష్ట్యాదికాలమునందు సర్వజ్ఞుడైనయీశ్వరునియొక్క సంకల్పమాత్రముచేత వేదమున కుత్పత్తి యున్నది. అందుచేత శ్వాసమువలె ననాయాసముగా నీశ్వరుడు వేదమును రచియించియున్నాడు. నైయాయికమతమునందు 'భారతాదికమువలె వేదము పౌరుషేయమై యున్నది. వేదాంతమతమునందు భారతాదికమువలె ఈశ్వరరూపపురుషునిచేత రచిత మైనందున పౌరుషేయమై యున్నది.

అయిన సర్వజ్ఞవ్యాసాదులు సకలసర్గసృష్టియందును భారతాదికమును రచియించి యున్నారు. దానియందు నిక్రిందినియమము లేదు. పూర్వసర్గమునం దెట్లు "ఆనుపూర్వి" యున్నదో అట్లే భారతాదికము ఉత్తరసర్గమునం దున్నది. అయిన, తనయొక్క యిచ్ఛానుసారముగా భారతాదిగ్రంథములయొక్క "అను పూర్వి" రచియింపబడినది. మఱియును, వేదముయొక్క 'ఆనుపూర్వి' విలక్షణ మై యుండ లేదు. మఱియు నేమనగా: పూర్వసర్గముయొక్క "యానుపూర్వి"ని గ్రహించి ఉత్తరసర్గము నందు పూర్వకల్పసమా 'నానుపూర్వి' సహిత వేదమును ఈశ్వరుడు రచియించియున్నాడు. పురుషరచితతారూపపౌరుషేయత్వము వేద మునందును భారతాదులయందును సమానమై యున్నది. అన్యసర్గముయొక్క యానుపూర్వియొక్క స్మరణము లేకయే పురుషరచితత్వరూపపౌరుషేయత్వము భారతాదికమం దున్నది; వేదమునందు లేదు. వేదమునందు పూర్వసర్గము యొక్క ఆనుపూర్వీస్మరణపూర్వక పురుషరచితత్వ మున్నది. అందువలన వేదము యొక్క ఆనుపూర్వి అనాదియై యున్నది. మఱియు నీశ్వరరూప పురుషునిచేత రచితమై యున్నది; విరోధము లేదు.

ఇతి, శ్రీమన్నిశ్చలదాసాహ్వయసాధువిరచిత మగువృత్తిప్రభాకరమునందు
ప్రమాణనిరూపణ మను తృతీయప్రకాశము
సమాప్తము.

## అధ, ఉపమానప్రమాణ నిరూపణమను చతుర్థప్రకాశప్రారంభము.

### ౯౨. క్రమభంగముయొక్క యభిప్రాయపూర్వకద్వివిధన్యాయరీతిగా ఉపమానోపమితులయొక్క ద్వివిధస్వరూపము.

యద్యపి, న్యాయవేదాంతములయొక్క సమస్తగ్రంథములయందు ఉపమాననిరూపణానంతరము శబ్దనిరూపణము చేయబడినది. తథాపి, త్రివిధప్రమాణవాది యైనసాంఖ్యాదులచేత ఉపమానము చెప్పబడలేదు. ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, అను త్రివిధప్రమాణములు మాత్రమే యంగీకరింపబడినవి. దానికి(అనగా ఉపమానమునకు)ఉపయుక్త మైనప్రమాణము పూర్వమునందే చెప్పవలసినది. అందువలన శబ్దప్రమాణోత్తరమునందు ఉపమాననిరూపణముచేయబడియున్నది. ఏప్రకారముగా శాస్త్రములయందు అధికప్రమాణాంగీకార మున్నదో ఆప్రకారమే యీగ్రంథమునందు ప్రమాణనిరూపణ మున్నది. అందువలన నితరసంగతులకు నిచట సాక్షేపము లేదు. "ఉపమితిప్రమ"కు కరణము ఉపమానప్రమాణ మనబడును. న్యాయరీతిగా ఉపమిత్యుపమానముల స్వరూప మేమనగా, "సంజ్ఞి" యందు "సంజ్ఞ" యొక్క వాచ్యతాజ్ఞానము "ఉపమితి" యనబడును. దానికి కరణ మనగా వ్యాపారసహితాసాధారణకారణము 'ఉపమాన' మనబడును. ఒకానొక నగరవాసి యగుపురుషుడు, గవయశబ్దవాచ్యము నెఱుగక ఆరణ్యకపురుషుని 'గవయ' మెట్టి దని ప్రశ్న చేసినప్పుడు 'గవయము గోసదృశ మై యున్నది,' అను నారణ్యకపురుషుని వచనము విని వాక్యార్థము ననుభవించి వనమునందు గోసదృశ మైనగవయమును జూచి "గోసదృశ మైనది గవయ" మని, ఈరీతిగా వాక్యార్థస్మరణము కలుగచేసికొనెను. అనంతరము దృష్టపశువునందు గవయపదవాచ్యత్వము నెఱుగుచున్నాడు. అచ్చట "పశు" విశేషమునందు గవయపదవాచ్యతాజ్ఞానము ఉపమితి" యై యున్నది. ఆరణ్యకపురుషబోధితవాక్యార్థముయొక్క శాబ్దానుభవము కరణమై యున్నది. గోసదృశపిండదర్శనానంతరకాలీన మైనవాక్యార్థస్మృతి వ్యాపారమై యున్నది. గోసదృశపిండముయొక్క ప్రత్యక్షము సంస్కారోద్బోధక మైనందున సహకారి యై యున్నది. అందువలన వాక్యార్థానుభవము ఉపమానమై యున్నది. వాక్యార్థస్మృతి వ్యాపారమై యున్నది. ఆకాంక్షాదిక మెట్లు శాబ్దబోధమునకు సహ

కారి యై యున్న నో అట్లు గోసదృశపిండదర్శనము సహకారి యై యున్నది. ఉపమితి ఫలమై యున్నది. ఇది సాంప్రదాయిక నైయాయికమతము.

మఱియును నవీననైయాయికులు చెప్పున దేమనగా, గోసదృశపిండము యొక్క యేదర్శనము 'సహకారి' యని యంగీకరింపబడినదో అది ఉపమానమై యున్నది. వాక్యార్థస్మృతి వ్యాపారమై యున్నది. 'గవయ' పదముయొక్క వాచ్యతాజ్ఞానము ఉపమితిరూపఫలమై యున్నది. ఈమతమునందు వాక్యార్థానుభవము కారణమునకు కారణ మైనందున "కులాలపిత"వలె అన్యథాసిద్ధమై యున్నది. దానియర్థ మేమనగా. కులాలపిత ఘటసామగ్రికంటె ఎట్లు బాహ్యుఁ డై యున్నాఁడో అట్లు ఉపమితిసామగ్రికంటె వాక్యార్థానుభవము బాహ్యమై యున్నది. ఈరెండును నైయాయికమతమై యున్నవి. దీనియందు అనేకశంకా సమాధానరూపవిచారము న్యాయకౌస్తుభాది గ్రంథములయందు వ్రాయబడి యున్నది. సిద్ధాంతమునందు నుపయోగి కానందున నిచట నాచేత వ్రాయబడ లేదు.

సదృశజ్ఞానముచేత ఉపమితి యెట్లు కలుగుచున్నదో అట్లు విధర్మజ్ఞానము చేతను గలుగుచున్నది. 'ఖడ్గమృగ' పదముయొక్క వాచ్యమును ఎఱుగనివాఁడు ఆరణ్యకపురుషునివలన 'ఉష్ట్రి' విధర్మ మగుశృంగసహిత నాసికాసహిత మృగము ఖడ్గమృగపదవాచ్య మని విని వాక్యార్థానుభవోత్తరమునందు వనమునకువెళ్లి ఉష్ట్రివిధర్మ మగు ఖడ్గమృగ దర్శనోత్తరమునందు ఖడ్గమృగ పద వాచ్యతను తెలిసికొనుచున్నాఁడు. మఱియును 'పృథివీ'పదవాచ్యము నెఱుగనివాఁడు "జలాది వైధర్మ్యవతీ పృథివీ" యను గురువాక్యమును విని దానియొక్క యర్థానుభవ మును బొంది జలాదివైధర్మ్యవిశిష్ట పదార్థమును జూచి వాక్యార్థమును స్మరించి యాపదార్థమునందు పృథివీపద వాచ్యతా నిశ్చయమును బొందుచున్నాఁడు. విరుద్ధధర్మసహితము 'వైధర్మ్య' మనబడును. ఖడ్గమృగమునందు ఉష్ట్రిము కంటె విరుద్ధ మగుధర్మము హ్రస్వగ్రీవాదికమై యున్నది. పృథివియందు జలా దికముకంటె విరుద్ధ మగు ధర్మము గంధమై యున్నది. ఈయుదాహరణద్వ యమునందును సాంప్రదాయికరీతిగా వాక్యార్థానుభవము కరణ మై యున్నది, వాక్యార్థస్మృతి వ్యాపార మై యున్నది. విరుద్ధధర్మవత్పదార్థదర్శనము సహకారి యై యున్నది. నవీనరీతిగా విరుద్ధధర్మవిశిష్టపదార్థప్రత్యక్షము కారణమై యున్నది. వాక్యార్థస్మృతి వ్యాపారమై యున్నది. వాక్యార్థానుభవసామగ్రి బాహ్య మై

యున్నది. ఖడ్గమృగపదవాచ్యతాజ్ఞానమును పృథిసీపదవాచ్యతా జ్ఞానమును 'ఉపమితి' రూపఫలమై యున్నది. ఈప్రకారమే న్యాయమతమునందు 'సంజ్ఞా వాచ్యతాజ్ఞానము' 'ఉపమానప్రమాణము' యొక్క ఫలమై యున్నది. మఱి యును, ప్రాచీనమతమునందు వాక్యార్థానుభవమునకు 'ఉపమానప్రమాణ' మని పేరు. నవీనమతమునందు, సాదృశ్యవిశిష్టపిండదర్శనమునకు, లేక వైధర్మ్య విశిష్ట పిండదర్శనమునకు, 'ఉపమానప్రమాణ' మని పేరు

౫౩. వేదాంతమతరీతిగా ఉపమానోపమితులయొక్క స్వరూపము.

వేదాంతమతమునందు ఉపమిత్యుపమానములయొక్క స్వరూపము విలక్షణమై యున్నది. గ్రామమునందు గోవ్యక్తిని జూచినవాడు వనమునకు వెళ్లి గవయమును జూచినప్పుడు "ఈపశువు గోసదృశమై యున్నది." అని ప్రత్యక్ష జ్ఞానమును బొందుచున్నాడు. అనంతరము "నాగోవు ఈ పశువువలె నున్నది." అనుజ్ఞానము కలుగుచున్నది. అచ్చట గవయమునందు గోసాదృశ్యజ్ఞానము 'ఉపమానప్రమాణ' మని చెప్పబడును. గోవునందు గవయసాదృశ్య జ్ఞానము 'ఉపమితి' యని చెప్పబడును. ఈమతమునందును ఉపమితికరణమే ఉపమాన మన బడును. అయిన 'ఉపమితి' యొక్క స్వరూపము, లక్షణము భిన్నమై యున్నవి. అందువలన 'ఉపమానము' న లక్షణభేదము లేకయే స్వరూపభేదము సిద్ధించు చున్నది. న్యాయమతమునందు 'సంజ్ఞి' యందు 'సంజ్ఞ' యొక్క వాచ్యతా జ్ఞానము "ఉపమితి" యని చెప్పబడును. వేదాంతమతమునందు సాదృశ్యజ్ఞానముచేత జన్యమయిన జ్ఞానము 'ఉపమితి' యని చెప్పబడును. గవయమునందు గోసాదృశ్య జ్ఞానముచేత గోవునందు గవయసాదృశ్యజ్ఞానము జన్యమై యున్నది. ఈరీతిగా నుపమితియొక్క లక్షణము న్యాయమతమును బట్టి భిన్నమై యున్నది. దానికి కరణమెద్దియో అది 'ఉపమాన,' మని చెప్పబడును. సాదృశ్యజ్ఞానజన్యజ్ఞానరూప 'ఉపమితి' గోవునందు గవయసాదృశ్యజ్ఞానమై యున్నది. దానికి కరణము గవయమునందు గోసాదృశ్యజ్ఞానమై యున్నది. అదే ఉపమానము. ఈమతమునం దుపమానప్రమాణము వ్యాపారహీనమై యున్నది. ఉపమానానంతర ముప మితియొక్క యుత్పత్తియందు ఏవ్యాపారము దొరకుట లేదు. ఈమతమునందు వైధర్మ్యవిశిష్ట జ్ఞానముచేత తదుపమితి యంగీకరింపబడ లేదు. ఎట్లనగా: సాదృశ్యజ్ఞానజన్య జ్ఞానమునకే 'ఉపమితి' యని పేరు గాని అన్యమునకు లేదు.

౧౪౮. విచారసాగరమునందు న్యాయమతరీతిగా ఉపమితి చెప్పుటయందలి యభిప్రాయము.

విచారసాగరమునందు న్యాయరీతిగా ఉపమితిస్వరూపము చెప్పంబడి యున్నది. దానియభిప్రాయ మే మనగా, న్యాయరీతిగా ఉపమిత్యుపమానముల యొక్క స్వరూపము నంగీకరించినప్పటికి అద్వైతసిద్ధాంతమునకు హాని లేదు. పైని న్యాయరీతిగా సిద్ధాంతమునకు అనుకూలమైనయుదాహరణము దొరకక యున్నది. ఎట్లనగా, వైధర్మ్యజ్ఞానముచేత నుపమితియును న్యాయమతమునం దంగీకరింపబడియున్నది. ఆసిద్ధాంతమున కనుకూలమైనయుదాహరణ మే మనగా "ఆత్మపదార్థ మెట్లుండునది" అను నీప్రశ్నకు "దేహాదివైధర్మ్యవాన్ ఆత్మా" అని జవాబు చెప్పుటవలన, అనిత్య, అశుచి, దుఃఖ, స్వరూపదేహాదికముకంటె విధర్మమైనది. అనగా నిత్యశుద్ధానందరూపము ఆత్మపదవాచ్యమై యున్నది. ఇట్లు ఏకాంతదేశమునందు వివేచనకాలమునందు మనస్సునకు ఆత్మతో సంయోగమై యుపమితిజ్ఞానము కలుగుచున్నది. మఱియును సాదృశ్యజ్ఞానజన్యజ్ఞానమే ఉపమితి యని యంగీకరించునెడల ఆత్మయందు దేనియొక్క సాదృశ్యమును లేదు. అందువలన జిజ్ఞాసువునకు అనుకూలమైనయుదాహరణము దొరకదు. యద్యపి, అసంగాదికధర్మముచేత ఆకాశాదికమునకు సదృశము ఆత్మయై యున్నది. అందువలన ఆకాశమునందు ఆత్మయొక్క సాదృశ్యజ్ఞానము ఉపమానమై యున్నది ఆత్మయందు ఆకాశముయొక్క సాదృశ్యజ్ఞానము ఉపమితియై యున్నది. ఇది జిజ్ఞాసువునకు అనుకూల మయిన యుదాహరణము. సిద్ధాంతమునందు నుపమితి సంభవించుచున్నది. తథాపి యేయధికరణమునందు ఏపదార్థముయొక్క యభావజ్ఞానము కలుగుచున్నదో ఆయభావజ్ఞానమునందు భ్రమబుద్ధి లేకయే ఆయధికరణమునందుఆపదార్థముయొక్క జ్ఞానము కలుగనేరదు. ఉ. ఆత్మయందు కర్తృత్వాద్యభావజ్ఞానము అగుచున్నది. న్యాయాదిశాస్త్రములను వినినప్పటికి ప్రథమజ్ఞానమందు భ్రమబుద్ధి పుట్టక యాత్మ కర్త, భోక్త, యనుజ్ఞానము కలుగుట లేదు. ఎవరికి వేదాంతార్థనిశ్చయము కలిగి నైయాయికాదులసంగముచేత, ఆత్మ కర్త, భోక్త, యనుజ్ఞానము కలుగుచున్నదో వారికి ప్రథమజ్ఞానమునందు భ్రమబుద్ధి కలిగియే రెండవజ్ఞానము కలిగియున్నది. ప్రథమజ్ఞానమునందు భ్రమబుద్ధి కలుగక విరోధిజ్ఞానము కలుగుట లేదు. ఆభ్రమబుద్ధి భ్రమరూపముగా నైనను, యథార్థముగా నైనను, నుండవచ్చును. దానియందును నియమము లేదు. అయిన భ్రమబుద్ధి

యందు భ్రమత్వనిశ్చయము కాఁగూడదు, అని నియమ మున్నది. ఈరీతిగా ఏకాలమునందు గురువాక్యముచేత జిజ్ఞాసువునకు ఆకాశాది సకలప్రపంచము గంధర్వనగరమువలె దృష్టనష్టస్వభావ మై యున్నది, ఆత్మ దానికంటె విలక్షణుఁడు, ఆకాశాదికమునందు ఆత్మయొక్క కించిత్సాదృశ్యము లేదు, అని దృఢనిశ్చయము కలుగుచున్నదో ఆకాలమునందు నాకాశాత్మలకు సాదృశ్యజ్ఞానము సంభవించుట లేదు. అందువలన నుత్తమజిజ్ఞాసుని యనుకూలసిద్ధాంతమునకు ఉపమిత్యుదాహరణము దొరకుట లేదు

౭౫. పూర్వోక్త వేదాంతన్యాయరీతిగా విలక్షణ మైన యుపమిత్యుపమానములయొక్క లక్షణము.

నైయాయికరీతియొక్క యుపమితియందు సర్వథా విద్వేష మగునెడల యుపమితికి నన్యథాలక్షణము చెప్పబడుచున్నది. అదె ట్లనగా: సాదృశ్యజ్ఞానజన్యజ్ఞానము లేక వైధర్మ్యజ్ఞానజన్యజ్ఞానము 'ఉపమితి' యనబడును. ఖడ్గమృగమునందు ఉష్ట్రముయొక్క వైధర్మ్యజ్ఞానముచేత నుష్ట్రమునందు ఖడ్గమృగముయొక్క వైధర్మ్యజ్ఞానము కలుగుచున్నది. పృథివియందు జలముయొక్క వైధర్మ్యజ్ఞానముచే జలమునందు పృథివియొక్క వైధర్మ్యజ్ఞానము కలుగుచున్నది. అందువలన నుష్ట్రమునందు ఖడ్గమృగముయొక్క వైధర్మ్యజ్ఞానమును, జలమునందు పృథివియొక్క వైధర్మ్యజ్ఞానమును 'ఉపమితి' యనబడును. దానికి కరణము, ఉపమాన మనబడును. ఇచట ఖడ్గమృగమునందు ఉష్ట్రముయొక్క వైధర్మ్యజ్ఞానము పృథివియందు జలముయొక్క వైధర్మ్యజ్ఞానముకూడ 'కరణ మైనందున 'ఉపమాన' మనబడును. విపరీతముగా నుపమానోపమితిభావము సంభవించుచున్నది. ఇంద్రియసంబద్ధమున సాదృశ్యజ్ఞానము 'ఉపమితి' యనబడును. అందుచేత, ప్రపంచమునందు ఆత్మయొక్క వైధర్మ్యజ్ఞానముచేత నాత్మయందు ప్రపంచవైధర్మ్యజ్ఞానము 'ఉపమితి' యై యున్నది. ఈప్రకారముగా సాదృశ్యజ్ఞానజన్యజ్ఞానము, వైధర్మ్యజ్ఞానజన్యజ్ఞానము ఈరెండును 'ఉపమితి' యనునెడల జిజ్ఞాసువునకు అనుకూలోదాహరణము సంభవించుచున్నది.

౭౬. వేదాంతపరిభాషా, టీకలయొక్క యుక్తిఖండనము.

వేదాంతపరిభాషయందు ఏకసాదృశ్యజ్ఞానజన్యజ్ఞానమే 'ఉపమితి' యని చెప్పబడియున్నది. తద్వ్యాఖ్యానమునందు తత్పుత్రునిచేత నన్యోపమితియొక్క ఖండననిమిత్తమై చెప్పిన దే మనగా, ఎచ్చట 'కమలేన లోచనం ఉపమినోమి'

యని ఉపమానోపమేయభావ మున్నదో ఆస్థానములయందు ఉపమాన ప్రమాణ మున్నది, వైధర్మ్యజ్ఞాన మున్నది. కాని, అచట ఉపమానోపమేయభావము లేదు. అందువలన నుపమానప్రమాణము సంభవించుట లేదు. అయిన అట్టివాని నడుగ వలసిన దే మనగా: వైధర్మ్యజ్ఞానజన్యోపమితికి ఏయుదాహరణము చెప్పబడినదో దానియందు ఉపమితివిషయజ్ఞానము, ఉపమానప్రమాణముచేత కలుగుట లేదు. ఉపమానేతరప్రమాణముచేత దానిజ్ఞానము కలుగుచున్నది. ఏప్రమాణము చేత దానియొక్క జ్ఞానము చెప్పబడుచున్నదో ఆప్రమాణముచేత సాదృశ్య జ్ఞానజన్యోపమితివిషయముయొక్క జ్ఞానము అగుచున్నది. ఉపమానప్రమాణము యొక్క యంగీకారము నిష్ఫలము కావలయును. ఈక్రిందిరీతిగా నొకడు చెప్పచున్నాడు. 'గవయము' యొక్క ప్రత్యక్షమునందు గోసాదృశ్యప్రత్యక్షము ఉన్నది, అయిన గోవునందు గవయసాదృశ్యప్రత్యక్షము లేదు. ఎట్లనగా ధర్మితో కూడ ఇంద్రియసంయోగము కలిగినప్పుడు, ఇంద్రియసంయుక్త తాదాత్మ్యసంబంధముచేత సాదృశ్యధర్మముయొక్క ప్రత్యక్షము కలుగుచున్నది. గోరూపధర్మితో గూడ ఇంద్రియసంయోగము లేనందున గోవునందు గవయసాదృశ్యప్రత్యక్షమగుట లేదు. అందువలన గోవునందు గవయసాదృశ్యజ్ఞానమునకు హేతు వైన గవయమునందు గోసాదృశ్యజ్ఞానరూపోపమానప్రమాణము నంగీకరింపవలయును. అట్లే, ఖడ్గమృగమునందు ఉష్ట్రమునందు వైధర్మ్యప్రత్యక్షజ్ఞాన మేర్పడుచున్నది. ఉష్ట్రమునందు ఖడ్గమృగముయొక్క వైధర్మ్యజ్ఞానరూపప్రత్యక్షము సంభవించుట లేదు. దానికి హేతువుగా ఖడ్గమృగమునందు ఉష్ట్రముయొక్క వైధర్మ్యజ్ఞానరూపోపమానమే ప్రమాణ మని యంగీకరించుట యోగ్యము. వేదాంతపరిభాషాదిటీకయందు ఏ మని చెప్పబడిన దనగా "ఏజ్ఞానోత్తరమునందు 'ఉపమినోమి' యనుప్రతీతి జ్ఞాతకు కలుగుచున్నదో అట్టిజ్ఞానము 'ఉపమితి'యై యున్నది. మఱియును, వైధర్మ్యజ్ఞానోత్తరమునందు ఉపమినోమి యనుప్రతీతి కలుగదు. అందుచేత నుపమితి కాదు." ఇవి రెండును సరి కావు. ఏలనగా, ముఖమునందు చంద్రసాదృశ్యప్రత్యక్షోత్తరమున 'ముఖం చంద్రే ణోపమినోమి' యను ప్రతీతి కలుగుచున్నది. మఱియును, ముఖమునందు చంద్రసాదృశ్యజ్ఞానము ప్రత్యక్షమై యున్నది, ఉపమితి కాదు. అందుచేత 'ఉపమినోమి' అను వ్యవహారమునకు 'ఉపమాలంకారము' విషయమై యున్నది. ఎచ్చట నుపమానోపమేయములకు సమానశోభ యున్నదో యచ్చట 'ఉపమాలంకార' మనబడును. అలంకార

సామాన్యలక్షణమును ఉపమానాది విశేషలక్షణమును అలంకారచంద్రికాది గ్రంథములయందు ప్రసిద్ధములు. కఠిన మనియును, అనుపయోగ మనియును ఇచటవిరళింపలేదు. అందువలన నెచ్చట 'ఉపమినోమి' యనుప్రతీతి కలదో దానికి విషయము ఉపమితిజ్ఞానము కాదు. మఱియు నే మనగా; సాదృశ్యజ్ఞాన జన్యజ్ఞాన వైధర్మ్యజ్ఞానజన్యజ్ఞానములయందు ఉపమితిశబ్దము పారిభాషికమై యున్నది. శాస్త్రము యొక్క సంకేతమునకు 'పరిభాష' యని పేరు. పరిభాషచేత బోధక మైనశబ్దమునకు 'పారిభాషిక' మని పేరు. ఛందోగ్రంథములయందు, 'పంచ' 'షట్' 'సప్తల'యందు, బాణరసమునిశబ్దములు ఎట్లు పారిభాషికములై యున్నవో యట్లే యుపమితిశబ్దము కూడ న్యాయశాస్త్రాద్వైతశాస్త్రముల యందు భిన్న భిన్నార్థములయందు పారిభాషికమై యున్నది. అందువలన నద్వైతశాస్త్రమునందు సాదృశ్యజ్ఞానమువలె వైధర్మ్యజ్ఞానజన్య జ్ఞానమును "ఉపమితి" శబ్దార్థములై యున్నవి. భేదసహితసమానధర్మమునకు సాదృశ్య మని పేరు. ఉ. గవయమునందు గోభేదసహిత మగు సమానావయవము ఉన్నది. అందువలన నది గోసాదృశ్యమై యున్నది. గోసమానధర్మము గోవునందు ఉండినను గోభేదము లేదు, గోభేదము అశ్వమం దుండినను సమానధర్మము లేదు. అందువలన సాదృశ్యము లేదు. చంద్రునియొక్క భేదసహితాహ్లాదజనకతా రూపసమానధర్మము ముఖమం దున్నది. అది ముఖమునందు చంద్రసాదృశ్యమై యున్నది. ఈరీతిగా ఉపమానోపమేయములయొక్క భేదసహితసమానధర్మమే రూపమై యున్నది. ఇది ఉదయనాచార్యుల మతసిద్ధాంతమునందు అంగీకరణమై యున్నది.

౫౭. కరణలక్షణ నిర్ణయము.

ఉపమితిశబ్దముయొక్క పరిభాషకు న్యాయాద్వైతములయందు భేదము ఉన్నది. ఉపమానశబ్దముయొక్కయర్థము యద్యపి మతద్వయమునందును భిన్నము కాదు. ఎట్లనగా, ఉపమితికరణము ఉపమాన మనబడును. అది న్యాయ మతము నందు గవయపదముయొక్క వాచ్యతాజ్ఞానము ఉపమితిపదముయొక్క పారిభాషి కార్థము. దానికి కరణము వాక్యార్థానుభవము, లేక సాదృశ్యవిశిష్ట పిండ ప్రత్యక్షము. మఱియును అద్వైతమతమునందు సాదృశ్యజ్ఞానజన్య జ్ఞానము, వైధర్మ్యజ్ఞాన జన్యజ్ఞానమును ఉపమితిపదముయొక్క పారిభాషికార్థము లై యున్నవి. దానికి కరణము సాదృశ్యజ్ఞానము, వైధర్మ్యజ్ఞానము. ఈరీతిగా నుపమితి

శబ్దముయొక్క పరిభాషయందు భేద మున్నది. ఆభేదమువలన నుపమానభేదము సిద్ధించుచున్నది. ఉపమానపదము పారిభాషికము కాదు. ఇకనే మనగా యౌగిక మై యున్నది. వ్యాకరణరీతిగా ఏపదము అవయవార్థకమును త్యజించుట లేదో అది యౌగికపద మనబడును. ఇచ్చట వ్యాకరణరీతిగా ఉపమితి కరణము ఉపమానపదముయొక్క యవయవార్థమై యున్నది. ఉపమానముచేత నుపమితి యొక్క యుత్పత్తియందు వ్యాపారము లేదు. అందువలన వ్యాపారవత్కారణమే కరణ మని నియమము లేదు. మఱియు నేమనగా నిర్వ్యాపార మైన కారణము కూడ కరణమై యున్నది. యద్యపి న్యాయమతనిరూపణ ప్రసంగమునందు వ్యాపారసహితాసాధారణ కారణమె కరణ మని చెప్పబడి యున్నది. అందువలన నిర్వ్యాపారకారణమునందు కరణతాసంభవము లేదు. తథాపి సిద్ధాంతమునందు వ్యాపారభిన్న మైన యసాధారణకారణమునకు కరణత్వము చెప్పవలయును. వ్యాపారసహితాసాధారణ కారణమున కీ కరణత లేదు. "వ్యాపారవత్" అనుటవలన వ్యాపారమునందు కరణలక్షణము ఎట్లు పోవుట లేదో అట్లు వ్యాపారభిన్న మని చెప్పినను వ్యాపారమునందు కరణ లక్షణము పోవుట లేదు. ఎట్లనగా వ్యాపారమునందు వ్యాపారవత్త్వము ఎట్లు లేదో అట్లు వ్యాపారభిన్నత్వము కూడ వ్యాపారమునందు లేదు. ఈరీతిగా వ్యాపారభిన్నాసాధారణకారణము కరణ మని చెప్పబడును. అది నిర్వ్యాపార మై యున్నది, లేక సవ్యాపారమై యున్నది. ప్రత్యక్షానుమాన శబ్దము, లను నీ మూడును 'ప్రత్యక్షప్రమా' 'అనుమితిప్రమా' 'శాబ్దప్రమ'లకు వ్యాపారసహిత కారణములై యున్నవి. మఱియును 'ఉపమాన' 'అర్థాపత్తి' 'అనుపలబ్ధి'అను నీ మూడును ఉపమిత్యాదిప్రమలకు నిర్వ్యాపారకారణము లై యున్నవి. అందు వలన సిద్ధాంతరీతిగా కరణలక్షణమునందు వ్యాపారవత్ పదముయొక్క స్థానము నందు వ్యాపారభిన్నపదము చెప్పవలసినది. మఱియును న్యాయమతమునందు కరణలక్షణములకు వ్యాపారమునందు అతివ్యాప్తిపరిహారమునకు వ్యాపారవత్ పదముయొక్క నివేశన మున్నది. లేనిచో వ్యాపారభిన్నపద నివేశన మున్నది. రెండుప్రకారములుగా కరణలక్షణము సంభవించుచున్నది. ఎట్లనగా: న్యాయ మతమునందు నుపమితికి కరణ మైన యుపమాన ప్రమాణమునందు వాక్యార్థ స్మృతి వ్యాపారమై యున్నది. ఇది న్యాయానుసారముగా ఉపమాననిరూపణము నందు పూర్వమే చెప్పబడినది. అందువలన నుపమితికరణోపమానమునందు

వ్యాపారవత్ పదమును జెప్పినను కరణలక్షణమునకు అతివ్యాప్తి లేదు. మఱి యును అర్థాపత్తికి అనుమానమునందు అంతర్భావమును నైయాయికుడు అంగీకరించినాడు. అందువలన నర్థాపత్తియందు ప్రమాకరణతారూప ప్రమాణత్వ మునకు అంగీకారము లేనందున దానియందు కరణతావ్యవహారాపేక్ష లేదు. అట్లే అభావప్రమయందు అనుపలబ్ధి సహకారికారణముగా నంగీకరింపబడినది. మఱియును, ప్రమాకరణతారూప ప్రమాణత్వము అనుపలబ్ధికి నైయాయికుని చేత నంగీకరింప బడియుండలేదు. మఱియు నే మనగా "అభావప్రమయందు అనుపలబ్ధిసహకృతేంద్రియాదికమునకు ప్రమాణత్వము అంగీకరింపబడినది. అందు వలన ననుపలబ్ధియందును ప్రమాకరణతా రూపప్రమాణత్వము అంగీకరింపబడ నందున కరణతావ్యవహారము కలుగనేరదు. ఈస్థానమునందు నిష్కర్ష యే మనగా అర్థాపత్త్యనుపలబ్ధులయందు కరణతావ్యవహారము ఇష్టమై యున్నది. కాని కరణలక్షణము లేదు. ఒకవేళ నుండినయెడల కరణలక్షణమునందు అతివ్యాప్తిదోషము కలుగుచున్నది. అర్థాపత్త్యనుపలబ్ధులయందు ప్రమాణత్వ ముండినయెడల కరణత్వము కూడ నుండవలయును. ఎట్లనగా: ప్రమాకరణ మునకు ప్రమాణ మని పేరు. అందువలన ప్రమాణత్వమునందు కరణతాప్రవేశ ముండుటవలన కరణత్వము లేక ప్రమాణత్వము సంభవించుట లేదు. ఆ ప్రమాణత్వమునకు న్యాయమతమునందు అర్థాపత్త్యనుపలబ్ధులకు అంగీకారము లేనందున రెంటియందును కరణతావ్యవహారము లేదు. ఈరీతిగా కరణతా రహితార్థాపత్త్యనుపలబ్ధులయందు కరణలక్షణము లేనందున అతివ్యాప్తి దోషము లేదు. ఈవిధముగా న్యాయమతమునందు వ్యాపారవ దసాధారణ కారణమునకు కారణత్వము చెప్పినను అతివ్యాప్తిదోషము లేదు. మఱియును వేదాంతసిద్ధాంతమునందు వ్యాపారపదము చెప్పినయెడల ఉపమానాది ప్రమాణ త్రయమునందు కరణలక్షణమునకు నవ్యాప్తి కలుగుచున్నది. ఎట్లనగా సిద్ధాంతమతమునందు ఇంద్రియసంబంధి యైన గవయమునందు ప్రత్యక్షరూప గోసాదృశ్యజ్ఞానము ఉపమానప్రమాణమై యున్నది. వ్యవహితగోవునందు గవయ సాదృశ్యజ్ఞానము ఉపమితిప్రమయై యున్నది. ఈవిధముగానే ఇంద్రియసంబంధి పశువునందు వ్యవహితపశువుయొక్క వైధర్మ్యజ్ఞానము ఉపమానప్రమాణమై యున్నది. వ్యవహితపశువునందు ఇంద్రియసంబంధి యగుపశువుయొక్క వైధర్మ్య జ్ఞానము ఉపమితిప్రమ. ఈప్రకారముగా ఉపమానముచేత నుపమితియొక్క

యుత్పత్తియందు ఏవ్యాపారము సంభవించుట లేదు. ఉపమితిప్రమయొక్క కరణము ఉపమాన మని చెప్పబడును. అందువలన నుపమాన ప్రమాణమునందు కరణతా వ్యవహారము ఇష్టమై యున్నది. అర్థాపత్త్యనుపలబ్ధులయందును ప్రమాణతావ్యవహార ముండుటవలన కరణతావ్యవహారము ఇష్టమై యున్నది. వ్యాపారము సంభవించినందున, ఉపమానార్థాపత్త్యనుపలబ్ధులయందు కరణ లక్షణములకు అవ్యాప్తి సంభవించుచున్నది. అందువలన కరణలక్షణమునందు సిద్ధాంతరీతిగా వ్యాపారవత్పదమును త్యజించి వ్యాపారభిన్నపదము చెప్పబడియున్నది. వేదాంతపరిభాషయందు ధర్మరాజుచేత "వ్యాపారవదసాధారణ కారణమ్" ఇది కరణలక్షణ మని చెప్పబడినది. "ప్రమాకరణం ప్రమాణమ్" అని ప్రమాణలక్షణము చెప్పబడి యున్నది. ధర్మరాజపుత్త్రునిచేత వేదాంత పరిభాషాటీకయందు చెప్పబడిన దేమనగా ఉపమితికి నసాధారణకారణము ఉపమానమై యున్నది. అది వ్యాపారహీనమై యున్నది. అట్లే అర్థాపత్త్యనుపలబ్ధులును గూడ "వ్యాపారహీనకారణమై యున్నవి." అందువలన నుపమానాదిత్రితయ లక్షణమునందు వ్యాపారమునకు ప్రవేశము లేదు. ఉపమితి ప్రమకు వ్యాపారవదసాధారణకారణము ఉపమానమై యున్నది. ఉపపాదక ప్రమకు వ్యాపారవదసాధారణకారణము అర్థాపత్తిప్రమాణమై యున్నది. అభావ ప్రమకు వ్యాపారవదసాధారణ కారణము అనుపలబ్ధిప్రమాణమై యున్నది. ఈరీతిగా నుపమానాదిత్రయమునకు వ్యాపారవత్పదఘటిత లక్షణమును చెప్పిన యెడల ఆత్రయమునకును వ్యాపారత్వము లేనందున ఉపమానాదిత్రయము యొక్క విశేషలక్షణమునకు అసంభవము కావలయును. అందువలన వ్యాపారవత్పదరహితము విశేషలక్షణమై యున్నది. ఉపమితిప్రమకు అసాధారణకారణము ఉపమానప్రమాణ మనబడును. ఈరీతిగా నర్థాపత్త్యనుపలబ్ధులయొక్క లక్షణమునందును వ్యాపారవత్పదము చెప్పకూడదు. అందువలన నసంభవము కాదు. ధర్మరాజపుత్త్రునిచేత ఉపమానప్రమాణాదులయొక్క విశేషలక్షణము యథాసంభవముగా చెప్పబడియున్నది. మఱియును కరణలక్షణము ప్రమాణసామాన్య లక్షణము మూలకారులచేత పూర్వమునందు చెప్పబడియున్నది. వానియం దే విలక్షణత్వము చెప్పబడలేదు. అందువలన తత్పుత్త్రోక్తియందు న్యూనత కనబడుచున్నది. ఎట్లనగా; కరణలక్షణమునందు విశేషము చెప్పబడియున్నది. వ్యాపారవత్త్వాభావము లేకయే ఉపమితికరణ ముపమానమై యున్నది. అర్థాపత్తిప్రమా

కరణము అర్థాపత్తియై యున్నది. అభావప్రమాకరణము అనుపలబ్ధియై యున్నది. ఇట్లు వ్యవహారము కాకపోవలయును. కరణత్వాభావమువలన ఉపమానాదికమునందు ప్రమాణతావ్యవహారము కూడ కాకపోవలయును. అందువలన మూలకారుని యొక్క కరణలక్షణమునందు వ్యాపారవత్ పదమునకు వ్యాపారభిన్న వ్యాఖ్యానము జేసినయెడల సర్వేష్టసిద్ధి యగుచున్నది. అందువలన మూలకారుని కరణలక్షణమునందు వ్యాపారవత్పదమునకు విలక్షణార్థమును చేయనియెడల పుత్రోత్పత్తియందు న్యూనత యగుచున్నది. మేము చెప్పినప్రకారము వ్యాపారరహితోపమానాదికమునందును ఉపమిత్యాదిప్రమాకరణత సంభవించుచున్నది. ఈరీతిగా ప్రపంచమునందు బ్రహ్మయొక్క విధర్మజ్ఞానము ఉపమానమై యున్నది. ప్రపంచముకంటె విలక్షణము బ్రహ్మమై యున్నది. ఈయుపమానప్రమాణమునకు ఫలము ఉపమితిజ్ఞానమై యున్నది.

ఇతి శ్రీనిశ్చలదాసాహ్వాయ సాధువిరచిత మగు వృత్తిప్రభాకరమునందు

నుపమాననిరూపణ మను చతుర్థప్రకాశము

సమాప్తము.

అథార్థాపత్తి ప్రమాణనిరూపణ మనుపంచమప్రకాశ ప్రారంభము.

౫౧ న్యాయమతమునం దర్థాపత్తియొక్క యంగీకారము.—

త్రివిధానుమాన వర్ణనము.

నైయాయికమతమునందు పూర్వోక్తప్రమాణచతుష్టయము మాత్రము ఉన్నది. వ్యతిరేక్యనుమానమునందు అర్థాపత్తిప్రమాణమునకు అంతర్భావ మున్నది. సిద్ధాంతమునందు కేవలవ్యతిరేక్యనుమానము అంగీకరింపబడలేదు. అందువలన నర్థాపత్తి భిన్నప్రమాణమై యున్నది. కేవలవ్యతిరేక్యనుమానము యొక్క ప్రయోజనము అర్థాపత్తిప్రమాణముచేత సిద్ధించుచున్నది. ఎచ్చట నన్వయవ్యాప్తి కుదాహరణము దొరకుట లేదో సాధ్యాభావమునందు హేత్వ భావముయొక్క ఉదాహరణము దొరకుచున్నదో అచ్చట కేవలవ్యతిరేక్యను మాన మున్నది.

"పృథివీ, ఇతరభేదవతీ గంధవత్త్వాత్" ఈస్థలమునందు యత్ర గంధవత్త్వం, తత్రేతరభేదః, ఈయన్వయవ్యాప్తికి నుదాహరణము దొరకుట లేదు. ఎట్లనగా. పక్షముకంటె భిన్నమైనది దృష్టాంత మగును. ఇచట సమస్తపృథివి పక్షమై యున్నది; దానికంటె భిన్న మగు జలాదికమునందు ఇతరభేదము గంధము కూడ లేదు. అందువలన నది కేవలవ్యతిరేక్యనుమానము. 'యత్రేతరభేదా భావః తత్ర గంధాభావః, యథా జలే.' ఈరీతిగా సాధ్యాభావమునందు హేత్వ భావముయొక్క వ్యాప్తిజ్ఞానమునకు ఏసహచారజ్ఞాన మున్నదో అది జలాదిక మునం దున్నది. అందువలన జలాదిక ముదాహరణమై యున్నది. వ్యాప్తిజ్ఞాన మునకు హేతువైనసహచారజ్ఞానము ఎచట నున్నదో అది యుదాహరణ మని చెప్పబడును.

అన్వయ్యనుమానమునందు ఎట్లు వ్యాప్యవ్యాపకభావ మున్నదో దాని కంటె విపరీతముగా వ్యతిరేక్యనుమానమునం దున్నది. అన్వయియందు హేతువు వ్యాప్యమై యున్నది. సాధ్యము వ్యాపకమై యున్నది. వ్యతిరేకియందు సాధ్యా భావము వ్యాప్యమై యున్నది. హేత్వభావము వ్యాపకమై యున్నది. అయిన ఈస్థానమునందు నైయాయికులయొక్క రెండుమతము లున్నవి. సాధ్యాభావ మునందు హేత్వభావముయొక్క సహచారదర్శన మున్నది. అందువలన హేత్వ

భావముయొక్క వ్యాప్తిజ్ఞానము కూడ సాధ్యాభావమునం దున్నది. ఈపక్షమునం దొకానొక నైయాయికుడు ఈ దోషమును జెప్పుచున్నాడు. ఏపదార్థమునందు నేవ్యాప్తియొక్క జ్ఞాన మున్నదో దానివలన ఆ సాధ్యమునకు అనుమితి కలుగుచున్నది. ఏపదార్థములకు పరస్పరవ్యాప్యవ్యాపకభావము తెలియబడలేదో వానికి పరస్పరము హేతుసాధ్యభావము సంభవించుట లేదు. వ్యాప్యవ్యాపకభావము ఇతరభేదాభావ, గంధాభావములకు ఉన్నది, గంధేతరభేదములకు హేతుసాధ్యభావము చెప్పుట ఆశ్చర్యజనకమై యున్నది. అందువలన సాధ్యాభావ హేత్వభావములయొక్క సహచారదర్శనమువలన కూడ హేతువునందు సాధ్యముయొక్క వ్యాప్తిజ్ఞానము కలుగుచున్నది. అన్వయవ్యతిరేక్యనుమానమునకు ఈక్రింద కనబడుచు భేదము ఉన్నది.

ఎచ్చట హేతుసాధ్యములయొక్క సహచారజ్ఞానముచేత హేతువునందు వ్యాప్తిజ్ఞానము ఉన్నదో అది అన్వయానుమాన మనబడును. ఎచ్చట సాధ్యాభావమునందు హేత్వభావముయొక్క సహచారదర్శనమువలన హేతువునందు సాధ్యవ్యాప్తిజ్ఞానము ఉన్నదో అది వ్యతిరేక్యనుమాన మనబడును. సాధ్యాభావమునందు హేత్వభావముయొక్క వ్యాప్తిజ్ఞానమును ఒకానొకప్పుడు కలుగుట లేదు. ఎచ్చట సాధ్యాభావమునందు హేత్వభావముయొక్క వ్యాప్తిజ్ఞానము కలుగుచున్నదో అచ్చట సాధ్యాభావముచేత హేత్వభావానుమితియే కలుగుచున్నది.

హేతువుచేత సాధ్యానుమితి కలుగుట లేదు ఎట్లనగా, వ్యాప్యజ్ఞానముచేత వ్యాపకానుమితి కలుగుచున్న దని నియమ మున్నది. ప్రథమపక్షము ప్రాచీనులది, ద్వితీయపక్షము నవీనులది. అనుమానప్రకరణమునందు న్యాయగ్రంథాధ్యయనము లేకయే బుద్ధిప్రవేశము కలుగుట లేదు. అందువలన ననుమానముయొక్క యేయర్థమును మేము విస్తరించి వ్రాయలేదు. ఈరీతిగా కేవలవ్యతిరేక్యనుమానముయొక్క ఉదాహరణము. మఱియు నెచట సాధ్యాభావ, హేత్వభావములయొక్క సహచారమునకు ఉదాహరణము దొరకుట లేదో అది కేవలాన్వయ్యనుమాన మనబడును. 'ఘటః పటశక్తిమాన్, జ్ఞేయత్వాత్ పటవత్'' ఇచ్చట సాధ్యాభావహేత్వభావములయొక్క సహచారము ఎచ్చటను దొరకుట లేదు. న్యాయమతమునందు, జ్ఞేయత, పటశక్తులు, సమస్తమునం దున్నవి. అందువలన భావముయొక్క సహచారమునకు ఉదాహరణములు దొర

కుటు లేదు. ఎచ్చట రెంటికిని ఉదాహరణములు దొరకుచున్నవో అది అన్వయవ్యతిరేక్యనుమాన మనబడును. ఇది ప్రసిద్ధానుమానమై యున్నది. "పర్వతో వహ్నిమాన్" దీనికి ప్రసిద్ధానుమాన మని పేరు. ఇచట అన్వయముయొక్క సహచారమునకు ఉదాహరణము మహానసమై యున్నది మఱియును వ్యతిరేకముయొక్క సహచారమునకు ఉదాహరణము మహాహ్రదమై యున్నది. ఈరీతిగా త్రివిధానుమానములు నైయాయికునిచేత నంగీకరింపబడియున్నవి.

౫౯. వేదాంతమతరీతిగా ప్రకాశ్యము, అన్వయవ్యతిరేకి, అనుమాన, అర్థాపత్తులయొక్క స్వీకారము.

వేదాంతమతమునందు కేవలవ్యతిరేకియొక్క ప్రయోజనము అర్థాపత్తిచేత సిద్ధించుచున్నది. ఇతరభేదము లేకయే 'గంధవత్త్వము' సంభవించుట లేదు. అందుచేత 'గంధవత్త్వము' యొక్క యనుపపత్తి ఇతరభేదకల్పనను కలిగించుచున్నది. ఈవిధముగా నర్థాపత్తిప్రమాణముచేత కేవలవ్యతిరేకి గతార్థమై యున్నది. మఱియును కేవలాన్వయ్యనుమానము ఏదియును లేదు. ఎట్లన, సర్వపదార్థములయొక్క యభావము బ్రహ్మమునందున్నది. అందువలన వ్యతిరేకసహచారమునకు నుదాహరణము బ్రహ్మమై యున్నది. యద్యపి, వృత్తిజ్ఞానముయొక్క విషయతారూపజ్ఞేయత బ్రహ్మమునందున్నది గాని దానియొక్క యభావము బ్రహ్మమునందు లేదు. తథాపి, జ్ఞేయతాదికము మిథ్యయై యున్నది. మిథ్యాపదార్థమును, దానియొక్క యభావమును ఏకాధిష్ఠానమునం దున్నవి. అందుచేత నైయాయికుడు దేనికి అన్వయవ్యతిరేకి చెప్పుచున్నాడో అది అన్వయినామకైకప్రకారానుమానము. ఇది వేదాంతమతమై యున్నది. ఈమతమునందు కేవలవ్యతిరేక్యనుమాన మంగీకరింపబడలేదు. అర్థాపత్తిప్రమాణ మంగీకరింపబడియున్నది. మఱియును విచారించినయెడల రెంటిని అంగీకరింపవలయును. ఎచ్చట నేకపదార్థజ్ఞానముయొక్క యనువ్యవసాయము భిన్న మగుచున్నదో అచ్చట ఆపదార్థజ్ఞానములయొక్క ప్రమాణము భిన్నమై యున్నది. 'వ్యవసాయ' 'జ్ఞానజనక' ప్రమాణములకు భేదము లేక 'అనువ్యవసాయభేదము' సిద్ధింపదు. ఏకవహ్నిప్రత్యక్షజ్ఞాన మగునపుడు 'వహ్నిం సాక్షాత్కరోమి' అనునట్లు 'అనువ్యవసాయ' మగుచున్నది. అనుమానజన్యజ్ఞాన మగునపుడు 'వహ్ని మనుమినోమి' అనునట్లు అనువ్యవసాయ మగుచున్నది. ఎచ్చట శబ్దముచేత వహ్నిజ్ఞాన మగుచున్నదో అచ్చట 'వహ్నిం శాబ్దయామి' అనునట్లు అనువ్యవసాయ మగుచు

న్నది. మఱియు, నెచట సూర్యునియందు వహ్నియొక్క సాదృశ్యజ్ఞానకరూ పోపమానప్రమాణముచేత సూర్యసదృశవహ్నిజ్ఞాన మగుచున్నదో అచట 'సూ ర్యేణ వహ్నిం మనుమనోమి' ఇట్లు అనువ్యవసాయ మగుచున్నది. జ్ఞానవిషయ జ్ఞానమునకు 'అనువ్యవసాయ మని పేరు. అనువ్యవసాయవిషయ మైనజ్ఞాన మే మున్నదో అది వ్యవసాయ మనబడును. ఈప్రకారముగా వ్యవసాయజ్ఞానజనక ప్రమాణభేదమువలన అనువ్యవసాయభేదము సిద్ధించుచున్నది. కదాచిత్ 'గం ధేన ఇతరభేదం పృధివ్యాం అనుమినోమి'' యిట్లు అనువ్యవసాయ మగుచు న్నది. మఱియును, 'గంధానుపపత్త్యా ఇతరభేదం పృథివ్యాం కల్పయామి' అని కదాచిత్ అనువ్యవసాయ మగుచున్నది. ఎచట అనువ్యవసాయమునకు విషయ మైనవ్యవసాయము అనుమానప్రమాణజన్యమై యున్నదో అచ్చట ప్రథమానువ్యవసాయ మగుచున్నది. ఎచ్చట అనువ్యవసాయమునకు విషయ మైనవ్యవసాయము అర్థాపత్తిప్రమాణజన్యమై యున్నదో అచ్చట ద్వితీయాను వ్యవసాయ మగుచున్నది. ఈవిధముగా అనువ్యవసాయభేదమువల్లను, వ్యవసా యభేదమువలనను వ్యవసాయజ్ఞానజనకానుమానార్థాపత్తులు రెండు కలవు. ఒకదాని నంగీకరించి రెండవదానిని నిరాకరించుట సరి కాదు. మఱియును 'శబ్ద శక్తిప్రకాశికాదిగ్రంధములయందు అనుమానప్రమాణముకంటె శబ్దప్రమాణము యొక్క భేదము అనువ్యవసాయముయొక్క భేదముచేతనే సిద్ధ మైనట్లు చెప్ప బడినది. అందువలన, ప్రమాణభేదముయొక్క సిద్ధియందు అనువ్యవసాయభేదము ప్రబలహేతువై యున్నది. ఈవిధముగా నర్థాపత్తి కేవలవ్యతిరేక్యనుమానములు రెండును, అంగీకరింపవలసినది. ఎచ్చట విషయప్రకాశము ఏకప్రమాణముచేత సిద్ధించుచున్నదో అచ్చట నపరప్రమాణముయొక్క నిషేధము కలుగుట లేదు. కేవలవ్యతిరేకియొక్క స్వరూపము సంక్షేపముగా ప్రదర్శిత మైనది.

౽౦. అర్థాపత్తిప్రమాణ, ప్రమలయొక్క స్వరూపభేదమును, తదుదా హరణములును.

అర్థాపత్తియొక్క స్వరూప మే మనగా, ప్రమాణములకు బోధకము ప్ర త్యక్ష శబ్ద మె ట్లైనదో అట్లు అర్థాపత్తిశబ్దము కూడ, ప్రమాణప్రమలు రెంటికిని బోధక మైనది. ఉపపాదకకల్పనము సమహేతు వైనయుపపాద్యజ్ఞానము అర్థాప త్తిప్రమాణ మనబడును. ఉపపాదకజ్ఞానము అర్థాపత్తిప్రమ యనబడును. ఉపపా దకసంపాదకశబ్దములు పర్యాయశబ్దములై యున్నవి. ఉపపాద్యసంపాద్యశబ్దము

ములును పర్యాయశబ్దములై యున్నవి. అందువలన విచారసాగరమునందు నుపపాదకజ్ఞానము అర్థాపత్తి యనబడినది. దానితో విరోధము లేదు. ఏది లేకయే యేది సంభవించుట లేదో దానికి అది 'ఉపపాద్య' మనబడును. ఉ. రాత్రిభోజనము లేకయే దివాఽభోజి యగుపురుషునియందు స్థూలత్వము సంభవించుట లేదు. అందువలన రాత్రిభోజనమునకు స్థూలత్వము ఉపపాద్యమై యున్నది. దేనియొక్క యభావమువలన దేనియొక్క అభావము సిద్ధించుచున్నదో అది దానికి 'ఉపపాదక'మై యున్నది. ఉ. రాత్రిభోజనముయొక్క యభావమువలన దివాఽభోజ యగుపురుషునకు స్థూలత్వాభావము సిద్ధించుచున్నది. అందువలన రాత్రిభోజనము స్థూలత్వమునకు 'ఉపపాదక'మై యున్నది. శంక.—ఈరీతిగా వ్యాపకమునకు నుపపాదకత్వము, వ్యాప్యమునకు నుపపాద్యత్వమును సిద్ధించుచున్నది. ఉపపాదకజ్ఞానమునకు హేతు వగునుపపాద్యజ్ఞానము అర్థాపత్తిప్రమాణమై యున్నది. ఇట్లు చెప్పుటవలన వ్యాపకజ్ఞానమునకు హేతు వైనవ్యాప్యజ్ఞానము అర్థాపత్తిప్రమాణమై యున్న దని సిద్ధించుచున్నది. ఇది అనుమానప్రమాణమై యున్నది. అర్థాపత్తిమాణమునకు అనుమానప్రమాణముకంటె భేదము ప్రతీత మగుట లేదు. ఉత్తరము. "స్థూలత్వము రాత్రిభోజనమునకు వ్యాప్యమై యున్నది. స్థూలత్వసహితుడు దేవదత్తుడు; అని యీరెండు జ్ఞానములును కలిగి యెచట రాత్రిభోజనజ్ఞానము కలుచున్నదో అచ్చట "అనుమితిజ్ఞానము"న్నది. మఱియును, దివాఽభోజి యైనపురుషునియందు రాత్రిభోజనము లేకయే స్థూలత్వమునకు ననుపపత్తి యున్నది, అని జ్ఞానోత్తరమునందు రాత్రిభోజనముయొక్క జ్ఞానము అర్థాపత్తిప్రమయై యున్నది. ఈహేతువుచేత ప్రథమరీతిగా రాత్రిభోజనముయొక్క జ్ఞానోత్తరమునందు 'స్థౌల్యేన రాత్రిభోజనం అనుమినోమి' అనునట్లు అనువ్యవసాయ మగుచున్నది. ద్వితీయరీతిగా, రాత్రిభోజనజ్ఞానోత్తరమునందు స్థూలత్వానుపపత్త్యా 'రాత్రిభోజనం కల్పయామి' అనునట్లు అనువ్యవసాయ మగుచున్నది. ఈవిధముగా ఉపపాద్యానుపపత్తిజ్ఞానమువలన ఉపపాదకకల్పన యర్థాపత్తిప్రమ యగును. ఉపపాదకకల్పనకు హేతు వగు నుపపాద్యానుపపత్తిజ్ఞానము అర్థాపత్తిప్రమాణ మనంబడును. అర్థ మనగా నుపపాదకవస్తువు. దానియొక్క ఆపత్తి యనగా కల్పన. ఈయర్థముచేత నర్థాపత్తిశబ్దము ప్రమాబోధకమై యున్నది. అచట 'అర్థ స్యాపత్తిః' అని షష్ఠీతత్పురుషసమాసమున్నది. 'అర్థ స్యాపత్తిః యస్మాత్' అని బహువ్రీహిసమాసముచే నర్థముయొక్క

కల్పన దేనివలన నగుచున్నదో ఆయుపపాద్యముయొక్క యనుపపత్తియొక్క జ్ఞానరూపప్రమాణము అర్థాపత్తిశబ్దముయొక్క అర్థమై యున్నది.

అర్థాపత్తి ద్వివిధమై యున్నది. (1) దృష్టార్థాపత్తి. (2) శ్రుతార్థాపత్తి.

ఎచ్చట దృష్ట మగునుపపాద్యముయొక్క అనుపపత్తిజ్ఞానముచేత ఉపపాదకముయొక్క కల్పన మగుచున్నదో అచ్చట దృష్టార్థాపత్తి యనబడును. ఉ. దివా అభోజి స్థౌల్యమునందు రాత్రిభోజనజ్ఞానము దృష్టార్థాపత్తి యై యున్నది. ఎట్లనగా, ఉపపాద్యస్థూలత్వము దృష్టమై యున్నది. మఱియును శ్రుత మగు నుపపాద్యముయొక్క అనుపపత్తిజ్ఞానముచేత ఉపపాదకకల్పన మెచట నగుచున్నదో అచ్చట శ్రుతార్థాపత్తి యనబడును. ఉ. 'గృహే అసద్దేవదత్తో జీవతి' అను వాక్యమును విని గృహముకంటె బాహ్యదేశమునందు దేవదత్తునికి 'సత్త' (అనగా ఉండుట) లేకయే గృహమునందు లేని దేవదత్తునకు జీవనము సంభవించుట లేదు. అందువలన గృహమునందు అసద్దేవదత్తుని జీవనముయొక్క అనుపపత్తి చేత దేవదత్తునికి గృహముకంటె బాహ్యదేశమునందు "సత్త" కల్పింపబడు చున్నది. అచట గృహమునందు అసద్దేవదత్తునియొక్క జీవనము దృష్టమై లేదు. మఱియు నేమనగా శ్రుతమై యున్నది. శ్రుతార్థముయొక్క అనుపపత్తిచేత ఉపపాదకముయొక్క కల్పన శ్రుతార్థాపత్తిప్రమ యనబడును. దానికి హేతువు అగు శ్రుతార్థముయొక్క అనుపపత్తిజ్ఞానము శ్రుతార్థాపత్తిప్రమాణ మనబడును. ఈస్థానమునందు గృహమునందు అసద్దేవదత్తునియొక్క జీవనము ఉపపాద్యమై యున్నది. గృహముకంటె బాహ్యసత్త ఉపపాదకమై యున్నది. అభిధానానుపపత్తి.—అభిహితానుపపత్తులయొక్క భేదమువలన శ్రుతార్థాపత్తి ద్వివిధమై యున్నది. 'ద్వారమ్' లేక 'పిధేహి' ఇత్యాదిస్థలములయం దెచట వాక్యము యొక్క యేకదేశము ఉచ్చరింపబడియున్నదో ఏకదేశము ఉచ్చరింపబడ లేదో అచ్చట శ్రుతపదార్థముయొక్క అన్వయయోగ్యార్థమునకు అధ్యాహార మున్నది; లేక, అన్వయయోగ్యార్థబోధకపద మేది యున్నదో దానికి అధ్యాహార మున్నది. ఇదియే క్రమముగా అర్థాధ్యాహారవాద, శబ్దాధ్యాహారవాదగ్రంథములయందు చెప్పబడినది. అయిన, అర్థాధ్యాహారజ్ఞానము, లేక, పదాధ్యాహారజ్ఞానము అన్య ప్రమాణముచేత సంభవింపదు. అర్థాపత్తిప్రమాణముచేత సంభవించుచున్నది. ఇచ్చట అభిధానానుపపత్తిరూప శ్రుతార్థాపత్తి యున్నది ఎట్లన అన్వయబోధ ఫలసహిత శబ్దప్రయోగము 'అభిధాన' మనంబడును. 'ద్వారమ్' ఇత్యాదిశబ్ద

ప్రయోగరూపాభిధానమునకు అభిధానరూపార్థమునకును 'పిధేహి' అనుపదము యొక్క అధ్యాహారములేక అనుపపత్తి యున్నది. అథవా యీస్థలమునందు ఏక పదార్థమునకు ఇష్టపదార్థాంతరమునందు అన్వయబోధమునందు వక్తయొక్క తాత్పర్యము అభిధానశబ్దముయొక్క అర్థమై యున్నది. 'ద్వారమ్'అని మాత్రము చెప్పినపుడు ద్వారకర్మతకు నిరూపకతాసంబంధముచేత పిధానాన్వయబోధము శ్రోతకు కలుగుచున్నది. ఇది వక్తృతాత్పర్యరూపాభిధానమై యున్నది. మఱియును 'పిధేహి' అని మాత్రము చెప్పినపుడును పూర్వోక్తవక్తృతాత్పర్యరూపాభిధానమున్నది. వక్తృతాత్పర్యరూపాభిధానమునకు అధ్యాహారము, లేక, అనుపపత్తి యున్నది. అందువలన అభిధానానుపపత్తి యనంబడును. ఇచ్చట అర్థాధ్యాహారము, లేక, శబ్దాధ్యాహారము ఉపపాదకమై యున్నది. బోధఫలకశబ్దప్రయోగము ఉపపాద్యమై యున్నది. అథవా పూర్వోక్తతాత్పర్యము ఉపపాద్యమై యున్నది. బోధఫలక శబ్దప్రయోగరూపోపపాద్యముయొక్క యనుపపత్తిచేత అథవా తాత్పర్యరూపోపపాద్యముయొక్క యనుపపత్తిచేత అర్థరూప, అథవా, శబ్దరూపోపపాదకమునకు కల్పన మున్నది. అందువలన నధ్యాహృతార్థమునకు, లేక, శబ్దమునకు అభిధానానుపపత్తిరూపార్థాపత్తి ప్రమాణముచేత బోధ మగుచున్నది. ఎచ్చట వాక్యముయొక్క అర్థము అన్యార్థకల్పనము లేక అనుపపన్న మగుచున్నదో అచ్చట అభిహితానుపపత్తిరూప శ్రుతార్థాపత్తి యున్నది. ఉ. "స్వర్గకామో యజేత" అను వాక్యముయొక్క అర్థము అపూర్వకల్పన లేక అనుపపన్నమగుచున్నది. అందువలన అభిహితానుపపత్తిరూపశ్రుతార్థాపత్తి యున్నది. ఇచట యాగముయొక్క స్వర్గసాధనత ఉపపాద్యమై యున్నది. దానికి అనుపపత్తిచేత ఉపపాదక మగునపూర్వమునకు కల్పన యున్నది. మఱియును స్వర్గసాధనత దృష్టము కాదు. మఱియు నేమనగా శ్రుతమై యున్నది; అందువలన నిది శ్రుతార్థాపత్తియై యున్నది.

### ౬౧. అర్థాపత్తి జిజ్ఞాసకు అనుకూలోదాహరణములు.

శ్రుతార్థాపత్తియొక్క జిజ్ఞాసకు అనుకూలోదాహరణము. "తరతి శోకమాత్మవిత్" అను నిచట జ్ఞానముచేత శోకమునకు నివృత్తి శ్రుతమై యున్నది. దానికి శోకమిథ్యాత్వము లేక, అనుపపత్తి యున్నది. అందువలన, జ్ఞానముచేత శోకనివృత్తియొక్క అనుపపత్తివలన బంధమిథ్యాత్వకల్పన సిద్ధించుచున్నది. బంధమిథ్యాత్వము ఉపపాదకమై యున్నది. జ్ఞానముచేత శోకనివృత్తి ఉపపాద్యమై

యున్నది. అది దృష్టము కాదు. అందువలన శ్రుతార్థాపత్తియై యున్నది. ఆలాగు ననే, మహావాక్యమునందు జీవబ్రహ్మలకు అభేదము శ్రుతమై యున్నది. అది ఔపాధిక భేద ముండు నెడల సంభవించును. స్వరూపముచేత జీవబ్రహ్మలకు భేద ముండు నెడల సంభవింపదు. అందువలన, జీవబ్రహ్మాభేదముయొక్క అనుపపత్తిచేత భేదమునకు ఔపాధికత్వజ్ఞానము అర్థాపత్తిప్రమాణజన్యమై యున్నది. ఇచ్చట, జీవబ్రహ్మలయొక్క అభేదము ఉపపాద్యమై యున్నది. భేదమునందు ఔపాధికత్వము ఉపపాదకమై యున్నది. ఉపపాద్యజ్ఞానము ప్రమాణమై యున్నది. ఉపపాదక జ్ఞానము ప్రమయై యున్నది. ఇచ్చట జీవబ్రహ్మాభేదము విద్వాంసులకు దృష్టమై యున్నది. తదితరులకు శ్రుతమై యున్నది. అందువలన, దృష్టార్థాపత్తి, శ్రుతార్థాపత్తి యను నీరెంటికిని ఉదాహరణమై యున్నది. ఎచ్చట వాక్యమునందు పదము నకు గాని అర్థమునకు గాని అధ్యాహారము లేదో మఱియు నన్యార్థముయొక్క కల్పన లేక వాక్యార్థమునకు ననుపపత్తియున్నదో అచ్చట అభిహితానుపపత్తిరూప శ్రుతార్థాపత్తి యున్నది. అందువలన "ద్వారమ్" అను నుదాహరణ మొకటి యేగాక అభిహితానుపపత్తిరూపశ్రుతార్థాపత్తికి ఉదాహరణమై యున్నది. అట్లే రజతాధికరణ మైనశుక్తి యందు రజతనిషేధము దృష్టమై యున్నది అది రజ తమునకు మిథ్యాత్వము వినాగా సంభవించుట లేదు. అందువలన నిషేధము యొక్క అనుపపత్తిచేత రజతమిథ్యాత్వకల్పన మేర్పడుచున్నది. ఇది దృష్టార్థా పత్తికి నుదాహరణమై యున్నది. ఇచ్చట రజతనిషేధము ఉపపాద్యమై యున్నది. మిథ్యాత్వము ఉపపాదకమై యున్నది. మఱియును, మనోవిలయా నంతరనిర్వికల్పసమాధికాలమునందు అద్వితీయబ్రహ్మమాత్రము శేషమై యు న్నది. సకలానాత్మ వస్తువుయొక్క అభావ మున్నది. తదనాత్మవస్తువు మానస మయి మనోవిలయముచేత దానియొక్క యభావము సంభవించుచున్నది. మానసము కానిచో మనోవిలయముచేత నభావము సంభవింపదు. ఎట్లనగా, అన్యవిలయముచేత అన్యముయొక్క అభావము కలుగనేరదు. అందువలన మనోవిలయముచేత సకల ద్వైతాభావముయొక్క యనుపపత్తిచేత సకల ద్వైతము మనోమాత్రమై యున్న దని కల్పన సిద్ధించుచున్నది. ఈ స్థలమునందు మనోవిలయముచేత సకలద్వైతవిలయము ఉపపాద్యమై యున్నది. దానియొక్క జ్ఞానము అర్థాపత్తిప్రమాణమై యున్నది. సకలద్వైతముయొక్క మానసత్వము ఉపపాదకమై యున్నది. దానియొక్క జ్ఞానము అర్థాపత్తిప్రమయై యున్నది.

ఈస్థానమునందు నుపపాదకప్రమకు అసాధారణకారణము అర్థాపత్తిప్రమాణమై యున్నది. అది నిర్వ్యాపారమై యున్నది. అయినను, దానియందు నుపపాదక ప్రమయొక్క కరణత సంభవించుచున్నది. ఈరీతిగా నుపమాననిరూపణమునందు చెప్పబడినది.

ఇతి శ్రీమన్నిశ్చలదాసాహ్వాయ సాధువిరచిత మగు వృత్తిప్రభాకరమునందు

అర్థాపత్తిప్రమాణనిరూపణ మనుపంచమప్రకాశము

స మా ప్త ము.



# వృత్తిప్రభాకరము.

## అనుపలబ్ధిప్రమాణనిరూపణ మనుషష్ఠప్రకాశ ప్రారంభము.

### ౬౨. అభావముయొక్క సామాన్యలక్షణమును భేదమును.

అనుపలబ్ధిప్రమాణముచేత అభావప్రమ కలుగుచున్నది. అందువలన నభావప్రమయొక్క యసాధారణకారణము అనుపలబ్ధిప్రమాణ మనబడును. న్యాయవేదాంతములయొక్క సంస్కారహీనుడు అభావస్వరూపము నెఱుంగజాలడు. అందువలన ప్రథమమున నభావస్వరూపనిరూపణము అత్యంతావశ్యకముగా నున్నది. ఏది నిషేధముఖప్రతీతివిషయముగా గాని, ప్రతియోగిసాపేక్షప్రతీతివిషయముగా గాని యున్నదో అది యభావ మనంబడును. ప్రాచీనమతముచేత నిది ప్రథమలక్షణమై యున్నది. నవీనమతమునందు ధ్వంస, ప్రాగభావములు నఞ్ శబ్దజన్యప్రతీతికి విషయములుగా లేవు. ఈయర్థము ముందు స్పష్టీకరింపబడును. అందువలన ద్వితీయలక్షణము చెప్పబడినది. ప్రతియోగిని త్యజించి అభావప్రతీతి యగుట లేదు. అందువలన ప్రతియోగిసాపేక్షప్రతీతికి విషయము సకలాభావమై యున్నది. యద్యపి, అభావమువలె సంబంధము, సాదృశ్యము కూడ ప్రతియోగినిరపేక్షప్రతీతికి విషయము కాదు. మఱియు నేమనగా, ప్రతియోగిసాపేక్షప్రతీతికి విషయమై యున్నది. దానియందు నభావలక్షణము పోవుచున్నది. తథాపి సంబంధసాదృశ్యములయొక్క ప్రతియోగితకంటె అభావప్రతియోగిత విలక్షణమై యున్నది. అది న్యాయగ్రంథమునందు అభావాభావరూపత్వము అభావముయొక్క ప్రతియోగితాస్వరూప మని యాచార్యులచేత వ్రాయబడియున్నది. ఈప్రతియోగిత్వము, సంబంధమునకును, సాదృశ్యమునకును లేదు. అందువలన సంబంధసాదృశ్యములయొక్క ప్రతియోగితకంటె విలక్షణప్రతియోగితాసహితము దేనికి ప్రతియోగి యగుచున్నదో అది యభావ మనంబడును. ఇది స్థూలరీతిమై యున్నది. సంబంధసాదృశ్యములకంటె భిన్నమై ప్రతియోగిసాపేక్షప్రతీతికి విషయమై యేది యున్నదో అది యభావ మనంబడును. ఆయభావము ద్విప్రకారమై యున్నది.

(౧) సంసర్గాభావము. (౨) అన్యోన్యాభావము.

వీనిలో అన్యోన్యాభావము ఏకవిధముగానే యున్నది. సంసర్గాభావము చతుర్విధము.

(౧) ప్రాగభావము. (౨) ప్రధ్వంసాభావము. (3) సామయికాభావము. (౪) అత్యంతాభావము.

ఈరీతిగా చతుర్విధసంసర్గాభావము, అన్యోన్యాభావమును జేరి పంచవిధాభావము లున్నవి. కపాలమునందు ఘటోత్పత్తికి పూర్వము ఘటాభావమున్నది. పచ్చికపాలమునందు రక్తోత్పత్తికి పూర్వము రక్తరూపాభావమున్నది. ఇవి ప్రాగభావంబు లనంబడును. ఘటోత్పత్త్యనంతరమున ముద్గరాదికమువలన కపాలమునందు ఏఘటాభావమున్నదో అది ప్రధ్వంసాభావమై యున్నది. మఱియును పక్వకపాలమునందు ఏశ్యామరూపాభావమున్నదో అదియును ప్రధ్వంసాభావ మనంబడును. నైయాయికమతమునందు ప్రధ్వంసాభావము సాదియైయును అనంతమైయు నున్నది. ఎట్లనగా ఘటముయొక్క ధ్వంసమునకు ఉత్పత్తి ముద్గరాదికమువలన నగుచున్నది. ఇది యనుభవసిద్ధము. మఱియును ధ్వంసమునకు ధ్వంసము సంభవించుట లేదు. ఎట్లనగా, ప్రాగభావము, ప్రతియోగి, ధ్వంసము, ఈమూటిలో నొకదానికి అధికరణము, కాలము అవశ్య మగుచున్నది. ప్రాగభావధ్వంసములకు అసాధారణ మయినకాలము ప్రతియోగికాధారమై యున్నది యను నియమ మున్నది. ఘటోత్పత్తియై నాశమునకు పూర్వము ఘటప్రాగభావధ్వంసమునకు అనాధారము కాలమై యున్నది. ఎట్లనగా, ప్రాగభావమునకు నాశమై ఘటధ్వంసము కానందున ఘటధ్వంసమునకు అనాధారము కాలమై యున్నది. ఆకాలమే ఘటమునకు నాధారమై యున్నది. ఘటధ్వంసమునకు ధ్వంస మంగీకరించినయెడల ఘటధ్వంసముయొక్క ధ్వంసమునకు అధికరణ మయిన కాలము ఘటప్రాగభావఘటధ్వంసములకు అనాధారమైనందున ఘటమునకు ఆధారము కావలయును. ఈరీతిగా ధ్వంసముయొక్కధ్వంసము నంగీకరించినయెడల ప్రతియోగికి ఉన్మజ్జనము కావలయును. దీనికొఱకు ప్రాగభావ మనాది యని యంగీకరింపబడవలసినది. సాది యని యంగీకరించినయెడల ప్రాగభావముయొక్క యుత్పత్తిచేత ప్రథమకాలము ప్రాగభావధ్వంసమున కనాధారమైనందున ప్రతియోగి కాధారము కావలయును. అందువలన ప్రాగభావము అనాదిసాంతమై యున్నది. ధ్వంసము అనంతము సాదియై యున్నది. భూతలాది

కమునందు నెచ్చట కదాచిత్ ఘట మున్నదో అచ్చట ఘటశూన్యకాలమునందు ఘటముయొక్క సామయికాభావ మున్నది. సమయవిశేషమునందుండు నభావము సామయికాభావ మనంబడును. వాయువునందు రూప మెప్పుడును లేనందున వాయువునందు రూపముయొక్క యత్యంతాభావ మున్నది. ఘటముకంటె నితర పదార్థమునందు ఘటముయొక్క యేభేద మున్నదో అది ఘటాన్యోన్యాభావమై యున్నది. సామయికాభావము సాదిసాంతమై యున్నది. అత్యంతాభావాన్యోన్యాభావములు రెండును అనాద్యనంతమై యున్నవి. ఈరీతిగా నభావము పంచవిధములై యున్నది.

౬3. ప్రాచీనన్యాయమతమునందు అభావములకు పరస్పరవిలక్షణతాపాదకప్రతీతి.

అభావమునకు పరస్పరవిలక్షణతాపాదక మయిన విలక్షణప్రతీతి యీ దిగువ నుదాహరింపబడుచున్నది. కపాలమునందు ఘటోత్పత్తికి పూర్వము "కపాలే ఘటో నాస్తి" యని ప్రతీతి యగుచున్నది. దానికి విషయము ఘటప్రాగభావమై యున్నది. ఎట్లనగా, ప్రతియోగియొక్క యుపాదానకారణమునందు సామయికాభావాత్యంతాభావములు రెండును ఉండవు. ఈయర్థము ఉత్తరభాగమునందు స్పష్ట మగుచున్నది. తనప్రతియోగియొక్క యుపాదానమును త్యజించి అన్యస్థలమునందు రెండుభావము లున్నవి. అందువలన కపాలే ఘటో నాస్తి అనుప్రతీతికి విషయము సామయికాభావాత్యంతాభావములు కావు. మఱియును, ఘటోత్పత్తికంటె పూర్వము ధ్వంసము సంభవించుట లేదు. ఎట్లనగా ధ్వంసమునకు ప్రతియోగి నిమిత్తకారణమై యున్నది. కారణముకంటె పూర్వము కార్యము సంభవించుట లేదు. అందువలన ఘటోత్పత్తికి పూర్వము "కపాలే ఘటో నాస్తి" అను ప్రతీతికి విషయము ఘటధ్వంసము కాదు. మఱియును ఘటాన్యోన్యాభావము యద్యపి కపాలమునందు సర్వథా యున్నది. తథాపి "కపాలో న ఘటః" అను నన్యోన్యాభావముయొక్క ప్రతీతి యగుచున్నది. "కపాలే న ఘటః" అనుప్రతీతి యన్యోన్యాభావవిషయము కాదు, ఈప్రతీతికి విషయము ఏదో అది ప్రాగభావ మనంబడును. ఆలాగుననే ముద్గరాదికము వలన ఘటమున కదర్శన మైనప్పుడు "కపాలే ఘటో నాస్తి" అనుప్రతీతి యగుచున్నది. దానికి విషయము ప్రాగభావము కాదు. ప్రాగభావనాశము ప్రతియోగిరూపమై యున్నది. ఘటోత్పత్త్యనంతరమునందు ప్రాగభావము సంభవిం

చుట లేదు. అది యభావమై యున్నది. దానికిని పూర్వోక్తరీతిగా సంభవము లేదు. అందువలన ముద్గరాదిజన్యఘటముయొక్క యదర్శనకాలమునందు "కపాలే ఘటో నాస్తి" యని ప్రతీతి యగుచున్నది. దానికి విషయము ప్రధ్వంసాభావమై యున్నది. ఈరీతిగా ప్రాగభావప్రధ్వంసాభావములు నఞ్ శబ్దజన్య ప్రతీతివిషయములై యున్నవి.ఇది ప్రాచీనమతమై యున్నది.

### ౬౮. నవీనన్యాయమతమునందు అభావమునకు పరస్పరవిలక్షణతా సాధకప్రతీతి.

నవీనమతమునందు ప్రతియోగియొక్క ఉపాదానకారణమునందును అత్యంతాభావ మున్నది. అత్యంతాభావమునకు ప్రతియోగితో విరోధ మున్నది, అన్యముతో లేదు. ఎచ్చట ప్రతియోగి లేదో అచ్చట అత్యంతాభావ మున్నది. అందువలన ఘటోత్పత్తికి పూర్వమునందు, ప్రతియోగియొక్క నాశకాలమునందు ప్రతియోగియొక్క యత్యంతాభావ ముండుటవలన "కపాలే ఘటో నాస్తి" యీప్రతీతికి విషయము అత్యంతాభావమై యున్నది. ఈప్రతీతిచేత ప్రాగభావ ప్రధ్వంసాభావములకు సిద్ధి కలుగుట లేదు. మఱియు నేమనగా, "కపాలే ఘటో భవిష్యతి" ఈప్రతీతి ఘటోత్పత్తికి పూర్వ మగుచున్నది. దానికి విషయము ప్రాగభావమై యున్నది. "ఘటో ధ్వస్తః" అనుప్రతీతికి విషయము ధ్వంసమై యున్నది. ఈరీతిగా ఘటోత్పత్తికి పూర్వమునందు కపాలమునందు ఘటాత్యంతాభావము, ప్రాగభావము రెండు నున్నవి. వానియందు "కపాలే ఘటః నాస్తి" అనుప్రతీతికి విషయము కపాలమునందు ఘటాత్యంతాభావమై యున్నది. "కపాలే ఘటో భవిష్యతి." అనుప్రతీతికి విషయము కపాలమునందు ఘటప్రాగభావమై యున్నది. అట్లే ముద్గరాదికమువలన కపాలమునందు, ఘటాదర్శనమైన కాలమునందును "కపాలే ఘటో నాస్తి" "కపాలే ఘటో ధ్వస్తః" ఈరీతిగా ద్వివిధప్రతీతి కలుగుచున్నది. వానియందు నాద్యప్రతీతివిషయము అత్యంతాభావమై యున్నది. ద్వితీయప్రతీతికి విషయము కపాలమునందు ఘటము యొక్క ప్రధ్వంసాభావమై యున్నది. ఈరీతిగా నవీనమతమునందు ప్రాగభావ ప్రధ్వంసాభావములు నఞ్ శబ్దజన్యప్రతీతికి విషయములు కావు. అందువలన ప్రథమలక్షణము ప్రాచీనమతానుసారి యై యున్నది. ద్వితీయలక్షణము ఉభయ మతానుసారి యై యున్నది. అందువలన ద్వితీయలక్షణమే సమీచీనమై యున్నది.

### ౬౯. అభావముయొక్క ద్వితీయలక్షణవిలక్షణప్రతీతి.

సంబంధసాదృశ్యములకంటె భిన్న మయినయేయన్యసాపేక్షప్రతీతివిషయ మున్నదో అది యభావ మనబడును. ఇది ద్వితీయలక్షణము. ''భూతలమునందు ''ఘటో నాస్తి'' యీప్రతీతికి విషయము ప్రాగభావధ్వంసములు కావు. ఎట్లనగా, ప్రతియోగియొక్క ఉపాదానమునందు రెండుఅభావములు ఉన్నవి. ఘటాభావమునకు ప్రతియోగి యయినఘటముయొక్కయుపాదానము భూతలము కాదు. అందువలన ఉక్తప్రతీతికి విషయము రెండు అభావములు కావు. అత్యంతాభావాన్యోన్యాభావములు నిత్యమై యున్నవి. భూతలమునందు ఘటాభావ మనిత్యమై యున్నది. అందువలన ఘటముయొక్క సామయికాభావమే ఉక్తప్రతీతికి విషయమై యున్నది. ''వాయోః రూపం నాస్తి'' యీప్రతీతికి విషయము కేవలాత్యంతాభావమై యున్నది. అనంత మైనందున ప్రాగభావము కాదు. అనాది యయినందున ధ్వంసము కాదు. సర్వదా యుండుటవలన సామయికాభావమును కాదు. అందువలన ఉక్తప్రతీతికి విషయము అత్యంతాభావమై యున్నది. "వాయు ర్న రూపవాన్'' ఈప్రతీతికి విషయము అన్యోన్యాభావమై యున్నది. ఉక్తప్రతీతిచేత వాయువునందు రూపవద్భేదము భాసించుచున్నది. ఈలాగుననే ''ఘటః పటో న'' యీప్రతీతికి విషయము అన్యోన్యాభావమై యున్నది. అన్యోన్యాభావమే భేద మనంబడును.

౬౬. అన్యోన్యాభావలక్షణము. దానియందు శంకాసమాధానములు.

అభేదమునకు నిషేధక మైనయేయభావ మున్నదో యది యన్యోన్యాభావ మనంబడును. ''ఘటః పటో న'' యిట్లు చెప్పుటవలన ఘటమునందు పటముయొక్క యభేదమునకు నిషేధము కలుగుచున్నది. అందువలన ఘటమునందు పటముయొక్క యన్యోన్యాభావ మున్నది. ఎట్లనగా, నఞ్ శబ్దము లేకయే దేనియందు ఏది ప్రతీత మగుచున్నదో దానికి నఞ్ శబ్దముచేత నిషేధము కలుగుచున్నది. ఉ. నఞ్ శబ్దము లేకయే "ఘటః పటః'' యీ వాక్యముచేత నీలో ఘటః ఇత్యాదికమువలెను పటమునందు ఘటాభేదమును లేక ఘటమునందు పటాభేదమును ప్రతీత మగుచున్నది ఈ యభేదమునకు నిషేధము నఞ్ శబ్దముచేత కలుగుచున్నది. అయిన ఈమాత్రము భేదమున్నది. ఏ పదముతో నఞ్ శబ్దమునకు సంబంధ మగుచున్నదో ఆపదముయొక్క అర్థముయొక్క యభేదమునకు నిషేధము కలుగుచున్నది. ఉ. ''ఘటః పటో న'' యీ వాక్యమునందు పటపదముతో నఞ్ శబ్దమునకు సంబంధ మున్నది. అచ్చట

ఘటమునందు పటపదార్థముయొక్క యభేదమునకు నిషేధ మగుచున్నది. మఱి యును, ''పటో ఘటో న'' యీవాక్యమునందు నఞ్ శబ్దమునకు ఘటపదముతో సంబంధ మున్నది. అచ్చట ఘటపదార్థముయొక్క యభేదమునకు నిషేధము పటమునందున్నది. దీనికొఱకు ''ఘటః పటో న'' ఈవాక్యముచేత నే యన్యోన్యాభావము ప్రతీత మగుచున్నదో దానికి ఘటము అనుయోగి యై యున్నది. పటము ప్రతియోగి యై యున్నది. ఈలాగుననే ''పటో ఘటో న'' యీవాక్యమువలన ప్రతీత మగునన్యోన్యాభావమునకు పటము అనుయోగి యై యున్నది, ఘటము ప్రతియోగియై యున్నది. దేనియందు నభావ మున్నదో అది యభావమునకు అనుయోగి యనంబడును. దేనియొక్క యభావము ఉన్నదో అది ప్రతియోగి యనంబడును. శంక.—దేనియొక్క నిషేధము చేయబడుచున్నదో అది యభావమునకు ప్రతియోగి యనంబడును. పూర్వమునం దిట్లు చెప్పంబడి యున్నది 'ఘటః పటో న' ఈవాక్యముచేత ఘటమునందు పటముయొక్క యభేదమునకు నిషేధము చేయబడుచున్నది. ''పటో ఘటో న'' ఈవాక్యముచేత ఘటముయొక్క యభేదమునకు నిషేధము చేయబడుచున్నది. అందువలన 'ఘటః పటో న'' ఈవాక్యముచేత ప్రతీత మగునభావమునకు ప్రతియోగి పటాభేదమై యున్నది. పటము కాదు. ఇటులనే ''పటో ఘటో న'' ఈవాక్యముచేత ప్రతీత మగునభావమునకు ప్రతియోగి ఘటాభేదమై యున్నది కాని ఘటము కాదు.అందువలన రెండువాక్యములయందును అభేదముయొక్క నిషేధమును జెప్పినయెడల పటమునందును ఘటమునందును క్రమముగా ప్రతియోగిత చెప్పుటవలన విరోధము సంభవించుచున్నది. దీనికి సమాధనము.— అసాధారణధర్మమునకు నభేద మని పేరు. ఏది తన్ను విడిచి యేపదార్థమునందు లేదో కేవలము తనయందే యున్నదో అది తనకు అసాధారణధర్మ మనంబడును. ఘటాభేదము ఘటమునందే యున్నది అన్యమునందు లేదు. అందువలన ఘటాభేదము ఘటమునకు నసాధారణధర్మమై యున్నది. ఆయసాధారణరూపధర్మరూపాభేదమే సకలపదార్థములకు తనయందు సంబంధమై యున్నది. ఈరీతిగా పదార్థములయొక్క యసాధారణధర్మరూపాభేదసంబంధము తనయొక్క స్వరూపమునం దున్నది. ఏపదార్థముయొక్క యేసంబంధము దేనియందు నున్నదో ఆపదార్థము ఆంబంధముచేత దానియందు ఉన్నది ఉ. ఘటముయొక్క సంయోగసంబంధము భూతలమునం దున్నప్పుడు సంయోగసంబంధముచేత భూతలమునందు ఘట మున్నది అని వ్యవహారము కలుగు

చున్నది. అందువలన ఘటమునకు భూతలమునందు సంయోగసంబంధ మున్నది. మఱియును సంయోగసంబంధముచేత భూతలమునందు ఘట మున్నది. ఇట్లు చెప్పుటవలన నర్థభేదము లేదు. ఈలాగుననే సంయోగసంబంధముచేత భూతలము నందు ఘటాభావమును మఱియును భూతలమునందు ఘటసంయోగాభావమును ఉన్నవి. ఇట్లు చెప్పుటవలన నర్థము ఒక్కటే యియున్నది. ఈప్రకారముగా పటము నం దభేదసంబంధముచేత ఘటాభావమును ఘటముయొక్క అభేదసంబంధము యొక్క పటమునం దుండునభావము ఈరెండును సమనియతమై యుండుటవలన ఏకపదార్థమై యున్నది సమనియతాభావములకు భేదము లేదు. ఇట్లు ఘటత్వా త్యంతాభావ ఘటాన్యోన్యాభావములు రెండును ఘటభిన్న మైనసమస్తపదార్థ ములయందు నున్నవి. అందువలన సమనియత మైనందున పరస్పరభిన్నము కాదు. మఱియు నే మనగా, ఒక యభావమునందే ఘటత్వాత్యంతాభావత్వము, ఘటా న్యోన్యాభావత్వము ఈరెండుధర్మములును ఉన్నవి. ఒకయభావమునకే ఘటత్వ మును, ఘటమును, ఈరెండును ప్రతియోగియై యున్నవి. ఘటత్వాత్యంతాభా వత్వరూపత్వముచేత నేయభావమునకు ఘటత్వము ప్రతియోగియై యున్నదో ఆయభావమునకు ఘటాన్యోన్యాభావత్వరూపముచేత ఘటము ప్రతియోగియై యున్నది. ఏరీతిగా ఒకయభావమునకే రూపభేదముచేత ప్రతియోగిద్వయ మున్న దో అట్లు రూపభేదముచేత ఒకటేయభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదక సంబంధములు రెండున్నవి. ఘటత్వాత్యంతాభావత్వరూపముచేత ప్రతియోగితా వచ్ఛేదక సంబంధము సమవాయమై యున్నది. మఱియును, ఘటాన్యోన్యాభావత్వ రూపముచేత ఆయభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము సమవాయసంబంధ మై యున్నది. ఈరీతిగా పటాదిసకలపదార్థములయందును ఉండెడు ఘటాభేదము యొక్క యత్యంతాభావము ఘటాన్యోన్యాభావము కూడ ఏకమై యున్నది. ఏక మైన యాయభావమునందు ఘటాభేదాత్యంతాభావత్వముయొక్క ఘటాన్యోన్యా భావత్వధర్మద్వయము ఉన్నది. మఱియును ఘటాభేదాత్యంతాభావత్వరూపము చేత ఆయభావమునకు ఘటాభావము ప్రతియోగియై యున్నది. ప్రతియోగితా వచ్ఛేదకము స్వరూపసంబంధమై యున్నది. ఘటాన్యోన్యాభావత్వరూపముచేత ఆయభావమునకు ఘటము ప్రతియోగియై యున్నది. ప్రతియోగితావచ్ఛేదకము అభేదసంబంధమై యున్నది. ఆయభేదసంబంధమునకే తాదాత్మ్య మని పేరు, తద్వ్యక్తిత్వ మని పేరు. ఈరీతిగా ఘటాభేదముయొక్క నిషేధమునకు ఘటము

ప్రతియోగి యై యున్నది. ఇట్లు చెప్పుటకును సంభవించుచున్నది విరుద్ధము కాదు. ఈస్థలమునందు ఈక్రింద నుదాహరింప బోవు నిష్కర్ష యున్నది. ఏవాక్యముచేత నఞ్ శబ్దము లేకయే యేపదార్థమునందు నేసంబంధముచేత నేపదార్థము ప్రతీత మగుచున్నదో 'నఞ్' శబ్ద సహిత మయిన యావాక్యము చేత నా పదార్థమునం దా సంబంధముచేత నా పదార్థముయొక్క నిషేధము ప్రతీతి మగుచున్నది. ఉ. "నీలో ఘటః" అనువాక్యముచేత ఘటపదార్థము నందు అభేదసంబంధముచేత నీలపదార్థము ప్రతీత మగుచున్నది ఎట్లనగా, అభేదసంబంధముచేత నీలవిశిష్టము ఘటము అని వాక్యముయొక్క యర్థము. "నఞ్" శబ్దసహిత మయిన "ఘటో న నీలః" అనువాక్యముచేత నభేదసంబంధముచేత నీలముయొక్క నిషేధము ఘటమునందు ప్రతీత మగుచున్నది. ఈప్రకారమే 'ఘటః పటః" అను వాక్యమునందును "నఞ్" శబ్దము లేకయే ఘటపదార్థమునందు నభేదసంబంధముచేత పటపదార్థము ప్రతీత మగుచున్నది. ఎట్లనగా, ఎచట పదద్వయమునందును సమానవిభక్తు లున్నవో అచ్చట నేకపదార్థమునందు నభేదసంబంధముచేత నపరపదార్థము ప్రతీత మగుచున్న దను నియమమున్నది. "నీలో ఘటః" అనువాక్యమువలె "ఘటః పటః" అనువాక్యమునందు రెండుపదములు సమానవిభక్తికమై యున్నవి. అందువలన "నఞ్" శబ్దము లేకయే "ఘటః పటః" అనువాక్యముచేతను పటపదార్థమునం దభేదసంబంధముచేత ఘటపదార్థము ప్రతీత మగుచున్నది. యద్యపి, అభేదసంబంధముచేత పటపదార్థమునందు ఘటపదార్థము సంభవించుట లేదు. తథాపి, ఏకపదార్థమునం దభేదసంబంధముచేత నపరపదార్థప్రతీతి సామగ్రి సమానవిభక్తి యై యున్నది. అది "ఘటః పటః" అను వాక్యమునందు నున్నది. అందుచేత "నఞ్" శబ్దము లేకయే "ఘటః పటః" "అనువాక్యముచేత పటపదార్థమునందు నభేదసంబంధముచేత ఘటము ప్రతీత మగుచున్నది. అయిన, పటపదార్థమునందు నభేదసంబంధముచేత ఘటపదార్థప్రతీతి భ్రమరూపమై యున్నదే కాని ప్రమ కాదు. అందువలన "నఞ్" శబ్దము లేకయే యేకపదార్థమునందు నేసంబంధముచేత నపరపదార్థముయొక్క ప్రతీతి భ్రమరూపమై లేక ప్రమరూపమై యున్నదో అచ్చట "న" శబ్దమును చేర్చి యేకపదార్థమునం దాశబ్దముచేత నపరపదార్థముయొక్క నిషేధము కలుగుచున్నది. ఈరీతిగా నేకపదార్థమునందు అభేదసంబంధముచేత అపరపదార్థమునకు నిషేధక మగునభావము అన్యోన్యాభావ మనబడును.

౬౭. నవీనరీతిగా సంసర్గాభావముల చతుర్విధభేదము, తల్లక్షణము, పరీక్షయు.—

దానికంటె భిన్న మగునభావ మేది యున్నదో అది సంసర్గాభావ మన బడును. సంసర్గాభావము ప్రాచీనమతమునందు చతుర్విధమై యున్నది. అనాది సాంత మగునభావ మేది యున్నదో అది "ప్రాగభావ" మనంబడును. తనప్రతియోగియొక్క యుపాదానకారణమునందు ప్రాగభావము ఉన్నది. ఉదాహరణము—ఘటముయొక్క ప్రాగభావమునకు ప్రతియోగి ఘటమై యున్నది. దానియొక్క యుపాదానకారణ మగు కపాలమునందు ఘటప్రాగభావము ఉన్నది. కపాలోత్పత్తి పూర్వమునందు కపాలముయొక్క యుపాదాన కారణమునందు ఘటప్రాగభావము ఉన్నది. ఈప్రకారము సృష్టికి పూర్వమునందు ఘటారంభక పరమాణు సముదాయమునందు ఘట ప్రాగభావము ఉన్నది. మఱియును, పరమాణు ఘటములయొక్క మధ్యమునం దుండు నేద్వ్యణుకాది కపాలాంతావయవి యున్నదో ఆసమస్తముయొక్క ప్రాగభావము సృష్టికి పూర్వము పరమాణువులయం దున్నది. ఈవిధముగా ప్రాగభావము అనాది; అనగా నుత్పత్తిరహితము. మఱియును, సాంతము, అనగా నంతసహితము. ధ్వంసమునకు నంత మని పేరు. దానికే నాశ మనియును పేరు. ఘటోత్పత్తిసామగ్రి యేది యున్నదో దానివలన ఘటప్రాగభావముయొక్క ప్రాగభావమునకు నంతము కలుగుచున్నది. అందువలన ఘటప్రాగభావముయొక్క యంతము ఘటరూపముగానే యున్నది. ఘటప్రాగభావముయొక్క ధ్వంసము ఘటముకంటె పృథక్కు కాదు. యద్యపి, ప్రధ్వంసాభావము అనంతమై యున్నది. మఱియును, ఘటము సాంతమై యున్నది. ఘటముయొక్క ప్రాగభావధ్వంసము ఘటరూపమగు నెడల ప్రధ్వంసాభావము కూడ సాంతము కావలయును. ప్రధ్వంసాభావము అనంతమై యున్నది, అను నీనియమమునకు భంగము కలుగవలయును. ధ్వంసము, నాశము, అంతము అనునివి పర్యాయశబ్దములై యున్నవి. ఆధ్వంసము ద్వివిధమై యున్నది. (౧) భావపదార్థనాశరూపధ్వంసము. (౨) అభావనాశరూపధ్వంసము. భావపదార్థనాశరూపధ్వంసము అభావరూపమై యున్నది. దీనికే ప్రధ్వంసాభావ మని పేరు. ఉదాహరణము. ఘటాదిభావ పదార్థముయొక్క నాశము అభావరూపమై యున్నది. దానికి ప్రధ్వంసాభావ మని పేరు. మఱియును అభావపదార్థముయొక్క నాశరూపధ్వంసము భావరూపమై యున్నది.

దానికి "ధ్వంసః" "ప్రధ్వంసః" అని పేర్లు. ధ్వంసాభావ ప్రధ్వంసాభావ మను పేరు లేదు. ఉదాహరణము. ఘటప్రాగభావము అభావపదార్థమై యున్నది. దానియొక్క నాశరూపధ్వంసము ఘటమై యున్నది. అది భావరూపమై యున్నది. దానికి ప్రధ్వంసాభావ మని పేరు లేదు. మఱియు నే మనగా ఘట ప్రాగభావనాశరూపఘటమునకు "స్వప్రాగభావధ్వంస" మనియును "ప్రధ్వంస" మనియును పేర్లు. ఈ ప్రకారముగా ధ్వంసము ద్విప్రకారమై యున్నది. దీనియందు "భావరూపధ్వంసము" సాంతమై యున్నది; కాని "అభావరూపధ్వంసము" అనంతమై యున్నది. అందుచేత ఘటప్రాగభావధ్వంసము ఘటరూప మైనందున సాంతమై యున్నది. తథాపి, ప్రధ్వంసాభావ మనంతమై యున్నది. ఈ నియమమునకు హాని లేదు. ఈరీతిగా అనాదిసాంత మైనయభావ మేది యున్నదో అది ప్రాగభావ మనంబడును. అనాది యైన యభావము అత్యంతాభావము కూడ నగుచున్నది. అది సాంతము కాదు. మఱియును, సాంతమైనయభావము "సామయికాభావము" కూడ నగుచున్నది. అది యనాది కాదు. మఱియును, వేదాంత సిద్ధాంతమునందు అనాదిసాంత మైనది మాయయై యున్నది. అది యభావము కాదు. ఇంక నే మనగా: జగదుపాదానకారణము మాయయై యున్నది. మాయ యభావరూప మని యంగీకరించినయెడల ఉపాదానకారణత్వము సంభవించుట లేదు. ఎట్లనగా, ఘటాదికమునకు నుపాదానకారణ మైనకపాలాదికము భావరూపముగా ప్రసిద్ధ మైనది. అభావము దేనికిని ఉపాదానకారణము కాదు. అందుచేత మాయ యభావరూపము కాదు, కాని భావరూపమై యున్నది. యద్యపి, మాయ భావాభావములకంటె విలక్షణమై అనిర్వచనీయమై యున్నది, తథాపి, మాయ యభావరూపము కాదు. అందువలన భావరూపత్వము కూడ మాయయందు కలుగుట లేదు. అందువలన ప్రాగభావముయొక్క లక్షణమునందు అభావపదముయొక్క ప్రవేశమువలన మాయతో కూడ ప్రాగభావముయొక్క లక్షణము కలుగదు. మఱియును, మాయ భావరూపము కాదు. ఇట్లు చెప్పుటయొక్క యభిప్రాయ మే మనగా, కాలత్రయమునందు దేనికి బాధ కలుగుట లేదో అది పరమార్థ "సత్" అనబడును. మఱియును భావ మనంబడును. ఇది బ్రహ్మ మై యున్నది. మాయ కాదు. ఎట్లనగా, జ్ఞానోత్తరకాలమునందు మాయకు బాధ కలుగుచున్నది. అందువలన పరమార్థసత్స్వరూపము భావము; యద్యపి మాయ కాదు. తథాపి 'విధిముఖప్రతీతికి ఎది విషయ మగు

చున్నదో అదియు కూడ 'సత్' అనంబడును. భావ మనియు ననంబడును. "నిషేధముఖప్రతీతికి" ఏది విషయ మగుచున్నదో అది యభావ మనంబడును. నిషేధముఖప్రతీతియొక్క విషయత మాయయందు లేదు. అందువలన మాయయు భావరూపమై యున్నది. యద్యపి, మాయ, ప్రకృతి, అవిద్య, అజ్ఞానము అను నీశబ్దములు పర్యాయములై యున్నవి. మఱియును, "అవిద్యాఽజ్ఞాన" శబ్దముల యందు "అకారము" నిషేధవాచకమై యున్నది. అందువలన మాయయు కూడ నిషేధముఖప్రతీతికి విషయ మైనందున అభావరూపముగానే చెప్పవల యును. తథాపి, "అకారమునకు" కేవలనిషేధము అర్థము కాదు. ఇక నేమనగా, "విరోధి" "భేదవాన్," "అల్పము" కూడ "అ"కారమునకు నర్థములై యున్నవి. "అధర్మ" శబ్దమునందు "అ"కారమునకు "విరోధి" అర్థమై యున్నది. 'ధర్మ విరోధి'కి "అధర్మ" మని పేరు. మఱియును "అబ్రాహ్మణో నాచార్యః" అను చోట "అ"కారమునకు "భేదవాన్" అని యర్థము; బ్రాహ్మణునికంటె భిన్నుడు ఆచార్యత్వమునకు యోగ్యుడు కాడు; ఇది వాక్యార్థము. మఱియును "అనుదరా దేవదత్తకన్యా" అనుచోట "అ"కారమునకు "అల్పము" అని యర్థము. అల్పోదరసహిత యైన దేవదత్తకన్య యని వాక్యార్థము. ఈస్థలమునందు "అ"కారమునకు నిషేధము అర్థము ఎట్లు కాదో అట్లు "అవిద్యా" శబ్ద "అజ్ఞాన" శబ్దములయందును "అ"కారమునకు నిషేధము అర్థము కాదు. మఱియు నేమనగా "విరోధి" యని యర్థము. మాయకు జ్ఞానముచేత వధ్యఘాతక భావవిరోధము ఉన్నది. అందువలన అజ్ఞాన మనంబడును. మాయ వధ్యమై యున్నది. జ్ఞానము ఘాతకమై యున్నది. వేదాంతవాక్యజన్యబ్రహ్మాకారవృత్తి "విద్య" యనంబడును. అది మాయకు విరోధి యై యున్నది. అందువలన "అవిద్య" యనంబడును. "అజ్ఞాన" "అవిద్యా" శబ్దములవాచ్యము మాయయై యున్నది. "అ"కారమునకు "విరోధి" అని అర్థ మైనందున భావరూపమై యున్నది. భావరూప మైనను బ్రహ్మమువలె పరమార్థసద్రూపము కాదు. మఱియు నేమనగా "విధిముఖప్రతీతి"కి విషయ మైనందున వ్యావహారికసద్రూపమై యున్నది.

ప్రాగభావ లక్షణమునందు "అభావ" పదము లేనియెడల లక్షణము నకు మాయయందతివ్యాప్తి కలుగుచున్నది. ఎట్లనగా: మాయ అనాదియు సాంతము నై యున్నది. అందువలన అనాది సాంతమగు నేయభావ మున్నదో

అది ప్రాగభావ మనంబడును. సాది అనంత మగు నే యభావ మున్నదో అది ప్రధ్వంసాభావ మనంబడును. ఘటాదియొక్క ధ్వంసము ముద్గరాదికమువలన కలుగుచున్నది. అందువలన "సాది" యై యున్నది. మఱియును, అనంతత్వము నందు యుక్తి పూర్వమే చెప్పబడినది. అనంత మగునభావము ప్రధ్వంసాభావ మనంబడును. అత్యంతాభావమునం దతివ్యాప్తి కలుగుచున్నది. అందువలన ప్రధ్వంసాభావముయొక్క లక్షణమునందు "సాది" యని చేర్పంబడినది. అత్యంతాభావము "సాది" కాదు. మఱియు నేమనగా "అనాది" యై యున్నది. మఱియును "సాది" యభావము ప్రధ్వంసాభావ మనినయెడల "సాది" యభావము "సామయికాభావము" కూడ నగుచున్నది. అచట నతివ్యాప్తి యగును. "సామయికాభావము" అనంతము కాదు. మఱియు నే మనగా "సాంతమై" యున్నది. "సాది" అనంతము ప్రధ్వంసాభావ మనినయెడల మోక్షమునం దతివ్యాప్తి యగును. ఎట్లన, మోక్షము జన్య మైనది. అందుచేత "సాది" యై యున్నది. మఱియును, ముక్తునకు పునస్సంసారము లేదు. అందువలన "అనంతమై" యున్నది, కాని, మోక్షము భావరూపమై యున్నది. అభావ రూపము కాదు. అందువలన ప్రధ్వంసాభావముయొక్క లక్షణమునందు "అభావము" చెప్పవలసినది. యద్యపి, అజ్ఞానము, దానికార్యముల నివృత్తి మోక్ష మనంబడును. ధ్వంసమునకు "నివృత్తి" యని పేరు. అందువలన మోక్షము కూడ అభావరూపమై యున్నది. అందువలన ప్రధ్వంసాభావము యొక్క లక్షణమునందు అభావపదమును నివేశనము చేయక పోయినను మోక్షమునందు అతివ్యాప్తిరూపదోషము లేదు. ఎట్లనగా అలక్ష్యమునందు లక్షణము పోయినయెడల దానికి అతివ్యాప్తి యని పేరు. అజ్ఞాన తత్కార్యములయొక్క ధ్వంసరూపమోక్షమునకు లక్ష్యత స్పష్టముగానే యున్నది. సకలనాశము ధ్వంసాభావలక్షణమునకు లక్ష్యమై యున్నది. సకలనాశమునందు అంతర్భూత మగు కార్యసహితాజ్ఞానముయొక్క నాశరూపమోక్ష మున్నది కల్పితముయొక్క నివృత్తి అధిష్ఠానరూపమై యున్నది. అజ్ఞానము, తత్కార్యము కల్పితములై యున్నవి. అందువలన దానియొక్క నివృత్తియు అధిష్ఠానబ్రహ్మ రూపమై యున్నది అందువలన మోక్షము అభావరూపము కాదు. మఱియు నే మనగా బ్రహ్మరూప మైనందున భావరూపమై యున్నది. దానియందు ధ్వంస లక్షణము పోయినయెడల అతివ్యాప్తి యగును. అందువలన "సాది' అనంత

మగునే యభావ మున్నదో అది ప్రధ్వంసాభావ మనంబడును. ఉత్పత్తినాశసహిత మైన యేయభావ మున్నదో అది "సామయికాభావ" మనంబడును. ఎచ్చట ఏకాలమునందు పదార్థ మున్నదో, యే దైన ఒకకాలమునందు లేదో అచ్చట పదార్థశూన్యకాలమునందు ఆపదార్థముయొక్క "సామయికాభావము" ఉన్నది. ఉ. భూతలాదికమునందు ఘటాదికము ఒకకాలమునం దున్నది మఱియు నొక కాలమునందు లేదు. అచ్చట ఘటశూన్యకాల సంబంధి యగు భూతలాదికమునందు ఘటాదికముయొక్క 'సామయికాభావము' ఉన్నది. సమయవిశేషమునందు ఉత్పన్నమును, మఱియును,సమయవిశేషమునందు నష్టమును, అగు నేయభావ మున్నదో అది 'సామయికాభావ' మనంబడును. భూతలమునుండి ఘటమును అన్యదేశమునకు తీసుకొనివెళ్లినపుడు ఘటాభావముభూతలమునందు ఉత్పన్న మగుచున్నది. మఱియు నాభూతలమునకు, ఘటమును తిరిగి తీసికొని వచ్చినప్పుడు ఘటముయొక్క యభావము భూతలమునందు నష్ట మగుచున్నది. ఈరీతిగా 'సామయికాభావము'ఉత్పత్తినాశ సహితమై యున్నది. ఉత్పత్తి సహితాభావము ప్రధ్వంసాభావము కూడ నగుచున్నది. అచట అతివ్యాప్తిపరిహారముకొఱకు "సామయికాభావము"యొక్క లక్షణమునందు నాశపదము చేర్పబడియున్నది. ప్రధ్వంసాభావము యద్యపి ఉత్పత్తిసహితాభావమై యున్నది, తథాపి నాశసహితము కానందున నాశపదమును చేర్చినయెడల అతివ్యాప్తిదోషము లేదు. నాశసహితాభావము సామయికాభావ మని చెప్పినయెడల ప్రాగభావమునందు అతివ్యాప్తి యగును. అందువలన సామయికాభావలక్షణమునందు ఉత్పత్తిపదము చేర్పబడియున్నది. లక్షణమునందు ఉత్పత్తిపదముయొక్క ప్రవేశమువలన ప్రాగభావమునందు అతివ్యాప్తి లేదు. ఎట్లనగా ప్రాగభావమునకు నాశ మున్నది. అయిన అనాది యైనందున ఉత్పత్తి లేదు. మఱియును, సామయికాభావలక్షణమునందు అభావపదమును ఉంపక ఉత్పత్తినాశసహితము సామయికాభావ మని చెప్పినయెడల ఘటాదికమునం దతివ్యాప్తి యగును. ఎట్లనగా, ఘటాదికము కూడ భూతభౌతికానంత పదార్థము ఉత్పత్తి సహితమై యున్నది. అభావపదప్రవేశమువలన ఘటాదికము భావరూప మైనందున దానియందు సామయికాభావలక్షణమున కతివ్యాప్తి లేదు. ఈరీతిగా భూతలాదికమునందు ఘటాదికముయొక్క యుత్పత్తి నాశ సహితాభావము సామయికాభావమై యున్నది. అన్యోన్యాభావముకంటె భిన్న మగునుత్పత్తినాశశూన్య మగునేయభావ మున్నదో అది యత్యంతాభావ మనం

బడును. ఎచ్చట ఏకాలమునందును ఏపదార్థము లేదో అచ్చట ఆపదార్థము యొక్క యభావము అత్యంతాభావ మనంబడును. ఉ. వాయువునందు రూపము ఏకాలమందును లేదు. అచ్చట రూపాత్యంతాభావ మున్నది. ఇట్లే గంధము కూడ వాయువునందు సర్వదా లేదు. అందువలన వాయువునందు గంధము యొక్క యత్యంతాభావ మున్నది. స్నేహగుణము కేవలజలమునందె యున్నది. అన్యమం దెప్పుడును లేదు. అందువలన జలము వినా అన్యపదార్థమునందు స్నేహముయొక్క యత్యంతాభావ మున్నది. ఆత్మయందు రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములు ఎప్పుడును లేవు. అందువలన రూపాదికముయొక్క యత్యంతాభావము ఆత్మయం దున్నది. పృథివీజలములయందు రస మున్నది. అన్యమునం దెప్పుడును లేదు, అందువలన పృథివీ, జల, భిన్నపదార్థమునందు రసము యొక్క యత్యంతాభావ మున్నది. పృథివీత్వజాతి కేవలపృథివియం దున్నది. జలాదికమునం దెప్పుడును లేదు. అందువలన జలాదికమునందు పృథివీత్వము యొక్క యత్యంతాభావ మున్నది. బ్రాహ్మణభిన్నక్షత్రియాదులయందు బ్రాహ్మణత్వ మెప్పుడును లేదు. అందువలన క్షత్రియాదికమునందు బ్రాహ్మణత్వాత్యంతాభావ మున్నది. ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, వ్యాపకమై యున్నవి. వానియం దెప్పుడు క్రియ లేదు. అందువలన నాకాశాదికమునందు క్రియాత్యంతాభావ మున్నది. పృథివీ, జల, తేజః, పవన, మనస్సులయందు క్రియ యున్నది. మఱియును, కదాచిత్ క్రియయొక్క యభావమును ఉన్నది. అందువలన పృథివ్యాదికము నిష్క్రియ మైనప్పుడు పృథివీ, జల, తేజః, పవన, మనస్సులయందు క్రియాత్యంతాభావము లేదు. అట్లే సామయికాభావము లేదు. ఎట్లనగా ద్రవ్యముయొక్క యభావము సామయికాభావ మగుచున్నది. క్రియకు సామయికాభావము సంభవించుట లేదు. ఈవిషయము అగ్రమునందు స్పష్ట మగుచున్నది. అందువలన సామయికాభావమును కాదు. మఱియు నే మనగా, పృథివ్యాది పంచకమునందు క్రియయొక్క ప్రాగభావము, ధ్వంసాభావమును ఉన్నవి

౭౮. నాలుగు సంసర్గాభావములకు ప్రతియోగితో విరోధము అన్యోన్యాభావములకు అవిరోధనిరూపణము.

ఈరీతిగా భూతలాదికమునందు ఎచ్చట కదాచిత్ ఘటాదిక మున్నదో, కదాచిత్ లేదో, అచ్చట సామయికాభావ మున్నది. అత్యంతాభావము లేదు. ఎట్లనగా అభావమునకు ప్రతియోగితో విరోధ మున్నది. ఎచ్చట ప్రతియోగి

యున్నదో అచ్చట అభావము లేదు. మఱి యే మనగా, అభావముయొక్క యభావ మున్నది. మఱియు నెచ్చట భూతలాదికమునందు కదాచిత్ ఘట మున్నదో కదాచిత్ లేదో అచ్చట అత్యంతాభావము నంగీకరించినయెడల అత్యంతాభావము నిత్య మైనందున ఘటకాలమునందును ఘటాత్యంతాభావ ముండుటవలన అత్యంతాభావమునకు స్వప్రతియోగితో విరోధము లేక పోవల యును. అందువలన భూతలాదికమునందు ఘటాదికముయొక్క యత్యంతా భావము సంభవించుట లేదు. ఉ. ఘటోత్పత్తికంటె పూర్వము కపాలమునందు ఘటప్రాగభావము ఉన్నది. ఘటరూపప్రతియోగి ఉత్పన్న మయిన తరువాత కపాలమునందు ఘటప్రాగభావ ముండుట లేదు. దానికి నాశ మగుచున్నది, అందువలన ఆప్రాగభావమునకు ప్రతియోగితో విరోధ మున్నది. ఈవిధముగానే కపాలమునందు ఘటముయొక్క ప్రధ్వంసాభావ ముండినప్పుడు ఘట ముండుట లేదు, ఘట ముండినయెడల ఆకాలమునందు కపాలమునందు ఘటప్రధ్వంసాభావ ముండుట లేదు. అందువలన నాప్రధ్వంసాభావమునకును ప్రతియోగితో విరో ధము స్పష్టమై యున్నది. ఈలాగున నేభూతలాదికమునందు సంయోగసంబంధము చేత ఘటాదిక మున్నదో ఆభూతలాదికమునందు ఘటాదియొక్క సామయికా భావము లేదు. మఱియు నెందులకనగా, ఎంతకాలము ఘటాది యగు ప్రతియోగి భూతలాదికమునందు లేదో అంతకాలము సామయికాభావ మున్నది. ఘటాది యయిన ప్రతియోగి వచ్చినప్పుడు సామయికాభావము నష్ట మగుచున్నది. ఘట మును అన్యత్ర తీసికొని వెళ్లినప్పుడు సామయికాభావ ముత్పన్న మగుచున్నది. ఈకారణమువలన సామయికాభావమునకు ఉత్పత్తినాశములు అంగీకరింపబడి యున్నవి. ఈరీతిగా సామయికాభావమునకును ప్రతియోగితో విరోధము స్పష్టమై యున్నది. ఎట్లు ప్రాగభావాదికమునకు ప్రతియోగితో విరోధ మున్నదో అట్లు అత్యంతాభావమునకును ప్రతియోగితో విరోధము చెప్పబడియున్నది. యద్యపి సకలాభావమునకు ప్రతియోగితో విరోధ మున్నయెడల ఏకాలమునందు భూతలమునందు ఘట మున్నదో ఆకాలమునందు ఘటాన్యోన్యాభావము భూత లమునందు లేక పోవలయును. మఱియును ఘటసహితభూతలమునందు ఘటాన్యో న్యాభావ మున్నది. ఎట్లనఁగా భేదమునకు అన్యోన్యాభావ మని పేరు. దీనికే తనతో అతిరిక్తత యనియును భిన్నత యనియును, పేరు. ఘటసహితభూతలము కూడ ఘటస్వరూపము కాదు. ఇంకే మనఁగా ఘటముకంటె అతిరిక్త మన

బడును. ఘటముకంటె భిన్న మనబడును. ఈరీతిగా ఘటసహితభూతలమునందు ఘటాన్యోన్యాభావ మున్నది. అందువలన ఘటాన్యోన్యాభావమునకు ఘటరూప ప్రతియోగితో విరోధము లేదు. ఈవిధముగానే పటాన్యోన్యాభావమునకు పటాత్మకముతో విరోధము లేదు. అందువలన సకలాభావమునకు ప్రతియోగితో విరోధము చెప్పుట సరి కాదు. ఇక నే మనగా, కొన్ని అభావములకు ప్రతియోగితో విరోధ మున్నది. కొన్ని యభావములకు విరోధము లేదు. ప్రాగభావాదిదృష్టాంతముచేత అత్యంతాభావమునకు ప్రతియోగితో విరోధమును సాధించినయెడల అన్యోన్యాభావదృష్టాంతముచేత అత్యంతాభావమునకు ప్రతియోగితో అవిరోధము కూడ సిద్ధింపవలయును. అందువలన ఘటాన్యోన్యాభావమువలె ఘటాత్యంతాభావము కూడ ఘటాధికరణమునందు సంభవించు చున్నది. తథాపి ఘటాధికరణమునందు ఘటాత్యంతాభావము సంభవించుట లేదు. ఎట్లనగా, అభావము ద్విప్రకారమై యున్నది. ఒకటి అన్యోన్యాభావము, మఱియు నొకటి సంసర్గాభావము. సంసర్గాభావము చతుర్విధమై యున్నది.

ఈరీతిగా పంచవిధాభావము లున్నవి. వీనియందు అభావత్వరూపధర్మము సర్వత్రాసమానమై యున్నది. మఱియు నిషేధముఖప్రతీతియొక్క విషయతయు సర్వాభావమునందు సమానమై యున్నది. తథాపి అన్యోన్యాభావముకంటె చతుర్విధసంసర్గాభావమునందు అనేకవిధవైలక్షణ్య మున్నది. ఏవాక్యమునందు ప్రతియోగి, అనుయోగిబోధక భిన్నవిభక్తిసహితపద మున్నదో ఆవాక్యముచేత సంసర్గాభావమునకు ప్రతీతి కలుగుచున్నది. ఉ. ఉత్పత్తికి పూర్వమునందు "కపాలే ఘటో నాస్తి" అనువాక్యమునందు అనుయోగిబోధక కపాలపదము సప్తమ్యంతమై యున్నది. ప్రతియోగిబోధకఘటపదము ప్రథమాంతమై యున్నది. అచ్చట ప్రాగభావప్రతీతి కలుగుచున్నది. ఈవిధముగా ముద్గరాదికమువలన ఘటమునకు అదర్శనమైనప్పుడు ఆవాక్యముచేత ఘటధ్వంసమునకు ప్రతీతి కలుగుచున్నది. "వాయౌ రూపం నాస్తి" - ఈవాక్యముచేత వాయువునందు రూపాత్యంతాభావమునకు ప్రతీతి కలుగుచున్నది. అచ్చటను గూడ అనుయోగిబోధక వాయుపదము సప్తమ్యంతమై యున్నది. ప్రతియోగిబోధక రూపపదము ప్రథమాంతమై యున్నది. "భూతలే ఘటో నాస్తి"-ఈవాక్యజన్యప్రతీతికి విషయము సామయికాభావమై యున్నది. అచ్చటను అనుయోగిబోధకభూతలపదము సప్తమ్యంతమై యున్నది. ప్రతియోగిబోధకఘటపదము ప్రథమాంతమై

యున్నది. ‘‘భూతలం న ఘటః’’ ఈవాక్యముచేత భూతలమునందు ఘటాన్యోన్యాభావము ప్రతీత మగుచున్నది. అచ్చట అనుయోగిబోధక భూతలపదము ప్రతియోగిబోధకఘటపదము ఈరెండును ప్రథమాంతములై యున్నవి. ఈరీతిగా భిన్నవిభక్త్యంతపదఘటిత వాక్యజన్యప్రతీతియొక్క విషయత సంసర్గాభావమునం దున్నది. అన్యోన్యాభావమునందు లేదు. మఱియును సమానవిభక్త్యంతపదఘటిత వాక్యజన్య ప్రతీతియొక్క విషయత యన్యోన్యాభావమునం దున్నది. సంసర్గాభావమునందు లేదు. ఈరీతిగా అన్యోన్యాభావముతో విలక్షణస్వభావసహిత మైనది చతుర్విధసంసర్గాభావమై యున్నది. అందువలన ప్రాగభావ ప్రధ్వంసాభావములయొక్క దృష్టాంతముచేత అత్యంతాభావమునకు ప్రతియోగితో విరోధమే సిద్ధించుచున్నది. విలక్షణస్వభావసహితాన్యోన్యాభావముయొక్క దృష్టాంతముచేత ప్రతియోగితో అవిరోధము సిద్ధించుట లేదు. సంసర్గాభావమునకు అన్యోన్యాభావముతో మఱియు నొక్కవైలక్షణ్య మున్నది.

౬౯. చతుర్విధ సంసర్గాభావములకు పరస్పరవిరోధము, అన్యోన్యాభావమునకు దానితో అవిరోధము.

చతుర్విధాన్యోన్యాభావములకు పరస్పరవిరోధము ఉన్నది. ఒక సంసర్గాభావాధికరణమునందు అపరసంసర్గాభావ ముండదు. ఉ. కపాలమునందు ఘటోత్పత్తికి పూర్వము ఘటప్రాగభావ మున్నది. అచ్చట ఘటధ్వంస మైనను అత్యంతాభావ మైనను, సామయికాభావ మైనను ఉండదు. ఇట్లే కపాలమునందు ఘటధ్వంస ముండినప్పుడు ప్రాగభావాదిసంసర్గాభావత్రయ ముండదు. మఱియును, ఘటాన్యోన్యాభావము కపాలమునందు సర్వదా యున్నది. ఇవ్విధంబుననే భూతలమునందు ఘటముయొక్క సామయికాభావ ముండినపుడు ఘటప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము, ఈత్రితయ ముండదు. ఘటాన్యోన్యాభావ మచ్చట నున్నది. ఈప్రకారమే వాయువునందు రూపాత్యంతాభావ మున్నది. దానియందు రూపప్రాగభావ, ప్రధ్వంసాభావ, సామయికాభావములు మూడు నుండవు. మఱియును రూపముయొక్క యన్యోన్యాభావము వాయువునం దున్నది. ఈరీతిగా చతుర్విధసంసర్గాభావములకు పరస్పర విరోధ మున్నది. అన్యోన్యాభావమునకు దానితో అవిరోధ మున్నది. అన్యోన్యాభావమునకు అన్యాభావముతో అవిరోధ ముండినను ప్రాగభావాదులకు పరస్పరావిరోధము ఎట్లు సిద్ధిం

చుట లేదో అట్లు అన్యోన్యాభావమునకు ప్రతియోగితో అవిరోధ ముండినను సంసర్గాభావంబున కైనను ప్రతియోగితో నవిరోధము సిద్ధింపదు.

౭౦. ప్రాచీనమతమునందు అభావంబులకు పరస్పరము ప్రతియోగితో విరోధావిరోధములయొక్క ప్రతిపాదనము.

అభావములకు ప్రతియోగితో పరస్పరవిరోధావిరోధములు విస్తారముగ ప్రతిపాదింపబడుచున్నవి. యద్యపి ప్రతియోగియొక్క యుపాదానకారణమునందు ప్రాగభావ ప్రధ్వంసాభావములు రెండును ఉన్నవి. ఉ. ఘటోపాదానకారణమైనకపాలమునందు ఘటప్రాగభావము ఘటోత్పత్తికి పూర్వమునం దున్నది. ముద్గరాదికముచేత ఘటమును పగులగొట్టినప్పుడు ఘటప్రధ్వంసాభావము ఆకపాలమునం దున్నది. అందువలన ప్రాగభావ, ప్రధ్వంసాభావములకు పరస్పరవిరోధము చెప్పకూడదు. తథాపి, ఏకకపాలమునందు రెండు నుండవు. కాని, భిన్నకపాలమునం దున్నవి. అందువలన "ఏకదా సహానవస్థానరూప విరోధము" ప్రాగభావప్రధ్వంసాభావములకు పరస్పర మున్నది. ఈప్రకారమే అత్యంతాభావమునకును దానితో విరోధ మంగీకరింపవలయును. యద్యపి, అన్యోన్యాభావమునకు ఏ యభావముతోను విరోధము లేదు. ఎట్లనగా: కపాలమునందు ఘటప్రాగభావము ఉన్నది. అచ్చట ఘటాన్యోన్యాభావము కూడ ఉన్నది. కపాలమునందు ఘటప్రధ్వంసాభావ ముండినపుడును ఘటాన్యోన్యాభావ మున్నది. మఱియును, తంతువునందు ఘటాత్యంతాభావ ముండినపుడును ఘటాన్యోన్యాభావ మున్నది. భూతలమునందు ఘటముయొక్క సామయికాభావ మున్నది. అచ్చటను ఘటముయొక్క యన్యోన్యాభావము ఉన్నది. ఈవిధముగా అన్యోన్యాభావమునకు ఏ యభావముతోను విరోధము లేదు. తథాపి సంసర్గాభావమునకు ఈస్వభావ మున్నది. చతుర్విధసంసర్గాభావమునందు నొకసంసర్గాభావము ఏకకాలమునం దుండును, కాని రెండవది యుండదు. ఉ. కపాలమునందు నుత్పత్తికి పూర్వము ఘటప్రాగభావ మున్నది. ఆకాలమునందు ఘటప్రధ్వంసాభావ ముండదు. ప్రధ్వంసాభావ ముండినప్పుడు ప్రాగభావ ముండదు. మఱియును, ఘటముయొక్క సామయికాభావాత్యంతాభావములు కపాలమునం దెప్పుడు నుండవు. యద్యపి, కపాలమునందు ఘటముయొక్క ప్రాగభావప్రధ్వంసాభావము లుండినప్పుడు పటముయొక్క యత్యంతాభావ మున్నది. తథాపి, ఏకప్రతియోగియొక్క సంసర్గాభావద్వయ ముండ దని నియమ మున్నది. అపరప్రతియోగియొక్క యపరసంసర్గా

భావ ముండుట విరోధము కాదు. ఇట్లే భూతలాదికమునందు ఘటముయొక్క సామయికాభావ మున్నది. అచ్చట ఘటాత్యంతాభావము కాని ప్రాగభావము కాని ప్రధ్వంసాభావము కాని యుండవు. వాయువునందు రూపాత్యంతాభావ మున్నది. అచ్చట రూపప్రాగభావాదిక ముండదు. యద్యపి, సంయోగసంబంధము చేత కదాచిత్ భూతలాదికమునందు ఘట మున్నది. సమవాయసంబంధముచేత కపాలము వినా అన్యపదార్థమునందు ఘట మెప్పుడును ఉండదు. అందువలన సమవాయసంబంధముచేత ఘటాత్యంతాభావము భూతలాదికమునం దున్నది. సంయోగసంబంధముచేత ఘటసామయికాభావ మున్నది. అందువలన, సామయికాభావాత్యంతాభావములకు పరస్పరవిరోధము సంభవింపదు. తథాపి, ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్న సామయికాభావమునకు ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావముతో విరోధ మున్నది, సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావముతో విరోధము లేదు. అందుచేత నీనియమము సిద్ధించు చున్నది. ఏయధికరణమునందు ఏకాలమునందు నే పదార్థమునకు నేసంబంధముచేత నేకసంసర్గాభావ మున్నదో ఆయధికరణమునందు నాకాలమునందు నాపదార్థముయొక్క యాసంబంధముచేత నపరసంసర్గాభావము కలుగదు. అన్యసంబంధముచేత కలుగును. ఏసంబంధముచేత నేపదార్థ మెచట లేదో అచ్చట నాపదార్థముయొక్క తత్సంబంధావచ్ఛిన్నాభావము చెప్పబడును. భూతలమునందు సంయోగసంబంధముచేత కదాచిత్ ఘట మున్నది. అందువలన సంయోగసంబంధావచ్ఛిన్నఘటాత్యంతాభావము భూతలమునం దెప్పుడును లేదు. మఱియు నే మనగా భూతలత్వరూపజాతియందును, భూతలముయొక్క రూపాదిగుణములందును, సంయోగసంబంధముచేత ఘట మెప్పుడును కలుగదు. ఎట్లనగా, రెండుద్రవ్యములకును సంయోగము సిద్ధించుచున్నది. ద్రవ్యజాతులకును, ద్రవ్యగుణములకును సంయోగము సంభవింపదు. అందువలన, భూతలత్వమునందును, భూతలరూపగుణాదులయందును ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. మఱియును, భూతలత్వమునందును, రూపాదిగుణమునందును సమవాయసంబంధముచేత ఘటము ఎప్పుడును కలుగదు. ఎట్లనః కార్యద్రవ్యమునకు తనయొక్క యుపాదానకారణమునందు సమవాయసంబంధ మున్నది, తదితరమునందు లేదు. గుణముయొక్క సమవాయము గుణియం దున్నది. జాతియొక్క సమవాయము వ్యక్తియం దున్నది.

క్రియయొక్క సమవాయము క్రియాసహితముగా నున్నది. అన్యత్ర యెక్కడను, ఎప్పుడును, సమవాయసంబంధ ముండదు. యద్యపి, పరమాణ్వాదినిత్యద్రవ్యమునందు విశేషపదార్థముయొక్క సమవాయమును నైయాయికు డంగీకరించినాడు. తథాపి, విశేషపదార్థము అప్రసిద్ధమై యున్నది. దానియొక్క యంగీకారము నిష్ప్రయోజనమై యున్నది. ఇది యద్వైతగ్రంథమునందు స్పష్టమై యున్నది. మఱియును దీధితికార, శిరోమణిభట్టాచార్యులచేతను విశేషపదార్థముయొక్క ఖండనము చెప్పబడినది. అందువలన, నుపాదానకారణ, గుణి, వ్యక్తి, క్రియాసహితములయందే, కార్య, ద్రవ్య, గుణ, జాతి, క్రియలకు, క్రమముగా సమవాయసంబంధ మున్నది గాని మఱియు దేనియందైనను సమవాయసంబంధము లేదు. ఈరీతిగా భూతలత్వమునందును, భూతలముయొక్క రూపాదిగుణమునందును ఘటముయొక్క సమవాయసంబంధ మెప్పుడును లేదు. మఱియు నే మనగా, కపాలమునందే ఘటముయొక్క సమవాయ మున్నది. అందువలన ఘటమునకు నుపాదానకారణ మగుకపాలమును విడిచి మఱియొక స్థానమునందు ఘటముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. ఘటముయొక్క యన్యసంసర్గాభావము ఆయత్యంతాభావముతో చేరియుండదు. ఎట్లన, ఘటప్రాగభావమును,ప్రధ్వంసాభావమును, కపాలమును వినాగా అన్యస్థలమునందుండవు. సామయికాభావ మచ్చట నున్నది.

ఎచ్చట నొకానొక కాలమునందు నేసంబంధముచేత ప్రతియోగి యున్నదో మఱియు నేసంబంధముచేత ప్రతియోగి లేదో ఆకాలమునందు తత్సంబంధావచ్ఛిన్నసామయికాభావ మున్నది. ఎచ్చట నేకాలమునందు నేసంబంధముచేత ప్రతియోగి యుండదో అచ్చట తత్సంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. కపాలము వినాగా అన్యపదార్థమునందు సమవాయసంబంధముచేత ఘటము కదాచిత్తుగా నైన నుండదు. అందుచేత, ఘటముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావముయొక్క యధికరణమునందు ఘటముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్నసామయికాభావ ముండదు. మఱియును, విచారము చేయునెడల ద్రవ్యముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావము అప్రసిద్ధమై యున్నది. ద్రవ్యముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్న సామయికాభావ మే ప్రసిద్ధమై యున్నది. ఎట్లనగా: నిత్యద్రవ్యము సమవాయసంబంధముచేత దేనియందైన నుండదు. అందువలన; నిత్యద్రవ్యముయొక్క సమవాయసంబంధా

వచ్ఛిన్నాత్యంతాభావము నున్నది. సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాత్యంతాభావము నిత్యద్రవ్యములకు నెప్పుడును సంభవింపదు. మఱియును, కార్యద్రవ్యముయొక్క యుపాదానకారణమునందు ప్రాగభావము కాని, ప్రధ్వంసాభావము కాని యున్నవి. అచ్చట సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావమైనను, సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమైన నుండదు. తనయొక్క యుపాదానకారణమును త్యజించి అన్యపదార్థమునందు సమవాయసంబంధముచేత కార్యద్రవ్యము ఎప్పుడైన నుండదు. ఒకవేళ ఎప్పుడయిన నుండినయెడల సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావ ముండును. ఉపాదానముకంటె భిన్నమగు వస్తువునందు కార్యద్రవ్యము ఎప్పుడయిన నుండదు. అందువలన,ఉపాదానముకంటె భిన్నపదార్థమునందు కార్యద్రవ్యముయొక్క సమవాయ సంబంధముయొక్క సామయికాభావము కలుగదు. మఱియు నేమనగా: అచ్చటను కార్యద్రవ్యముయొక్క సమవాయసంబంధముయొక్క యత్యంతాభావమై యున్నది. ఈ విధముగా సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావము ద్రవ్యమునకు అప్రసిద్ధమై యున్నది.

గుణక్రియలు కూడ సమవాయసంబంధముచేత నేద్రవ్యమునందు నుత్పన్నమై నష్ట మగుచున్నవో ఆద్రవ్యమునందు సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావము లేదు. మఱియు నేమనగా: మొదట ప్రాగభావ మున్నది. తర్వాత ప్రధ్వంసాభావము ఉన్నది. మఱియును ఘటముయొక్క గుణక్రియలు సమవాయసంబంధముచేత నన్యద్రవ్యమునందు నెకప్పుడు నుండవు. అచ్చటను దానియొక్క సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. సామయికాభావము లేదు. ఈప్రకారము గుణక్రియలయొక్క సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావము కూడ అప్రసిద్ధమై యున్నది. ఆలాగుననే గుణక్రియలయొక్క సంయోగసంబంధావచ్ఛిన్న సామయికాభావమును అప్రసిద్ధమై యున్నది.ఎట్లనగా: సంయోగసంబంధముచేత గుణక్రియలు కదాచిత్తుగా నుండి కదాచిత్తుగా నుండని యెడల గుణక్రియలయొక్క సంయోగసంబంధావచ్ఛిన్న సామయికాభావ ముండును. సంయోగసంబంధముచేత గుణక్రియలు దేనియందును కదాచిత్తుగా నైన నుండవు. అందువలన గుణక్రియలయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమే యుండును. అత్యంతాభావము సకలపదార్థములయందున్నది. ఎట్లనగా సంయోగసంబంధముచేత గుణక్రియలు ఏపదార్థమునందైన నుండినయెడల తత్స

దార్థమునందు గుణక్రియలయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ ముండదు. ఆసంయోగసంబంధముచేత గుణక్రియలకు నాధార మెద్దియును లేదు. అందువలన, గుణక్రియలయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము కేవలాన్వయియై యున్నది. దేనికి ఎప్పుడును అభావము లేదో అది కేవలాన్వయి యనంబడును. ఉక్తాత్యంతాభావముయొక్క యభావము ఎప్పుడును లేదు.అందువలన నది కేవలాన్వయి యనంబడును. ఈప్రకారమే, సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావమును, సంయోగసంబంధావచ్ఛిన్న సామయికాభావమును గుణక్రియలకు అప్రసిద్ధములై యున్నవి. ఈవిధముగానే, జాతియొక్క సామయికాభావమును,అప్రసిద్ధమై యున్నది. ఎట్లనగా: సంయోగసంబంధముచేత జాతి యేపదార్థమునందును ఏకాలమునందైన నుండదు. అందుచేత సమస్తపదార్థములయందును జాతియొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. సామయికాభావము లేదు. ఈలాగుననే తనకు ఆశ్రయమైన వ్యక్తి యేది యున్నదో దానియందు సమవాయసంబంధముచేత జాతి సర్వదా యున్నది. ఆవ్యక్తియందు జాతియొక్క సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ ముండదు. ఉ. ఘటత్వజాతి ఘటవ్యక్తియందు సమవాయసంబంధముచేత నున్నది. అచ్చట ఘటత్వముయొక్క యత్యంతాభావమును, సామయికాభావమును, ప్రాగభావమును ప్రధ్వంసాభావమును, లేవు. ప్రాగభావప్రధ్వంసాభావములు అనిత్యమునకు నున్నవి. ఘటత్వము నిత్యమై యున్నది. దానికి ప్రాగభావప్రధ్వంసాభావములు కలుగుట లేదు. ఎచ్చట ప్రతియోగి యెప్పుడైనను లేదో అచ్చట అత్యంతాభావ మున్నది. ఎచ్చట ప్రతియోగి కదాచిత్తుగా నుండి కదాచిత్తుగా నుండదో అచ్చట సామయికాభావ మున్నది. ఘటమునందు ఘటత్వము సర్వదా సమవాయసంబంధముచేత నున్నది. అందువలన ఘటమునందు ఘటముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమును, సమవాయసంబంధావచ్ఛిన్నసామయికాభావమును, సంభవించుట లేదు. ఈవిధముగానే, ఘటముకంటె భిన్న మగు ఘటత్వమునకు అనాధార మగునేపటాదిక మున్నదో దానియందు ఘటత్వజాతి సమవాయసంబంధముచేత నొకప్పుడైనను ఉండదు. అందువలన, దానియందును ఘటత్వజాతియొక్క సమవాయసంబంధావచ్ఛిన్నసామయికాభావ ముండదు. మఱియు నేమనగా సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. ఈప్రకారమే, ద్రవ్యముకంటె భిన్నపదార్థములయొక్క సామయికాభావము అప్రసిద్ధమై యున్నది,

మఱియును, ద్రవ్యము కూడ నిత్యానిత్య భేదముచేత ద్వివిధమై యున్నది. పృథివి, జలము, తేజస్సు, వాయువు, ద్వ్యణుకాదిరూపము అనిత్యములు; కాలము దిక్కు, ఆత్మ, మనస్సు, పరమాణురూపపృథివ్యప్తేజోవాయువులును నిత్యద్రవ్యములు. అనిత్యద్రవ్యము సమవాయసంబంధముచేత నొకపదార్థంబునందు నొకప్పుడైనను ఉండదు. అందువలన, దానియొక్క సమవాయసంబంధావచ్ఛిన్నసామయికాభావము ఎప్పుడును సిద్ధింపదు. మఱియు నేమనగా సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమే యున్నది. ఈలాగుననే అనిత్యమగుద్వ్యణుకాది ద్రవ్యము సమవాయసంబంధముచేత తన యవయవము లగుపరమాణ్వాదులయందున్నది. అవయవము వినా అన్యపదార్థమునందు అనిత్యద్రవ్యము సమవాయసంబంధముచేత ఎప్పుడు నుండదు. అవయవమునందు అవయవియొక్క ప్రాగభావప్రధ్వంసాభావము లున్నవి. అందుచేత సమవాయసంబంధావచ్ఛిన్నసామయికాభావము అవయవమునందు కార్యద్రవ్యమునకు సంభవింపదు. అవయవముకంటె భిన్న మగుపదార్థమునందు సమవాయసంబంధముచేత అవయవి యెప్పుడు నుండదు. అందువలన సమవాయసంబంధావచ్ఛిన్నసామయికాభావ మచ్చట లేదు, కాని,సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. ఈవిధముగా,ద్రవ్యముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావము అప్రసిద్ధమై యున్నది. కేవలసంయోగ సంబంధావచ్ఛిన్న సామయికాభావము ద్రవ్యమునకు ప్రసిద్ధమై యున్నది. అదియును కార్యద్రవ్యమునకే యున్నది. నిత్యద్రవ్యమునకు సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమే యున్నది. సామయికాభావము నిత్య ద్రవ్యమున కెప్పుడును గలుగదు. ఎట్లన: నిత్యద్రవ్యమునకు ''అవృత్తి''స్వభావ మున్నది. అందువలన సంయోగసంబంధముచేత నిత్యద్రవ్యము ఏపదార్థమునందు నెప్పుడైన నుండదు. యద్యపి, నిత్యద్రవ్యమునకును అపరద్రవ్యముతో సంయోగమున్నది. దేనియొక్క సంయోగము దేనికి కలుగుచున్నదో అది దానియందు సంయోగసంబంధమున నున్నది. తథాపి, నిత్యద్రవ్యముయొక్క సంయోగము వృత్తినియామకము కాదు. కుండబదరములయొక్క సంయోగము బదరమున కెట్లు వృత్తి నియామకమై యుండి కుండకు వృత్తినియామకము కాదో అట్లు నిత్యద్రవ్యమునకు కార్యద్రవ్యముతో సంయోగము కూడ కార్యద్రవ్యవృత్తినియామక మైనను నిత్యద్రవ్యమునకు వృత్తినియామకము కాదు. ఈహేతువువలన సంయోగసంబంధావచ్ఛిన్నసామయికాభావము నిత్యద్రవ్యంబు

నకు సుప్రసిద్ధమై యున్నది. సంయోగసంబంధముచేత, లేక, సమవాయసంబంధ ముచేత నేపదార్థము దేనియందు లేదో అది అవృత్తి యనంబడును. నిత్య ద్రవ్యమునందు సంయోగసంబంధ, సమవాయసంబంధములచేత అన్యపదార్థ మున్నది. అన్యపదార్థమునందు, సంయోగసంబంధముచేత నైనను, సమవాయ సంబంధముచేత నైనను నిత్యద్రవ్య ముండుట లేదు. అందువలన, నిత్యద్రవ్య ము అవృత్తి యనంబడును. ఈప్రకారముగా, సంసర్గాభావ, అన్యోన్యాభావ భేదముచేత అభావము ద్వివిధమై యున్నది. దీనియందు సంసర్గాభావమునకు నాలుగుప్రభేదము లున్నవి. ఈనాలుగింటికిని పరస్పర విరోధ మున్నది. ఈ నాలు గింటికిని తమతమప్రతియోగితో విరోధ మున్నది. ప్రతియోగితో విరోధ మె ట్లనగా, ఏప్రతియోగి యేసంబంధముచేత నెచ్చట నున్నదో దానియొక్క తత్సంబంధావచ్ఛిన్నాభావ మచ్చట లేదు. మఱియును ఏకసంబంధముచేత ప్రతియోగి యుండినను అన్యసంబంధముచేత దానియొక్క యభావము నున్నది. ఉ. సంయోగసంబంధముచేత భూతలమునందు ఘట ముండినపుడు సమవాయసంబం ధముచేత ఘటము లేదు. అందువలన, సంయోగసంబంధముచేత ఘటసహిత భూతలమందును ఘటముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. అందువలన, ఏసంబంధముచేత ప్రతియోగి యున్నదో తత్సంబంధా వచ్ఛిన్నసంసర్గాభావమునకు ప్రతియోగితో విరోధ మున్నది. సంసర్గాభావము లకు పరస్పరవిరోధమును సమానసంబంధముచేత నున్నది. మఱియును, ఏకసం బంధావచ్ఛిన్నైకసంసర్గాభావ మెచ్చట నున్నదో అచ్చటను అన్యసంబంధావచ్ఛి న్నాపరసంసర్గాభావ మున్నది. ఉ. ఘటశూన్యభూతలమునందు ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నసామయికాభావ మున్నది. మఱియును, ఆఘటము యొక్క సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమును ఆభూతలమునందు నున్నది. ఈవిధముగా, ప్రతియోగితో సంసర్గాభావమునకు ఏకసంబంధముచేత విరోధ మున్నది. మఱియును, సమానసంబంధముచేతను పరస్పరము సంసర్గా భావమునకు విరోధము ఉన్నది. అన్యోన్యాభావమునకు ప్రాగభావాదికముతో నెట్లు విరోధము లేదో అట్లు స్వప్రతియోగితో కూడ విరోధము లేదు. మఱి యును, విచారము చేసినయెడల అన్యోన్యాభావమునకు అన్యాభావముతో యద్యపి విరోధము లేదు. తథాపి, తనయొక్క ప్రతియోగితో అన్యోన్యా భావమునకే విరోధము ఉన్నది. బహుగ్రంథములయందు ఈక్రిందిప్రకారము

ప్రాయబడెను. సంసర్గాభావమునకు ప్రతియోగితో విరోధము ఉన్నది; అన్యోన్యాభావమునకు ప్రతియోగితో విరోధము లేదు. ఇక నేమనగా, ప్రతియోగితావచ్ఛేదకధర్మముతో విరోధ మున్నది—ఉ. భూతలమునందు ఘట మున్నది. ఆకాలమునందు ఘటమునందు అన్యోన్యాభావ మున్నది. ఎట్లనగా: భేదమునకు అన్యోన్యాభావ మని పేరు. ఘటసహితము భూతలమును, ఘట స్వరూపము కాదు. కాని, ఘటముకంటె భిన్నమై యున్నది. ఘటముకంటె భిన్న మనగా, ఘటముయొక్క భేదసహితము భూతలమై యున్నది. భేదసహిత మనినను, అన్యోన్యాభావసహిత మనినను ఏకార్థమునే సూచించును. ఘట శూన్యమైనట్టి కాని, లేక, ఘటసహిత మైనట్టికాని, పదార్థము, ఘట భిన్నమై యున్నది. ఘటమునందు ఘటత్వ మున్నది. అచ్చట ఘటభేదరూపఘటాన్యోన్యాభావ ముండదు. ఘటము వినా యేపదార్థమునందును ఘటత్వ ముండదు. అచ్చట, ఘటాన్యోన్యాభావ ముండును. ఈప్రకారము, ఘటాన్యోన్యాభావమునకు ఘటముతో విరోధము లేదు; కాని, ఘటత్వముతో విరోధ మున్నది. అచ్చట ఘటాన్యోన్యాభావమునకు ప్రతియోగి ఘటమై యున్నది. ప్రతియోగితావచ్ఛేదకము ఘటత్వమై యున్నది. దేనియొక్క యభావ మున్నదో అది ప్రతియోగి యనంబడును. ప్రతియోగియందు నేధర్మ మున్నదో అది ప్రతియోగితావచ్ఛేదక మనంబడును. యద్యపి, ప్రతియోగియం దుండు ధర్మములనేకము లయియున్నవి. ఉ. ఘటమునందు, ఘటత్వము, పృథివీత్వము, ద్రవ్యత్వము, పదార్థత్వము, కూడ ఘటమునం దున్నవి. దానియం దుండు పృథివీత్వాదికములు కూడ ఘటాన్యోన్యాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము కావలయును. పృథివీత్వాదికము ఘటాన్యోన్యాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము కాదు. పృథివ్యన్యోన్యాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము పృథివీత్వమైయున్నది. ద్రవ్యాన్యోన్యాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము ద్రవ్యత్వమై యున్నది. ఘటాన్యోన్యాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము పృథివీత్వ, ద్రవ్యత్వాదికము కాదు. ఘటరూప మగు ప్రతియోగియందు నున్నది. అందువలన ఘటత్వమువలె ఘటాన్యోన్యాభావమునకు పృథివీత్వద్రవ్యత్వాదికము ప్రతియోగితావచ్ఛేక మని చెప్పనలయును. తథాపి, అభావబోధకపదముతోఁగూడ ప్రతియోగిబోధకపదమును ఉచ్చరించినపుడు ఏ ధర్మమునకు ప్రతీతి కలుగుచున్నదో అది ప్రతియోగితావచ్ఛేదక మనంబడును. ఘటాన్యోన్యాభావమును చెప్పినపుడు

ప్రతియోగిబోధకము ఘటపదమై యున్నది. ఉ. "పటో ఘటో న" అనునపుడు ప్రతియోగిబోధకము ఘటపదమై యున్నది. దానిని ఉచ్చరించినపుడు ఘటత్వమునకు ప్రతీతి కలుగుచున్నది. పృథివీత్వ, ద్రవ్యత్వాదికములకు ప్రతీతి కలుగుట లేదు. అందువలన ఘటాన్యోన్యాభావములకు ప్రతియోగితావచ్ఛేదకము ఘటత్వమై యున్నది కాని పృథివీత్వము కాదు. మఱియును, "జలం పృథివీ న" అనునపుడు, పృథివ్యన్యోన్యాభావమునకు పృథివీపదము ప్రతియోగిబోధక మై యున్నది. దాని నుచ్చరించినపుడు పృథ్వీత్వమునకు ప్రతీతి కలుగుచున్నది. అచ్చట ప్రతియోగితావచ్ఛేదకము పృథివీత్వ మై యున్నది. "గుణో ద్రవ్యం న" అని ద్రవ్యాన్యోన్యాభావము చెప్పినపుడు ప్రతియోగిబోధకము ద్రవ్యపదమై యున్నది. దానిని ఉచ్చరించినయెడల ద్రవ్యత్వమునకు ప్రతీతి కలుగుచున్నది. అచ్చట ప్రతియోగితావచ్ఛేదకము ద్రవ్యత్వమై యున్నది. ఘటపదమును ఉచ్చరించునపుడు ఘటత్వమునకు ప్రతీతి కలుగుచున్నది. పృథివీత్వాదికమునకు లేదు. దీనియందు నీక్రింద నుదాహరించినహేతు వున్నది. ఘటపదమునకు ఘటత్వవిశిష్టమునందు శక్తి యున్నది. ఏధర్మవిశిష్టమునందు ఏపదమునకు శక్తి యున్నదో ఆధర్మమునకు ఆపదముతో ప్రతీతి కలుగుచున్నది. ఈరీతిగా ఘటాన్యోన్యాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము ఘటత్వమై యున్నది. అది ఘటమునం దున్నది. ఘటాన్యోన్యాభావము ఘటమునందు లేదు. ఘటముకంటె భిన్న మగు సకలపదార్థమునందు ఘటాన్యోన్యాభావ మున్నది. అచ్చట ఘటత్వము లేదు. అందువలన ఘటత్వ రూపప్రతియోగితావచ్ఛేదకముతో ఘటాన్యోన్యాభావమునకు విరోధ మున్నది. ఘటరూపప్రతియోగితో విరోధము లేదు. సంసర్గాభావమునకు ప్రతియోగితో విరోధ మున్నది. ఈరీతిగా అనేకగ్రంథకారులచేత వ్రాయబడియున్నది. సంసర్గాభావము, అన్యోన్యాభావముల యొక్క లక్షణములు కూడ ఈయర్థానుసారముగా చేయబడియున్నవి. ప్రతియోగివిరోధి యగునేయభావ మున్నదో అది సంసర్గాభావ మనంబడును. ప్రతియోగితావచ్ఛేదకమునకు విరోధి యగు నేయభావ మున్నదో అది యన్యోన్యాభావ మనంబడును. ఈరీతిగా లక్షణము చెప్పినను అన్యోన్యాభావమునకు ప్రతియోగితో లవిరోధము సిద్ధించుచున్నది. మఱియును చతుర్విధసంసర్గాభావమునకు ప్రతియోగితో విరోధము సిద్ధించుచున్నది. అయిన గ్రంథకారులయొక్కయీసమగ్రి లేఖనము స్థూలదృష్టిచేతనే కాని వివేకదృష్టిచేత కాదు. ఎట్లనగా:

అత్యంతాభావమునకు ఏరీతిగా ప్రతియోగితో విరోధ మున్నదో ఆరీతిగా అన్యోన్యాభావమునకును ప్రతియోగితో విరోధ మున్నది. ఏ భూతలమునందు సంయోగసంబంధముచేత ఘటము ఉన్నదో ఆభూతలమునందు సమవాయసంబంధావచ్ఛిన్నఘటాత్యంతాభావమునకును ప్రతియోగితో సర్వథా విరోధము లేదు. మఱియు నేమనగా సంబంధముచేత ప్రతియోగి యున్నదో తత్సంబంధావచ్ఛిన్నాత్యంతాభావము లేదు అందువలన నభావమునకు ప్రతియోగితావచ్ఛేదకసంబంధవిశిష్టప్రతియోగితో విరోధ మున్నది. ప్రతియోగితావచ్ఛేదకసంబంధము కంటె అన్యసంబంధవిశిష్టప్రతియోగితో నేయభావమునకును విరోధము లేదు. ఏసంబంధముచేత పదార్థముయొక్క యభావము చెప్పబడియున్నదో అది ప్రతియోగితావచ్ఛేదకసంబంధ మనంబడును. అత్యంతాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకసంబంధము అనేకమై యున్నది. ఎట్లనగా: ఏయధికరణమునందు ఏకసంబంధముచేత నేపదార్థ మున్నదో ఆయధికరణమునందు అపరసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము ఆ పదార్థమునకు ఉన్నది. ఉ. పృథివియందు సమవాయసంబంధముచే గంధ మున్నది, సంయోగసంబంధముచే నెప్పుడును లేదు. అందువలన పృథివియందు గంధముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము ఉన్నది. అచ్చట ప్రతియోగితావచ్ఛేదకము సంయోగసంబంధమై యున్నది. జలమునందు సంయోగసంబంధముచేత, లేక, సమవాయసంబంధముచేతను గంధము లేదు. అయిన కాలికసంబంధముచేత జలమునందును గంధ మున్నది. అందువలన జలమునందు గంధముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమును సమవాయసంబంధావచ్ఛిన్నాత్యంతాభావమును ఉన్నవి. అచ్చట ప్రథమాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము సంయోగసంబంధమై యున్నది. ద్వితీయాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము సమవాయసంబంధమై యున్నది. కాలికసంబంధముచేత నేకైకజన్యమునందు పదార్థ మున్నది. అందువలన ద్వ్యణుకకార్యరూపజలమునందు గంధ ముండుటవలన జలవృత్తిగంధాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము కాలికసంబంధము కాదు. నిత్యపదార్థమునందు కాలికసంబంధముచేత నే పదార్థమును ఉండదు. అందువలన పరమాణురూప జలమునందు గంధముయొక్క కాలికసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము కూడ ఉన్నది. అందువలన ప్రమాణవృత్తి గంధాభావమునకు ప్రతియోగితావచ్ఛేదకము కాలికసంబంధమై యున్న

ది. ఈరీతిగా నత్యంతాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదక సంబంధము, అనేకమై యున్నది. అన్యాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదక సంబంధము ఏకైకమై యున్నది. ఊ. కపాలమునందు ఘటప్రాగభావ మున్నది, ఇతరమునందు ఎప్పుడును ఘటప్రాగభావము లేదు. ఆకపాలమునందు ఘటప్రాగభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము సమవాయసంబంధమై యున్నది. ప్రాగభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము అన్యసంబంధము కాదు. దేనియొక్క యత్సంబంధావచ్ఛిన్నప్రాగభావము దేనియందున్నదో ఆసంబంధముచేత దానికి ఉత్పత్తి దానియందగుచున్నది, అని నియమ మున్నది. కపాలమునందు ఘటముయొక్క యుత్పత్తి సమవాయసంబంధముచేత కలుగుచున్నది. అన్యసంబంధముచేత కలుగుట లేదు. అందువలన కపాలమునందు ఘటముయొక్క సమవాయసంబంధావచ్ఛిన్నప్రాగభావ మున్నది. దానికి ప్రతియోగితావచ్ఛేదకము ఒకటే సమవాయ సంబంధమై యున్నది. "కపాలే సమవాయేన ఘటో నష్టః" ఈప్రతీతి ధ్వంసాభావమును విషయీకరించుచున్నది. అందువలన ధ్వంసముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము కూడ సమవాయసంబంధమాత్రమై యున్నది. ఈలాగుననే జన్యద్రవ్యముయొక్క సామయికాభావమును గూడ నున్నది. జన్యద్రవ్యమునకును సంయోగసంబంధావచ్ఛిన్న సామయికాభావము నున్నది. సమవాయసంబంధావచ్ఛిన్న సామయికాభావము అప్రసిద్ధమై యున్నది, ఇది పూర్వమునందే చెప్పబడియున్నది. అందువలన సామయికాభావమునకును, ప్రతియోగితావచ్ఛేదకము సంయోగసంబంధమై యున్నది. ఈవిధముగా అన్యోన్యాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము అభేదసంబంధమాత్రమై యున్నది. ఆయభేదమే నైయాయికునిచేత తాదాత్మ్యసంబంధ మని చెప్పబడియున్నది.

అభేదసంబంధావచ్ఛిన్నాభావమే అన్యోన్యాభావ మనంబడును. అన్యసంబంధావచ్ఛిన్నాభావము సంసర్గాభావ మనంబడును. అన్యోన్యాభావ మని చెప్పబడలేదు. ఈరీతిగా సన్యోన్యాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదక సంబంధము ఏకతాదాత్మ్యమై యున్నది, అనగా అభేదమై యున్నది. మఱియును ఏసంబంధము అన్యోన్యాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకము కాదు. మఱియును ప్రతియోగితావచ్ఛేదక సంబంధవిశిష్ట ప్రతియోగికి అభావముతో విరోధ మున్నది. అన్యసంబంధవిశిష్టప్రతియోగికి అత్యంతాభావముతో కూడ విరోధము లేదు, అని నిర్ణీతమై యున్నది. అన్యోన్యాభావముయొక్క ప్రతియోగి

తావచ్ఛేదక మయిన యేయభేదసంబంధ మున్నదో ఆయభేదసంబంధముచేత తనస్వరూపమునందే ఘట మున్నది. భూతలకపాలాదికమునందు అభేదసంబంధముచేత ఘటము ఎప్పుడును ఉండదు. ఎచ్చట నభేదసంబంధముచేత ఘటము ఉండదో అచ్చట ఘటాన్యోన్యాభావము ఉన్నది. తనయొక్క స్వరూపమునందు అభేదసంబంధముచేత ఘటము ఉన్నది. అచ్చట ఘటాన్యోన్యాభావము ఉండదు. ఈరీతిగా ప్రతియోగి తావచ్ఛేదకసంబంధవిశిష్ట ప్రతియోగికి ఎట్లు అత్యంతాభావముతో విరోధ మున్నదో అట్లు అన్యోన్యాభావముతో కూడ ప్రతియోగితావచ్ఛేదక సంబంధవిశిష్ట ప్రతియోగికి విరోధము స్పష్టమై యున్నది. ప్రతియోగితావచ్ఛేదక సంబంధవిశిష్ట ప్రతియోగితో అత్యంతాభావమువలె అన్యోన్యాభావమునకు విరోధము స్పష్టమైనందున ప్రతియోగితో విరోధకథనము సకలగ్రంథకారులచేత వివేకనేత్రనిమీలనచేత చెప్పబడియున్నది. అందువలన సకలాభావములకు ప్రతియోగితో విరోధ మున్నది. ఇది ప్రథమప్రసంగము. ఎచ్చట భూతలాదికమునందు కదాచిత్తు ఘట ముండి కదాచిత్తు లేదో అచ్చట ఘటముయొక్క సామయికాభావ మున్నది, అత్యంతాభావము లేదు. ఎట్లనఁగా, అభావమునకు ప్రతియోగితో విరోధ మున్నది. ఆవిరోధము పూర్వోక్తరీతిగా నిర్ణీతమై యున్నది. అందువలన భూతలమునందు సంయోగసంబంధముచేత ఘట ముండినప్పుడు ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ ముండదు. ఘటమును తీసికొని వెళ్లిన తర్వాత ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. ఈరీతిగా నంగీకరింపవలసినది. అందువలన భూతలమునందు ఘటముయొక్క యత్యంతాభావమునకు ఉత్పత్తి, వినాశము అంగీకరింపవలసినది. ఉత్పత్తి, వినాశము లేనియెడల కదాచిత్తు ఉన్నది, కదాచిత్తు లేదు, అను వ్యవహారము అత్యంతాభావమునందు సంభవింపదు. ఆ యుత్పత్తి వినాశము అత్యంతాభావమునకు సంభవించుట లేదు. ఎట్లనగా నెచ్చట సంయోగసంబంధముచేత ఘటము లేదో అచ్చట ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. ఆఘటముయొక్క యత్యంతాభావము ఏకమై యున్నది. అనేకముగా లేదు. ఎట్లనగా ప్రతియోగిభేదముచేత అభావమునకు భేదము సిద్ధించుచున్నది. అధికరణభేదముచేత నభావమునకు భేదము కలుగుట లేదు, అని తార్కికసిద్ధాంత మున్నది. ఉ. ఘటాభావపటాభావములకు ప్రతియోగి భిన్నమై యున్నది.ఆయభావములు భిన్నములై యున్నవి.

భూతలమునందు సంయోగసంబంధముచేత ఘటాత్యంతాభావ మున్నది. ఈలాగుననే భూతలత్వమునందును సంయోగసంబంధముచేత ఘటము లేదు. ఘటత్వ జాతియందును సంయోగసంబంధముచేత ఘటము లేదు. అందువలన సంయోగ సంబంధావచ్ఛిన్నఘటాత్యంతాభావ మున్నది. పటత్వాదికమునందును సంయోగ సంబంధావచ్ఛిన్న ఘటాత్యంతాభావ మున్నది. ఈరీతిగా ననంతాధికరణమునందు సంయోగసంబంధావచ్ఛిన్నఘటాత్యంతాభావ మున్నది. దానియొక్క యధికర ణము యద్యపి అనంతమై యున్నది. తథాపి ఘటరూపప్రతియోగి ఏకమై యున్నది. అందువలన సంయోగసంబంధావచ్ఛిన్నఘటాత్యంతాభావము ఏకమై యున్నది. అయిన భూతలత్వ, ఘటత్వాదిజాతియం దు ఘటముయొక్క సంయోగ సంబంధము ఎప్పుడు లేదు. అందువలన భూతలత్వ, ఘటత్వాదిజాతియం దుండు ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము ఉత్పత్తివినాశ రహితమై నిత్యమై యున్నది. భూతలాదికమునందు సంయోగసంబంధముచేత ఒకప్పుడు ఘట మున్నది. ఒకప్పుడు లేదు. అందువలన ఘటకాలమునందు భూతలవృత్తిఘటాత్యంతాభావము నష్ట మగుచున్నది. ఘటాపసరణకాలమునందు ఘటాత్యంతాభావము ఉత్పన్న మగుచున్నది. ఈరీతిగా ఘటత్వాదిజాతియం దుండు ఘటాత్యంతాభావము నిత్యమై యున్నది. ఆఘటాత్యంతాభావము భూత లాదికమునందు నుత్పత్తినాశసహిత మైనందున అనిత్యమై యున్నది, అని చెప్పుట సరి కాదు. ఎచ్చట సంయోగసంబంధముచే నొకప్పుడు ఘట మున్నదో అచ్చట ఘటశూన్యకాలమునందు ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నా భావ మైనను మఱియు నే మైనను ఒక యనిత్యాభావము నంగీకరింపవలయును. అది సామయికాభావ మనంబడును. ఆభూతలమునందు సమవాయసంబంధము చేత నొకప్పుడును ఘట ముండదు. అందువలన ఘటమునకు సమవాయసంబం ధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. ఘటత్వభూతలత్వాదికమునందు సంయోగ సంబంధముచేత నొకప్పుడును ఘట ముండదు. సమవాయసంబంధముచేతను కపాలము వినా అన్యపదార్థమునందు ఘట ముండదు. అందువలన ఘటత్వాదిక మునందు సంయోగసంబంధావచ్ఛిన్నఘటాత్యంతాభావమును, సమవాయసంబం ధావచ్ఛిన్నఘటాత్యంతాభావము నున్నది. ఆయత్యంతాభావము ఉత్పత్తినాశ రహితమై నిత్యమై యున్నది. అందువలన నీక్రింద నుదాహరించిననిష్కర్షము సిద్ధించుచున్నది. ఎచ్చట నొకప్పుడు సంయోగసంబంధముచేత ప్రతియోగి

యుండి మఱియు నొకప్పు డుండదో అచ్చట సంయోగసంబంధావచ్ఛిన్నసామ యికాభావము చెప్పబడియున్నది. ఘటముయొక్క సామయికాభావము ఉత్పత్తి వినాశసహితమై యున్నది. అందువలన ప్రతియోగిభేదము లేకయే ఏకఘటము యొక్క సామయికాభావము అనేకమై యున్నది. మఱియు నే సంబంధముచేత నెచ్చట ఘటరూపప్రతియోగి ఒకప్పుడును ఉండదో అక్కడ ఘటము యొక్క తత్సంబంధావచ్ఛిన్నాత్యంతాభావము చెప్పబడియున్నది. ఆయత్యంతా భావము ఉత్పత్తివినాశరహిత మైనందున నిత్యమై యున్నది. ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము అనంతాధికరణమునందు నేకమై యున్నది. ఈలాగుననే యనంతాధికరణమునం దుండెడిసమవాయసంబంధావచ్ఛి న్నఘటాత్యంతాభావమును ఏకమై యున్నది.ఏదైన ఒకయధికరణమునకు నాశము కలిగినప్పటికిని ఆయత్యంతాభావము అన్యాధికరణమునం దున్నది. అందువలన అత్యంతాభావమునకు నాశము కలుగుట లేదు. ఉ. ఘటముయొక్క సమవా యసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము తంతువునందును, తంతుత్వజాతియందును ఘటత్వమునందును, పటత్వమునందును కపాలత్వమునందును ఒకకపాలమును విడిచి సకలపదార్థమునందు నున్నది. వానియం దుండెడిసమవాయసంబంధావ చ్ఛిన్నఘటాత్యంతాభావము ఏకమై యున్నది. తంత్వాద్యనిత్యపదార్థమునకు నా శము కలిగినప్పటికి తంతుత్వాదినిత్యపదార్థమునందు ఆయత్యంతాభావ మున్నది. అందువలన నత్యంతాభావము నిత్యమై యున్నది. ప్రతియోగిభేదముచేత అత్యం తాభావమునకు భేద మున్నది. ఉ. ఘటాత్యంతాభావముకంటె పటాత్యంతా భావము భిన్నమై యున్నది. మఱియును ప్రతియోగితావచ్ఛేదకసంబంధముచేత ప్రతియోగిభేదము లేకయే అత్యంతాభావమునకు భేదము కలుగుచున్నది. సమ వాయసంబంధావచ్ఛిన్నగంధాత్యంతాభావమునకును సంయోగసంబంధావచ్ఛిన్న గంధాత్యంతాభావమునకును, గంధరూపప్రతియోగి ఏకమైయున్నది అయిన ప్రతియోగితావచ్ఛేదక సంబంధములు రెండైనందున అభావము కూడ భిన్నమై యున్నది. రెంటిని ఏకముగా నంగీకరించునెడల, పృథివియందు సమవాయ సంబంధావచ్ఛిన్న గంధాత్యంతాభావము లేనందున సంయోగసంబంధావచ్ఛిన్న గంధాత్యంతాభావము కూడ లేకపోవలయును. ఒకడు చెప్పున దేమనగా;పృథివి యందు సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము లేనియెడల ''పృథివ్యాం సంయోగేన గంధో నాస్తి"అని ప్రతీతి కాకపోవలయును.అందువలన పృథివియందు

సంయోగసంబంధావచ్ఛిన్న గంధాత్యంతాభావ మున్నది. సమవాయసంబంధావచ్ఛిన్న గంధాత్యంతాభావము లేదు. అందువలన ప్రతియోగి భేదముచేత ఎట్లు అత్యంతాభావమునకు భేద మున్నదో అట్లు ప్రతియోగితావచ్ఛేదక సంబంధముచేతను అత్యంతాభావమునకు భేద మున్నది. సామయికాభావమునకు ప్రతియోగితావచ్ఛేదక సంబంధభేదము లేకయే సమయభేదమువలన భేద మున్నది. ఉ. భూతలాదికమునందు ఘటసంయోగము లేనప్పుడు ఘటముయొక్క సంయోగ సంబంధావచ్ఛిన్న సామయికాభావ మున్నది. భూతలమునందు ఘట సంయోగ ముండినప్పుడు ఘటముయొక్క ప్రథమసామయికాభావమునకు నాశము కలుగుచున్నది. భూతలమునందుండెడి ఘటమును తీసికొని వెళ్లినప్పుడు ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్న సామయికాభావ ముత్పన్నమగుచున్నది. ఆఘటమును భూతలమునకు తీసికొనివచ్చినప్పుడు మఱియొక సామయికాభావము నష్ట మగుచున్నది. తిరిగి ఆఘటమును తీసివేసినప్పుడు ఆఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్న తృతీయసామయికాభావ ముత్పన్న మగుచున్నది. ఈరీతిగా ప్రతియోగి భేదములేక ప్రతియోగితావచ్ఛేదక సంబంధభేదముకూడ లేకయే కాలభేదముచేత సామయికాభావము భిన్నమైయున్నది. ఈసామయికాభావాత్యంతాభావములకు వైలక్షణ్యము, తద్విలక్షణత స్పష్టమై యున్నది. ఈరీతిగా న్యాయసంప్రదాయమునందు అభావము పంచవిధమై యున్నది.

౭౧. నవీనతార్కికమత ప్రకారము సామయికాభావముయొక్క స్థానమునందు అత్యంతాభావాంగీకారము, తచ్ఛంకాసమాధానములు.

నవీనతార్కికులు సామయికాభావము నంగీకరించుట లేదు. భూతలాదికమునందు ఘటాదికముయొక్క యేసామయికాభావ మంగీకరింపబడియున్నదో అచ్చటను ఘటాదికముయొక్క యత్యంతాభావ మున్నది. మఱియును భూతలాదికమునందు ఘటాదికముయొక్క యత్యంతాభావ మున్నది. మఱియును భూతలాదికమునందు ఘటాదికముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము నంగీకరించిన యెడల దోషము చెప్పబడియున్నది. జాతిగుణాదికమునందు ఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాత్యంతాభావము నిత్యమై యున్నది. భూతలాదికమునందు ఆఘటముయొక్క సంయోగసంబంధావచ్ఛిన్నాభావ మనిత్యమై యున్నది. అది నిత్యము, అనిత్యము, పరస్పరభిన్నమైయును ఉన్నది. ఏకము కాదు. జాతిగుణాదికమునందును, భూతలాదికము

నందును ఉండెడి సంయోగసంబంధావచ్ఛిన్న ఘటాభావమునకు భేద మంగీకరిం
పనియెడల, నిత్యత్వానిత్యత్వరూపవిరుద్ధధర్మములకు సాంకర్యము కావలయును.
దానికి సమాధానము వక్ష్యమాణరీతిగా గంగేశోపాధ్యాయాదికులచేత వ్రాయ
బడియున్నది. భూతలాదికమునం దుండెడి ఘటముయొక్క సంయోగసంబంధా
వచ్ఛిన్నాభావము అనిత్యము కాదు, నిత్యమై యున్నది. భూతలమునం దెప్పుడు
ఘటసంయోగ మున్నదో ఆకాలమునందు ఘటముయొక్క సంయోగసంబంధా
వచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. అది నష్ట మగుట లేదు. అందువలన అత్యం
తాభావము కేవలాన్వయియై యున్నది. దేనియొక్క యభావ మెప్పుడును కాక
సకలపదార్థములయందును సర్వదా యున్నదో అది కేవలాన్వయి యనంబడును.
దీనియం దొకశంక, సంయోగసంబంధముచేత ఘట మున్నప్పుడు, సంయోగ
సంబంధావచ్ఛిన్న ఘటాత్యంతాభావము నంగీకరించినయెడల, సంయోగసంబం
ధముచేత ఘటసహితభూతలమునందు ''సంయోగేన ఘటో నాస్తి'' అని ప్రతీతి
కావలయును. దానికి సమాధానము. యద్యపి సంయోగసంబంధముచేత ఘట
సహితభూతలమునందును నిర్ఘటభూతలమువలె ఘటముయొక్క సంయోగ
సంబంధావచ్ఛిన్నాత్యంతాభావ మున్నది. తథాపి, నిర్ఘటభూతలమునందు
"సంయోగేన ఘటో భూతలే నాస్తి" అని ప్రతీతి యగుచున్నది. సఘటభూతల
మునందు ఉక్తప్రతీతి కలుగుట లేదు. ఎట్లనగా, ఉక్తప్రతీతికి విషయము కేవల
ఘటాత్యంతాభావము కాదు. భూతలసంబంధి యగుఘటముయొక్క యాధార
కాలముకంటె అతిరిక్తకాలము సంయోగసంబంధావచ్ఛిన్న ఘటాత్యంతాభావ
ము ఈరెండును ఎచ్చట నున్నవో అచ్చట ''సంయోగేన ఘటో నాస్తి''
యని ప్రతీతి కలుగుచున్నది. భూతలమునందు సంయోగసంబంధముచేత ఘటము
లేనప్పుడు భూతలసంబంధిఘటాధార మైనకాలము లేదు. భూతలాసంబంధియైన
ఘటానాధారకాల మున్నది. అందువలన భూతలసంబంధిఘటమునకు ఆధార
మైనకాలముకంటె అతిరిక్తకాల మున్నది. సంయోగసంబంధావచ్ఛిన్నఘటాత్యం
తాభావమును ఉన్నది. అందువలన ''సంయోగేన ఘటో నాస్తి'' అని ప్రతీతి
కలుగుచున్నది. ఏభూతలమునందు సంయోగసంబంధముచేత ఘట మున్నదో
యచ్చట నత్యంతాభావము నిత్యమైనందున సంయోగసంబంధావచ్ఛిన్నఘటా
త్యంతాభావ మున్నది. అయిన భూతలసంబంధి యగు నేఘట మున్నదో దానికి
నాధార మైనకాల మున్నది. అందువలన భూతలసంబంధిఘటాధారకాలము

కంటె అతిరిక్తకాలము లేనందున సంయోగిసంబంధముచేత ఘటము ఉండినప్పటికి "సంయోగేన భూతలే ఘటో నాస్తి"యని ప్రతీతి కలుగుట లేదు. ఈరీతిగా నత్యంతాభావము అనేకదేశమునందు ప్రతియోగియుండినను, ఉండకపోయినను సర్వదా యున్నది. అయిన అభావముయొక్క ఘటాదిప్రతియోగియొక్క సంబంధిక్రియయగు నేయనుయోగినుభూతలాదిక మున్నదో దానికి ఆధారకాలము ప్రతియోగి యుండినప్పుడు ఉన్నది. ప్రతియోగిసంబంధి యగు ననుయోగియొక్క ఆధారకాలముకంటె అతిరిక్త మగుకాలము లేదు. అందువలన ప్రతియోగి నాస్తి యని ప్రతీతి ప్రతియోగి యుండినప్పుడు కలుగుట లేదు. ప్రతియోగి లేనప్పుడు ప్రతియోగిసంబంధి యనుయోగియొక్క యాధారకాలముకంటె అతిరిక్తకాలమును అత్యంతాభావమును ఈరెండు నున్నవి. అందువలన "భూతలే సంయోగేన ఘటో నాస్తి" అని ప్రతీతి కలుగుచున్నది. ఈరీతిగా నెచ్చట ప్రాచీనులు సామయికాభావమును అంగీకరించినారో నచ్చటను అత్యంతాభావమున్నది. అత్యంతాభావమునకు ననిత్యత లేదు. మఱియును ఉక్తకాలము లేనందున ప్రతియోగి యుండినను అత్యంతాభావప్రతీతి కలుగుట లేదు.

౭౩. నవీనతార్కికోక్తమతఖండనము.

నవీనగ్రంథకారులయొక్క మతము సరి కాదు. ప్రాచీనమతమే గ్రాహ్యము. ఎట్లనగా; ప్రతియోగి యుండినప్పుడు అత్యంతాభావమును అంగీకరించినయెడల ప్రతియోగ్యభావముల యొక్క పరస్పరవిరోధములకు విచ్ఛేదము కలుగవలయును. మఱియు నవీనులు చెప్పున దే మనగా విరోధము ద్వివిధమై యున్నది.

(1) సహానవస్థానరూపము. (2) సహాప్రతీతిరూపము.

ఏకాధికరణమునందు నేకకాలమునందు ఉండనిది 'సహానవస్థానరూపవిరోధ' మనబడును. ఉ. 'ఆతపశీతత్వముల' కుండువిరోధము 'అభావ' ప్రతియోగులకు లేదు. ఎట్లనగా; ప్రతియోగి యుండినను అత్యంతాభావ మున్నది. కాని, అభావ ప్రతియోగులకు "సహాప్రతీతిరూప" విరోధ మున్నది. ఏకకాలమునందు ఏకాధికరణమునందు దేనికి ప్రతీతి కలుగుట లేదో దానికి "సహాప్రతీతిరూపవిరోధ" మనబడును. ప్రతియోగి యుండినను అత్యంతాభావముయొక్క ప్రతీతి కలుగుట లేదు. అందువలన, ప్రతియోగ్యభావములకు 'సహాప్రతీతిరూపవిరోధము' ఉన్నది, కాని 'సహానవస్థానవిరోధము' లేదు. ఈరీతిగా నవీనులు చెప్పుసమాధానము సర్వలోక శాస్త్రవిరుద్ధమై యున్నది. ఎట్లనగా: అభావముయొక్క యభా

వము ‘ప్రతియోగి’ యనంబడును. ఎచ్చట అభావము లేదో అచ్చట నభావము యొక్క యభావ మున్నది. ఉ. ఘటసహితదేశమునందు ఘటముయొక్క యభావము లేదు. కాని, ఘటాభావముయొక్క యభావ మున్నది. అవె ఘటము; అదె ఘటాభావమునకు ప్రతియోగియై యున్నది.ఈప్రకారము అభావముయొక్క యభావము సర్వశాస్త్రములయందు ప్రతియోగి యనంబడును.నవీనరీతిగా నది యసంగత మగును ఎట్లన: నవీనమతమునందు ఘటసహితదేశమున ఘటముయొక్క యభావముకూడ నున్నది. అందుచేత ఘటాభావముయొక్క యభావము అని చెప్పుట సరికాదు.యద్యపి, వక్ష్యమాణరీతిగా ఘటాభావాభావము ఘటముకంటె భిన్నమైయున్నదే కాని ఘటరూపము కాదు. తథాపి, ఘటమునకు ఘటాభావాభావము సమనియతమై యున్న దను సంశము నిర్వివాదము. మఱియును, నవీన రీతిగా ఘటసహితదేశమునందు ఘటాభావ ముండుటవలన ఘటాభావాభావము లేనందున రెంటికిని సమనియతత్వము [“ఘటో నాస్తి” యను వ్యవహారమునకు సిద్ధి లేకయే ఆఘటాత్యంతాభావమునకు ఫలము సిద్ధింపదు. ఉక్తవ్యవహారము యొక్క సిద్ధియే ఫలమై యున్నది. మఱియును, ‘ఘటో నాస్తి’ యను ప్రతీతి చేతనే ఘటాత్యంతాభావము సిద్ధించుచున్నది. ఉక్తప్రతీతి లేకయే, ఘటాత్యంతాభావమునందు నేప్రమాణమును లేదు. నవీనమతమునందు ఘటాత్యంతాభావముచేత “ఘటో నాస్తి” యనువ్యవహారమునకు సిద్ధి యగుట లేదు. మఱియునే మనగా] కలుగదు. అందువలన నవీనమతము శాస్త్రవిరుద్ధమై యున్నది. మఱియును ప్రతియోగియును, అభావమును, సమానాధికరణములు కావని సర్వలోకమునం దంతట ప్రసిద్ధమై యున్నది. ఆప్రసిద్ధ మైనయర్థమునకు నవీన కల్పనచేత బాధ కలుగవలయును. మఱియును, ఘటముయొక్క యధికరణమునందు ఘటాత్యంతాభావాంగీకారము అప్రమాణము; మఱియు నేప్రమాణము చేతను సిద్ధింపదు, ఎచ్చట ఘటము లేదో అచ్చట “ఘటో నాస్తి” యను ప్రతీతి చేత అత్యంతాభావము సిద్ధించుచున్నది. ఘటసహితదేశమునందు ‘ఘటో నాస్తి’ యను ప్రతీతి లేదు. మఱియు నొకప్రతీతి ఘటసహితదేశమునందు అత్యంతాభావ సాధకము కాదు. అందుచేత ప్రతియోగిదేశమునందు అత్యంతాభావాంగీకారము ప్రమాణసిద్ధము కాదు. మఱియును, అందులకు మాఱుగా ఘటసహితదేశమునందు ‘ఘటాత్యంతాభావో నాస్తి’యనుప్రతీతి యున్నది. ఆప్రతీతిచేత విరుద్ధాత్యంతాభావాంగీకారము ఉన్నది. మఱియును ఘటసహితదేశమునందు ఘటా

త్యంతాభావము నంగీకరించువారికి 'మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః' (అసలునకు మోసము వచ్చినది) అనున్యాయము ప్రాప్తించును. ఎట్లన అత్యంతాభావమునకు కేవలాన్వయిత్వసాధనముకొఱకును నిత్యత్వమును సాధించుటకొఱకును ఘట సహితదేశమునందు ఘటాత్యంతాభావ మంగీకరింపవలయును. అయిన ఘటసహిత దేశమునందు ఘటాత్యంతాభావము నంగీకరించినయెడల ఆ యత్యంతాభావము నిష్ఫలము నిష్ప్రమాణమును అగును. తథాహి; సర్వపదార్థమునకు ఫలవ్యవహారము సిద్ధము. ఘటసంబంధి భూతలాధికరణకాలముకంటె నతిరిక్తకాలముచేత ఉక్తవ్యవహారమునకు సిద్ధి కలుగుచున్నది. ఎట్లనగా; ఘటసంబంధి భూతలాధికరణ కాలముకంటె అతిరక్తకాల ముండినపుడు 'ఘటో నాస్తి' యను ప్రతీతి కలుగుచున్నది. ఘటసంబంధి భూతలాధికరణకాల ముండినపుడు 'ఘటో నాస్తి' యను ప్రతీతి కలుగదు. ఈవిధముగా 'ఘటో నాస్తి'యను ప్రతీతిచేత ఘటసంబంధి భూతలాధికరణకాలముకంటె అతిరిక్తకాలమునకు సిద్ధి కలుగుచున్నది; కాని, ఘటాత్యంతాభావము సిద్ధింపదు. ప్రతీతివలె 'ఘటో నాస్తి' యను వ్యవహారమునకు సిద్ధి నవీనమతమునందు ఘటాత్యంతాభావముచేత కలుగదు. మఱియు నేమనగా, ఉక్తకాలముచేత "ఘటో నాస్తి" యను వ్యవహారము కలుగుచున్నది. అందువలన ఘటాత్యంతాభావము నవీనమతమునందు నిష్ప్రమాణమై యున్నది. శబ్దప్రయోగము "వ్యవహార" మనంబడును. జ్ఞానమునకు "ప్రతీతి" యని పేరు. ఈప్రకారముగా నవీనమతముచేత అత్యంతాభావమునకు నిత్యత్వ మంగీకరించుటకు ప్రతియోగిసహితదేశమునందు అత్యంతాభావము నంగీకరించు నెడల మూలముచేత అత్యంతాభావమునకు హాని కలుగును. అందువలన ఘటసహిత దేశమునందు ఘటాత్యంతాభావము సిద్ధించుట లేదు. మఱియు నెచ్చట భూతలమునందు కదాచిత్తు ఘట మున్నదో అచ్చట అత్యంతాభావ ముండినను అత్యంతాభావ మను సంజ్ఞ కూడ నిరర్థక మగును. అత్యంతాభావ మెచ్చట నున్నదో ఆకాలమునందు ప్రతియోగి లేనియెడల ఆయత్యంతాభావము సంజ్ఞ రీతిగా సిద్ధించకున్నది. అందువలన, ఎచ్చట కదాచిత్తు ప్రతియోగి యుండి కదాచిత్తుగా నుండదో అచట త్రికాలములయందును ప్రతియోగియొక్క యభావము లేదు. అందువలన నత్యంతాభావము లేదు. దానికంటె భిన్న మగు నొక యభావ మున్నది అది సామయికాభావ మనంబడును.

23 న్యాయసంప్రదాయమతమునందు ఘటప్రధ్వంసముయొక్క ప్రాగభావమునకు ఘటస్వరూపత్వ, ఘటప్రాగభావరూపత్వ నిర్ణయము —

ఈప్రకారముగా చతుర్విధసంసర్గాభావములు, అన్యోన్యాభావమును చేరి పంచవిధాభావము లయినవి, వానిలో నొక్కొక్క యభావము ద్వివిధమై యున్నది

(1) భావప్రతియోగికము (2) అభావప్రతియోగికము

భావముయొక్క యభావము 'భావప్రతియోగికాభావ' మనంబడును అభావముయొక్క యభావము 'అభావప్రతియోగికాభావ' మనంబడును ఈ ప్రాగభావము ద్వివిధము, కపాలాదికమునం దుండు ఘటప్రాగభావము 'భావప్రతియోగిక'మై యున్నది భావపదార్థముయొక్క ప్రాగభావము ఎట్లున్నదో అట్లు అభావమునకు ప్రాగభావ మున్నది అయిన, 'సాది' పదార్థమునకే ప్రాగభావ మున్నది 'అనాది'కి ప్రాగభావము లేదు అత్యంతాభావము, అన్యోన్యాభావము, ప్రాగభావము, 'అనాదు'లై యున్నవి అందుచేత వీనియొక్క ప్రాగభావము సంభవించుట లేదు 'ప్రధ్వంసాభావము అనంతమై' "సాది" యై యున్నది అందువలన ప్రధ్వంసాభావముయొక్క ప్రాగభావ మున్నది ఆప్రధ్వంసాభావముయొక్క ప్రాగభావము ప్రతియోగిరూపమైయును ప్రతియోగిప్రాగభావరూపమై యున్నది ఈ ముద్గరాదికమువలన ఘటాదులకు నాశము కలుగుచున్నది దానికి ఘటప్రధ్వంసాభావ మని పేరు ఆప్రధ్వంసాభావము ముద్గరాదిజన్యమై యున్నది, ముద్గరాదివ్యాపారముకంటె పూర్వ ఘటకాలమునందును, ఘటప్రాగభావకాలమునందును లేనందున 'సాది'యై యున్నది అందువలన ముద్గరాది వ్యాపారముకంటె పూర్వము ఘటధ్వంసముయొక్క ప్రాగభావ మున్నది ఆ ఘటధ్వంసముయొక్క ప్రాగభావము, ఘటకాలమునందును, ఘటోత్పత్తికి పూర్వ మగు ఘటప్రాగభావకాలమునందు నున్నది అందువలన, ఘటధ్వంసముయొక్క ప్రాగభావము ఘటకాలమునం దుండునెడల ఘటరూపమై యున్నది మఱియును ఘటోత్పత్తికి పూర్వమునం దుండినయెడల ఘటప్రాగభావరూపమై యున్నది ఈప్రకారముగా, ఘటధ్వంసముయొక్క ప్రాగభావము ఘటమునం దైనను, ఘటప్రాగభావమునం దైనను అంతర్భూతమై యున్నది. అంతకంటె భిన్నము కాలేదు. ఇది సాంప్రదాయికమై యున్నది.

౭౪. ఉక్తమతఖండనము, ఘటప్రధ్వంసముయొక్క అభావ, ప్రతియోగిక, ప్రాగభావమునకు సిద్ధి.

ఈమతము యుక్తివిరుద్ధమై యున్నది. ఎట్లనగా, ఘటము భావరూపమై సాదియై యున్నది. ఘటముయొక్క ప్రాగభావము అభావరూపమై అనాదియై యున్నది. ఒకటే ఘటధ్వంస ప్రాగభావమునకు, ఒకప్పుడు భావరూపత్వము, ఒకప్పుడు అభావరూపత్వము చెప్పుట విరుద్ధమై యున్నది. ఇదే ప్రకారము ఒకప్పుడు సాదిరూపత్వము, మఱియు నొకప్పుడు అనాదిరూపత్వమును చెప్పుట విరుద్ధమై యున్నది. ఘటకాలమునందు "కపాలే సమవాయేన ఘటోఽస్తి" "ఘటప్రధ్వంసో నాస్తి" ఈరీతిగా విధిరూప, నిషేధరూపములగు, రెండు విధములయి విలక్షణప్రతీతి కలుగుచున్నది. దానికి విషయ మగు పరస్పరము విలక్షణము అను పదార్థద్వయము అంగీకరింపవలసినది. ఘటోత్పత్తికి పూర్వమునందును, 'కపాలే ఘటో నాస్తి' 'ఘటప్రధ్వంసో నాస్తి' అను రెండు విధములగు ప్రతీతి కలుగుచున్నది. యద్యపి, ఆరెండువిధములగు ప్రతీతులు నిషేధముఖములై యున్నవి. తథాపి, విలక్షణములై యున్నవి. ప్రథమప్రతీతియందు "నాస్తి" యని చెప్పుటవలన ఏ యభావము ప్రతీత మగుచున్నదో దాని ప్రతియోగి ఘటము ప్రతీత మగుచున్నది. రెండవ ప్రతీతియందు "నాస్తి" యని చెప్పుటవలన ప్రతీత మగునభావమునకు ఘటప్రధ్వంసరూప ప్రతియోగి ప్రతీత మగుచున్నది. అందువలన ప్రతియోగియొక్క భేదము ఉండుటవలన ఘటప్రాగభావమునకును ఘటప్రధ్వంసప్రాగభావమునకును అభేదము సంభవించుట లేదు. మఱియు నేమనగా ఘటము దాని ప్రాగభావమునకంటె ఘటప్రధ్వంసముయొక్క ప్రాగభావము భిన్నముగా నంగీకరించుట యుక్తమై యున్నది. అనుభవసిద్ధపదార్థమునకు లాఘవబలముచేత లోపము సంభవించుట లేదు. అందువలన, సాంప్రదాయికరీతిగా ఘటప్రధ్వంసప్రాగభావమునకు ఘటము దాని ప్రాగభావమునందు అంతర్భావము నంగీకరించినయెడల లాఘవము నిష్ప్రయోజనమై యున్నది. ఈరీతిగా ప్రధ్వంసాభావముయొక్క ప్రాగభావము అభావప్రతియోగిక ప్రాగభావమై యభావమై యున్నది.

౭౫. సామయికాభావముయొక్క ప్రాగభావమునకు అభావ ప్రతియోగిత్వము.

ఈలాగుననే సామయికాభావము సాదియై యున్నది. దానియొక్క ప్రాగభావము కూడ అభావప్రతియోగిక ప్రాగభావమై యున్నది

౭౬. ప్రాచీనప్రాగభావముయొక్క ప్రధ్వంసమునకు ప్రతియోగి ప్రతియోగి స్వరూపమునందును ఆ ప్రతియోగియొక్క ధ్వంసమునందును అంతర్భావమునకు నవీనమతి ప్రకారము ఖండనము — దానికి అభావప్రతియోగిత్వము —

ప్రధ్వంసాభావము కూడ అత్యంతాభావాన్యోన్యాభావములకు సంభవించుట లేదు ద్వివిధాభావములును అనాదులై అనంతములై యున్నవి ఈలాగుననే ప్రధ్వంసాభావము కూడ అనంతమై యున్నది దానికి ప్రధ్వంసము సంభవించుట లేదు అయిన ప్రాగభావ, సామయికాభావములకు ప్రధ్వంస మున్నది సాంప్రదాయికరీతిగా ప్రాగభావధ్వంసమునకు ప్రతియోగి ప్రతియోగియందును ప్రతియోగి ప్రతియోగియొక్క ధ్వంసమునందును అంతర్భావ మున్నది దానికంటె వేఱు కాదు ఉ ఘటప్రాగభావమునకు ధ్వంసము కలుగుచున్నది అది ఘటకాలమునందును, ఘటధ్వంసకాలమునందును ఉన్నది ఘటకాలమునందు ఘటప్రాగభావముయొక్క ధ్వంసము ప్రతియోగిస్వరూపమై యున్నది ఎట్లనగా ఘటప్రాగభావముయొక్క ధ్వంసమునకు ప్రతియోగి ఘటప్రాగభావమై యున్నది ఘటప్రాగభావమునకు ప్రతియోగి ఘటమై యున్నది అందువలన ఘటకాలమునందుండెడిఘటప్రాగభావముయొక్క ధ్వంసము ప్రతియోగిప్రతియోగిస్వరూపమై యున్నది ముద్గరాదికముచేత ఘటముయొక్క నాశమైనప్పుడు ఆకాలమునందును ఘటప్రాగభావముయొక్క ధ్వంస మున్నది ఘటము లేదు అందువలన ఆకాలమునందు ఘటప్రాగభావముయొక్క ధ్వంసము ప్రతియోగిప్రతియోగి ధ్వంసరూపమై యున్నది ఎట్లనగా, ఘటప్రాగభావధ్వంసమునకు ప్రతియోగి యగునేఘటప్రాగభావము ఉన్నదో దానికి ప్రతియోగి ఘటమై యున్నది. ఆ ఘటముయొక్క ధ్వంసమే ఘటప్రాగభావముయొక్క ధ్వంసమై యున్నది ఘటధ్వంసముకంటె వేఱుఘటప్రాగభావధ్వంసము లేదు ఈరీతిగా ప్రాగభావధ్వంసము ఒకప్పుడు తనయొక్క ప్రతియోగియొక్క ప్రతియోగిరూపమై యున్నది. మఱియు నొకప్పుడు తనప్రతియోగిప్రతియోగియొక్క ధ్వంసరూపమై యున్నది గాని వేఱు కాదు. ఈసాంప్రదాయికము యుక్తివిరుద్ధమై యున్నది ఎట్లనగా ఘటము సాంతమై భావరూపమై యున్నది ఘటధ్వంసము అనంతమై యభావరూపమై యున్నది. ఒకే ఘటప్రాగభావముయొక్కధ్వంసమునకు సాంతానంత

ములతో నభేదకథనము ఘాఘాఘావములతో నభేదకథనము విరుద్ధమై యున్నది. ఘటోత్పత్తి యైనప్పుడు "ఘటో జాతః, ఘటప్రాగభావో నష్టః" అని ద్వివిధ విలక్షణ ప్రతీతి కలుగుచున్నది. దానిలో "ఘటో జాతః" అను ప్రతీతికి విష యము ఉత్పన్నఘటమై యున్నది. "ఘటప్రాగభావో నష్టః" అను ప్రతీతికి విషయము ఘటప్రాగభావముయొక్క ధ్వంసమై యున్నది. వీని కభేదకథనము సంభవించుటలేదు. ముద్గరాదికముచేత ఘటధ్వంస మగుటవలన ఈ క్రిందివిధ ముగా ప్రతీతి కలుగుచున్నది. "ఇదానీం ఘటధ్వంసో జాతః, ఘటప్రాగభావ ధ్వంసః, పూర్వంఘటోత్పత్తికాలే జాతః" అచ్చట వర్తమానకాలమునందు ఘట ధ్వంసముయొక్కయుత్పత్తి యతీతకాలమునందు ఘటప్రాగభావధ్వంసముయొక్క యుత్పత్తియును సిద్ధమగుచున్నది. వర్తమానకాలమునందు ఉత్పత్తిసహితము కాదు అతీతకాలమునందు ఉత్పత్తిసహిత మైనదానికి అభేదము సంభవించుట లేదు. అందువలన ఘటప్రాగభావముయొక్క ధ్వంసము ఘటరూపమై ఘట ధ్వంసముకంటెను పృథక్కై యున్నది. యద్యపి, వేదాంతపరిభాషాద్యద్వైత గ్రంథములందును ధ్వంసప్రాగభావ ప్రాగభావధ్వంసములు, వేఱువేఱు అని వ్రాయబడలేదు, అయిన పూర్వోక్తన్యాయసంప్రదాయరీతిగా అంతర్భూత మనియే వ్రాయబడియున్నది. తథాపి, శ్రుతి, సూత్రభాష్యములు ఈనిరూపణ మునందు నుదాసీనములై యున్నవి. అందువలన ఏయర్థము యుక్త్యనుభవాను సారిముగా నున్నదో ఆయర్థమే యంగీకరింపబడవలసినది.

యుక్త్యనుభవములకు విరుద్ధ మగునాధునికగ్రంథకారలేఖనము ప్రమా ణము కాదు. అందువలన పూర్వోక్తార్థము ప్రమాణవిరుద్ధము కాదు.(ప్రత్యుత) పైగా పృథగంగీకారమే యుక్త్యనుభవానుసారమై యున్నది. ఈరీతిగా ప్రాగ భావముయొక్క ధ్వంసము అభావప్రతియోగికప్రధ్వంసాభావమై యున్నది.

### ౭౭. ఘటాన్యోన్యాభావముయొక్కయు, అత్యంతాభావముయొక్కయు ఘటత్వరూపత్వము, దానియందు దోషము.

కేవలద్రవ్యమునకు సామయికాభావ మున్నది. ఇది పూర్వమందు ప్రతి పాదింపబడియున్నది. అందువలన సభావప్రతియోగికసామయికాభావము ప్రసిద్ధమై యున్నది. అభావప్రతియోగికాత్యంతాభావమునకు అనేకోదాహరణము లున్నవి. కపాలమునందు ఘటప్రాగభావము ప్రధ్వంసాభావము నున్నవి. తంతు వునందు లేవు. అందువలన తంతువునందు ఘటప్రాగభావముయొక్క యత్యంతా

భావము, ఘటప్రధ్వంసాభావముయొక్క యత్యంతాభావము నున్నవి. కపాలమునందు ఘటముయొక్క సామయికాభావము, అత్యంతాభావము లేవు. అందువలన కపాలమునందు ఘటముయొక్క సామయికాభావముయొక్క యత్యంతాభావ మున్నది. మఱియును ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావ మున్నది. కపాలమునందు కపాలముయొక్క యన్యోన్యాభావము లేదు. అచ్చట కపాలాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావ మున్నది. ఘటమునందు ఘటముయొక్క యన్యోన్యాభావము లేదు. అచ్చట ఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావ మున్నది. అయిన అన్యోన్యాభావముయొక్క యత్యంతాభావము వేఱుగా లేదు, అన్యోన్యాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదక ధర్మరూపమై యున్నది. ఘటాన్యోన్యాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదక ధర్మము ఘటత్వమై యున్నది. అది కేవలఘటమునందే యున్నది. ఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావము కూడ ఘటమునందే యున్నది. ఘటముకంటె భిన్న మగుసకలపదార్థములయందు ఘటాన్యోన్యాభావ మున్నది. అందువలన ఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావము ఘటముకంటె భిన్నపదార్థమునందు లేదు. ఈరీతిగా ఘటత్వమునకు సమనియత మగుఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావ ముండుటవలన ఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావము ఘటత్వరూప మైయె యున్నది. ఈరీతిగా ప్రాచీన లేఖనము కూడ శ్రద్ధాయోగ్యము కాదు. ఎట్లనగా, "ఘటే సమవాయేన ఘటత్వం" అనుప్రతీతికి విషయము ఘటత్వమైయున్నది. "ఘటే ఘటాన్యోన్యాభావో నాస్తి" అనుప్రతీతికి విషయము ఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావమై యున్నది. అందువలన నన్యోన్యాభావముయొక్క యత్యంతాభావము అన్యోన్యాభావముయొక్క ప్రతియోగితావచ్ఛేదకధర్మరూపము కాదు. దానికంటె భిన్నమై యభావరూపమై యున్నది.

౭౮. అత్యంతాభావముయొక్క యత్యంతాభావమునకు ప్రథమాత్యంతాభావముయొక్క ప్రతియోగిరూపత్వప్రతిపాదనము, తత్ ఖండనము.

ఈలాగుననే అత్యంతాభావముయొక్క యత్యంతాభావము కూడ ప్రథమాభావముయొక్క ప్రతియోగిరూపమై ప్రాచీనులచేత నంగీకరింపబడియున్నది. దానియొక్క ఖండనము నవీనన్యాయగ్రంథమునందు స్పష్టమై యున్నది. తథాహి,

ఎచ్చట ఘటము ఎప్పుడును లేదో అచ్చట ఘటాత్యంతాభావ మున్నది. ఎచ్చట ఘట మున్నదో అచ్చట ఘటాత్యంతాభావము లేదు. దానియొక్క యత్యంతాభావ మున్నది. ఈరీతిగా ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావము ప్రథమాత్యంతాభావము ప్రతియోగి యగునేఘట మున్నదో దానికి సమనియత మైనందున ఘటస్వరూప మై యున్నది. దానికంటె భిన్నము కాదు. ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావమునకు ఘటస్వరూపత్వము నంగీకరింపక, భేదము నంగీకరించునెడల అత్యంతాభావమునకు అనవస్థ యగును. ఎట్లు ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావము భిన్నముగా నున్నదో అట్లు ద్వితీయాత్యంతాభావముయొక్క తృతీయాత్యంతాభావము, తృతీయముయొక్క చతుర్థాత్యంతాభావమును, దానియొక్క పంచమాత్యంతాభావమును ఈరీతిగా అత్యంతాభావమునకు ఎచ్చటను సమాప్తి కాకపోవలయును. ఈరీతిగా ననంతధార కావలయును. ద్వితీయాత్యంతాభావమునకు ప్రథమాత్యంతాభావముయొక్క ప్రతియోగిస్వరూపమును అంగీకరించినయెడల అనవస్థాదోషము లేదు. ఎట్లనగా ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావము ఘటరూపమైనదిగా నంగీకరించినయెడల ద్వితీయాత్యంతాభావముయొక్క యత్యంతాభావము కూడ ఘటాత్యంతాభావ మైయె యున్నది. ఎట్లనగా. ద్వితీయాత్యంతాభావము ఘటరూపమై యున్నది. అందువలన దానియొక్క యత్యంతాభావము ఘటాత్యంతాభావమై యున్నది. ఈలాగుననే తృతీయాత్యంతాభావముయొక్క చతుర్థాత్యంతాభావమును ఘటరూపమై యున్నది. చతుర్థాత్యంతాభావముయొక్క పంచమాత్యంతాభావము ఘటాత్యంతాభావరూప మై యున్నది. ఈరీతిగా ప్రతియోగియందును, ఏకాత్యంతాభావమునందును, అంతర్భూతమై అత్యంతాభావ మున్నది. అనవస్థాదోషమును లేదు. అత్యంతాభావముయొక్క యత్యంతాభావము ప్రథమాత్యంతాభావముయొక్క ప్రతియోగిస్వరూపమై ప్రాచీనులచేత నంగీకరింపబడియున్నది. అచ్చట నవీనగ్రంథకారులచేత నీక్రింద నుదాహరింపబడిన దోషము వ్రాయబడియున్నది. ఎచ్చట భూతలమునందు ఘటము ఉన్నదో అచ్చట 'భూతలే ఘటోఽస్తి, భూతలే ఘటాత్యంతాభావో నాస్తి' అని ఈరీతిగా విలక్షణప్రతీతి కలుగుచున్నది. విధిముఖప్రతీతికిని నిషేధముఖప్రతీతికిని ఏకవిషయము సంభవించుట లేదు. అందువలన విధిముఖప్రతీతికి ఘటము విషయమై యున్నది. మఱియు నిషేధముఖప్రతీతికి

విషయము ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావమై యున్నది. అది ఘటరూపము కాదు. ఇక నేమనిన అభావరూపమై యున్నది. అందువలన ఘట మునకంటె పృథక్కై యున్నది. మఱియు ద్వితీయాత్యంతాభావమును పృథక్కై-యంగీకరించినయెడల అనవస్థాదోషము చెప్పఁబడియున్నది. దానికి సమాధాన మేమనగా, ద్వితీయాత్యంతాభావము ప్రథమాత్యంతాభావముయొక్క ప్రతి యోగికి సమనియతమై యున్నది. తృతీయాభావము ప్రథమాభావమునకు సమ నియతమై యున్నది. మఱియును ప్రతియోగియొక్క సమానదేశమునందు ఏద్వి తీయాభావ మున్నదో దానికి సమనియతము చతుర్థాభావమై యున్నది. ప్రథమ తృతీయమునకు సమనియతము పంచమాభావమై యున్నది. ఈరీతిగా యుగ్మ సంఖ్యా ఉభావము ద్వితీయాభావమునకు సమనియతమై యున్నది. విషమ సంఖ్యాభావము ప్రథమాభావమునకు సమనియతమై యున్నది. అచ్చట ద్వితీ యాభావము యద్యపి ప్రథమాభావముయొక్క ప్రతియోగికి సమనియతమై యున్నవి.తథాపి భావమునకును, అభావమునకును ఏకత్వము సంభవించుటలేదు. అందువలన ఘటమునకు సమనియతమైనప్పటికి ఘటాత్యంతాభావాభావము ఘటమునకంటె పృథక్కై యున్నది. మఱియును ప్రథమాభావమునకు సమనియత మగుతృతీయాభావము ప్రథమాభావస్వరూపమై యున్నదే కాని పృథక్కు కాదు. ఎట్లనగా, 'ఘటో నాస్తి'యనునిషేధముఖప్రతీతికి విషయము ప్రథమా భావమై యున్నది. మఱియు ఘటాత్యంతాభావాభావో నాస్తి అను నినిషేధ ముఖప్రతీతికిని విషయము తృతీయాభావమై యున్నది. అందువలన తృతీయా భావము ప్రథమాభావరూపమై యున్నది. ఈలాగుననే "ఘటాత్యంతాభావో నాస్తి" యను నీనిషేధముఖప్రతీతికి విషయము ద్వితీయాభావమై యున్నది. "తృతీయాభావో నాస్తి" యనునీప్రతీతికి చతుర్థాభావము విషయమై యున్నది. అందువలన ద్వితీయాభావమునకు సమనియత మగు చతుర్థాభావము ద్వితీయా భావరూపమై యున్నది. అయిన ఘటమునకు సమనియతమై యున్నప్పటికిని ద్వితీయాభావాభావరూపమై ఘటమునకంటె భిన్నమై యభావరూపమై యున్నది. ఈరీతిగా ప్రథమాభావమునందును ద్వితీయాభావమునందును అంతర్భూతమైయ భావమాల యున్నది. అనవస్థాదోషము యద్యపి ప్రాచీనరీతిగా ప్రతియోగి అభా మునందు అంతర్భూతమై యభావమై యున్నది. అందువలన ఒకటే అభావము నంగీకరింపవలసినది. నవీనరీతిగా రెండభావములు అంగీకరింపవలయును. అందు

వలన నవీనమతమునందు గౌరవ మున్నది. తథాపి భావాభావములకు ఏకత్వము సంభవించుట లేదు. అందువలన ప్రాచీనమతము ప్రమాణవిరుద్ధమై యున్నది. నవీనమతమైన అనుభవానుసారియై యున్నది. అందువలన ప్రమాణసిద్ధగౌరవము దోషకరము కాదు. ఈరీతిగా ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావము కూడ అభావప్రతియోగికాభావమై యున్నది. ఈరీతిగా నభావప్రతియోగిక సంసర్గాభావమునకు ఉదాహరణము చెప్పంబడియున్నది.

౭౫ అభావప్రతియోగికాన్యోన్యాభావమునకు నుదాహరణము. మఱియు నుక్తార్థానువాదము.

అభావప్రతియోగికాన్యోన్యాభావమునకు ఉదాహరణము అతిస్పష్టమై యున్నది. ఉ. ప్రాగభావముయొక్క యన్యోన్యాభావము ప్రాగభావమునందు లేదు, సకలపదార్థమునం దున్నది. ఎట్లన భేదము అన్యోన్యాభావ మనంబడును. స్వరూపమునందు భేదము లేదు. స్వరూపాతిరిక్తసర్వమును సర్వముయొక్క భేదమైయున్నది. అందువలన ప్రాగభావభిన్నపదార్థమునందు ప్రాగభావముయొక్క యన్యోన్యాభావ మున్నది. ప్రధ్వంసాభావమునకంటె భిన్నమునందు ప్రధ్వంసాభావము యొక్క యన్యోన్యాభావ మున్నది. అత్యంతాభావమునకంటె భిన్నమునందు అత్యంతాభావముయొక్క యన్యోన్యాభావ మున్నది. అన్యోన్యాభావముకంటె భిన్నమునందు అన్యోన్యాభావముయొక్క యన్యోన్యాభావ మున్నది. అన్యోన్యాభావముకంటె భిన్నమై చతుర్విధసంసర్గాభావ మున్నది, మఱియును భావపదార్థమైయున్నది. ఎట్లన, సంసర్గాభావము భావపదార్థము, అన్యోన్యాభావ రూపము కాదు. అందువలన నన్యోన్యాభావమునకంటె భిన్నమైయున్నది. ఏది దేనికంటె భిన్నమై యున్నదో దానియందు దానియొక్క యన్యోన్యాభావ మున్నది. అందువలన సంసర్గాభావమునందును సకలభావపదార్థమునందును అన్యోన్యాభావముయొక్క యన్యోన్యాభావమై యున్నది. ఈరీతిగా పంచవిధాభావములో సామయికాభావము కేవలద్రవ్యమునకే యున్నది. అందువలన నభావప్రతియోగికము కాదు. అభావప్రతియోగికచతుర్విధాభావమునకు ఉదాహరణము చెప్పంబడి యున్నది. అభావప్రతియోగికాభావము కొన్నిస్థలములయందు భావరూపముగా ప్రాచీనులచే నంగీకరింపబడియున్నది. ఉ. ఘటప్రాగభావముయొక్కధ్వంసము ఘటరూపమై యంగీకరింపబడి యున్నది. ఘటధ్వంసముయొక్క ప్రాగభావము ఘటరూపమై యంగీకరింపబడి యున్నది. ఘటాన్యోన్యాభావముయొక్క యత్యంతాభావము

ఘటత్వమై యంగీకరింపబడియున్నది. ఘటాత్యంతాభావముయొక్క యత్యంతాభావము ఘటమై యంగీకరింపబడియున్నది. దానిఖండనము కూడ చెప్పబడియున్నది. అందువలన నభావప్రతియోగికమైనప్పటికి అభావమై యున్నది. భావప్రతియోగికాభావమైన అతిప్రసిద్ధమై యున్నది. ఈరీతిగా నభావముయొక్క నిరూపణము న్యాయశాస్త్రప్రకారముగా చేయబడియున్నది. మఱియును ప్రాచీనమతములలో నెక్కడనైనను, నవీనమతములలో నెక్కడనయినను దోషము చెప్పయున్నది, ఆదోషమైన, న్యాయమర్యాదానుసారముగా చెప్పినదిగా నున్నది.

౮౦. ఉక్తన్యాయమతమునందు వేదాంతమతవిరుద్ధాంశప్రదర్శనము, మఱియును అనాదిప్రాగభావఖండనము.

ఉక్తప్రకారముగా అభావనిరూపణము వేదాంతశాస్త్రముచేతను విరుద్ధము కాదు. ఎంత అంశము వేదాంతవిరుద్ధమై యున్నదో అది వ్రాయబడియున్నది. కపాలమునందుండెడి ఘటప్రాగభావము అనాదియనిచెప్పనది ప్రమాణవిరుద్ధమై యున్నది. అందువలన వేదాంతానుసారి కాదు. ఎట్లనగా, ఘటప్రాగభావముయొక్క యధికరణ మగుకపాలము సాదియై యున్నది. ప్రతియోగియు, ఘటము కూడ సాదియై యున్నది. ప్రాగభావమునకు ననాదిత్వ మెట్లు సంభవించుచున్నది? మఱియును మాయయందుండెడి సకలకార్యముయొక్క ప్రాగభావమునకు అనాదిత్వము చెప్పినయెడల సంభవించుచున్నది. ఎట్లనగా మాయ అనాదియై యున్నది. అయిన మాయయందు కార్యముయొక్క ప్రాగభావాంగీకారము వ్యర్థము, సిద్ధాంతమున కిష్టము కాదు. ఎట్లనగా, ఘటముయొక్క యుత్పత్తి కపాలమునందు కలుగుచున్నది, అన్యమునందు లేదు. పటమున కుత్పత్తి తంతువునందు కలుగుచున్నది, కపాలమునందు లేదు. అందువలన ఘటప్రాగభావము కపాలమునందున్నది, తంతువునందు లేదు. పటప్రాగభావము తంతువునందున్నది, కపాలమునందు లేదు. దేనియొక్క ప్రాగభావము దేనియందున్నదో దానియొక్క యుత్పత్తి దానియందు కలుగుచున్నది, అన్యమునందు లేదు. సర్వకార్యమునకు నుత్పత్తి సర్వముచేత నసమ్మతమైయున్నది. ఈకారణమువలన ప్రాగభావాంగీకారము చేయవలసినది.

ముఖ్యప్రయోజనము ప్రాగభావమునకు దిగువప్రకారము నైయాయికుడు చెప్పుచున్నాడు. కపాలతంత్వాదికముయొక్క పరిణామము ఘటపటాదికము కాదు. మఱియు నేమనగా, కపాలమునందు ఘటముయొక్క యారంభ మగు

చున్నది. తంతువునందు పటముయొక్క యారంభ మగుచున్నది. మఱియును, ఘట పటాదికము ఉండినప్పుడు పూర్వమువలె, కపాలము తంతువు కూడ విద్యమానమై యున్నవి. పరిణామవాదము నంగీకరించునెడల ఘటాకారమును పొందిన తరువాత స్వరూపముచేత కపాల ముండనేరదు. ఈలాగుననే పటాకారము పొందినతరువాత తంతువు ఉండనేరదు. ఆపరిణామవాదము లేదు. ఆరంభవాద మున్నది. కపాలము ఎప్పు డున్నదో అప్పుడు తాను ఘటమును ఉత్పత్తి చేయుచున్నది. ఎప్పుడు ఘట ముత్పన్న మగుచున్నదో అప్పుడును ఘటముయొక్క సామగ్రి పూర్వమునవలె నున్నది. పరిణామవాదమం దైన కార్యోత్పత్తియయిన తరువాత నుపాదానకారణ ముండదు. ఎట్లనగా, పరిణామవాదమునందు ఉపాదానకారణమే కార్యరూపమును బొందుచున్నది. అందువలన ఘటరూపమును పొందినతరువాత కపాలము ఘటసామగ్రి కాదు. ఆరంభవాదమునందు నుపాదానకారణము తనస్వరూపమును త్యజించుట లేదు. ఉపాదానముకంటె భిన్నకార్యమునకు నుత్పత్తి యగుచున్నది. తనస్వరూపముతో నుపాదానకారణ మున్నది. అందువలన ఘటోత్పత్త్యనంతరము కూడ ఎప్పుడును సామగ్రి యుండుటవలన తిరిగి ఘటోత్పత్తి కావలయును. యద్యపి, ఏకఘటోత్పత్త్యనంతరము అన్యఘటోత్పత్తియందు ప్రథమఘటము ప్రతిబంధకమై యున్నది, ఘటముచేత నిరుద్ధకపాలమునందు అన్యఘటమునకు నుత్పత్తి కలుగుట లేదు. తథాపి ప్రథమోత్పన్నఘటమునకు తిరిగి యుత్పత్తి కావలయును. ప్రథమోత్పత్త్యనంతరము తిరిగి యుత్పత్త్యంగీకారము చేసినయెడల ఎట్లు ఉత్పత్తికాలమునందు 'ఘటః ఉత్పద్యతే' యనునీవ్యవహార మున్నదో అట్లు ఉత్పత్తికాలోత్తరకాలమునందును 'ఘటః ఉత్పద్యతే' అను నీవ్యవహారము కావలయును. సిద్ధఘటమునకు నేయాధారకాల మున్నదో అది ఘటోత్పత్తికాలోత్తరకాలమై యున్నది. సిద్ధఘటముయొక్క యాధారకాలమునందు 'ఉత్పన్నో ఘటః' అనునీవ్యవహారము కలుగుచున్నది. ఉత్పద్యతే ఘటః' అనునీవ్యవహారము ఒకయుత్పత్తిక్షణమునందే కలుగుచున్నది. ఘటముయొక్క యాధార మగు ద్వితీయాదిక్షణమునందు 'ఉత్పద్యతే' యను వ్యవహారము కలుగుట లేదు. ఎట్లనగా, వర్తమానోత్పత్తిసహితము ఘటమై యున్నది. ఈయర్థము, 'ఘటః ఉత్పద్యతే' యను నీవాక్యముచేత ప్రతీత మగుచున్నది. 'ఉత్పన్నో ఘటః' అనునీవాక్యముచేత నతీతోత్పత్తిసహితమైనది ఘటము అనునీయర్థము ప్రతీత మగుచున్నది. ఉత్పన్నమునకు నుత్పత్తి యంగీకరించిన

యెడల ఘటసిద్ధిదశయందును ఏదైన ఒకయుత్పత్తి వర్తమానమై యుండవల యును. అందువలన ఉత్పన్నఘటమునందును 'ఉత్పద్యతే ఘటః' అనుసీవ్యవహా రము కావలయును. అందువలన నుత్పన్న ఘటమునకు తిరిగి యుత్పత్తి లేదు. ఆలోచింపగా ఘటోత్పత్తియొక్క సామగ్రి యున్నవి అని యంగీకరింపవలసి వచ్చును. మఱియును సామగ్రి కపాలాదికమై యున్నది. ఆఘటముయొక్క ప్రాగభావము లేదు. ఘటముయొక్క ప్రాగభావమునకు ఘటోత్పత్తిక్షణము నందు ధ్వంస మున్నది. ఆ ఘటముయొక్క ప్రాగభావము ఘటోత్పత్తియందు కారణమై యున్నది. అది లేనందున నుత్పన్నఘటమునకు తిరిగి యుత్పత్తి కలుగుటలేదు. ఇది ప్రాగభావమునకు ముఖ్యప్రయోజనమై యున్నది.

ఆమాయయందు ఘటాదికముయొక్క ప్రాగభావమునకు ప్రథమప్రయో జనము సంభవించుట లేదు. ఎట్లనగా, ఘటాదికమునకు సాక్షాదుపాదా నము మాయ కాదు. ఇంక నేమనగా, కపాలాదికమై యున్నది. మాయకు సర్వ పదార్థమును గుఱించి సాక్షాదుపానత్వము సిద్ధాంతపక్షమునం దంగీకరింపఁబడి యున్నది. అదియు కూడ కార్యోత్పత్తియందు రెండవకారణము నపేక్షించుట లేదు. అద్భుతశక్తి మాయయందు ఉన్నది. అందువలన ప్రాగభావాదిరూపాన్య కారణమును అపేక్షించుట లేదు. అందువలన మాయయందు దేనియొక్క ప్రాగభావమును లేదు. మఱియు, కపాలమునందు ఘటోత్పత్తి కలుగుచున్నది, పటమునందు లేదు. దీనియందు ప్రాగభావము హేతువై చెప్పబడి యున్నది. అదియును సంభవింపదు. కపాలమునందును ఘటకారణత యున్నది, పటకారణత లేదు. ఎట్లన, అన్వయవ్యతిరేకముచేత కారణతాజ్ఞానము కలుగుచున్నది. కపా లముయొక్క యన్వయము అనగా సత్త యుండినప్పుడు ఘటాన్వయము ఉన్నది. కపాలముయొక్క వ్యతిరేక మనగా అభావము. ఆయభావముచేత ఘటము యొక్క వ్యతిరేక మున్నది. ఈరీతిగా కపాలాన్వయవ్యతిరేకముచేత ఘటాన్వ యవ్యతిరేకము చూడఁబడియున్నది, పటమునకు లేదు. అందువలన కపాలము నందు ఘటకారణత యున్నది, పటకారణత లేదు. గాన కపాలమువలన ఘటో త్పత్తి యగును గాని పటాద్యుత్పత్తి లేదు. పటాదికముయొక్క వ్యావృత్తి కొఱకు ఘటప్రాగభావము కపాలమునందు సంభవించుట లేదు. మఱియును ఏముఖ్య ప్రయోజనము ప్రాగభావమునకు చెప్పబడి యున్నదో అది కపాలము నందు ఘటోత్పత్త్యనంతరము ఉత్పత్త్యాపత్తినివృత్తికొఱకై చెప్పబడియున్నది.

ఈదోషము పరిణామవాదమునందు లేదు. ఎట్లన, స్వరూపముతో స్థిత మైన కపాలము ఘటోత్పత్తిజనకమై యున్నది. కార్యరూపమును పొందినకపాలము చేత ఘటోత్పత్తి కలుగుట లేదు. అందువలన పరిణామవాదమునందు ప్రాగ భావము నిష్ఫల మయియున్నది. విచారింపగా ఆరంభవాదమునందును ప్రాగభావము నిష్ఫలమై యున్నది. ఎట్లనగా, ఘటోత్పత్తి యయిన యనంత రము పునరుత్పత్తి కావలయు నని ఎవడు చెప్పునో వానిని అడుగవలసిన దేమనగా, ఘటాంతరమునకు నుత్పత్తి కావలయు నని యా? (అథవా)ఆలాగున కాక పోయిన ఏఘటము ఏకపాలమునందు ఉత్పన్న మయినదో దానికి ఉత్పత్తి కావలసినదా? అన్యఘటమునకు నుత్పత్తి కావలసిన దని చెప్పినయెడల అది యును గూడ సంభవించుట లేదు. ఎట్లనగా, ఏకపాలముచేత నేఘటము అగు చున్నదో ఆకపాలమునందు ఆఘటకారణత యున్నది. ఘటాంతరకారణత కపాలాంతరమునందు ఉన్నది. అందువలన నన్యఘటోత్పత్త్యాపత్తికి అవకాశము లేదు. ఏఘటము పూర్వమునందు నుత్పన్న మైనదో ఆ ఘటమునకు నుత్పత్తి కావలసిన దని చెప్పినయెడల అదియును సంభవింపదు. ఎట్లన, ఎచ్చట కపాలము చేత ఘటోత్పత్తి యయినదో అచ్చట ప్రథమోత్పత్తి అన్యోత్పత్తికి ప్రతిబంధకమై యున్నది. అందువలన పునరుత్పత్తి కలుగుట లేనందున ప్రాగభావము నిష్ఫలమై యున్నది.

ఉత్పత్తియొక్క స్వరూపమును సూక్ష్మముగా విచారించినయెడల పున రుత్పత్త్యాపాదనము విరుద్ధమై యున్నది. ఎట్లన, ఆద్యక్షణముతో సంబంధము ఉత్పత్తి యనంబడును. ఘటమునకు నాద్యక్షణముతో సంబంధము ఘటోత్పత్తి యనంబడును.ఘటాధికరణక్షణముయొక్క ధ్వంసమునకు అనధికరణ మగు నేక్షణ మున్నదో అది ఘటాద్యక్షణం బనంబడును.ఘటమునకు నధికరణము అనంతక్షణ మై యున్నది. వానిలో ఘటాధికరణమగునేద్వితీయాదిక్షణము లున్నవో వానిలో ఘటాధికరణప్రథమక్షణమునకు ధ్వంస మున్నది. ప్రథమక్షణమునందు ఘటాధి కరణక్షణముయొక్క ధ్వంసము లేదు. అందువలన ఘటాధికరణక్షణముయొక్క ధ్వంసమునకు అనధికరణము ఘటముయొక్క ప్రథమక్షణమై యున్నది. ఆక్షణ ముతో సంబంధమే ఘటోత్పత్తి యనంబడును. ద్వితీయాదిక్షణమునందు ప్రథ మక్షణముతో సంబంధము లేదు. అందువలన ప్రథమక్షణమునందే 'ఉత్పద్యతే' యనువ్యవహారము కలుగుచున్నది, ద్వితీయాదిక్షణమునందు లేదు. ఈరీతిగా

ప్రథమక్షణసంబంధరూపోత్పత్తి తిరిగి అయ్యెడి నని చెప్పుట 'మమ జననీవంధ్యా' యను వాక్యమునకు తుల్యమై యున్నది. ఎట్లన, ఘటోత్పత్త్యుత్తరక్షణము ఘటాధికరణధ్వంసమునకు అధికరణ మయియే కావలయును. అందువలన ఘటాధి కరణధ్వంసమునకు అధికరణ మయియే కావలయును. అందువలన ఘటాధికరణ ధ్వంసమునకు అనధికరణక్షణము తిరిగి సంభవించుట లేదు. అందువలన నుత్పన్న మైనదానియొక్క యుత్పత్తి కావలయు నని చెప్పుట విరుద్ధమై యున్నది. ఈరీతిగా ప్రాగభావము నిష్ఫలమై యున్నది. "కపాలే సమవాయేన ఘటో నాస్తి" యను ప్రతీతికి విషయము సామయికాభావమే సంభవించుచున్నది. మఱియును, "కపాలే ఘటో భవిష్యతి" యను ప్రతీతికి విషయము కూడ ఘటముయొక్క భవిష్య త్కాలమై యున్నది. ప్రాగభావ మసిద్ధమై యున్నది.

మఱియు తనశాస్త్రముయొక్క సంస్కారమువలన నైయాయికుడు ప్రాగభావమును అంగీకరించినయెడల అదియును సాదిగా నంగీకరింపవలసినది. అనాదిగా నంగీకరించుట సంభవింపదు. ఎట్లన, అన్యమతమునందు అభావమునకు అధికరణభేదమువలన భేద మున్నది. మఱియు, నైయాయికమతమునందు అధి కరణభేదమువలన అభావమునకు భేదము లేదు. ఇక నే మనగా, ప్రతియోగి భేదమువలన అభావమునకు భేద మున్నది. అందువలన నేకప్రతియోగికాభావము నానాధికరణమునందు ఏకమై యున్నది. అయిన ప్రాగభావము నైయాయిక మతమునందును అధికరణభేదమువలన భిన్నమైయె యున్నది. ఎట్లనగా, ఘట ప్రాగభావము ఘటోపాదానకారణ మగు కపాలమునందే యున్నది. వానిలో గూడ ఏఘటము ఏకపాలమునందు ఉత్పన్న మగునో ఆఘటముయొక్క ప్రాగ భావము ఆకపాలమునం దున్నది. అన్యఘటముయొక్క ప్రాగభావము అన్య కపాలమునం దున్నది. ఈరీతిగా నేకప్రాగభావము ఒకటే యధికరణమునందు ఉన్నది. ఆకపాలాదికము ప్రాగభావమునకు నధికరణమై సాదియై యున్నది. దానిలో నుండెడి ప్రాగభావము ఏరీతిగాను అనాదియై సంభవించుట లేదు. అనాది యగుప్రాగభావము అనాద్యధికరణమునందును సాదియందును ఉండిన యెడల అనాది యని చెప్పుట కూడ సంభవించుచున్నది. ఆనానాధికరణ మునందు ప్రాగభావము సంభవించుట లేదు. అందునలన కపాలమాత్ర వృత్తి ఘటప్రాగభావమునకు అనాదిత్వము సంభవింపదు. ఒకడు చెప్పున దే మనగా, మఱియును కపాలముయొక్క యుత్పత్తికి పూర్వమునందు కపాల

ముతెయొక్క అవయవమునందు ఘటముయొక్క ప్రాగభావ మున్నది. తత్పూర్వమునందు అవయవియొక్క యవయవమునం దున్నది. ఈరీతిగా అనాది పరమాణువునందు ఘటముయొక్క యనాదిస్థమై యున్నదని గ్రహింపవలయును. అదియును గూడ సంభవించుట లేదు. ఎట్లన, తనయొక్క ప్రతియోగియొక్క యుపాదానకారణమునందు ప్రాగభావము ఉన్నది, అన్యమునందు లేదు, అని నైయాయికనియమ మున్నది. కపాలముయొక్క యవయవము కపాలమునకు నుపాదానకారణమై యున్నదే కాని ఘటమునకు కాదు. అందువలన కపాలావయవమునందు కపాలముయొక్కయే ప్రాగభావ మున్నది,* ఘటముయొక్క ప్రాగభావము కపాలమునందే యున్నది, కపాలావయవమునందు సంభవించుట లేదు. ఈరీతిగా పరమాణువు కేవలము ద్వ్యణుకమునకు నుపాదానకారణమై యున్నది. అందువలన ద్వ్యణుకముయొక్క ప్రాగభావమే పరమాణువునందున్నది. ద్వ్యణుకముకంటె నుత్తరోత్తర త్ర్యణుకాది ఘటపర్యంతముయొక్క ప్రాగభావము పరమాణువునందు సంభవించుటలేదు. మఱియును పరమాణువునందు ద్వ్యణుక భిన్నపదార్థముయొక్కయు, ప్రాగభావము నంగీకరించినయెడల పరమాణువు చేతను ఘటోత్పత్తి కావలయును. మఱియును.

పరిణామవాదమునందు కార్యకారణములకు నభేదము ఉన్నది. అందువలన ద్వ్యణుకము మొదలుకొని అంత్యావయవి యగు ఘటమువఱకు కార్యకారణ పరంపరకు భేదము లేదు. ఆమతమునందు, పరమాణువునందు ద్వ్యణుకము యొక్క ప్రాగభావమే ఘటపర్యంతకార్యపరంపరయొక్క ప్రాగభావమై యున్నది. అందువలన పరమాణువునందు ఘటాదికముయొక్క ప్రాగభావము సంభవించు చున్నది, అని యారంభవాదమునందు కార్యకారణములకు అభేదము లేదు. ఇక నేమనగా కార్యకారణములకు పరస్పరము అత్యంతభేద మున్నది. అందువలన కపాలావయవమునందు ఘటప్రాగభావము లేదు. ఈలాగుననే పరమాణువునందు ద్వ్యణుకకార్య మగు త్ర్యణుకముయొక్క ప్రాగభావము సంభవించుట లేదు. ఈరీతిగా, సావికపాలాదికమునందు ఘటాదికముయొక్క ప్రాగభావమునకు అనాదిత్వకథన మసంగతమై యున్నది.

౮౧. అనంతప్రధ్వంసాభావఖండనము.

ఈలాగుననే నైయాయికమతమునందు ప్రధ్వంసాభావము కూడ తన ప్రతియోగియొక్క యుపాదానమునందే యున్నది. అందువలన ఘటధ్వంసము

కపాలమాత్రవృత్తియై యనంతమై యున్నది, అను నీకథనము అసంగతమై యున్నది. ఘటధ్వంసాధికరణ మగు నేకపాల మున్నదో దానియొక్క నాశము వలన ఘటధ్వంసమునకు నాశము కలుగుచున్నది. మఱియును, ఘటధ్వంసమునకు నాశ మంగీకరించినయెడల నైయాయికుడు చెప్పుదోష మే మనగా, ఘటధ్వంసమునకు ధ్వంసము కలుగునెడల ఘటమున కుజ్జీవనము కావలయును. ఎట్లనగా, ప్రాగభావధ్వంసాభావమునకు అనాధారకాలము ప్రతియోగ్యాధారమై యున్నది, అను నీ నియమ మున్నది. ఏకాలమునందు ఘటధ్వంసముయొక్క ధ్వంస మున్నదో ఆకాలము ఘటధ్వంసమునకు ననాధారము కావలయును. మఱియును ప్రాగభావమునకును అనాధారము కావలయును. అందువలన ఘటాధారము కావలయును. ఈరీతిగా, ధ్వంసముయొక్క ధ్వంసము నంగీకరించినయెడల ఘటాదిప్రతియోగికి నుజ్జీవనము కావలయును, అను నీదోషము కూడ లేదు. ఎట్లనగా, ప్రాగభావమున కనాదిత్వమును ధ్వంసమున కనంతత్వమును అంగీకరించినయెడల ఉక్తనియమము సిద్ధ మగుచున్నది. ఉక్తనియమము నంగీకరించినయెడల ప్రాగభావమున కనాదిత్వము ధ్వంసమున కనంతత్వమును సిద్ధించుచున్నవి. మఱియును సిద్ధాంతపక్షమునందు ప్రాగభావము సాదియై యున్నది. అందువలన ప్రాగభావోత్పత్తి పూర్వకాలము ఘటప్రాగభావమునకు ఘటధ్వంసమునకును అనాధారమై యున్నది, ఘటాధారము కాదు. అథవా ముఖ్యసిద్ధాంతమునందు సర్వథా ప్రాగభావాంగీకారము లేదు. అందువలన ఘటోత్పత్తి పూర్వకాలము ఘటప్రాగభావమున కనాధారమై యున్నది. ఘటధ్వంసమునకును అనాధారమై యున్నది. ఘటరూపప్రతియోగికిని అనాధారమై యున్నదే కాని ఘటరూపప్రతియోగికి ఆధారము కాదు. అందువలన ప్రాగభావధ్వంసములకు అనాధారకాలము ప్రతియోగి కాధారమై యున్నది, అను నియమము సంభవించుట లేదు. అందువలన ఘటధ్వంసమునకు ధ్వంస మున్నది. మఱియును ఉక్తనియమాసిద్ధివలన ఘటమునకు నుజ్జీవనము కలుగుట లేదు.

౮౨. అన్యోన్యాభావమునకు సాది సాంతత్వము
అనాదితాంగీకారము

అన్యోన్యాభావమును సాదిసాంతాధికరణమునందు సాదిసాంతమై యున్నది. ఉ. ఘటమునందు పటముయొక్క యన్యోన్యాభావ మున్నది. దానికి నధికరణము

౮3. అభావప్రమకు హేతువగు ప్రమాణనిరూపణము.

అభావజ్ఞానమునకు భేదపూర్వకన్యాయమతమునందు భ్రమప్రత్యక్షము నందు విషయానపేక్షము.

అభావముయొక్క స్వరూపనిరూపణము చేయబడుచున్నది. అభావముయొక్క జ్ఞానము ద్వివిధమై యున్నది.

(1) భ్రమరూపము. (2) ప్రమారూపము.

భ్రమజ్ఞానము కూడ ప్రమవలె ప్రత్యక్షపరోక్షభేదముచేత ద్వివిధమై యున్నది. ఘటసహితభూతలమునందు ఇంద్రియసంయోగ ముండినను ఏదో ఒకప్రకారముచేత ఘటోపలబ్ధి కలుగుట లేదు. అచ్చట ఘటాభావముయొక్క ప్రత్యక్షభ్రమ కలుగుచున్నది. అయిన విషయము లేకయే ప్రత్యక్షజ్ఞానము కలుగుట లేదు. అన్యథాఖ్యాతిమతమందైననో భ్రమప్రత్యక్షమునందు విషయాపేక్ష లేదు. ఇక నేమనగా, అన్యపదార్థమునకు నన్యరూపముతో జ్ఞానము అన్యథాఖ్యాతి యనంబడును. అందువలన నేపదార్థమునకు అన్యరూపముతో జ్ఞానము కలుగుచున్నదో దానియపేక్ష యున్నది ఉ. రజ్జువునకు సర్పత్వరూపముతో జ్ఞానము కలుగుచున్నది. ఆజ్ఞానమునకు రజ్జ్వపేక్ష యున్నది. తథాపి ఏవిషయముయొక్క జ్ఞానమునందు ఆకారము ప్రతీత మగుచున్నదో దాని యపేక్ష యన్యథాఖ్యాతిమతమునందు లేదు ఉ. సర్పముయొక్క భ్రమయందు భాసించుచున్నది. దానియపేక్ష లేదు.

౮౪. సిద్ధాంతమునందు పరోక్షభ్రమయందు విషయానపేక్షము, మఱియు నపరోక్షభ్రమయందు తదపేక్షయు.

తథాపి, సిద్ధాంతమునందు అనిర్వచనీయఖ్యాతి యున్నది. ఎచ్చట ప్రత్యక్షభ్రమ కలుగుచున్నదో అచ్చట భ్రమజ్ఞానమువలె అనిర్వచనీయ విషయమునకు నుత్పత్తి కలుగుచున్నది. అందువలన వ్యావహారికఘటసహితభూతలమునందు ప్రాతిభాసికఘటాభావము అనిర్వచనీయమై యుత్పన్న మగుచున్నది. వ్యావహారికఘటమునకు వ్యావహారికఘటాభావముతో విరోధ మున్నది. ప్రాతిభాసికఘటాభావముతో వ్యావహారికఘటాభావమునకు విరోధము లేదు. అందువలన వ్యావహారికఘటసహితభూతలమునందు అనిర్వచనీయఘటాభావము, దానియొక్క యనిర్వచనీయజ్ఞానమును ఈరెండును నుత్పన్న మగుచున్నవి. అచ్చట

ఘటాభావముయొక్క ప్రత్యక్షభ్రమ చెప్పబడుచున్నది. ఎచ్చట సంధునికి విప్రలంభకవచనమువలన ఘటసహితభూతలమునందు ఘటాభావముయొక్క జ్ఞానము కలుగుచున్నదో, అది అభావముయొక్క పరోక్షభ్రమమై యున్నది. పరోక్షజ్ఞానమునందు విషయముయొక్క యపేక్ష లేదు. ఎట్లనగా, అతీతానాగత ములయొక్కయు పరోక్షజ్ఞానము కలుగుచున్నది. అందువలన నెచ్చట నభావ ముయొక్క పరోక్షభ్రమ యున్నదో అచ్చట ప్రాతిభాసికాభావమునకు నుత్పత్తి కలుగుట లేదు. కేవలాభావాకారవృత్తిరూపజ్ఞానమునకే ఉత్పత్తి కలుగు చున్నది.

౮౫. సిద్ధాంతమునందు అభావభ్రమాదిస్థానమునందు అన్యథాఖ్యా త్యంగీకారము.

అథవా, పరోక్షభ్రమవలె ఎచ్చట నభావప్రత్యక్షభ్రమ కలుగుచున్నదో అచ్చట 'ప్రాతిభాసికాభావమునకు ఉత్పత్తి యగుట లేదు. అభావము యొక్క భ్రమము అన్యథాఖ్యాతిరూపమై యున్నది. ఎట్లనగా, రజ్జ్వాదికమునందు సర్పాదిభ్రమ యన్యథాఖ్యాతిరూపముగా నంగీకరించినయెడల ఈదోషము ఉన్నది. రజ్జువునందు సర్పత్వధర్మముయొక్క ప్రతీతి యన్యథాఖ్యాతి యనబడు చున్నది. అది సంభవింపదు. ఎట్లనగా : ఇంద్రియసంబంధము రజ్జువుతోను, రజ్జుత్వముతోను ఉన్నది; సర్పత్వముతో నింద్రియసంబంధము లేదు. మఱియును విషయముతో సంబంధము వినా ఇంద్రియజన్యజ్ఞానము కలుగుట లేదు. అందు వలన రజ్జువునకు సర్పత్వధర్మముతో ప్రతీతిరూపాన్యథాఖ్యాతి సంభవించుట లేదు. ఈరీతిగా ప్రత్యక్షభ్రమస్థలమునందు అన్యథాఖ్యాతిని నిషేధించి అనిర్వ చనీయఖ్యాతిని అంగీకరింపవలసినది. దానియొక్క క్రమము పూర్వమునందే చెప్పబడియున్నది.

అయిన ఎచ్చట అధిష్ఠానారోప్యములు రెండును ఇంద్రియ సంబంధములై యున్నవైనా అచ్చట నుక్తదోషము సంభవించుట లేదు. అందువలన సిద్ధాంత గ్రంథమునందును అచ్చట అన్యథాఖ్యాతియే వ్రాయంబడి యున్నది. ఉ. పుష్ప ముయొక్క యుపరిభాగమునందు ధరించిన స్ఫటికమునందు రక్తతాప్రత్యక్ష భ్రమము కలుగుచున్నది. అచ్చట పుష్పముయొక్క రక్తిమతో కూడను నేత్ర మునకు సంయుక్తసమవాయ సంయుక్తతాదాత్మ్యసమవాయము ఉన్నది మఱి యును స్ఫటికముతో నేత్రమునకు సంయోగసంబంధము ఉన్నది. అచ్చట

రక్తత, ఆరోప్యమై యున్నది. స్ఫటికము అధిష్ఠానమై యున్నది. అచ్చట పుష్పముయొక్క వ్యావహారికరక్తత స్ఫటికమునందు ప్రతీత మగుచున్నది. స్ఫటికమునందు అనిర్వచనీయరక్తిమకు నుత్పత్తి కలుగుట లేదు. ఎట్లన, రక్తిమతో సర్వత్వమువలె నేత్రముయొక్క సంబంధము లేదు. విషయముతో సంబాధము లేకయె ఇంద్రియజన్యజ్ఞానము కలుగుట లే దనుదోషము ఉన్నది. నేత్రముతో రక్తిమకు సంబంధము ఉండుటవలన ఉక్తదోషము సంభవించుట లేదు. అందువలన నారోప్యముయొక్క సన్నిధానస్థలమునందు అన్యథాఖ్యాతియే సంభవించుచున్నది. ఈలాగుననే ఘటసహితభూతలమునందు ఘటాభావభ్రమ యున్నది. అచ్చట నారోప్యాధిష్ఠానములయొక్క సన్నిధానము ఉండుటవలన ఆరోప్యముతో కూడను అధిష్ఠానమువలె ఇంద్రియసంబంధము ఉన్నది. ఎట్లన, అధిష్ఠానము భూతలమై యున్నది. ఆరోప్య మగు ఘటాభావము భూతలమునందు లేదు. అయిన భూతలవృత్తిభూతలత్వమునందు ఘటాభావము ఉన్నది. భూతలవృత్తి రూపస్పర్శాదిగుణ మేది యున్నదో దానియందును ఘటాభావ మున్నది. భూతలత్వముతోను, భూతలముయొక్క రూపాదిగుణముతోను ఘటసంయోగము లేదు. ఎట్లనగా, రెండుద్రవ్యములకు సంయోగము కలుగుచున్నది. ఘటము ద్రవ్యమై యున్నది, భూతలత్వము ద్రవ్యము కాదు. మఱియు నే మనగా జాతియై యున్నది. దానితో ఘటమునకు సంయోగము సంభవింపదు. భూతలముయొక్క రూపస్పర్శాదికమును ద్రవ్యము కాదు, గుణమై యున్నది. దానితో కూడను ఘటమునకు సంయోగము సంభవింపదు. మఱియును దేనియందు దేనియొక్క సంయోగసంబంధము లేదో దానియందు ఆపదార్థముయొక్క సంయోగిసంబంధాభావాత్యంతాభావము ఉన్నది. ఈరీతిగా భూతలమునందు సంయోగసంబంధముతో ఘటము ఉండినను భూతలత్వమునందును భూతలముయొక్క గుణమునందును సంయోగసంబంధముచేత ఘటము లేనందున, సంయోగాసంబంధావచ్ఛిన్నఘటాత్యంతాభావము ఉన్నది. అచ్చట నధిష్ఠానము భూతలమై యున్నది. ఆరోప్యము ఘటాత్యంతాభావమై యున్నది. దానికి భూతలముతో స్వాధికరణసమవాయసంబంధము ఉన్నది. స్వ మ్మనగా ఘటాత్యంతాభావము, దానికి అధికరణము భూతలత్వము, భూతలముయొక్క రూపాదిగుణము కూడ దానియొక్క సమవాయము భూతలమునం దున్నది. భూతలమునకు ఘటాత్యంతాభావముతో స్వసమవేతవృత్తిత్వసంబంధము ఉన్నది. స్వ మ్మనగా

భూతలము, దానియందు సమవేత మనగా, సమవాయసంబంధముచేత నుండునది భూతలత్వమై యున్నది, గుణమై కూడ నున్నది. దానియందు వృత్తిత్వ మనగా, ఆధేయత, అది అత్యంతాభావమునకు నున్నది. ఈరీతిగా నాన్యోన్యాధిష్ఠానములకు పరస్పరసంబంధము ఉండుటవలన సన్నిధానము ఉన్నది. అందువలన భూతలత్వవృత్తియు రూపస్పర్శాదివృత్తియు నగు నేన్యానహైకఘటాత్యంతాభావము ; ఉన్నదో దానికి భూతలమునందు ప్రతీతి యుండుటవలన అభావము యొక్క భ్రమము అన్యథాఖ్యాతిరూపమై యున్నది. ప్రాతిభాసికాభావమునకు నుత్పత్తి యంగీకరించుట నిష్ప్రయోజనమై యున్నది. ఈరీతిగా ప్రత్యక్షపరోక్షభేదములవలన అభావభ్రమము ద్వివిధమై యున్నది.

౮౬. ప్రత్యక్ష పరోక్ష యథార్థ భ్రమరూపాభావప్రమకు ఇంద్రియము, అనుపలంభాది సామగ్రియొక్క కథనము.

ఈలాగుననే అభావప్రమయు కూడ ప్రత్యక్ష పరోక్షభేదమువలన ద్వివిధమై యున్నది. నైయాయికమతమునం దైన ఇంద్రియజన్యజ్ఞాన మపరోక్షజ్ఞాన మనంబడును. దానికంటె భిన్న మగుజ్ఞానము పరోక్షజ్ఞాన మనంబడును. అభావముతో కూడ ఇంద్రియమునకు విశేషణతాసంబంధము లేక స్వసంబంధవిశేషణతా సంబంధము ఎచ్చట నున్నదో అచ్చట నభావప్రత్యక్షప్రమ పరోక్షప్రమయై యున్నది. శ్రోత్రముతో శబ్దాభావమునకు విశేషణతాసంబంధ మున్నది. అచ్చట శబ్దాభావముయొక్క శ్రోత్రజన్యప్రత్యక్షప్రమ కలుగుచున్నది. అట్లు భూతలమునందు ఘటాభావ ముండినప్పుడు నేత్రసంబంధభూతలమునందు విశేషణతాసంబంధము అభావమునకు నుండుటవలన ఘటాభావముయొక్క నేత్రజన్యప్రత్యక్షప్రమ యగుచున్నది. పురుషశూన్య భూతలమునందు ఎచ్చట స్థాణువునందు పురుషభ్రమ యున్నదో అచ్చట పురుషాభావ మున్నది. మఱియును పురుషాభావముతో నేత్రమునకు స్వసంబద్ధ విశేషణతాసంబంధమును ఉన్నది. తథాపి పురుషాభావముయొక్క ప్రత్యక్షము కలుగుట లేదు. అందువలన నభావముయొక్క ప్రత్యక్షమునందు ఇంద్రియము కరణమై యున్నది. ప్రతియోగియొక్క అనుపలంభము సహకారియై యున్నది. ఎచ్చట స్థాణువునందు పురుషభ్రాంతి యున్నదో అచ్చట ప్రతియోగియొక్క యనుపలంభము లేదు. ఇక నే మనగా పురుషరూపప్రతియోగియొక్క యుపలంభము ఉన్నది. ఉపలంభ మనగా జ్ఞానము. ఉ. ఘటాదిద్రవ్యముయొక్క చాక్షుషప్రత్యక్షమునందు నేత్రము కరణమై యున్నది. మఱియు నంధకారమునందు చాక్షుషప్రత్య

క్షము కలుగుట లేదు. అందువలన నేత్రజన్యచాక్షుషప్రత్యక్షమునందు ఆలోక సంయోగము సహకారియై యున్నది. అందువలన నంధకారస్థఘట మున్నప్పుడు నేత్రేంద్రియము ఉన్నది. నేత్రేంద్రియమునకు ఘటముతో సంయోగము కూడ ఉన్నది. తథాపి ఘటమునకు ఆలోకముతో సంయోగరూపసహకారి లేదు. అందువలన నంధకారస్థఘటమునకు చాక్షుషప్రత్యక్షము కలుగుట లేదు. చాక్షుషప్రత్యక్షమునందు ఆలోకసంయోగము సహకారియై యున్నది. అచ్చట నింద్రియముతో నాలోకముయొక్క సంయోగము హేతువు కాదు. విషయముతో నాలోకసంయోగము హేతువై యున్నది. అందువలన ప్రకాశమునందున్న పురుషునకు అంధకారస్థఘటప్రత్యక్షము లేదు. అచ్చట నింద్రియముతో నాలోకసంయోగము ఉన్నది. విషయ మగు ఘటముతో నాలోకసంయోగము లేదు. మఱియు నంధకారస్థపురుషునికి ప్రకాశస్థఘటముయొక్క ప్రత్యక్షము కలుగుచున్నది. అచ్చట నింద్రియముతో నాలోకసంయోగము లేదు. విషయముతో, నాలోకసంయోగము ఉన్నది. అందువలన విషయాలోకముల యొక్క సంయోగము నేత్రజన్యజ్ఞానమునందు సహకారియై యున్నది. తథాపి ఘటముయొక్క పూర్వదేశమునందు ఆలోకసంయోగము ఉన్నది. పశ్చిమప్రదేశమునందు నేత్రసంయోగము ఉన్నది. అచ్చట ఘటముయొక్క చాక్షుషప్రత్యక్షము కలుగుట లేదు. కలుగవలయును. ఎట్లనగా, విషయముతో నాలోకసంయోగరూపసహకారి యున్నది. ఆసంయోగరూప వ్యాపారసహిత నేత్రేంద్రియము ఉన్నది. అందువలన ఘటముయొక్క యేదేశమునందు నేత్రసంయోగము ఉన్నదో ఆదేశమునందు నాలోకసంయోగ సహకారి యున్నది అని యంగీకరింపవలసినది. దీపసూర్యాదికముయొక్క ప్రభ యాలోక మనంబడును. ఎట్లు ద్రవ్యచాక్షుషప్రత్యక్షమునందు ఆలోకసంయోగము సహకారియై యున్నదో అట్లు అభావముయొక్క ప్రత్యక్షమునందు ఇంద్రియము కరణమై ప్రతియోగ్యనుపలంభము సహకారియై యున్నది. అందువలన స్థాణువునందు పురుషభ్రమ యున్నది. అచ్చట పురుషాభావముయొక్క ప్రత్యక్షము లేదు. ఈలాగుననే ఎచ్చట భూతలమునందు ఘటము లేదో ఘటసదృశమైన యన్యపదార్థము ఉన్నదో దానియందు ఘటభ్రమ కలిగినయెడల ఆభూతలమునందు ఘటాభావము ఉన్నది. ఘటాభావముతో నింద్రియమునకు స్వసంబంధవిశేషణతాసంబంధము ఉన్నది. ఎట్లనఁగా ఘటముయొక్క భ్రమ కలిగియున్నది, మఱి

యును ఘటము లేదు. ఇక నే మనగా ఘటాభావము ఉన్నది. దానికి భూతల మునందు విశేషణతాసంబంధము ఉన్నది. ఆభూతలముతో నింద్రియమునకు సంయోగము ఉన్నది. అందువలన నింద్రియసంబద్ధ మనగా నింద్రియముతో సంబంధసహిత మగు భూతలమునందు అభావమునకు విశేషణతాసంబంధము ఉన్నది. అందువలన సంబంధరూప వ్యాపార సహితేంద్రియము కరణమై యున్నది. ప్రతియోగియొక్క యనుపలంభరూప సహకారి లేదు. ఎట్లనగా జ్ఞానము ఉపలంభ మనంబడును. అజ్ఞానము భ్రమరూపమై లేక ప్రమారూప మై యున్నది. దీనియందు విశేషము లేదు. ఎచ్చట ఘటభ్రమ కలుగుచున్నదో అచ్చట ఘటాభావముయొక్క ప్రతియోగి యగుఘటముయొక్క యనుపలంభము లేదు. ఇక నే మనగా భ్రమరూపోపలంభము అనగా జ్ఞానము ఉన్నది. ఈరీతిగా నభావప్రత్యక్షమునందు ఇంద్రియము కరణమై యున్నది. ప్రతియోగ్యనుపలంభము సహకారియై యున్నది. కేవలప్రతియోగియొక్క యనుపలంభము సహకారి యని చెప్పినను నిర్వాహ మగుట లేదు. ఎట్లనగా స్తంభమునందు పిశాచముయొక్క భేదము ప్రత్యక్షమై యున్నది. స్తంభమునందు పిశాచము యొక్క యత్యంతాభావము ప్రత్యక్షము కాదు. ఈ స్తంభము పిశాచము కాదు అను ననుభవము సర్వలోకమునకు నున్నది. స్తంభమునందు పిశాచము లేదు. అనునీనిశ్చయము లేదు. ఇచ్చట ప్రథమానుభవమునకు విషయము స్తంభవృత్తి పిశాచాన్యోన్యాభావమై యున్నది. ద్వితీయానుభవమునకు విషయము పిశాచాత్యంతాభావమై యున్నది. రెండభావములకు ప్రతియోగి పిశాచమై యున్నది. దానియొక్క యనుపలంభము ఉన్నది. మఱియు నింద్రియసంబద్ధము స్తంభమై యున్నది. దానిలో పిశాచాన్యోన్యాభావము పిశాచాత్యంతాభావమును ఈరెండును విశేషణతాసంబంధముచేత నున్నవి. అందువలన పిశాచాన్యోన్యాభావమువలె పిశాచాత్యంతాభావమునకు ప్రత్యక్షము కావలయును. ఈలాగుననే ఆత్మయందు సుఖాభావదుఃఖాభావములకు ప్రత్యక్ష మగుచున్నది. ధర్మాభావాధర్మాభావములకు ప్రత్యక్ష మగుట లేదు, అను నీవార్త సర్వలోకములకు అనుభవసిద్ధమై యున్నది. 'ఇదానీం మయి సుఖం నాస్తి' 'ఇదానీం మయి దుఃఖం నాస్తి' యనురీతిగా అనుభవము సర్వలోకమునకు నున్నది. ఆయనుభవము న్యాయమతమునందు మానసప్రత్యక్షమై యున్నది. మనస్సునకు సుఖాభావముతో దుఃఖాభావముతోను కూడ స్వసంయుక్తవిశేష

ణతా సంబంధము ఉన్నది. ఎట్లన, స్వమ్ అనగా మనస్సు, దానితో సంయుక్తము అనగా సంయోగసహితము ఆత్మ, దానియందు విశేషణతాసంబంధముచేత సుఖాభావదుఃఖాభావ మున్నది. ఈలాగుననే ధర్మాధర్మాభావముతో మనస్సునకు స్వసంయుక్తవిశేషణతాసంబంధము ఉన్నది. తథాపి ప్రత్యక్షము కలుగుట లేదు. "మయి ధర్మో నాస్తి" "మయి అధర్మో నాస్తి" అనునీప్రత్యక్షానుభవము ఎవరికిని కలుగుట లేదు. సుఖాభావదుఃఖాభావములకు ప్రతియోగి సుఖదుఃఖమై యున్నది. దానికి ఎట్లు అనుపలంభము అభావకాలమునం దున్నదో అట్లు ధర్మాభావాధర్మాభావములకు ప్రతియోగు లగు . ధర్మాధర్మము లున్నవో వానికిని అనుపలంభము ఉన్నది. అందువలన ప్రతియోగియొక్క యనుపలంభరూప సహకారి సహిత మనస్సుతో సుఖాభావదుఃఖాభావములయొక్క ప్రత్యక్షము ఉన్నది. ఆలాగుననే ధర్మాధర్మరూపప్రతియోగియొక్క యనుపలంభరూప సహకారిసహిత మనస్సుతో ధర్మాధర్మములయొక్క యభావమునకును ప్రత్యక్షము కావలయును. వాయువునందు రూపాభావము ప్రత్యక్షమై యున్నది, గురుత్వాభావము ప్రత్యక్షము కాదు. రూపాభావమునకు ప్రతియోగి రూపమై యున్నది. గురుత్వాభావమునకు ప్రతియోగి గురుత్వమై యున్నది. ఈరెంటికిని వాయువునందు నుపలంభము ఉన్నది. నేత్రమునకు వాయువుతో సంయోగ సంబంధము ఉన్నది. నేత్రసంయుక్త వాయువునందు రూపాభావ గురుత్వాభావములు విశేషణతాసంబంధముచేత నున్నవి. అందువలన స్వసంబద్ధ విశేషణతాసంబంధముచేత వాయువునందు ఎట్లు రూపాభావముయొక్క చాక్షుషప్రత్యక్ష మగుచున్నదో అట్లు స్వసంబద్ధవిశేషణతాసంబంధము గురుత్వాభావముతోను కూడ నేత్రమునకు ఉన్నది. అందువలన "వాయౌ రూపం నాస్తి" అను నీచాక్షుషప్రతీతి కూడ కావలయును. అందువలన నింద్రియ జన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు కేవలానుపలంభము సహకారి కాదు. ఇక నే మనగా యోగ్యానుపలబ్ధి సహకారి యై యున్నది. వాయువునందు అనుపలంభము ఎట్లు రూపమున కున్నదో అట్లు గురుత్వమునకు అనుపలంభ మున్నది. అయిన యోగ్యానుపలంభము రూపమున కున్నది. గురుత్వమునకు యోగ్యానుపలబ్ధి లేదు. ఎట్లనగా ప్రత్యక్షయోగ్యముయొక్క యప్రతీతి యోగ్యానుపలంభ మనంబడును. రూపమైననో ప్రత్యక్షయోగ్యమై యున్నది. గురుత్వము ప్రత్యక్షయోగ్యము కాదు ఎట్లనగా, త్రాసుయొక్క యూర్ధ్వాదిభాగముతో

గురుత్వానుమితి కలుగుచున్నది. ఏ యింద్రియముతోను గురుత్వజ్ఞానము కలుగుట లేదు, అందువలన ప్రత్యక్షయోగ్యము గురుత్వము కానందున దానియొక్క యనుపలంభము యోగ్యానుపలంభము కాదు. ఆత్మయందు సుఖాభావ దుఃఖాభావములకు మానసప్రత్యక్షము ఉన్నది. అచ్చటను ప్రత్యక్షయోగ్యమగు సుఖముయొక్క యనుపలంభము; ప్రత్యక్షయోగ్యమగు దుఃఖముయొక్క యనుపలంభము ఉండుటవలన యోగ్యానుపలంభము సహకారిగా సంభవించుచున్నది. ధర్మాభావాధర్మాభావములకు ఆత్మయందు మానసప్రత్యక్షము లేదు, అచ్చటను ధర్మరూపప్రతియోగియొక్క యనుపలంభము ఉన్నది. అయిన ధర్మాధర్మములు కేవలశాస్త్రవేద్యములై యున్నవి. ప్రత్యక్షయోగ్యములు కావు, అందువలన ధర్మాధర్మములయొక్క యోగ్యానుపలంభము లేదు. దానియొక్క యభావమువలన ధర్మాధర్మాభావములకు మానసప్రత్యక్షము కలుగుట లేదు.

౮౮. స్తంభమునందు పిశాచముయొక్క దృష్టాంతముచేత శంకాసమాధానపూర్వకానుపలంభముయొక్క నిర్ణయము.

ఈలాగుననే స్తంభమునందు పిశాచాత్యంతాభావముయొక్క ప్రత్యక్షము లేదు. అచ్చటను పిశాచరూపప్రతియోగియొక్క యనుపలంభము ఉన్నది. అయిన ప్రత్యక్షయోగ్యము పిశాచము కాదు, అందువలన యోగ్యానుపలంభము లేదు. ప్రత్యక్షయోగ్యప్రతియోగియొక్క యనుపలంభము యోగ్యానుపలంభ మనంబడును. పిశాచాత్యంతాభావమునకు ప్రతియోగి యగునే పిశాచము ఉన్నదో అది ప్రత్యక్షయోగ్యము కాదు. అందువలన పిశాచముయొక్క యనుపలంభము యోగ్యానుపలంభము కాదు. దీనియం దొకశంకయున్నది. స్తంభమునందు పిశాచముయొక్క భేదము ప్రత్యక్షము కాకపోవలయును. ఎట్లనగా పిశాచాన్యోన్యాభావము పిశాచభేద మనంబడును, దానికి ప్రతియోగి పిశాచమై యున్నది. అది ప్రత్యక్షయోగ్యము కాదు, అందువలన యోగ్యానుపలంభముయొక్క అభావమువలన పిశాచాత్యంతాభావమువలె పిశాచాన్యోన్యాభావము కూడ అప్రత్యక్షము కావలయును. సిద్ధాంతి చెప్పునదేమనగా, ఉక్తరూపము యోగ్యానుపలంభము కాదు. ఇక నే మనగా ప్రత్యక్షయోగ్యాధికరణమునందు ప్రతియోగియొక్క యనుపలంభము యోగ్యానుపలంభ మనంబడును. ప్రతియోగి కూడ ప్రత్యక్షయోగ్యమై యుండవలసినది, అథవా, అప్రత్యక్షమై యుండవలయును. అభావాధికరణము ప్రత్యక్షయోగ్యమై

యుండవలసినది, దానియందు ప్రతియోగియొక్క యనుపలంభము కావలయును. స్తంభమునందు నేసిశాచాన్యోన్యాభావము ఉన్నదో దానికి ప్రతియోగి పిశాచమై యున్నది. అదే ప్రత్యక్షయోగ్యము కాదు, మఱియును దానియందు ప్రత్యక్షయోగ్యతాపేక్షయు కూడ లేదు. తథాపి, పిశాచాన్యోన్యాభావమునకు అధికరణము స్తంభమై యున్నది, అది ప్రత్యక్షయోగ్యమైనందున యోగ్యానుపలంభముయొక్క సద్భావము ఉన్నది. అందువలన పిశాచముయొక్క యన్యోన్యాభావము స్తంభమునందు ప్రత్యక్ష మగుచున్నది, అని యీసిద్ధాంతియొక్క సమాధానము సంభవింపదు. ఎట్లనగా, ఉక్తరీతిగా నీక్రింద నుదాహరించిన ప్రకారము సిద్ధ మగుచున్నది. అభావముయొక్క ప్రతియోగి ప్రత్యక్షయోగ్యమై, లేక ప్రత్యక్షాయోగ్యమై కూడ నుండవచ్చును అభావముయొక్క యే యధికరణము ప్రత్యక్షయోగ్యమై యున్నదో దానియందు ప్రతియోగియొక్క యనుపలంభ ముండవలసినది. ఆయోగ్యానుపలంభము అభావప్రత్యక్షమునందు సహకారియై యున్న దనునీయర్థము నంగీకరించినయెడల స్తంభమునందు పిశాచాత్యంతాభావము కూడ ప్రత్యక్షము కావలయును. ఈలాగుననే ఆత్మయందు ధర్మాధర్మాభావములు కూడ ప్రత్యక్షము కావలయును. ఎట్లనగా, స్తంభవృత్తి పిశాచాత్యంతాభావమునకు అధికరణము స్తంభమై యున్నది. అది ప్రత్యక్షయోగ్యమై యున్నది. ఆత్మవృత్తి ధర్మాభావాధర్మాభావములకు అధికరణ మగునాత్మ ప్రత్యక్షయోగ్యమై యున్నది. అయిన ఇంతమాత్రభేద మున్నది. ఎంతమాత్ర మనగా, స్తంభము బాహ్యేంద్రియజన్యప్రత్యక్షయోగ్యమై యున్నది. అందువలన స్తంభమునందు పిశాచాత్యంతాభావమునకు బాహ్యేంద్రియజన్యప్రత్యక్షము కావలయును. మఱియును ఆత్మ మానసప్రత్యక్షయోగ్యమై యున్నది. అందువలన నాత్మయందు ధర్మాభావాధర్మాభావములు మనకు మానసప్రత్యక్షము కావలయును. వాయువునకు ప్రత్యక్షయోగ్యత్వ మంగీకరించినయెడల వాయువృత్తిగురుత్వాభావము మనకు ప్రత్యక్షము కావలయును. వాయువునకు ప్రత్యక్షయోగ్యత్వమునంగీకరింపనియెడల వాయువృత్తిరూపాభావము మనకు ప్రత్యక్షము కాకపోవలయును. మఱియును, వాయువునందు రూపాభావప్రత్యక్షము ఉన్న దని సిద్ధాంతము ఉన్నది, అనుభవసిద్ధమై యున్నది. ఈయర్థము ఉత్తరత్ర స్పష్ట మగును. సిద్ధాంతి ఈరీతిగా సమాధానమును చెప్పుచున్నాడు. యోగ్యానుపలంభము ద్వివిధము. ఒకటి ప్రత్యక్షయోగ్యప్రతియోగియొక్క యనుపలంభము

యోగ్యానుపలభంబై యున్నది. మఱియు నొకటి ప్రత్యక్షయోగ్యాధికరణము నందు ప్రతియోగియొక్క యనుపలంభము యోగ్యానుపలంభమై యున్నది. అత్యంతాభావముయొక్క ప్రత్యక్షమునందు ప్రథమయోగ్యానుపలంభము సహకారియై యున్నది. అందువలన నధికరణము ప్రత్యక్షయోగ్యమై లేక అయోగ్యమై యుండు గాక. అత్యంతాభావముయొక్క యే ప్రతియోగి ప్రత్యక్షయోగ్యమై యున్నదో దానియొక్క యనుపలంభము అత్యంతాభావముయొక్క ప్రత్యక్షము నందు సహకారియై యున్నది. అన్యోన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు ద్వితీయాయోగ్యానుపలంభము సహకారియై యున్నది. అందువలన అన్యోన్యాభావమునకు ప్రతియోగి ప్రత్యక్షయోగ్యమై లేక ప్రత్యక్షాయోగ్యమై యుండుగాక. ప్రత్యక్షయోగ్యాధికరణమునందు ప్రతియోగియొక్క యనుపలంభము అన్యోన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు సహకారియై యున్నది. అందువలన నెక్కడను దోషము లేదు. స్తంభమునందు పిశాచాత్యంతాభావముయొక్క ప్రతియోగి పిశాచము ప్రత్యక్షయోగ్యము కాదు. అందువలన స్తంభవృత్తిపిశాచాత్యంతాభావము అప్రత్యక్షమై యున్నది. మఱియును స్తంభవృత్తిపిశాచాన్యోన్యాభావమునకు అధికరణము స్తంభమై యున్నది. అది ప్రత్యక్షమై యున్నది. అందువలన స్తంభమునందు పిశాచాన్యోన్యాభావము ప్రత్యక్ష మగుచున్నది ఆత్మవృత్తి సుఖాత్యంతాభావదుఃఖాత్యంతాభావములకు ప్రతియోగి సుఖదుఃఖములు మానసప్రత్యక్షయోగ్యములై యున్నవి. వానియొక్క యత్యంతాభావమునకు మానసప్రత్యక్షము కలుగుచున్నది. ధర్మాధర్మములు ప్రత్యక్షయోగ్యములు కావు. అందువలన వానియొక్క యత్యంతాభావము మనకు ప్రత్యక్షము కలుగుట లేదు. రూపగుణము ప్రత్యక్షయోగ్యమై యున్నది. అందువలన వాయువునకు రూపాత్యంతాభావముయొక్క ప్రత్యక్షము కలుగుచున్నది. గురుత్వగుణము ప్రత్యక్షయోగ్యము కాదు. అందువలన వాయువునందు గురుత్వాత్యంతాభావప్రత్యక్షము కలుగుటలేదు. ఈరీతిగా ఈయర్థము సిద్ధమైనది. అధికరణమునందు ప్రత్యక్షయోగ్యత్వము మఱియు ప్రతియోగియొక్క యనుపలంభము అన్యోన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు సహకారియై యున్నది. మఱియు ప్రతియోగియందు ప్రత్యక్షయోగిత్వము ప్రతియోగియొక్క యనుపలంభము అత్యంతాభావముయొక్క ప్రత్యక్షమునందు సహకారియై యున్నది. అను నియమము సిద్ధాంతి చెప్పియున్నాడు గాని అది కూడ సంభవించుట లేదు.

ఎట్లనగా అన్యోన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు అధికరణముయొక్క యోగ్యత హేతువై యుండినయెడల వాయువునందు రూపవద్భేదము కలుగుచున్నది. అది కాకపోవలయును. 'వాయూ రూపవాన్ న' అనునీప్రత్యక్షము ఎల్లరకు కలుగుచున్నది. మఱియు వక్ష్యమాణరీతిగా ఈప్రత్యక్షము సంభవించుచున్నది. అచ్చట అన్యోన్యాభావమునకు అధికరణము వాయువై యున్నది, అది ప్రత్యక్షయోగ్యము కాదు. వాయువునకు ప్రత్యక్షయోగ్యత్వమును ఆగ్రహముతో నంగీకరించినయెడల వాయువునందు గురుత్వవద్భేదమునకును ప్రత్యక్షము కావలయును. మఱియు 'వాయు గ్గురుత్వవా న్న' అనునీప్రత్యక్షము ఎవరికి కలుగుట లేదు. వక్ష్యమాణరీతిగా సంభవించుట లేదు. మఱియు స్తంభమునందు పిశాచవద్భేదము ఆప్రత్యక్షమై యున్నది. అన్యోన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు అధికరణముయొక్క యోగ్యత హేతువైనయెడల పిశాచవద్భేదమునకు అధికరణము స్తంభమై యున్నది. దానికి ప్రత్యక్షయోగ్య ముండినయెడల పిశాచపదన్యోన్యాభావరూపపిశాచవద్భేదముప్రత్యక్షము కావలయును. 'స్తంభః పిశాచవాన్ న' అనునీప్రత్యక్షము లేదు. అందువలన ప్రత్యక్షయోగ్యాధికరణము ప్రతియోగియొక్క యనుపలంభరూపయోగ్యానుపలంభము అన్యోన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు సహకారియై యున్నది, అను నియమము సంభవించుట లేదు. ఈలాగుననే అత్యంతాభావప్రత్యక్షమునందు ప్రతియోగియొక్క యోగ్యత్వము సహకారి యని అంగీకరించినయెడల జలపరమాణువునందు పృథివీత్వాత్యంతాభావముయొక్క ప్రత్యక్షము కావలయును. ఎట్లనగా జల పరమాణువృత్తి పృథివీత్వాత్యంతాభావమునకు ప్రతియోగి పృథివీత్వ మై యున్నది. దానికి ఘటాదికమునందు చాక్షుషప్రత్యక్ష మున్నది. అందువలన ప్రతియోగి ప్రత్యక్షయోగ్యమై యున్నది. మఱియు దానికి జలపరమాణువునందు ఉపలంభ మనగా ప్రతీతి కలుగుట లేదు. అందువలన అనుపలంభ మున్నది. మఱియు జలపరమాణువుతో నేత్రమునకు సంయోగ మున్నది. అందువలన జలపరమాణువృత్తి పృథివీత్వాత్యంతాభావముతో నేత్రమునకు స్వసంయుక్తవిశేషణతా సంబంధము ఉన్నది. ఒకరు చెప్పుచున్నారు:—పరమాణువు నిరవయవమై యున్నది, దానితో నేత్రమునకు సంయోగము సంభవించుట లేదు, ఎట్లనగా పదార్థముయొక్క యేకదేశమునందు సంయోగము కలుగుచున్నది, అవయవము దేశ మనబడును, పరమాణువునకు అవయవరూపదేశము సంభవిం

చుట లేదు. సకలపరమాణువునందు సంయోగమును చెప్పినయెడల అవ్యాప్య వృత్తిత్వము సంయోగమునకు లేకపోవలయును. ఏకదేశమునందు ఉండి ఏకదేశమందు దుండనియెడల అది అవ్యాప్యవృత్తి యనంబడును. అందువలన పరమాణువుతో నేత్రమునకు సంయోగము లేదు. అది సంభవించుటయు లేదు. ఎట్లనగా పరమాణువుల సంయోగము లేనియెడల ద్వ్యణుకము పుట్టకపోయెడును. పరమాణువునందు మహత్త్వాత్యంతాభావమునకు చాక్షుషప్రత్యక్షము కలుగుచున్నది. అది కాక పోవలయును. పరమాణువునందు మహత్త్వాభావమునకు ప్రత్యక్షము కలుగుచున్న దను నియర్థము ఉత్తరత్ర స్పష్టమగును. అందువలన నేత్రసంయుక్త విశేషణతాసంబంధముచేత ఎట్లు పరమాణువునందు మహత్త్వాభావప్రత్యక్ష మగునో అట్లు నేత్రసంయుక్త విశేషణతాసంబంధముచేత పృథివీత్వాభావమునకును ప్రత్యక్షము కావలయును. నేత్రసంయుక్త పరమాణువునందు మహత్త్వాభావమువలె పృథివీత్వాభావమునకు విశేషణతాసంబంధము ఉన్నది. పరమాణువుయొక్క సంయోగము వ్యాప్యవృత్తియై యున్నది అని మంజూషయొక్క టీకయందు వ్రాయబడియున్నది. అందువలన జలపరమాణువునందు పృథివీత్వాత్యంతాభావముయొక్క ప్రత్యక్షసామగ్రి యుండుటవలన దానికిని ప్రత్యక్షము కావలయును. మఱియు వక్ష్యమాణరీతిగా జలపరమాణువునందు పృథివీత్వాత్యంతాభావమునకు ప్రత్యక్షము కలుగుట లేదు. ఈరీతిగా సకలాభావముయొక్క ప్రత్యక్షమునందు ఏకరూప మగు యోగ్యానుపలంభము సంభవించుట లేదు. మఱియు అన్యోన్యాభావాత్యంతాభావములయొక్క ప్రత్యక్షమునందు భిన్నభిన్నరూపసహిత యోగ్యానుపలంభము సహకారి యని చెప్పినప్పటికిని సంభవింపదు, అను నిశంకకు క్రింద వ్రాయబడిన సమాధాన మున్నది.

"యోగ్యే అనుపలంభః; యోగ్యానుపలంభః" అని సప్తమీసమాసమును చేసినయెడల అధికరణమందు ప్రత్యక్షయోగ్యము సిద్ధించును. అచ్చట యోగ్యానుపలంభము సిద్ధమై యున్నది. మఱియు "యోగ్యస్య అనుపలంభః; యోగ్యానుపలంభః" అని షష్ఠీసమాసమును చేసినయెడల ప్రతియోగియందు యోగ్యత్వ మున్నది. అచట యోగ్యానుపలంభము సిద్ధించుచున్నది. ఏకైక ప్రకారముగా యోగ్యానుపలంభమును అంగీకరించినయెడల దోషము చెప్పబడి యున్నది. ఈలాగుననే అన్యోన్యాభావముయొక్క ప్రత్యక్షమునందు అధికరణ యోగ్యత్వమునకు సాధక మగు సప్తమీసమాససహిత యోగ్యానుపలంభము

నంగీకరించి మఱియు నత్యంతాభావముయొక్క ప్రత్యక్షమునందు ప్రతియోగికి యోగ్యతాసాధక షష్ఠీసమాస సహిత యోగ్యానుపలంభము సహకారి యని యంగీకరించి యభావభేదముచేత రెంటికిని అంగీకార మున్నది. దానియందును దోషము చెప్పబడి యున్నది. అందువలన అన్యప్రకారముగా యోగ్యానుపలంభము సహకారియై యున్నది. యోగ్యానుపలంభ శబ్దమునందు సప్తమీసమాస షష్ఠీసమాసములు లేవు. "నీలో ఘటః" అను నీశబ్దమువలె ప్రథమాసమాస మున్నది. అది దిగువ నుదాహరింపబడినది. ఉ. 'నీల శ్చాసౌ ఘటో నీలఘటః' అను నిశబ్దమునందు ప్రథమాసమాస మున్నది. ఇది వ్యాకరణమందు కర్మధారయ మనబడును. ఎచ్చట కర్మధారయ సమాస మున్నదో అచ్చట పూర్వపదార్థమునకు ఉత్తరపదార్థముతో అభేదము ప్రతీత మగుచున్నది. ఉ. 'నిలఘటః' ఈశబ్దమందు కర్మధారయసమాసము చేసినప్పుడు నీల పదార్థమునకు ఘటపదార్థముతో అభేదము ప్రతీత మగుచున్నది. ఈలాగు ననే 'యోగ్య శ్చాసౌ అనుపలంభః యోగ్యానులంభః' ఈరీతిగా కర్మధారయ సమాసమును చేసినయెడల యోగ్యానుపలంభశబ్దముచేత యోగ్యపదార్థమునకు అనుపలంభపదార్థముతో అభేదము ప్రతీత మగుచున్నది. అందువలన అభావముయొక్క ప్రతియోగి అధికరణముకూడ యోగ్యము కావలసినది, అని చెప్పినయెడల దానియొక్క యోగ్యతవలన ప్రయోజనము లేదు. అనుపలంభమునందు యోగ్యత కావలసినది. ఎచ్చట ప్రతియోగియొక్క అనుపలంభము యోగ్యమై యున్నదో అభావముయొక్క ప్రత్యక్షము కలుగుచున్నది. ఎచ్చట ప్రతియోగియొక్క అనుపలంభ మయోగ్యమై యున్నదో అచ్చట భావముయొక్క ప్రత్యక్షము కలుగుట లేదు. అనుపలంభమందు యోగ్యత్వ మయోగ్యత్వము ద్విప్రకారమై యున్నవి. ఉపలంభాభావ మనుపలంభ మనబడును. ప్రతీతి, జ్ఞానము, ఉపలంభము ఇవి పర్యాయపదములై యున్నవి. ప్రతియోగిప్రతీతియొక్క యభావము అనుపలంభశబ్దార్థమై యున్నది. అందువలన ఇంద్రియముచేత ఘటాభావముయొక్క ప్రత్యక్షమునందు ఘటప్రతీత్యభావము సహకారియై యున్నది. అచ్చట ఘటాభావజ్ఞానము ప్రమారూపమై ఫలమై యున్నది ఘటజ్ఞానముయొక్క అభావము ఘటాభావప్రమకు సహకారి కారణమై యున్నది. ఆఘటజ్ఞానముయొక్క అభావము యోగ్యము కావలయును. ఘటజ్ఞానాభావమే ఘటానుపలంభ మనంబడును. ఆయభావరూపానుప

లంభమందు అన్యప్రకారముగా యోగ్యత సంభవించుట లేదు. మఱి యేమన్నగా ఏయనుపలంభముయొక్క యుపలంభరూపప్రతియోగి యోగ్యమై యున్నదో ఆ యనుపలంభము యోగ్య మనంబడును. ఏయనుపలంభముయొక్క ప్రతియోగి యగు నుపలంభము అయోగ్యమై యున్నదో ఆయనుపలంభ మయోగ్య మని చెప్పబడును. అందువలన నీయర్థము సిద్ధ మగుచున్నది. యోగ్యోపలంభము యొక్క యభావరూపయోగ్యానుపలంభము సహకారియై యున్నది. ఈరీతిగా అనుపలంభమునకు యోగ్యతను చెప్పుటవలన ఉపలంభమునందు యోగ్యత పర్యవసానమైనది; అందువలన ఉపలంభమందు యోగ్యత కావలసినది. యోగ్యోపలంభముయొక్క యభావము యోగ్యానుపలంభ మనంబడును. ఉపలంభము యొక్క యోగ్యతకు అనుపలంభమందు వ్యవహార మున్నది. యద్యపి ప్రథమము నందే యోగ్యోపలంభముయొక్క అభావము యోగ్యానుపలంభ మని చెప్పిన యెడల లాఘవ మున్నది. ఉపలంభరూపప్రతియోగిద్వారా అనుపలంభము యోగ్య మని చెప్పుట నిష్ఫలమై యున్నది. తథాపి వ్యాకరణమర్యాదచేత యోగ్యానుపలంభశబ్దమునకు అర్థమును చేసినప్పుడు అనుపలంభమునందు యోగ్యత ప్రతీత మగుచున్నది. అందువలన ఉపలంభవృత్తి ముఖ్యయోగ్యతకు అనుపలంభముతో ఆరోపము చెప్పబడి యున్నది. అందువలన ఈలాగు అర్థము సిద్ధమగుచున్నది. ఎచ్చట ప్రతియోగియొక్క యోగ్యోపలంభముయొక్క అభావ మున్నదో యచ్చట అభావముయొక్క ప్రత్యక్ష మున్నది. ఎచ్చట ప్రతియోగి యొక్క సత్తచేత ప్రతియోగ్యుపలంభసత్త యున్నదో ఆయుపలంభము యోగ్యమై యున్నది. దానియొక్క యభావము అనుపలంభ మనియు యోగ్య మనియు చెప్పబడును.

ఎచ్చట ప్రతియోగి యుండినను నియమముగా ప్రతియోగియొక్క యుపలంభము కలుగుట లేదో ఆయుపలంభ మయోగ్య మనబడును. దానియొక్క యభావము అనుపలంభ మైనను అయోగ్య మని చెప్పబడుచున్నది. ఎట్లు ఆలోకమునందు ఘటసత్త యుండినప్పుడు నియమముగా ఘటోపలంభము కలుగుచున్నదో అచ్చట ఘటోపలంభము యోగ్యమై యున్నది. దేనియొక్క అనుపలంభము యోగ్య మని చెప్పబడుచున్నదో అట్లు సంయోగసంబంధముచేత ఎచ్చట పిశాచ మున్నదో అచ్చట పిశాచసత్తవలన నియమముగా పిశాచోపలంభము గలుగుట లేదు. అందువలన పిశాచోపలంభ మయోగ్యమైయున్నది. దానియొక్క యభావము

పిశాచానుపలంభ మైనను అయోగ్య మనంబడును. ఈరీతిగా ఘటానుపలంభము యోగ్యమై యున్నది. అది ఘటాభావముయొక్క ప్రత్యక్షమునందు హేతువై యున్నది. మఱియు పిశాచానుపలంభము యోగ్యము కాదు. అందువలన పిశాచానుపలంభముచేత పిశాచాత్యంతాభావమునకు ప్రత్యక్షము కలుగుట లేదు. యద్యపి ఘటాభావాధికరణమునందు ఘటముయొక్క సత్త ఘటోపలంభముయొక్క సత్తయును సంభవించుట లేదు. తథాపి ఘట ఘటోపలంభములకు ఇట్లు ఆరోప మగుచున్నది. "యదా భూతలే ఘటస్స్యాత్ తదా ఘటోపలంభస్స్యాత్." అందువలన ఘటాభావాధికరణమునందును ఆరోపితఘటమునకు సత్తయు, ఘటానుపలంభ ముండినను ఆరోపిత ఘటోపలంభమునకు సత్తయు సంభవించుచున్నవి. అందువలన అర్థ మిట్లు నిష్కృష్ట మగుచున్నది. ఏయభావముయొక్క యధికరణమందు ప్రతియోగియొక్క యారోపణముచేసి ప్రతియోగియొక్క యుపలంభమునకు నియమముగా ఆరోప మున్నదో ఆయుపలంభము యోగ్య మనంబడును. దానియొక్క యభావమును యోగ్య మనంబడును. ఆయధికరణమందు ఆయభావము ప్రత్యక్షమై యున్నది. ఏయభావముయొక్క యధికరణమందు ఏయభావముయొక్క ప్రతియోగికి ఆరోపమును చేసి ఆప్రతియోగియొక్క యుపలంభమునకు ఆరోపములేదో ఆయభావము అప్రత్యక్షమై యున్నది. ఉ. అంధకారమందు ఘటాభావము ప్రత్యక్షముగా లేదు. ఎట్లనగా అంధకారమందు 'యద్యత్ర ఘటస్స్యాత్, తదా తస్యోపలంభస్స్యాత్' అని యీరీతిగా ఘటారోపముచేత ఘటోపలంభమునకు నియమముగా నారోపము సంభవించుట లేదు. అందువలన అంధకారమందు ఘటప్రత్యక్షము కలుగుట లేదు. స్తంభమందు పిశాచభేదము ప్రత్యక్షమై యున్నది. ఎట్లనగా "యది తాదాత్మ్యేన పిశాచః స్తంభే స్యాత్ తదుపలభ్యేత" ఈరీతిగా స్తంభవృత్తి తాదాత్మ్య సంబంధముచేత పిశాచముయొక్క ఆరోపమువలన పిశాచోపలంభముయొక్క ఆరోపము నియమముగా కలుగుచున్నది. ఎట్లనగా స్తంభమునందు తాదాత్మ్యసంబంధముచేత స్తంభ మున్నది. దానికి నియమముగా నుపలంభ మున్నది. ఈలాగుననే పిశాచము కూడ తాదాత్మ్యసంబంధముచేత స్తంభమునం దుండినయెడల స్తంభమువలె దానికిని నియమముగా నుపలంభము కావలయును. ఆయుపలంభమునకు అభావమువలన స్తంభమునందు తాదాత్మ్య సంబంధముచేత పిశాచము లేదు. అందువలన పిశాచమునకు స్తంభమునందు తాదా

త్మ్యసంబంధావచ్ఛిన్నాభావ మున్నది. తాదాత్మ్యసంబంధావచ్ఛిన్నాభావమే అన్యోన్యాభావ మనంబడును. మఱియు స్తంభమునందు సంయోగసంబంధావచ్ఛిన్నపిశాచాత్యంతాభావమును అదే ప్రకారముగా సమవాయసంబంధావచ్ఛిన్నపిశాచాత్యంతాభావమును ప్రత్యక్షము కావు. ఎట్లనగా, 'స్తంభే యది సంయోగేన పిశాచ స్స్యాత్ సమవాయేన వా పిశాచ స్స్యాత్ తదా తస్యోపలంభ స్స్యాత్' ఈరీతిగా సంయోగసంబంధముచేత లేక సమవాయసంబంధముచేత పిశాచమునకు స్తంభమందు ఆరోపము చేసి పిశాచోపలంభమునకు ఆరోపము కలుగుట లేదు. ఎట్లనగా ఎచ్చట శ్మశానవృక్షాదియందు సంయోగసంబంధముచేత పిశాచ మున్నదో మఱియు తనయొక్క అవయవమునందు సమవాయసంబంధముచేత పిశాచ మున్నదో అచ్చటను పిశాచోపలంభము కలుగుట లేదు. స్తంభమునందు సంయోగసంబంధముచేత లేక సమవాయ సంబంధముచేత ఏది యున్నదో ఆసమస్తమునకు నుపలంభము కలుగుచున్నది. స్తంభమునందు సంయోగసంబంధముచేత లేక సమవాయసంబంధముచేత పిశాచారోపమువలన పిశాచోపలంభమున కారోప మున్నది. మఱియు స్తంభమందు ద్వ్యణుకాదిసంయోగ మున్నది, మఱియు వాయుసంయోగ మున్నది. అందువలన ద్వ్యణుకవాయువు సంయోగసంబంధముచేత స్తంభవృత్తియై యున్నది. దాని కుపలంభము కలుగుట లేదు. మఱియు సమవాయసంబంధముచేత గురుత్వాదికము అప్రత్యక్షగుణమై యున్నది. దానికి స్తంభమునం దుపలంభము కలుగుట లేదు. అందువలన స్తంభమునందు సంయోగసంబంధముచేత లేక సమవాయసంబంధముచేత పిశాచారోపమువలన దానియొక్క యుపలంభమునకు ఆరోపము కలుగుట లేదు. అందువలన స్తంభమునందు సంయోగసంబంధావచ్ఛిన్న పిశాచాత్యంతాభావము సమవాయ సంబంధావచ్ఛిన్నపిశాచాత్యంతాభావము అప్రత్యక్షములై యున్నవి. యద్యపి ఎచ్చట తాదాత్మ్యసంబంధముచేత పిశాచ మున్నదో అచ్చట పిశాచమునకు నియమముగా నుపలంభము కలుగుట లేదు. ఎట్లనగా తాదాత్మ్యసంబంధముచేత పిశాచమునందు పిశాచ మున్నది. ఉపలంభము కలుగుట లేదు. అందువలన తాదాత్మ్యసంబంధముచేత పిశాచము ఆరోపిత మైనను నియమముగా పిశాచోపలంభముయొక్క ఆరోపము సంభవించుట లేదు. అత్యంతాభావముయొక్క రీతిగానే అన్యోన్యాభావమునందు నిదే క్రమ మున్నది. తథాపి

అన్యప్రకారముగా భేద మున్నది. స్తంభమునందు తాదాత్మ్యసంబంధముచేత నేది యున్నదో దానికి నియమముగా ఉపలంభము కలుగుచున్నది. స్తంభమునందు తాదాత్మ్యసంబంధముచేత స్తంభ మున్నది కాని తదితరము లేదు. మఱియు, స్తంభమునకు నియమముగా ఉపలంభము కలుగుచున్నది. మఱియు నితరపదార్థం బేదైనను స్తంభమునందు తాదాత్మ్యసంబంధముచేత నుండునెడల స్తంభమువలె దానికిని ఉపలంభము కలుగవలయును. అందువలన తాదాత్మ్యసంబంధముచేత స్తంభమునందు పిశాచారోపముచేత దానియొక్క యుపలంభమునకు నియమముగా ఆరోప మున్నది. 'యది తాదాత్మ్యేన పిశాచః స్తంభస్స్యాత్ తదా తస్య స్తంభస్యైవ ఉపలంభ స్స్యాత్' అనువిధముగా స్తంభమునందు తాదాత్మ్యముచేత పిశాచముయొక్క యారోప ముండుటవలన పిశాచోపలంభముయొక్క యారోప మున్నది. అందుచేత స్తంభమునందు పిశాచభేదము ప్రత్యక్షము. ఆ స్తంభమునందు పిశాచవద్భేదము అప్రత్యక్షమై యున్నది. ఎట్లన: 'యది తాదాత్మ్యేన స్తంభః పిశాచవాన్ స్యాత్ తదా పిశాచవత్త్వేన స్తంభస్య ఉపలంభ స్స్యాత్' అనువిధమున స్తంభమునందు తాదాత్మ్యముచేత 'పిశాచవంతము' యొక్క ఆరోపముచేత పిశాచవదుపలంభమునకు ఆరోపము సంభవింపదు. ఎట్లనగా పిశాచవద్వృక్షాదికమునందు పిశాచవత్త్వముయొక్క యుపలంభము కలుగుట లేదు. అందువలన స్తంభమునందు పిశాచవత్త్వముయొక్క భేదము అప్రత్యక్షమై యున్నది, పిశాచముయొక్క భేదమువలె ప్రత్యక్షము కాదు ఈవిధముగా బుద్ధిమంతు డనుభవముచేత నెఱుగవలయును. ప్రతియోగియొక్క యుపలంభమునకు ఆరోప మెచ్చట సంభవించుచున్నదో అచ్చట అభావప్రత్యక్షము కలుగుచున్నది.

88. ఉపలంభమునకు ఆరోపము కాని అనారోపము కాని యుండిన యెడల అభావమునకు ప్రత్యక్షమునందు గాని అప్రత్యక్షత్వమునందు గాని ఉదాహరణము.

ఈప్రకారమే 'యది సుఖం దుఃఖం వా స్యాత్ తదా సుఖస్య చ దుఃఖస్య చ ఉపలంభ స్స్యాత్' అనువిధముగా ఆత్మయందు సుఖదుఃఖముల యారోపముచేత వాని యుపలంభమునకు నియమముగా అరోప మున్నది. ఎట్లనగా, అజ్ఞాత సుఖదుఃఖము లుండవు; కాని జ్ఞాతములై యుండును. అందువలన సుఖదుఃఖములకు ఆరోపమై వానియొక్కయుపలంభమునకు నియమముగా ఆరోపము కలుగు

చున్నది. అందువలన ఆత్మవృత్తి సుఖాభావదుఃఖాభావములు ప్రత్యక్షములై యున్నవి. మఱియు, 'ఆత్మని ధర్మో యది స్యాత్ అధర్మో వా స్యాత్ తదా తస్య ఉపలంభ స్స్యాత్' అనునట్లు ధర్మాధర్మములయొక్క యారోపమువలన వానియొక్క ఉపలంభమునకు ఆరోపము కలుగుట లేదు. ఎట్లనగా ప్రత్యక్షజ్ఞానము ఉపలంభ మనబడును. యద్యపిజ్ఞానము ప్రతీతి ఉపలంభము అనునవి పర్యాయశబ్దములై యున్నవి. అందువలన జ్ఞానమాత్రమునకు ఉపలంభ మని పేరు. తథాపి యీ ప్రసంగమందు ఏయింద్రియముతో అభావప్రత్యక్షము కలుగుచున్నదో ఆ యింద్రియ జన్యజ్ఞానమునకు ఉపలంభశబ్దముతో గ్రహింపవలయును. ఉదాహరణము: సుఖాభావమునకు మనస్సుచేత ప్రత్యక్షము కలుగును. అచట సుఖముయొక్క యారోపముచేత సుఖోపలంభమునకు ఆరోపము(అనగా మానస ప్రత్యక్షముయొక్క యారోపము) ఉన్నది. ఇట్లే వాయువునందు రూపాభావముయొక్క చాక్షుషప్రత్యక్ష మున్నది. అచటరూపముయొక్క యారోపముచేత దానియొక్క యుపలంభముయొక్క యారోపము అనగా చాక్షుషప్రత్యక్షముయొక్క యారోప మున్నది. ఈవిధముగానే అన్యేంద్రియముతో అభావప్రత్యక్ష మెచ్చట నగునో అచ్చట అన్యేంద్రియ జన్యప్రత్యక్షమే ఉపలంభశబ్దముయొక్క యర్థముగా నెఱుగవలయును. ధర్మాధర్మములు కేవల శాస్త్రవేద్యములై యున్నవి. వానియొక్క యుపలంభము ఇంద్రియ జన్యజ్ఞాన మెప్పుడును కాదు. అందువలన ధర్మాధర్మములయొక్క యారోపముచేత వానియొక్క యుపలంభమునకు ఆరోపము కలుగుటలేదు. అందువలన ధర్మాభావాధర్మాభావములు ప్రత్యక్షములు కావు. ఈవిధముగానే వాయువునందు గురుత్వాత్యంతాభావము ప్రత్యక్షము కాదు. మఱియు వాయువునందు రూపాత్యంతాభావము ప్రత్యక్షమై యున్నది ఎట్లనగా: వాయువునందు గురుత్వ మున్నయెడల దానికి ఉపలంభము కావలయును. ఈరీతిగా గురుత్వారోపమువలన గురుత్వోపలంభమున కారోపము కలుగదు. ఎట్లన: ఎచ్చట పృథివీజలములందు గురుత్వ మున్నదో అచ్చటను గురుత్వమునకు ప్రత్యక్షరూపోపలంభము కలుగదు. ఇంకేమనగా: గురుత్వముయొక్క అనుమితిజ్ఞానము కలుగుచున్నది.అందువలన గురుత్వముయొక్క యారోపముచేత ఉపలంభముయొక్క ఆరోపము లేదు. ఈకారణముచేత వాయువునందు గురుత్వాభావము ప్రత్యక్షము కాదు. వాయువునందు రూప ముండినయెడల ఘటరూపమువలె వాయురూపమున కుపలంభము కావలయును. కేవలరూపమునకే ఉపలంభము లేదు. వాయువునకు నుప

లంభము కావలయును. ఎట్లన ఏద్రవ్యమునందు మహత్త్వగుణము ఉద్భూతరూప ము కూడ నున్నవో ఆద్రవ్యము ప్రత్యక్షమై యున్నది. ఏద్రవ్యమునందు మహత్త్వ ముండినదో దానిరూపము ప్రత్యక్షమై యున్నది. పరమాణుద్వ్యణుకమునందు మహత్త్వము లేదు. దానియొక్క రూపము ప్రత్యక్షము కాదు. అణుకాదిరూప వాయువునందు మహత్త్వ మున్నది. దానియందు రూప ముండినయెడల త్ర్యణు కాది రూపవాయువుయొక్క ప్రత్యక్షము కలుగును. దానియొక్క రూపము ప్రత్య క్షము కావలయును. ఈరీతిగా పరమాణుద్వ్యణుకరూపవాయువును త్యజించి త్ర్యణుకాదివాయువునందు రూపారోపమువలన రూపోపలంభమునకు ఆరో పము గలుగుచున్నది. అందువలన త్ర్యణుకాది రూపవాయువునందు రూపాభా వము ప్రత్యక్షమై యున్నది. పరమాణుద్వ్యణుకరూపవాయువునందు రూపము యొక్క ఆరోప ముండినను మహత్త్వము లేనందున రూపోపలంభమునకు ఆరోపము లేనందున పరమాణువ్వ్యణుకవాయువునందు రూపాభావము ప్రత్య క్షము కాదు. ఈలాగుననే జలపరమాణువునందు పృథివీత్వాభావము ప్రత్యక్షము కాదు. ఎట్లన జలపరమాణువునందు పృథివీత్వ ముండినయెడల దానికి ఉపలంభ మయ్యెడిని. ఈరీతిగా పృథివీత్వముయొక్క యారోపముచేత పృథివీత్వోపలంభ మునకు ఆరోపము కలుగుట లేదు. ఎట్లనగా ఆశ్రయము ప్రత్యక్ష మైనయెడల జాతికి ప్రత్యక్షము గలుగుచున్నది. అందువలన జలపరమాణువునందు జలత్వ మున్నది. ఎట్లు జలత్వమునకు ప్రత్యక్షము లేదో అట్లు ఆరోపితపృథివీత్వము యొక్క యుపలంభమునకు ఆరోపము సంభవించుట లేదు. అందువలన జలపర మాణువునందు పృథివీత్వాభావము ప్రత్యక్షము కాదు, మఱియు పరమాణువు నందు మహత్త్వాభావము ప్రత్యక్షమై యున్నది. ఎట్లనగా పరమాణువునందు చాక్షుషప్రత్యక్షసామగ్రి ఉద్భూతరూపమై యున్నది. త్వాచప్రత్యక్షమునకు సామగ్రి ఉద్భూతస్పర్శమై యున్నది, అయిన మహత్త్వము కాదు. అందు వలన పరమాణువులయొక్క ప్రత్యక్షము లేదు. పరమాణువుయొక్క ప్రత్యక్ష యోగ్యరూపాదిగుణమునకు మహత్త్వాభావమువలన ప్రత్యక్షము కానేరదు. మహత్త్వ సహితద్రవ్యముయొక్క రూపాదిగుణము ప్రత్యక్షమై యున్నది. పరమాణువునందు మహత్త్వ ముండినయెడల పరమాణువు ప్రత్యక్షమై యుండును. పరమాణువుయొక్క ప్రత్యక్షయోగ్యగుణమునకును ప్రత్యక్షము కావల యును. ఘటాదికముయొక్క మహత్త్వము ప్రత్యక్షమై యున్నది. అందువలన

రూపాదికమువలె మహత్త్వగుణము ప్రత్యక్షయోగ్యమై యున్నది. ఆకాశాది కమునందు మహత్త్వ మయిననో ఉన్నది, అయినను ఉద్భూతరూప సమానాధికర ణ మహత్త్వముయొక్క ప్రత్యక్షము గలుగుచున్నది. ఆకాశాదికమునందు ఉద్భూ తరూపము లేదు. అందువలన దానియొక్క మహత్త్వముయొక్క ప్రత్యక్షము గలుగుటలేదు. తథాపి మహత్త్వగుణము ప్రత్యక్షయోగ్యమై యున్నది. ఈ రీతిగా పరమాణువునందు మహత్త్వము వినా ప్రత్యక్షముయొక్కయన్యసామగ్రి లేదు. మహత్త్వ ముండినయెడల పరమాణువు దానియొక్క గుణములకు ప్రత్యక్షము కావలయును. అందువలన పరమాణువునందు మహత్త్వారోపము చేత దానియొక్క యుపలంభమునకు ఆరోపము సంభవించుచున్నది. మహత్త్వా రోపముచేత కేవల మహత్త్వోపలంభమునకు ఆరోపము సంభవించుట లేదు. ఇక నే మనగా పరమాణువుయొక్క యుపలంభమునకును పరమాణు సమవేత ప్రత్యక్షయోగ్యగుణాదికముయొక్క యుపలంభమునకు ఆరోప మున్నది. పర మాణువునందు మహత్త్వ మున్నయెడల ఆపరమాణువునకు ఉపలంభ మయ్యెడిని. మఱియు పరమాణువునందు సమవేత ప్రత్యక్ష యోగ్యగుణమునకు ఉపలంభ ము కావలయును. మఱియు ప్రత్యక్షయోగ్యజాతికిని ప్రత్యక్షయోగ్యక్రియకును ఉపలంభము కావలయును. ఆపరమాణ్వాదికమునకు ఉపలంభము లేనందున పర మాణువునందు మహత్త్వము లేదు. ఈరీతిగా పరమాణువునందు మహత్త్వా భావప్రత్యక్ష మున్నది. ఈరీతిగా ఏయధికరణమందు ఏ యభావముయొక్క ప్రతియోగియొక్క యారోపమువలన ఉపలంభారోప మున్నదో ఆయధికరణము నందు ఆయభావము ప్రత్యక్షమై యున్నది.

89. ఏ ఇంద్రియముచేత నుపలంభారోపము గలిగినదో అయింద్రియము చేత నుపలంభారోపమువలన నభావప్రత్యక్షము గలుగును.

ఏయింద్రియజన్యోపలంభమునకు నారోప మున్నదో ఆ యింద్రియముచేత నభావప్రత్యక్ష మగుచున్నది. ఉ. భూతలమునందు ఘట మున్నయెడల నేత్ర ముతో ఘటోపలంభము కావలసియున్నది. ఉపలంభమో కలుగుట లేదు, అందువలన ఘటము లేదు. ఈరీతిగా నెచ్చట నేత్రజన్యోపలంభమున కారోప మున్నదో అచ్చట ఘటాభావవిషయమునకు చాక్షుష ప్రత్యక్ష మున్నది. భూత లమునందు ఘట మున్నయెడల త్వగింద్రియముచేత ఘటోపలంభ మగును, ఈరీ తిగా నంధునికి లేక అంధకారమునందు త్వగింద్రియజన్యోపలంభారోప మున్నదో

అప్పుడు ఘటాభావవిషయకత్వాచప్రత్యక్షము కలుగుచున్నది. ఈరీతిగానే యింద్రియముయొక్క యుపలంభమున కారోప మున్నదో ఆయింద్రియముతో నభావప్రత్యక్షము కలుగుచున్నది. వాయువునందు రూపాభావవిషయకచాక్షుష ప్రత్యక్ష మున్నది, త్వాచప్రత్యక్షము లేదు. ఎట్లనగా వాయువునందు రూప మున్న యెడల రూపమునకు నేత్రేంద్రియజన్యోపలంభ మగును. అయినను దానియుపలంభము లేదు. అందువలన వాయువునందు రూపము లేదు. ఈరీతిగా నేత్రేంద్రియ జన్యరూపోపలంభమున కారోప మున్నది. వాయువునందు రూప ముండినయెడల త్వగింద్రియముచేత దానియొక్క యుపలంభ మగును. ఈరీతిగా త్వగింద్రియజన్య రూపోపలంభముయొక్క యారోపము కలుగుట లేదు. ఎట్లనగా, రూపసాక్షాత్కారమునకు కేవలనేత్రమే హేతువై యున్నది, త్వక్కు కాదు. రసనాదీంద్రియజన్యరూపోపలంభమునకు నారోపము కూడ కలుగుట లేదు. అందువలన రూపాభావమునకు చాక్షుష ప్రత్యక్షమే యున్నది. మధురద్రవ్యమునందు తిక్తరసాభావముయొక్క రాసనప్రత్యక్షమే యున్నది. చక్కెరయందు తిక్తరస మున్న యెడల దానికి రసనేంద్రియముతో నుపలంభ మగును. అయిన నట్టియుపలంభము లేదు; అందువలన శర్కరయందు తిక్తరసము లేదు. ఈరీతిగా శర్కరయందు తిక్తరసారోపమువలన రసనాజన్యతిక్తరసోపలంభమునకు నారోప మున్నది. అన్యేంద్రియ జన్యోపలంభమునకు ఆరోపము లేదు. అందువలన రసాభావప్రత్యక్షము రసనేంద్రియజన్య మయియే యున్నది. ఈరీతిగానే స్పర్శాభావప్రత్యక్షము త్వగింద్రియజన్యమైయే యున్నది. ఎట్లనగా, అగ్నియందు శీతస్పర్శ ముండినయెడల దానికి త్వగింద్రియముతో నుపలంభ మగును. అయిన నగ్నియందు శీతస్పర్శమునకు త్వగింద్రియముతో నుపలంభము లేదు. ఈరీతిగా నగ్నియందు శీతస్పర్శారోపమువలన త్వగింద్రియజన్యోపలంభమున కారోప మున్నది. అందువలన స్పర్శాభావప్రత్యక్షము కేవలత్వగింద్రియజన్యమై యున్నది. ఈరీతిగానే పరమాణువునందు మహత్త్వాభావమునకు చాక్షుషప్రత్యక్షమే యున్నది. ఎట్లనగా పరమాణువుకంటె భిన్నము మహత్త్వమై యున్నది. మఱియును పరమాణు గుణముయొక్క జ్ఞానము చక్షుస్సుచేతను త్వగింద్రియముచేతను కలుగుచున్నది. ఇది యనుభవసిద్ధమై యున్నది. ఘటముయొక్క యల్పత్వ మహత్త్వములను నేత్రేంద్రియత్వగింద్రియములచేతనే తెలియవలయును. అందువలన రెండింద్రియములకును మహత్త్వము విషయమై యున్నది.

తథాపి, అపకృష్టతమ మహత్త్వమునకు త్వగింద్రియముచేత జ్ఞానము గలిగిన యెడల త్ర్యణుకగతమహత్త్వమునకు త్వగింద్రియముచేత జ్ఞానము కావలయును. అందువలన నపకృష్టతమ మహత్త్వమునకు కేవలనేత్రేంద్రియముచేత జ్ఞానము కలుగుచున్నది. పరమాణువునందును నపకృష్టతమ మహత్త్వముయొక్కయే యారోపము కావలయును. ఆయపకృష్టతమ మహత్త్వముయొక్క త్వాచప్రత్యక్షము కలుగుట లేదు. చాక్షుషప్రత్యక్షము కలుగుచున్నది. అందువలన పరమాణువునందు మహత్త్వారోపమువలన నేత్రజన్యోపలంభమున కే ఆరోప ముండుటవలన పరమాణువునందు మహత్త్వాభావముయొక్క చాక్షుషప్రత్యక్షము కలుగుచున్నది, త్వాచప్రత్యక్షము కలుగుట లేదు. పరమాణువునందు మహత్త్వ ముండినయెడల త్ర్యణుకమహత్త్వమువలె నేత్రముచేత దాని కుపలంభము కావలయును ఈరీతిగా చాక్షుషోపలంభమున కారోప మున్నది, త్వాచోపలంభమునకు లేదు. ఆత్మయందు సుఖాభావాదివిషయక మానసప్రత్యక్షమే యగున్నది. ఎట్లనగా, ఆత్మయందు సుఖ ముండినయెడల మనస్సుచేత సుఖమున కుపలంభము కావలయును. ఈకాలమునందు సుఖోపలంభము కలుగుట లేదు. అందువలన నీకాలమునందు నాయందు సుఖము లేదు. ఈరీతిగా నాత్మయందు సుఖారోపముచేత దానియొక్క మానసోపలంభమున కారోప మున్నది. అందువలన సుఖాభావవిషయక మానసప్రత్యక్ష మున్నది. ఈరీతిగానే దుఃఖాభావేచ్ఛాభావ ద్వేషాభావములకును మానసప్రత్యక్ష మున్నది అయిన తనసుఖాదికముయొక్క యభావము ప్రత్యక్ష మగుచున్నది. పరసుఖాదికము యొక్క యభావము ప్రత్యక్ష మగుట లేదు. ఇక నేమనగా, శబ్దాదికముచేత దానియొక్క పరోక్షజ్ఞానము కలుగుచున్నది. ఎట్లనగా, నొకనికి సుఖాదిక ముండినను దానియొక్క యుపలంభ మితరునికి కలుగుటలేదు. అందువలన నితరునియందు సుఖ మున్నయెడల నాకు నుపలంభము కావలయును,అని యీరీతిగా నన్యవృత్తి సుఖాదికముయొక్క యుపలంభారోపము తనకు కలుగుట లేదు. అందువలన నన్యవృత్తి సుఖాదికముయొక్క యభావము ప్రత్యక్షము కాదు. ఈరీతిగా ప్రతియోగియొక్క యారోపమువలన నెచ్చట నుపలంభారోప మున్నదో ఆయభావము ప్రత్యక్ష మగుచున్నది. ఇట్లు ఉపలంభాభావరూపానుపలంభము యోగ్యానుపలంభ మనంబడును. అందువలన ప్రతియోగియొక్క యారోపమువలన ఏయుపలంభారోప మున్నదో ఆ యుపలంభము దేనికి ప్రతియోగియై యున్నదో అది యోగ్యానుపలంభ మనంబడును.

య్యాయర్థమునందు ఏదోషము లేదు. ఈరీతిగా నేయధికరణమునందు నేపదార్థమునకు నింద్రియజన్యారోపితోపలంభము సంభవించుచున్నదో ఆయధికరణమునందు దానియొక్క యభావము ప్రత్యక్ష మగుచున్నది. పిశాచముయొక్క యొక్క భేదము స్తంభమునందు ప్రత్యక్షమై యున్నది. పరమాణువునందు అప్రత్యక్షమై యున్నది. అందువలన నేయధికరణమునందు ఏపదార్థమునకు నింద్రియజన్యారోపితోపలంభము సంభవించుచున్నదో దానియొక్క యభావము ప్రత్యక్షముగాఁ జెప్పబడుచున్నది పిశాచముయొక్క ఇంద్రియజన్యారోపితము కూడ స్తంభమునం దున్నది. పరమాణువునందును పిశాచముయొక్క భేదము ప్రత్యక్షము కావలయును. అందువలన నధికరణశబ్దము వక్కాణించి చెప్పబడినది. స్తంభమునందు ఉపలంభముయొక్క యారోప మున్నది. స్తంభమునందే పిశాచభేదము ప్రత్యక్ష మగుచున్నది. పరమాణువునందు తాదాత్మ్య సంబంధముచేత పిశాచ ముండినను పరమాణువువలె దానియొక్క యుపలంభము సంభవించుట లేదు. అందువలన పరమాణువునందు పిశాచభేదము ప్రత్యక్షము కాదు. మఱియు నేపదార్థమునకు అని చెప్పుటవలన వాయువునందు రూపాత్యంతాభావమువలె గురుత్వాత్యంతాభావము ప్రత్యక్షము కాదు. ఏయధికరణమునందు నింద్రియజన్యారోపితోపలంభము సంభవించుచున్నదో ఆయధికరణమునందు నభావప్రత్యక్ష మున్నది, అని ఇంతమాత్రము చెప్పినయెడల వాయురూపాధికరణమునందు రూపముయొక్క యింద్రియజన్యారోపితోపలంభము సంభవించుచున్నది, గురుత్వాభావము కూడ ప్రత్యక్షము కావలయును. అందువలన నేపదార్థముయొక్క యుపలంభము సంభవించుచున్నదో దానియొక్క యభావము ప్రత్యక్షమగుచున్న దని చెప్పబడియున్నది. అందువలన రూపముయొక్క ఆరోపితోపలంభముచేత వాయువునందు గురుత్వాభావము ప్రత్యక్షము కాదు. ఈరీతిగా నెచ్చట ప్రతియోగియొక్క యేయింద్రియజన్యారోపితోపలంభ మున్నదో ఆ యింద్రియముచేత నభావముయొక్క ప్రత్యక్షము గలుగుచున్నది. మఱియు నెచ్చట నుక్తరీతిగా నుపలంభము సంభవించుట లేదో అచ్చట నభావముయొక్క పరోక్షజ్ఞానము గలుగుచున్న దనునది నైయాయికమతమై యున్నది. ఉక్తరీతిగా న్యాయమతమునందు నభావప్రత్యక్షమునుగూర్చి ఇంద్రియము కరణమై యున్నది. ఇంద్రియమునందు విశేషణతయు, ఇంద్రియసంబద్ధవిశేషణతయు, అభావేంద్రియములకు సంబంధమై యున్నది. అది వ్యాపారమై యున్నది.

అభావప్రత్యక్షప్రమ ఫలమై యున్నది, యోగ్యానుపలంభము ఇంద్రియమునకు సహకారికారణమై యున్నది గాని కరణము కాదు.

90. న్యాయమతమునందు సామగ్రీసహితాభావ ప్రమానిరూపణము.

ఎట్లు ఘటాదికముయొక్క చాక్షుషప్రత్యక్షమునందు ఆలోకసంయోగము సహకారికారణమై నేత్రేంద్రియము కరణమై యున్నదో అట్లు అభావప్రత్యక్షమునందును యోగ్యానుపలంభము సహకారియై యున్నది. అభావప్రమయొక్క చాక్షుషప్రత్యక్షమునందు ఎప్పటికిని ఆలోకసంయోగము సహకారి కాదు. యద్యపి అంధకారమునందు ఘటాభావమునందు త్వాచప్రత్యక్షము గలుగుచున్నది. చాక్షుషప్రత్యక్షము గలుగుట లేదు. ఆలోకమునందు ఉండునట్టి ఘటాభావవిషయక చాక్షుషప్రత్యక్షము కలుగుచున్నది. అందువలన అభావముయొక్క చాక్షుషప్రత్యక్షమునందు అన్వయ వ్యతిరేకముచేత ఆలోకసంయోగమును సహకారిగా జెప్పవలసినది. తథాపి ఘటమునందు కులాలజనకునివలె అభావముయొక్క చాక్షుషప్రత్యక్షమునందు ఆలోకసంయోగము అన్యథా సిద్ధమై యున్నది. ఎట్లు ఘటకారణ మగు కులాలసిద్ధిచేత కులాలజనకుడు కారణసామగ్రితో బాహ్యుడై యున్నాడో ఘటకారణము కాడు అని కూడ చెప్పబడియున్నాడో అయినను ఘటకారణమునకు కారణమై యున్నాడో అట్లు అభావప్రత్యక్షమునకు సహకారి కారణము యోగ్యానుపలంభమై యున్నది. దానిసిద్ధికొఱకు అభావప్రత్యక్షముయొక్క కారణసామగ్రి కంటెను ఆలోకసంయోగము బాహ్యమై యున్నది. ఎట్లనగా, అనుపలంభమునకు ప్రతియోగియగు నేయుపలంభ మున్నదో దానికి నెచ్చట నారోపము సంభవించుచున్నదో ఆ యనుపలంభము యోగ్య మనంబడును. ఘటముయొక్క చాక్షుషోపలంభమునకు ఆరోపము ఆలోకమునందు గలుగుచున్నది. అంధకారమునందు చాక్షుషోపలంభముయొక్క ఆరోపము కలుగుట లేదు. అందువలన ఘటాభావముయొక్క చాక్షుషప్రత్యక్షమునకు సహకారి కారణ మగు నే యోగ్యానుపలంభ మున్నదో దానికి సాధకము ఆలోకమై యున్నది. ఘటాభావముయొక్క చాక్షుషప్రత్యక్షమునకు సాక్షాత్కారణము కాదు. అందువలన కారణసామగ్రికి బాహ్యమై యున్నది. అందువలన కులాలజనకునివలె అన్యథాసిద్ధమై యున్నది. ఎట్లు కులాలజనకుడు ఘటమునకు కారణముకాడో అట్లు ఆలోకసంయోగము కూడ అభావముయొక్క చాక్షుషప్రత్యక్షమునకు కారణము

కాదు. ఇక నేమనగా, చాక్షుష ప్రత్యక్షమునకు కారణ మగు నేయోగ్యానుప లంభ మున్నదో దానికి ఉక్తరీతిగా సాధకమై యున్నది.

మఱియును ప్రాచీనగ్రంథమునందైననో యోగ్యానుపలంభము యీదిగువ నుదాహరించిన ప్రకారముగా వ్రాయంబడియున్నది. ఎచ్చట ప్రతియోగి లేక యే ప్రతియోగ్యుపలంభముయొక్క సకలసామగ్రియును ఉండి, ఉపలంభము కలుగుటలేదో అచ్చట యోగ్యానుపలంభ మున్నది. ఉదాహరణము. ఆలోక మునందు ఘటము లేనప్పుడు యోగ్యానుపలంభ మున్నది. ఎట్లనగా, ఘటాభా వమునకు ప్రతియోగి యగు ఘటము లేదు. దానిని వదలి ఆలోకసంయోగము, ద్రష్టయొక్క నేత్రము కూడ ఘటముయొక్క చాక్షుషోపలంభమునకు సామగ్రి యై యుండుటవలన యోగ్యానుపలంభ మున్నది. మఱియును అంధకారమునందు ఎచ్చట ఘటము లేదో అచ్చట యోగ్యానుపలంభము కాదు. ఎట్లనగా, ప్రతి యోగియొక్క చాక్షుషోపలంభముయొక్క సామగ్రిలో ఆలోకసంయోగ యున్నది దానియొక్క యభావము ఉన్నది. ఇట్లు స్తంభమునందు తాదాత్మ్య సంబంధముచేత ఏది యున్నదో దానియొక్క యుపలంభమునకు స్తంభవృత్తి ఉద్భూతరూపమును, మహత్త్వమును, సామగ్రియై యున్నవి. అందువలన స్తంభమునందు తాదాత్మ్యసంబంధముచేత పిశాచముయొక్క అనుపలంభము యోగ్యమై యున్నది. మఱియును, సంయోగసంబంధముచేత ఏది స్తంభవృత్తి యై యున్నదో దానియొక్క యుపలంభ సామగ్రి స్తంభమునందుండెడి యుద్భూ తరూపము, మహత్త్వమును కావు, మఱియు నేమనగా, సంయోగసంబంధము చేత వృత్తియగు పదార్థమునందుండెడి యుద్భూతరూపము, మహత్త్వమును కావలసినది. అది పిశాచమునందు లేదు అందువలన సంయోగసంబంధావచ్ఛిన్న పిశాచాత్యంతాభావమునకు ప్రతియోగి యగు నేపిశాచ మున్నదో దానియొక్క యుపలంభమునకు సామగ్రి యగు పిశాచవృత్తి ఉద్భూతరూపముయొక్క అభా వమువలన సంయోగసంబంధముచేత పిశాచముయొక్క అనుపలంభము యోగ్యము కాదు. ఈరీతిగా ప్రతియోగి లేక యేప్రతియోగియొక్క యుపలం భముయొక్క సకలసామగ్రియుండి ఉపలంభము మాత్రము కలుగుటలేదో ఆ యోగ్యానుపలంభము అభావప్రత్యక్షమునకు సహకారి కారణమై యున్నది. ఈరీతిగా నెచ్చట యోగ్యానుపలంభము, ఇంద్రియమునకు అభావముతో సంబం ధమును కూడ నున్నదో అచ్చట నింద్రియజన్య ప్రత్యక్షప్రమ అభావమునకు

కలుగుచున్నది. ఎచ్చట యోగ్యానుపలంభము లేదో అచ్చట అభావ ప్రత్యక్ష జ్ఞానము కలుగుట లేదు. ఇక నేమనగా, అనుమానాదికమువలన పరోక్షజ్ఞానము కలుగుచున్నది. నైయాయిక రీతిగా అభావప్రత్యక్షమునందు యోగ్యానుపలంభము సహకారియై యున్నది. ఇంద్రియము కరణమై యున్నది.

91. భట్టవేదాంత మతములయందు న్యాయమతముకంటె అభావప్రమా సామగ్రియందుండు విలక్షణత్వము.

భట్టమతమునందును అద్వైతమతమునందును యోగ్యానుపలంభమే కరణమై యున్నది. అభావజ్ఞానమునందు ఇంద్రియమునకు కరణత్వము లేదు. అందువలన అనుపలబ్ధి నామక భిన్నప్రమాణము భట్టమతమునం దంగీకరింపబడి యున్నది. భట్టమతానుసారిగానే అద్వైతగ్రంథమునందును అభావ ప్రత్యక్షమునకు హేతువు అనుపలబ్ధినామక భిన్నప్రమాణమే వ్రాయఁబడియున్నది. అనుపలంభమే అనుపలబ్ధి యనంబడును. ఎట్లు యోగ్యానుపలంభము నైయాయికునిచేత సహకారిగా నంగీకరింపబడియున్నదో అట్లు యోగ్యానుపలంభము భట్టమతమునందును అద్వైతమతమునందును ప్రమాణమై యున్నది. నైయాయికమతమునందు అభావప్రత్యక్షమునకు కారణము (1) ఇంద్రియము (2) యోగ్యానుపలంభము, ఈరెండునై యున్నవి. వీనిలో నింద్రియము కరణమై యున్నది. అందువలన అభావప్రమయందు యోగ్యానుపలంభము ప్రమాణమై యున్నది. అనుపలంభమునకు అభావప్రమనుగూర్చి సహకారికారణత్వ మంగీకరింపబడియున్నది, కరణత్వ మంగీకరింపఁబడలేదు అందువలన అనుపలంభము ప్రమాణము కాదు. మఱియును భట్టాదిమతములయందు అనుపలబ్ధియే ప్రమాణమై యున్నది. యద్యపి (విచారింపగా) అభావప్రమయొక్క ఉత్పత్తియందు అనుపలబ్ధికి ఏవ్యాపారము సంభవించుట లేదు, వ్యాపారసహిత మగు నేప్రమాకారణ మున్నదో అది ప్రమాణమనంబడును, అందువలన అనుపలబ్ధికి ప్రమాణత్వము సంభవించుటలేదు. తథాపి వ్యాపారసహిత ప్రమయొక్క కారణమునకే ప్రమాణత్వ మున్నది, అను నీ నియమము గూడ నైయాయికమతమునం దున్నది. భట్టాదిమతమునందైన సకలప్రమాణములకును భిన్నభిన్న లక్షణము లున్నవి. కొన్నిలక్షణములయందు వ్యాపారమునకు ప్రవేశ మున్నది. కొన్నిప్రమాణముల లక్షణమునందు వ్యాపారమునకు ప్రవేశము లేదు. ఉ. ప్రత్యక్షప్రమకు వ్యాపారసహితాసాధారణకారణము ప్రత్యక్షప్రమాణ మనంబడును, అనుమితిప్రమకు వ్యాపార

రిసహితాసాధారణ కారణము అనుమాన మనంబడును. శాబ్దప్రమకు వ్యాపార సహిత సాధారణకారణము శబ్దప్రమాణ మనంబడును. ఈరీతిగా మూడుప్రమాణముల లక్షణమునందైన వ్యాపారమునకు ప్రవేశ మున్నది. ఆప్రమాణముల యొక్క నిరూపణమునందు మూడుస్థానములయందును వ్యాపారముయొక్క సంభవము చెప్పబడియున్నది. ఉపమానము అర్థాపత్తి అనుపలబ్ధి యను నీ మూడింటియొక్క లక్షణమునందు వ్యాపారమునకు ప్రవేశము లేదు. ఉపమితియొక్క యసాధారణకారణము ఉపమానప్రమాణ మనంబడును. ఉపపాదకకల్పనకు అసాధారణకారణ మగు నుపపాద్యానుపపత్తిజ్ఞానము అర్థాపత్తిప్రమాణ మనంబడును. అభావప్రమయొక్క అసాధారణకారణము అనుపలబ్ధి ప్రమాణ మనంబడును. యద్యపి (విచారింపగా) అభావపరోక్షజ్ఞానము కూడ అనుమానాదికములవలన కలుగుచున్నది, అని పూర్వమే చెప్పబడియున్నది. అందువలన ఆ నుపలబ్ధి లక్షణమునకు అభావజ్ఞాన జనకానుమానాదికమునందు అతివ్యాప్తి యున్నది. తథాపి అనుమానాది ప్రమాణము భావప్రమకును, అభావప్రమకును సాధారణకారణమై యున్నది. అభావప్రమయొక్క అసాధారణకారణము కాదు, అనుపలబ్ధిచేత కేవలాభావముయొక్కయే జ్ఞానము కలుగుచున్నది. అందువలన అభావప్రమయొక్క అసాధారణకారణము అనుపలబ్ధిప్రమాణమై యున్నది, అన్యము కాదు. ఈరీతిగా మూడుప్రమాణములయొక్క లక్షణమునందు వ్యాపారమునకు ప్రవేశము లేదు. అందువలన వ్యాపారముయొక్క అపేక్ష త్రివిధప్రమాణముల యందును లేదు. అనుపలబ్ధిప్రమాణముచేత అభావజ్ఞానము కలుగుచున్నది. అది అయినను ప్రత్యక్షమై యున్నది. అనుమానముచేతను, శబ్దముచేతను, ఏ యభావముయొక్క జ్ఞాన మున్నదో అది పరోక్షమై యున్నది. ఏయేస్థానమునందు నైయాయికుడు ఇంద్రియజన్యాభావజ్ఞానమును జెప్పుచున్నాడో అంతజ్ఞానము అనులబ్ధిప్రమాణజన్యమై యున్నది. ఎట్లనగా నైయాయికమతమునందును అభావజ్ఞానమునకు సహకారి కారణము అనుపలబ్ధియై యున్నది. ఏయోగ్యానుపలబ్ధిని నైయాయికుడు ఇంద్రియమునకు సహకారిగా నంగీకరించియున్నాడో ఆయోగ్యానుపలబ్ధి భట్టమతమునందు స్వతంత్రప్రమాణముగా భిన్నముగా నున్నది. నైయాయికమతమునందైన అభావప్రమకు ప్రమాణ మింద్రియమై యున్నది. వేదాంతమతమునందు ప్రమాణము అనుపలబ్ధియై యున్నది, వేదాంతమతమునందు అనుపలబ్ధిప్రమాణజన్యాభావజ్ఞానము కూడ నైయాయికమతమునందు వలెనే ప్రత్యక్షమై యున్నది, పరోక్షము కాదు.

## 92. వేదాంతమతరీతిగా ఇంద్రియాజన్యప్రత్యక్షముయొక్క లక్షణ నిర్ణయము.

ఇచ్చట నొకశంక, ఇంద్రియజన్యజ్ఞానమే ప్రత్యక్షమై యున్నది. అభావ జ్ఞానమునకు నింద్రియజన్యత్వమును నిషేధించి ప్రత్యక్షత్వమును జెప్పుట సరి కాదు. దానికి సమాధాన మే మనఁగా, ఇంద్రియజన్యజ్ఞానమే ప్రత్యక్ష మైన యెడల ఈశ్వరజ్ఞానము ప్రత్యక్షము కాకపోవలయును. ఎట్లనఁగా, న్యాయ మతమందైన ఈశ్వరజ్ఞానము నిత్యమై యున్నది. అందువలన నింద్రియజన్యము కాదు. వేదాంతమతమునందు ఈశ్వరునియొక్క జ్ఞానము మాయావృత్తిరూప మై యున్నది. ఇంద్రియజన్యము కాదు. మఱియు అద్వైతగ్రంథమునందు ఇంద్రి యజన్యజ్ఞానమునకు ప్రత్యక్షత్వమును జెప్పెడి పక్షమునందు అనేకదోషములు వ్రాయంబడియున్నవి. అందువలన నింద్రియజన్యజ్ఞానమే ప్రత్యక్షమగుచున్నది, అని నియమము లేదు. ప్రమాణచేతనముతో విషయచేతనమునకు అభేద ముండినయెడల ఆజ్ఞానము ప్రత్యక్షమై యున్నది. ఎచ్చట విషయము సమ్ముఖమై యున్నదో అచ్చటనొకప్పుడు ఇంద్రియవిషయములయొక్కసంబంధముచేత ఇంద్రి యములద్వారా అంతఃకరణవృత్తి ఘటాదిదేశమునకు పోవుచున్నది. అచ్చట ఘటసమానాకారమును పొంది ఘటవృత్తి యగుచున్నది. అచ్చట వృత్త్యవ చ్ఛిన్నచేతనము ప్రమాణచేతన మనంబడును. విషయమునం దుండెడి చేతనము విషయచేతన మనంబడును. ప్రమాణచేతనము, విషయచేతనమును స్వరూపము నందు సర్వదా ఏకమై యున్నవి. ఉపాధిభేదమువలన చేతనము భిన్నముగా ను న్నది. ఉపాధియు కూడ భిన్నదేశములం దున్నయెడల ఉపహితమునకు భేద ము న్నది; ఏకదేశమునం దున్నయెడల ఉపహితమునకు భేదము లేదు. ఉ. ఘట రూపము ఘటము; కూడ ఏకదేశమునం దున్నవి. అచ్చట ఘటరూపోపహితా కాశము ఘటోపహితాకాశము కూడ ఏకమయియే యున్నవి. మఱియును మఠాంతరమునందు ఘట మున్నది, అచ్చట ఘటోపహితాకాశము మఠాకాశము కంటె భిన్నము కాదు. యద్యపి మఠాకాశమైన ఘటాకాశముకంటె భిన్నముగా నున్నది. ఎట్లనగా ఘటశూన్యదేశమునందును మఠ మున్నది. తథాపి మఠశూన్య దేశమునందు ఘటము లేదు. అందువలన మఠాకాశముకంటె ఘటాకాశము భిన్న ము కాదు. ఈరీతిగా వృత్తివిషయములు భిన్నదేశములం దుండుటవలన వృత్త్యు పహితచేతనము, విషయోపహితచేతనము భిన్నముగా నున్నవి. మఱియును వృ

త్తి విషయదేశమునం దుండు నపుడు విషయచేతనము కూడ వృత్తిచేతనమగుచున్నది. అందువలన విషయచేతనమునకు వృత్తిచేతనముతో భేదము లేదు, అభేదమే యున్నది. యద్యపి విషయదేశమునకు వృత్తి వెళ్లినపుడు ద్రష్టయొక్క శరీరముయొక్క అంతఃకరణముమొదలుకొని విషయపర్యంతము వృత్తియాకారమగుచున్నది. అందువలన విషయదేశముతో బాహ్యముగా వృత్తిస్వరూపముండుటవలన విషయచేతనముతో భిన్నముగా వృత్తిచేతన మున్నది. తథాపి ఆకాలమునందు వృత్తికంటె భిన్నదేశమునందు విషయము లేదు. అందువలన విషయచేతనమునకు వృత్తిచేతనముతో నభేదము చెప్పబడియున్నది. ఈ రెంటికిని పరస్పరాభేదము ఎచ్చటనైనను వ్రాయబడి యున్నయెడల దాని యభిప్రాయ మే మనగా, ఎంత వృత్తిభాగము ఘటదేశమునం దున్నదో అంత వృత్తిభాగోపహితచేతనము ఘటచేతనముకంటె భిన్నము కాదు. ఈరీతిగా నెచ్చట విషయచేతనమునకు వృత్తిచేతనముతో నభేద మున్నదో ఆజ్ఞానము ప్రత్యక్ష మనంబడును.

**93.** ప్రత్యభిజ్ఞయొక్కయు అభిజ్ఞాప్రత్యక్షజ్ఞానముయొక్కయు, స్మృత్యాది పరోక్షజ్ఞానముయొక్కయు సామగ్రీసహితనిర్ణయము.

ఎచ్చట విషయచేతనమునకు వృత్తిచేతనముతో నభేదము లేదో ఆజ్ఞానము పరోక్ష మనంబడును. సంస్కారజన్య స్మరణరూపాంతఃకరణవృత్తి శరీరములోపలనే యగుచున్నది. దానివిషయము దేశాంతరమునం దున్నది, లేదా నష్టమై పోయినది. అందువలన విషయచేతనమునకు వృత్తిచేతనముతో నభేదము లేనందున స్మృతిజ్ఞానము పరోక్షమై యున్నది. ఏపదార్థముయొక్క పూర్వానుభవసంస్కార ముండి ఇంద్రియముయొక్క సంయోగ ముండినప్పుడు "సోయం" అనుసీజ్ఞానము కలుగుచున్నదో అది అభిజ్ఞాజ్ఞాన మనంబడును. అచ్చటను గూడ ఇంద్రియజన్యవృత్తి విషయదేశమునకు పోయియున్నది. అందువలన విషయచేతనమునకు వృత్తిచేతనముతో నభేద ముండుటవలన ప్రత్యభిజ్ఞాజ్ఞానము కూడ ప్రత్యక్షమయియే యున్నది. కేవలేంద్రియ జన్యవృత్తి యుండినప్పుడు "అయం" అని ప్రత్యక్షము గలుగుచున్నది, అది యభిజ్ఞాప్రత్యక్ష మనంబడును. ముఖ్యసిద్ధాంతమునం దైన పూర్వానుభూతముయొక్క "సోయం" అనుసీజ్ఞానముకూడ తత్తాంశమునందు స్మృతిరూపమై యుండుటవలన పరోక్షమై యున్నది. "అయం" అంశమునందు ప్రత్యక్షమై యున్నది. ఇందువలన "సోయం" అను సీజ్ఞానము

సందు కేవల ప్రత్యక్షత్వము లేదు. ఇక 'నే' మనగా అంశభేదముచేత పరోక్షత్వ ప్రత్యక్షత్వము లను రెండు ధర్మము లున్నవి.

కేవలసంస్కారజన్యవృత్తి యుండినయెడల దానికి "సః" అని ఈ యాకార మున్నది. దానికి స్మృతి యని పేరు. ఏపదార్థమునకు పూర్వమునం దింద్రియము చేత లేక అనుమానాదికముచేత జ్ఞానము కలిగియున్నదో దానికి స్మృతి కలుగు చున్నది. అందువలన స్మృతిజ్ఞానమునందు పూర్వానుభవము కరణమై యు న్నది. అనుభవ జన్యసంస్కారము వ్యాపారమై యున్నది. ఎట్లనఁగా ఏపదా ర్థమునకు పూర్వమునందు జ్ఞానము కలిగి యున్నదో దానికి వర్తమానంతరము నందును స్మృతి కలుగుచున్నది. అచ్చట స్మృతియొక్క అవ్యవహితపూర్వ కాలమునందు అనుభవ మైన లేదు. అవ్యవహిత పూర్వకాలమునందు ఏది యున్నదో అది హేతువై యున్నది. అందువలన పూర్వానుభవము స్మృతికి సాక్షాత్కారణము కాదు. ఒకదానిద్వారా కారణ మని చెప్పవలసినది. అందు వలన ఇట్లంగీకరించుట యోగ్యము. ఏపదార్థముయొక్క యనుభవము పూర్వ కాలమునందు లేదో దానియొక్క స్మృతి కలుగుట లేదు. పూర్వానుభవము స్మృతికి కారణము కానియెడల దేనియొక్క అనుభవము లేదో దానియొక్కయు స్మృతి కలుగవలయును. అట్లు కలుగుట లేదు. ఈరీతిగా పూర్వానుభవము తో స్మృతికి అన్వయవ్యతిరేక మున్నది. పూర్వానుభవ ముండినప్పుడు స్మృతి యున్నది, అని అన్వయము. పూర్వానుభవము లేనప్పుడు స్మృతి లేదు, అని వ్యతి రేకము. ఒకటి యుండినప్పుడు మఱియొకటి కూడ నుండుట అన్వయ మనంబ డును. ఒకటి లేకుండుటవలన రెండవది కూడ లేకుండుట వ్యతిరేక మనంబడును. అన్వయవ్యతిరేకమువలన కారణ కార్యభావము తెలియవలయును. పూర్వాను భవ స్మృతులయొక్క అన్వయవ్యతిరేకదర్శనమువలన వానికి కారణకార్యభావ మవశ్యమై యున్నది. అయిన అవ్యవహితపూర్వకాలమందు పూర్వానుభవ ముం డుట లేదు. అందువలన స్మృత్యుత్పత్తికి పూర్వమునందు అనుభవమున కేదయిన నొకవ్యాపారము నంగీకరింపవలసినది. ఎచ్చట ప్రమాణబలముచేత కారణత నిశ్చయమై అవ్యవహితపూర్వకాలమునందు కారణసత్త సంభవించుట లేదో అచ్చట వ్యాపారకల్పన యున్నది. ఉ. శాస్త్రరూపప్రమాణముచేత యాగము నందు స్వర్గసాధనత్వము నిశ్చయింపబడి యున్నది. మఱియు నంత్యాహుతి యాగ మనంబడును. ఆయాగముయొక్క నాశమైన బహుకాలానంతరము స్వర్గము

కలుగుచున్నది. సుఖవిశేషము స్వర్గ మనంబడును. స్వర్గముయొక్క యవ్యవహిత పూర్వకాలమునందు యాగము లేనందున యాగమునకు కారణత్వము సంభవించుట లేదు. అందువలన శాస్త్రముచేత నిర్ణీతకారణత్వనిర్వాహార్థము యాగమునకు అపూర్వము వ్యాపారముగా సంగీకరింపబడి యున్నది. ఎప్పుడు అపూర్వ మంగీకరింపఁబడి యున్నదో అప్పుడు దోషము లేదు. ఎట్లనగా, కార్యముయొక్క యవ్యవహితపూర్వకాలమునందు కారణము, లేక వ్యాపారము ఒకటి కావలసి యున్నది. ఒకప్పుడు రెండును ఉన్నవి. ఒకటిమాత్రము అవశ్యముగా కావలసియున్నది. ఏది ధర్మ మనంబడునో అది యాగజన్యాపూర్వమై యున్నది. యాగముచేత అపూర్వము ఉత్పన్న మగుచున్నది. మఱియును యాగజన్యమైన యేస్వర్గ మున్నదో దానికి అపూర్వము జనకమై యున్నది, అందువలన వ్యాపారమై యున్నది. ఎట్లు యాగమునకు స్వర్గసాధనతానిర్వాహార్థము అపూర్వము వ్యాపారముగా సంగీకరింపబడి ఆయపూర్వము సర్వదా పరోక్షమై యున్నదో అట్లు అన్వయవ్యతిరేకబలముచేత సిద్ధమగు పూర్వానుభవమునకు ఏస్మృతికారణత్వ మున్నదో దానియొక్క నిర్వాహార్థము సంస్కారము సంగీకరింపవలసినది. ఆసంస్కారము సర్వదా పరోక్షమై యున్నది. ఏయంతఃకరణమునందు పూర్వానుభవము ఉండి స్మృతి కాఁగలదో ఆయంతఃకరణముయొక్క ధర్మము సంస్కారమై యున్నది. నైయాయికమతమునందు, (1) అనుభవము (2) సంస్కారము. (3) స్మృతి యను నివి మూడును ఆత్మయొక్క ధర్మములై యున్నవి. అనుభవజన్యసంస్కారమునకు నైయ్యాయికమతమునందు భావన అని పేరు. ఆసంస్కారము పూర్వానుభవజన్యమై యున్నది. మఱియును పూర్వానుభవజన్య స్మృతికి జనకమై యున్నది. అందువలన వ్యాపారముగా జెప్పంబడి యున్నది. ఈరీతిగా. పూర్వానుభవము స్మృతికి కరణమై యున్నది. సంస్కారము వ్యాపారమై యున్నది. స్మృత్యుత్పత్తికి అవ్యవహిత పూర్వకాలమునందు పూర్వానుభవమునకు నాశము ఉంటుటవలన అనుభవాభావ మున్నది. తథాపి దానియొక్క వ్యాపారమగు సంసార మున్నది.అందువలన పూర్వానుభవము నష్టమైనను స్మృతి గలుగచున్నది. ఆసంస్కారము ప్రత్యక్షముగా లేదు. అనుమానము, లేక అర్థాపత్తి, ఈరెంటిలో ఏదో ఒకదానిచే సంస్కారసిద్ధి యగుచున్నది. ఎంతవఱకు పూర్వానుభూత విషయక స్మృతి యగుచున్నదో అంతకాలము వఱకును, సంస్కారము ఉన్నది. ఏస్మృతికంటె ఉత్తర

స్మృతి గలుగుట లేదో అది చరమస్మృతియనంబడును, చరమస్మృతిచేత సంస్కార ము నష్టమగుచున్నది, అందువలన తిరిగి ఆపదార్థముయొక్క స్మృతి గలుగుట లేదు. ఈరీతిగా పూర్వానుభవజన్య సంస్కారముచేత అనేకస్మృతి గలుగుచున్నది. ఎంతవఱకు చరమస్మృతి గలుగుచున్నదో అంతవఱకును ఒక్కటే సంస్కార మున్నది. స్మృతియందు చరమత్వము కార్యముచేత తెలియవలయును. ఏస్మృతి గలిగి తిరిగి సజాతీయస్మృతి గలుగుట లేదో ఆస్మృతియందు అనుమానముచేత చరమతాజ్ఞానము గలుగుచున్నది. అంత్యము చరమ మనంబడును. మఱియును ఇచ్చట నొకానొకడు చెప్పున దేమనగా పూర్వానుభవజన్యసంస్కారముచేత ప్రథమస్మృతి గలుగుచున్నది. ప్రథమస్మృత్యుత్పత్త్యనంతరమునందు సంస్కారము నష్టమగుచున్నది. స్మృతిచేత తిరిగి సంస్కారము ఉత్పత్తియగుచున్నది. దానిచేత తిరిగి సజాతీయస్మృత్యంతము ఉత్పత్తి యగుచున్నది. ఆస్మృతిచేత స్వజనక సంస్కారమునకు నాశమై అన్యసంస్కారము ఉత్పన్న మగుచున్నది దానిచేత తృతీయస్మృతి గలుగుచున్నది. ఈరీతి గా స్మృతిచేతను సంస్కారోత్పత్తి యగుచున్నది. ఏస్మృత్యనంతరమునందు సజాతీయస్మృతి గలుగదో ఆస్మృతి సంస్కారమునకు హేతువు కాదు. ఈమతమునందు సంస్కారద్వారా స్మృతిజ్ఞానము కూడ ఉత్తరస్మృతికి కరణమై యున్నది. మఱియును ప్రథమ స్మృతికి అనుభవమై యున్నది. ఈరెండుస్థలములయందును సంస్కారము వ్యాపారమై యున్నది. ప్రథమమతమునందు స్మృతిజ్ఞానమునకు కరణము స్మృతి కాదు. మఱియు నేమనగా పూర్వానుభవమై యున్నది. మఱియును పూర్వానుభవజనిత మైనయొక టే సంస్కారము చరమస్మృతిపర్యంతము ఉన్నది. అందువలన పూర్వానుభవమే స్మృతికరణమై యున్నది. మఱియును పూర్వానుభవజన్య సంస్కారమే సకల సజాతీయస్మృతియందును వ్యాపారమై యున్నది. రెండుపక్షముల యందును స్మృతిజ్ఞానము ప్రమ కాదు. ఎట్లనగా ప్రథమపక్షమునం దైననో స్మృతిజ్ఞానమునకు కరణము పూర్వానుభవమై యున్నది. అది షట్ప్రమాణముల కంటె భిన్నమై యున్నది. ప్రమాణజన్యజ్ఞానము ప్రమయనంబడును. పూర్వానుభవము ప్రమాణము కాదు. ద్వితీయపక్షమునందు ప్రథమస్మృతికి కరణమైననో పూర్వానుభవమై యున్నది. ద్వితీయాది స్మృతికి కరణము స్మృతియై యున్నది. ఆస్మృతియు కూడ షట్ప్రమాణములలో చేరినది కాదు. అందువలన స్మృతి ప్రమ కాదు. తథాపి యథార్థాయథార్థభేదముచేత స్మృతి ద్వివిధము. భ్రమరూ

పానుభవముయొక్క సంస్కారముచేత ఏది యుత్పన్నమైనదో అది అయథార్థమై యున్నది. ప్రమారూపానుభవముయొక్క సంస్కారముచేత ఏది యుత్పన్నమైనదో అది యథార్థమై యున్నది. ఈరీతిగా రెండుపక్షములును అద్వైతగ్రంథములందు వ్రాయఁబడియున్నవి. వానిలో దూషణభూషణము లనేకము లున్నవి. గ్రంథవిస్తరభయముచేత ఉపరమించి ప్రసంగమాత్రము ఇచ్చట వ్రాయబడినది. ఎట్లు పూర్వానుభవజన్యస్మృతిజ్ఞానము పరోక్షమై యున్నదో అట్లు అనుమానాదిప్రమాణజన్యజ్ఞానము కూడ పరోక్షమై యున్నది. ఎట్లనగా, స్మృతివిషయము వృత్తికంటె ఎట్లు వ్యవహితమై యున్నదో అట్లు అనుమానాదిజన్యజ్ఞానముయొక్క విషయముకూడ వృత్తిదేశమునందు లేదు. ఇక నేమనఁగా, వ్యవహితమగు పర్వతాదిదేశమునందు వహ్ని యున్నది. అతీతానాగతపదార్థమునకును అనుమానాదికముచేత అనుమితి గలుగుచున్నది. అందువలన అనుమానాదిజన్యజ్ఞానముయొక్క దేశమునందును, కాలమునందును, విషయము లేదు. ఇక నేమనగా, అనుమిత్యాదిజ్ఞానముయొక్క దేశకాలములకంటె, భిన్నదేశ భిన్నకాలములయందు ఆజ్ఞానముయొక్క విషయము ఉన్నది.

94. ఇంద్రియజన్యతానియమరహిత ప్రత్యక్షజ్ఞానముయొక్క అనుసంధానము.

ఇంద్రియజన్యజ్ఞానముయొక్క విషయము దానియొక్క దేశకాలముల కంటె భిన్నదేశమునందును, భిన్నకాలమునందును ఉండుటలేదు. ఇక నేమనగా, జ్ఞానముయొక్క దేశకాలములయందే యున్నది. అందువలన నింద్రియజన్యజ్ఞానము ప్రత్యక్షమగుచునే యున్నది. అద్వైతమతమునందు అంతఃకరణముయొక్క పరిణామమగు నేవృత్తి యున్నదో అదియే జ్ఞానమనఁబడును. అందువలన జ్ఞానవిషయములు ఏకదేశమునందున్నవి, లేక, వృత్తివిషయములు ఏకదేశమునందున్న వని చెప్పినను అర్థము ఏకమై యున్నది. ఇంద్రియజన్యజ్ఞానమే ప్రత్యక్షమై యుండవలయు నను నియమము లేదు. ఎచ్చట నన్యప్రమాణజన్యవృత్తిదేశమునందును విషయము మున్నదో అచ్చటప్రత్యక్షజ్ఞానమే యున్నది. ఉ. "దశమస్త్వమసి" అను వాక్యముచేత నుత్పన్నమగు వృత్తియొక్క దేశమునందు విషయ మున్నది. అందువలన శబ్దప్రమాణజన్యజ్ఞానము కూడ నొకప్పుడు ప్రత్యక్షమగుచున్నది. మహావాక్యజన్య బ్రహ్మాకారవృత్తియు బ్రహ్మమును ఈరెండును ఏకదేశమునందున్నవి. అందువలన మహావాక్యజన్య బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షమై యున్నది. ఈరీతిగానే

ఈశ్వరజ్ఞానమునకు నుపాదానకారణ మగు మాయయొక్క దేశమునందు సకల పదార్థము లున్నవి. అందువలన నింద్రియజన్యము కాకపోయినను ఈశ్వరజ్ఞానము ప్రత్యక్షమై యున్నది. ఈరీతిగా ననుపలబ్ధిప్రమాణజన్యాభావజ్ఞానము కూడ ప్రత్యక్షమై యున్నది. ఎట్లన ఎచ్చటభూతలమునందు ఘటాభావజ్ఞాన మున్నదో అచ్చట భూతలముతో నింద్రియమునకు సంబంధమై భూతలదేశమునకు నంతఃకరణవృత్తి బయలుదేఱిపోవును. "భూతలే ఘటో నాస్తి" అని వృత్తియొక్క యాకార మున్నది. అచ్చట భూతలాంశమునందు వృత్తి నేత్రజన్యమై యున్నది. ఘటాభావాంశమునందు అనుపలబ్ధిజన్యమై యున్నది ఎట్లు "పర్వతో వహ్నిమాన్" అను నీవృత్తి పర్వతాంశమునందు నేత్రజన్యమై యున్నది, వహ్న్యంశమునందు ననుమానజన్యమై యున్నది, ఈరీతిగానే ఒకటేవృత్తి అంశభేదముచేత నింద్రియము, అనుపలబ్ధి, ఈరెండుప్రమాణములచేత నుత్పన్న మగుచున్నది. అక్కడ భూతలావచ్ఛిన్న చేతనమునకు వృత్త్యవచ్ఛిన్న చేతనముతో అభేద మున్నది భూతలావచ్ఛిన్న చేతనమే ఘటాభావావచ్ఛిన్న చేతనమై యున్నది. అందువలన ఘటాభావావచ్ఛిన్న చేతనమునకును వృత్త్యవచ్ఛిన్న చేతనముతో నభేద మున్నది. అందువలన ననుపలబ్ధిప్రమాణ జన్యమైనను ఘటాభావజ్ఞానము ప్రత్యక్షమై యున్నది. అయినను ఎక్కడ అభావముయొక్క యధికరణము ప్రత్యక్షయోగ్యమై యున్నదో అధికరణముయొక్క ప్రత్యక్షమునందు, ఇంద్రియముయొక్క వ్యాపారమును ఉన్నదో అక్కడ నుక్తరీతిగా సంభవించుచున్నది.

మఱియు నెక్కడ అధికరణముయొక్క ప్రత్యక్షమునందు ఇంద్రియ వ్యాపారము లేదో అక్కడ ననుపలబ్ధిప్రమాణజన్యాభావజ్ఞానము ప్రత్యక్షము కాదు, పరోక్షమై యున్నది. ఉ. వాయువునందు రూపాభావముయొక్క యోగ్యానుపలబ్ధి చేత నిమీలితనేత్రము కలిగినవానికి జ్ఞానము కలుగుచున్నది. పరమాణువునందు యోగ్యానుపలబ్ధిచేత నేత్రముయొక్క యున్మీలనవ్యాపారము లేకయే మహత్త్వాభావజ్ఞానము కలుగుచున్నది. అచ్చట విషయదేశమునకు వృత్తిపోవుట లేదు. అందువలన ననుపలబ్ధిప్రమాణజన్యవాయువునందు రూపాభావజ్ఞానము పరమాణువునందు మహత్త్వాభావజ్ఞానమును ప్రత్యక్షము కావు, పరోక్షమై యున్నవి. ఈరీతిగా ననుపలబ్ధి ప్రమాణజన్యాభావజ్ఞానము ఒకప్పుడు ప్రత్యక్షమై మఱియొకప్పుడు పరోక్షమునై యున్నది. వేదాంత పరిభాషాది గ్రంథములయందు ననుపలబ్ధి ప్రమాణ జన్యాభావ విషయక ప్రత్యక్షము వ్రాయ బడి

యున్నది, కాని అనుపలబ్ధి జన్యపరోక్షజ్ఞానమునకు నుదాహరణము వ్రాయబడ లేదు. దానియందు జడి న్యూనతమై యున్నది. వ్రాయ దగినదియే. పరోక్షోదాహరణము వ్రాయబడనందున ననుపలబ్ధి జన్యజ్ఞానము పరోక్షము కా దనునది భ్రమమై యున్నది.

95. అభావజ్ఞానమునకు సర్వత్ర పరోక్షతా నిర్ణయము.

మఱియును సూక్ష్మదృష్టితో విచారించినయెడల ననుపలబ్ధి ప్రమాణజన్యాభావవిషయకజ్ఞానము సర్వత్ర పరోక్షమై యున్నది. ఎప్పుడును ప్రత్యక్షము కాదు. ఎట్లనఁగా ప్రమాణచేతనముతో విషయచేతనమునకు నభేద ముండినను ఏవిషయము ప్రత్యక్షయోగ్యము కాదో దానియొక్క పరోక్షజ్ఞానమే గలుగుచున్నది.ఉ. శబ్దాదిప్రమాణముచేత ధర్మాధర్మవిషయకజ్ఞానమైనప్పుడు ప్రమాణచేతనముతో విషయచేతనమునకు భేదము లేదు. ఎట్లన అంతఃకరణదేశమునందు ధర్మాధర్మము లున్నవి.అందువలన నంతఃకరణము, ధర్మాధర్మములుకూడ భిన్నదేశమునందు లేనందున ధర్మాధర్మావచ్ఛిన్నచేతనప్రమాణము చేతనముకంటె భిన్నము కాదు. తథాపి ధర్మాధర్మములు ప్రత్యక్షయోగ్యములు కావు. అందువలన శబ్దాదిజన్యధర్మాధర్మవిషయకజ్ఞానము ఎప్పుడు ప్రత్యక్షముకాదు అనుభవానుసారముగా విషయమునందు యోగ్యత్వమును, అయోగ్యత్వమును తెలియవలసినది. ఎట్లు ధర్మాధర్మములు ప్రత్యక్షయోగ్యములు కావో అట్లు అభావపదార్థము కూడ ప్రత్యక్షయోగ్యము కాదు. అభావపదార్థము ప్రత్యక్షమైయున్నయెడల వాదులకు వివాదము కాకపోవలయును. మీమాంసకుఁడు అభావమును అధికరణస్వరూప మని యంగీకరించుచున్నాడు. నైయాయికుఁడు అధికరణముకంటె భిన్నముగా నంగీకరించియున్నాడు. ఈరీతిగనే నాస్తికుఁడు అభావమును తుచ్ఛ మనియు నలీక మనియును నంగీకరించియున్నాడు. ఆస్తికుడు అభావమును పదార్థ మని యంగీకరించుచున్నాడు. ఈప్రకారముగా నభావముయొక్క స్వరూపమునందు వివాదము ఉన్నది. మఱియును ప్రత్యక్షయోగ్య మగు నేఘటాధికమున్నదో దానియొక్క స్వరూపమునందు నధికరణముకంటె భిన్నమా కాదా యనునట్టి వివాదము లేదు. అందువలన నభావపదార్థము ప్రత్యక్షయోగ్యము కాదు. ఈకారణముచేత నెచ్చట భూతలమునందు ఘటాభావజ్ఞాన మున్నదో అచ్చట ప్రమాణచేతనముతో ఘటాభావావచ్ఛిన్నచేతనమునకు నభేద ముండినను నభావాంశమునందు ఈజ్ఞానము పరోక్షమై యున్నది, భూతలాంశమునందు

అపరోక్షమై యున్నది. ఉ. “పర్వతో వహ్నిమాన్” అనుజ్ఞానము పర్వతాంశమునందు అపరోక్షమై యున్నది. వహ్న్యంశమునందు పరోక్షమై యున్నది. ఈరీతిగా ననుపలబ్ధి ప్రమాణజన్యాభావవిషయకజ్ఞానము సర్వత్ర పరోక్షముగా నంగీకరించినయెడల భాట్టులతోకూడ విరోధము లేదు. భట్టమతమునందు అనుపలబ్ధిజన్యాభావవిషయకజ్ఞానము పరోక్షమై యున్నది. మఱియును అభావజ్ఞానమును ఇంద్రియజన్యముగా నైయాయికు డంగీకరించి ప్రత్యక్షముగా జెప్పుచున్నాడు. అది సర్వథా యసంగతమై యున్నది. వాయువునందు రూపాభావవిషయకచాక్షుషప్రత్యక్షము గలుగుచున్నది. పరమాణువునందు మహత్త్వాభావవిషయక చాక్షుషప్రత్యక్షము కలుగుచున్న దని నైయాయిక సిద్ధాంతమున్నది. అది సంభవించుట లేదు. ఎట్లనగా, వాయువునందు రూపాభావవిషయకజ్ఞానముకొఱకు ఎవరును నేత్రోన్మీలన వ్యాపారము చేయుట లేదు. నిమీలితనేత్రునకును వాయువునందు యోగ్యానుపలబ్ధిచేత రూపాభావవిషయకజ్ఞానము కలుగుచున్నది. పరమాణువునందు మహత్త్వాభావవిషయకజ్ఞానమును ఉన్మీలితనేత్రము గలవానికివలె నిమీలితనేత్రునికి కూడ కలుగుచున్నది. నిమీలితనేత్రులకు ఘటాదివిషయకచాక్షుషజ్ఞానము ఎప్పుడును కలుగుట లేదు. అందువలన వాయువునందు రూపాభావముయొక్కయు పరమాణువునందు మహత్త్వాభావముయొక్కయు చాక్షుషప్రత్యక్షము కలుగుటలేదు. ఇక నే మనగా యోగ్యానుపలబ్ధిచేత దానియొక్క పరోక్షజ్ఞానము కలుగుచున్నది.

నైయాయికుడు చెప్పున దే మనగా, అభావజ్ఞానమునందు నింద్రియముయొక్క యన్వయవ్యతిరేకదర్శనమువలన నభావజ్ఞానమునుగూర్చి ఇంద్రియము హేతువై యున్నది. దీనికి సమాధానము భేదధిక్కారాది గ్రంథమునందు విపులముగా వ్రాయబడియున్నది. ఇంద్రియముయొక్క అన్వయవ్యతిరేకము అధికరణజ్ఞానమునందు చరితార్థమై యున్నది. ఉ. భూతలమునందు ఘటాభావజ్ఞాన మైనప్పుడు అభావాధికరణ భూతలజ్ఞానము నేత్రేంద్రియముచేత కలుగుచున్నది. ఆనేత్రేంద్రియముతో జ్ఞాతభూతలమునందు యోగ్యానుపలబ్ధిచేత ఘటాభావవిషయకమగు జ్ఞానము కలుగుచున్నది. ఈరీతిగా ఘటాభావాధికరణ మగు నేభూతలమున్నదో దానియొక్క జ్ఞానమునందు నింద్రియము చరితార్థమై యున్నది, అనగా సఫలమై యున్నది, అను నీ శంకాసమాధానములు రెండును అసంగతములై యున్నవి. ఎట్లనగా:—

వాయువునందు రూపాభావముయొక్క, పరమాణువునందు మహత్త్వాభావముయొక్క, జ్ఞానము నేత్రేంద్రియవ్యాపారము లేకయే కలుగుచున్నది. అందువలన కొంత అభావజ్ఞానమునందు ఇంద్రియాన్వయవ్యతిరేక ముండినను ఇంద్రియమునకు కారణత్వము సిద్ధమగుట లేదు. సకలాభావ జ్ఞానమునందును ఇంద్రియాన్వయవ్యతిరేక మసిద్ధమై యున్నది. ఈరీతిగా శిథిలమూలశంకకు సమాధానకథనము కూడ నసంగతమై యున్నది. తిరిగి నైయాయికుడు శంకించునదేమనగా, "ఘటానుపలబ్ధ్యా ఇంద్రియేణాభావం నిశ్చినోమి" అనునీప్రతీతి కలుగుచున్నది. అందువలన ననుపలబ్ధియు, నింద్రియమును, ఈరెండును ఘటాభావజ్ఞానమునకు హేతువులై యున్నవి. ఈశంకకు నుక్తసమాధాన మున్నది ఘటాభావాధికరణజ్ఞానము ఇంద్రియముచేత కలుగుచున్నది. ఘటాభావజ్ఞానము అనుపలబ్ధిచేత కలుగుచున్నది, అను నీసమాధానము సంభవించుట లేదు. ఎట్లన, ఎచ్చట నింద్రియయోగ్యాధికరణ మున్నదో అచ్చట నుక్తసమాధానము సంభవించుచున్నది. ఎచ్చట నధికరణము ఇంద్రియయోగ్యము కాదో అచ్చట నుక్తసమాధానము సంభవించుట లేదు. ఎట్లన "వాయౌ రూపానుపలబ్ధ్యా నేత్రేణ రూపాభావం నిశ్చినోమి" ఈరీతిగా వాయువునందు రూపాభావముయొక్క అనుపలబ్ధిజన్యము నేత్రజన్యమునగు ప్రతీతి కలుగుచున్నది. అచ్చట వాయువుయొక్క ప్రతీతి నేత్రజన్యమై యున్నది, రూపాభావముయొక్క ప్రతీతి అనుపలబ్ధిజన్యమై యున్నది, అని చెప్పుట సరికాదు. ఎట్లన, వాయువునందు రూపాభావమువలన నేత్రమునకు యోగ్యత లేదు, అందువలన నభావజ్ఞానము కేవలానుపలబ్ధిజన్యమైనది, అని యంగీకరించినయెడల, నుభయజన్యతాప్రతీతివిరోధమునకు నద్వైతవాదియొక్క సమాధాన మేమనగా "భూతలే అనుపలబ్ధ్యా నేత్రేణ ఘటాభావం నిశ్చినోమి" అనువాక్యమునకు ననుపలబ్ధిసహితనేత్రముచేత భూతలమునందు ఘటాభావవిషయక నిశ్చయ సహితుడను నేనై యున్నాను, అను నీ యభిప్రాయము కాదు. మఱి యేమనగా భూతలమునం దింద్రియజన్య ఘటోపలబ్ధియొక్క యభావమువలన ఘటాభావనిశ్చయ సహితుడనై యున్నాను, అని తాత్పర్యము. అభావనిశ్చయమునకు ననుపలబ్ధి హేతువై యున్నది. అనుపలబ్ధియొక్క ప్రతియోగి యగు నేయుపలబ్ధి యున్నదో దానియందు నింద్రియజన్యత భాసించుచున్నది. అందువలన నిషేధనీయోపలబ్ధియందు నింద్రియజన్యత ప్రతీత మైనందున ఇంద్రియజన్యోపలబ్ధ్యభావమువలన ఘటాభావనిశ్చయ

ముత్పన్న మగుచున్నదని సిద్ధాంత మున్నది. ఈ ప్రకారముగానే " వాయూ రూపానుపలబ్ధ్యా నేత్రేణ రూపాభావం నిశ్చినోమి " యనువాక్యమునకును రూపానుపలబ్ధి సహిత నేత్రముచేత రూపాభావనిశ్చయ సహితుఁడను నేనై యున్నాను, అని తాత్పర్యము కాదు. ఎట్లన, నేత్రవ్యాపారము లేకయే రూపాభావనిశ్చయము కలుగుచున్నది. నేత్రజన్యరూపోపలబ్ధి లేనందున వాయువునందు రూపాభావనిశ్చయసహితుడనై యున్నానని తాత్పర్యము. అందువలన నేయుపలబ్ధియొక్క యభావము రూపాభావనిశ్చయమునకు హేతువై యున్నదో ఆయుపలబ్ధియందు నేత్రజన్యత్వము ప్రతీత మగుచున్నది. ఈ రీతిగా నభావనిశ్చయమునకు హేతువగు నేయనుపలబ్ధి యున్నదో దానికి ప్రతియోగియగు నుపలబ్ధియందు ఇంద్రియజన్యత్వము చెప్పవలసినది. మఱియును వివేకము లేక అభావనిశ్చయమునం దింద్రియజన్యత్వము ప్రతీతమై యున్నది. నైయాయికశంకకు నీ సమాధానము సర్వత్ర వ్యాపకమై యున్నది. మఱియు నధికరణజ్ఞానముయొక్క యింద్రియజన్యత్వము అభావజ్ఞానమునందు భాసించుచున్నది. భేదధిక్కార వేదాంతపరిభాషాధికముయొక్క యీ సమాధానము సర్వత్ర వ్యాపకము కాదు. ఎచ్చట ప్రత్యక్షయోగ్యభూతలాదిక మభావాధికరణమై యున్నదో అచ్చట నీ సమాధానము సంభవించుచున్నది. ఎచ్చట ప్రత్యక్షాయోగ్యవాయ్వాదికము అభావాధికరణమై యున్నదో అచ్చట నుక్తసమాధానము సంభవించుట లేదు. "అనుపలబ్ధ్యా రసనేంద్రియేణ ఆమ్లరసాభావ మాత్రమే జానామి"—ఈస్థానమునందును అధికరణజ్ఞానము రసనేంద్రియజన్యముగా సంభవించుట లేదు.| ఏలయన, ఆమ్లరసాభావమున కధికరణము ఆమ్రఫలమై యున్నది. దానిజ్ఞానముయొక్క సామర్థ్యము రసనేంద్రియమునందు లేదు. రసనేంద్రియమునందు కేవలరసజ్ఞానముయొక్క సామర్థ్య మున్నది, ద్రవ్యజ్ఞానముయొక్క సామర్థ్యము లేదు. అందువలన రసనేంద్రియజన్యామ్లరసోపలబ్ధి లేనందున ఆమ్రఫలమునందు రసాభావనిశ్చయ సహితుఁడనై యున్నాను, అనునీ తాత్పర్యముచేత నుక్తవ్యవహారము కలుగుచున్నది. యద్యపి ఉక్తవాక్యముయొక్క అక్షరమర్యాదచేత నుక్తార్థము క్లిష్టమై యున్నది, తథాపి అన్యగతి సంభవించుట లేనందున నుక్తార్థముచే యంగీకరింపవలసినది. అందువలన నైయాయికశంకకు అస్మదుక్తమే సమాధానమై యున్నది. ఈరీతిగా ననుపలబ్ధి ప్రమాణముచేత నభావనిశ్చయము కలుగుచున్నది, అను సిద్ధాంతము నిర్దోషమై యున్నది.

తిరిగి నైయాయికుడు శంకించున దేమనగా, అభావప్రమకు పృథక్ప్రమాణము నంగీకరించినయెడల గౌరవదోష మున్నది. ఘటాదికముయొక్క ప్రత్యక్షప్రమయందు నింద్రియమునకు ప్రమాణత నిర్ణీతమై యున్నది. ఆ నిర్ణీతప్రమాణముచేత నభావప్రమోత్పత్తి నంగీకరించినయెడల లాఘవ మున్నది.

96. అనుపలబ్ధి ప్రమాణాంగీకారమునందు నైయాయికశంకకు సిద్ధాంతియొక్క సమాధానము.

ఈశంకకు వక్ష్యమాణసమాధానము. ఇంద్రియమునకు ప్రమాణతావాది యగు నైయాయికుడును అనుపలబ్ధికి కారణత్వము నంగీకరించుచున్నాడు. అనుపలబ్ధికి కరణత్వము లేదని చెప్పుచున్నాడు. అద్వైతవాది ఇంద్రియమునకు నభావకరణత్వము నంగీకరింపలేదు. అందువలన నింద్రియమునకు నభావముతో స్వసంబద్ధవిశేషణతయు శుద్ధవిశేషణతా సంబంధమును అంగీకరించుట కూడదు. నైయాయికునికి నప్రసిద్ధ సంబంధముయొక్క కల్పన గౌరవమై యున్నది. మఱియు అనుపలబ్ధియందు సహకారికారణత్వమును నైయాయికుడును అంగీకరించినాడు. దానికి నద్వైతవాది కారణతానాయక ప్రమాణత్వమును జెప్పుచున్నాడు. అందువలన నైయాయికమతమునందే గౌరవదోష మున్నది అద్వైతమతమునందు లేదు.

మఱియును వేదాంతపరిభాషయొక్క టీకాకారు డగు మూలకారునకు పుత్త్రుడున్నాడు. ఆయనకు నద్వైతశాస్త్రసంస్కారము న్యూనమై యున్నది. న్యాయశాస్త్రసంస్కారము అధికముగా నున్నది. అందువలన మూలమునకు వ్యాఖ్యానముచేసి నైయాయికమతమునకు సీరీతిగా నుజ్జీవనము చేసియున్నాడు. అనుపలబ్ధియుజ్జీవనప్రకారము కాదు. అభావజ్ఞానము ఇంద్రియముచేతనే గలుగుచున్నది. మఱియును అభావముతో నింద్రియమునకు సంబంధము లేదు. విషయముతో సంబంధము లేక ఇంద్రియజన్యజ్ఞానము గలుగుట లేదు. విశేషణత మఱియును స్వసంబద్ధవిశేషణత యనునట్టి యీరెండుసంబంధములను నైయాయికు డంగీకరించినాడో అది అప్రసిద్ధమై యున్నది. అందువలన నప్రసిద్ధకల్పన గౌరవమై యున్నది, అది యసంగతమై యున్నది. ఎట్లనగా, "ఘటాభావవ ద్భూతలం" అను నీప్రతీతి సర్వసమ్మతమై యున్నది. ఈప్రతీతిచేత ఘటాభావమునందు ఆధేయత భాసించుచున్నది. భూతలమునం దధికరణత భాసించుచున్నది. పరస్పరసంబంధము లేకయే ఆధారాధేయభావము సంభవించుట లేదు. అందువలన

భూతలాద్యధికరణమునందు నభావముయొక్క సంబంధము సర్వాచార్యుల క్లిప్తమై యున్నది. ఎవఁడు అభావమును ప్రత్యక్షముగా నంగీకరించుటలేదో ఆతనికిని అభావాంగీకార మున్నది. అందువలన నధికరణముతో అభావముయొక్క సంబంధము సర్వాచార్యుల క్లిప్తమై యున్నది. ఆసంబంధమునకు వ్యవహారము కొఱకు ఏదైన నొకనామ ముండవలసినది. అందువలన నధికరణమునం దుండెడి యభావముయొక్క సంబంధము విశేషణత యనంబడును ఈరీతిగా విశేషణతా సంబంధము అప్రసిద్ధము కాదు. అందువలన నప్రసిద్ధరూపకల్పనాగౌరవము నైయాయికమతమునందు లేదు. అభావమునకు నధికరణముతో సంబంధము సర్వమతసిద్ధమైనందున స్వసంబద్ధవిశేషణతా సంబంధమును అప్రసిద్ధముగా లేదు. మఱియును "నిర్ఘటం భూతలం పశ్యామి" అను నీయనువ్యవసాయ మున్నది. అందువలన భూతలాదికమునందు అభావజ్ఞానము నేత్రజన్యమై యున్నది. ఎచ్చట నేత్రజన్యజ్ఞాన మున్నదో అక్కడనే పశ్యామి యని యనువ్యవసాయజ్ఞాన మగుచున్నది అందువలన భూతలాదికమునందు అభావజ్ఞానము నేత్రాదిజన్యమై యున్నది. ఎచట నేత్రజన్యజ్ఞానమున్నదో అక్కడనే పశ్యామి యని యనువ్యవసాయ మగుచున్నది. మఱియు నద్వైతమతమునందు భూతలముయొక్క జ్ఞానము నేత్రజన్యమై యున్నది, అభావజ్ఞానము అనుపలబ్ధిజన్యమై యున్నది. నేత్రజన్యము కాదు. అందువలన ననువ్యవసాయజ్ఞానమునందు తన విషయమగు వ్యవసాయమునకు విలక్షణత్వము భాసింపవలసినది. ఉదాహరణము "పర్వతో వహ్నిమాన్" అను నీజ్ఞానము పర్వతాంశమునందు ప్రత్యక్షమై యున్నది, వహ్న్యంశమునందు అనుమితియై యున్నది. దానికి "పర్వతం పశ్యామి, వహ్ని మనుమినోమి" అను నీ అనువ్యవసాయము గలుగుచున్నది. దానియందు వ్యవసాయములకు వైలక్షణ్య మున్నది. ఆ వైలక్షణ్యము ఇచ్చట నేత్రజన్యత్వము అనుమానజన్యత్వమునై యున్నది. అట్లు అభావజ్ఞానమునందు నేత్రజన్యత్వానుపలబ్ధిజన్యత్వరూపవిలక్షణత్వ ముండినయెడల అనువ్యవసాయమునందు భాసింపవచ్చును. కేవలనేత్రజన్యత్వమే అనువ్యవసాయమునందు భాసించుచున్నది. అందువలన నభావజ్ఞానము కూడ ఇంద్రియజన్యమై యున్నది. పృథక్ప్రమాణజన్యము కాదు. మఱియును అభావజ్ఞానము ఇంద్రియజన్యము కాదని అంగీకరించినప్పటికిని అద్వైతవాది అనుపలబ్ధిజన్య మని యంగీకరించి ప్రత్యక్షరూపముగా జెప్పుచున్నాడు. అదియు నసంగతమై యున్నది. ఎట్లనగా, ఏప్రత్యక్షజ్ఞాన మున్నదో అది యింద్రియ

జన్యమై యున్నది, అనుసీనియమమునకు బాధ కావలయును. అభావజ్ఞానము ఇంద్రియజన్యమై యున్నది. ఈరీతిగా వేదాంతపరిభాషాటీకయందు నైయాయికమతోజ్జీవనము అద్వైతగ్రంథ విరుద్ధముగా వ్రాయంబడి యున్నది. అది యుక్తి విరుద్ధమై యున్నది. ఎట్లనగా:

అభావమునకు నధికరణముతో సంబంధము ఎల్లరకు ఇష్టమై యున్నది. అందువలన నప్రసిద్ధకల్పన లేదు, అని ప్రథమమునం దేది చెప్పబడియున్నదో అది యసంగతమై యున్నది. ఎట్లన అభావాధికరణములకు సంబంధమైననో ఇష్టమై యున్నది. అయినప్పటికిని విశేషణతాసంబంధమునందు ప్రత్యభిజ్ఞానకారణత్వము అప్రసిద్ధమై యున్నది. ఎట్లన ఎవడు అభావజ్ఞానమునకు ఇంద్రియ జన్యత్వము నంగీకరించినాడో ఆయనమతమునందు విశేషణతా సంబంధము ఇంద్రియ జన్యజ్ఞానమునకు కారణముగా నంగీకరింపవలసినది. అన్యమతమునందు విశేషణతా సంబంధమునందు ఇంద్రియజన్యజ్ఞానముయొక్క కారణత్వము అంగీకరింపబడలేదు. అందువలన నప్రసిద్ధకల్పనాదోష పరిహారము నైయాయికమతమునందు గలుగుట లేదు. మఱియు నభావజ్ఞానమునకు పృథక్ప్రమాణ జన్యత్వము నంగీకరించినయెడల "నిర్ఘటం భూతలం పశ్యామి" అనునీయనువ్యవసాయము కాక పోవలయును, అని యేదోషము చెప్పబడియున్నదో అది సంభవించుట లేదు. ఎట్లనగా ఘటాభావవిశిష్ట భూతలముయొక్క చాక్షుషజ్ఞానసహితుడనై యున్నానని యనువ్యవసాయ మున్నది. ఉక్తవాక్యమునకును ఇదే అర్థము. ఈ అనువ్యవసాయమునందు ఘటాభావము విశేషణమై యున్నది. భూతలము విశేష్యమై యున్నది. ఆవిశేష్యభూతలమునందు చాక్షుషజ్ఞానముయొక్క విషయత యున్నది, ఘటాభావరూప విశేషణమునందు లేదు. అయినను ఘటాభావవిశిష్ట భూతలమునందు ప్రతీత మగుచున్నది. ఒకప్పుడు విశేషణమాత్ర ధర్మమును, ఒకప్పుడు విశేష్యమాత్ర ధర్మమును ఒకప్పుడు విశేషణవిశేష్యముల రెంటియొక్క ధర్మమును విశిష్టమునందు ప్రతీత మగుచున్నవి. ఉ. 'దండీ పురుషః' అను నీజ్ఞానమునందు దండము విశేషణమై యున్నది, పురుషుడు విశేష్యమై యున్నాడు. ఎచ్చట దండము లేక పురుషుడు మాత్రమే యున్నాడో అచ్చట 'దండీ పురుషో నాస్తి' అను నీప్రతీతి గలుగుచున్నది. అందువలన దండరూప విశేషణముయొక్క యభావ మున్నది. పురుషరూప విశేష్యముయొక్క యభావము లేదు. తథాపి విశేషణమాత్ర వృత్తి యభావము దండవిశిష్టపురుషుని

యందు ప్రతీతమగుచున్నది. ఎచ్చటను దండ ముండి పురుషుడు లేడో అచ్చ టను విశేష్యమాత్రముయొక్క యభావ మున్నది. మఱియును 'దండీ పురుషో నాస్తి' యను నీరీతిగా దండవిశిష్టపురుషునియందు అభావము ప్రతీతమగుచున్నది. ఎచ్చట దండములేకయుండి పురుషుడును గూడ లేడో అక్కడ విశేషణవిశేష్య ముల రెంటియొక్క యభావము విశిష్టమునందు ప్రతీతమగుచున్నది. ఈ ప్ర కారముగానే విశేష్యమగుభూతలమునందు చాక్షుషజ్ఞానముయొక్క విషయత యున్నది. విశేషణమగు ఘటాభావమునందు విషయత లేదు. ఆఘటాభావము కూడ విశిష్టభూతలమునందు ప్రతీతమగుచున్నది. ఎచ్చట 'వహ్నిమంతం పర్వ తం పశ్యామి' అను నీరీతిగా పర్వతప్రత్యక్షముయొక్క యనువ్యవసాయ మున్న దో అచ్చట చాక్షుషజ్ఞానముయొక్క విషయత విశేష్యమగుపర్వతమునందున్నది, విశేషణ మగు వహ్నియందు లేదు. తథాపి వహ్ని విశిష్ట పర్వతమునందు చాక్షు షజ్ఞానముయొక్క విషయత ప్రతీత మగుచున్నది. మఱియును ఘటాభావమును భూతలమును విజాతీయజ్ఞానమునకు విషయమైనయెడల 'పర్వతం పశ్యామి, వహ్ని మనుమనోమి' అని యీరీతిగా విలక్షణవ్యవసాయమును విషయీక రించుచుండు ననువ్యవసాయము కావలయు నని యేదోషమైన చెప్పబడియు న్నదో ఈకథనము కూడ అద్వైతగ్రంథముయొక్క శిథిలసంస్కారము కలిగిన వానిదిగా నున్నది. ఎట్లన, అభావజ్ఞానము అనుపలబ్ధి ప్రమాణజన్యమై యున్న ది, అనునీయర్థమును నెవ్వడంగీకరించినాడో ఆయనకు 'ఘటానుపలబ్ధ్యా ఘటాభావం నిశ్చినోమి' 'నేత్రేణ భూతలం పశ్యామి' అనునీయనువ్యవసా యములు ఎట్లు అబాధితముగా గలుగుచున్నవో అట్లు వ్యవసాయజ్ఞానము యొక్క విషయత ఘటాభావమునందును భూతలమునందును విలక్షణముగా నంగీకరింపబడి యున్నది. మఱియును అనుపలబ్ధిజన్యత్వము నంగీకరించి అద్వై తవాది అభావజ్ఞానమునకు ప్రత్యక్షత్వము నంగీకరించినాడు. మఱియు నేది ప్రత్యక్షజ్ఞాన మున్నదో అది ఇంద్రియజన్యమై యున్నది. అందువలన నుక్త నియమమునకు అనుపలబ్ధి వాదిమతమునందు బాధకావలయును, అని యేదోష ము చెప్పబడియున్నదో అదియు కూడ సిద్ధాంతాపరిశీలనమూలకమై యున్నం దున అసంగతమై యున్నది. ఎట్లన అనుపలబ్ధి ప్రమాణజన్యాభావజ్ఞానము ప్రత్య క్షము కాదు. ఇకనేమనగా ఏనోయొక జ్ఞానము ప్రత్యక్షమై యున్నది. వాయు వునందు రూపాభావజ్ఞానము పరమాణువునందు మహత్త్వాభావజ్ఞానము మొద

లయున్నవి అనుపలబ్ధి జన్యములై యుండినను పరోక్షములై యున్నవి, లేక అను పలబ్ధిప్రమాణజన్యమైనను అభావజ్ఞానము పరోక్షమై యున్నది. ఇది పూర్వము నందే ప్రతిపాదింపబడి యున్నది. అందువలన ననుపలబ్ధివాది అభావజ్ఞానమును ప్రత్యక్షముగా నంగీకరించినాడు, అను ధర్మరాజపుత్రునియొక్క కథనము సిద్ధాంతాజ్ఞానవిజృంభితమై యున్నది. మఱియును వేదాంత పరిభాషాది గ్రంథము లందు కొన్నిచోట్ల నభావజ్ఞానమునకు నేత్రప్రత్యక్షత్వము చెప్పబడి యున్నదో అది ప్రౌఢవాదముచేత చెప్పబడియున్నది. అనుపలబ్ధి ప్రమాణజన్యాభావజ్ఞాన మునకు నేత్రప్రత్యక్షత్వము నంగీకరించినను వక్ష్యమాణరీతిగా నభావజ్ఞానము నందు నింద్రియ జన్యత్వము సిద్ధమగుట లేదు, అని గ్రంథకారులయొక్క ప్రౌఢ వాద మున్నది. ప్రతివాదియొక్క వచనము నంగీకరించియు స్వమతమునందు దోషపరిహారము చేసినయెడల నది ప్రౌఢవాద మనంబడును. మఱియును అభావజ్ఞానమునకు ప్రత్యక్షత్వము నంగీకరించి యింద్రియజన్యత్వము నంగీకరింపని యెడల ప్రత్యక్షజ్ఞానము ఇంద్రియజన్యమై యున్నది అను నియమము బాధి తము కావలయును, అని చెప్పుట కూడ అసంగతమై యున్నది. ఎట్లన ఆయన నడుగవలసిన దే మనగా, 'ఏ ప్రత్యక్షజ్ఞాన మున్నదో అది ఇంద్రియజన్యమై యున్నదా? ఇంద్రియజన్యముకంటె భిన్నమైయున్నది, ప్రత్యక్షము కాదని నియమ మున్నదా? అథవా ఏయింద్రియజన్య జ్ఞానమున్నదో అది ప్రత్యక్షమై యున్నది, ప్రత్యక్షముకంటె భిన్నమైనది యింద్రియజన్యము కాదని నియమ మున్నదా?' ఇందులో ప్రథమపక్షము నంగీకరించినయెడల నసంగతమై యున్నది. ఈశ్వర జ్ఞానము ప్రత్యక్షమై యున్నది. ఇంద్రియజన్యము కాదు. న్యాయమతమునందు నిత్యమై యున్నది. సిద్ధాంతమందు మాయాజన్యమై యున్నది. ఈశ్వరునికి నింద్రియ ములు లేనందున ఆయనయొక్క జ్ఞాన మింద్రియజన్యము కాదు. మఱియును. 'దశమస్త్వమసి' అను నివాక్యముచేత నుత్పన్నమైన జ్ఞానము ప్రత్యక్షమైయున్నది. ఇంద్రియజన్యము కాదు. దశమపురుషునికి తన శరీరమునందు దశమత్వజ్ఞానము కలుగుచున్నది, ఆశరీరము నేత్రయోగ్యమై యున్నది, అందువలన దశమజ్ఞానము కూడ నేత్రేంద్రియజన్యమై యున్నది, అని చెప్పినయెడల నది సంభవించుటలేదు. ఎట్లనగా, నిమీలిత నయనునికి నివాక్యము వినగానే దశమజ్ఞానము గలుగుచున్నది. నేత్రజన్యముగా నుండినయెడల నేత్రవ్యాపారము లేక నది కలుగక పోవలయును. అందువలన దశమజ్ఞానము నేత్రజన్యముకాదు. మఱియును దశమజ్ఞానము మనో

జన్యమై యుండుటవలన ఇంద్రియజన్యమై యున్నది, అని యిట్లు చెప్పినయెడల అదియును సంభవించుట లేదు. ఎట్లనగా దేవదత్త యజ్ఞదత్తాది నామ మాత్మకు లేదు. న్యాయమతమునందు శరీరవిశిష్టాత్మకును, వేదాంతమతమునందైన సూక్ష్మశరీరవిశిష్టస్థూలశరీరమునకు నున్నది. ఈరీతిగానే "త్వం, అహం" అను వ్యవహారముకూడ సూక్ష్మశరీరవిశిష్ట స్థూలశరీరమునందు కలుగుచున్నది. ఆ స్థూలశరీరముయొక్క జ్ఞానము మనస్సుచేత సంభవించుట లేదు. మనస్సునందు బాహ్యపదార్థజ్ఞానసామర్థ్యము లేదు. మనస్సునకవధానమైన యెడల వాక్యముచేత దశమజ్ఞానము కలుగుచున్నది. విక్షిప్త మనస్సునకు కలుగుట లేదు. అందువలన నన్వయవ్యతిరేకముచేత మనస్సు దశమజ్ఞానమునకు హేతువై యుండుటవలన దశమజ్ఞానముమానసమై యున్నది. అందువలన నింద్రియజన్యమని చెప్పినయెడల నదియును సంభవించుటలేదు. ఈరీతిగా నన్వయవ్యతిరేకముచేత మనస్సు సకలపదార్థజ్ఞానమునకునుహేతువై యున్నది. విక్షిప్త మనస్సు గలవారికి నేత్రప్రమాణముచేతను జ్ఞానము కలుగుటలేదు. సావధానమనస్కులకు మాత్రమే సకలజ్ఞానము కలుగుచున్నది. అందువలన జ్ఞానము మానసికముగా జెప్పవలసినది. అందువలన సర్వజ్ఞానమునకును మనస్సు సాధారణకారణమై యున్నది. ఇంద్రియము లనుమానాది సకలప్రమాణమునకును సహకారియై యున్నది. మనస్సహితనేత్రముచేత నేజ్ఞానము కలుగుచున్నదో అది చాక్షుషజ్ఞాన మనంబడును. మనస్సహితానుమాన ప్రమాణముచేత నే జ్ఞానము గలుగుచున్నదో అది అనుమితిజ్ఞాన మనంబడును. మనస్సహితశబ్దప్రమాణముచేత నేజ్ఞానము కలుగుచున్నదో అది శాబ్దజ్ఞాన మనబడును. అన్యప్రమాణములు లేకయే కేవలమనస్సుచేత నేజ్ఞానము కలుగుచున్నదో అది మానస జ్ఞాన మనంబడును, అది కేవలమనస్సుచేత నాంతరపదార్థ మగు సుఖాదివిషయక జ్ఞానమై యున్నది. అందువలన నాంతరపదార్థముయొక్క జ్ఞానమే మానసమై యున్నది. బాహ్యపదార్థముయొక్క యింద్రియానుమానాదికము లేకయే కేవల మనస్సుచేత జ్ఞానము కలుగుట లేదు. అందువలన దశమజ్ఞానము మానసమై యున్నది. అని చెప్పుట సంభవించుట లేదు. ఆంతరపదార్థ విషయక జ్ఞానము మానసికమై యున్నది, అను నిదియును నైయాయికమత రీతిగా జెప్పబడినది. సిద్ధాంతమందైననో యే జ్ఞానమును మానసము కాదు. ఎట్లనగా, శుద్ధాత్మస్వయంప్రకాశుడై యున్నాడు. ఆయనయొక్క

ప్రకాశమునందు ఏప్రమాణముయొక్క యపేక్షయు లేదు. అందువలన నాత్మజ్ఞానము మానసముకాదు, మఱియును సుఖాదికము సాక్షిభాస్యమై యున్నది. ఏకాలమునందు నిష్టపదార్థముయొక్క సంబంధముచేత సుఖాకారాంతఃకరణ పరిణామము కలుగుచున్నదో, అనిష్ట పదార్థముయొక్క సంబంధముచేత దుఃఖాకారాంతఃకరణపరిణామము కలుగుచున్నదో, ఆసమయములందు సుఖదుఃఖములను విషయీకరించుచుండు నంతఃకరణ సత్త్వగుణపరిణామవృత్తి కలుగుచున్నది. ఆవృత్తియందు నారూఢసాక్షి సుఖదుఃఖములను ప్రకాశింప జేయుచున్నాడు. సుఖదుఃఖములయొక్కయుత్పత్తిని గూర్చి ఇష్టసంబాధమును అనిష్టసంబాధమును నిమిత్తములై యున్నవి. ఈనిమిత్తములచేత సుఖదుఃఖములను విషయీకరించుచుండు నంతఃకరణవృత్తి కలుగుచున్నది. దాని యుత్పత్తియందు నేప్రమాణముయొక్క యపేక్షయు లేదు. అందువలన సుఖదుఃఖములు సాక్షిభ్యాసములై యున్నవి. యద్యపి ఘటాదికముయొక్క ప్రకాశముకూడ కేవల వృత్తిచేతనే గలుగుట లేదు. వృత్తియం దారూఢచేతనమువలననే సర్వప్రకాశము కలుగుచున్నది. అందువలన పదార్థము సాక్షిభాస్యముగా జెప్పవలసినది. తథాపి ఘటాదివిషయక జ్ఞానరూపాంతఃకరణ వృత్తియుత్పత్తియందు ఇంద్రియానుమానాది ప్రమాణములయొక్క యపేక్ష యున్నది. మఱియును సుఖాది విషయక జ్ఞానరూపవృత్తియొక్క యుత్పత్తియందు ప్రమాణముయొక్క యపేక్ష లేదు. ఇంత మాత్రము భేద మున్నది; ఏవృత్తియందు నారూఢసాక్షి విషయమును ప్రకాశింపజేయుచున్నదో ఆవృత్తి యెచ్చట నింద్రియానుమానాది ప్రమాణముచేత కలుగుచున్నదో అచ్చట విషయము సాక్షిభాస్యముగా జెప్పుట లేదు. ప్రమాణజన్య జ్ఞానమునకు విషయముగా జెప్పబడుచున్నది. ఎచ్చట ప్రమాణవ్యాపారము లేక యేవృత్తి యుత్పన్నమైనదో ఆ వృత్తియం దారూఢసాక్షి యే విషయమును ప్రకాశింపజేయుచున్నదో అది సాక్షిభాస్యముగా జెప్పబడుచున్నది. ఘటాదిగోచరాంతఃకరణముయొక్క వృత్తి యింద్రియానుమానాది ప్రమాణముచేత కలుగుచున్నది. ఆవృత్తియందు నారూఢసాక్షి ప్రకాశించుచున్నది తథాపి ఘటాదికము ప్రమాణగోచరముగా జెప్పబడుచున్నది, సాక్షిభాస్యము కాదు. సుఖాదిగోచరవృత్తి ప్రమాణజన్యము కాదు. సుఖాది జనక ధర్మాదిజన్యమై యున్నది. అందువలన సుఖాదికము సాక్షిభాస్యమై యున్నది. ఈరీతిగా సుఖాదికము దాని జ్ఞానము సమానసామగ్రిచేత కలుగు

చున్నవి. అందువలన నజ్ఞాతసుఖ ముండుట లేదు, జ్ఞాతముగానే సుఖముండును. మఱియును సుఖాదికముయొక్క ప్రత్యక్షమును గూర్చి సుఖాదికము హేతువు కాదు. పూర్వకాలమునందు సుఖాదిక ముండినయెడల స్వజ్ఞానమునకు హేతువు కా వచ్చును. సుఖాదికము దానియొక్క జ్ఞానము కూడ సమానకాలమునందు సమాన సామగ్రిచేత గలుగుచున్నవి. అందువలన పరస్పర కార్యకారణ భావము లేదు. ఘటాదికముయొక్క ప్రత్యక్షజ్ఞానమునందు ఘటాదికము హేతువై యున్నది. ఎట్లనగా, ప్రత్యక్షజ్ఞానము కంటె పూర్వమునందు ఘటాదిక ముత్పన్నమై యున్నది. అందువలన స్వగోచరప్రత్యక్షమును గూర్చి ఘటాదికము హేతువై యున్నది. ఘటాదికముయొక్క అనుమిత్యాదిజ్ఞానమైన యెడల ఆయనుమిత్యాదికమును గూర్చి ఘటాదికము హేతువు కాదు. అనుమితి జ్ఞానమునందును, శాబ్దజ్ఞానమునందును విషయము కూడ కారణ మయినయెడల అతీతానాగతపదార్థముయొక్క యనుమిత్యాదిజ్ఞానము కాకపోవలయును. అందువలన ననుమితిజ్ఞాన శాబ్దజ్ఞానాదికమునందు విషయము కారణము కాదు. ఈరీతిగానే సుఖాదికము కూడ స్వగోచర జ్ఞానమునకు కారణము కాదు. ప్రథమ ప్రసంగ మే మనగా, సుఖాదికముయొక్క జ్ఞానము మానసికము కాదు. సుఖాదిక ము సాక్షిభాస్యమై యున్నది. మనస్సునకు నసాధారణ విషయము దొరకదు. ఈకారణముచేత సర్వజ్ఞానమునకు నుపాదాన మంతఃకరణమై యున్నది. జ్ఞానమునకు స్వతంత్రకరణ రూపేంద్రియమును మనస్సునుగా నైయాయికులు చెప్పిన యెడల అది యసంగతమై యున్నది. అందువలన దశమజ్ఞానము మానసికము కాదు. వాక్యజన్యమై ప్రత్యక్షమై యున్నది. ఈరీతిగా నేది ప్రత్యక్షజ్ఞానమై యున్నదో అది ఇంద్రియ జన్యమై యున్నది, అను నియమము సంభవించుట లేదు. మఱియును ఏ యింద్రియజన్యజ్ఞాన మున్నదో అది ప్రత్యక్షమై యున్నది. ఇంద్రియజన్యజ్ఞాన మేదియును అప్రత్యక్షము కాదని చెప్పినయెడల నీనియమము చేత సిద్ధాంతమునకు హాని లేదు. ఎట్లనగా, ఇంద్రియజన్యజ్ఞానమునకు మేమును అప్రత్యక్షము నంగీకరింపము. ఇంద్రియజన్యజ్ఞానము ప్రత్యక్షమై యున్నది. కొన్ని స్థలములయందు శబ్దాదికముచేతను ప్రత్యక్షమగుచున్నది అని సిద్ధాంత మున్నది. అందువలన నుక్తనియమమునకు విరోధము లేదు. ఈరీతిగా ధర్మరాజపుత్రునియొక్క నైయాయికానుసారి యగు నుక్తి అసంగతమై యున్నది.

అందువలన నభావజ్ఞానము ఇంద్రియజన్యము కాదు. యోగ్యానుపలబ్ధి

నాపుత పృథక్ప్రమాణ జన్యమై యున్నది. ఎచ్చట ప్రతియోగి యుండినయెడల దానియొక్క యుపలంభము కావలయునని యీరీతిగా ప్రతియోగియొక్క యారోపమువలన నుపలంభారోపమున్నదో అచ్చట నభావజ్ఞానము యోగ్యానుపలబ్ధి ప్రమాణజన్యమై యున్నది. అంధకారమునందు ఘటాభావజ్ఞానము అనుమానాది జన్యమై యున్నది. అంధకారమునందు ఘట ముండినయెడల దానియొక్క యుపలంభ మగును. ఈరీతిగా ఘటరూపప్రతియోగియొక్క ఆరోపమువలన ఘటోపలంభముయొక్క యారోపము సంభవించుట లేదు. ఈరీతిగా నన్యమతమునందు నభావవిషయకమగు నెంతజ్ఞానము ఇంద్రియజన్యమై యున్నదో అంత జ్ఞానము వేదాంతమతమునందు కేవలానుపలబ్ధిజన్యమై యున్నది. నైయాయిక మతమునందు ఇంద్రియము కరణమై యున్నది, అనుపలబ్ధి సహకారి కారణమై యున్నది. అందువలన నింద్రియమునందు ప్రమాణత యున్నది, అనుపలబ్ధి యందు ప్రమాణత లేదు. వేదాంతమతమునందు అనుపలబ్ధియందు ప్రమాణత్వ మధికముగా నంగీకరింపబడియున్నది. అనుపలబ్ధి స్వరూపముచేత రెండుమతముల యందును సిద్ధమై యున్నది. ఈరీతిగానే న్యాయమతమునందు విశేషణతా సంబంధమునకు జ్ఞానకరణత్వము అధికముగా నంగీకరింపబడియున్నది. విశేషణతా సంబంధము స్వరూపముచేత నధికరణాభావములకు రెండు మతముల యందును సిద్ధమై యున్నది. ఈరీతిగా వేదాంతి కనుపలబ్ధియందు ప్రమాణత్వ మధికముగా నంగీకరింపవలసినది; నైయాయికునికి విశేషణతా సంబంధము నందు జ్ఞానముయొక్క కారణత్వము నధికముగా నంగీకరింపవలసినది. అందు వలన లాఘవ గౌరవ గుణ దోషము లెవరికిని లేవు. ఈయుభయులకు సమాన కల్పన యున్నది. తథాపి అభావజ్ఞానముయొక్క కరణత యింద్రియమునం దధికముగా నైయాయికుడు చెప్పుచున్నాడు. ఇది యితని మతమునందు గౌరవ దోషమై యున్నది. వాయువునందు రూపాభావజ్ఞానము నేత్రవ్యాపారము లేకయే కలుగుచున్నది. దానిని చాక్షుషజ్ఞానముగా నైయాయికుడు చెప్పుచున్నాడు. పరమాణువునందు మహత్త్వాభావజ్ఞానము కూడ నేత్రవ్యాపారము లేకయే కలుగుచున్నది. అదియును నైయాయికుడు చాక్షుషజ్ఞానముగా జెప్పుచున్నాడు. ఈరీతిగా ననేక స్థలములయందు ఏయింద్రియములయొక్క వ్యాపారము లేకయే యేయభావముయొక్క జ్ఞానము కలుగుచున్నదో అది ఆయింద్రియజన్య మనంబడును. అది యనుభవవిరుద్ధమై యున్నది. ఏయింద్రియ

వ్యాపారముచేత నేజ్ఞానము కలుగుచున్నదో ఆజ్ఞాన మాయింద్రియజన్యమై యున్నది. ఏయింద్రియ వ్యాపారము లేకయే జ్ఞానము కలుగుచున్నదో ఆయింద్రియజన్యత్వము జ్ఞానమునకు నంగీకరించినయెడల సకల జ్ఞానము సకలేంద్రియ జన్యము కావలయును. అందువలన నభావజ్ఞానము ఇంద్రియజన్యమై యున్నది అను నైయాయికమతము సమీచీనము కాదు. ఈరీతిగా నభావజ్ఞానము అనుపలబ్ధి ప్రమాణజన్యమై యున్నది. అయినను అభావజ్ఞానముయొక్క యుత్పత్తియందు వ్యాపారహీనాసాధారణకారణ మనుపలబ్ధియై యున్నది. అందువలన నభావజ్ఞానముయొక్క యసాధారణకారణత్వము అనుపలబ్ధి ప్రమాణమునకు లక్షణమై యున్నది.

97. అనుపలబ్ధిప్రమాణముయొక్క నిరూపణము జిజ్ఞాసువున కుపయోగము.

అనుపలబ్ధినిరూపణముచేత జిజ్ఞాసువునకు నుపయోగ మున్నది. 'నేహ నానాస్తి కించన" ఇత్యాది శ్రుతిప్రపంచముయొక్క త్రైకాలికాభావమును జెప్పుచున్నది. అనుభవసిద్ధ ప్రపంచమునకు త్రైకాలిక నిషేధము సంభవించుట లేదు. అందువలన ప్రపంచమునకు స్వరూపముతో నిషేధము చేయబడ లేదు. ఇక నేమనగా, ప్రపంచము పారమార్థికముగా లేదు. అందువలన పారమార్థికత్వ విశిష్ట ప్రపంచముయొక్క త్రైకాలికాభావమును శ్రుతి చెప్పుచున్నది. ఈరీతిగా పారమార్థికత్వ విశిష్ట ప్రపంచముయొక్క యభావము శ్రుతి సిద్ధమై యున్నది. మఱియును అనుపలబ్ధి ప్రమాణముచేతను సిద్ధమై యున్నది. పారమార్థికత్వవిశిష్ట ప్రపంచ ముండినయెడల నెట్లు ప్రపంచమునకు స్వరూపముతో నుపలబ్ధి గలుగుచున్నదో యట్లు పారమార్థిక ప్రపంచమునకును నుపలబ్ధి కావలయును. స్వరూపముచేత ప్రపంచోపలబ్ధి యున్నది. పారమార్థిక రూపముతో ప్రపంచోలబ్ధి లేదు. అందువలన పారమార్థికత్వ విశిష్ట ప్రపంచముయొక్క యభావ మున్నది. ఈరీతిగా ప్రపంచాభావజ్ఞానము అనుపలబ్ధిచేత గలుగుచున్నది. మఱియును అనేకాభావవిషయక జ్ఞానము జిజ్ఞాసునకు నిష్టమై యున్నది. దానికి హేతువు అనుపలబ్ధి ప్రమాణమై యున్నది.

ఇది శ్రీమన్నిశ్చలదాసాహ్వాయసాధు విరచిత మగు వృత్తిప్రభాకరమునందు అనుపలబ్ధి ప్రమాణనిరూపణమను షష్ఠప్రకాశము సమాప్తము.

# వృత్తిప్రభాకరము

## సప్తమప్రకాశము.

వృత్తిభేదము, అనిర్వచనీయఖ్యాతిమండనము, అన్యఖ్యాతి ఖండనము, స్వతఃప్రమాత్వ ప్రమాణనిరూపణమునను సప్తమప్రకాశము ప్రారంభము.

98. ఉపాదానము; (సమవాయి); అసమవాయి. నిమిత్తకారణము. సంయోగముయొక్క లక్షణము.

గ్రంథారంభమునందు 'వృత్తియనగా నేమి?' అను వచనముచేత వృత్తి యొక్కలక్షణము దానియొక్కభేదము అడుగబడినవి. వృత్తికారణ మేది? ఇది వృత్తిసామగ్రియొక్క ప్రశ్నమై యున్నది. మూడవ ప్రశ్న వృత్తియొక్క ప్రయోజనము. దీనిలో వృత్తిప్రయోజననిరూపణము అష్టమప్రకాశమునందు స్పష్టమగును. కారణసముదాయము సామగ్రి యనంబడును. కారణము ద్వివిధమై యున్నది. ఒకటి యుపాదానకారణము, మఱియొకటి నిమిత్తకారణము. దేనియొక్క స్వరూపమునందు కార్య మున్నదో అది ఉపాదానకారణ మనంబడును. ఉపాదాన కారణమే సమవాయి కారణ మనంబడును. ఉ. ఘటమునకు ఉపాదాన కారణము కపాలమై యున్నది. మఱియును కార్యముకంటె తటస్థమై కార్యజనకమై ఏది యున్నదో అది నిమిత్తకారణ మనంబడును. ఉ. ఘటమునకు నిమిత్త కారణము కపాలచక్రదండాదికమై యున్నది. న్యాయ వైశేషిక మతమునందు, సమవాయ్య సమవాయినిమిత్తభేదమువలన, కారణము త్రివిధమై యున్నది. కార్యముయొక్క సమవాయి కారణముతో సంబంధియై కార్యమునకు ఏది జనకమై యున్నదో అది అసమవాయి కారణ మనంబడును. ఉ. ఘటమునకు అసమవాయి కారణము కపాలసంయోగమై యున్నది. పటమునకు అసమవాయి కారణము తంతు సంయోగమై యున్నది. ఘటమునకు సమవాయి కారణమగు కపాలముతో సంబంధియై ఘటమునకు జనకమై కపాలసంయోగ మున్నది. ఈలాగుననే పటమునకు సమవాయికారణ మగు తంతువుతో సంబంధియై పటమునకు జనకమై తంతుసంయోగ మున్నది. సమవాయి కారణముయొక్క సంయోగ

మును కార్యజనకముగా అంగీకరింపనియెడల వియుక్తకపాలములచేత ఘటమునకు, వియుక్తతంతువులచేత పటమునకు నుత్పత్తి కావలయును. ఈరీతిగా ద్రవ్యముయొక్క యుత్పత్తియందు అవయవసంయోగము కారణమై యున్నది. ఆ యవయవసంయోగమునందు కార్య ముండదు. ఆ యవయవమునందు కార్యద్రవ్యముయొక్క స్థితి యున్నది అందువలన అవయవసంయోగమునకు సమవాయి కారణత్వము సంభవించుటలేదు. కార్యముకంటె తటస్థముగా నుండుటలేదు. ఇక నేమనగా, అవయవసంయోగము కార్యద్రవ్యమును, అవయవమునందు సమానాధికరణ మై యున్నవి. అందువలన నిమిత్తకారణత్వము కూడ అవయవసంయోగమునందు సంభవించుటలేదు. అందువలన సమవాయి కారణ నిమిత్తకారణములకంటె విలక్షణమై అసమవాయికారణ ముండుటవలన కారణము త్రివిధమై యున్నది. ఎట్లు ద్రవ్యోత్పత్తియందు అవయవసంయోగము అసమవాయి కారణమై యున్నదో అట్లు గుణోత్పత్తియందు కొన్నిచోట్ల గుణము అసమవాయి కారణమై యున్నది. కొన్నిచోట్ల క్రియ అసమవాయి కారణమై యున్నది. తథాహి, నీలతంతువుచేత నీలపటోత్పత్తి యగుచున్నది. పీతపట ముత్పన్నమగుట లేదు. అందువలన పటముయొక్క నీలరూపమును గుఱించి తంతువుయొక్క నీలరూపము కారణమై యున్నది. ఆపటముయొక్క నీలరూపమునకు సమవాయి కారణము పటమై యున్నది. తంతువుయొక్క నీలరూపమునకు సమవాయి కారణము పటము కాదు. ఈలాగుననే తంతువుయొక్క నీలరూపము పటముయొక్క నీలరూపముతో తటస్థమై లేదు. ఇక నేమనగా తంతువుయొక్క నీలరూపము తంతువునం దున్నది. పటముయొక్క నీలరూపము గూడ తంతువునం దున్నది. అందువలన రెండు సమానాధికరణములై యుండుట వలన సంబంధియై యున్నది. మఱియును అసంబంధి తటస్థ మనంబడును. యద్యపి పటముయొక్క నీలరూపము సమవాయ సంబంధముచేత పటమునం దున్నది. తథాపి స్వ సమవాయిసంబంధముచేత పటముయొక్క నీలరూపము తంతువునందే యున్నది. స్వం అనగా పటముయొక్క నీలరూపము దానికి సమవాయి యగు నేపట మున్నదో దానియొక్క సమవాయము తంతువునం దున్నది. ఈరీతిగా పటముయొక్క నీలరూపముతో తంతువుయొక్క నీలరూపము సమానాధికరణమై యున్నది. తంతువుయొక్క నీలరూపము సాక్షాత్సంబంధముచేత తంతువునం దున్నది దానియందే పటద్వారా పరంపరాసంబంధముచేత పటము

యొక్క నీలరూప మున్నది. అందువలన పటముయొక్క నీలరూపముతో తంతువుయొక్క నీలరూపము తటస్థము గాసంచున నిమిత్తకారణము కాదు. ఇక నేమనగా, పటముయొక్క నీలరూపమునకు సమవాయికారణ మగు నేపట మున్నదో దానియొక్క సంబంధి యగు తంతువుయొక్క నీలరూపమై యున్నది. పటముయొక్క నీలరూపమునకు జనకమైనందున దానికి నసమవాయికారణము తంతువుయొక్క నీలరూపమై యున్నది. తంతువుయొక్క నీలరూపము, పటము, ఈ రెండును తంతువునందు సమవాయ సంబంధముచేత నున్నవి. అందువలన సమానాధికరణసంబంధముచేత తంతువుయొక్క నీలరూపము పటసంబంధియై యున్నది. ఎట్లు కార్యరూపమునకు నసమవాయికారణము ఉపాదానరూపమై యున్నదో అట్లు రస, గంధ, స్పర్శములయందును తెలియవలసినది. సకలగుణములయొక్క యుత్పత్తియందును ఏరీతిగా గుణమునకు క్రియ అసమవాయికారణమై యున్నదో అది న్యాయవైశేషిక గ్రంథములయందు విస్పష్టముగా జెప్పబడియున్నది. అనుపయోగి యని దెలిసియు గ్రంథవిస్తర భయముచే నిచట వ్రాయలేదు.

సంయోగప్రసంగ మనేకస్థలములయందు వచ్చియున్నది. గుణోత్పత్తియందు క్రియాసమవాయికారణముయొక్క యుదాహరణముయొక్క కథనము సంయోగోత్పత్తి స్థలమునందు సంభవించుచున్నది. సంయోగము ద్వివిధమై యున్నది. ఒకటి కర్మజ సంయోగము. మఱియు నొకటి సంయోగజ సంయోగము. దేనియొక్క యుత్పత్తియందు క్రియ అసమవాయికారణమై యున్నదో యది కర్మజ సంయోగ మనబడును. కర్మజసంయోగము కూడ అన్యతర కర్మజ మని, ఉభయకర్మజ మను నీభేదమువలన ద్వివిధమై యున్నది. సంయోగమున కాశ్రయమైన రెంటిలో నేకద్రవ్యముయొక్క క్రియచేత నేసంయోగము గలుగుచున్నదో యది యన్యతరకర్మజ సంయోగ మనంబడును. ఉ. పక్షియొక్క క్రియచేత వృక్షపక్షులకు సంయోగము గలుగుచున్నది. అది యన్యతరకర్మజ సంయోగ మగుచున్నది. అచ్చట వృక్షము, పక్షియు సమవాయికారణమై యున్నవి. సంయోగమునకు సమవాయి కారణ మగు పక్షియందు నాక్రియయొక్క సమవాయ సంబంధ ముండుటవలన పక్షిరూప సమవాయి కారణమునకు సంబంధినియై, పక్షివృక్షములయొక్క సంయోగమునకు జనకమై పక్షియొక్క క్రియ యున్నది. అందువలన పక్షివృక్షసంయోగమునకు నసమవాయి కార

ణము పక్షిక్రియ యై యున్నది. ఇది అన్యతరకర్మజ సంయోగమునకు నుదాహరణమై యున్నది. మేషద్వయముయొక్క క్రియచేత నేమేషముల సంయోగము గలుచున్నదో యది యుభయకర్మజ సంయోగమై యున్నది. మేషద్వయ సంయోగమును గూర్చి రెండు మేషములును సమవాయి కారణమై యున్నవి. వానియొక్క సంయోగము అసమవాయి కారణమై యున్నది. ఎచ్చట హస్తక్రియచేత హస్తతరుసంయోగ మున్నదో యచ్చట హస్తతరువులు పరస్పరసంయుక్తములై యున్నవి, అను నీవ్యవహారమువలె కాయతరువులు సంయుక్తములై యున్నవి అను వ్యవహారముకూడ కలుగుచున్నది. సంయుక్త మనగా సంయోగసహితము, ఈ స్థలమునందు హస్తతరువులయొక్క సంయోగమును గూర్చి హస్తక్రియ అసమవాయి కారణమై యున్నది. మఱియు, కాయమునందైనను, లేక తరువునందైనను క్రియ కలిగినయెడల కాయతరుసంయోగము గూడ క్రియాజన్యమని ప్రసిద్ధిగా నున్నది. మఱియును వృక్షమునందువలె కాయమునందు క్రియ కలుగుటలేదు. ఎట్లన, సకలావయవములయందును క్రియ యున్నది. సకలావయవములయందును క్రియ కలిగినయెడల అవయవియందును క్రియ కలుగుచున్నది. హస్తముకంటె నితర సకలావయవములు నిశ్చలమై యుండుటవలన కాయమునందు క్రియాకథనము సంభవించుటలేదు. అందువలన కాయతరు సంయోగమును గూర్చి క్రియ అసమవాయికారణ మని చెప్పుట సంభవించుటలేదు. ఇక నేమనగా, అన్యతరకర్మజమగు హస్తతరు సంయోగమే కాయతరు సంయోగమునకు నసమవాయి కారణమై యున్నది. ఎట్లన, కాయతరు సంయోగమునకు సమవాయి కారణ మగు నేకాయ మున్నదో దానియందు స్వసమవాయి సమవేతత్వసంబంధముచేత హస్తతరు సంయోగము సంబంధియై యున్నది, కాయతరు సంయోగమునకు జనకమై యున్నది. అందువలన నసమవాయి కారణమై యున్నది. స్వ మ్మనగా, హస్తతరు సంయోగము, దానికి సమవాయి హస్తమై యున్నది. దానిలో సమవేత మగు నేకాయ మున్నదో దానియొక్క సమవేతత్వరూపధర్మమే సంబంధమై యున్నది. ఈరీతిగా పరంపరా సంబంధమునకు సామానాధికరణ్య సంబంధమునందు పర్యవసాన మున్నది. ఒక యధికరణమునందు రెంటియొక్క స్థితి సామానాధికరణ్య మనంబడును. ఇచట వేనికి నేకాధికరణమునందు వృత్తి యున్నదో వానికి సమానాధికరణము లని పేరు. ఇచ్చట హస్తతరుసంయోగము సమవాయసంబంధముచేత హస్తమునం దున్నది. కాయము గూడ సమ

వాయి సంబంధముచేత హస్తమునం దున్నది. అందువలన రెండును సమానాధికరణములై యున్నవి. వానికి సామానాధికరణ్యసంబంధ మున్నది. ఇచ్చట కాయమును, సంయోగమును హస్తమునందు సాక్షాత్సంబంధముచేత నున్నవి, అందువలన సమానాధికరణములై యున్నవి. ఈరీతిగానే యొకటి సాక్షాత్సంబంధముచేత నున్నది. మఱియు నొకటి పరంపరాసంబంధముచేత నున్నది. అదియును సమానాధికరణమైయున్నది. వానియొక్క సామానాధికరణ్యము సంబంధమనంబడును. ఇది ప్రత్యక్షప్రమాణమునందు చెప్పబడియున్నది. హస్తతరు సంయోగముయొక్క ప్రతీతి యుండినప్పుడే కాయతరుసంయోగప్రతీతి కలుగుచున్నది. హస్తతరు సంయోగమును జూడనియెడల ఆకాయతరుసంయోగ ప్రతీతి కలుగుట లేదు. అందువలన కాయతరు సంయోగమునకు హస్తతరు సంయోగము కారణమై యున్నది. ఇది సంయోగజ సంయోగమునకు నుదాహరణమై యున్నది. ఈసంయోగమే కారణాకారణ సంయోగజన్య కార్యాకార్య సంయోగ మనంబడును. ఇచ్చట రెండు సంయోగము లున్నవి. (1) ఒకటి హస్తతరు సంయోగము; అది హేతుసంయోగమై యున్నది; (2) కాయతరు సంయోగము. ఫలసంయోగమై యున్నది. ఈస్థానమునందు కారణశబ్దముచేత ఫలసంయోగమున కాశ్రయమగు సమవాయి కారణమును గ్రహింపవలయును. అందువలన ఫలసంయోగమునకు నాశ్రయములు, కాయము తరువు. ఈరెంటిలో కాయమునకు సమవాయి కారణము హస్తమై యున్నది. అందువలన కారణశబ్దముచేత హస్తమునకు గ్రహణ మున్నది. అకారణశబ్దముచేత తరువునకు గ్రహణమగుచున్నది. ఎట్లన, కాయమునకు, లేక తరువునకు సమవాయికారణము తరువు కానందున అకారణమై యున్నది. ఈరీతిగనే సంయోగముయొక్క యాశ్రయముచేత జన్యమైన దానికి కార్యశబ్దముచేత గ్రహణమగుచున్నది. హేతుసంయోగాశ్రయముచేత అజన్యమైన దానికి అకార్యశబ్దముచేత గ్రహణమగుచున్నది. హేతుసంయోగమున కాశ్రయము హస్తము, తరువుకూడ అయియున్నవి. వీనిలో హస్తజన్య మగు నేకార్య మున్నదో యది కార్యమై యున్నది. మఱియును, హస్తముచేతను తరువుచేతను యజన్య మగు నేతరువున్నదో అది అకార్యమై యున్నది. ఈరీతిగా కారణ మగు నేహస్తము, అకారణ మగు నే తరువు ఉన్నవో వానియొక్క సంయోగముచేత కార్య మగు నే కాయము, అకార్యమగు నేతరువు నున్నవో వానికి సంయోగము కలుగుచున్నది. అందువలన నీ

సంయోగము కారణాకారణ సంయోగజన్య కార్యాకార్య సంయోగి యన బడును. సంయోగజ సంయోగము ఈప్రకారమై యున్నది. కర్మజసంయోగము అన్యప్రకారమై యున్నది. ఎచ్చట కపాలకర్మచేత కపాలద్వయసంయోగ మున్నదో కపాలసంయోగముచేత కపాలాకాశసంయోగమున్నదో అచ్చట సంయోగము కర్మజమయియే యున్నది, సంయోగజ సంయోగము కాదు. ఎట్లన నేకపాలముయొక్క కర్మచేత కపాలద్వయ సంయోగమున్నదో ఆ కపాలకర్మ చేతనే కపాలాకాశ సంయోగము కలుగుచున్నది. కపాలద్వయముయొక్క సంయోగము కపాలాకాశ సంయోగము ఈరెండును ఏకక్షణముసందు కలుగు చున్నవి. వానికి పరస్పరము కార్యకారణ భావము సంభవించుటలేదు. అందు వలన కపాలద్వయ సంయోగమువలె కపాలాకాశసంయోగము కూడ క పాలక్రియచేతనే యుత్పన్నమైనందున సంయోగము కర్మజముగానే యున్నది. ఉక్తప్రకారముగా కారణాకారణసంయోగజన్య కార్యాకార్యసంయోగము, అన్యతరకర్మజ సంయోగము, ఉభయకర్మజ సంయోగము నను నీభేదములవలన సంయోగము త్రివిధముగా నున్నది. కొందఱు గ్రంథకారులు సహజసంయోగ మును కూడ నంగీకరించి యున్నారు. ఉ. సువర్ణమునందు పీతరూప గురుత్వా శ్రయమగు పార్థివభాగముయొక్క యగ్నిసంయోగముచేత దేనికి నాశము కలు గుట లేదో ఆద్రవత్వాశ్రయముతో తైజసభాగమునకు సహజ సంయోగ మున్నది. సంయోగియొక్క జన్మతో కూడ నేది యుత్పన్నమైనదో యది సహజ సంయోగ మనంబడును, సువర్ణము కేవల పార్థివ మని చెప్పినయెడల జలత్వాది పార్థివముయొక్క ద్రవత్వమునకు నగ్ని సంయోగముచేత నాశము గలుగుట వలన సువర్ణద్రవత్వమునకు నగ్నిసంయోగముచేత నాశము కావలయును. కేవల తైజస మని చెప్పినయెడల పీతరూప గురుత్వములయొక్క యభావము కావల యును. అందువలన సువర్ణమునందు తైజస పార్థివభాగములు సంయుక్తములై యున్నవి. మఱియును మీమాంసకుడు నిత్యసంయోగము నంగీకరించినాడు. ఈరీతిగా ద్రవ్యోత్పత్తియందు సమవాయికారణము అవయవసంయోగమై యున్నది. గుణోత్పత్తియందు నొకప్పుడు గుణము మఱియు నొకప్పుడు క్రియ అసమవాయి కారణమై యున్నది. సమవాయికారణ నిమిత్తకారణముల యొక్క లక్షణము దానియందు సంభవింపదు. సమవాయికారణమునందు సం బంధియై యేది కార్యజనకమై యున్నదో అది అసమవాయికారణ మైనందున

సమవాయ్యసమవాయి నిమిత్తభేదమువలన కారణము త్రివిధమై యున్నది. ఇది నైయాయికవైశేషికానుసారిగ్రంథమునందు వ్రాయంబడియున్నది.

### 99. ఉభయ కారణాంగీకార పూర్వక తృతీయ మగు అసమవాయి కారణముయొక్క ఖండనము.

తథాపి న్యాయ వైశేషికభిన్నమతములయందు నుపాదానకారణము నిమిత్తకారణములను నీద్వివిధ కారణము లంగీకరింప బడియున్నవి. నైయాయికుడు దేనిని అసమవాయి కారణముగా జెప్పుచున్నాడో దానిని నిమిత్తకారణముగా గణించియున్నారు. నిమిత్తకారణముయొక్క లక్షణము అసమవాయికారణమునందు లేదు, అని పూర్వమునం దేది చెప్పబడియున్నదో దానికి సమాధానము. కార్యముతో తటస్థమై కార్యమునకు జనకమై యేది యున్నదో అది నిమిత్తకారణముయొక్క లక్షణము, అని త్రివిధకారణవాది రీతిగా చెప్పబడియున్నది. ద్వివిధకారణవాదిరీతిగా నైననో ఉపాదానకారణముకంటె భిన్న మగు నేకారణమున్నదో అది నిమిత్తకారణ మనంబడును. ఆనిమిత్తకారణ మనేకవిధములుగా నున్నది. కొన్ని కార్యములయొక్క యుపాదానమునందు సమవేతమై యున్నది. ఉ. ఘటమునకు నిమిత్తకారణము కపాలసంయోగమైయున్నది. అదిఘటమునకు నుపాదానకారణ మగు కపాలమునందు సమవేతమై యున్నది. మఱి కొన్ని నిమిత్తకారణములు కార్యోపాదానముయొక్క యుపాదానమునందు సమవేతములై యున్నవి. ఉ. ఘటరూపమునకు నిమిత్తకారణము తంతురూపమై యున్నది. పటరూపమునకు నుపాదాన మగు నేపట మున్నదో దానికి నుపాదాన మగు తంతువునందు అది సమవేతమై యున్నది. ఈరీతిగానే కొంత నిమిత్తకారణము కర్తృరూప చేతనమై యున్నది. వాడు స్వతంత్రుడై యున్నాడు. ఉ. ఘటమునకు నిమిత్తకారణము కులాలుడై యున్నాడు. కొంత నిమిత్తకారణము జడమైనది. అది కర్తృపరాధీనమై యున్నది. ఉ. ఘటమునకు కారణము దండాదికమై యున్నది. ఈరీతిగా నిమిత్తకారణమునం దనేకభేదము లున్నవి. కించిద్వైలక్షణ్యముచేత అసమవాయికారణమును వేఱుగా నంగీకరించినయెడల ఘటకారణ మగు కపాలసంయోగమునందును, ఘటరూపకారణ మగు కపాలరూపమునందును కారణతాభేద మంగీకరింపవలయును. ఎట్లనగా, ఘటకారణ మగు కపాలసంయోగమైననో కార్యోపాదానమునందు సమవేతమై యున్నది. ఘటరూపకారణమగు కపాలరూపముకూడ కార్యోపాదానమునందు సమవేతమై యున్నది.

ఈరీతిగా విలక్షణ కారణములై యున్నవి. ఈరెంటిని నైయాయికుడు అసమవాయికారణములనుగానే చెప్పియున్నాడు. దీనిలో పరస్పరవిలక్షణకారణత్వమంగీకరింపబడలేదు. ఈరీతిగానే చేతన జడభేదమువలన వైలక్షణ్యముండినను అది నిమిత్తకారణముగానే చెప్పబడుచున్నది. పరస్పర విలక్షణ కారణత్వము వానియందు నంగీకరింపబడలేదు. మఱియును నిమిత్తకారణమునందు ననేక విలక్షణత్వ మున్నది. కొన్ని కార్యకాలవృత్తియై యున్నవి. కొన్ని కార్యకాలముకంటె పూర్వకాలవృత్తియై యున్నవి. ఉ. జలపాత్రముయొక్క సన్నిధానముచేత గోడయందు సూర్యప్రభాప్రతిబింబము కలుగుచున్నది. దానిని గూర్చి సన్నిహితజలపాత్ర నిమిత్తకారణమై యున్నది. ఆజలపాత్రను తీసికొనివెళ్లుటవలన ప్రతిబింబాభావము కలుగుచున్నది. అందువలన సన్నిహిత జలపాత్ర కార్యకాల వృత్తియగు నిమిత్తకారణమై యున్నది. ప్రత్యక్షజ్ఞానమునందు విషయము నిమిత్తకారణమై యున్నది. అదియును కార్యకాల వృత్తియై యున్నది. దండాదికము ఘటమునకు నిమిత్తకారణమై యున్నది. అది కార్యకాలముకంటె పూర్వకాలమునందు వృత్తియగు నిమిత్తకారణమై యున్నది. ఈరీతిగా నిమిత్త కారణమునందును, అసమవాయి కారణమునందును అవాంతర భేదములనేకము లుండుటవలన సమవాయికారణముకంటె భిన్న మగుదానియందు ద్వివిధకారణత్వమే యంగీకరింపవలసి యున్నది. ఒకప్పుడు సమవాయికారణత్వమున్నది. మఱియొకప్పుడు నిమిత్తకారణత్వ మున్నది. ఈ ప్రకారముగానే సమవాయికారణముకంటె భిన్నమగు సకలకారణమునందును ఏకవిధకారణత్వమునే యంగీకరింప వలయును. ఆ సమవాయికారణమునకంటె భిన్నమగు కారణమును అసమవాయికారణముగాను, నిమిత్తకారణముగాను చెప్పవచ్చును. సమవాయికారణ సంబంధిత్వాసంబంధిత్వరూపావాంతరభేదమువలన వేఱు సంజ్ఞాకరణము నిష్ప్రయోజనమై యున్నది. అందువలన సమవాయికారణ, నిమిత్తకారణ భేదముచేత కారణము ద్వివిధమై యున్నది.

ఒకడు శంకించున దేమనగా, ఎట్లు అసమవాయి నిమిత్తకారణముల యొక్క పృథక్సంజ్ఞ నిష్ప్రయోజనమై యున్నదో అట్లు సమవాయికారణ నిమిత్త కారణములయొక్క పరస్పర వైలక్షణ్య జ్ఞానముచేతను పురుషార్థప్రాప్తి కలుగుట లేదు. లోకమునందును కారణతామాత్రమె ప్రసిద్ధమై యున్నది. సమవాయి కారణతయును, నిమిత్తకారణతయును ప్రసిద్ధముగా లేవు. అందువలన లోక

వ్యవహారజ్ఞానమును ద్వివిధకారణతా నిరూపణకు ప్రయోజనముకాదు. కార్యకారణ భావవ్యవహారము లోకమునందు గలుగుచున్నది. అందువలన నేది యుండుటవలన కార్యోత్పత్తి యగుచున్నదో యేది యుండకపోవుటవలన గార్యోత్పత్తి యగుట లేదో యీరీతిని నేది కార్యావ్యవహిత పూర్వకాల వృత్తియై యున్నదో అది కారణ మనంబడును. ఈరీతిగా కారణమునకు సాధారణ లక్షణమును జెప్పవలయును, ఆ భేదద్వయ నిరూపణము కూడ నిష్ప్రయోజనమై యున్నది, అనునిశంకకు సమాధానము. యద్యపి కారణభేదద్వయ నిరూపణము చేత పురుషార్థ సిద్ధి, లేక, వ్యవహారసిద్ధియు ప్రయోజనముకాదు. తథాపి పురుషార్థమునకు హేతువు అద్వైతజ్ఞానమై యున్నది. ద్వివిధకారణ నిరూపణము దాని కుపయోగియై యున్నది. అది యుక్తమే కదా. సర్వజగత్కారణము బ్రహ్మమై యున్నది మఱియును కారణముకంటె కార్యము అభిన్నమై యున్నది. అందువలన సకల జగత్తు బ్రహ్మమై యున్నది. దానికంటె వేఱులేదు. దీనిని వినిన జిజ్ఞాసువునకు నిట్లు శంక కలుగుచున్నది. కారణముకంటె భిన్నముగా కార్యము లేనియెడల దండకులాలాదికముకంటెను ఘటము భిన్నముగా నుండక పోవలయును; సమాధానము; ఉపాదాన నిమిత్త భేదమువలన కారణము ద్వివిధమై యున్నది. వీనిలో నుపాదానముకంటె కార్యము అభిన్నముగానున్నది. ఉ. మృత్పిండముకంటె ఘట మభిన్నమై యున్నది, కటకకుండలాదికము సువర్ణముకంటె నభిన్నమై యున్నది, నఖనికృంతన (గోరుగొల్చు) క్షురాదికము లోహముకంటె నభిన్నమై యున్నది. మఱియు నిమిత్తకారణముకంటె నభిన్నముగా లేదు, భిన్నముగానే యున్నది. ఈరీతిగానే బ్రహ్మముకూడ జగత్తునకు నుపాదాన కారణమై యున్నది. అందువలన సకల జగత్తు బ్రహ్మ మయియే యున్నది. దానికంటె భిన్నముకాదు. ఈరీతిగా కారణభేదద్వయ నిరూపణము అద్వైతజ్ఞానమున కుపయోగియై యున్నది. అన్యవిధకారణములకు పరస్పర విలక్షణతా నిరూపణము నిష్ఫలమై యున్నది. అందువలన తత్త్వజ్ఞానోపయోగి పదార్థ నిరూపణ గ్రంథమునందు కారణముయొక్క తృతీయభేద నిరూపణ మసంగతమై యున్నది.

న్యాయ వైశేషికానుసారి గ్రంథమునందు తత్త్వజ్ఞానోపయోగి యగు పదార్థనిరూపణమును ప్రతిజ్ఞచేసి తత్త్వజ్ఞానమునందు నత్యంతానుపయోగి యగు పదార్థములయొక్క విస్తారి నిరూపణముచేత ప్రతిజ్ఞాభంగము కలుగుచున్నది.

ఒకానొక తార్కికుడు శంకించునదేమనగా, తత్త్వజ్ఞానమునకు మననము హేతువై యున్నది "ఆత్మా ఇతరపదార్థభిన్నః, ఆత్మత్వాత్, యోనేతరభిన్నః, కింతు ఇతరః, సోఽనాత్మా యథా ఘటః" అను నీ వ్యతిరేకానుమానముచేత నాత్మయందు నితరభేదానుమితిజ్ఞానము కలుగుచున్నది. అది మనన మనంబడును. ఇతర పదార్థముయొక్క జ్ఞానము లేకయే ఆత్మయందు నితర భేదజ్ఞానము కలుగుటలేదు. ఎట్లన ప్రతియోగిజ్ఞానము లేకయే భేదజ్ఞానము కలుగుట లేదు. అందువలన నాత్మయందు నితరభేదానుమితిరూప మననమునకు నుపయోగి యై ఇతరపదార్థనిరూపణము తత్త్వజ్ఞానమున కుపయోగియై యున్నది. అది సంభవించుటలేదు. ఎట్లన శ్రుతార్థముయొక్క నిశ్చయమునకు ననుకూల మగు ప్రమేయ సందేహానివృత్తియగు యుక్తి చింతనము మనన మనంబడును. మఱియు భేదజ్ఞానముచేత ననర్థము కలుగును. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది వాక్యముచేత నపరిదృశ్యమాన మగు చరాచరాత్మక సర్వజగమునకు బ్రహ్మతో నత్యంతాభేదము సకలవేదతాత్పర్యమై యున్నది. "ద్వితీయాద్వై భయం భవతి; మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఇత్యాది వాక్యములచేత భేదజ్ఞానమునకు నింద కనిపించుచున్నది. అందువలన భేదజ్ఞానము, సాక్షాత్తుగా గాని, లేక తత్త్వజ్ఞానము ద్వారాగా గాని పురుషార్థ జనకము కాదు. మఱియును మననపదముచేతను ఆత్మకంటె నితరభేదప్రతీతి కలుగుటలేదు. మననపదమునకు చింతనము మాత్రము అర్థమై యున్నది. వాక్యాంతరానుసారముగా నభేద చింతనమునందు మనన శబ్దమునకు పర్యవసన్నార్థమున్నది, ఏప్రకారముగాను ఆత్మకంటె నితరభేదము మననశబ్దార్థముగా సంభవించుట లేదు. మఱియు నితర పదార్థజ్ఞానముచేతనే పురుషార్థ సాధనతత్త్వజ్ఞాన ప్రాప్తి యగునెడల సకల పురుషులకును లేక ఎవ్వరికిని తత్త్వజ్ఞానప్రాప్తి లేకపోవలయును. ఇతరపదార్థముయొక్క సామాన్యజ్ఞానము అపేక్షిత మైనయెడల ఆసామాన్యజ్ఞానము సర్వపురుషులకు నున్నది. అందువలన నితరజ్ఞానపూర్వకేతర భేదజ్ఞానముచేత సర్వజనులకును తత్త్వజ్ఞానము కావలయును, సర్వపదార్థములయొక్క యసాధారణధర్మస్వరూప మగు విశేషరూపముతో నితరజ్ఞాన మపేక్షిత మగునెడల సర్వజ్ఞుడగు నీశ్వరుడు తప్ప నితరుల కెవరికిని నసాధారణ ధర్మముతో సకలేతర జ్ఞానము సంభవించుట లేదు. అందువలన నితరజ్ఞానము సంభవింపనందున నితర భేదజ్ఞానము సంభవించుటలేదు. అందువలన తత్త్వజ్ఞాన మెవరికిని కలుగుట

లేదు. అందువలన ప్రమాణాది నిరూపణములేక బహుతర పదార్థములయొక్క నిరూపణము నిష్ప్రయోజనమైనందున కారణమునందు తృతీయభేద నిరూపణము అనపేక్షితమై యున్నది. తార్కికునిశంక యేమనగా.

భావకార్యముయొక్క యుత్పత్తి త్రివిధకారణములచేత నగుచున్నది. పంచవిధాఽభావము లున్నవి, వానిలో ప్రాగభావము అనాది సాంతమై యున్నది. అందువలన దానికి నాశ మున్నది, ఉత్పత్తిలేదు. అన్యోన్యాభావాత్యంతాభావములు అనాదులై యనంతములునై యున్నవి, అందువలన వానికిని ఉత్పత్తిలేదు. సామయికాభావము సాదిసాంతమునై యున్నది. దానికి నుత్పత్తి నాశములు రెండు నున్నవి. ప్రధ్వంసాభావ మనంతమై సాదియై యున్నది. దానికి నాశములేదు ఉత్పత్తియున్నది. ఈరీతిగా రెండభావముల కుత్పత్తి యున్నది. అందువలన రెండును కార్యములై యున్నవి. వానికి సమవాయి కారణము, అసమవాయి కారణము సంభవించుట లేదు, ఎట్లన దేనియందు సమవాయ సంబంధముచేత కార్య ముత్పన్నమయినదో అది సమవాయి కారణ మనంబడును. దేనియందును సమవాయ సంబంధముచేత నభావ ముండుట లేదు అందువలన దానికి సమవాయి కారణము సంభవించుట లేదు. సమవాయి కారణమునందు సంబంధియై కార్యమున కేది జనకమై యున్నదో అది అసమవాయి కారణమనంబడును. సమవాయికారణముయొక్క యభావమువలన దానియందు సంబంధి యగుజనకమునకు నసంభవమువలన సమవాయి కారణము కూడ అభావమునకు సంభవించుటలేదు. అందువలన కేవల నిమిత్తకారణముచేత సామయికాభావ ప్రధ్వంసాభావము లుత్పన్నము లగుచున్నవి. భూతలాదిదేశమునందు ఘటముయొక్క సామయికాభావమునకు భూతలాదిదేశముతో ఘటముయొక్క అపసరణము నిమిత్తకారణమై యున్నది ఘటప్రధ్వంసాభావమునకు ఘటము నిమిత్త కారణమై యున్నది. ఈరీతిగానే ఘటముతో ముద్గరాదికముయొక్క సంయోగముకూడ ఘటధ్వంసమునకు నిమిత్తకారణమై యున్నది. ఈరీతిగా నభావకార్యము నిమిత్తకారణమాత్ర జన్యమై యున్నది. తథాపి యావద్భావకార్యము త్రివిధ కారణ జన్యమై యున్నది, అను నీ నియమ మున్నది. ఈతార్కిక వచనమునకు సర్గాదికాలమునందు ఈశ్వరునియొక్క చికీర్షవలన పరమాణువులందు నేక్రియ కలుగుచున్నదో దానియందు వ్యభిచార మున్నది. ఎట్లన, పరమాణువుయొక్క క్రియకు పరమాణువు సమవాయికారణమై యున్నది. ఈశ్వరేచ్ఛాదికము

నిమిత్తకారణమై యున్నది. పరమాణువున్నంను సంబంధియగు క్రియాజనక ముగా నేదైన నుండినయెడల అసమవాయి కారణ ముండును. ఆపరమాణువు నందు సంబంధియై ఆక్రియకు జనకమై ఏదియును లేదు. అందువలన సర్గారంభ మునందు పరమాణువుయొక్క క్రియ కారణద్వయజన్యమై యున్నది, కారణత్రయజన్యమై లేదు. అందువలన తార్కికోక్తనియమము సంభవిం చుట లేదు. మఱియును సిద్ధాంతమునందు యావద్భావకార్యము ఉపా దాన నిమిత్తకారణజన్యమై యున్నది అను నియమ మున్నది, దానికి నెక్క డను వ్యభిచారము లేదు. ఎచ్చట కారణత్రయ జన్యముగా కార్యము చెప్ప బడుచున్నదో అచ్చటను తార్కికాభిమతాసమవాయి కారణము నిమిత్త కారణముగానే యున్నది, అందువలన సకలభావకార్యములకును ద్వివిధకారణ జన్యత్వ మున్నది. ఈరీతిగా నుపాదాననిమిత్త భేదమువలన కారణము ద్వివిధమై యున్నది. సాధారణాసాధారణభేదముచేతను కారణము ద్వివిధ మై యు న్నది. ఈశ్వరాది నవకము సాధారణకారణమై యున్నది, దానికంటె భిన్న మగు కపాలాదికము ఘటాదికమున కసాధారణకారణమై యున్నది. వానిలోను కొన్ని నిమిత్తకారణములై యున్నవి, కొన్ని యుపాదానకారణములై యున్నవి. ఉపాదాన నిమిత్త కారణములకంటె భిన్నమగు కారణము లేకమై యున్నది.

100. వృత్తిజ్ఞానమునకు నుపాదాన నిమిత్త కారణములు, సామాన్య లక్షణము.

అంతఃకరణముయొక్క జ్ఞానరూప వృత్తికి నుపాదానకారణము అంతః కరణమై యున్నది. ప్రత్యక్షాదిప్రమాణమును, ఇంద్రియ సంయోగాది వ్యాపా రమును, నిమిత్త కారణములై యున్నవి. మఱియు నీశ్వరునియొక్క జ్ఞానరూప వృత్తికి నుపాదానకారణము మాయయై యున్నది. అదృష్టాదికము నిమిత్తకార ణమై యున్నది. భ్రమరూప వృత్తికి నుపాదానకారణ మవిద్యయై యున్నది, నిమి త్తకారణము దోషమై యున్నది. ఈసంగతి ఖ్యాతినిరూపణమునందు స్పష్టపడ గలదు. ఈరీతిగా వృత్తికారణమును తెలియవలయును.

వృత్తిలక్షణము గ్రంథారంభమునందు వ్రాయబడి యున్నది. విషయ ప్రకాశమునకు హేతువగు నంతః కరణముయొక్కయు, అవిద్యయొక్కయు పరి ణామము వృత్తి యనంబడును. ఇది వృత్తిలక్షణముగా చెప్పంబడి యున్నది. కొన్ని గ్రంథములయందు నజ్ఞాననాశకపరిణామము వృత్తి యనంబడును. పరోక్ష

జ్ఞానముచేతను అసత్త్వాపాదకాజ్ఞానాంశమునకు నాశము కలుగుచున్నది. అథవా విషయచేతనస్థాజ్ఞానమునకు నాశనము అపరోక్షజ్ఞానము గలుగక కలుగుట లేదు. ప్రమాతృచేతనస్థాజ్ఞాననాశము పరోక్షజ్ఞానముచేతను కలుగు చున్నది.

అందువలన పరోక్షవృత్తియందు నుక్తలక్షణమున కవ్యాప్తి లేదు. తథాపి సుఖదుఃఖములయొక్క జ్ఞానరూపవృత్తియందును, మాయావృత్తిరూపేశ్వరజ్ఞానమునందును శుక్తిరజతాదిగోచర భ్రమరూపావిద్యావృత్తియందు నుక్తలక్షణమున కవ్యాప్తి యున్నది. ఎట్లన, ప్రథమమునందు నజ్ఞాతసుఖదుఃఖాదిక ముత్పన్నమగుచున్నది. అనంతరము దానియొక్క జ్ఞానము గలుగుచున్నది. సుఖాదిజ్ఞానముచేత దానియొక్క యజ్ఞానమునకు నాశము సంభవించు చున్నదో; ఆ యజ్ఞాతసుఖాదికము లేదు. ఇక నేమనగా, సుఖాదికము, దానియొక్క జ్ఞానము కూడ నేకకాలమునందు గలుగుచున్నవి. అందువలన నజ్ఞాతసుఖాదికము లేనందున సుఖాదిగోచరవృత్తిచేత నజ్ఞానమునకు నాశము సంభవించుట లేదు. ఈప్రకారముగానే ఈశ్వరునికి నసాధారణరూపముతో సకలపదార్థము సదా ప్రత్యక్షముగా ప్రతీతమగుచున్నది. అందువలన నజ్ఞానాభావమువలన మాయావృత్తిరూప జ్ఞానముచేత నజ్ఞాన నాశము సంభవించుట లేదు. శుక్తిరజతాది మిథ్యాపదార్థములకు వానియొక్క జ్ఞానమునకు నేకకాలమునందు నుత్పత్తి గలుగుచున్నది. అందువలన భ్రమవృత్తిచేతను అజ్ఞానమునకు నాశము గలుగుట లేదు. ఈరీతిగానే ధారావాహిక వృత్తి గలిగినప్పుడును, ఉక్తలక్షణమునకు ద్వితీయాదివృత్తియందు నవ్యాప్తి యున్నది. ఎట్లన, జ్ఞానధార గలిగినప్పుడు ప్రథమజ్ఞానముచేత నజ్ఞాన నాశమైనందున ద్వితీయాది జ్ఞానమునకు నజ్ఞాన నాశకత్వము సంభవించుట లేదు. అందువలన ప్రకాశపరిణామము వృత్తి యనంబడును. దీని కభిప్రాయ మేమనగా, అస్తి యను నీవ్యవహారమునకు హేతువగు నవిద్యాంతఃకరణములయొక్క యేపరిణామ మున్నదో అది వృత్తి యనంబడును. ప్రకాశక పరిణామమును వృత్తి యని చెప్పినను అజ్ఞాతపదార్థగోచరవృత్తియందే ప్రకాశకత యున్నది. అనావృతగోచర వృత్తియందు ప్రకాశకత్వము లేదు. ఎట్లన, అనావృతచేతనముయొక్క సంబంధముచేతనే విషయప్రకాశము సంభవించుటవలన వృత్తియందు ప్రకాశకత్వ కల్పనము అయోగ్యమై యున్నది. అందువలన వృత్తియందు నజ్ఞాననాశకత్వము తప్ప నన్యవిధప్రకాశకత్వము సంభవింపనందున ద్వితీయ లక్షణమునకు ప్రథమ లక్షణమువలె సుఖాదిగోచర వృత్తి

యందు నవ్యాప్తి యగును. అందువలన నస్తివ్యవహారమునకు హేతువగు నవిద్యాంతఃకరణములయొక్క పరిణామము వృత్తి యనఁబడును. పరోక్షవృత్తి యందును అస్తి వ్యవహారముయొక్క హేతుత్వము స్పష్టమై యున్నది. ఘటాది గోచరాంతఃకరణముయొక్క వృత్తి ఘటాది జ్ఞాన మనంబడును. యద్యపి అద్వైత సిద్ధాంతమునందు వృత్త్యవచ్ఛిన్న చేతనము జ్ఞాన మనంబడును. అబాధితవృత్త్య వచ్ఛిన్న చేతనము ప్రమాజ్ఞాన మనంబడును. బాధిత మగు నేరజ్జు సర్పాదిక మున్నదో తద్గోచరవృత్త్యవచ్ఛిన్న చేతనము అప్రమాజ్ఞాన మనంబడును. తథాపి చేతనమునందు జ్ఞానశబ్దముయొక్కయు, ప్రమాశబ్దముయొక్కయు, అప్రమాశబ్దముయొక్కయు, ప్రయోగము వృత్తిసంబంధమువలన గలుగుచున్నది. అందువలన వృత్తియుగూడ ననేకస్థలములయందు జ్ఞాన మనంబడును. ఈరీతిగా ప్రమాఽప్రమాభేదముచే వృత్తి ద్వివిధమై యున్నది.

### 101. ప్రత్యక్షముయొక్క లక్షణసహిత ప్రమాఽప్రమారూప వృత్తి జ్ఞానముయొక్క భేదము.

అప్రమకూడ యథార్థాయథార్థభేదముచేత ద్వివిధమై యున్నది. ఈశ్వరునియొక్క జ్ఞానము సుఖాదిగోచరజ్ఞానము, యథార్థాఽప్రమయై యున్నవి. శుక్తిరజతాదికభ్రమ అయథార్థాప్రమయై యున్నది. ప్రమాణజన్యమగు నే యథార్థజ్ఞాన మున్నదో అది ప్రమయై యున్నది. ఈశ్వరజ్ఞానాదికము ప్రమాణజన్యము అందువలన ప్రమ కాదు, దోషజన్యము కానందున భ్రమయును కాదు. బహు గ్రంథములయందు ప్రమకంటె జన్యముగానే లక్షణము చెప్పబడి యున్నది. తదను సారముగా నీశ్వరజ్ఞానముకూడ యథార్థాప్రమ యై యున్నది. అయినను యథార్థాయథార్థభేదమువలన స్మృతి ద్వివిధమై యున్నది. ఆద్విప్రకారముకూడ ప్రమ కాదు. వారిమతమందు ప్రమకు లక్షణ మే మనగా, అబాధితార్థమును విషయీకరించునట్టి స్మృతికంటె భిన్న మగు నేజ్ఞాన మున్నదో అది ప్రమ యనంబడును. శుక్తిరజతాది జ్ఞానము స్మృతికంటె భిన్నమైనను అబాధితార్థమును విషయీకరించునది కాదు, బాధితార్థమునే విషయీకరించుచున్నది. అందువలన ప్రమ కాదు. అబాధితార్థమును విషయీకరించునది స్మృతిజ్ఞానమైనను స్మృతిజ్ఞానమునందు ప్రమావ్యవహారము లేనందున స్మృతిభిన్నమయి, అబాధితార్థగోచరమయి యేజ్ఞాన మున్నదో అది ప్రమగా చెప్పబడియున్నది. యద్యపి అన్యయథార్థ జ్ఞానమువలె యథార్థస్మృతి కూడ సంవాదప్రవృత్తికి జనకమై

నందున స్మృతిసాధారణముగా ప్రమాలక్షణము చెప్పవలసినది. తథాపి సంవాది ప్రవృత్తికి నుపయోగ మయిన ప్రమాత్వము స్మృతియందు నున్నది. ఆ ప్రవృత్తికి నుపయోగి యగు ప్రమాత్వము అబాధితపదార్థగోచరత్వరూపమై యున్నది. ప్రమావ్యవహారమున కుపయోగి యగు ప్రమాత్వము స్మృతియందు లేదు. ఎట్లన (1)లౌకికము, (2) శాస్త్రీయము నను భేదముచేత వ్యవహారము ద్వివిధమై యున్నది. శాస్త్రముకంటె బాహ్య మగు నేలోకశబ్దప్రయోగ మున్నదో అది లౌకిక వ్యవహార మనంబడును. శాస్త్రపరిభాషచేత నేశబ్దప్రయోగ మున్నదో అదిశాస్త్రీయవ్యవహార మనంబడును. శాస్త్రముకంటె బాహ్య మగు నేవ్యవహారము కూడ చేయంబడుట లేదు. ఒకానొకపండితుడు తథా శబ్దప్రయోగము జేసిన యెడల శాస్త్రపరిభాషా సంస్కారమువలననే చేయుంబడుచున్నది. అందువలన కేవల శాస్త్రీయ ప్రమావ్యవహార మున్నది. మఱియును ప్రాచీన గ్రంథకారులచేత స్మృతిభిన్న మగు యథార్థజ్ఞానమునందే ప్రమావ్యవహారము చేయబడియున్నది. అందువలన స్మృతి వ్యావృత్తముగా ప్రమాలక్షణము చెప్పవలసినది.

"యథార్థానుభవః ప్రమా" అనునీప్రమాలక్షణము ప్రాచీనాచార్యులచేత వ్రాయబడియున్నది. స్మృతిభిన్నజ్ఞానము అనుభవ మనంబడును. అందువలన స్మృతియందు ప్రమావ్యవహార మిష్టము కాదు. ప్రత్యక్షాదిజ్ఞానముకంటె స్మృతిజ్ఞానము విలక్షణమై యున్నది. ప్రత్యక్షాది సకల జ్ఞానములయందును అనుభవత్వ మున్నది, స్మృతియందు లేదు. అందువలన ననుభవత్వముయొక్క సత్త్వాసత్త్వముచేత ప్రత్యక్షాదికము స్మృతియును పరస్పర విజాతీయమై యున్నవి. ఉ. ఎట్లు ప్రత్యక్షానుమితి శాబ్దాది జ్ఞానములయందు ప్రత్యక్షత్వ, అనుమితిత్వ, శాబ్దత్వాది విలక్షణధర్మ ముండుటవలన ప్రత్యక్షాదిజ్ఞానము పరస్పర విజాతీయమై యున్నదో విజాతీయ ప్రమయొక్క కరణరూపప్రమాణము కూడ ప్రత్యక్ష, అనుమాన, శబ్దాదికము కూడ భిన్నమై యున్నదో అట్లు సకలానుభవముకంటె విజాతీయమై స్మృతి యున్నది, దానికి కారణ మనుభవమై యున్నది, అది యేప్రమకు కారణము కాదు. అందువలన ప్రమాణముకాదు. యద్యపి వ్యాప్తిప్రత్యక్షము అనుమితికి కరణమగుటచేత ననుమానము ప్రమాణమై యున్నది. ఈరీతిగానే పదప్రత్యక్షము శబ్దప్రమాణమై, గవయమునందు గోసాదృశ్యప్రత్యక్షము ఉపమానప్రమాణమై యున్నది ప్రత్యక్షజ్ఞానము కూడ అనుభవముయొక్క విశేషమయియే యున్నది, అందువలన ననుభవము ప్రమాణముకాదు, అని చెప్పుట సరికాదు.

తథాపి వ్యాప్తిజ్ఞానత్వరూపముతో వ్యాప్తిజ్ఞానము అనుమితికి హేతువై యున్నది, అనుభవత్వరూపముతో వ్యాప్తిజ్ఞానము అనుమితికి హేతువు కాదు. ఈ ప్రకారముగానే పదప్రత్యక్షము సాదృశ్యజ్ఞానము కూడ అనుభవత్వరూపముతో శాబ్దప్రమకును, నుపమితి ప్రమకును హేతువు కాదు. స్మృతిజ్ఞానమును గూర్చి యనుభవత్వరూపముచేత పూర్వానుభవము స్మృతికి హేతువై యున్నది. అందువలన ప్రమాణము కాదు. స్మృతిజ్ఞానమును కూడ ప్రమ యని చెప్పినయెడల విజాతీయ ప్రమాకరణము పృథక్ప్రమాణముగా నుండును. అందువలన న్యాయశాస్త్రమందైననో అనుభవనామకపంచమప్రమాణమును జెప్ప యుండవలయును. భట్టవేదాంతుల మతములయందు సప్తమ ప్రమాణమును జెప్పి యుండవలయును. అందువలన సకల గ్రంథకారులకును స్మృతియందు ప్రమావ్యవహార మిష్టము కాదు. ఎవరైనను యథార్థజ్ఞానమునందు ప్రమావ్యవహారము సంగీకరించినయెడల తదనుసారముగా ప్రమాలక్షణమునందు స్మృతిభిన్నత్వ రూప నివేశమును జేయకూడదు అబాధితార్థ గోచరజ్ఞానమే ప్రమ యని చెప్పవలసినది. భ్రమానుభవజన్యాయథార్థ స్మృతి బాధితార్థగోచర మైనందున దానియందు నతివ్యాప్తి లేదు. యథార్థానుభవజన్య స్మృతియందు లక్షణ ముండినయెడల నచ్చట ప్రమావ్యవహార మిష్టమై యున్నది. అందువలన నతివ్యాప్తిలేదు. అలక్ష్యమందు లక్షణము వర్తించినయెడల నతివ్యాప్తి యనంబడును. యథార్థ స్మృతి లక్ష్యమై యున్నది. అందువలన నతివ్యాప్తి లేదు. ఈ మతానుసారముగా యథార్థాయథార్థభేదమువలన వృత్తి ద్వివిధమై యున్నది. యథార్థము ప్రమ యనంబడును. అయథార్థము అప్రమ యనంబడును. ఈమతమునందు ప్రమ సప్తవిధమై యున్నది. (౧) ప్రత్యక్షము; (౨) అనుమితి; (౩) శాబ్ది; (౪) ఉపమితి; (౫) అర్థాపత్తి; (౬) అనుపలబ్ధియని షడ్భేదము లున్నవి. ఈలాగుననే (౭) యథార్థస్మృతి కూడ ప్రమయొక్క సప్తమభేదమై యున్నది. అయినను సకల గ్రంథముల యొక్క మర్యాద యే మనగా స్మృతియందు ప్రమావ్యవహారము లేనందున ప్రత్యక్షాది భేదమువలన ప్రమారూపవృత్తి షడ్విధమై యున్నది. బాహ్యాభ్యంతర భేదమువలన ప్రత్యక్షప్రమ ద్వివిధమై యున్నది. అబాధిత బాహ్యపదార్థగోచర వృత్తి బాహ్యప్రత్యక్షప్రమ యనంబడును. శ్రోత్రాది పంచేంద్రియములతో పంచవిధ బాహ్యప్రత్యక్షప్రమ కలుగుచున్నది. ఒకప్పుడు శబ్దముచేతను బాహ్యగోచరాపరోక్షవృత్తి కలుగుచున్నది. ఉ. "దశమస్త్వమసి" ఈ వాక్యముచేత

స్థూలశరీరవిషయ కాపరోక్షజ్ఞానము కలుగుచున్నది. ఈరీతిగా కారణభేదము వలన బాహ్యప్రత్యక్ష ప్రమ షడ్విధమై యున్నది. కొందఱు గ్రంథకర్తలు అనుపలబ్ధిప్రమాణజన్య మగు నభావగోచర వృత్తిని గూడ నపరోక్షవృత్తి యని జెప్పెదరు. వారి మతమునందు శ్రోత్రాది పంచేంద్రియములు, శబ్దము, అనుపలబ్ధి యను నీ యేడును బాహ్యప్రత్యక్షప్రమకు కరణములై యున్నవి. అందువలన బాహ్యప్రత్యక్షప్రమ సప్తవిధమై యున్నది. ఈ యర్థము పూర్వమునందు వ్రాయబడియున్నది. ధర్మాధర్మములయందువలె ప్రత్యక్షయోగ్యత్వ మభావమునందు లేదు. అందువలన వృత్త్యవచ్ఛిన్న చేతనముతో నభావావచ్ఛిన్న చేతనమున కభేద ముండినను అభావగోచరవృత్తి యపరోక్షము కాదు అనుమిత్యాదికమువలె అనుపలబ్ధి ప్రమాణజ న్యాభావగోచరవృత్తి ప్రత్యక్ష వృత్తికంటె విలక్షణమై యున్నది. అందువలన బాహ్యప్రత్యక్షప్రమ షడ్విధమై యున్నది. సప్తవిధము కాదు. అంతరప్రత్యక్షప్రమయును ద్వివిధమై యున్నది. ఒకటి ఆత్మగోచరమై యున్నది, మఱియొకటి యనాత్మగోచరమై యున్నది. ఆత్మగోచరముకూడ ద్వివిధమై యున్నది. ఒకటి శుద్ధాత్మగోచరమై యున్నది, మఱియొకటి విశిష్టాత్మగోచరమై యున్నది. శుద్ధాత్మగోచరము ద్వివిధము. (1) బ్రహ్మగోచరము; (2) బ్రహ్మాగోచరము. త్వం పదార్థబోధక వేదాంతవాక్యముచేత "శుద్ధః, ప్రకాశోఽహం" యను నీ యంతఃకరణవృత్తి కలుగుచున్నది. ఆవృత్తిదేశమునందే అంతఃకరణ వృత్త్యుపహితశుద్ధచేతన మున్నది. అందువలన వృత్త్యవచ్ఛిన్న చేతన విషయావచ్ఛిన్న చేతనములకు నభేద ముండుటవలన వృత్తి యపరోక్షమై యున్నది. ఆవృత్తికి విషయమగు శుద్ధచేతనమునందు బ్రహ్మత్వముకూడ ఉన్నది. అయిన బ్రహ్మాకారవృత్తి కలుగలేదు. ఎట్లన, అవాంతర వాక్యముచేత వృత్తి కలుగుచున్నది. మహావాక్యముచేత వృత్తి కలిగినయెడల బ్రహ్మాకారముకూడ నగును. ఎట్లన శబ్దజన్యజ్ఞానమున కీస్వభావ మున్నది. సన్నిహితపదార్థమును ఏరూపముగా శబ్దము బోధించుచున్నదో ఆరూపమునే విషయీకరించుచున్నది. ఏరూపముతో శబ్దము విషయీకరించుటలేదో ఆరూపముతో శబ్దజన్యజ్ఞానము విషయీకరించుటలేదు. ఉ. దశమపురుషునికి "దశమోఽస్తి" అనురీతిగా చెప్పినప్పుడు "దశమోఽహం" అనురీతిగా శ్రోతకు జ్ఞానము కలుగుటలేదు. ఎట్లు దశమునియందు నాత్మత్వముండినను నాత్మతాబోధక శబ్దము లేనందున నాత్మతాజ్ఞానము కలుగుటలేదో అట్లు ఆత్మయందు బ్రహ్మత్వము సదాయుండినను బ్రహ్మతాబోధక శబ్దము

లేనందున బ్రహ్మజ్ఞానము కలుగుట లేదు. అందువలన నుక్తవృత్తి బ్రహ్మగోచర శుద్ధాత్మగోచ రాంతర ప్రత్యక్షప్రమయై యున్నది.

ప్రత్యక్షసంగతివలన నీ శంక కలుగుచున్నది. సిద్ధాంతమునందు నింద్రియ జన్యజ్ఞానము ప్రత్యక్షమై యున్నది అను నంగీకారము లేదు. వృత్త్యవచ్ఛిన్న చేతనముతో విషయావచ్ఛిన్న చేతనమునకు నభేదమే జ్ఞానముయొక్క ప్రత్యక్షతా హేతువై యున్నది. ఎచ్చట నింద్రియసంబద్ధ ఘటాదిక మున్నదో అచ్చట నింద్రియముద్వారా అంతఃకరణవృత్తి బాహ్యమునకు పోయి విషయముయొక్క యాకారమునకు సమానాకారము నొంది విషయముతో సంబంధము కలది యగుచున్నది. అందువలన వృత్తిచేతనముయొక్కయు, విషయచేతనము యొక్కయు ఉపాధి ఏకదేశమునం దుండుటవలన నుపహితచేతనముల కభేద మున్నది. ఈప్రకారముగా సుఖాదిజ్ఞానము యద్యపి ఇంద్రియజన్యము కాదు. శుద్ధాత్మజ్ఞానము కూడ ఇంద్రియజన్యము కాదు, శబ్దజన్యమై యున్నది. తథాపి విషయచేతన వృత్తిచేతనములకు భేదములేదు. ఎట్లన సుఖాకారవృత్తి యంతఃకరణదేశమునం దున్నది, సుఖముకూడ అంతఃకరణమునం దున్నది. అందువలన వృత్త్యుపహితచేతన విషయోపహితచేతనములకు నభేద మున్నది. ఈప్రకారము గానే యాత్మాకారవృత్తికి నుపాదానకారణ మంతఃకరణమై యున్నది. అంతఃకరణోపహిత చేతనమునకు నభిముఖమై యున్నది, అందువలన నాత్మాకారవృత్తి కూడ అంతఃకరణదేశమునం దున్నది. అంతఃకరణమే శుద్ధాత్మకు నుపాధియై యున్నది. ఈరీతిగా రెండుపాధులు ఏకదేశమునం దుండుటవలన వృత్తిచేతన విషయ చేతనముల కభేద మున్నది. అందువలన సుఖాదిజ్ఞానము, శుద్ధాత్మజ్ఞానముకూడ ప్రత్యక్షరూపమై యున్నవి. ఇచ్చట నీ నిష్కర్ష యున్నది. ఎచ్చట విషయమునకు ప్రమాతతో వృత్తిద్వారా గాని లేక సాక్షాత్తుగా గాని సంబంధ మున్నదో ఆ విషయముయొక్క జ్ఞానము ప్రత్యక్షమై యున్నది. ఆ విషయమే ప్రత్యక్ష మనంబడును. ఉ, ఘటప్రత్యక్షజ్ఞాన మైనప్పుడు ఘటము ప్రత్యక్షమై యున్నది అను నీవ్యవహారము కలుగుచున్నది. బాహ్యపదార్థమునకు వృత్తిద్వారా ప్రమాతతో సంబంధ మున్నది. సుఖాదికమునకు ప్రమాతతో సాక్షాత్సంబంధ మున్నది. అతీత సుఖాదికమునకు ప్రమాతతో వర్తమానసంబంధము లేదు. అందువలన నతీత సుఖాదికముయొక్క జ్ఞానము స్మృతిరూపమై యున్నది, ప్రత్యక్షరూపము కాదు. అతీతసుఖాదికమునకును ప్రమాతతోసంబంధము కలిగినది, తథాపి ప్రమాణలక్ష

ణమ్మునందు వర్తమానమునకు నివేశ మున్నది. ప్రమాతతో వర్తమానసంబంధి యగు యోగ్యవిషయము ప్రత్యక్ష మనంబడును. ప్రమాతతో వర్తమాన సంబంధి యోగ్యవిషయముయొక్క జ్ఞానము ప్రత్యక్షజ్ఞాన మనంబడును. యోగ్య మని చెప్పినయెడల ధర్మాదికము సదా ప్రమాతతో సంబంధియై యున్నది. అందు వలన సదా ప్రత్యక్షముగా చెప్పవలయును. శబ్దాదికముచేత దానియొక్క జ్ఞానము కలుగుచున్నది. అది ప్రత్యక్షజ్ఞానముగా జెప్పవలయును. ధర్మాదికము ప్రత్యక్షయోగ్యము కానందున లక్షణమునందు యోగ్యపద నివేశమువలన దోషములేదు. యోగ్యతాయోగ్యతలు అనుభవానుసారముగా అనుమేయములై యున్నవి. ఏవస్తువునందు ప్రత్యక్షతానుభవ మున్నదో దానియందు యోగ్యత యున్నది. దేనియందు ప్రత్యక్షతానుభవము లేదో దానియందయోగ్యత యున్నది. ఈజ్ఞానము అనుమానము లేక అర్థాపత్తిచేత కలుగుచున్నది యోగ్యతాయోగ్యత లీరీతిగా నైయాయికులుకూడ అంగీకరింపవలసినది. ఆయా మతమునందు సుఖాదికము ధర్మాదికముకూడ ఆత్మయొక్క ధర్మములై యున్నవి. వానియందు మనస్సంయుక్త సమవాయ సంబంధ మున్నది. తథాపి యోగ్యత యుండుటవలన సుఖాదివిషయకమానస సాక్షాత్కారము కలుగు చున్నది. అందువలన యోగ్యతాయోగ్యతలు సర్వమతములయందును నంగీక రింపవలసినవై యున్నవి. ఈరీతిగా ప్రత్యక్షయోగ్య వస్తువునకు ప్రమాతతో వర్తమానసంబంధ మున్నది. అచ్చట ప్రత్యక్షజ్ఞానము కలుగుచున్నది. ఈవిష యమునందొకశంక. బ్రహ్మగోచరజ్ఞానము పరోక్షము కాకపోవలయును. ఎట్లన, బ్రహ్మకు ప్రమాతతో నసంబంధ ముండినయెడల బాహ్యాదిజ్ఞానమువలె బ్రహ్మ జ్ఞానముకూడ పరోక్ష మగును. ఎప్పుడు అవాంతరవాక్యముచేత సత్యస్వరూప, జ్ఞానస్వరూప, అనంతస్వరూప మగు బ్రహ్మ మున్నది, అని వృత్తి కలుగుచున్నదో ఆకాలమునందు బ్రహ్మకు ప్రమాతతో సంబంధ మున్నది. అందువలన నవాంతర వాక్యజన్య బ్రహ్మజ్ఞానము కూడ ప్రత్యక్షమే కావలయును. సిద్ధాంతమునందు నవాంతర వాక్యజన్య బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షము కాదు, పరోక్షమై యున్నది. అది ఉక్తరీతిగా సంభవించుట లేదు. ఈశంకకు సమాధాన మే మనగా. ప్రత్యక్ష లక్షణమునందు విషయమునకు యోగ్యత్వ విశేషణము చెప్పబడియున్నది. ఈ ప్రకారముగానే యోగ్యప్రమాణజన్యత్వము జ్ఞానమునకు విశేషణమై యున్నది. అందువలన నుక్తదోషము లేదు. ఎట్లన, ప్రమాతతో వర్తమానసంబంధము

గలిగిన యేయోగ్యవిషయ మున్నదో దానియొక్క యోగ్యప్రమాణజన్య జ్ఞానము ప్రత్యక్షజ్ఞాన మనంబడును. ఈలక్షణమునం దుక్తదోషము లేదు. ఎట్లన, వాక్యమున కీస్వభావ మున్నది. శ్రోతయొక్క స్వరూపబోధక పదఘటితవాక్యముచేత నపరోక్షజ్ఞానము కలుగుచున్నది. శ్రోతయొక్క స్వరూపబోధక పదరహితవాక్యముచేత పరోక్షజ్ఞానము గలుగుచున్నది. విషయము సన్నిహితమై ప్రత్యక్షయోగ్యమై యుండినయెడల స్వరూపబోధక పదరహితవాక్యముచేత నపరోక్షజ్ఞానము గలుగుట లేదు. ఉ. దశమబోధక వాక్యము ద్వివిధమై యున్నది. ఒకటి "దశమోఽస్తి" అనువాక్యము, మఱియొకటి "దశమస్త్వమసి" అనువాక్యము. వీనిలో ప్రథమవాక్యము శ్రోతయొక్క స్వరూపబోధక పదరహితమై యున్నది. మఱియొకవాక్యము శ్రోతృస్వరూపబోధక త్వంపద ఘటితమై యున్నది. ఘటిత మనగా యుక్తము. వానిలో ప్రథమవాక్యముచేత శ్రోతకు దశమ విషయక పరోక్షజ్ఞానమే కలుగుచున్నది. వాక్యజన్యజ్ఞానమునకు విషయము దశమ పురుషుడై యున్నాడు. వాడు రెండు స్థలములయందును అతిసన్నిహితుడై యున్నాడు. ఏది స్వరూపముతో భిన్నమై సంబంధియై యున్నదో అది సన్నిహితమై యున్నది. దశమ పురుషుడు శ్రోతృ స్వరూపముతో భిన్నుడు కాడు. ఇక నేమనగా, శ్రోతృస్వరూపుడై యున్నాడు అందువలన నతిసన్నిహితుండు, మఱియును ప్రత్యక్షయోగ్యుడు. ప్రత్యక్షయోగ్యుడు కాకపోయినయెడల ద్వితీయజ్ఞానముచేత దశమ విషయక ప్రత్యక్షజ్ఞానము కాకపోవలయును. ద్వితీయ వాక్యముచేత ప్రత్యక్షజ్ఞానము గలుగుచున్నది. అందువలన ప్రత్యక్షయోగ్యుడై యున్నాడు. ఈరీతిగా నతిసన్నిహితుడును వాక్యజన్య ప్రత్యక్షయోగ్యుడు నగు దశమునియొక్క ప్రత్యక్షజ్ఞానము ఏవాక్యముచేత గలుగుటలేదో ఆవాక్య మయోగ్యమై యున్నది. ద్వితీయవాక్యముచేత నాదశమునియొక్క యపరోక్షజ్ఞానము గలుగుచున్నది. అందువలన ద్వితీయ వాక్యము యోగ్యమై యున్నది. వాక్యముయొక్క యోగ్యతాయోగ్యతలయందు వేఱుగా నే హేతువును లేదు. స్వరూపబోధకపద ఘటితత్వ, స్వరూపబోధకపద రహితత్వములే యోగ్యతాయోగ్యతలకు సంపాదకములై యున్నవి. ఈరీతిగా "దశమస్త్వమసి" యను వాక్యము యోగ్యప్రమాణమై యున్నది. దానిచేత జన్యమగు "దశమోఽహం" మను నీప్రత్యక్షజ్ఞాన మున్నది. "దశమోఽస్తి" యను నీవాక్యము అయోగ్య ప్రమాణమై యున్నది, దానిచేత "దశమః క్వాపి అస్తి" అను నీదశమజ్ఞానము

కిని వివాదము లేదు. శుద్ధాత్మగోచరప్రమ ద్వివిధముగా చెప్పంబడియున్నది. మఱియును విశిష్టాత్మగోచరప్రత్యక్షప్రమకు ననంతభేదము లున్నవి. "అహమజ్ఞః; అహం కర్తా, అహం సుఖీ; అహం దుఃఖీ, అహం మనుష్యః" అని ఈరీతిగా ననేకభేదము లున్నవి. యద్యపి అబాధితార్థమును విషయీకరించు నేజ్ఞానమున్నదో ఆజ్ఞానము ప్రమ యనంబడును. 'అహం కర్తా'యను జ్ఞానమునకు "అహం న కర్తా "యనుజ్ఞానముచేత బాధ గలుగుచున్నది. దానికి ప్రమ యని చెప్పుట సంభవింపదు. తథాపి సంసారదశయందు అబాధితార్థమును విషయీకరించుజ్ఞానము ప్రమ యనంబడును. సంసారదశయందు క్తజ్ఞానమునకు బాధ లేదు. అందువలన ప్రమయై యున్నది. ఈరీతిగా నాత్మగోచరాంతరప్రత్యక్షప్రమయొక్క భేదము చెప్పంబడియున్నది. „మఱియును "మయి సుఖం; మయి దుఃఖం" ఇత్యాదిసుఖాదిగోచరజ్ఞానము కూడ ఆత్మగోచరప్రత్యక్షప్రమయై యున్నది. అయినను "అహం సుఖీ, అహం దుఃఖీ" ఇత్యాదిప్రమయందు నహంపదముయొక్క యర్థ మగు నాత్మ విశేష్యభూతుడై యున్నాడు. సుఖదుఃఖాదికము విశేషణమై యున్నది. "మయి సుఖం" "మయి దుఃఖం" ఇత్యాదిప్రమయందు సుఖదుఃఖాదికము విశేష్యమై యున్నది, ఆత్మ విశేషణమై యున్నాడు. అందువలన "మయి సుఖం దుఃఖం" ఇత్యాదిజ్ఞానము ఆత్మగోచరప్రత్యక్షప్రమ యని చెప్పంబడియున్నది. ఇక నేమనగా, సుఖాదికము విశేష్య మైనందున ననాత్మగోచరాంతరప్రత్యక్షప్రమ యని చెప్పబడియున్నది. వాచస్పతిమతమునందు విశిష్టజ్ఞానము, సుఖాదిజ్ఞానము కూడ మనోజన్యమై యున్నది. సిద్ధాంతమునందు నంతఃకరణవిశిష్టాత్మయందు నంతకరణభాగము సాక్షిభాస్యమై యున్నది. చేతనభాగము స్వయంప్రకాశమై యున్నది. ఈరీతిగానే సుఖాదికము సాక్షిభాస్యమై యున్నది. ఏజ్ఞానమును మనోజన్యము కాదు. అందువలన మనస్సు ఇంద్రియము కాదు. ఈరీతిగా స్మృతికంటె భిన్న మగు యథార్థవృత్తి ప్రమ యనంబడును. దానియొక్క భేదము చెప్పబడియున్నది. స్మృతిరూపాంతఃకరణవృత్తియు కూడ యథార్థాయథార్థభేదంబుల వలన ద్వివిధంబై యున్నది. వానిలో యథార్థస్మృతి ద్విప్రకారమ్మై యున్నది. ఒకటి ఆత్మస్మృతి; మఱియొకటి అనాత్మస్మృతి. తత్త్వమస్యాదివాక్యజన్యానుభవముచేత నేయాత్మతత్త్వస్మృతి గలుగుచున్నదో అది యథార్థాత్మస్మృతియై యున్నది. వ్యావహారికప్రపంచమునకు మిథ్యాత్వానుభవము గలిగి దానియొక్క సంస్కారముచేత మిథ్యాత్వరూప

ముగా ప్రపంచస్మృతి యేది కలుగుచున్నదో అది యథార్థానాత్మస్మృతి యగుచున్నది. ఈరీతిగానే అయథార్థస్మృతియును ద్వివిధమై యున్నది. ఒకటి ఆత్మగోచరాయథార్థస్మృతి, మఱి యొకటి అనాత్మగోచరాయథార్థస్మృతియును, అహంకారాదికమునందు ఆత్మత్వభ్రమరూపానుభవముయొక్క సంస్కారముచేత ఆత్మత్వస్మృతి ఆత్మగోచరాయథార్థస్మృతియై యున్నది. ఈరీతిగానే ఆత్మయందు కర్తృత్వానుభవసంస్కారముచేత "ఆత్మా కర్తా" యను నీస్మృతి కూడ నాత్మగోచరాయథార్థస్మృతియై యున్నది. మఱియును ప్రపంచమునందు సత్యత్వముయొక్క సంస్కారముచేత "ప్రపంచః సత్యః" అనునీస్మృతి అనాత్మగోచరాయథార్థస్మృతియై యున్నది. యథార్థాయథార్థభేదముచేత వృత్తి ద్వివిధముగా జెప్పంబడియున్నది. స్మృతిభిన్నయథార్థవృత్తి ప్రమ యనంబడును. యథార్థానుభవజన్యస్మృతి యథార్థ మనంబడును. అయథార్థానుభవజన్యస్మృతి అయథార్థ మనంబడును. అనుభవమునందు యథార్థము అబాధితార్థకృతమై యున్నది. అబాధితార్థవిషయకానుభవము యథార్థ మనియును, ప్రమ యనియును జెప్పంబడును. అందువలన నబాధితార్థాధీనానుభవమునందు యథార్థత్వ మున్నది. స్మృతియందును యథార్థత్వ మున్నది. మఱియును అయథార్థత్వము అనుభవాధీనమై యున్నది. స్మృతికంటె భిన్న మగు నే జ్ఞాన మున్నదో అది యనుభవ మనంబడును. అదియు కూడ యథార్థాయథార్థభేదముచేత ద్విప్రకారకమై యున్నది. యథార్థానుభవము చెప్పబడినది. ఇప్పుడు అయథార్థానుభవనిరూపణమును జేయుచున్నాము. అయథార్థస్మృతి నిరూపణము పూర్వమునందే చెప్పబడియున్నది. అదియు కూడ అనుభవముయొక్క అయథార్థత్వాధీనమై యున్నది. అందువలన నయథార్థానుభవముయొక్క నిరూపణము చెప్పబడియున్నది.

## 102. సంశయరూప భ్రమయొక్క లక్షణము, భేదము.

అయథార్థానుభవము ద్విప్రకారముగా నున్నది. ఒకటి సంశయరూపము, మఱియొకటి నిశ్చయరూపము. అయథార్థమే భ్రమ యనంబడును. సంశయజ్ఞానము కూడ భ్రమరూపమై యున్నది. ఎట్లన, స్వాభావాధికరణమునందు అవభాసము భ్రమ యనంబడును. మఱియు సంశయజ్ఞానము కూడ పరస్పరవిరుద్ధోభయ విషయకమై యున్నది. వానిలో ఏకముయొక్క యభావ ముండుటచే నీ సంశయమందు భ్రమలక్షణ మున్నది. ఏకవిశేష్యమునందు విరుద్ధమగు రెండు విశేషణ

ములయొక్క జ్ఞానము సంశయ మనంబడును. ఉ. స్థాణుర్వానవా ? అని స్థాణువు యొక్కజ్ఞానము కలుగుచున్నది. ఈ రెండును సంశయ మనంబడును. ఇచట స్థాణువు విశేష్యమై యున్నది. స్థాణుత్వ, స్థాణుత్వా భావములు విశేషణములై యున్నవి. రెండు విరుద్ధముగా నున్నవి. ఏకాధికరణమునం దుండుట లేదు. అందువలన స్థాణురూపై కవిశేష్యము నందు, స్థాణుత్వ, స్థాణుత్వాభావరూప విరుద్ధోభయ విశేషణములయొక్క జ్ఞానముండుటవలన ప్రథమసంశయమునందు లక్షణము సంభవించుచున్నది. ద్వితీయ సంశయమునందును లక్షణము సంభవించుచున్నది. ఎట్లన, స్థాణురూపైకవిశేష్యమునందు స్థాణుత్వ పురుషత్వ రూప విరుద్ధోభయ విశేషణములయొక్క జ్ఞానమున్నది. ఎట్లు స్థాణుత్వ, స్థాణుత్వాభావములకు పరస్పరవిరోధము ఉన్నదో అట్లు స్థాణుత్వ పురుషత్వముల కును విరోధము అనుభవ సిద్ధమై యున్నది. అందువలన ప్రథమ సంశయము విరుద్ధభావాభావోభయగోచర మై యున్నది. ద్వితీయసంశయము విరుద్ధమగు నుభయభావగోచరమై యున్నది. న్యాయగ్రంథ ప్రకారముగా నైన భావాభావగోచర మే సంశయ జ్ఞానమై యున్నది. కేవలభావగోచరము సంశయము కాదు. ఎచ్చట " స్థాణుర్వాపురుషోవా " అనునీ సంశయము కలుగుచున్నదో అచ్చటను, " (1) స్థాణుత్వ (2) స్థాణుత్వా భావములు, (3) పురుషత్వ, (4) పురుషత్వాభావములు అను నీనాలుగు కోటులు ఉన్నవి ; అందువలన ద్వికోటికము, మఱియు చతుష్కోటికము అని సంశయము ద్విప్రకారమై యున్నది. " స్థాణుర్న వా " అను నీ సంసయము ద్వికోటికమై యున్నది. " స్థాణుర్వా పురుషోవా " అను నీ సంశయము చతుష్కోటికమై యున్నది. ఏక ధర్మియందు ప్రతీతమగు ధర్మము కోటి యనంబడును. అందువలన కేవల భావ గోచర సంశయము న్యాయమతమం దప్రసిద్ధమై యున్నది. అన్నివిధములను సంశయజ్ఞానము భ్రమరూపమైయున్నది. రెండు విరుద్ధ విశేషణములు ఒకదాని యం దుండుట లేదు. ఒకదానియొక్క యభావమే యుండును. ఉ. స్థాణువునందు స్థాణుత్వ మున్నది, స్థాణుత్వాభావము లేదు. అందువలన స్థాణుత్వాభావరహిత స్థాణువునందు స్థాణుత్వాభావ జ్ఞానము భ్రమరూపమై యున్నది. అయిన నొక అంశమునందు సంశయజ్ఞానము భ్రమ యగుచున్నది. సకలాంశమునందును భ్రమ యగుట లేదు. ఎచ్చట స్థాణువునందు "స్థాణుర్న వా" అను నీ సంశయము కలుగు చున్నదో అచ్చట నభావాంశమునందు భ్రమ యున్నది. ఎచ్చట పురుషునియందు

ముగా ప్రపంచస్మృతి యేది కలుగుచున్నదో అది యథార్థానాత్మస్మృతి యగు చున్నది. ఈరీతిగానే అయథార్థస్మృతియును ద్వివిధమై యున్నది. ఒకటి ఆత్మ గోచరాయథార్థస్మృతి, మఱి యొకటి అనాత్మగోచరాయథార్థస్మృతియును, అహంకారాదికమునందు ఆత్మత్వభ్రమరూపానుభవముయొక్క సంస్కారము చేత ఆత్మత్వస్మృతి ఆత్మగోచరాయథార్థస్మృతియై యున్నది. ఈరీతిగానే ఆత్మ యందు కర్తృత్వానుభవసంస్కారముచేత "ఆత్మా కర్తా" యను నీస్మృతి కూడ నాత్మగోచరాయథార్థస్మృతియై యున్నది. మఱియును ప్రపంచమునందు సత్య త్వముయొక్క సంస్కారముచేత "ప్రపంచః సత్యః" అనునీస్మృతి అనాత్మగోచ రాయథార్థస్మృతియై యున్నది. యథార్థాయథార్థభేదముచేత వృత్తి ద్వివిధ ముగా జెప్పంబడియున్నది. స్మృతిభిన్నయథార్థవృత్తి ప్రమ యనంబడును. యథార్థానుభవజన్యస్మృతి యథార్థ మనంబడును. అయథార్థానుభవజన్యస్మృతి అయథార్థ మనంబడును. అనుభవమునందు యథార్థము అబాధితార్థకృతమై యున్నది. అబాధితార్థవిషయకానుభవము యథార్థ మనియును, ప్రమ యని యును జెప్పంబడును. అందువలన నబాధితార్థాధీనానుభవమునందు యథా ర్థత్వ మున్నది. స్మృతియందును యథార్థత్వ మున్నది. మఱియును అయథార్థ త్వము అనుభవాధీనమై యున్నది. స్మృతికంటె భిన్న మగు నే జ్ఞాన మున్నదో అది యనుభవ మనంబడును. అదియు కూడ యథార్థాయథార్థభేదముచేత ద్విప్రకారకమై యున్నది. యథార్థానుభవము చెప్పబడినది. ఇప్పుడు అయ థార్థానుభవనిరూపణమును జేయుచున్నాము. అయథార్థస్మృతి నిరూపణము పూర్వమునందే చెప్పబడియున్నది. అదియు కూడ అనుభవముయొక్క అయథా ర్థత్వాధీనమై యున్నది. అందువలన నయథార్థానుభవముయొక్క నిరూపణము చెప్పబడియున్నది.

### 102. సంశయరూప భ్రమముయొక్క లక్షణము, భేదము.

అయథార్థానుభవము ద్విప్రకారముగా నున్నది. ఒకటి సంశయ రూపము, మఱియొకటి నిశ్చయరూపము. అయథార్థమే భ్రమ యనంబడును. సంశయజ్ఞానము కూడ భ్రమమై యున్నది. ఎట్లన, స్వాభావాధికరణమునందు అవ భాసము భ్రమ యనంబడును. మఱియు సంశయజ్ఞానము కూడ పరస్పరవిరుద్ధో భయ విషయకమై యున్నది. వానిలో ఏకముయొక్క యథార్థ మునుండుటచే సంశ యమందు భ్రమలక్షణ మున్నది. ఏకవిశేష్యమునందు విరుద్ధమగు రెండు విశేషణా

హేతువై యున్నది. అందువలన నివర్తనీయమై యున్నది. జిజ్ఞాసువుచేత నివర్త నీయమైన యేభ్రమ యున్నదో దానియొక్క భేదమును జెప్పెదము. సంశయరూపభ్రమ ద్వివిధమై యున్నది.(1)ఒకటి ప్రమాణసంశయము, మఱియొకటి(2)ప్రమేయ సంశయము. ప్రమాణగోచరసందేహము ప్రమాణసంశయ మనంబడును. అది యప్రమాణగిశాసంభావన యనంబడును. వేదాంతవాక్యము అద్వితీయబ్రహ్మమునందు ప్రమాణమై యున్నదా లేదా? అనునది ప్రమాణసంశయమై యున్నది. దీనియొక్క నివృత్తి శారీరక ప్రథమాధ్యాయ పఠనమువలనను, శ్రవణమువలనను గలుగును. ప్రమేయసంశయము గూడ (1) ఆత్మసంశయ మనియు (2) ననాత్మసంశయ మనియును ద్వివిధముగా నున్నది. అనాత్మసంశయము అనంతవిధమై యున్నది. దానిం జెప్పుటవలన నేమియు నుపయోగము లేదు. ఆత్మసంశయము గూడ ననేక ప్రకారమై యున్నది.

ఆత్మ బ్రహ్మముకంటె అభిన్నమా లేక భిన్నమా? అభిన్నమైనను సర్వదా అభిన్నమా? లేక మోక్షకాలమందే యభిన్నమై యున్నదా? సర్వదా యభిన్నమైనను, ఆనందాద్యైశ్వర్య సహితమై యున్నదా? లేక ఆనందాది రహితమై యున్నదా? ఆనందాద్యైశ్వర్య సహితమై యుండినను, ఆనందాదికము గుణమై యున్నదా? లేక బ్రహ్మాత్మ స్వరూపమై యున్నదా? ఈరీతిగా తత్పదార్థాభిన్న త్వంపదార్థమునం దనేక ప్రకార సంశయము లున్నవి.

ఈప్రకారముగానే కేవల త్వంపదార్థగోచర సంశయము కూడ ఆత్మగోచరసంశయమై యున్నది. ఆత్మ దేహాదికముకంటె భిన్నుడా, లేక కాడా? భిన్నుడుగా జెప్పినను అణురూపుడుగా నున్నాడా? లేక మధ్యమ పరిణాముడై యున్నాడా, లేక విభుపరిణాముడై యున్నాడా? విభువని చెప్పినను కర్తయై యున్నాడా, అకర్తయై యున్నాడా? అకర్తయని చెప్పినను పరస్పర భిన్నమై అనేకమై యున్నాడా, లేక ఏకమై యున్నాడా? ఈరీతిగనే అనేక సంశయములు కేవల త్వంపదార్థగోచరములై యున్నవి.

ఈప్రకారముగానే కేవలతత్పదార్థ సంశయము కూడ అనేక ప్రకారమై యున్నవి. వైకుంఠాది లోకవిశేష వాసి యగు నీశ్వరుడు పరిచ్ఛిన్న హస్త పాదాద్యవయవసహిత శరీరుడై యున్నాడా? లేక శరీరసహితవిభుడై యున్నాడా? శరీరరహిత విభు వని చెప్పినను పరమాణ్వాది జగత్కర్తయై యున్నాడా? లేక నిరపేక్షకర్తయై యున్నాడా? పరమాణ్వాది నిరపేక్షకర్త యని చెప్పినను కేవల

కర్తయై యున్నాడా? లేక అభిన్ననిమిత్తోపాదాన కర్తయై యున్నాడా? అభిన్న నిమిత్తోపాదానముగా జెప్పినయెడల ప్రాణికర్మ నిరపేక్షకర్తయై యుండుటవలన విషమకారిత్వాది దోషసహితుడై యున్నాడా? లేక ప్రాణికర్మసాపేక్ష కర్తయై యుండుటవలన విషమకారిత్వాది దోషరహితుడై యున్నాడా? ఈరీతిగా ననేక ప్రకార తత్పదార్థ గోచరసంశయము లున్నవి. ఆసకల సంశయములు ప్రమేయసంశయములై యున్నవి. దాని నివృత్తి మననముచేత గలుగును. శారీరక ద్వితీయాధ్యాయాధ్యయనముచేతను లేక శ్రవణముచేతను మననము సిద్ధించును. వానిచేత ప్రమేయసంశయము పోవును.

జ్ఞానసాధనముయొక్కయు మఱియును మోక్షసాధనముయొక్కయు సంశయము కూడ ప్రమేయ సంశయమై యున్నది. ఎట్లన ప్రమావిషయము ప్రమేయ మనంబడును. జ్ఞానసాధనము, మోక్షసాధనము కూడ ప్రమావిషయమైనందున ప్రమేయమై యున్నవి. అందువలన నీయుభయసాధనములయొక్క సంశయము ప్రమేయసంశయమై యున్నది. దాని నివృత్తి శారీరకతృతీయాధ్యాయమువలన గలుగును. ఈరీతిగానే మోక్షస్వరూప సంశయము కూడ ప్రమేయసంశయమై యున్నది. దాని నివృత్తి శారీరకచతుర్థాధ్యాయ పఠనమువలన గలుగును. యద్యపి శారీరక చతుర్థాధ్యాయమునందు మొదట సాధనవిచారమే యున్నది, ఉత్తరత్ర ఫలవిచార మున్నది. మోక్షము ఫల మనంబడును. తథాపి చతుర్థాధ్యాయమునందు నెంతవఱకు సాధనవిచార మున్నదో అంతవఱకు చతుర్థాధ్యాయ సహిత తృతీయాధ్యాయముచేత సాధన సంశయము నివృత్త మగును. అవశిష్ట చతుర్థాధ్యాయముచేత ఫల సంశయము నివృత్త మగును.

### 103. నిశ్చయరూపభ్రమజ్ఞానముయొక్క లక్షణము.

సంశయ నిశ్చయభేదముచేత భ్రమజ్ఞానము ద్వివిధమై యున్నది. సంశయభ్రమనిరూపణము చేయబడినది. నిశ్చయభ్రమ చెప్పబడుచున్నది. సంశయముకంటె భిన్నమగు జ్ఞానము నిశ్చయ మనంబడును. శుక్తియొక్క శుక్తిత్వరూపముచేత యథార్థజ్ఞానము, రజతత్వజ్ఞానముచేత శుక్తియొక్క భ్రమజ్ఞానము, ఈరెండును సంశయముకంటె భిన్నజ్ఞానములైనందున నిశ్చయ జ్ఞానములై యున్నవి. బాధితార్థమును విషయీకరించునట్టిదియు, సంశయముకంటె భిన్నమగునట్టిదియు ఏజ్ఞానమున్నదో అది నిశ్చయ మనంబడును. శుక్తియందు రజత

నిశ్చయమునకు విషయము రజతమై యున్నది. అది బాధితమై యున్నది. ఎట్లన, సంసారదశయందే శుక్తిజ్ఞానముచేత రజతమునకు బాధ యగుచున్నది. బ్రహ్మజ్ఞానము లేక దేనికి బాధ గలుగుట లేదో అది అబాధిత మనంబడును. బ్రహ్మజ్ఞానము లేకయే శుక్త్యాదిజ్ఞానముచేత దేనికి బాధయగుచున్నదో అది బాధిత మనంబడును. లేక, ప్రమాతృబాధ లేక దేనిబాధ గలుగుట లేదో అది యబాధిత మనంబడును. ప్రమాత యుండినను దేనికి బాధ గలుగుచున్నదో అది బాధిత మనంబడును. అబాధితము ద్వివిధము. ఒకటి సర్వత్రాబాధితము మఱియు నొకటి వ్యావహారికాబాధితము. దేనికి సర్వదా బాధ గలుగుట లేదో అది చేతనమై యున్నది. దేనికి వ్యవహారదశయందు బాధ గలుగుట లేదో అది యజ్ఞానము. మహాభూతములు, భౌతిక ప్రపంచములై యున్నవి. సుఖాదికము ప్రాతిభాసికమై యున్నది. అయినను బ్రహ్మజ్ఞానము లేక సుఖాదికమునకు బాధ గలుగుట లేదు. అందువలన నబాధితమై యున్నది. దాని యొక్క జ్ఞానము భ్రమకాదు. ఈరీతిని బాధితపదార్థము కూడ ద్వివిధమై యున్నది. ఒకటి వ్యావహారిక పదార్థావచ్ఛిన్నచేతనవివర్తము. మఱియు నొకటి ప్రాతిభాసిక పదార్థావచ్ఛిన్నచేతనవివర్తమై యున్నది. ఎట్లన, శుక్తి రజతమునకు అధిష్ఠానము శుక్త్యవచ్ఛిన్నచేతనమై యున్నది. శుక్తి వ్యావహారికమై యున్నది. స్వప్నమునందు శుక్తి ప్రతీతమై దానియందు రజతభ్రమ గలుగుచున్నది. ఆరజతమునకు స్వప్నమునందే శుక్తిజ్ఞానముచేత బాధ గలుగుచున్నది. రజతమునకు నధిష్ఠానము స్వప్నశుక్త్యవచ్ఛిన్న చేతనమై యున్నది. స్వప్నశుక్తి ప్రాతిభాసికమై యున్నది. ఈరీతిగా బాధిత పదార్థము ద్వివిధమై యున్నది. దాని యొక్క నిశ్చయము భ్రమ నిశ్చయ మనంబడును.

### 104. అధ్యాసముయొక్క లక్షణము. భేదము.

భ్రమజ్ఞానమునందు శాస్త్రకారులకు అనేకధా వాదము లున్నవి. వారి మతములకంటెు విలక్షణముగా భ్రమయొక్క యసాధారణలక్షణమును శ్రీభాష్యకారులు వ్రాసియున్నారు. భ్రమయొక్క యేస్వరూపము అన్యశాస్త్రి కారులచే నంగీకరింపబడి యున్నదో దానియందు వక్ష్యమాణలక్షణము సంభవించుట లేదు. అందువలన నిలక్షణ మసాధారణమై యున్నది. అన్యులు అసాధారణలక్షణమును జెప్పియున్నను భాష్యకారులకు నన్యాభిమతభ్రమలక్షణమునందవ్యాప్త్యాదిదోషము కలదు. అధిష్ఠానమునకంటెు విషమసత్తాసహితావభాసము అధ్యాస

మనంబడును. ఎచ్చట శుక్తియందు రజతభ్రమ గలుగుచున్నదో అచ్చట శుక్తి దేశమునందు రజతముయొక్క యుత్పత్తి యగుచున్నది. దానియొక్క జ్ఞానము, తాత్కాలిక రజతము. ఈరెండును సిద్ధాంతమునందు అవభాస మనియును, అధ్యాసమనియును జెప్పంబడును. అన్యశాస్త్రమందు రజతోత్పత్తి నంగీకరింప లేదు. ఇది సర్వశాస్త్ర విలక్షణముగా నున్నది. ఒకసత్ఖ్యాతి వాదమునందు మాత్రమే రజతోత్పత్తి యంగీకరింపబడి యున్నది. దానికంటె వైలక్షణ్యము కూడ ఉత్తరత్ర స్పష్టమగును. వ్యాకరణరీతిగా నధ్యాసపదమునకు, నవభాస పదమునకును, విషయము జ్ఞానము ఈరెండును కూడ వాచ్యములై యున్నవి. అందువలన నర్థాధ్యాసమనియు, జ్ఞానాధ్యాసమనియును ఈభేదమువలన నధ్యాసము ద్వివిధమై యున్నది కొన్ని స్థలములయందు కేవల సంబంధాధ్యాసము, మఱియు గొన్ని స్థలములయందు సంబంధవిశిష్ట సంబంధియొక్క యధ్యాసము, ఇతరత్ర, కేవలధర్మాధ్యాసము, పరత్ర ధర్మ విశిష్టధర్మియొక్క యధ్యాసము, ఇతరత్ర, అన్యోన్యాధ్యాసము, మఱియుం గొన్ని చోట్లలో అన్యతరాధ్యాసము ను ఉన్నవి. అన్యతరాధ్యాసము ద్వివిధముగా నున్నది. ఒకటి ఆత్మయందు అనాత్మాధ్యాసము. మఱియొకటి యనాత్మయం దాత్మాధ్యాసము. ఈరీతిగా నర్థాధ్యాసము అనేక ప్రకారమై యున్నది ఉక్తలక్షణమునకు సర్వత్ర సమన్వయము ఉన్నది. ముఖ్యసిద్ధాతమునందు సకలాధ్యాసమునకును చేతన మధిష్ఠానమై యున్నది. రజ్జువునందు సర్పము ప్రతీతమై నందున అచ్చట నున్న ఇదమాకార వృత్త్యవచ్ఛిన్న చేతనముకంటె నభిన్నమగు రజ్జ్వవచ్ఛిన్న చేతనమే సర్పమునకు నధిష్ఠానమై యున్నది, రజ్జువు అధిష్ఠానముకాదు, అను నీ యర్థము విచార సాగరమునందు స్పష్టీకరించి యున్నాము. అచ్చట చేతనమునకు పరమార్థసత్త యున్నది. లేక దానియొక్క యుపాధియగు రజ్జువు వ్యావహారికమై యుండుట వలన రజ్జ్వవచ్ఛిన్న చేతనమునకు వ్యావహారికసత్త యున్నది. ఈరెండు ప్రకారములచేతను, సర్పమునకును, దానియొక్క జ్ఞానమునకును, ప్రాతిభాసికసత్త యుండుటవలన, అధిష్ఠానసత్తకంటె విషమసత్తా సహిత మగు నవభాసము సర్పము, దానియొక్కజ్ఞానమునై యున్నవి. అందువలన నీరెండును, అవభాస మనియు నధ్యాసమనియును జెప్పంబడును. జ్ఞానము, దానియొక్క విషయము కూడ అవభాస మనంబడును. ఈరీతిగా సర్వత్ర అధ్యాసమునకు నధిష్ఠానము చేతన మని చెప్పినయెడల, అధిష్ఠానమునకు పరమార్థ సత్తయు, నధ్యస్తమునకు

ప్రాతిభాసికసత్తయు నుండుటచే నధిష్ఠానముకంటె విషమసత్తా సహితావభాసము అనగా జ్ఞానము, దానివిషయము కూడ స్పష్టముగానే యున్నవి. మఱియును రజతాధిష్ఠానము శుక్తియై యున్నదను నీవవ్యవహారము లోకమునం దున్నది. అందువలన నవచ్ఛేదకతా సంబంధముచేత శుక్తియే రజతమున కాశ్రయమై యున్నది. ఎట్లన, చేతనమునందు రజతాధిష్ఠానత్వమునకు అవచ్ఛేదకమగు శుక్తి యుండుటవలన దానియందు రజతావచ్ఛేదకత్వ సంబంధమున్నది. ఆయవచ్ఛేద కత్వ సంబంధముచేత శుక్తిని రజతాధిష్ఠాన మని చెప్పినయెడల శుక్తికి వ్యావహారిక సత్త యున్నది. రజతమునకు ప్రాతిభాసికసత్త యున్నది, ఈ హేతువును బట్టి చూచినను అధిష్ఠానముకంటె విషమసత్త దీనియం దున్నది. ఈరీతిగా సర్వాధ్యాసములయందును, ఆరోపితములకంటె నధిష్ఠానములకు విషమ సత్త యున్నది. ఏపదార్థమునందు ఆధారత్వము ప్రతీత మగుచున్నదో అది యధిష్ఠాన మనంబడును. ఈ యాధారత్వము పరమార్థముగా నైనను లేక యారోపితముగా నైనను ఉన్నది. పరమార్థముగా నాధారమై యేది యున్నదో యది యధిష్ఠాన మనంబడును, అను నీ యాగ్రహము లేక నియమము ఈ ప్రసంగమునందు లేదు. ఎట్లన, ఆత్మయందు ననాత్మాధ్యాసము ఎట్లున్నదో అట్లు అనాత్మయం దాత్మా ధ్యాస మున్నది. మఱియు ననాత్మయందు పరమార్థముగా నాత్మాధారత్వము లేదు, ఆరోపితాధారత్వ మున్నది. అందువలన నాధారమాత్రము ఈ ప్రసంగము నందు అధిష్ఠాన మనిచెప్పంబడును. ఎచ్చట, ననాత్మయం దాత్మాధ్యాస మున్న దో అచ్చట నధిష్ఠాన మనాత్మయై యున్నది. దానికి వ్యావహారికసత్త యున్నది. ఆత్మకు పారమార్థికసత్త యున్నది అందువలన నధిష్ఠానముకంటె విషమసత్తా సహితము అవభాసమై యున్నది.

105. అన్యోన్యాధ్యాసమునందు శంకా సమాధానములు.

యద్యపి, అత్మాధిష్ఠాన మనాత్మ యని చెప్పుటచే నాత్మ ఆరోపితుడైనట్లు సిద్ధించుచున్నది. ఏది యారోపితమో యది కల్పితము. కాన నాత్మయు కల్పిత మగును. అందువలన ననాత్మయం దాత్మాధ్యాసమును జెప్పుట సరికాదు. తథాపి భాష్యకారులచేత శారీరకారంభమునందు ఆత్మానాత్మల కన్యోన్యాధ్యాసము చెప్పంబడి యున్నది. అందువలన ననాత్మయం దాత్మాధ్యాసనిషేధము సంభవిం చుటలేదు. పరస్పరాధ్యాసము అన్యోన్యాధ్యాస మనంబడును. అందువలన న నాత్మయం దాత్మాధ్యాసము నంగీకరించి ఉక్తశంకకు సమాధానము జెప్పవలసి

యున్నది. ఆసమాధాన మీరీతిగా నున్నది. అధ్యాసము ద్వివిధము. (1) స్వరూపాధ్యాసము. (2) సంసర్గాధ్యాసము. ఏపదార్థముయొక్క స్వరూపము అనిర్వచనీయముగా నుత్పన్న మగుచున్నదో యది స్వరూపాధ్యాస మనంబడును. ఉ. శుక్తియందు రజత స్వరూపాధ్యాస మున్నది. ఆత్మయం దహంకారాద్యనాత్మయొక్క స్వరూపాధ్యాస మున్నది ఈప్రకారముగా ఏపదార్థ స్వరూపము ప్రథమమునందు సిద్ధమై వ్యావహారికమై యున్నదో, లేక పారమార్థికమై యున్నదో దానికి అనిర్వచనీయసంబంధ ముత్పన్న మగునెడల నది సంసర్గాధ్యాస మనంబడును. ఉ. ముఖముతో దర్పణమునకు నుక్తరీతిగా నేసంబంధమును లేదు. మఱియును ఈరెండు పదార్థములును వ్యావహారికములై యున్నవి. అచ్చట దర్పణమునందు ముఖముయొక్క సంబంధము ప్రతీత మగుచున్నది. అందువలన ననిర్వచనీయ సంబంధ ముత్పన్న మగుచున్నది. ఈప్రకారముగానే రక్తవస్త్రమునందు "రక్తః పటః" అను నీప్రతీతి కలుగుచున్నది. రక్తరూపసహితము పటమై యున్నది, అను నీ ప్రతీతిచేత రక్తరూపసహిత పదార్థముయొక్క తాదాత్మ్యసంబంధము పటమునందు భాసించుచున్నది. మఱియు రక్తరూపసహితము కుసుంభద్రవ్యమై యున్నది. అందువలన రక్తరూప సహితముయొక్క తాదాత్మ్యము కుసుంభద్రవ్యమునం దున్నది, పటమునందు లేదు. ఈరీతిగా రక్తరూప సహితమగు కుసుంభ ద్రవ్యము, పటము కూడ, వ్యావహారికములై యున్నవి. వీనియొక్క తాదాత్మ్య సంబంధ మనిర్వచనీయముగా నుత్పన్నమగుచున్నది. 'లోహితః స్ఫటికః' అను నీ ప్రతీతిచేత లోహితముయొక్క తాదాత్మ్యము స్ఫటికమునందు భాసించుచున్నది. లోహిత తాదాత్మ్యము పుష్పమునం దున్నది, స్ఫటికమునందు లేదు. రక్తరూపసహితము లోహిత మనంబడును, రక్తరూపసహితము పుష్పమై యున్నది, స్ఫటికము కాదు. అందువలన లోహితముయొక్క అనిర్వచనీయ తాదాత్మ్యసంబధము స్ఫటికమునం దుత్పన్న మగుచున్నది. ఈరీతిగా ననేక స్థలములయందు సంబంధి వ్యావహారికమై యున్నది, దానియొక్క సంబంధజ్ఞానము అనిర్వచనీయముగా నుత్పన్నమగుచున్నది. ఇదియ సంసర్గాధ్యాస మనంబడును. ఈప్రకారముగానే చేతనమునకు నహంకారమునందు నధ్యాసము లేదు. చేతనము పారమార్థికమై యున్నది. దానియొక్క సంబంధమునకు నహంకారమునం దధ్యాస మున్నది. ఆత్మత్వము చేతనమునం దున్నది. అది అహంకారమునందు ప్రతీతమైనందున ఆత్మయొక్క తాదాత్మ్యము చేతనమునం దున్నది.

అది యహంకారమందు ప్రతీత మగుచున్నది. అందువలన ఆత్మచేతనముయొక్క తాదాత్మ్యసంబంధము అహంకారమందు అనిర్వాచనీయమై యున్నది. లేక, ఆత్మవృత్తి తాదాత్మ్యమునకు అహంకారమునం దనిర్వాచనీయ సంబంధ మున్నది. అందువలన చేతనము కల్పితము కాదు, చేతనముయొక్క తాదాత్మ్యసంబంధము అహంకారమునందు కల్పితమై యున్నది. లేక, ఆత్మచేతన తాదాత్మ్యముయొక్క సంబంధము కల్పిత మై యున్నది. యద్యపి అద్వైతసిద్ధిగ్రంథమునందు నుక్తోదాహరణమునందు నన్యథాఖ్యాతి చెప్పంబడియున్నది. తథాపి బ్రహ్మవిద్యాభరణమునందు నుక్తరీతిగా ననిర్వాచనీయ ఖ్యాతి నంగీకరించి నిర్వాహము చేయబడియున్నది. అన్యథాఖ్యాతి ప్రసిద్ధము కాదు. మఱియు విచారసాగరమునందును, ఈగ్రంథమునందును పూర్వ మిట్లు వ్రాయంబడియున్నది. ఎచ్చట నధిష్ఠానముతో నారోప్యమునకు సంబంధమున్నదో అచ్చట నన్యథాఖ్యాతి అంగీకరింపబడు నని చెప్పినది గ్రంథకారరీతిగా వ్రాయబడియున్నది. అధిష్ఠానముతో నారోప్యమునకు సంబంధ మున్నచోట నన్యథాఖ్యాతియొక్క నియమ ముండినయెడల నహంకారమునందును చేతనముయొక్క తాదాత్మ్యము అన్యథాఖ్యాతిచేత ప్రతీత మగుచున్నది, అని చెప్పుటలో బాధక మేమియు లేదు. ఈరీతిగా నెచ్చట పారమార్థికపదార్థాభావము ఉండి దాని ప్రతీతి యగుచున్నదో అచ్చట పారమార్థికపదార్థముయొక్క యనిర్వచనీయసంబంధము వ్యావహారిక పదార్థమునం దుత్పన్న మగుచున్నది. దానియొక్క జ్ఞానము కూడ ననిర్వచనీయమయియే యున్నది. మఱియును వ్యావహారిక పదార్థాభావము ఉండి అది ఎచ్చట ప్రతీతియగుచున్నదో అచ్చట అనిర్వచనీయమై సంబంధి యుత్పన్న మగుచున్నది. సంబంధిజ్ఞానము కూడ అనిర్వచనీయమై యున్నది. కొన్ని స్థలములయందు సంబంధముమాత్రము సంబంధముయొక్క జ్ఞానముకూడ అనిర్వచనీయముగా నుత్పన్న మగుచున్నవి. అధిష్ఠానముతో నధ్యస్తమునకు విషయ సత్త యనిర్వచనీయ సత్తయై యున్నది. ఆత్మకు ననాత్మయందు నధ్యాస మున్నచోట నధిష్ఠాన మగు ననాత్మ వ్యావహారికమై యున్నది. ఆత్మ యధ్యస్తము కాదు. ఆత్మయొక్క సంబంధ మనాత్మయం దధ్యస్త మై యున్నది. అందువలన ననిర్వచనీయమై యున్నది.

106. అనాత్మయం దధ్యస్తమగు నాత్మకు పరమార్థసత్తయందు తాత్పర్యము.

పూర్వోక్తమేమనగా, అనాత్మయందాత్మాధ్యాస మున్నచోట నధ్యస్తమునకు పరమార్థ సత్త యుండుటవలన విషమసత్తయున్నది. మఱియును బ్రహ్మవిద్యాభరణమునం దుక్తస్థలములయందు అధ్యస్తమునకు పరమార్థసత్తయె చెప్పంబడియున్నది. దాని తాత్పర్యమేమనగా, శుద్ధపదార్థముకంటె విశిష్టము భిన్నమై యున్నది. అందువలన ననాత్మయందు ఆత్మసంబంధముయొక్క అధ్యాస మెచ్చట చెప్పబడియున్నదో అచ్చట సంబంధవిశిష్టాత్మయొక్క యధ్యాసమై యున్నది. స్వరూపముతో నాత్మసత్యుడై యున్నాడు. అందువలన నధ్యస్తమునకు పరమార్థసత్త స్వరూపదృష్టితో జెప్పబడియున్నది. అధ్యస్తము కల్పితమై యున్నది. అందువలన ననాత్మసంబంధవిశిష్టము కల్పితమైనను శుద్ధము కల్పితము కాదు. ఎట్లన, శుద్ధముకంటె విశిష్టము భిన్నమైనందున విశిష్టముయొక్క కల్పితత్వము శుద్ధమునందు లేదు. మఱియు కేవలాత్మ సంబంధముయొక్క యధ్యాసము జెప్పుట వలన సంబంధవిశిష్టాత్మయొక్క యధ్యాసము జెప్పవలసినది. దానికంటె నధ్యస్తమునకు పరమార్థసత్త జెప్పుటయె శ్రేష్ఠమై యున్నది. ఎట్లన, కేవల సంబంధముయొక్క యధ్యాసము జెప్పినయెడల నధిష్ఠానమున కారోపితముతో విషమసత్త సంభవించుటలేదు. ఎట్లన, ఆత్మయొక్క సంబంధ మంతఃకరణమునం దధ్యస్తమై యున్నది. మఱియును స్ఫురణరూప చేతనముయొక్క తాదాత్మ్యసంబంధము ఘటాదికమునం దధ్యస్తమై యున్నది. ఎట్లన, 'ఘటఃస్ఫురతి' అను నీ వ్యవహారము ఘటమునందు స్ఫురణసంబంధముతో బ్రతీత మగుచున్నది. చేతనముయొక్క యధిష్ఠాన మంతఃకరణమై యున్నది. ఘటాదికము వ్యావహారికమై యున్నది. దానియందు చేతనముయొక్క సంబంధము కూడ వ్యావహారికమై యున్నది. ప్రాతిభాసికముగా లేదు. చేతనముయొక్క సంబంధము ప్రాతిభాసిక మగునెడల బ్రహ్మజ్ఞానము లేకయే బాధితము కావలయును. బాధిత మగుట లేదు గాన ననాత్మసంబంధమున కధిష్ఠానమగు ననాత్మయొక్క వ్యావహారికసత్త యుండుట వలనను, విషమసత్త లేనందునను, అధ్యాసలక్షణ మసంభవ మగుచున్నది. కాన సంబంధవిశిష్టాత్మకు ననాత్మయం దధ్యాస మున్నది. విశేష్య భాగమునకు పరమార్థసత్త యుండుటవలన విశిష్టమునకును పరమార్థ సత్త యున్నది. అధిష్ఠానమునకు వ్యావహారిక సత్త యున్నది. రెంటికిని విషమసత్త యుండుట వలన నధ్యాసలక్షణము సంభవించుచున్నది. మఱియును స్వప్నాధిష్ఠానము సాక్షియై యున్నది. దానికి స్వరూపముతో పారమార్థికసత్త యున్నది. పదా

మునకు ప్రాతిభాసికసత్త యున్నది. అందువలన నధిష్ఠానముతో విషమసత్త యుండుటవలన నధ్యాసము సంభవించుచున్నది.

యద్యపి సత్తాస్వరూపము చేతనమై యున్నది. దానికి భేదము జెప్పుట సరి కాదు. తథాపి చేతన స్వరూపసత్తకంటె సత్త యనునది భిన్నపదార్థమై యున్నది. దానియం దుత్కర్షాపకర్షము లున్నవి. అది పారమార్థిక, వ్యావహారిక, ప్రాతిభాసిక భేదముచే త్రివిధమై యున్నది. ప్రాతిభాసికమునం దుత్కర్షాపకర్షము లున్నవి. స్వప్నమునందు కొన్ని పదార్థములు ప్రతీతము లగుచున్నవి. అవి స్వప్నమునందే బాధితము లగుచున్నవి. ఏది జాగ్రత్కాలమునందు బాధితమగు చున్నదో ఆస్వప్నమునందు బాధితపదార్థమునకు నపకృష్టసత్త యున్నది. ఈ రీతిగా చేతనస్వరూపసత్తకంటె భిన్నసత్తాస్వరూపము శ్రుతిచే ప్రథితమగుచున్నది "సత్యస్య సత్యం" "ప్రాణా వై సత్యం" "తేషా మేష సత్య మితి". మఱియును రజతముయొక్క సత్తకంటె శుక్తిసత్త యుత్కృష్టమై యున్నది యనునది సర్వానుభవసిద్ధమై యున్నది గాన నుత్కర్షాపకర్ష సత్త చేతనమునకంటె భిన్నమై యున్నది.

107. అధ్యాసమున కన్యలక్షణము.

అధ్యాసాన్యలక్షణ మేమనగా, తన యభావముయొక్క యధికరణమునందు నవభాస మధ్యాస మనంబడును. శుక్తియందు రజతముయొక్క పారమార్థిక, వ్యావహారికా భావము లున్నవి. రజత మనిర్వచనీయమై యున్నది. కాన రజతాభావమునకు నధికరణ మగు నేశుక్తి యున్నదో, దానియందు రజతప్రతీతియును, తత్ప్రతీతివిషయమును కూడ నుండుటవలన రజతావభాస మున్నది. అందువలన నది యధ్యాసమై యున్నది ఈరీతిగా కల్పితముయొక్క యధికరణమునందు కల్పితముయొక్క యభావ ముండుటవలన నధ్యాసమునం దీలక్షణము సంభవించుచున్నది.

108. ఏకాధికరణమునందు భావాభావములయొక్క విరోధశంకాసమాధానములు.

యద్యపి, ఏకాధికరణమునందు భావాభావములకు విరోధ మున్నది. సంయోగము, దానియొక్క అభావము కూడ ఏకాధికరణమునందు మూలాదిదేశ భేదముచేత నున్నవి, ఏకదేశమునందు లేవు. అందువలన నేకాధికరణమునందు భావాభావములు సంభవించుట లేదు. తథాపి పదార్థములయొక్క విరోధము

అనుభవానుసారముగా జెప్పవలసినది. కేవల భావాభావములకు విరోధము లేదు. ఇక నేమనగా, ఘటత్వ పటత్వము లనునీ రెంటును భావాత్మకములై యున్నవి. ఏకాధికరణమునం దుండవు. వానికిని విరోధ మున్నది ద్రవ్యత్వ, ఘటత్వములకు విరోధములేదు. ఈరీతిగానే ఘటాధికరణభూతలమునందు అతీత కాలవిశిష్టఘటాభావ మున్నది. అందువలన శుద్ధఘటాభావముతో ఘటమునకు విరోధ మున్నది. విశిష్టఘటాభావమునకును, ఘటమునకును, విరోధములేదు. ఈరీతిగానే సంయోగ సంబంధముచేత ఘటసహితభూతలమునందు సమవాయ సంబంధావచ్ఛిన్న ఘటాభావ మున్నది. దానితో ఘటమునకు విరోధములేదు. ఈరీతిగానే సమసత్తాసహిత ప్రతియోగియు, అభావమును, కూడ ఏకాధికరణమునం దుండుట లేదు. విషమసత్తా సహిత ప్రతియోగికి నభావముతో విరోధము లేదు. కల్పితముయొక్క యభావమునకు పారమార్థికసత్త యున్నది. లేక, వ్యావహారిక సత్త యున్నది. కల్పితమునకు ప్రాతిభాసికసత్త యున్నది, అందువలన విరోధము లేదు. ఎచ్చట శుక్తియందు రజతభ్రమ యున్నదో అచ్చట వ్యావహారిక రజతము లేదు. అందువలన రజతముయొక్క వ్యావహారికాభావ మున్నది. మఱియును పారమార్థిక రజతము ఎక్కడను లేనందున రజతముయొక్క పారమార్థికాభావము కేవలాన్వయియై యున్నది. అందువలన శుక్తియందు పారమార్థిక రజతాభావము కూడ ఉన్నది అనిర్వచనీయరజతము, దానిజ్ఞానముకూడ ఏకకాలమునం దుత్పన్నమగుచున్నవి. మఱియును ఏకకాలమునందు రెంటికిని నాశము కలుగుచున్నది. అందువలన రజతము ప్రాతిభాసికమై యున్నది. ప్రతీతికాలమునందు దేనికి సత్తయుండి ప్రతీతిశూన్యకాలమునందు దేనికి సత్తలేదో యది ప్రాతిభాసిక మనంబడును. ఈరీతిగా భ్రమజ్ఞానము, దాని విషయముకూడ అనిర్వచనీయముగా నుత్పన్నము లగుచున్నవి. సదసత్తులకంటె విలక్షణ మనిర్వచనీయ మనంబడును. దానియొక్క యభావము వ్యావహారిక మనంబడును. అందువలన ప్రతియోగ్యభావములకు పరస్పరము విరోధము లేదు. వ్యావహారికాభావమున వ్యవహార ప్రతీతితో విరోధమున్నది.

109. అధ్యాసముయొక్క ప్రసంగమునందు నాలుగు శంకలున్నవి.

ఈ ప్రసంగమునందు నాలుగు శంకలున్నవి, స్వప్నప్రపంచాధిష్ఠానము సాక్షియై యున్నది, అని పూర్వమునందు చెప్పబడినది సంభవించుట లేదు. ఎట్లన, ఏయధికరణమునం దేది యారోపితమై యున్నదో అది యధిష్ఠానముతో

సంబద్ధమై ప్రతీత మగుచున్నది. ఉ. శుక్తియందు రజతము ఆరోపితమై యున్నది. అది ఇదం రజతమను రీతిగా శుక్తియొక్క ఇదంత్వముతో సంబద్ధ మగుచున్నది. ఆత్మయందు కర్తృత్వాదిక మారోపితమై యున్నది. అది అహంకర్తయను రీతిగా సంబద్ధమై ప్రతీతమగుచున్నది. ఈరీతిగానే స్వప్నగజాదికము సాక్షియం దారోపితమై యుండినయెడల "అహం గజః," "మయి గజః" అని సాక్షితో సంబద్ధమై గజాదికము ప్రతీతి కావలయును.

రెండవశంక.

శుక్తియందు రజతాభావము వ్యావహారికమై యున్నది. పారమార్థికమై కూడ నున్నది. అది సంభవించుట లేదు. ఎట్లన నద్వైతవాదమునందు ఏక మగుటచేతనే పారమార్థికమై యున్నది. దానికంటె భిన్నమగునది పారమార్థిక ముగా నంగీకరింపబడినయెడల నద్వైతవాదమునకు హాని కలుగును, రజతము పారమార్థికముగా లేదు. అందువలన పారమార్థిక రజతాభావ మున్నది, అని చెప్పుట సంభవించుచున్నది. పారమార్థికాభావ మున్నదని చెప్పుట సంభవించుట లేదు.

తృతీయశంక.

శుక్తియందు అనిర్వచనీయ రజతమునకు నుత్పత్తి నాశములు పూర్వము నందు జెప్పంబడినవి. అవి సంభవింపవు. ఎట్లన, రజతమున కుత్పత్తి నాశములుం డినయెడల ఘటముయొక్క యుత్పత్తి నాశములవలె రజతముయొక్క యుత్పత్తి నాశములుకూడ ప్రతీతము కావలయును. ఉ. ఘటోత్పత్తి యగునప్పుడు ఘట ముత్పత్తియైనది అని ఘటోత్పత్తి ప్రతీత మగుచున్నది. మఱియును ఘటనాశమై నప్పుడు ఘటనాశము కలిగినదని ఘటనాశము ప్రతీత మగుచున్నది. ఈరీతిగనే రజతోత్పత్తి యయినప్పుడు రజత ముత్పన్నమైనదని రజతోత్పత్తి ప్రతీతి కావల యును. రజతమునకు జ్ఞానముచేత నాశమైనప్పుడు శుక్తిదేశమునందు రజతము నకు నాశముకలిగినది అని నాశము ప్రతీతముకావలయును. శుక్తియందు కేవల రజతము ప్రతీతమై యున్నది. దానియొక్క యుత్పత్తినాశములు ప్రతీతమగుట లేదు. అందువలన శాస్త్రాంతర రీతిగా నన్యథాఖ్యాత్యాదికమే సమీచీనమై యున్నది. అనిర్వచనీయ ఖ్యాతి సంభవించుట లేదు.

చతుర్థశంక.

సదసత్తులకంటె విలక్షణ మగు ననిర్వచనీయ రజతాదికము ఉత్పన్నమగు చున్నదని పూర్వమునందు జెప్పినది సర్వథా అసంగతమై యున్నది. సత్తుకంటె విలక్షణ మస త్తయి యున్నది, అస త్తుకంటె విలక్షణముస త్తయి యున్నది, స త్తు కంటె విలక్షణత యున్నది. అసత్తు లేదు, అని చెప్పుట విరుద్ధమై యున్నది. ఈరీతి గానే యసద్విలక్షణ మున్నది సత్తు లేదు, అని చెప్పుటయును విరుద్ధమై యున్నది ఈరీతిగా నాలుగు శంకలు చేయబడినవి.

110. నాలుగు శంకలకు సమాధానములు.

వానికి క్రమముగా సమాధానము లేమనగా, సాక్షియందు స్వప్నాధ్యాస ముండినయెడల "అహం గజః" "మయి గజః" అను నీ ప్రతీతి కావలయును, అను నీ శంకకు సమాధానము. పూర్వానుభవ జనిత సంస్కారముచేత నధ్యాసము కలుగుచున్నది. ఎటుల పూర్వానుభవ మున్నదో అటులే సంస్కార మున్నది. సంస్కారమునకు సమానమగు నధ్యాసము గలుగుచున్నది. సర్వాధ్యాసముల కు నుపాదానకారణ మగు నవిద్య సమానమై యున్నది. అయిన నిమి త్తకారణము పూర్వానుభవజన్య సంస్కారమై యున్నది. అది విలక్షణమై యున్నది. ఏప్రకార ముగా పూర్వానుభవ జన్యసంస్కార మున్నదో ఆప్రకారముగానే అవిద్యా పరి ణామము గలుగుచున్నది. ఏపదార్థమునకు నహమాకారజ్ఞాన జన్యసంస్కార సహితావిద్య యున్నదో ఆపదార్థమునకు నహమాకారావిద్యాపరిణామ రూపా ధ్యాసము గలుగును. ఏపదార్థమునకు మమతాకారానుభవజన్య సంస్కార సహితావిద్య యున్నదో ఆపదార్థమునకు మమతాకారావిద్యాపరిణామ రూపాధ్యాసము గలుగుచున్నది. ఏపదార్థమున కిదమాకారానుభవజన్య సంస్కార సహితావిద్య యున్నదో యాపదార్థమునకు నిదమాకారావిద్యా పరిణామరూపాధ్యాసము గలుగుచున్నది. స్వప్నగజాదికముయొక్క పూర్వాను భవము ఇదమాకారముగానే యున్నది. అహమాకారాద్యనుభవము లేదు. అందువలన ననుభవజన్యసంస్కారము కూడ ఇదమాకారముగానే యున్నది. అందువలన 'అయం గజః' అను నీ ప్రతీతి గలుగుచున్నది, "మయి గజః," "అహం గజః" యను నీ ప్రతీతి గలుగుట లేదు. సంస్కారము అనుమేయమై యున్నది. కార్యమునకు ననుకూల మగు సంస్కారముయొక్క యనుమితి సంస్కారజనక పూర్వానుభవము కూడ అధ్యాసరూపమై యున్నది. దానికి జనక మగు

సంస్కారము కూడ ఇదమాకారముగానే యున్నది. అధ్యాసప్రవాహ మనాదియై యున్నది. ప్రథమానుభవముయొక్క ఇదమాకారతయందు ఏ హేతువు లేదను శంక సంభవించుట లేదు. ఎట్లన ననాదిపక్షమునందు నేయనుభవమును ప్రథమముగా లేదు. పూర్వపూర్వానుభవానుసారముగా నుత్తరోత్తరానుభవము గలుగుచున్నది.

అభావమును పారమార్థికముగా నంగీకరించినయెడల నద్వైతమునకు హాని గలుగు నను ద్వితీయ శంకకు సమాధానము. సిద్ధాంతమునందు సకల పదార్థములు కల్పితములై యున్నవి వానియొక్క యభావము పారమార్థికమై యున్నది. అది బ్రహ్మరూపమై యున్నది, అను నీ యర్థము భాష్యకార సమ్మతమై యున్నది. దీనియందు యుక్తిని ఉత్తరత్ర చెప్పెదము. ఈకారణముచేత నద్వైతమునకు హాని లేదు. శుక్తియందు రజతోత్పత్తి నంగీకరించినయెడల ఉత్పత్తి విషయక ప్రతీతి కావలయు నను నీ శంకకు సమాధానము. శుక్తియందు తాదాత్మ్య సంబంధముచేత రజత మధ్యస్తమై యున్నది. శుక్తియొక్క ఇదంతయొక్క సంబంధము రజతమునం దధ్యస్తమై యున్నది. అందువలన 'నిదం రజత'మని రజతము ప్రతీత మగుచున్నది. ఎట్లు శుక్తి నిష్ఠేదంతయొక్క సంబంధము రజతమం దధ్యస్తమై యున్నదో ఆశుక్తియందు ప్రాక్సిద్ధత్వధర్మ మున్నది. రజతప్రతీతి కాలమునకంటె పూర్వమునందు సిద్ధమైనది ప్రాక్సిద్ధ మనందురు. రజతప్రతీతి కాలమునకంటె ప్రథమసిద్ధము శుక్తియై యున్నది. ఈరీతిగా శుక్తియందు ప్రాక్సిద్ధత్వధర్మమున్నది. ఆ సంబంధముయొక్క యధ్యాసము కూడ రజతమునందున్నది. అందువలన 'నిదానీం రజత' మను నీప్రతీతి కలుగుట లేదు 'ప్రాగ్జాతం రజతం పశ్యామి' యను నీ ప్రతీతి గలుగుచున్నది. ఈ ప్రతీతికి విషయము ప్రాగ్జాతత్వమై యున్నది, అది రజతమునందు లేదు. ఇక నేమనగా రజతమునందు ఇదానీంజాతత్వ మున్నది. మఱియును ప్రాగ్జాతత్వము రజతమునందు ప్రతీత మగుచున్నది. అచ్చట రజతమునందు ననిర్వచనీయ ప్రాగ్జాతముయొక్క యుత్పత్తి నంగీకరించునెడల గౌరవదోష మున్నది. శుక్తి నిష్ఠ ప్రాగ్జాతత్వముయొక్క ప్రతీతిని రజతమునం దంగీకరించినయెడల అన్యథాఖ్యాతి నంగీకరించిన ట్లగును. ఈస్థానమునం దన్యథాఖ్యాత్యంగీకారము కూడ నున్నది. తథాపి శుక్తి నిష్ఠ ప్రాగ్ధర్మత్వముయొక్క యనిర్వచనీయ సంబంధము రజతమునం దుత్పన్నమై యున్నది, అను నీపక్షము సమీచీనమై యున్నది. ఈరీతిగా శుక్తి నిష్ఠ ప్రాక్సిద్ధత్వ సంబంధము

యొక్క ప్రతీతిచేత నుత్పత్తి ప్రతీతికి ప్రతిబంధము కలుగుచున్నది. ఏలయన, ప్రాక్సిద్ధత్వము, వర్తమానోత్పత్తియు నను నీ రెంటికిని పరస్పర విరోధ మున్నది. ఎచ్చట ప్రాక్సిద్ధత్వ మున్నదో అచ్చట నతీతోత్పత్తి యున్నది. ఎచట వర్తమానోత్పత్తి యున్నదో అచట ప్రాక్సిద్ధత్వము లేదు. ఈరీతిగా శుక్తివృత్తిప్రాక్సిద్ధత్వ ధర్మసంబాధముయొక్క ప్రతీతిచేత నుత్పత్తి ప్రతీతికి ప్రతిబాధ ముండుట వలన రజతోత్పత్తి యుండినను తదుత్పత్తి ప్రతీతి కలుగుట లేదు. మఱియు రజతనాశ ముండినయెడల దానియొక్క ప్రతీతి కావలయు నను శంకకు సమాధానము. అధిష్ఠాన ముండినపుడు రజతనాశము గలుగుచున్నది. అది అధిష్ఠాన జ్ఞానము చేత రజతబాధ నిశ్చయమైనది. శుక్తియందు కాలత్రయమునందును రజతము లేదను నీ నిశ్చయము బాధ యనంబడును. ఈ నిశ్చయము నాశప్రతీతికి విరోధియై యున్నది. ఎటు లన, నాశనమునందు ప్రతియోగి కారణమై యున్నది. బాధచేతనైన ప్రతియోగ్యభావము సర్వదా భాసించు చున్నది. దేనియొక్క యభావము సర్వదా యున్న దను నీజ్ఞానము గలుగుచున్నదో దానియొక్క నాశబుద్ధి సంభవించుట లేదు. అథవా, ఎటుల ఘటాదికమునకు ముద్గరాదికముతో చూర్ణభావరూప నాశ మున్నదో అటుల కల్పితముయొక్క నాశము లేదు. ఇక నేమనగా, అధిష్ఠాన జ్ఞానముచేత నజ్ఞానరూపోపాదానసహిత కల్పితమునకు నివృత్తి గలుగుచున్నది. అధిష్ఠాన మాత్రముయొక్క యవశేషమే యజ్ఞానసహితకల్పితముయొక్క నివృత్తియై యున్నది. ఆయధిష్ఠానము శుక్తియై యున్నది, దానియొక్క యవశేషరూప రజతనాశ మనుభవసిద్ధమై యున్నది. అందువలన రజతనాశమునకు ప్రతీతి లేదు, అను కథనము సాహసమాత్రమై యున్నది.

మఱియును సదసద్విలక్షణకథనము విరుద్ధమై యున్నది అను నీశంకకు సమాధానము. స్వరూపరహితము సద్విలక్షణ మని చెప్పినయెడల విద్యమాన స్వరూపము అసద్విలక్షణ మని చెప్పినయెడలను విరోధ మున్నది. ఎట్లన, ఒకటే పదార్థమున్నది స్వరూపసాహిత్యము గూడ సంభవింపదు. అందువలనసదసద్విలక్షణమునకు నుక్తార్థము కాదు. ఇక నేమనగా, కాలత్రయమునందును దేనికి బాధలేదో యది సత్తనంబడును. దేనికి బాధయున్నదో యది సద్విలక్షణ మనంబడును. శశశృంగ, వంధ్యాపుత్త్రులవలె స్వరూపహీన మసత్తనంబడును. దానికంటె విలక్షణము స్వరూప సహితమై యున్నది. ఈరీతిగా బాధయోగ్య స్వరూప సహితము సదసద్విలక్షణ శబ్దమునకు నర్థమై యున్నది. సద్విలక్షణ శబ్దమునకు

బాధయోగ్య మర్థము, స్వరూప సహిత మను నీ యర్థము అస ద్విలక్షణ శబ్దము నకు నున్నది.

111. పూర్వోక్తాధ్యాసముయొక్క భేదానువాదము, తదుదాహరణ ములు.

ఈరీతిగా నెచట భ్రమజ్ఞాన మున్నదో యచట ననిర్వచనీయ పదార్థము నకు నుత్పత్తి యున్నది. కొన్ని స్థలములయందు సంబంధమునకు నుత్పత్తి యున్నది. ఉ శుక్తియందు రజతోత్పత్తి యున్నది. శుక్తివృత్తి తాదాత్మ్య సం బంధమునకు రజతమునకు నుత్పత్తి యున్నది. శుక్తివృత్తి స్వతాదాత్మ్యమునకు రజతమునం దన్యథాఖ్యాతి లేదు. ఈరీతిగనే శుక్తియందు ప్రాక్సిద్ధత్వ రూపధర్మ మున్నది. దానియొక్క యనిర్వచనియ సంబంధమునకు రజతమునం దుత్పత్తి యున్నది. దానికిని అన్యథాఖ్యాతి లేదు. ఈరీతిగా నన్యోన్యాధ్యాసమున కును సంబంధాధ్యాసమునకును సంబంధ్యధ్యాసమునకు నిది యుదాహరణమై యున్నది. అనిర్వచనీయ వస్తువుయొక్క ప్రతీతి జ్ఞానాధ్యాస మనంబడును. జ్ఞాన ముయొక్క యనిర్వచనీయవిషయము అర్థాధ్యాస మనంబడును. అందువలన జ్ఞానాధ్యాసార్థాధ్యాసములకు నిదే యుదాహరణము. రజతత్వధర్మవిశిష్ట రజతమునకు శుక్తియం దధ్యాస ముండుటవలన ధర్మ్యధ్యాసమునకు నిదే యుదాహరణము. ఎచట నన్యోన్యాధ్యాస మగుచున్నదో నచట రెంటికిని పర స్పర స్వరూపముతో నధ్యాసము లేదు. ఇక నేమనగా నారోపితమునకు స్వరూప ముతో నధ్యాస మున్నది. సత్యవస్తువుయొక్క ధర్మము లేక సంబాధము అధ్యస్త మై యున్నది. సంబంధాధ్యాసముకూడ ద్విప్రకారకమై యున్నది. కొన్నిచోట్ల ధర్మసంబంధాధ్యాస మున్నది. ఉక్తోదాహరణమునందు శుక్తివృత్తి ఇదంత్వరూ పధర్మ సంబంధమునకు రజతమునం దధ్యాస మున్నది. 'రక్తః పటః' అను నీస్థల మునందు కుసుంభవృత్తి రక్తరూప ధర్మసంబంధమునకు పటమునం దధ్యాస ము న్నది. దర్పణమునందు ముఖసంబంధాధ్యాస మున్నది. అంతఃకరణమునకు నాత్మయందు స్వరూపముతో నధ్యాస మున్నది అంతఃకరణమునం దాత్మకు స్వరూపముతో నధ్యాసము లేదు. ఆత్మసంబంధాధ్యాస ముండుటవలన నాత్మ యొక్క సంసర్గాధ్యాస మున్నది. ఆత్మ జ్ఞానస్వరూపుడై యున్నాడు, అంతఃకర ణము కాదు. జ్ఞానముయొక్క సంబంధ మంతఃకరణమునందు ప్రతీత మగుచున్నది. అందువలన నాత్మసంబంధమునకు నంతఃకరణమునం దధ్యాస మున్నది. ఈప్రకా

రముగానే "ఘటః స్ఫురతి" "పటః స్ఫురతి" యను నీరీతిగా స్ఫురణ సంబంధము సర్వపదార్థములయందును బ్రతీత మగుచున్నది. అందువలన నాత్మసంబంధమునకు నిఖిలపదార్థములయం దధ్యాస మున్నది. ఆత్మయందు కాణత్వాదీంద్రియ ధర్మములు బ్రతీత మగుచుండుటవలన కాణత్వాది ధర్మమున కాత్మయం దధ్యాస మున్నది. ఆత్మయందు నింద్రియముయొక్క తాదాత్మ్యాధ్యాసము లేదు. ఎట్లన "అహం కాణః" యను నీ ప్రతీతి యగుచున్నది. "అహం నేత్రం" అను నీ ప్రతీతి కలుగుట లేదు. అందువలన నేత్రధర్మమగు కాణత్వమునకు నాత్మయం దధ్యాస మున్నది. నేత్రమున కధ్యాసము లేదు. ఇది ధర్మాధ్యాసోదాహరణమై యున్నది. యద్యప్యాత్మయందు నేత్రాదినిఖిల ప్రపంచమున కధ్యాస మున్నది. తథాపి బ్రహ్మచేతనమునందు సమస్తప్రపంచమున కధ్యాస మున్నది. త్వం పదార్థమునందు నిఖిలప్రపంచమున కధ్యాసము లేదు. అవిద్య కీయద్భుతమహిమ యున్నది. ఏక ధర్మవిశిష్టైకపదార్థమునకే యధ్యాస మున్నది. అపరధర్మవిశిష్టమున కధ్యాసము లేదు. ఉ. బ్రాహ్మణత్వాది ధర్మవిశిష్ట శరీరమునకు నాత్మయందు తాదాత్మ్యాధ్యాస మున్నది. శరీరత్వ విశిష్టశరీమునకు నధ్యాసము లేదు. ఈరీతిగా వివేకి యగు వాడు కూడ "బ్రాహ్మణోహం" "మనుష్యోహం" అను నీ వ్యవహారము జేయుచున్నాడు. "శరీరమహం" యను నీ వ్యవహారము వివేకికి గలుగుట లేదు. అందువలన నవిద్యకు నద్భుతమహిమ యుండుటవలన నింద్రియాధ్యాసము లేకయే ఆత్మయందు కాణత్వాది ధర్మాధ్యాసము సంభవించుచున్నది. ఇది ధర్మాధ్యాసోదాహరణమై యున్నది. ఏది యన్యాశ్రితమై స్వతంత్రము కాదో యది ధర్మ మనంబడును. అందువలన సంబంధముకూడ ధర్మముగానే యున్నది. దానియొక్క యధ్యాసము కూడ ధర్మాధ్యాసమై యున్నది. అయినను ధర్మము ద్వివిధమై యున్నది. ఒకటి ప్రతియోగ్యనుయోగులయొక్క ప్రతీతికి నధీన మగు ప్రతీతికి విషయమై యున్నది. కొన్నిధర్మములు అనుయోగిమాత్రప్రతీతికి నధీన మగు నే ప్రతీతి యున్నదో దానికి విషయములై యున్నవి. ఒకప్పుడు అనుయోగిప్రతీతి లేకయే కేవలధర్మమునకు బ్రతీతి కలుగుచున్నది. ఉ. ఘటత్వాదికముయొక్క ప్రతీతియందు అనుయోగిమాత్ర ప్రతీతియొక్క యపేక్ష యున్నది. ఘటత్వము నిత్యమై యున్నది, ఇత్యాదివాక్యజన్య ప్రతీతియందు అనుయోగి ప్రతీతియొక్క యపేక్ష లేదు. ఈరీతిగా ధర్మము ద్వివిధమై యున్నది. అను యోగి ప్రతియోగులయొక్క ప్రతీతిలేకయే దేనికి ప్రతీతి కలుగుచున్నదో ఆధర్మము సంబంధ మనం

బడును. ఘటత్వాదికము కేవలధర్మ మని చెప్పబడుచున్నది. సంబంధ మని చెప్పబడుట లేదు. సంబంధాధ్యాసము కూడ ధర్మాధ్యాసముగానే యున్నది. ఉక్తరీతిగా సకలభ్రమయందును రెండులక్షణములు సంభవించుచున్నవి. అధిష్ఠానముకంటె విషమసత్తాసహితావభాస మధ్యాస మనంబడును. లేక స్వాభావాధికరణమునందు అవభాస మధ్యాస మనంబడును. భ్రమకాలమునందు అనిర్వాచనీయవిషయము, దాని జ్ఞానము కూడ నుత్పన్నమగుచున్నవి. అందువలన రెండులక్షణములు అధ్యాసమునకు సంభవించుచున్నవి. పరోక్షాపరోక్షభేదమువలన భ్రమ ద్విప్రకారమై యున్నది. అపరోక్షభ్రమకు నుదాహరణము చెప్పబడియున్నది. ఎచట వహ్నిశూన్యదేశమునకు వహ్న్యనుమితి జ్ఞానము గలుగుచున్నదో అది పరోక్షభ్రమయై యున్నది. అది యీరీతిగా కలుగుచున్నది. మహానసత్వము వహ్నివ్యాప్తము కాదు. మహానసమునందు పునఃపునః వహ్నిదేశమునకు మహానసత్వవ్యాప్యతాభ్రమ యుత్పన్నమగుచున్నది. అచట వహ్నిశూన్యకాలమునందు "ఇదం మహానసం వహ్నిమత్, మహానసత్వాత్ పూర్వదృష్టమహానసవత్." అని మహానసమునందు వహ్నియొక్క యనుమితిరూపభ్రమజ్ఞానము కలుగుచున్నది. మఱియును విప్రలంభవాక్యముచేత నహ్నివిషయకశాబ్దభ్రమ కలుగుచున్నది. ఆరెండును పరోక్షభ్రమలై యున్నవి. ఎచట పరోక్షభ్రమ యున్నదో అచట ననిర్వచనీయవిషయమునకు నుత్పత్తి యంగీకరింపబడలేదు. ఆదేశమునం దసద్వహ్నివిషయకప్రతీతి యున్నది. అందువలన నధ్యాసలక్షణమునకు పరోక్షభ్రమ లక్ష్యము కాదు. వహ్న్యభావాధికరణమునందు ప్రతీతి యుండుటవలన స్వాభావాధికరణమునందు అవభాస మున్నది. విషయము జ్ఞానము కూడ అవభాస మనంబడును. వహ్న్యభావాధికరణమునందు వహ్నియొక్క పరోక్షజ్ఞానరూపావభాస ముండుటవలన నుక్తలక్షణమునకు యద్యపి అతివ్యాప్తి యున్నది, తథాపి లక్షణమునందు అవభాసపదముచేత నపరోక్షజ్ఞానమునకు గ్రహణముండుటవలన పరోక్షభ్రమయం దధ్యాసలక్షణమునకు నతివ్యాప్తి లేదు. ఎచట పరోక్షభ్రమ యున్నదో ఆస్థలమందు ఏరీతిగా నైయాయికుడు అన్యథాఖ్యాత్యాదికముచేత నిర్వహించుకొనునో దానికి విలక్షణముగా జెప్పుటయందు నద్వైతులకు నియమము లేదు. అపరోక్షభ్రమయందే పారిభాషికకార్యాధ్యాసము విలక్షణముగా జెప్పబడియున్నది. ఎట్లన, కర్తృత్వాద్యనర్థభ్రమ యపరోక్షమై యున్నది. దానిస్వరూ

పమునందు జ్ఞాననివర్త్యత్వముకొఱకు నధ్యాసనిరూపణ ముండుటవలన నపరోక్ష భ్రమయొక్క దృష్టాంతముకొఱకు నధ్యాసతాప్రతిపాదనమునందు నియమము న్నది. పరోక్షభ్రమయందు శాస్త్రాంతరముచేత విలక్షణము జెప్పుటలో ప్రయోజనము లేదు అపరోక్షభ్రమయం దుక్తరీతిగా లక్షణసమన్వయ మున్నది.

**112—136.** సిద్ధాంతసమ్మతానిర్వచనీయఖ్యాతినిరూపణము.

**112.** సాంప్రదాయికమతము.

సిద్ధాంతమునం దనిర్వచనీయఖ్యాతి యున్నది. దానిక్రమ మెట్టి దన, ఎచట రజ్జ్వాదికమునందు సర్పాది భ్రమ కలుగుచున్నదో అచట నధిష్ఠానముయొక్క సామాన్యజ్ఞాన మధ్యాసమునకు హేతువై యున్నది. అందువలన రజ్జువుయొక్క యిదమాకారసామాన్యజ్ఞాన మున్నది. ఆసామాన్యజ్ఞానము దోషసహితనేత్రరూపప్రమాణముచేత నుత్పన్న మైనందున ప్రమయై యున్నది. ఆదోషసహితనేత్రజన్యేదమాకారవృత్త్యవచ్ఛిన్నచేతనస్థావిద్యయొక్క పరిణామము సర్పజ్ఞానమై యున్నది. అది జ్ఞానాభాస మనంబడును. దోషసహితనేత్రమునకు రజ్జువుతో సంబంధమై అంతఃకరణముయొక్క యిదమాకారవృత్తి రజ్జుదేశమునకు బోవుట వలన ప్రమాతృచేత నేదమవచ్ఛిన్న చేతనములయొక్క యుపాధి యేకదేశమునం దుండుటవలన ప్రమాతృచేతనముతో నిదమవచ్ఛిన్న చేతనమునకు భేదము లేదు. అందువలన రజ్జువుయొక్క సామాన్యమగు సిదంరూపము ప్రత్యక్షమై యున్నది. ప్రత్యక్షవిషయముయొక్క యిదమాకారజ్ఞానము కూడ ప్రత్యక్షమై యున్నది. ఏవిషయమునకు ప్రమాతృచేతనముతో నభేద మున్నదో యావిషయము ప్రత్యక్ష మనంబడును. ప్రత్యక్షవిషయజ్ఞానము కూడ ప్రత్యక్ష మనంబడును. అథవా, ప్రమాణచేతనముతో విషయచేతనమునకు నభేదమే జ్ఞానగతప్రత్యక్షత్వ ప్రయోజనమై యున్నది. ఉక్తస్థలమునందు ప్రమాతృ చేతనముయొక్క యభేదముకూడ వృత్తిద్వారా కలుగుచున్నది. అందువలన వృత్తిరూపప్రమాణచేతనమునకు విషయచేతనముతో నభేదము కూడ అబాధితమై యున్నది. ఉ. తటాకజలమునకు కాలువద్వారా కేదారజలముతో నభేద మున్నది. అచ్చట కాలువజలమునకు కేదారజలముతో నభేద మున్నది, ఇచట తటాకజలస్థానీయము ప్రమాణచేతనమై యున్నది. కాలువ సమానము వృత్తియై యున్నది. కాలువ జలసమానము వృత్తిచేతనమై యున్నది. కేదారసమానము విషయమై యున్నది. కేదారస్థజలసమానము విషయచేతనమై యున్నది. యద్యపి, ఉక్త

దృష్టాంతముచేత విషయచేతనమునకు ప్రమాతృచేతనముతో నభేదము సంభవించుచున్నది. తథాపి ప్రమాతృచేతనముతో ఘటాదివిషయమున కభేదము సంభవించుటలేదు. ఉ. తటాకజలముతో కాలువద్వారా కేదారజలమున కభేదమున్నది. పార్థివకేదారమునకు తటాకజలముతో నభేదము లేదు. అందువలన ఘటాదివిషయకప్రత్యక్షమునందు ప్రమాతృచేతనముతో నభేదము హేతువుగా జెప్పుట సరికాదు. తథాపి ప్రమాతృచేతనముతో నభేదము విషయగత ప్రత్యక్షత్వ ప్రయోజకమై యున్నది, అని చెప్పుటవలన, ప్రమాతృచేతనమునకు విషయమునకును ఏకత్వము వివక్షితము కాదు. ప్రమాతృచేతనముయొక్క సత్తకంటె విషయమునకు భిన్నసత్త లేదు. ప్రమాణచేతనముయొక్క సత్తయే విషయసత్తయై యున్నది, ఆవిషయము ప్రత్యక్షమై యున్నది, అనునీయర్థము వివక్షితమై యున్నది. ఘటాధిష్ఠానము ఘటావచ్ఛిన్న చేతనమై యున్నది. రజ్జ్వధిష్ఠానము రజ్జ్వవచ్ఛిన్న చేతనమై యున్నది. ఈరీతిగా సకలవిషయమునకు నధిష్ఠానము విషయావచ్ఛిన్న చేతనమై యున్నది. అధిష్ఠానసత్తకంటె నధ్యస్తమునకు పృథక్సత్త లేదు. అధిష్ఠానసత్తయే అధ్యస్తసత్తయై యున్నది. అందువలన విషయావచ్ఛిన్న చేతనముయొక్క సత్తకంటె విషయమునకు పృథక్సత్త లేదు. అంతఃకరణవృత్తిద్వారా ప్రమాతృచేతనమునకు విషయచేతనముతో నభేద ముండినపుడు ప్రమాతృచేతనము కూడ విషయచేతనముతో నభిన్నమై విషయమున కధిష్ఠానమై యున్నది. అందువలన నపరోక్షవృత్తివిషయమునకు నధిష్ఠాన మేప్రమాతృచేతన మున్నదో దానియొక్క సత్తకంటె విషయమునకు భిన్నసత్తాభావమే ప్రమాతృచేతనముతో విషయముయొక్క యభేద మనంబడును. అది ఉక్తరీతిగా సంభవించుచున్నది. ఈరీతిగా నపరోక్షస్థలమునందు విషయదేశమునందు వృత్తియొక్క నిర్గమన మంగీకరింపవలసినది. ఎటుల కాలువ సంబంధము లేక తటాకజలమునకును కేదారజలమునకును ఐక్యము సంభవించుట లేదో అటుల వృత్తి సంబంధము లేక ప్రమాతృచేతన విషయచేతనములకు నైక్యము సంభవించుట లేనందున నెట్లు పరోక్షజ్ఞానకాలమునందు ప్రమాతృచేతన విషయచేతనములకు భేద ముండుటవలన ప్రమాతృచేతనముతో విషయము భిన్నసత్తాసహిత మైనందున ప్రమాతృచేతనముతో నభిన్నసత్తాసహితము విషయము కాదో అటులే వృత్తియొక్క నిర్గమనము లేక యపరోక్షజ్ఞానకాలమందును భిన్నసత్తాసహితము విషయము కానలయును. అందువలన విషయదేశమునకు వృత్తియొక్క నిర్గ

మన మంగీకరింపవలసినది. ఈరీతిగా ''అయం సర్పః'' ''ఇదం రజతం'' ఇత్యాద్య పరోక్షజ్ఞానమునకు నుత్పత్తి యున్నది. అచ్చట భ్రమకంటె నవ్యవహిత పూర్వకాలమునందు భ్రమహేతు వగు నధిష్ఠానసామాన్యజ్ఞాన మున్నది. అది ప్రత్యక్షరూపప్రమయై యున్నది. దానిచే సర్పాది విషయము, దానియొక్క జ్ఞానము కూడ నుత్పన్నమగుచున్నవి. ఇదిసాంప్రదాయిక మతమై యున్నది.

113. ఉక్తానిర్వచనీయఖ్యాతిరూపమతమునందు శంక, సంక్షేపశారీరకుల సమాధానము.

అపరోక్షప్రమచేత నజ్ఞానమునకు నివృత్తి నియమముగా గలుగుచున్నది అను నీవచనము అష్టమ ప్రకాశమునందు ప్రతిపాదింపబడును. అందువలన రజ్జుశుక్త్యాదికముయొక్క ఇదమాకారాపరోక్షప్రమచేతను విషయచేతనముయొక్క అజ్ఞానమునకు నివృత్తి కలుగుటవలన నుపాదానము లేనందున సర్పాదికము దానియొక్క జ్ఞానము కూడ ఉత్పన్నమగుట లేదు. దీనికి సంక్షేపశారీరకానుసారి యగు సమాధానము. ఇదమాకార వృత్తిచేత విషయముయొక్క యిదమంశమందుండు నజ్ఞానమునకు నివృత్తి గలుగుచున్నది. రజ్జుత్వశుక్తిత్వాది విశేషాంశమందుండు నజ్ఞానమునకు నివృత్తి కలుగుట లేదు. మఱియును రజ్జుత్వశుక్తిత్వాది విశేషాంశముయొక్క జ్ఞానముచేతనే యధ్యాసమునకు నివృత్తి యుండుటవలన విశేషాంశముయొక్క యజ్ఞానమే యధ్యాసమునకు హేతువై యున్నది. సామాన్యాంశముయొక్క యజ్ఞానము కూడ నధ్యాసమునకు హేతువు అయినయెడల ఇదమాకార సామాన్యజ్ఞానముచేతను అధ్యాసమునకు నివృత్తి కావలయును. ఎట్లన, దేనియొక్క యజ్ఞానముచేత భ్రమ కలుగుచున్నదో దానియొక్క జ్ఞానము చేత నది నష్టమగుచున్నది, అను నీ నియమమున్నది. అందువలన నిదమంశముయొక్క యజ్ఞానమున కధ్యాసమునందపేక్ష లేదు, ప్రత్యుత, ఇదమాకార నేత్రప్రమయొక్క యపేక్ష అపరోక్షాధ్యాసమునందున్నది. ఎట్లన, రజ్జ్వాదికముతో నేత్రమునకు సంయోగమైనప్పుడు సర్పాదికమున కపరోక్షభ్రమ కలుగుచున్నది. నేత్ర సంయోగము లేక కలుగుట లేదు. అందువలన నేత్రజన్యాపరోక్షప్రమారూపాధిష్ఠాన సామాన్య జ్ఞానమే యధ్యాసమునకు హేతువై యున్నది. అచ్చట నన్యప్రకారముగా సామాన్య జ్ఞానమున కధ్యాసమునందుపయోగము సంభవించుట లేదు. అధ్యాసమునకుపాదానమగు నజ్ఞానమునకు క్షోభము సామాన్యజ్ఞానముచేత కలుగుచున్న

దని యంగీకరింపవలసినది. ఈరీతిగా నధిష్ఠానముయొక్క సామాన్యజ్ఞానమునకు నధ్యాసమును గుఱించి కారణత్వ ముండుటవలన ఇదమంశముయొక్క యజ్ఞాన మధ్యాసమునకు హేతువు కాదు.

## 114. కవితార్కికచక్రవర్తి నృసింహభట్టోపాధ్యాయ మతముయొక్క యనువాద మనాదరమును.

కవితార్కికచక్రవర్తి నరసింహభట్టోపాధ్యాయులచేత నధిష్ఠానసామాన్యజ్ఞానమునకు నధ్యాసమును గూర్చి హేతుత్వము నిషేధింపబడియున్నది. అధిష్ఠానముతో నేత్రసంయోగ ముండినయెడల సర్పాద్యధ్యాస మగుచున్నది. నేత్రసంయోగము లేనియెడల సర్పాద్యధ్యాసము కలుగుట లేదు. ఈరీతిగా నింద్రియాధిష్ఠాన సంయోగముయొక్క యన్వయవ్యతిరేకములచేత సామాన్యజ్ఞానమున కధ్యాసకారణత్వము పూర్వమునందు చెప్పబడియున్నది. ఆ యన్వయవ్యతిరేకముచేతను ఇంద్రియాధిష్ఠాన సంయోగమునకే యధిష్ఠాన కారణత్వము సిద్ధించుచున్నది. ఇంద్రియసంయోగ జన్యసామాన్య జ్ఞానమున కధ్యాసకారణత్వము సిద్ధించుట లేదు. ఎట్లన, అన్వయ వ్యతిరేకములచేత కారణత్వ నిశ్చయ మగుచున్నది. సాక్షాత్కారణత్వము సంభవించుచున్నది. పరంపరాకల్పన మయోగ్యమైయున్నది. అందువలన నింద్రియ సంయోగాన్వయ వ్యతిరేకముచేత నధ్యాసమును గూర్చి ఇంద్రియాధిష్ఠాన సంయోగమునకే సాక్షాత్కారణత్వ ముచితమైయున్నది. అధిష్ఠాన సామాన్యజ్ఞానము ద్వారా ఇంద్రియసంయోగమునకు కారణత్వము జెప్పుట సరికాదు. ఎట్టుల నధిష్ఠానసామాన్య జ్ఞానముచేత నవిద్యయందు క్షోభ మంగీకరింపబడినదో అటుల నధిష్ఠానేంద్రియములయొక్క సంయోగముచేతను క్షోభ మంగీకరింపవలసినది. అధిష్ఠానసామాన్య జ్ఞానమును అధ్యాసమును గూర్చి హేతువుగా నంగీకరింపనియెడల నధ్యాసముకంటె పూర్వమునందు ఇదమాకారాపరోక్షప్రమ యుండుటవలన నజ్ఞాన నివృత్తి శంకాసమాధానములు కలుగుచున్నవి అవి నిష్కారణముగా నున్నవి. ఇదియును అనుకూలమై లాఘవమై యున్నవి. ఈరీతిగా నధిష్ఠాన సామాన్యజ్ఞానమునకు నధ్యాసమునుగూర్చి కారణత్వము కవితార్కిక చక్రవర్తి నరసింహభట్టులచేత నిషేధింపబడియున్నది. ఆయనయును నద్వైతవాదియై యున్నాడు. తథాపి ఆయన వచనము సాంప్రదాయికవచనముతో విరుద్ధమై యున్నది. అందువలన దాని ఖండన మీగ్రంథమునందు విస్తరముగా చేయబడును. అధిష్ఠాన సామాన్య

జ్ఞాన మధ్యాసమునకు హేతువై యుండుటవలన ఇదంతాంశవిషయకాజ్ఞానము యొక్క యపేక్ష యధ్యాసమునందు లేదు. అందువలన సంక్షేపశారీరకమునందు నధిష్ఠానాధారములకు భేదము చెప్పబడియున్నది. సవిలాసాజ్ఞాన విషయ మధిష్ఠాన మనంబడును. కార్యము విలాస మనంబడును. సర్పాది విలాససహితాజ్ఞానమునకు విషయము రజ్జ్వాది విశేషరూప మైనందున సర్పాద్యధిష్ఠానము రజ్జ్వాదివిశేషరూపమై యున్నది. అధ్యస్తమం దభిన్నమై దేనికి స్ఫురణమగుచున్నదో అది యాధార మనబడును. "అయం సర్పః" "ఇదం రజత మి"త్యాదిభ్రమప్రతీతియందు అధ్యస్త సర్పరజతాదికముతో నభిన్నమై సామాన్యేదమంశమునకు స్ఫురణ ముండుటవలన సామాన్యాంశ మాధారమై యున్నది. ఈమతమునం దధిష్ఠానాధ్యస్తములకు నేకజ్ఞానవిషయత యున్నది అను నీనియమధ్యాసమునందు ఆధారాధ్యస్తములకు నేకజ్ఞాన విషయత యున్నది అను నియమమున్నది. అధిష్ఠానాధ్యస్తముల కేకజ్ఞాన విషయత్వము నంగీకరించినయెడల రజ్జుశుక్త్యాది విశేషరూపముల కధిష్ఠానత్వ ముండుటవలన "రజ్జుస్సర్పః" "శుక్తి రూప్య" మని భ్రమ కావలయును. సామాన్యేదమంశమునకు నాధారత యున్నది. అధిష్ఠానత్వము లేదు. అందువలన "అయం సర్పః" "ఇదం రజతం" అను నీభ్రమ కలుగకపోవలయును. అందువలన విశేషాంశముయొక్క యజ్ఞానమే యధ్యాసమునకు హేతువై యున్నది. ఈమతమునందు నాధారాధ్యస్తములకు నేకజ్ఞాన విషయత్వ మంగీకరింపవలసినది.

115. అధ్యాసకారణత్వమునందు పంచపాదికావివరణకారులమతము.

ఆవరణవిక్షేపభేదముతో నజ్ఞానము ద్వివిధమై యున్నది. ఆవరణశక్తివిశిష్టాజ్ఞానాంశమునకు జ్ఞానముతో విరోధ ముండుటవలన నాశమగుచున్నది. విక్షేపశక్తి విశిష్టాజ్ఞానాంశమునకు జ్ఞానముతో విరోధము లేనందున జ్ఞానముచేత దానికి నాశము కలుగుట లేదు, అను నీవచన మవశ్య మంగీకరణీయమై యున్నది. అన్యథా జలప్రతిబింబిత వృక్షముయొక్క యూర్ధ్వభాగమునందు నధోదేశస్థత్వ భ్రమ కలుగుచున్నది. అచ్చట వృక్షముయొక్క విశేషరూపముతో జ్ఞాన ముండినను ఊర్ధ్వభాగమునందు నధోదేశస్థత్వాధ్యాసమునకు నివృత్తి కలుగుట లేదు. ఈప్రకారముగానే జీవన్ముక్త విద్వాంసులకు బ్రహ్మాత్మయొక్క విశేషరూపజ్ఞాన ముండినను అంతఃకరణాదిరూప విక్షేపమునకు నివృత్తి కలుగుట లేదు. అచట నుక్తస్థలమువలన సామాన్యరూపముతో జ్ఞాన మున్నది.

విశేషరూపముతో నజ్ఞాన మున్నది, అని చెప్పుట సరి కాదు. విక్షేపశక్తి విశిష్టాజ్ఞానాంశమునకు జ్ఞానముచేత నివృత్తి కలుగుట లేదు. ఆవరణశక్తివిశిష్టాజ్ఞానాంశమునకే జ్ఞానముచేత నివృత్తి కలుగుచున్నది, అను నీ సమాధాన మున్నది. ఈప్రకారముగానే రజ్జు శుక్త్యాది సామాన్యజ్ఞానముచేత నిదమంశావరకమైన నజ్ఞానాంశమునకు నాశము కలుగుచున్నది. సర్పరజతాది విక్షేపమునకు హేతువగు నజ్ఞానాంశమునకు నాశము కలుగుట లేదు. అందువలన నిదమాకారసామాన్య జ్ఞానముండినను సర్పాది విక్షేపమునకు హేతువగు నిదమంశముయొక్క యజ్ఞానము సంభవించుచున్నది. ఈరీతిగా నిదమాకార సామాన్య జ్ఞానముండినను సవిలాసాజ్ఞానవిషయమగు రజ్జ్వాదిసామాన్యాంశము సంభవించుచున్నది. అందువలన నధిష్ఠానత్వమునకు నిదమంశమునందు సంభవముండుటవలన నధిష్ఠానాధ్యస్తములకు నేక జ్ఞానవిషయత్వము సంప్రదాయ రీతిగా ప్రాప్తమై యున్నది. దానికిని విరోధము లేదు. పంచపాదికా సంక్షేప శారీరకులయొక్క మతమునకు వైలక్షణ్యము. దానియందుండు రహస్యము సంక్షేప శారీరకరీతిగా విశేషాంశమునం దధిష్ఠానత్వ మున్నది. సామాన్యాంశమునం దధిష్ఠానత్వము లేదు. విశేషాంశమునం దాధారత్వములేదు. ఈమతమునందు సామాన్యాంశమునందు నధిష్ఠానత యున్నది. ఇంతమాత్రము భేద మున్నది. విశేషాంశమునం దాధారత్వాభావము ఈ మతమునందును సమానమై యున్నది. ఎట్లన నధ్యస్తముతో నభిన్నముగా నేది ప్రతీత మగుచున్నదో అది యాధార మనంబడును. "రజ్జుస్సర్పః" అను నీ రీతిగా ప్రతీతి యుండినయెడల నధ్యస్తముతో నభిన్నముగా విశేషాంశము ప్రతీతము కావలయును. ఉక్తరీతిగా ప్రతీత మగుట లేదు. అందువలన విశేషరూపముతో రజ్జువు ఆధారము కాదు. ఈరీతిగా ప్రథమపక్షమునందు నిదంత్వరూపముతో రజ్జువునందును శుక్తియందును ప్రమాణజన్య జ్ఞానముయొక్క ప్రమేయత యున్నది. శుక్తిత్వరూపముతోను, రజ్జుత్వరూపముతోను ప్రమేయత్వము లేనందున నజ్ఞాతత్వ ముండుటవలన సర్పరజతములయొక్క యధిష్ఠానత యున్నది. ద్వితీయ పక్షమునందు నావరణశక్తి విరోధిప్రమయొక్క విషయతారూపప్రమేయత యిదంత్వరూపముతో నున్నది. తథాపి విక్షేపశక్తిమదజ్ఞానముయొక్క విషయత జ్ఞాతమునందును ఉన్నది. అందువలన నిదంత్వరూపముతో రజతాదికముయొక్క యధిష్ఠానత యున్నది.

116. ఈస్థానమునం దొకరహస్య మున్నది.

అజ్ఞానకృతావరణము చేతనమునం దున్నది. స్వభావముచే నావృతరూప మగునట్టియు జన్మాంధసమాన మగునట్టియు జడపదార్థమునందు నజ్ఞానకృతావరణము నంగీకరించుట లేదు. ఈ ప్రకారముగానే ప్రమాణజన్యజ్ఞాన విషయతారూపప్రమేయత్వము కూడ చేతనమునం దున్నది. ఘటాది జడపదార్థమునందు నావరణ ముండినయెడల దాని నివృత్తికొఱకు ప్రమేయత్వముకూడ నంగీకరింప వలయును. చేతనమునం దజ్ఞానవిషయత్వ రూపాజ్ఞాతత్వ ముండుటవలన చేతనము నందే జ్ఞాతత్వరూప ప్రమేయత్వ మున్నది. ఈరీతిగనే సకాలాధ్యాసమునకు నధిష్ఠానము చేతనమై యున్నది. జడపదార్థ మధ్యస్తమై యున్నది. ఇతరమున కధిష్ఠానత్వము సంభవించుట లేదు. అందువలన రజ్జు శుక్త్యాదికమునందు (1) అజ్ఞాతత్వము; (2)జ్ఞాతత్వము (3)అధిష్ఠానత్వము ఏప్రకారముగాను సంభవించుట లేదు. తథాపి, మూలాజ్ఞాన విషయత్వ రూపాజ్ఞాతత్వము నిరవచ్ఛిన్న విభుచేతనము నం దున్నది. అయిన మూలాజ్ఞాన విషయత్వరూ పాజ్ఞాతత్వము ఆయావిషయావచ్ఛిన్న చేతనమునం దున్నది. ఈయర్థ మష్టమప్రకాశమునందు జెప్పంబడును. ఈరీతిగానే బ్రహ్మజ్ఞాన విషయత్వరూప జ్ఞాతత్వము నిరవచ్ఛిన్న చేతనమునందును, ఘటాదిజ్ఞానముయొక్క విషయత్వ రూపజ్ఞాతత్వము ఘటాద్యవచ్ఛిన్న చేతనము నందును ఉన్నవి. అవిద్యయొక్క యధిష్ఠానత్వము నిరవచ్ఛిన్న చేతనమునం దున్నది. భూతభౌతిక ప్రపంచముయొక్క యధిష్ఠానత్వము అజ్ఞానావచ్ఛిన్న చేతనమునం దున్నది. ప్రాతిభాసిక సర్ప రజతాదికముయొక్క యధిష్ఠానత్వము రజ్జ్వవచ్ఛిన్న, శుక్త్యవచ్ఛిన్నాది చేతనమునం దున్నది. చేతనమునం దజ్ఞాతత్వ, జ్ఞాతత్వా,ధిష్ఠానత్వాదికములకు నవచ్ఛేదకము జడపదార్థమై యున్నది. అందువలన నవచ్ఛేదకత్వ సంబాధముచేత జడపదార్థమునందును అజ్ఞాతత్వాదికము యొక్క సంభవ ముండుటవలన రజ్జువు అజ్ఞాతమై జ్ఞాతమైన సర్పమున కధిష్ఠానమై యున్నది. ఈరీతిగా వ్యవహారము సంభవించుచున్నది. సర్పాది భ్రమ హేతువు రజ్జ్వాదికముతో నింద్రియ సంయోగజన్యేదమాకార సామాన్యజ్ఞాన రూపాంతఃకరణవృత్తియై యున్నది. ఆసామాన్య జ్ఞానముచేత క్షోభవిశిష్టావిద్యయొక్క సర్పాదిరూపపరిణామము, సర్పాదిజ్ఞానరూపపరిణామము కూడ సంభవించుచున్నది. రజ్జ్వాది విషయోపహితచేతనస్థావిద్యాంశము సర్పాది విషయాకార పరిణామ మగుచున్నది. ఇదమాకారవృత్త్యుపహితచేతనస్థావిద్యాంశముయొక్క జ్ఞానాకార పరిణామ మున్నది. రజ్జ్వవచ్ఛిన్న చేతనము సర్పమునకు నధిష్ఠానమై

యున్నది. ఇదమాంకార వృత్త్యవచ్ఛిన్న చేతనము సర్పజ్ఞానమున కధిష్ఠానమై యున్నది.

117. విషయోపహిత వృత్త్యుపహితచేతనములకు అభేదమునందు శంకా సమాధానములు.

యద్యపి ఇదమాకారప్రత్యక్షవృత్తి యుండినచోట విషయోపహిత చేతన, వృత్త్యుపహితచేతనములకు నభేద మున్నది. అందువలన నుక్తరీతిగా విషయ జ్ఞానములయొక్క యుపాదానములకు నధిష్ఠానములకును భేదకథనము సంభవించుటలేదు. సర్పాదివిషయముయొక్క యధిష్ఠానముతో జ్ఞానముయొక్క యధిష్ఠానమునకు భేదము నంగీకరించినయెడల సర్పాద్యధిష్ఠానజ్ఞానముచేత సర్పాది జ్ఞానమునకు నివృత్తి కాకపోవలయును. ఎటు లనగా, తనయధిష్ఠానము యొక్క జ్ఞానముయొక్క జ్ఞానముచేత నధ్యస్తనివృత్తి గలుగుచున్నది. అన్యాధిష్ఠానజ్ఞానముచేత నధ్యస్తనివృత్తి గలిగినయెడల సర్పమునకు నధిష్ఠాన మగు రజ్జువుయొక్క జ్ఞానముచేత నధ్యస్తసంసారమునకు నివృత్తి కావలయును. అందువలన నేక జ్ఞానముచేత సర్పాదివిషయముయొక్క, దానిజ్ఞానము యొక్కయు, నివృత్తికొఱకు రెంటికిని అధిష్ఠాన మొక్కటినే యంగీకరించుట యుక్తమై యున్నది. ఈశంకకు సమాధానము. ఇచట నేకవస్తువునకు నుపాధికృత భేద ముండినయెడల నుపాధినిమిత్తముచేత నభేదము గలుగుచున్నది. రెండు ఉపాధు లేకదేశమునం దుండినయెడల నుపహితములకు నభేదము గలుగుచున్నది. అయిన నుపాధియొక్క యేకదేశస్థత్వముచేత నెచటను ఉపహితముల కభేద మున్నదో, అచ్చట నొకటే ధర్మియందు తత్తదుపహితత్వము లను రెండుధర్మము లున్నవి. ఉ. ఒకయాకాశమునకు ఘటమఠోపాధిభేదము చేత భేద ముండినచోట ఘటమఠములయొక్క నాశమువలన నభేద మున్నది. మఠదేశమునందు ఘటముయొక్క స్థాపనచేతను ఘటాకాశమునకు మఠాకాశముతో భేద ముండుట లేదు. అయినను ఘటాకాశమునందు, ఘటోపహితత్వ, మఠోపహితత్వము లను రెండుధర్మము లున్నవి. ధర్మియేకమై యున్నది. తథాపి యావత్కాలము ఘటమఠములు రెండు నున్నవో తావత్కాలపర్యంతము ఘటాకాశము, మఠాకాశము లను నీరెండు వ్యవహారము లున్నవి. ఈప్రకారముగానే రజ్జ్వాదివిషయదేశమునందు వృత్తియొక్క నిర్గమనకాలమునందు వృత్త్యుపహిత చేతనముతో విషయచేతనమునకు యద్యపి అభేద మున్నది. తథాపి రెండుఉపా

ధుల సద్భావమువలన, వృత్త్యుపహితత్వ, రజ్జూపహితత్వము లను రెండు ధర్మము లున్నవి. వానిలో సర్పాది విషయముయొక్క యధిష్ఠానతావచ్ఛేదక ధర్మము రజ్జూపహితత్వమై యున్నది. సర్పాదిజ్ఞానముయొక్క యధిష్ఠానతావచ్ఛేదక ధర్మము వృత్త్యుపహితత్వమై యున్నది. ఈరీతిగా సర్పాదివిషయోపాదానాజ్ఞానాంశముయొక్క చేతనమునందు నధికరణతావచ్ఛేదకరజ్జూపహితత్వ మున్నది. భ్రాంతిజ్ఞానోపాదానాజ్ఞానాంశముయొక్క చేతనమునందు నధికరణతావచ్ఛేదక వృత్త్యుపహితత్వ మున్నది. ఈరీతిగా నేకదేశమునందు ఉపాధి యుండుట వలన నుపహితములకు నభేద ముండినను ధర్మములకు భేద మున్నది. అందువలన వృత్త్యుపహితావచ్ఛిన్నచేతననిష్ఠాజ్ఞానాంశమునకు భ్రమజ్ఞానముయొక్క యుపాదానత యున్నది. మఱియును రజ్జ్వాదివిషయోపహితత్వావచ్ఛిన్నచేతననిష్ఠాజ్ఞానాంశమునందు భ్రమజ్ఞానముయొక్కయు, విషయముయొక్కయు నుపాదానత్వ మున్నది. ఈప్రకారముగానే వృత్త్యుపహితత్వావచ్ఛిన్న చేతనమునందు భ్రమజ్ఞానముయొక్క యధిష్ఠానత్వ మున్నది. రజ్జ్వాదివిషయోపహిత త్వావచ్ఛిన్నమైన యా చేతనమునందు సర్పాది విషయముయొక్క యధిష్ఠానత్వ మున్నది. ఈప్రకారముగా నుపాధియొక్క సద్భావకాలమునందు ఏకదేశ స్థోపాధి యుండుటవలన నుపహితముల కభేద ముండినను, ఉపాధిపురస్కారముగా భేద వ్యవహారము కూడ నున్నది. మఱియు భిన్నదేశమునందు ఉపాధి యుండినప్పుడు కేవలభేదవ్యవహార మున్నది. ఉపాధికి నివృత్తి గలిగినప్పుడు భేదవ్యవహారము లేదు. కేవలాభేదవ్యవహార మున్నది. ఈప్రకారముగా వృత్తివిషయములు రెండును ఏకదేశస్థ మైనప్పుడు చేతనమునకు నభేదముండినను, ఉపాధిపురస్కారముగా పూర్వోక్తోపాదానాధిష్ఠానములకు భేదకథన మసంగతము కాదు. స్వరూపముచేత నుపహితమునకు నభేద ◦ మున్నది. అందువలన నేకాధిష్ఠానముయొక్క జ్ఞానముచేత సర్పాది విషయమునకును, దానియొక్క జ్ఞానమునకును, నివృత్తి సంభవించు చున్నది.

118. రజ్జ్వాదికముయొక్క ఇదమాకారప్రమచేత సర్పాదివిషయక భ్రమజ్ఞానము గలుగుచున్నది. దానిలో రెండు పక్షము లున్నవి.

రజ్జ్వాదికముయొక్క యిదమాకార ప్రమచేత సర్పాదికముయొక్క భ్రమజ్ఞానము గలుగుచున్నది. ఇచ్చట రెండు పక్షము లున్నవి. ఒకటు చెప్పున దేమనగా, "అయం సర్పః" "ఇదం రజతం" ఈరీతిగా నధిష్ఠానగ తేదంత్వాంశము, సర్ప

రజతాదికమునందు దానియొక్క సంబంధమును విషయీకరించునట్టి సర్పరజతాదిగోచరభ్రమ కలుగుచున్నది. అధిష్ఠానముయొక్క ఇదంతాంశమును, ఇదంతాంశముయొక్క సంబంధమును త్యజించి కేవల సర్పరజతాది గోచరాపరోక్షభ్రమ కలుగుట లేదు. కేవలాధ్యస్తగోచరముగానే భ్రమ గలిగినయెడల "సర్పః" "రజతం" అను నీయాకారముగా భ్రమ కలుగవలయును. "ఇమం సర్పం జానామి" "ఇదం రజతం జానామి" యను భ్రమయొక్క యనువ్యవసాయము కూడ ఇదం పదార్థముతో తాదాత్మ్యాపన్న సర్పరజతాదిగోచర వ్యవసాయమును విషయీకరించుచున్నది. మఱియును కల్పితసర్పాదికమునందు నిదంత లేదు. ఎట్లన, వర్తమానకాల, పురోదేశములయొక్క సంబంధము ఇదంతయై యున్నది. వ్యావహారిక దేశకాలమునకు ప్రాతిభాసికముతో వ్యావహారిక సంబంధము సంభవించుట లేదు. మఱియు నధిష్ఠానముయొక్క యిదంతకు కల్పితమునందు ప్రతీతిచేత వ్యావహారిక నిర్వాహ ముండుటవలన కల్పితమునందు నిదంతయొక్క యంగీకారము నిష్ఫల మగును. మఱియు నన్యథాఖ్యాతితో విద్వేష ముండినయెడల నధిష్ఠాన నిష్ఠేదంతకు కల్పితమునకును అనిర్వచనీయ సంబంధముత్పన్న మగుచున్నది గాని కల్పితమునందు నిదంతాంగీకారము లేదు. తథాపి సంబంధిని త్యజించి కేవలసంబంధముయొక్క జ్ఞానము కలుగుట లేదు. అందువలన నధిష్ఠాననిష్ఠేదంతను త్యజించి కేవలాధ్యస్తగోచరాపరోక్షభ్రమ కలుగుట లేదు. ఈరీతిగా నిదంపదార్థమునకు ద్విధా ప్రతీతి గలుగుచున్నది. ఒకటి యింద్రియాధిష్ఠానములయొక్క సంయోగముచేత నిదమాకారప్రమారూపాంతఃకరణవృత్తిరూపప్రతీతి గలుగుచున్నది. మఱియు నింకొకటి వృత్త్యుపహితచేతనస్థావిద్యాపరిణామరూపసర్పరజతాది గోచర భ్రమప్రతీతి గలుగుచున్నది అదియు గూడ నధ్యస్తమునందు ఇదంపదార్థముయొక్క తాదాత్మ్యమును గోచరించుచున్నదై ఇదం పదార్థమును గోచరించుచున్నది. ఈరీతిగా నపరోక్షభ్రమ ఇదమాకారమై అధ్యస్తాకారమునై యున్నది, అని యొకయాచార్యునిచే సంగీకరింపబడియున్నది.

అనేక గ్రంథకారులు చెప్పునది యేమనగా, అధిష్ఠానేంద్రియములయొక్క సంయోగముచేత నిదమాకారాంతఃకరణముయొక్క వృత్తిరూపప్రమచేత క్షోభసహితమైన యవిద్యయొక్క కేవలాధ్యస్తాకారపరిణామము గలుగుచున్నది అవిద్యయొక్క యిదమాకారపరిణామము కలుగుట లేదు. ఎట్లన, వ్యా

వహారిక పదార్థాకారావిద్యాపరిణామము సంభవించుట లేదు. నాత్మాదవిద్యా జన్యప్రాతిభాసిక పదార్థాకారముగానే యవిద్యాపరిణామరూపభ్రమజ్ఞానము కలుగుచున్నది. అందువలన నధిష్ఠాననిష్ఠేదంతయందు భ్రమజ్ఞానముయొక్క విషయత్వము లేదు. కేవలాధ్యస్తమునందే భ్రమవిషయత్వ మున్నది.

పూర్వమతమునందు "అయంసర్పః; ఇదం రజతం" అను నీభ్రమాకారము చెప్పబడినది. ఈప్రకారముగానే "ఇదం రజతం జానామి" యని భ్రమానువ్యవసాయ మున్నదనియు చెప్పబడినది. అధ్యస్తమాత్ర గోచర భ్రమ ముండిన యెడల "సర్పః; రజతం" అని భ్రమాకార ముండవలయును. మఱియును "రజతం జానామి" అని ఈరీతిగానే యను వ్యవసాయ ముండవలయును దీనికి సమాధాన మే మనగా, ఎట్లు సర్ప రజతాదికముయొక్క యధిష్ఠానగ తేదంతకు సధ్యస్తమునందు భానమున్నదో, లేక, యధిష్ఠానగ తేదంతకు సధ్యస్త సర్పాదికమున్నది, అనిర్వచనీయసంబంధ ముత్పన్నమగుచున్నదో అట్లు సర్పాది జ్ఞానాభాసముయొక్క యధిష్ఠానేదమాకారప్రమావృత్తి యున్నది. ఆవృత్తియం దిదం పదార్థ విషయకత్వ మున్నది. దానియొక్క ప్రతీతి సర్పాదిభ్రమయందున్నది. లేక ప్రమావృత్తి రూపాధిష్ఠానమునందు ఇదం పదార్థవిషయకత్వ మేది యున్నదో దానికి ననిర్వచనీయ సంబంధము సర్పాది జ్ఞానమునందు గలుగుచున్నది. అందువలన నిదమాకారత్వ శూన్యభ్రమయందు ఇదమాకారత్వ ప్రతీతి యున్నది. అథవా, ఇదమాకార వృత్త్యుపహితచేతనమే సర్పాది జ్ఞానాభాసమునకు నధిష్ఠానమై యున్నది. ఉక్తవృత్త్యుప లక్షితాధిష్ఠాన ముండినయెడల నుక్తవృత్తికంటె రెండు, నాలుగు ఘంటాది వ్యవధాన ముండినను సర్పాది భ్రమ కావలయును. ఎట్లన, ఉపలక్షణ సహిత ముపలక్షిత మనంబడును. ఉపలక్షణమునందు వర్తమానత్వాపేక్ష లేదు, అను నీయర్థ ముత్తరత్ర చెప్పంబడును. మఱియును వక్ష్యమాణరీతిగా నుపాధియందు వర్తమానత్వాపేక్ష యున్నది. ఇదమాకారవృత్తి దేనికి నుపాధి యగుచున్నదో అది ఇదమాకారవృత్త్యుపహిత మనంబడును. అందువలన సర్ప రజతాదికముయొక్క భ్రమజ్ఞాన ముండినకాలమునందు నంతఃకరణముయొక్క ఇదమాకారవృత్తియు గూడ నున్నదని యవశ్య మంగీకరింప దగి యున్నది. ఎట్లన, అధిష్ఠానముయొక్క సత్తాకాలముకంటె నతిరిక్తకాలమునందు నధ్యస్త ముండుట లేదు. అందువలన భ్రమజ్ఞానముయొక్క సమయమునందు వృత్త్యుపహితచేతన గతాధిష్ఠానత్వమునకు నుపయోగి యగు నిదమాకారాంతఃకరణ

వృత్తి యున్నది. మఱియును రజతాకారావిద్యావృత్తి యున్నది. ఈరీతిగా "అయం సర్పః; ఇదం రజతం" అను నీ రెండు జ్ఞానము లున్నవి. ఇదమాకార ప్రమావృత్తి యొకటియును, సర్ప రజతాద్యాకార సహితభ్రమవృత్తియు నింకొకటి యున్నది. అవచ్ఛేదకతా సంబంధముచేత భ్రమవృత్తికి నిదమాకార ప్రమావృత్తి యధిష్ఠానమై యున్నది. అధ్యస్తమునకు నభేదసంబంధ మున్నది. ఉదాహరణము. బ్రహ్మప్రపంచములయొక్క "సర్వ మిదం బ్రహ్మ" యను నీప్రతీతికి విషయము అభేదమై యున్నది. అందువలన "అయం సర్పః; ఇదం రజతం" అను నీరీతిగా ఉభయవృత్తి యభేదము ప్రతీత మగుచున్నది. యద్యపి ఉక్త రీతిగా వృత్తిద్వయ ముండినయెడల నధిష్ఠానాధ్యస్తములు రెండును ఏకజ్ఞానమునకు విషయ మగుచున్నవను నీప్రాచీనవచన మసంగత మగును. తథాపి ఏకజ్ఞాన విషయమై యున్నదను వచనమునకు నేక వృత్తి విషయమై యున్నదను నీయర్థము కాదు. ఇక నేమనగా, అధిష్ఠానాధ్యస్తములు ఏకసాక్షికి విషయమై యున్నవి అని ప్రాచీనవచనముయొక్క యర్థము. రజ్జు, శుక్త్యాదిదేశమునందే, సర్ప, రజతాదిక మున్నది. ఇదమాకారవృత్తియు గూడ రజ్జు శుక్త్యాదిదేశమునకు నిర్గమించుచున్నది. అందువలన నిదమాకార వృత్త్యుపహితసాక్షికి నధిష్ఠానమును; అధ్యస్తమును, విషయమై యున్నవి. ఈరీతిగా నధిష్ఠానాధ్యస్తములు ఏకజ్ఞాన విషయములై యున్నవి. ఈప్రాచీనవచనమునందు జ్ఞానపదమునకు సాక్షి యర్థమై యున్నది. వృత్తికాదు. అందువలన భ్రమవృత్తికి నధ్యస్తమాత్ర గోచరత్వము నంగీకరించుటయందు ననేకాచార్యులయొక్క సమ్మతి యున్నది.

**119.** కవితార్కిక చక్రవర్తి నృసింహాభట్టోపాధ్యాయ మతము

కవితార్కికచక్రవర్తి నరసింహాభట్టోపాధ్యాయులు చెప్పిన దేమనగా భ్రాంతిజ్ఞానము లేకయే ప్రమారూపేదమాకారజ్ఞానము భ్రమ హేతువు కాదు. ఇక నేమనగా "అయం సర్పః; ఇదం రజతం" అను నీరీతిగా భ్రమరూపజ్ఞాన మొకటియే యున్నది. ఎట్లన, భ్రమకంటె పూర్వమునందు ఇదంపదార్థాకార ప్రమారూపసామాన్యజ్ఞానము, రజ్జుశుక్త్యాదికమునకు నంగీకరించిన వాని నడుగవలసిన దేమనగా, అనుభవానుసారముగా జ్ఞానద్వయము నంగీకరించు చున్నావా? లేక భ్రమరూప కార్యముయొక్క యనుపపత్తిచేత భ్రమభిన్న సామాన్యజ్ఞానము నంగీకరించుచున్నావా? అనుభవానుసారముగా జ్ఞానద్వయమును జెప్పినయెడల నది సంభవించుటలేదు. ఎట్లన, ప్రథమ మతమునందు రెండువృత్తులు ఇదం

పదార్థగోచరము లని చెప్పబడియున్నవి. ఒకటి ప్రమారూపాంతఃకరణము యొక్క ఇదమాకారవృత్తి, మఱియునొకటి అవిద్యయొక్క భ్రమరూపవృత్తి. ఇదం పదార్థమును గోచరించుచున్నదై ఇదం రజతమని రజతావగాహినియై యున్నది. ఈమతమునందు నిదంపదార్థమునకు ద్విధాప్రతీతి యున్నది. అది ఏయనుభవమునందును ఆరూఢము కాలేదు. సర్పరజతాది జ్ఞానమువలె ఇదం గోచరజ్ఞానముగూడ నేకముగానే యనుభవసిద్ధమై యున్నది. అందువలన ప్రథమపక్షము అనుభవానుసారి కాదు. ద్వితీయ పక్షమునందు నిదం పదార్థమునకు రెండుజ్ఞానముల నంగీకరింపలేదు. అయినను ''అయం సర్పః; ఇదం రజతం'' అనిరెండు జ్ఞానములు అంగీకరింపబడినది. ఇదమాకారము ప్రమగా నంగీకరింపబడినది. సర్పరజతాది గోచరము భ్రమగా నంగీకరింపబడినది. అదియు గూడ ననుభవవిరుద్ధమై యున్నది. రజ్జుశుక్తియొక్క జ్ఞానముచేత సర్పరజతములయొక్క బాధోత్తరమునందు నీకు ఎట్లు భ్రమ గలిగిన దని ఎవని నైనను అడిగినయెడల దానికి వాడిటు లుత్తరముజెప్పగలడు. ఎట్లన, ''అయం సర్పః; ఇదం రజతం'' అనుభ్రమ నాకగుచున్నదిగదా. ఇదమాకారప్రమ గలిగి సర్పాకార రజతాకార భ్రమ గలిగిన దని యుత్తరము నెవరును జెప్పుటలేదు. అందువలన ద్వితీయమత రీతిగా, జ్ఞానద్వయాంగీకార మనుభవవిరుద్ధమై యున్నది. అందువలన నింద్రియ జన్యాంతఃకరణముయొక్క వృత్తిరూపేదమాకారజ్ఞానముప్రమయై యున్నది. ఇదమాకారజ్ఞానజన్య సర్పరజతాది గోచరేదంపదార్థవిషయ కావిద్యావృత్తి రూప జ్ఞానాభాసము గలుగుచున్నది. ఈరీతిగా జ్ఞానద్వయాంగీకార మనుభవానుసారి కాదు.

### 120. ఉపాధ్యాయమతమునందు సామాన్యజ్ఞాన (ధర్మిజ్ఞాన) వాది యొక్క శంకయును సమాధానమును.

సామాన్యజ్ఞానవాది శంకించున దేమనగా, రజ్జ్వాదికముతో నింద్రియ సంయోగము గలిగినయెడల సర్పాద్యధ్యాసము గలుగుచున్నది. ఇంద్రియసంయోగము లేనియెడల నధ్యాసము గలుగుట లేదు. ఈరీతిగా నన్వయవ్యతిరేకముచేత నింద్రియమునకు నధిష్ఠానముతో సంయోగము అధ్యాసకారణముగా సిద్ధించుచున్నది. మఱియు నధిష్ఠానేంద్రియములయొక్క సంయోగమున కధిష్ఠాన ద్వారా కారణత్వము సంభవించుచున్నది. అన్యప్రకారముగా నధిష్ఠానేంద్రియసంయోగమునకు నధ్యాసమునం దుపయోగము సంభవించుట లేదు. అధ్యాసకారణత్వమును జెప్పినయెడల నదియును సంభవించుట లేదు. ఎట్లన, అధిష్ఠానేంద్రియముల

యొక్క సంయోగము లేకయే యహంకారాద్యధ్యాసము గలుగుచున్నది. అందువలన నధ్యాసమాత్రమును గూర్చి యధిష్ఠానజ్ఞానముయొక్క సామాన్యజ్ఞానము హేతువై యున్నది. అహంకారాద్యధ్యాసమునకు నధిష్ఠానము ప్రత్యక్స్వరూపాత్మయై యున్నది. అది స్వయంప్రకాశమై యున్నది. సర్వాద్యధ్యాసాధిష్ఠానముయొక్క సామాన్యజ్ఞానము ఇంద్రియసంయోగముచేత గలుగుచున్నది. ఈరీతిగా నిజప్రకాశశూన్యాధిష్ఠానముయొక్క సామాన్యజ్ఞానద్వారాగానే ఇంద్రియ సంయోగమునకు నధ్యాసమునం దుపయోగ మున్నది. సాక్షాదుపయోగము లేదు. అందువలన నధిష్ఠాన సామాన్యజ్ఞానమే అధ్యాసమునకు కారణమై యున్నది. అధ్యాసము కార్యమై యున్నది. ఎచ్చట కార్యము ప్రతీతమై కారణము ప్రతీత మగుట లేదో అచ్చట కార్యముయొక్క అన్యథానుపపత్తిచేత కారణముయొక్క కల్పన గలుగుచున్నది. భ్రమస్థలమునందు ఇదమాకారప్రమ యద్యపి అనుభవసిద్ధము కాలేదు. తథాపి భ్రమరూపకార్యమునకు సామాన్యజ్ఞానరూపకారణము లేకయే యనుపపత్తి యుండుటవలన సామాన్యజ్ఞానమునకు కల్పన యున్నది. ఈరీతిగా ధర్మిజ్ఞానవాది చెప్పినయెడల సంభవించుట లేదు. అధ్యాసమునకు హేతువగు సామాన్యజ్ఞానము ధర్మిజ్ఞాన మనంబడును. ఈప్రసంగమునందు సామాన్యజ్ఞానమును నధ్యాస కారణముగాను నంగీకరించువాడు పూర్వపక్షిగా నున్నాడు. మఱియును సామాన్యజ్ఞానము నపలపించువా డుపాధ్యాయసిద్ధాంతి. ఆయన వచన మే మనగా, సామాన్యజ్ఞానము లేకయే యేయధ్యాసము గలుగనియెడల నధ్యాసకారణత్వము సామాన్యజ్ఞానమునందు సంభవించుచుండినను యధిష్ఠానముయొక్క సామాన్య జ్ఞానము లేకయే ఘటాద్యధ్యాసము గలుగుచున్నది. అందువలన నధ్యాస మాత్రమునందు నధిష్ఠానముయొక్క సామాన్య జ్ఞానమునకు కారణత్వము లేదు. ధర్మి జ్ఞానవాది ఘటాద్యధ్యాసముకంటె పూర్వమునందు సామాన్య జ్ఞానము జెప్పినయెడల ఆయనను అడుగవలసిన దేమనగా, ఘటాద్యధ్యాసమునకు హేతువు అధిష్ఠానముతో నింద్రియసంయోగ జన్యాంతఃకరణ వృత్తిరూప సామాన్య జ్ఞానమై యున్నదా? లేక చేతనస్వరూపప్రకాశమే సామాన్యజ్ఞానమై యున్నదా? ప్రథమ పక్షము సంభవింపదు. ఎట్లన, ఘటాద్యధ్యాసమునకు నధిష్ఠానమైన యజ్ఞానావచ్ఛిన్న బ్రహ్మము నీరూపమై యున్నది. అందువలన బ్రహ్మగోచరాంతఃకరణముయొక్క చాక్షుషవృత్తి సంభవించుట లేదు. ద్వితీయపక్షమును జెప్పినయెడల

స్వరూపప్రకాశ మావృతమై యున్నది. ఆవృతప్రకాశ రూపమైన సామాన్యజ్ఞాన మునుకూడ నధ్యాసహేతువునుగా నంగీకరించినయెడల ధర్మిజ్ఞానవాదిమతమునందు నింద్రియ సంయోగము లేకయే సర్పాద్యధ్యాసము కానలయును. అందువలన నావృతప్ర కాశరూపసామాన్యజ్ఞానము అధ్యాసమునకు హేతువుకాదు. ఈరీతిగా ఘటాద్య ధ్యాసమునకు పూర్వమునందు సామాన్యజ్ఞానము లేనందున నధ్యాసమాత్రమును గూర్చి సామాన్యజ్ఞానమునకు గారణత్వము లేనందున నధ్యాసరూపకార్యాను పపత్తిచేత సామాన్యజ్ఞానరూపేదమాకారవృత్తియొక్క కల్పన సంభవించుట లేదు. మఱియును ధర్మిజ్ఞానవాది చెప్పునదేమనగా, సకలాధ్యాసమునందు ననావృతప్ర కాశరూపసామాన్యజ్ఞానమును హేతువుగా జెప్పినయెడల ఘటాద్యధ్యాసమునం దు వ్యభిచారకథనము సంభవించుచున్నది. అధ్యాసమాత్రమును గూర్చి యనావృ తానావృతసాధారణ ప్రకారము హేతువై యున్నది. ప్రాతిభాసికాధ్యాసమునం ను నావృతప్రకాశము హేతువై యున్నది.ఉపాధ్యాయమతమునందు సర్పాద్యధ్యా సమునకు నింద్రియసంయోగము హేతువుగా నంగీకరింపబడియున్నది. ఘటా ద్యధ్యాసమున నింద్రియసంయోగము హేతువుగా నంగీకరింపబడ లేదు, సంభవిం చుటయును లేదు. అందువలన నింద్రియ సంయోగముయొక్క యభావకాలము నందు సర్పాద్యధ్యాసము కలుగుట లేదు. ఘటాద్యధ్యాసము ఇంద్రియసంయో గము లేకయే కలుగుచున్నది, అను నీ వ్యవస్థ యెట్లు సంభవించుచున్నదో యట్లు మనమతమునందును ప్రాతిభాసికసర్పాధ్యాసమునకు ననావృతప్రకాశము హేతువుగా నున్నది. అందువలన నావరణభంగముకొఱకు సర్పాద్యధ్యాసము నకు పూర్వము ఇదమాకారసామాన్యజ్ఞానరూప ప్రమయొక్క యపేక్ష యు న్నది. ఘటాద్యధ్యాసమునకు హేతువు సాధారణప్రకాశమై యున్నది. అందువలన ననావృత ప్రకాశముయొక్క సద్భావముచేత ఘటాద్యధ్యాసము నందు వృత్తియొక్క యపేక్ష లేదు. అందువలన సామాన్యజ్ఞానరూపవృత్తి యొక్క యభావకాలమునందు సర్పాద్యధ్యాసము కలుగుట లేదు. ఘటాద్య ధ్యాసము వృత్తిలేకయే కలుగుచున్నది, అనునీవ్యవస్థ సంభవించుచున్నది. ఈ క్రిందవ్రాయబడిన ధర్మిజ్ఞానవాదియొక్క యీవచనముకూడ ననంగతమై యున్నది. ఎట్లన, ప్రాతిభాసికాధ్యాసమునకు పూర్వమునందు నింద్రియజన్యప్ర మారూపాంతఃకరణవృత్తి నియమముగా కలుగుచున్నది, అను నీనియమమునకు కూడ శంఖమునందు పీతతాధ్యాసమునందు, కూపజలముయొక్క నీలతా

ధ్యాసమునందును వ్యభిచార మున్నది. ఎట్లన, బ్రహ్మజ్ఞానము లేకయే దేనికి బాధ మగుచున్నదో యది ప్రాతిభాసికాధ్యాస మనంబడును. శంఖమునందు పీతత్వ మునకును కూపజలమునందు నీలత్వమునకును బాధ బ్రహ్మజ్ఞానముకంటె పూర్వ మునందే శంఖశ్వేతతాజ్ఞానజలశ్వేతతా జ్ఞానములచేత కలుగుచున్నది. అందువలన నిదియును ప్రాతిభాసికాధ్యాసమై యున్నది. ఈస్థానమునందు ధర్మిజ్ఞానవాది యొక్క ప్రక్రియ యే మనగా, ప్రాతిభాసికాధ్యాసమునం దనావృతప్రకాశము నకు కారణత్వనియమ ముండుటవలన శంఖజలములతో నేత్రసంయోగముచేత ని దమాకారాంతఃకరణవృత్తివలన నభివ్యక్త శంఖావచ్ఛిన్న చేతనమునందును, జ లావచ్ఛిన్న చేతనమునందును పీతనీలరూపముయొక్క యధ్యాసము కలుగుచున్న ది. ఉపాధ్యాయమతమునం దైనను శంఖముతోను, జలముతోనుగూడ నేత్రసం యోగ ముండి పీతనీలరూపములయొక్క యధ్యాసము కలుగుచున్నది. ఇదమా కారవృత్త్యపేక్ష లేదు. అందువలన ధర్మిజ్ఞానవాది నడుగవలసిన దే మనగా, ఇదమాకారవృత్తికి విషయము రూపము లేకయే కేవలశంఖాదిద్రవ్య మున్నది. అథవా రూపవిశిష్ట శంఖమై యున్నది. మఱియును రూపవిశిష్టజలము ఇదమా కారవృత్తికి విషయమై యున్నది. రూపమును త్యజించి కేవలద్రవ్యమును వృ త్తి విషయీకరించుచున్నది అని చెప్పుట సంభవించుట లేదు. ఎట్లన నేత్ర జన్యవృత్తికి రూపమును విషయీకరించు స్వభావమున్నది. మఱియును రూప విశిష్ట ద్రవ్యమునుగూడ విషయీకరించుచున్నది. కేవల ద్రవ్యమును నేత్ర జన్యవృత్తి విషయీకరించుట లేదు. రూపమును త్యజించి కేవల ద్రవ్యమును విషయీకరించినయెడల ఘటవిషయకచాక్షుషజ్ఞానము కలిగినవానికి ఘటము నొక్క నీలతాదికమునందు సందేహము కలుగవలయును. మఱియును రూప రహితవాయ్వాదిద్రవ్యమునకును చాక్షుషజ్ఞానము కావలయును, అందువలన కేవల ద్రవ్యగోచరేదమాకారచాక్షుషవృత్తి శంఖాదివైషయిక సామాన్య జ్ఞానరూపమై సంభవించుటలేదు: రూపవిశిష్ట శంఖగోచర, రూపవిశిష్ట జల గోచరవృత్తిని జెప్పినయెడల, ఆయన నడుగవలసిన దే మనగా, శుక్లరూపవి శిష్ట శంఖమును, శుక్లరూప జలమును ఈవృత్తి విషయీకరించుచున్నదా? ప్రథమపక్షము జెప్పినయెడల శుక్లరూపమును గోచరించు చున్నదై, ఇదమా కారవృత్తికంటె నుత్తరకాలమునందు పూర్వవృత్తి విరోధమగు పీతనీలభ్రమలు కలుగుట లేదు. అందువలన పీతభ్రమ, నీలభ్రమలకు పూర్వమునందు శుక్ల

రూపవిశిష్ట శంఖజలాదికముయొక్క ఇదమాకారజ్ఞానము సంభవించుట లేదు. అధ్య స్తరూప విశిష్టగోచరేదమాకారవృత్తి సంగీకరించినయెడల శంఖమునం దధ్య స్తము పీతరూపమై యున్నది. జలమునం దధ్య స్తము నీలరూపమై యున్నది. తద్విశిష్టజ్ఞానము భ్రమమై యున్నది. అభ్రమకు హేతుత్వమును జెప్పుట యందు ఆత్మాశ్రయ ముండుటవలన సంభవించుటలేదు. పంజియును ధర్మిజ్ఞాన వాది ఇదమాకారజ్ఞానరూప ప్రమయే యధ్యాసమునకు హేతువుగా సంగీకరించి నాడు. అధ్య స్తరూప విశిష్టముయొక్క జ్ఞానమునకు భ్రమత్వ ముండుటవలన ప్రమారూపధర్మి జ్ఞాన మధ్యాసమునకు హేతువై యున్నది. అను ని ధర్మిజ్ఞాన వాదియొక్క నియమమునకు భంగము కావలయును. ఈరీతిగా శంఖమునందు పీతతాభ్రమకు, జలమునందు నీలతాభ్రమకు పూర్వమునం దధిష్ఠానజ్ఞానము సంభవించుట లేదు. అధిష్ఠానేంద్రియములయొక్క సంయోగమునకు సంభవ మున్నది. అందువలన సామాన్యజ్ఞానమునకు వ్యభిచారమును, ఇంద్రియ సంయోగమున కవ్యభిచారము నుండుటవలన నధ్యాసమునకు హేతువు అధిష్ఠానేంద్రియ ములయొక్క సంయోగమై యున్నది. సామాన్యజ్ఞానము హేతువు కాదు. ఇది యుపాధ్యాయులయొక్క మతమై యున్నది.

**121.** ప్రాచీనాచార్యులగు ధర్మిజ్ఞానవాదియొక్క మతము.

ధర్మిజ్ఞానవాది ప్రాచీనాచార్యుడై యున్నాడు. ధర్మిజ్ఞానమునకు శంఖ పీతాద్యధ్యాసమునందు నేవ్యభిచారము చెప్పబడినదో దానికి సమాధాన మేమ నగా, అధ్యాస మాత్రమునుగూర్చి సామాన్యజ్ఞానము హేతువు కాదు. అధ్యా సవిశేషమునందు సాదృశ్యజ్ఞానత్వరూపముతో సామాన్యజ్ఞానమునకు కారణత్వ ము చెప్పుటకు నధ్యాసముయొక్క భేదము చెప్పబడియున్నది. ప్రాతిభాసికా ధ్యాసము ద్వివిధమై యున్నది. (1).. ధర్మియొక్క విశేషజ్ఞానముచేత ప్రతిబ ధ్యమై యున్నది. (2) విశేషజ్ఞానముచేత నప్రతిబధ్యమై యున్నది. నీలపృష్ఠ త్వ త్రికోణత్వాది విశేషధర్మముయొక్క జ్ఞాన ముండినప్పుడు రజతాధ్యాసము కలుగుట లేదు. అందువలన రజతాధ్యాసము విశేషజ్ఞానముచేత ప్రతిబధ్యమై యున్నది. ఈప్రకారముగానే సర్పాధ్యాసము కూడ తెలియవలసినది. శ్వేత త్వరూప విశేషధర్మముయొక్క జ్ఞాన ముండినను శంఖమునందు పీతత్వాధ్యాసము జలమునందు నీలత్వాధ్యాసము కలుగుచున్నవి. అందువలన నుక్తాధ్యాసము విశేషజ్ఞానముచేత నప్రతిబధ్యమై యున్నది. ఈరీతిగానే రూపరాహిత్య విశేష

ధర్మముయొక్క జ్ఞాన ముండినను ఆకాశమునందు నీలత్వాధ్యాసము కూడ విశేషజ్ఞానముచేత నప్రతిబధ్య మగుచున్నది. చక్కెరయందు కటుత్వాధ్యాసము కూడ విశేషజ్ఞానముచేత నప్రతిబధ్యమై యున్నది. ఎట్లన, ఆకాశము నీలరూపమైయున్నది అను నీ నిశ్చయము గలిగినవానికిని, అనేక పర్యాయములు చక్కెరయందు మధురత్వ నిశ్చయము కలిగినవానికిని ఆకాశమునందు నీలత్వాధ్యాసము, పిత్తాదిదోషముచేత చక్కెరయందు కటుత్వాధ్యాసము కలుగుచున్నవి. ఈరీతిగా ద్వివిధాధ్యాస మున్నది. వీనిలో నంత్యాధ్యాసము అధిష్ఠానాధ్యస్తములయొక్క సాదృశ్యజ్ఞానము లేకయే కలుగుచున్నది. ఎచ్చట నధిష్ఠానాధ్యస్తములయందు విరోధిధర్మమున్నదో అచ్చట సాదృశ్యము సంభవించుట లేదు. పరస్పరవైధర్మ్యజ్ఞానము-డిన నుక్తాధ్యాసము సంభవించుచున్నది. అందువలన భ్రమరూప సాదృశ్యజ్ఞానము కూడ నాయధ్యాసమునకు హేతువు కాదు. అయిన విశేషజ్ఞానముచేత దేనికి ప్రతిబంధ మగుచున్నదో యా రజత సర్పాద్యధ్యాసమునందు నధిష్ఠానమునకు నధ్యస్తముతో సాదృశ్యజ్ఞానము హేతువై యున్నది. విశేషజ్ఞానముచేత ప్రతిబధ్యమగు నధ్యాసమునుగూడ సాదృశ్యజ్ఞానజన్యముగా నంగీకరింపక దుష్టేంద్రియ సంయోగజన్యముగానే యంగీకరించినయెడల శుక్తియందు రజతాధ్యాసమువలె దుష్టనేత్ర సంయోగముచేత నింగాలమునందు రజతాధ్యాసము కావలయును. అగ్నిదగ్ధ నీలకాష్ఠ మింగాల మనంబడును. రజ్జువునందు సర్పాధ్యాసమువలె దుష్టనేత్ర సంయోగముచేత ఘటమునందును సర్పాధ్యాసము కావలయును. ఈరీతిగా విశేషజ్ఞానముచేత దేనికి ప్రతిబంధమగుచున్నదో ఆప్రాతిభాసికాధ్యాసమునందు సాదృశ్యజ్ఞానము హేతువై యున్నది. సాదృశ్యజ్ఞానము కూడ సామాన్య జ్ఞాన రూప ధర్మిజ్ఞానముగానే యున్నది. శుక్తియందును రజతమునందును, చాకచక్యరూప సాదృశ్య మున్నది. రజ్జువునందును, సర్పమునందును భూమి సంబంధ దీర్ఘత్వ రూప సాదృశ్యమున్నది. పురుష, స్థాణువులయందు నుచ్చైస్త్వ సాదృశ్య మున్నది. ఈప్రకారముగా నధిష్ఠానాధ్యస్తములయందుండు సమాన ధర్మమే సాదృశ్యపదార్థమై యున్నది. దానియొక్క జ్ఞానము, సామాన్యజ్ఞాన మనియును, ధర్మిజ్ఞాన మనియును జెప్పుట సంభవించుచున్నది. ఈరీతిగా విశేషజ్ఞానముచేత బ్రతిబధ్య మగు నేప్రాతిభాసికాధ్యాస మున్నదో దానియందు సాదృశ్యజ్ఞానరూప ధర్మిజ్ఞానమే హేతువై యున్నది. దుష్టేంద్రియ సంయోగమునకు సాదృశ్యజ్ఞానముద్వారా నుక్తాధ్యాసమునందుపయోగ మున్నది.

**122. ధర్మిజ్ఞానవాదియొక్క మతమునందు నుపాధ్యాయులయొక్క శంకాసమాధానములు.**

ఉపాధ్యాయమతానుసారి చెప్పునదేమనగా, ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయ, దోషములచేత ధర్మిజ్ఞాన ప్రతిబధ్యాధ్యాసము గలుగుచున్నది. సాదృశ్యజ్ఞానమును ఉక్తాధ్యాసమునకు హేతువునుగా జెప్పినయెడల ప్రమాతకు ధర్మిజ్ఞానము గలుగుచున్నది. అందువలన ప్రమాతృ దోషముచేత నధ్యాసమునకు హేతువు ఉన్నది. సాదృశ్యము నధ్యాసమునకు హేతువునుగా జెప్పినయెడల విషయదోషమై యధ్యాసమునకు హేతువగుచున్నది. ఎట్లు ప్రమాతృదోషరూప సాదృశ్యజ్ఞానమును నధ్యాసహేతువుగా జెప్పి యింగాలమునందు రూపాధ్యాసముయొక్క యాపత్తికి పరిహారమున్నదో అట్లు విషయదోష రూప సాహిత్యమును నధ్యాసమునకు హేతువుగా నంగీకరించినను నుక్తాపత్తికి పరిహారమున్నది. అందువలన సాదృశ్యజ్ఞానరూప ధర్మిజ్ఞానమును నుక్తాధ్యాసమునకు హేతువుగా నంగీకరించుట నిష్ఫలమై యున్నది. ఈరీతిగా నుపాధ్యాయానుసారి చెప్పినయెడల ధర్మిజ్ఞానవాదియొక్క సమాధానమేమనగా, దూరదేశమునందున్న సముద్రజలమునందు నీలశిలాభ్రమ గలుగుచున్నది. అదియును విశేషజ్ఞానముచేత ప్రతిబధ్యాధ్యాసమై యున్నది. ఎట్లన, జలమునందు శుక్లరూపజలత్వములయొక్క జ్ఞానముచేత నీలశిలాభ్రమకు ప్రతిబంధమగుచున్నది. జలమునందు నీలశిలయొక్క సాదృశ్యములేదు, సముద్రజలమునందును నీలరూపముయొక్క భ్రమగలిగి నీలశిలయొక్క భ్రమ గలుగుచున్నది. అచ్చట నీలరూపముయొక్క జ్ఞానమే భ్రమరూపసాదృశ్యజ్ఞానమై యున్నది. అందువలన భ్రమప్రమాసాధారణ సాదృశ్యజ్ఞానమే ఉక్తాధ్యాసమునకు హేతువై యున్నది స్వరూపముతో సాదృశ్యము హేతువు కాదు. ఉపాధ్యాయానుసారి తిరిగి చెప్పునదేమనగా, ఇంగాలాదికమునందు రూపాధ్యాసముయొక్క యాపత్తి పరిహారముకొఱకు సాదృశ్యజ్ఞానముయొక్క సామగ్రికి నుక్తాధ్యాసముయొక్క కారణత్వము నంగీకరించినాడు. అధిష్ఠానాధ్యస్తములయందు సమానధర్మరూపమగునేసాదృశ్యమున్నదో దానితో నింద్రియమునకు స్వసంయుక్త తాదాత్మ్యరూపసంబంధమే సాదృశ్యజ్ఞానమునకు సామగ్రియై యున్నది. సముద్రజలమునందు నీలశిలాధ్యాసమునకు హేతువు భ్రమస్వరూపసాదృశ్యజ్ఞానమై యున్నది. దానికి సామగ్రి, దోషసహితేంద్రియమునకు జలమునందుండు సంయోగమై యున్నది.

ఈరీతిగా సాదృశ్యజ్ఞానమున కేసామగ్రి యున్నదో యది ఉక్తాధ్యాసమునకు హేతువై యున్నది. సాదృశ్యజ్ఞానమును అధ్యాసమునకు హేతువునుగా నంగీకరించినను సాదృశ్యజ్ఞానమునందు నింద్రియసంబంధమునకు కారణత్వ మవశ్యమంగీకరింపవలసినది. అందువలన సాదృశ్యజ్ఞానముయొక్క కారణమునకే యధ్యాసకారణత్వ ముచితమై యున్నది. ఈరెంటిమధ్యను సాదృశ్యజ్ఞానాంగీకారము నిష్ఫలమై యున్నది. శంఖపీతాద్యధ్యాసమునందు ఇంద్రియసంబంధమునకే కారణత్వ మున్నది. ఆస్థానమునందు సాదృశ్యజ్ఞానము సంభవించుటలేదు. అందువలన సాదృశ్యజ్ఞానముయొక్క యపేక్ష ఎచ్చట నున్నదో అచ్చటను సాదృశ్యజ్ఞానముయొక్క సామగ్రి అధ్యాసమునకు కారణమై యున్నది. సాదృశ్యజ్ఞానమునకు కారణత్వములేదు. సాదృశ్య జ్ఞానముయొక్క సామగ్రికి నధ్యాసకారణత్వము నంగీకరించినయెడల సకలాధ్యాసమునందును ఏకేంద్రియసంయోగమునకు కారణత్వము సిద్ధమైనందున లాఘవ మున్నది. మఱియును సాదృశ్యజ్ఞానమునకు కారణత్వము నంగీకరించిన యెడల విరూపాధ్యాసమునందు నింద్రియసంయోగమునకును హేతుత్వము నంగీకరింప వలయును. మఱియును సాదృశ్యాధ్యాసమునందు సాదృశ్యజ్ఞానమునకు హేతుత్వ మంగీకరించుపక్షములో నధ్యాసముయొక్క కారణద్వయ కల్పనచేత గౌరవదోష మున్నది. అందువలన నెచ్చట సాదృశ్యజ్ఞానమును హేతువునుగా జెప్పుచున్నాడో అచ్చటను సాదృశ్యజ్ఞానముయొక్క సామగ్రీరూపేంద్రియ సంబంధమే అధ్యాసమునకు హేతువై యున్నది. ఈరీతిగా నుపాధ్యాయునియొక్క శంకకు ధర్మిజ్ఞాన వాదియొక్క సమాధానమేమనగా, ఇంద్రియ సంబంధముచేత జ్ఞానముయొక్క యుత్పత్తిమాత్రము చూడబడినది. అందువలన కేతాది విషయముయొక్క యుత్పత్తి ఇంద్రియ సంబంధముచేత సంభవించుట లేదు. సాదృశ్యజ్ఞానమును నధ్యాసమునకు హేతువునుగా నంగీకరించినయెడల కారణద్వయకల్పనారూపమైన యేగౌరవము చెప్పబడియున్నదో అది అసంగతమై యున్నది. ఎట్లన ధర్మిజ్ఞానవాదికి కారణద్వయకల్పనమునందు నెట్లు ద్విత్వసంఖ్యాకల్పన మున్నదో అట్లు ఉపాధ్యాయ మతమునందు సాదృశ్యజ్ఞానముయొక్క సామగ్రిని యధ్యాసకారణముగా కల్పనయందు కారణమునకు నధికశరీరకల్పన మున్నది. సాదృశ్యజ్ఞానసామగ్రిస్వరూపమునందు సాదృశ్యజ్ఞాన మంతర్భూతమై యున్నది. అందువలన నుపాధ్యాయునియొక్క మతమునందు సాదృశ్యజ్ఞాన సామగ్రి అధికశరీరవతి నధ్యా

సమునకు హేతువుగా నంగీకరింపవలసినది. ఈరీతిగా లాఘవగౌరవములు రెండు మతములందును సమానమై యున్నవి. మఱియును జ్ఞానముయొక్క సామగ్రిచేత విషయోత్పత్తియొక్క యసంభవరూపయుక్తి విరోధము ఉపాధ్యాయమతమును నం దధికదోషమై యున్నది. అందువలన సాదృశ్యజ్ఞానమే ఉక్తాధ్యాసమునకు హేతువై యున్నది. సాదృశ్యజ్ఞానముయొక్క సామగ్రి హేతువు కాదు.

**123.** ఉపాధ్యాయకృత సాదృశ్యజ్ఞానమునకు నధ్యాసకారణత్వ ఖండనము.

ఈరీతిగా ధర్మిజ్ఞానవాది సాదృశ్యజ్ఞానసత్వ రూపముచేత సామాన్య జ్ఞానమునకు విశేషజ్ఞాన ప్రతిబధ్యాధ్యాసమును గూర్చి కారణత్వమును జెప్పినయెడల నీప్రకారముగా నుపాధ్యాయ మతమునందు సమాధాన మున్నది. విరూపమునందును అధ్యాసము గలుగుటవలన సకలాధ్యాసమునందు సాదృశ్యజ్ఞానమునకు కారణత్వము సంభవించుట లేదు. ఇక నేమనగా, ఇంగాలాదికమునందు రూప్యాద్యధ్యాసముయొక్క పరిహారము కొఱకు విశేషజ్ఞానప్రతిబధ్యాధ్యాసమునందే సాదృశ్య జ్ఞానమునకు హేతుత్వము నంగీకరింపవలసినది. అచ్చటను రూప్యాధ్యాసమునందు ఎట్లు నీలపృష్ఠ త్రికోణత్వాది విశేషధర్మజ్ఞానము అధ్యాసమునకు ప్రతిబంధకమై యున్నదో అట్లు విశేష ధర్మజ్ఞానముయొక్క సామగ్రియును నధ్యాసమునకు ప్రతిబంధకమై యుండుటవలన నింగాలాదికమునందు రూప్యాద్యధ్యాసమునకు నాపత్తి లేదు, అందువలన సాదృశ్య జ్ఞానమునకు నధ్యాస హేతుత్వము నంగీకరించుట నిష్ఫలమై యున్నది. అది యుక్తమే కదా. ఏపదార్థముయొక్క జ్ఞానము దేనియందు ప్రతిబంధకమై యున్నదో ఆపదార్థముయొక్క జ్ఞానసామగ్రియును దానికి ప్రతిబంధ మగు నని నీ నియమ మున్నది. ఉ. పర్వతమునందు వహ్న్యనుమితికి ప్రతిబంధకము వహ్న్యభావజ్ఞానమై యున్నది. దానియొక్క సామగ్రి వహ్న్యభావవ్యాప్య జ్ఞానమై యున్నది. ఎట్లన వ్యాప్యముయొక్క జ్ఞానముచేత వ్యాపకముయొక్క జ్ఞానము కలుగుచున్నది. వహ్నివ్యాప్యము ధూమమై యున్నది. దానియొక్క జ్ఞానముచేత వ్యాపక మగు వహ్నియొక్క జ్ఞాన మగుచున్నది. ఈరీతిగానే వహ్న్యభావమునకు వ్యాప్యము జలాదికమై యున్నది. దానియొక్క జ్ఞానముచేత వహ్న్యభావముయొక్క జ్ఞానము గలుగుచున్నది. అందువలన వహ్న్యభావముయొక్క జ్ఞానసామగ్రి, వహ్న్యభావమును, వ్యాప్యము యొక్క జ్ఞానమై యున్నవి. వహ్న్య

నుమితికి ప్రతిబంధకము వహ్న్యభావ జ్ఞానమై యున్నది. ఆవహ్న్యభావ జ్ఞానము యొక్క సామగ్రి యగు వహ్న్యభావవ్యాప్యముయొక్క జ్ఞానము కూడ వహ్న్య నుమితికి ప్రతిబంధకమై యున్నది. ఈరీతిగా ప్రతిబంధకజ్ఞానముయొక్క సామగ్రి యు ప్రతిబంధకమై యున్నది. యద్యపి ప్రతిబంధకముయొక్క సామగ్రిని ప్రతిబం ధకముగా జెప్పినయెడల దాహమునకు ప్రతిబంధక మగు నేమణి యున్నదో దానియొక్క సామగ్రికి దాహప్రతిబంధకత్వ వ్యభిచార మున్నది. తథాపి, ప్రతి బంధకజ్ఞానముయొక్క సామగ్రికి ప్రతిబంధకత్వము నంగీకరించినయెడల వ్యభి చారము లేదు. ఈరీతిగా నధ్యాసమునకు ప్రతిబంధక మగునే విశేషజ్ఞాన మున్నదో దానియొక్క సామగ్రియును నధ్యాసమునకు ప్రతిబంధకమై యున్నది. శుక్తియందు రూప్యాధ్యాసమునకు ప్రతిబంధకము నీలతారూప విశేషధర్మము యొక్క జ్ఞానమై యున్నది. దానియొక్క సామగ్రి నీలభాగ వ్యాపి యగు నేత్ర సంయోగమై యున్నది. అదియు గూడ రూప్యాధ్యాసమునకు ప్రతిబంధకమై యున్నది. ఎట్లన, నీలభాగమునందు శుక్తితో నేత్రసంయోగము గలిగిన యెడల శుక్తిజ్ఞానమే గలుగుచున్నది, రూప్యభ్రమ కలుగుట లేదు. శుక్తియొక్క నీల ముకంటె భిన్న భాగ మగునేచాకచక్యదేశ మున్నదో దానితో నేత్రసంయోగము గలిగిన యెడల రూప్యభ్రమ గలుగుచున్నది. ఈరీతిగా నీలరూప సహిత ధర్మి యొక్క జ్ఞానము రూప్యాధ్యాసమునకు ప్రతిబంధకమై యున్నది. మఱియును నీల రూపముయొక్క యాశ్రయముతో నేత్రసంయోగసంబంధ మున్నది. ఆ నీల రూపముతో నేత్ర సంయుక్తతాదాత్మ్యసంబంధము ప్రతిబధ్యజ్ఞాన సామగ్రియై యున్నది. అదియు గూడ రూప్యాధ్యాసమునకు ప్రతిబంధకమై యున్నది. ఇంగాల ముతో నేత్ర సంబంధ ముండినప్పుడు నీలరూప విశిష్టముతోనే యున్నది. అందు వలన నింగాలముతో నేత్రసంయోగము దానియొక్క నీలరూపముతో సంయు క్తతాదాత్మ్యసంబంధరూప ప్రతిబంధకము జ్ఞానమునకు సామగ్రియై యుండుట వలన నింగాలమునందు రూప్యాధ్యాసమునకు ప్రాప్తియే లేదు. దానియొక్క పరిహారముకొఱకు సాదృశ్యజ్ఞానమునకు నధ్యాస హేతుత్వాంగీకారము నిష్ఫ లమై యున్నది.

124. ధర్మిజ్ఞానవాదికృష్ణోపాధ్యాయ మతమునందలి దోషము, దాని యొక్క పరిహారము.

మఱియు ధర్మిజ్ఞానవాది యుపాధ్యాయ మతమునందు జెప్పునట్టి దోషమే మనగా పుండరీకాకారముగా కత్తిరించిన పటమునందు పుండరీకభ్రమ కలుగుచున్నది. విస్తృత పటమునందు పుండరీక భ్రమ లేదు. అందువలన సాదృశ్యజ్ఞానము అధ్యాసమునకు హేతువై యున్నది. దానికిని అధ్యాస ప్రతిబంధకవిశేషజ్ఞాన సామగ్రిని అధ్యాస ప్రతిబంధకముగా నంగీకరించుటవలన సమాధాన మున్నది. తథాహి, విస్తారిత విశిష్టపటముతో నేత్రముయొక్క సంయోగము పటముయొక్క విశేషజ్ఞాన సామగ్రియై యున్నది. ఎచ్చట విస్తృతపటముతో నేత్రముయొక్క సంబంధ మున్నదో అచ్చట పుండరీకాధ్యాసము గలుగుటలేదు. ఎచ్చట పుండరీకాకార పటముతో నేత్రముయొక్క సంబంధ మున్నదో అచ్చట పటముయొక్క విశేష జ్ఞాన సామగ్ర్యభావ ముండుటవలన పుండరీకాధ్యాసము గలుగుచున్నది. యద్యపి ఎచ్చట సముద్ర జలముయొక్క సముదాయమునందు నీలశిలాతలాధ్యాస మున్నదో అచ్చట విశేషజ్ఞానసామగ్రి యున్నది. ఎట్లన నేత్రసంయుక్త తాదాత్మ్య సంబంధము శుక్లగుణస్వరూప విశేషజ్ఞానమునకు హేతువై యున్నది. మఱియు చాక్షుషజ్ఞానమునకు హేతువు జలముతో నాలోక సంయోగము కూడ నున్నది. ఈరీతిగానే జలరాశిత్వ రూపవిశేషమునకు వ్యంజకతరంగాదియొక్క ప్రత్యక్ష మున్నది. ఈప్రకారముగా సముద్రముయొక్క జలసముదాయముయొక్క విశేషజ్ఞానముయొక్క సామగ్రియందు మూడుపదార్థములున్నవి. (1) శుక్లరూపముతో నేత్రసంయుక్త తాదాత్మ్యము (2) ఆలోకసంయోగము, (3) జలరాశిత్వవ్యంజక తరంగప్రత్యక్షము. ఈమూడు నుండినను సముద్ర జలసముదాయమునందు నీలశిలాతలముయొక్క భ్రమగలుగుచున్నది. అందువలన విశేషదర్శనముయొక్క సామగ్రికి అధ్యాసప్రతిబంధకతా వ్యభిచారమున్నది. తథాపి ప్రతిబంధకరహిత విశేషదర్శనసామగ్రి యధ్యాసమునకు ప్రతిబంధకమై యున్నది. ప్రతిబంధకసహిత విశేషదర్శనముయొక్క సామగ్రి యధ్యాసమునకు ప్రతిబంధము కాదు. ఎచ్చట సముద్రజల సముదాయమునందు నీలశిలాతలాధ్యాసముగలుగుచున్నదో అచ్చట సముద్రజలమునందు నీలరూపభ్రమ గలిగి నీలశిలాధ్యాసము గలుగుచున్నది. నీలరూపముయొక్క భ్రమజ్ఞానముండుటవలన జలమునందు శుక్లరూపజ్ఞానము గలుగుటలేదు. అందువలన జలముయొక్క విశేష ధర్మ మగునేశుక్లరూప మున్నదో దానియొక్కజ్ఞానమునకు ప్రతిబంధకమగు నీలరూపభ్రమ యున్నది. ఈరీతిగానే దూరత్వదోషముచేత

జలరాశిత్వవ్యంజకతరంగాదికముయొక్క ప్రత్యక్షము గలుగుట లేదు. అందువలన జలరాశిత్వరూపవిశేషముయొక్క జ్ఞానమునకు ప్రతిబంధకము దూరత్వదోషమై యున్నది. అందువలన ప్రతిబంధకసహిత విశేషజ్ఞానముయొక్క సామగ్రి యున్నది. అయిన ప్రతిబంధకరహిత విశేష జ్ఞానముయొక్క సామగ్రియే యధ్యాసమునకు విరోధియై యుండుటవలన సముద్రజలసముదాయమునందు నీలశిలాతలాధ్యాసము గలుగుచున్నది. దానికి ప్రతిబంధకము కలుగుట లేదు. విశేషముగా జెప్పవలసిన దేమున్నది? సకల కారణముచేత స్వకార్యముయొక్క యుత్పత్తి ప్రతిబంధకరహితముచేతనే గలుగుచున్నది. ప్రతిబంధకముండుటవలన నేకారణముచేతను కార్యము గలుగుట లేదు. అందువలన ప్రతిబంధకముయొక్క యభావము కూడ సకల కార్యమునకును సాధారణ కారణమై యుండుటవలనను, మఱియును ప్రతిబంధక ముండుటవలన నేత్రసంయోగాది సకలాసాధారణ కారణము లుండినను విశేషజ్ఞానముయొక్క సామగ్రి లేదు. ఎట్లన, సకల కారణ సహితకారణము సామగ్రి యనంబడును. ఎచ్చట ననేక కారణము లుండి యొకటి లేదో అచ్చట సామగ్రి లేదు. ఈరీతిగా జలమునందు నీలతాభ్రమకు శుక్లరూపముయొక్క జ్ఞానమునందును దూరత్వరూపదోషమునకు జలరాశిత్వ రూపజ్ఞానమునందును, ప్రతిబంధకత్వ మున్నది. ఆ ప్రతిబంధక ముండుటవలన ప్రతిబంధకాభావ ఘటితవిశేషజ్ఞానముయొక్క సామగ్ర్యభావ ముండుటవలన నీలశిలాతలభ్రమ సంభవించుచున్నది. ఇక్కడ నొక విశేషము తెలియదగియున్నది. సమీపస్థపురుషునికి నాలోకసహితదేశమునందు నేత్రసంయోగ ముండినను జలసముదాయమునందు నీలరూపభ్రమ గలుగుచున్నది. అందువలన జలమునందు నీలరూపభ్రమకు విశేషజ్ఞానముచేత లేక దానియొక్క సామగ్రిచేత ప్రతిబంధము కలుగుట లేదు. అందువలన విశేషజ్ఞానముచేత నప్రతిబధ్యమైనందున జలముయొక్క శుక్లరూపముతో నేత్ర సంయుక్త తాదాత్మ్యసంబంధ ముండినను జలమునందు నీలరూపభ్రమ సంభవించుచున్నది. ధర్మిజ్ఞాసవాదియొక్క మతమునందు నుక్తభ్రమయే సామాన్యజ్ఞానత్వరూపముతో సముద్రజలమునందు నీలశిలాతలాధ్యాసమునకు హేతువై యున్నది. ఉపాధ్యాయ మతమునందు దోషరూపముచేత విశేషజ్ఞానమునకు ప్రతిబంధకమై యున్నది, లేక ప్రతిబంధకాభావరహిత విశేషజ్ఞానముయొక్క సామగ్ర్యభావ సంపాదనద్వారా శిలాతలాధ్యాసమునకు హేతువై యున్నది. ఈరీతిగా నుపా

ధ్యాయ మతమునందు సామాన్యజ్ఞానరూప ధర్మిజ్ఞానమునకు నధ్యాసకారణత్వము లేదు. తథాపి ఇంగాలాదికమునందు రూప్యాధ్యాసాదికముయొక్క యభావము సంభవించుచున్నది. అందువలన నధ్యాసమునందు ధర్మిజ్ఞానముయొక్క కార్యత్వము లేనందున కార్యానుపపత్తిచేత ధర్మిజ్ఞానరూపేదమాకారప్రమావృత్తియొక్క కల్పన సంభవించుట లేదు. ఈరీతిగా ననుభవానుసారముచేత 'లేక కార్యానుపపత్తిచేత ఇదమాకారవృత్తి నంగీకరించి దానియొక్క నిషేధము చేయబడి యున్నది.

**125. ఉపాధ్యాయ మతమునందు ధర్మిజ్ఞానవాదియొక్క శంకాసమాధానములు.**

తథాపి ధర్మిజ్ఞానవాది చెప్పున దేమనగా, విషయముతో నింద్రియముయొక్క సంబంధమే యంతఃకరణముయొక్క విషయాకారవృత్తికి హేతువై యున్నది. శుక్త్యాది విషయముతో నేత్రసంయోగము గలిగి యిదమాకారవృత్తి యేప్రకారముగా గలుగుట లేదు? అన్యత్ర వ్యాసంగ ముండినయెడల విషయముతో నింద్రియసంయోగ ముండినను ఆ విషయముయొక్క జ్ఞానరూపవృత్తి గలుగుట లేదు. అన్యత్ర వ్యాసంగరహితులకు విషయముతో నింద్రియ సంయోగము గలిగి యావిషయాకారవృత్తి యవశ్యము గలుగుచున్నది. అందువలన నన్యత్ర వ్యాసంగరూప ప్రతిబంధకాభావ సహిత నేత్రసంయోగముచే రజ్జుశుక్త్యాదికమును గోచరించుచున్నదై యంతఃకరణయొక్క యిదమాకారము గలుగుచున్నది. ఆవృత్తి నేత్రాదిప్రమాణజన్యమై యుండుటవలనను, శుక్త్యాదికముయొక్క యబాధితేదంతాగోచరమై యుండుటవలనను, ప్రమారూపమై యున్నది. ఈరీతిగా కారణసద్భావముచేత నిదమాకార ప్రమాకల్పన మంగీకరింపవలసి యున్నది, అని యుపాధ్యాయులయొక్క సమాధానము ఉన్నది. యద్యపి నేత్రసంయోగాదికముచేత ఇదమాకారవృత్తి గలుగుచున్నది. అయిన దోషసహితనేత్రజన్యమై యున్నది. మఱియును "ఇదం రజతం" అను నీరీతిగా స్వాకాలము నందుత్పన్నమగు మిథ్యారజతమును గోచరించుచున్నదై గలుగుచున్నది. అందువలన నావృత్తి భ్రమరూపమై యున్నది, ప్రమ కాదు. ఉపాధ్యాయమతముయొక్క నిష్కర్షము దోషసహితేంద్రియము యొక్క సంబంధముచేత విషయచేతన నిష్ఠావిద్యయందు కార్యాభిముఖతా రూపక్షోభము గలిగి సర్పరజతాది రూపావిద్దయొక్క పరిణామము గలుగుచున్నది. నేత్రసంయోగానో [illegible]

యందు క్షోభము కలుగుచున్నది, తదుత్తరక్షణమునం దవిద్యయొక్క సర్పరజతాది పరిణామము గలుగుచున్నది. ఏక్షణమునందు సర్పరజతాది రూప మగు నవిద్యయొక్క పరిణామము గలుగుచున్నదో యాక్షణమునందు ఆ సర్పరజతాదికమును విషయీకరించు 'నిదం రజతం' మను నీయంతఃకరణముయొక్క వృత్తి రూపజ్ఞానము గలుగుచున్నది ఏదుష్టనేత్ర సంయోగముచేత నవిద్యయందు క్షోభద్వారా సర్పరజతాదికముయొక్క యుత్పత్తి గలుగుచున్నదో యా సంయోగముచేత నంతఃకరణముయొక్క పరిణామ రూపవృత్తిజ్ఞానమున కుత్పత్తి గలుగుచున్నది.

యద్యపి ఇంద్రియసంయోగముచేత నవ్యవహితోత్తరక్షణమునందు జ్ఞానముయొక్క యుత్పత్తియే యంగీకరింపబడి యున్నది. మఱియును నేత్రసంయోగముకంటె నేకక్షణవ్యవధానముచేత సర్పరజతాదికముయొక్క యుత్పత్తి చెప్పబడియున్నది. ఎట్లన, నేత్రసంయోగోత్తరక్షణమునం దవిద్యయొక్క క్షోభము చెప్పి తదుత్తరక్షణమునందు సర్పరజతాదికముయొక్క యుత్పత్తి చెప్పంబడియున్నది. అందువలన నవిద్యయొక్క క్షోభకాలమునందు వృత్తిజ్ఞానమునకు నుత్పత్తి సంభవించుచున్నది. తదుత్తరక్షణమునందు భావిసర్పరజతాదికమునకు జ్ఞానకాలమునం దుత్పత్తి చెప్పినయెడల విరోధము ప్రతీతమగుచున్నది. తథాపి విరోధములేదు. కార్యాభిముఖావిద్యయొక్క యవస్థ క్షోభమనంబడును. ఎట్లు కార్యాభిముఖమై అవిద్యయు స్వకార్య సర్పరజతాదికమును రచియించుచున్నదో అట్లు అంతఃకరణము కూడ నేత్రసంయోగముచేత జ్ఞానరూప కార్యాభిముఖమై జ్ఞానమును రచించుచున్నది. అందువలన నవిద్యయొక్కయు, అంతఃకరణముయొక్కయు స్వకార్యాభిముఖావస్థకు నవ్యవహితోత్తరక్షణము ఏకమై యున్నది. దానికంటె ద్వితీయక్షణమునందు నవిద్యయొక్క సర్పరజతాది పరిణామము గలుగుచున్నది. మఱియు నాక్షణమునందు నంతఃకరణముయొక్క జ్ఞానరూప పరిణామము గలుగుచున్నది. నేత్రసంయోగముకంటె నవ్యవహితోత్తరక్షణమునందు నేత్రజ్ఞానమునకు నుత్పత్తి చెప్పబడియున్నదో ఆక్షణకాల మతిసూక్ష్మమై యున్నది. అందువలన కార్యాభిముఖావస్థయొక్క క్షణమును కార్యోత్పత్తి క్షణమును ఒకటె కాలమై యున్నది. ఈ యభిప్రాయముచేత నటుల జెప్పంబడియున్నది. ఈరీతిగా రజ్జుశుక్త్యాదికముతో దుష్టేంద్రియ సంయోగముచేత నంతఃకరణముయొక్క పరిణామరూప జ్ఞానమును, విషయావచ్ఛిన్న చేతన

ష్టావిద్యయొక్క పరిణామరూప సర్పరజతాదికమును ఏకకాలమునందు గలుగుచున్నవి. వానికి విషయ విషయీభావ మున్నది. అందువలన నంతఃకరణముయొక్క పరిణామరూపవృత్తి జ్ఞానముకూడ దుష్టేంద్రియసంయోగజన్యమై యున్నది. మిథ్యాపదార్థగోచరమయ్యును ఉన్నది. అందువలన భ్రమ యగును, ప్రమకాదు. ధర్మిజ్ఞానవాదియొక్క మతమునందు నవిద్యాక్షోభమునకు సామాన్యజ్ఞానము హేతువై యున్నది. అందువలన ధర్మిజ్ఞానవాదియొక్క మతమునందు ఇదమాకారవృత్త్యుత్తర కాలమునందు క్షోభసహితావిద్యయొక్క పరిణామము సర్పరజతాదికమై యున్నది. మఱియు నుత్తరకాలభావిపదార్థము ప్రత్యక్షజ్ఞానమునకు విషయముగా సంభవించుట లేదు. అందువలన నిదమాకారవృత్తికి విషయము సర్పరజతాది మిథ్యాపదార్థము కాదు. ఇకనేమనగా శుక్త్యాదిక మగుటవలన ఇదమాకారవృత్తి ప్రమయై యున్నది. సర్పరజతాదికమును విషయీకరించున దేదనగా, అవిద్యాపరిణామరూప భ్రమవృత్తియై యున్నది. ఈ కారణముచేత ధర్మిజ్ఞానవాదియొక్క మతమునందు భ్రమవృత్తి ఐంద్రియికము కాదు. సాక్షాదింద్రియ సంబంధముచేత గలిగినయెడల నది ఐంద్రియిక మనంబడును. భ్రమవృత్తి కధిష్ఠాన మనంబడును. ఏ యిదమాకారవృత్తి యున్నదో దానియొక్క యుత్పత్తిద్వారా పరంపరగా నింద్రియ సంబంధమునకు భ్రమవృత్తియం దుపయోగ మున్నది, సాక్షాత్తుగా లేదు. ఉపాధ్యాయ మతమునందు సర్పరజతాదికమునకు నుపాదానభూతావిద్యయందు క్షోభమునకు నిమిత్తము దోషసహితేంద్రియ సంయోగమై యున్నది. అందువలన నేక యింద్రియసంయోగముచేత నవిద్యా పరిణామరూప సర్పరజతాదికమును, దానినివిషయీకరించు నంతఃకరణ పరిణామరూపేదమాకార వృత్తియును, ఏకకాలమునందు గలుగుచున్నవి. ఈరీతిగా నుపాధ్యాయ మతమునందు నిదమాకారవృత్తి భ్రమరూపమై యున్నది. మఱియును సాక్షాదింద్రియ సంబంధముచేత నుత్పన్న మగుచున్నది. అందువలన నైంద్రియికముగా జెప్పబడియున్నది. ఇంద్రియ సంబంధముచేతనే ఇదమాకారవృత్తి యున్నది. అది స్వకాలమునందుత్పన్న సర్పరజతాదికమును విషయీకరించుచున్నదై యున్నది. అందువలన "అయం సర్పః; ఇదం రజతం" అను రీతిగా భ్రమ గలుగుచున్నది. కేవలేదంపదార్థమును గోచరించుటలేదు.

126. ఉపాధ్యాయమతమునందు శంకాసమాధానములు.

ఉపాధ్యాయమతమునందు నీసంశయ మున్నది. ఏపదార్థముతో నింద్రి సంబంధ మున్నదో తద్గోచర మగునట్టియే వృత్తి గలుగుచున్న దను నియమ మున్నది. అన్యముతో నింద్రియ సంబంధముచేత నన్యగోచరవృత్తి గలిగిన యెడల ఘటముతో నింద్రియసంబంధముచేత పటగోచరమైన వృత్తి కావల యును, విశేషము చెప్పానది యేమి? ఏకపదార్థముతో నింద్రియసంబంధము గలిగి సకల పదార్థగోచరవృత్త్యుపత్తిచేత సకల పురుషులు అనాయాసముగా సర్వజ్ఞులు కావలయును. అందువలన నన్యపదార్థముతో నింద్రియ సంబంధము చేత నన్యగోచరవృత్తి సంభవించుట లేదు. ఇక నేమనగా, దేనితో నింద్రియ సంబంధ మున్నదో తన్మాత్రగోచరముగ వృత్తి గలుగుచున్నది. ఉపాధ్యాయ మతమునందు రజ్జుశుక్త్యాదికముతో నేత్రసంయోగముచేత నుత్పన్నమగువృత్తి సర్పరజతాది గోచరముగా నంగీకరించుటకు శక్యము కాదు. ఈ శంకకు సమా ధానము. స్వసంబంధముతోను స్వతాదాత్మ్యసహితముతోను ఇంద్రియ సంబం ధముచేత స్వగోచరవృత్తి గలుగుచున్నది. వృత్తికి విషయము స్వపదార్థమై యున్నది. ఏపదార్థమును విషయీకరించు వృత్తి గలుగుచున్నదో ఆపదార్థ ముతో నింద్రియ సంబంధము లేక ఆపదార్థముయొక్క తాదాత్మ్యసహితముతో నింద్రియ సంబంధము కలుగవలసినది. భ్రమవృత్తికి విషయము సర్పరజతాదిక మై యున్నది. అచ్చట వృత్తి విషయముతో నేత్రసంబంధము కాలేదు. ఇక నే మనగా, సర్పరజతాదికముయొక్క తాదాత్మ్యసహితమైన యేరజ్జుశుక్త్యాదిక ము న్నదో దానితో నేత్రసంబంధ మగుచుండెను. ఎట్లన నధ్యస్తమునకు నధిష్ఠానము తో తాదాత్మ్యసంబంధ మున్నది.సర్పరజతాదికముయొక్క యధిష్ఠానతావచ్ఛేదక మైనందున రజ్జుశుక్త్యాదికము కూడ సర్పరజతాదికమునకు నధిష్ఠానముగా చెప్పబడుచున్నది. అందువలన సర్పరజతాదికముయొక్క తాదాత్మ్యసహిత మగు రజ్జుశుక్త్యాదికముయొక్క సంబంధముచేత నుత్పన్నమగు వృత్తికి సర్ప రజతాదికము కూడ విషయమై సంభవించుచున్నది. ఘటమునందు పటము యొక్క తాదాత్మ్యము లేదు. అందువలన ఘటేంద్రియ సంబంధముచేత నుత్ప న్నమగు వృత్తి పటగోచరము కాదు. బ్రహ్మకంటె భిన్న మగు నేయొకపదార్థము నందును సకల తాదాత్మ్యము లేదు. బ్రహ్మమందు సకల పదార్థములయొక్క తాదాత్మ్య మున్నది. బ్రహ్మ మసంగమై యున్నది. దానితో నింద్రియ సంబం ధము సంభవించుట లేదు. అందువలన నేకపదార్థముతో నింద్రియసంబంధము

చేత వృత్తి కలిగినయెడల సర్వజ్ఞత్వ వృత్తి లేదు. ధర్మిజ్ఞానవాదియొక్క మతమునందు సర్పరజతాదికము జ్ఞేయమై యున్నది. దానియొక్క పరిణామ మవిద్యాపరిణామమై యున్నది. దానియొక్క జ్ఞానము ఉక్తరీతిగా నంతఃకరణ పరిణామమై యున్నది. ఆయంతఃకరణముయొక్క పరిణామము ఇంద్రియసంబంధముచేత గలుగుచున్నది. అందువలన నైంద్రియిక మనంబడును. ఈరీతిగా సర్పరజతాదికముతో నేత్రసంయోగాభావ మున్నను రజ్జుశుక్త్యాదికముతో సృష్ట నేత్రసంయోగజన్య చాక్షుషభ్రమ వృత్తికి విషయము సర్పరజతాదికమై యున్నది. ఇది యుపాధ్యాయ మతము, "చక్షుషా సర్పం పశ్యామి" "చక్షుషా రజతం పశ్యామి" ఈయనువ్యవసాయముచేత సర్పరజతాదిగోచర భ్రమరూప చాక్షుషవృత్తి సిద్ధించుచున్నది. రజ్జుశుక్త్యాది గోచరేదమాకార ప్రమాణవృత్తియందు నభివ్యక్తసాక్షిగోచరత్వమును సర్పరజతాదికమునకు ధర్మిజ్ఞానవాది యంగీకరించుచున్నాడు. ఆయన మతమునందు నుక్తానువ్యవసాయమునకు విరోధ మున్నది.

127. ధర్మిజ్ఞానవాది మతమునం దధ్యాసమునందు పరంపరచేత నేత్రమునకు నుపయోగము, మఱియు నుపాధ్యాయమతమునందు శంఖపీతాధ్యాసమునందు సాక్షాదుపయోగము.

ఈరీతిగా ధర్మిజ్ఞానవాది చెప్పుచున్నాడు. సర్పరజతాదికముయొక్క ప్రకాశము సాక్షిరూపమై యున్నది. అయినను అభివ్యక్తసాక్షిచేతనముచేతనే దానికి ప్రకాశము గలుగుచున్నది. అందువలన సాక్షికి నభివ్యంజక మగు నిదమాకారవృత్తి నేత్రజన్య మైనందున పరంపరచేత సర్పరజతాది విషయకసాక్షిరూప ప్రకాశమునందును నేత్రమునకు నుపయోగ మున్నది. అందువలన సర్పరజతాదికముయొక్క జ్ఞానమునందు చాక్షుషత్వ వ్యవహార మున్నది. అందువలన ధర్మిజ్ఞానవాది మతమునందు సర్పరజతాదికమునకు సాక్షిభాస్యత్వము నంగీకరించినను ఉక్తానువ్యవసాయమునకు విరోధము లేదు.

ఇట్లు చెప్పుట సరికాదు. ఎట్లన, ఉక్తస్థలమునందు పరంపరచేత నేత్రమునకుపయోగ ముండుటవలన చాక్షుషత్వవ్యవహారమునకు నిర్వాహము చెప్పబడి యున్నది. తథాపి శంఖమునందు పీతభ్రమ గలిగినప్పుడు పరంపరచేతను నేత్రమున కుపయోగము సంభవించుట లేదు. ఎట్లన, రూపములేక కేవలశంఖమునందు నేత్రయోగ్యత లేదు అందువలన రూపవిశిష్టమునందు చెప్పినయెడల శంఖముయొక్క శుక్లరూపగ్రహణ మైనను పీతత్వారోపము గలుగుట లేదు. [illegible]

వలన నధ్యస్తపీత రూపవిశిష్టమునందు నేత్రయోగ్యత నంగీకరింపవలసినది. అది ధర్మిజ్ఞానవాది మతమునందు సంభవించుట లేదు. ఎట్లన నధ్యస్త పదార్థమునందు నైంద్రియికత్వము లేదు, అని ధర్మిజ్ఞానవాదిమత మున్నది. ఈప్రకారముగా రూపము లేక కేవలశంఖజ్ఞానమునందు, లేక రూపవిశిష్టశంఖజ్ఞానమునందు నేత్రమునకు నుపయోగము సంభవించుట లేదు. మఱియు నుపాధ్యాయమతమునందు శంఖముతో నేత్రసంబంధమే పీతరూపాధ్యాసమునకు హేతువై యున్నది. ఆనేత్రముయొక్క సంబంధము రూపరహిత కేవలశంఖముతో లేక శుక్లరూపవిశిష్టముతో నైన సంభవించుచున్నది.

**128. ధర్మిజ్ఞానవాది మతమునందు శంఖపీతత్వమున కనధ్యాసము. ఉపాధ్యాయమతమునందు దానియొక్క యనువాదము దోషము.**

ఈస్థానమునందును ధర్మిజ్ఞానవాది చెప్పున దేమనగా, ఎచ్చట శంఖమునందు పీతరూపాధ్యాసము గలుగుచున్నదో అచ్చట సర్పరజతాదికమువలె పీతరూపమునకు స్వరూపముచేత నధ్యాసము లేదు. ఇక నేమనగా, ఎట్లు స్ఫటికమునందు జపాకుసుమ వృత్తిలౌహిత్యముయొక్క సంసర్గముయొక్క యధ్యాసమున్నదో అట్లు నేత్రవృత్తి పీతసంబంధి పీతిమయొక్క సంబంధమునకు, శంఖమునకును అధ్యాస మున్నది. పీతపిత్తముయొక్క జ్ఞానము లేక దానియొక్క సంబంధాధ్యాసము లేదు. అందువలన పీతపిత్తముయొక్క జ్ఞానమునందు నేత్రమున కుపయోగ ముండుటవలన శంఖపీతాధ్యాసమునందును పరంపరచేత నేత్రమున కుపయోగ మున్నది. అందువలన పీతశంఖమును "చక్షుషా పశ్యామి" యను నీయనువ్యవసాయము సంభవించుచున్నది. మఱియును శంఖమునందు పీతరూపముయొక్క సంబంధము అనిర్వచనీయముగా నుత్పన్నమగుచున్నది. అందువలన నన్యథాఖ్యాతి వాదముయొక్క యాపత్తి కూడ లేదు.

ఈరీతిగా ధర్మిజ్ఞానవాది చెప్పినయెడల ఆయనను అడుగవలసిన దేమనగా, శంఖమునందు పీతరూపసంసర్గాధ్యాసమునకు హేతువు పిత్తపీతత్వజ్ఞానమై యున్నది. అది నయనదేశస్థమై పీతత్వప్రత్యక్షజ్ఞానము గలుగుచున్నదా? లేక శంఖదేశమునందు పీతద్రవ్యము ప్రాప్తమై, దానియొక్క పీతత్వప్రత్యక్షజ్ఞానము కలుగుచున్నదా? ప్రథమపక్షము నంగీకరించినయెడల నయనదేశస్థపీతద్రవ్యముతో నయనస్థాంజనమునకు వలెను నేత్రసంయోగము సంభవింపనందున చాక్షుషప్రత్యక్షము గలుగుట లేదు. అందువలన నయనస్థ పీతపిత్తగోచర

పరోక్షవృత్తి గలుగును. అపరోక్షవృత్తిస్థసాక్షిచేత శంఖపీతత్వమునకు నపరోక్షప్రకాశము గలుగుట లేదు. మఱియు నేత్రద్వారముచేతనైన నయనస్థపిత్తపీతతాగోచరచాక్షుషవృత్తి నంగీకరించినను ఆవృత్తియందు నభివ్యక్తసాక్షితో నయనదేశస్థ పిత్తపీతతామాత్రమునకు సంబంధ మున్నది. శంఖముతోను, శంఖమందుండు పీతతాసంబంధముతోను సాక్షికి సంబంధము లేదు. కానువలన శంఖమునకును, శంఖమునందుండు పీతిమసంబంధమునకును, సాక్షితో సంబంధములేనందున ప్రకాశము కాకపోవలయును. దీని తాత్పర్యమేమనగా, జపాకుసుమసంబంధి రక్తరూపముయొక్క యనిర్వాచనీయ సంబంధమునకు స్ఫటికమునందు ఉత్పత్తి యున్నది. అచ్చట రక్తత, స్ఫటికత, రక్తతాసంబంధము, ఈమూడు పదార్థములు పురోదేశమునం దుండుటవలన నేకవృత్తియం దభివ్యక్తసాక్షికి విషయములై యున్నవి. పీతశంఖాధ్యాసమునందు పీతిమ నయనదేశమునందున్నది. పీతిమయొక్క సంబంధసహితశంఖము పురోదేశమునం దున్నది. అందువలన నేకవృత్తియం దభివ్యక్త సాక్షిచేత ఆమూటికిని ప్రకాశము సంభవించుట లేదు, అందువలన నయనదేశస్థ పిత్తపీతిమ జ్ఞానమునందు నేత్రముకుపయోగ మున్నది. ఈప్రథమపక్షము సంభవించుటలేదు. కానువలన శంఖదేశమునందు ప్రాప్తమగు పిత్తద్రవ్యముయొక్క పీతతాపరోక్షజ్ఞానము నేత్రముచేత గలుగుచున్నది. తదనంతరము శంఖమునందు పీతిమయొక్క యనిర్వచనీయ సంబంధ ముత్పన్నమగుచున్నది. ఉ. కుసుంభమునందు సంబంధియగు పటమునందు కుసుంభద్రవ్యముయొక్క రూపమునకు పటమునందు ప్రతీతి గలుగుచున్నది, అక్కడ నేకవృత్తియం దభివ్యక్తసాక్షిచేత కుసుంభమునకును, రక్తరూపమునకును, తత్సంబంధి యగు పటమునకును, ప్రకాశమగుచున్నది. స్ఫటికమునందు లౌహిత్యభ్రమ యున్నది. అచ్చట నేకవృత్తియం దభివ్యక్తసాక్షిచేతనే నిఖిలమునకును ప్రకాశమగుచున్నది. ఈప్రకారముగానే శంఖపీతభ్రమయందును నయనదేశముతో నిస్సృతపీతపిత్తముగూడ శంఖదేశమునందు ప్రాప్తమగుచున్నది, దానియొక్క యనిర్వచనీయ సంబంధమునకు శంఖమునం దుత్పత్తి యగుచున్నది, అను నీ ద్వితీయపక్షము నంగీకరించినయెడల నుక్తదోషములేదు. ఎట్లన, పీతపిత్తమును, శంఖమును, ఏకదేశస్థమైనందున పీతపిత్తగోచరచాక్షుషవృత్తియందు నభివ్యక్త సాక్షిచేత శంఖమునకు, శంఖమునందుండు పీతత్వముయొక్క సంసర్గమునకును ప్రకాశమంగీకరించినయెడల బాధ

కములేదు. ఈరీతిగా శంఖదేశమునందు ప్రాప్తమగు నేపీతపిత్త మున్నదో దానియొక్క పీతతానిర్వచనీయ సంసర్గమునకు శంఖమునం దుత్పత్తి యున్నది. శంఖదేశస్థ పీతపిత్తముయొక్క ప్రత్యక్షము నేత్రజన్యమై యున్నది. ఈరీతిగానే శంఖమునందు సంసర్గాధ్యాసము కలుగుచున్నది. అందువలన పరంపరచేత శంఖపీతాధ్యాసమునందును నేత్రమున కుపయోగ ముండుటవలన చాక్షుషత్వ ప్రతీతి సంభవించుచున్నది ఈధర్మిజ్ఞానవాదియొక్క ఉక్తియు సంభవించుటలేదు. ఎట్లన, శంఖదేశమునందు పీతరూపసహితపిత్తమునకు నిర్గమనము కలిగినయెడల శంఖమునందు పీతతయొక్క ప్రతీతి సకలద్రష్టృజనులకు గావలయును.

**129.** ధర్మిజ్ఞానవాది మతమునందు నుక్తదోషమునకు (ద్వితీయము) సమాధానము, మఱియు నుపాధ్యాయమతమునందు (ద్వితీయము)దోషము.

ధర్మిజ్ఞానవాది చెప్పునదేమనగా, దోషసహిత నేత్రమునుండి నిర్గతమగు పిత్తమును ఏపురుషుడు చూచియున్నాడో అయనకు శంఖలిప్త పిత్తపీతిమ ప్రతీతి గలుగుచున్నది. ఎవనియొక్క నేత్రమునందు పిత్తదోషములేదో ఆయనకు నిర్గతపిత్తము చూడబడదు. అందువలన పిత్త పీతతయొక్క ప్రతీతి శంఖమునందు గలుగుటలేదు. ఎట్లు భూమినుండి యెగిరిన పక్ష్యాదికముయొక్క యుద్గమనక్రియను, మధ్యక్రియను గూడ ఎవరు చూచియున్నారో వారికి నత్యూర్ధ్వదేశమునందు పక్షిప్రతీతి గలుగుచున్నది. అధోదేశమునందు నెగురునప్పుడు ఆపక్షిని ఎవరు చూడలేదో వారికి నత్యూర్ధ్వదేశగత పక్షిప్రతీతి యగుటలేదు; ఈరీతిగానే ఎవరినేత్రమునుండి పీతపిత్తము నిర్గతమైనదో వారికి నేత్రము దగ్గఱనుండి బయలుదేఱిన దానియొక్క ప్రతీతి గలుగుటవలన శంఖదేశమునందు దానియొక్క ప్రతీతి గలుగుచున్నది, ఇతరులకు గలుగుటలేదు. ఈదృష్టాంతముచేత నన్యపురుషులకు పీతిమప్రతీత్యాపత్తి పరిహారము చెప్పుట సంభవింపదు. ఎట్లన ఎవరికి ఊర్ధ్వదేశగత పక్షియొక్క దర్శన మున్నదో వారు అన్యపురుషులకు నీరీతిగా నుపదేశము జేయుచున్నారు. నాయొక్క నేత్రసమీపముగా నీయొక్క నేత్రముతో జూడుము. మఱియును నంగుళినిర్దేశమును జేసినయెడల నన్యపురుషులకూర్ధ్వదేశగత పక్షియొక్క ప్రతీతి గలుగుచున్నది. మఱియును, శంఖలిప్తపిత్తముయొక్క ప్రతీతి యేప్రకారముగాను నితరులకు గలుగుట లేనందున దృష్టాంతము విషమమై యున్నది. అందువలన శంఖదేశమునందు పిత్తముయొక్క నిర్గమనము సంభవించుట లేదు.

మఱియును ధర్మిజ్ఞానవాది చెప్పునదేమనగా, దోషసహితనేత్రముతో నిర్గతమగు పీతపిత్తముయొక్క పీతిమకు దోషసహితనేత్రముచేతనే యపరోక్షజ్ఞానము గలుగుచున్నది. అందువలన నన్యపురుషులకు శంఖమునందు పీతిమాధ్యాసము గలుగుటలేదు. ఈరీతిగా శంఖదేశస్థపిత్త పీతిమయొక్క యపరోక్షానుభవము నేత్రేంద్రియముచే గలుగుచున్నది. నేత్రముచేత ననుభూతపీతిమయొక్క యనిర్వచనీయ సంబంధము శంఖమునందు గలుగుచున్నది. అది సాక్షిప్రకాశ్యమై యున్నది. శంఖమునందు పీతిమసంబంధముయొక్క ప్రతీతియందు పరంపరచేత నేత్రమునకు నుపయోగ ముండుటవలన చాక్షుషత్వ వ్యవహారము కూడ సంభవించుచున్నది. ఈ ప్రకారముగా ధర్మిజ్ఞానవాదియొక్క సమాధానము కూడ ననుభూయమానారోపమునందే సంభవించుచున్నది, స్మర్యమాణారోపమునందు సంభవించుటలేదు. అన్యత్రానుభూతమునకు నన్యత్రప్రతీతి యనుభూయమానారోప మనంబడును. ఉ. శంఖదేశస్థనేత్రముయొక్క పిత్తమునం దనుభూత మగు నేపీతిమసంబంధ మున్నదో దానికి శంఖమునందు ప్రతీతి యున్నది. ఇది యనుభూయమానారోపమై యున్నది. ఈరీతిగా సన్నిహితపదార్థముయొక్క ధర్మమునకు నితరమునందు ప్రతీతి గలిగినయెడల నచ్చట ననుభూయమానారోప మున్నది. ప్రత్యక్షానుభవవిషయముయొక్క యారోప మేది యున్నదో అది యనుభూయమానారోప మనంబడును; సన్నిహితోపాధియందే ప్రత్యక్షానుభవముయొక్క విషయత యున్నది. జలమునందు నీలతాధ్యాసము గలిగినయెడల అది స్మర్యమాణారోపమై యున్నది. స్మృతివిషయము స్మర్యమాణ మనంబడును, జలాధార మగు భూమి నీలమై యున్నది, లేక నీలస్మృతికామిశ్రితజలము ఎచ్చట నున్నదో యచ్చట జలమునందు నీలతాధ్యాస మనుభూయమానారోపముగా సంభవించుచున్నది. అయిన ధవళభూమిస్థ నిర్మల జలమునందును, ఆకాశమునందును నీలతయొక్క స్మర్యమాణారోప మున్నది. ఆస్థలమునందు నీలరూపసంసర్గి అధిష్ఠానగోచరచాక్షుషవృత్త్యంగీకారము లేనందున పరంపరచేతను నేత్రమున కుపయోగము సంభవించుటలేదు. అందువలన నుక్తాధ్యాసమునందు చాక్షుషత్వప్రతీతి ధర్మిజ్ఞానవాదియొక్క మతమునందు సంభవించుటలేదు ఎట్లన, అధ్యస్తపదార్థము ధర్మిజ్ఞానవాదియొక్క మతమునందు సాక్షిభాస్యముగా నంగీకరింపబడి యున్నది. మఱియు నుపాధ్యాయ మతమునందు నధ్యస్త పదార్థము

యొక్క యింద్రియవృత్తి యున్నది. అందువలన నుక్తాధ్యాసమునందును చాక్షుషత్వ ప్రతీతి సంభవించుచున్నది. మఱియును స్తనమునొక్క మధుర దుగ్ధమునందు నెచ్చట బాలకులకు తిక్తరసభ్రమ గలుగుచున్నదో యా స్థలమునందు మధురదుగ్ధము అధిష్ఠానమై యున్నది. ద్రవ్యగ్రహణమునందు రసనేంద్రియమునకు యోగ్యత లేనందున మధురదుగ్ధముయొక్క జ్ఞానమునందు రసనేంద్రియమున కుపయోగము సంభవించుట లేదు. ధర్మిజ్ఞానవాదమునందు నధ్యస్తగోచరేంద్రియవృత్తి లేదు. అందువలన మధురదుగ్ధమునందు తిక్తతాభ్రమకు రాసనత్వము చెప్పక పోవలయును. ఉపాధ్యాయమతమునందైననో తిక్తతాగోచర రాసన వృత్తి యున్నది. అందువలన తిక్తతాభ్రమమునందు రాసనత్వ వ్యవహారము సంభవించుచున్నది.

130. మధురదుగ్ధమునందు తిక్తరసాధ్యాసమునకు రసనగోచరతాపూర్వకోపాధ్యాయమతనిష్కర్షము.

పరంతు ఇంతమాత్ర భేద మున్నది. సర్పరజతాద్యధ్యాసమునందు నధిష్ఠానముతో నేత్రసంబంధముచేత నధిష్ఠానగోచర చాక్షుష వృత్తి కలుగుచున్నది. ఆవృత్తియొక్క సమకాలమునందు నుత్పన్నమగు సర్పరజతాదికము కూడ దాని విషయమై యున్నది. మధురదుగ్ధమునందు తిక్తరసాధ్యాసము గలుగుచున్నది. అచ్చట దుగ్ధాకారరాసన వృత్తి లేదు. ఇకనేమనగా, త్వగింద్రియను శరీరవ్యాపియై యుండుటవలన త్వాచవృత్తి మధుర దుగ్ధాకారమగుచున్నది. దానిచేత మధుర దుగ్ధమునకు ప్రకాశమగుచున్నది. ఏకాలమునందు మధురదుగ్ధముతో సంయోగ మున్నదో యాకాలమునందు దోషదూషిత రసనమునకు దుగ్ధముతో సంయోగమున్నది. రసనా సంయోగముచేత దుగ్ధావచ్ఛిన్న చేతనస్థావిద్యయందు క్షోభము గలిగి, అవిద్యయొక్క తిక్తరసాకార పరిణామమును, తిక్తరసగోచర రాసనవృత్తియును ఏకకాలమునందు గలుగుచున్నవి. ఈరీతిగా మధుర దుగ్ధమునందు తిక్తరసాధ్యాసము గలిగినప్పుడు మధుర ద్రవ్యముయొక్క ప్రకాశము త్వాచవృత్త్యవచ్ఛిన్న చేతనముచేత గలుగుచున్నది. మఱియును తిక్తరసాకారరాసన వృత్తి గలుగుచున్నది. అందువలన రాసనవృత్త్యవచ్ఛిన్న చేతనముచేత తిక్తరసమునకు ప్రకాశము గలుగుచున్నది. త్వాచవృత్తియును రాసన వృత్తియును దుగ్ధదేశమునకు పోవుచున్నది. అందువలన నేకదేశస్థమైనందున నుభయవృత్త్యుపహిత చేతనములకు భేదము లేదు.

అందువలన నధిష్ఠానాధ్యస్తములకు నేకజ్ఞాన విషయత్వము కూడ సంభవించుచున్నది. తిక్తరసగోచర రాసనవృత్తి నంగీకరింపక త్వాచవృత్తియం దభివ్యక్త చేతనముచేతనే తిక్తరసమునకు ప్రకాశము నంగీకరించినయెడల తిక్తరసముయొక్క జ్ఞానమునందు రాసనత్వ ప్రతీతి కాకపోవలయును. ధర్మిజ్ఞానవాది మతమునందు సర్పరజతాద్యధ్యాసమునందు నధ్యాస కారణ మగు నధిష్ఠానజ్ఞానమునందు నేత్రమున కుపయోగ ముండుటవలన పరంపరచేత నధ్యస్త జ్ఞానమునకు నేత్రజన్యత యున్నది. తిక్తరసాధ్యాసమునందు నధిష్ఠానము మధుర దుగ్ధమై యున్నది. అది యద్రవ్యరూప మైనందున దానియొక్క జ్ఞానమునందును రసనేంద్రియమున కుపయోగము లేనందున పరంపరచేత తిక్తరసజ్ఞానమునకు రసనజన్యత సంభవించుట లేదు. అందువలన తిక్తరసాధ్యాసమునందు రాసనత్వప్రతీతి నిర్వాహము కొఱకు ధర్మిజ్ఞానవాదికిని రాసనవృత్తి యవశ్యాంగీకరణమై యున్నది. సర్పరజతాద్యధ్యాసమునందును నధ్యస్తగోచరేంద్రియక వృత్తియే గలుగుచున్నది. దానికంటె భిన్నమగు నధ్యస్తగోచరావిద్యాపరిణామరూపమగు ననిర్వచనీయ వృత్తికల్పనము నిష్ఫలమై యున్నది. ఈ మతమునం దవిద్యయొక్క పరిణామము కేవల విషయాకారముగానే యున్నది. ఆయనిర్వచనీయ విషయముయొక్క జ్ఞానరూపవృత్తి అంతఃకరణముయొక్క జన్యమైనదిగా నున్న దుష్టేంద్రియ సంయోగముచేత నావృత్తి గలుగుచున్నది. అందువలన భ్రమరూపమై యున్నది. అధిష్ఠానముతో దుష్టేంద్రియము యొక్క సంబంధమే అవిద్యయందు క్షోభద్వారా అధ్యాసము హేతువై యున్నది. అధిష్ఠానముయొక్క సామాన్యజ్ఞానము అధ్యాసమునకు హేతువు కాదు.

131. ఆచార్యోక్తిచేత, యుక్తిచేతను, ఉపాధ్యాయమతమునకు విరుద్ధత యగుచున్నది.

మఱియు ధర్మిజ్ఞానమతమునం దుక్తదోషమునకు సమాధానము.

ఈకవితార్కికచక్రవర్తి నరసింహాభట్టోపాధ్యాయులయొక్క మతము సకలాచార్యోక్తికిని విరుద్ధమై యున్నది. అది యుక్తమే కదా. (1) అధిష్ఠాన సామాన్యజ్ఞానము. (2) దోషము. (3) పూర్వానుభవజనిత సంస్కారము. ఈ మూటిచేతను నధ్యాసము గలుగుచున్నదని ప్రాచీనమత మున్నది. మఱియును నుపాధ్యాయమతమునందు నధిష్ఠానముతో నింద్రియముయొక్క సంయోగము అధ్యాసమునకు హేతువుగా నంగీకరింపబడినది. అధిష్ఠానముయొక్క సామాన్య

జ్ఞాన మంగీకరింపబడలేదు. అందువలన ప్రాచీనమతమునకు విరుద్ధమై యున్నది. (1) అర్థాధ్యాసము; (2) జ్ఞానాధ్యాసము నను భేదముచేత నధ్యాసము ద్వివిధమై యున్నది. ఇది సకలాద్వైతవాదులకు సమ్మతమై యున్నది. ఉపాధ్యాయమతము నందు జ్ఞానాధ్యాస మప్రసిద్ధమై యున్నది. ఎట్లన అనిర్వచనీయ సర్పరజతాది గోచరావిద్యయొక్క పరిణామము జ్ఞానాధ్యాస మనంబడును. ఉపాధ్యాయమత మునందు నైంద్రియభ్రమవృత్తి నంగీకరించుటవలన దానికి లోపమున్నది. ఈరీతిగా ప్రాచీనవచనమునకు విరుద్ధమై యున్నది. వక్ష్యమాణరీతిగా నిది యుక్తివిరుద్ధమై యున్నది. అధిష్ఠానేంద్రియములయొక్క సంబంధమును సకలాధ్యాసములందును కారణముగా నంగీకరించినయెడల నహంకారాద్యధ్యాసమునకు ననుపపత్తి కావలయును. ఎట్లన, అహంకారాదికమునకు నధిష్ఠానము బ్రహ్మమై యున్నది; లేక సాక్షిచేతనమై యున్నది. అది నీరూపమై యున్నది. దానితో జ్ఞానహేతువగు నింద్రియసంబంధము సంభవించుట లేదు. మఱియును ప్రాతిభాసికాధ్యాసమునందే ఇంద్రియ సంబంధమునకు కారణత్వము నంగీకరించినను అహంకారాధ్యాసము కూడ ప్రాతిభాసికమై యున్నది. ఈమతమునం దింద్రియ సంబంధము లేనందున నహంకారాద్యధ్యాసమునకు ననుపపత్తియే కావలయును. అహంకారాద్యధ్యాసము వ్యావహారిక మైనందున ప్రాతిభాసికముకంటె విలక్షణమైయున్నది. ఈమతమునందును స్వాప్నాధ్యాసమునకు ననుపపత్తి కావలయును. ఎట్లన సర్వమతములందును స్వాప్నాధ్యాసము ప్రాతిభాసికమై యున్నది. దానికి నధిష్ఠానము సాక్షిచేతనమై యున్నది. ఇంద్రియ సంబంధము సంభవింపనందున ప్రాతిభాసికాధ్యాసమునందును నధిష్ఠానముతో నింద్రియ సంబంధమునకు గారణత్వము సంభవింపదు. ఇట్టి యుపాధ్యాయుని మతము సరికాదు. మఱియును ధర్మిజ్ఞాన మతమునందు నుపాధ్యాయునిచేత దోషము చెప్పబడినది. అధిష్ఠానజ్ఞానమునందు నింద్రియసంబంధమునకు నుపయోగ మంగీకరించినయెడల శంఖమునందు పీతమాధ్యాసము గలిగినప్పుడు రూపములేకయే కేవలశంఖ విషయకచాక్షుషము నంగీకరించినయెడల నీరూపవాయువుయొక్క ప్రత్యక్షము కావలయును. శుక్లరూపవిశిష్ట శంఖముయొక్క చాక్షుషప్రత్యక్షము నంగీకరించినయెడల పీతరూపజ్ఞానమునకు విరోధియగు శుక్లరూపజ్ఞాన ముండుటవలన పీతరూపాధ్యాసము కాకపోవలయును. ఇట్లు చెప్పుటయు నుపాధ్యాయునియొక్క యవివేకముచేతనై యున్నది. ఎట్లన, రూపసహితద్రవ్యముయొక్క చాక్షుష ప్రత్యక్షము గలుగు

చున్నదను నియమ మున్నది. ఒకప్పుడు దోషవశముచేత రూపభాగమును త్యజించి కేవలాశ్రయ విషయకచాక్షుషప్రత్యక్షము గలుగుచున్నది. నిర్దోషనయనముచేత రూపవిశిష్ట విషయకచాక్షుషప్రత్యక్షము గలుగుచున్నది. అయినను నీరూపముయొక్క చాక్షుషప్రత్యక్షము గలుగుట లేదు. అందువలన నీరూపముగు వాయువుయొక్క చాక్షుషజ్ఞానమునకు నాపత్తి లేదు. రూపసహిత శంఖముయొక్క రూపభాగమును త్యజించి దుష్టనేత్రముచేత చాక్షుషప్రత్యక్షము గలుగుచున్నది తథాపి శుక్లరూపమునందు శుక్లత్వజ్ఞానమునకు ప్రతిబంధకము నయనదోషమై యున్నది. అందువలన పీతరూపముయొక్క యధ్యాసముకూడ సంభవించుచున్నది. ఎట్లన, శుక్లత్వవిశిష్ట శుక్లరూపముయొక్క జ్ఞానము పీతరూపజ్ఞానమునకు విరోధియై యున్నది. కేవల శుక్లరూపవ్యక్తియొక్క జ్ఞానమే రూపాంతరజ్ఞానమునకు విరోధి కాదు. ఈవిషయము ప్రతిబధ్యప్రతిబంధక భావనిర్ణాయక గ్రంథమునందు ప్రసిద్ధమై యున్నది. ఈరీతిగా శంఖమునందు పీతతాధ్యాసమునకు హేతువు శంఖరూపాధిష్ఠానముయొక్క ఇదమాకార చాక్షుషజ్ఞానము సంభవించుచున్నది. అది కేవల శంఖగోచరమై యున్నది. అథవా దోషబలము చేత శుక్లత్వమును త్యజించి శుక్లరూపవిశిష్ట శంఖగోచరమై యున్నది. మఱియును పరంపరచేత పీతతాజ్ఞానమునందు నేత్రమున కుపయోగ ముండుటవలన పీతతాధ్యాసమునందు చాక్షుషత్వ ప్రతీతికి నిర్వాహముకూడ ధర్మిజ్ఞానవాదమునందు సంభవించుచున్నది. మఱియును మధురదుగ్ధమునందును తిక్తరసాధ్యాస మున్నది. అచ్చట ధర్మిజ్ఞానవాదమునందును రాసనవృత్తి కావశ్యకత చెప్పబడియున్నది. ఎట్లన, తిక్తరసమునకు నధిష్ఠాన మగునేమధురదుగ్ధ మున్నదో దానియొక్క సామాన్యజ్ఞానరూపవృత్తి రాసనముగా సంభవించుట లేదు. ఇక నేమనగా, త్వాచవృత్తియే యధిష్ఠానగోచరమై యున్నది. ఆత్వాచవృత్తియందభివ్యక్త సాక్షిచేత తిక్తరసమునకు ప్రకాశము నంగీకరించినయెడల తిక్తరసముయొక్క ప్రతీతియందు రాసనత్వ వ్యవహారము సంభవించుట లేదు. అందువలన ధర్మిజ్ఞానవాదికి తిక్తరస విషయకభ్రమ రూపప్రతీతి రాసనజన్యముగానే యంగీకరింపవలయును. ఈరీతిగా రజతాదిభ్రమజ్ఞానము కూడ ఇంద్రియజన్యమై యున్నది. ఈరీతిగా నుపాధ్యాయవచనము, మధురదుగ్ధమున కధిష్ఠానత్వ మంగీకరించినయెడల, సంగతమై యున్నది. ఆమధురరససహితదుగ్ధ రూపద్రవ్యము అధిష్ఠానముకాదు. ఇక నేమనగా, తిక్త రసాధ్యాసమున కధిష్ఠానము దుగ్ధముయొక్క మధుర రసమై

యున్నది. దానియొక్క జ్ఞానమునందు రసనమున కుపయోగ మూఁడుటవలన తిక్తరసప్రతీతియందు రాసనత్వ ప్రతీతియును వ్యవహారముకూడ సంభవించుచున్నవి. యద్యపి మధుర రసజ్ఞానమైన యనంతరము దానికి విరోధియగు తిక్త రసాధ్యాసము సంభవించుట లేదు. తథాపి మధురత్వ ధర్మ విశిష్ట మధుర రసముయొక్క జ్ఞానమే తిక్త రసజ్ఞానమునకు విరోధియై యున్నది. మధురత్వ ధర్మమును త్యజించి కేవల మధుర రసవ్యక్తియొక్క సామాన్యజ్ఞానము తిక్త రసాధ్యాసమునకు విరోధి కాదు. ఎట్లు శుక్తిత్వరూపముచేత శుక్తిజ్ఞానము రజతాధ్యాసమునకు విరోధియైనను శుక్తియొక్క సామాన్యజ్ఞానము రజతాధ్యాసమునకు విరోధికాదు. తిరిగి శుక్తియొక్క సామాన్యజ్ఞానము రజతాధ్యాసమునకెట్లు హేతువై యున్నదో అట్లు మధురరసముయొక్క సామాన్యజ్ఞానము కూడ తిక్త రసాధ్యాసమునకు హేతువై యున్నది. ఈరీతిగా ధర్మిజ్ఞానవాదమునందును తిక్త రసాధిష్ఠానమగు నేమధురరస మున్నదో దానియొక్క సామాన్యజ్ఞానము రసనముచేత గలిగి తిక్త రసాధ్యాసము గలుగుటవలన పరంపరచేత రసనేంద్రియమునకు తిక్త రసాధ్యాసమునం దుపయోగ మున్నది. అందువలన తిక్త రసముయొక్క ప్రతీతియందు రాసనత్వ వ్యవహారము సంభవించుచున్నది.

**132. తిక్త రసాధ్యాసమునందు కొందఱయొక్క యన్యోక్తి, మఱియు తత్ఖండనము.**

మఱియు మధురదుగ్ధమునే తిక్త రసాధిష్ఠానముగా నంగీకరించినను తిక్త రసాధ్యాసమునందు రసనాపేక్ష లేదు. ఇక నేమనగా, దుగ్ధ (క్షీర) గోచరత్వాచవృత్తి యున్నది. త్వాచవృత్తి తిక్త రసాకారము యద్యపి కాదు, తథాపి త్వాచవృత్తియందు నభివ్యక్తసాక్షి నిరావృతమై యున్నది. దానియొక్క సంబంధముచేత తిక్త రసమునకు ప్రకాశము గలుగుచున్నది. తిక్త రసముయొక్క ప్రతీతియందు రసనముయొక్క వ్యాపారము భాసించుట లేదు. అందువలన తిక్త రసాధ్యాసమునందు రాసనత్వ వ్యవహార మప్రామాణికమై యున్నది. ఈపక్షమునందు తిక్త రసాధ్యాసము కేవల మర్థాధ్యాసమై యున్నది తిక్త రసాకారావిద్యయొక్క వృత్తి నిష్ఫలమైనందున నంగీకరింపలేదు. ఈరీతిగా కొందఱు గ్రంథకారులు మధుర క్షీరమును తిక్త రసాధ్యాసమునకు నధిష్ఠానముగా నంగీకరించి మధురదుగ్ధ గోచరత్వాచవృత్తియందు నభివ్యక్తసాక్షిచేత తిక్త రసమునకు ప్రకాశ మంగీకరించి తిక్త రస గోచరవృత్తి నంగీకరింప లేదు.

ఈలేఖన మసంగతమై యున్నది. ఎట్లన స్వాకారవృత్తియం దభివ్యక్తచేతనముచేత విషయమునకు ప్రకాశము గలుగుచున్నది. అన్యాకారవృత్తియం దభివ్యక్తచేతనముచేత స్వసంబంధి విషయమునకు ప్రకాశ మంగీకరించినయెడల రూపవద్ఘటాకారవృత్తియం దభివ్యక్తచేతనముచేత ఘటగత పరిమాణ సంఖ్యాదికముయొక్క ప్రతీతి కావలయును. మఱియును. 'రూపవాన్ ఘటః' అను జ్ఞానము గలిగినను ఘటముయొక్క స్థూలతాదికమునకు ప్రకాశము గలుగుట లేదు. మధురదుగ్ధాకారత్వాచవృత్తియందు నభివ్యక్తచేతనముచేత శ్వైత్యమునకు ప్రకాశము సంభవించుటలేదు. అయిన దోషమునకు నద్భుతమహిమ యంగీకరింపబడి యున్నది. అందువలన దోషదుష్టేంద్రియజన్యవృత్తియందు నభివ్యక్తసాక్షిచేత వృత్త్యగోచరమునకు, నొకప్పుడు చేతనసంబంధికిని ప్రకాశము నంగీకరించినయెడల యథాకథంచిత్ ఉక్తలేఖనముకూడ సంభవించుచున్నది. రూపవద్ఘటాకారవృత్తి దోషజన్యముకాదు. అందువలన నావృత్తికగోచర పరిమాణాదికమునకు నావృత్తియం దభివ్యక్త చేతనముచేత ప్రకాశము గలుగుట లేదు.

133. ముఖ్యసిద్ధాంతకథనము.

ముఖ్యసిద్ధాంత మే మనగా, ఎట్లు స్వప్నావస్థయందు పదార్థము సాక్షిభాస్యమై యున్నదో దానియందు చాక్షుషత్వ, రాసనత్వాది ప్రతీతియు నున్నదో అట్లు సర్పరజతాదికము అనిర్వచనీయ పదార్థమై సాక్షిభాస్యమై యున్నది. వానియందు చాక్షుషత్వాది ప్రతీతి భ్రమమై యున్నది. కేవల సర్పరజతాదికమే సాక్షి భాస్యముకాదు, ఇక నేమనగా, అనాత్మపదార్థము సాక్షిభాస్యమై యున్నది. స్వప్నమువలె ఘటాది ప్రమేయమును, నేత్రాదిప్రమాణముచేత నేత్రాదికమునకు ఘటాదికముతో సంబంధమును, ఏకకాలమునం దుత్పన్నమగుచున్నవి. అందువలన వానికి పరస్పర ప్రమాణప్రమేయ భావము సంభవించుటలేదు, మఱియును ప్రతీతమై యున్నది. అందువలన ననిర్వచనీయమై యున్నది. ఇది సిద్ధాంతమై యున్నది. వ్యావహారిక ప్రపంచమునకు మిథ్యాత్వసిద్ధికి నుపయోగియగు సాక్షిభాస్యత్వమునకు సాధకము మిథ్యాసర్పాదికము దృష్టాంతమై యున్నది. వానికి నైంద్రియికత్వము నంగీకరించినయెడల సిద్ధాంతమునకు సాధకమగు దృష్టాంతము ప్రతికూలమగును. అందువలన నుపాధ్యాయులమతము సిద్ధాంత విరోధమై యున్నది.

అధ్యస్తపదార్థమునకు నైంద్రియికత్వము నంగీకరింపనియెడల ఆకాశము నందు నీలతాధ్యాసమునకు ననుపపత్తి యున్నది. ధర్మిజ్ఞానవాదమునందు ఈ దోషము నిరాకరణీయమై యున్నది. ఎట్లన, ఆకాశము నీరూపమై యున్నది. అందువలన నేత్రముచేత నాకాశముయొక్క సామాన్యజ్ఞానము సంభవించుట లేదు. సామాన్యజ్ఞానము సంభవించినయెడల నీలతాధ్యాసము గలుగుచున్నది. ఉపాధ్యాయ మతమునందు ఆకాశముతో నేత్రమునకు సంయోగము గలిగి యా కాశావచ్ఛిన్నచేతనస్థావిద్యయందు క్షోభద్వారా నీలరూపమునకు నుత్పత్తి యును, నీలరూపవిశిష్టాకాశగోచర నేత్రసంయోగజ న్యాంతఃకరణముయొక్క చాక్షుషవృత్తియును, ఏకకాలమునందు గలుగుచున్నవి. అందువలన నాకాశము నందు నీలతాధ్యాసమునకు సంభవ మున్నది.

**134. ధర్మిజ్ఞానవాదమునందు నాకాశమునందు నీలతాధ్యాసమునకు నసంభవదోషము, దానియొక్క పరిహారమును.**

తథాపి, ధర్మిజ్ఞాన వాదమునందు ఈయాధ్యాసమునకు ననుపపత్తి లేదు. ఎట్లన, యద్యపి ఆకాశము నీరూపమై యున్నది. తథాపి ఆలోకద్రవ్యము రూప సహితమై యున్నది. అందువలన నాలోకముతో దుష్టనేత్రమునకు సంయోగము గలిగి యాలోకగోచ రాలోకవ్యాపి ఆకాశాకార ప్రమారూప సామాన్య జ్ఞానము గలుగుచున్నది. తదనంతరము ఆకాశావచ్ఛిన్న చేతనస్థావిద్యయందు క్షోభద్వారా నీలరూపాకారావిద్యయొక్క పరిణామము గలుగుచున్నది. ఈరీతిగానే ఇదమాకారవృత్త్యవచ్ఛిన్న చేతనస్థావిద్యయొక్క నీలరూపగోచర జ్ఞానాకార పరిణామము గలుగుచున్నది. ఆకాశగోచర ప్రమావృత్తియును నీలరూపగోచ రావిద్యావృత్తియును నేకదేశమునం దుండుటవలన నుభయ వృత్త్యుపహితసాక్షి ఏకమై యున్నది. అందువలన నధిష్ఠానాధ్యస్తములకు నేక సాక్షిచేత ప్రకాశము గలుగుచున్నది. యద్యపి విశేషరూపముగా నధిష్ఠాన జ్ఞానము గలిగినయెడల నధ్యాసము సంభవించుట లేదు. ఆకాశాకార ప్రమా వృత్త్యనంతరము అధ్యాసము చెప్పబడినది. అచ్చట నాకాశత్వరూపముచేత నాకాశజ్ఞానము నధ్యాసమునకు హేతువునుగా జెప్పినయెడల విశేషరూపము యొక్క జ్ఞానము అధ్యాసమునకు హేతువుగా బ్రతీతమగుచున్నది. అది యసం గతమై యున్నది. తథాపి ఆకాశత్వరూపముచేత నాకాశముయొక్క జ్ఞానము కూడ సామాన్యజ్ఞానమై యున్నది గాని విశేషజ్ఞానము కాదు. "నీరూప

ఆకాశం" అను నీరూపత్వవిశిష్టాకాశముయొక్క జ్ఞానమే విశేషజ్ఞానమై యున్నది. ఎట్లన, అధ్యాసకాలమునందు నప్రతీతమైన యంశము విశేషాంశ మనంబడును. అది యనధిష్ఠాన మనంబడును. అధ్యాసకాలమునందు ప్రతీతాంశము సామాన్యాంశ మనంబడును. అది యాధార మనంబడును. "ఆకాశం నీలం" అను నీ భ్రాంతికాలమునందు నాకాశత్వరూపముతోను నాకార ప్రతీతి గలుగుచున్నది. "నీరూప మాకాశం" అను నీరూపత్వధర్మముతో నాకాశముయొక్క ప్రతీతి భ్రాంతికాలమునందు గలుగుట లేదు. అందువలన నాకాశత్వరూపముతో నాకాశముయొక్క జ్ఞానము కూడ సామాన్యజ్ఞానమై యుండుటవలన తదనంతరమున నీలరూపముయొక్క యధ్యాసము సంభవించుచున్నది.

### 135. సర్పాదిభ్రమ స్థలమునందు నాలుగు మతములు, చతుర్థమతము నందు దోషము.

ఈరీతిగా సర్ప రజతాదికభ్రమ గలిగినచోట మూడుమతము లున్నవి. ఒకటి యుపాధ్యాయుని మతము. ఆమతమునందు నొక్కటె జ్ఞానము దుష్టేంద్రియ విషయములయొక్క సంబంధముచేత నంతఃకరణపరిణామ రూపమై యున్నది. ఈజ్ఞానము అధిష్ఠానముయొక్క సామాన్యాంశమును, నధ్యస్తాంశమును, విషయీకరించుభ్రమరూపమై యున్నది. దానికంటె వేఱు అధిష్ఠానముయొక్క సామాన్యాంశమాత్ర గోచరప్రమాజ్ఞానము ఆయన మతమునం దంగీకరింపబడ లేదు. ధర్మిజ్ఞానవాదమునందు రెండు మతము లున్నవి. ఒక మతమునందు నిదమాకార సామాన్యజ్ఞానప్రమా రూపజ్ఞానానంతరమునందు "అయం సర్పః ఇదం రజతం" అను నీరీతిగా భ్రమజ్ఞానము గలుగుచున్నది. అది యవిద్యాపరిణామ రూపమై యున్నది. మఱియు నధిష్ఠానముయొక్క సామాన్యాంశమును విషయీకరించుచున్నదై యధ్యస్తమును విషయీకరించుచున్నది. అందువలన నిదమాకారమై యధ్యస్తాకారమయ్యును ఉన్నది. ధర్మిజ్ఞాన వాదమునందు రెండవమతము ఇదమాకార సామాన్యజ్ఞానము అధ్యాసమునకు హేతువగు ప్రమారూపమై యున్నది. తదుత్తరక్షణమునందు సర్ప రజతాది గోచరావిద్యయొక్క పరిణామ జ్ఞానము కలుగుచున్నది. అది భ్రమరూపమై యున్నది. అందువలన నధిష్ఠానగోచరము కాదు. కేవలాధ్యస్తగోచరమై యున్నది. ఆ భ్రమజ్ఞానమునందు నిదంపదార్థ విషయకత్వము లేదు. తథాపి దానియొక్క యధిష్ఠానజ్ఞానమునందు నిదంపదార్థ విషయకత్వ మున్నది. దానియొక్క యనిర్వచనీయ సంబంధము భ్రమజ్ఞానమునం

దుత్పన్న మగుచున్నది. ఈరీతిగా కేవలాధ్యస్త పదార్థాకార భ్రమజ్ఞానము గలుగుచున్నది అను నీమతమే సమీచీనమై యున్నది.

ధర్మిజ్ఞానవాదమునందే కొందఱు గ్రంథకారులు మూడవపక్షము నంగీకరించి యున్నారు. అది యుక్తమేకదా. అధ్యాసమునకు హేతువు అధిష్ఠానముయొక్క సామాన్యజ్ఞానమై యున్నది, దానికంటె భిన్నమగు సర్పరజతాదిగోచరావిద్యయొక్క వృత్తి నిష్ఫలమై యున్నది. ఎట్లన, అధిష్ఠానగోచరాంతఃకరణముయొక్క యిదమాకారవృత్తిని అధ్యాసమునకు హేతువుగా నంగీకరించినయెడల ఆ వృత్తియం దభివ్యక్తచేతనముచేతనే సర్పరజతాదికమునకు ప్రకాశము కలుగుచున్నది. అందువలన సర్పరజతాదికము జ్ఞేయరూపమై యవిద్యాపరిణామమై యున్నది. అవిద్యయొక్క జ్ఞానరూప పరిణామము కలుగుట లేదు. ఈమతమునందును ఉపాధ్యాయమతమువలె శుక్తి రజతాదికమునందు కేవలాధ్యాస మున్నది. జ్ఞానాధ్యాస మంగీకరింపబడ లేదు. ఈమతముకూడ నుపాధ్యాయ మతమువలె సకలాచార్య వచనమునకును యుక్తికిని విరుద్ధమై యున్నది. ఎట్లన, ఈమతమునందు భ్రమజ్ఞానమునకు లోప మున్నది. ఇదమాకారమగు నేజ్ఞానమున్నదో అది యధిష్ఠానముతో నింద్రియసంయోగముచేత జన్యమగు నంతఃకరణముయొక్క వృత్తిరూపమై యున్నది. అధిష్ఠానగోచరమయ్యు నున్నది. అందువలన ప్రమయై యున్నది. దానికంటె భిన్నజ్ఞాన మంగీకరింపబడ లేదు. అందువలన భ్రమజ్ఞాన మప్రసిద్ధము కావలయును. యద్యపి అధిష్ఠానగోచరేదమాకార జ్ఞానమే సర్పరజతాదికమును విషయీకరించుచున్నది. అందువలన బాధితపదార్థగోచర మైనందున భ్రమ యనంబడును. తథాపి, ఈమతమునం దజ్ఞానమునకు నబాధితాధిష్ఠాన గోచరత్వ ముండుటవలన ప్రమాత్వము కూడ కావలయును. అందువలన నేకజ్ఞానమునందు భ్రమత్వ, ప్రమాత్వములకు సాంకర్యము కలుగును. యద్యపి సత్య రజతగోచరము, శుక్తి రజతగోచరము ఏకజ్ఞానముగా నుండుచోట భ్రమత్వ, ప్రమాత్వములయొక్క సాంకర్యము నప్రసిద్ధమై యున్నది. అందువలన నవచ్ఛేదక భేదమువలన నెట్లు ఏకపదార్థమునందు సంయోగము, సంయోగాభావము నగు విరోధపదార్థముకూడ ఉన్నదో అట్లు ఏకజ్ఞానమునందును నవచ్ఛేదక భేదమువలన భ్రమత్వ, ప్రమాత్వవిరోధి ధర్మములు సంభవించుచున్నవి. దృష్టాంతమునందు వృక్షవృత్తి సంయోగాభావమునకు నవచ్ఛేదకము మూలదేశమై యున్నది. సంయోగమున కవచ్ఛేదకము శాఖాదేశమై యున్నది ఈలా

గునసే జ్ఞానమునందును బాధిత విషయకత్వము భ్రమత్వమున కనచ్ఛేదకధర్మమై యున్నది. అబాధిత విషయకత్వము ప్రమాత్వమున కవచ్ఛేదక ధర్మమై యున్నది. అందువలన నొక్కటియగు జ్ఞానమునందు బాధిత విషయకత్వావచ్ఛిన్న భ్రమత్వము, అబాధిత విషయకత్వావచ్ఛిన్న ప్రమాత్వము కూడ నుండుటవలన భ్రమత్వ, ప్రమాత్వములకు సాంకర్య దోషములేదు. తథాపి భ్రమత్వ, ప్రమాత్వమువలె బాధితాబాధిత విషయకత్వములుకూడ పరస్పర భావాభావరూపములైనందున విరోధులై యున్నవి. వానికిని అవచ్ఛేదక భేదములేక యేకజ్ఞానమునందు సమావేశము సంభవించుట లేదు. వానికి నన్యావచ్ఛేదకము పలబ్ధమై లేదు. ఏదయిన నొకదానిని కల్పించినయెడల పరస్పర విరోధముగానే యన్యావచ్ఛేదకము సిద్ధించుచున్నది. అందువలన వానికి నన్యావచ్ఛేదకము నంగీకరించుటలో అనవస్థాదోషము కలుగును. ఈరీతిగా నేక జ్ఞానమునందు భ్రమత్వ, ప్రమాత్వములయొక్క సాంకర్యము సంభవించుట లేదు. మఱియును సత్య రజతగోచరమగు నేక జ్ఞానమునందు భ్రమత్వ, ప్రమాత్వములకు సాంకర్యము చెప్పబడి యున్నది. అదియును సిద్ధాంతజ్ఞానముచేత చెప్పబడినదియే. ఎట్లన, సత్య రజతగోచరము అంతఃకరణముయొక్క వృత్తియై యున్నది శుక్తి రజతగోచర మవిద్యయొక్క వృత్తియై యున్నది. అందువలన సత్య రజతగోచరము, శుక్తి రజతగోచరము నను జ్ఞానద్వయ మున్నది. ఆరెండు జ్ఞానములు సమానకాలమునం దుత్పన్నమై సజాతీయగోచరములై యున్నవి. అందువలన వానికి పరస్పర భేదము ప్రతీత మగుట లేదు. వానియం దేకత్వభ్రమ యున్నది. అందువలన భ్రమత్వ, ప్రమాత్వములయొక్క సాంకర్య మదృష్టగోచరమైనందున నిదమాకార ప్రమావృత్తియందు నభివ్యక్త సాక్షి చేత నధ్యస్తమునకు ప్రకాశము సంభవించుట లేదు. అధిష్ఠానాగోచర వృత్తియందు అభివ్యక్తసాక్షిచేతనే యధ్యస్తమునకు ప్రకాశము నంగీకరించి యధ్యస్తగోచరావిద్యావృత్తి నంగీకరింపనియెడల నధ్యస్త పదార్థములకు స్మృతి కాకపోవలయును. ఎట్లన, అనుభవనాశముచేత సంస్కారము గలుగుచున్నది. అన్యగోచరానుభవముచేత నన్యగోచర సంస్కారస్మృతి నంగీకరించినయెడల పటగోచరానుభవము చేత ఘటగోచర సంస్కారము, స్మృతియును కావలయును. అందు సమానగోచరానుభవముచేత సంస్కారద్వారా స్మృతి యుత్పన్నమగుచున్నది, అను నీనియమ ముండుటవలన నధిష్ఠానగోచర వృత్తిరూపానుభవముచేత నధ్యస్తగోచర సంస్కారద్వారా స్మృత్యుత్పత్తి కవ

కాశము లేదు. అధ్యస్తగోచరసాక్షి రూపానుభవముచేత సంస్కారద్వారా స్మృత్యుత్పత్తిని జెప్పినయెడల సర్వథా యసంగతమై యున్నది. ఎట్లన, అనుభవనాశముచేత సంస్కారము కలుగుచున్నది. సాక్షి నిత్యమై యున్నది. దానికి సంస్కారజనకత్వము సంభవింపదు. ఒకడు శంకించున దేమనగా, ఏవృత్తిచేత చేతనాభివ్యక్తిద్వారా ఏపదార్థమునకు ప్రకాశము గలుగుచున్నదో యావృత్తిచేత నాపదార్థగోచర సంస్కారముద్వారా స్మృతి కలుగుచున్నది. పటగోచరవృత్తియం దభివ్యక్తచేతనముచేత ఘటప్రకాశ మగుట లేదు. అందువలన పటగోచరానుభవముచేత ఘటగోచర సంస్కారద్వారా స్మృత్యాపత్తి లేదు. అధిష్ఠాన గోచరాంతఃకరణముయొక్క ఇదమాకారవృత్తియం దభివ్యక్తచేతనముచేత నధ్యస్తమునకు ప్రకాశము కలుగుచున్నది. అందువలన నధిష్ఠానగోచ రేదమాకారప్రమచేత నధ్యస్తగోచర సంస్కారద్వారా స్మృతి కలుగుటవలన నధ్యస్తగోచరావిద్యావృత్త్యంగీకారము నిష్ఫలమై యున్నది. ఇట్లు చెప్పుట యసంగతము. ఎట్లన, అధిష్ఠానగోచరేదమాకార జ్ఞానముచేత నధ్యస్తమునకు ప్రకాశము నంగీకరించువాని నడుగవలసిన దేమనగా, ఇదమాకారజ్ఞానము, అధ్యస్తాకారముగా నున్నదా? లేక లేదా? అధ్యస్తాకారముగా నుండిన యెడల నది సంభవింపదు. ఎట్లన, ప్రత్యక్షజ్ఞానమునందు నాకారసమర్పణమునకు హేతువు విషయమై యున్నది. ఇదమాకార జ్ఞానోత్తరక్షణమునందు నధ్యస్తపదార్థమున కుత్పత్తి యుండుటవలన భావి విషయముచేత ప్రత్యక్షజ్ఞానమునందు స్వాకార సమర్పణము సంభవింపదు. అందువలన నిదమాకారజ్ఞానమునకు నధ్యస్తాకారత్వము సంభవింపదు. ద్వితీయపక్షము కూడ నసంగతమై యున్నది. ఎట్లన, అన్యాకారవృత్తియం దభివ్యక్తసాక్షిచేత నన్యవిషయమునకు ప్రకాశము కలుగుటలేదని పూర్వమునందు జెప్పంబడి యున్నది. ఇదమాకారవృత్తియం దభివ్యక్తసాక్షి సంబంధముచేత నాకారసమర్పణ మజనకమైన దానికిని (అధ్యస్తమునకు) ప్రకాశము నంగీకరించిన యెడల నిదమాకారవృత్తియందు నభివ్యక్తసాక్షియొక్క సంబంధి యగు నేయధిష్ఠానముయొక్క విశేషాంశ మున్నదో దానికి ప్రకాశము కావలయును, అందువలన నిదమాకార సామాన్యజ్ఞానముకంటె భిన్న మగు నవిద్యయొక్క పరిణామ రూపాధ్యస్తాకారవృత్తి రూపజ్ఞాన మవశ్యాంగీకరణీయమై యున్నది. దానియందును రెండుపక్షము లున్నవి. వానిలో నధిష్ఠానగోచరమయ్యును, అధ్యస్తగోచరమయ్యును, అనిర్వచనీయజ్ఞాన మున్నది, అను నీప్రథమ

పక్షము సమీచీనము కాదని పూర్వమునందు చెప్పఁబడియున్నది. అనిర్వచనీయ మిథ్యాజ్ఞానము ఉభయగోచరముగా నంగీకరించినయెడల ప్రమాత్వ, భ్రమత్వ ములకు సాంకర్యదోషము కలుగును, అందువలన నిదమాకార సామాన్య జ్ఞానోత్తరక్షణమునందు కేవలాధ్యస్తగోచరావిద్యయొక్క వృత్తి కలుగుచున్నది. ఎట్లు సర్ప రజతాదికము మిథ్యయై యున్నదో అట్లు దానియొక్క జ్ఞానమును మిథ్యయై యున్నది. అందువలన సర్ప రజతాదికముయొక్క బాధవలె దాని యొక్క జ్ఞానమునకును బాధ కలుగుచున్నది. ఇదమాకార ప్రమావృత్తియం దభివ్యక్తసాక్షిచేతనే యధ్యస్తమునకు ప్రకాశము నంగీకరించినయెడల సాక్షి సర్వదా యబాధ్యమై యున్నది. ఇదమాకారవృత్తికూడ నంతఃకరణముయొక్క పరిణామమైనందున ఘటాది జ్ఞానమువలె వ్యవహారకాలమునం దబాధ్యమై యున్నది. అందువలన బ్రహ్మజ్ఞానము లేకయే యధ్యస్త జ్ఞానమునకు బాధ కాకపోవలయును.

**136. అనిర్వచనీయ ఖ్యాతియందు జెప్పబడిన నాలుగు మతములయొక్క యనువాదము వాని సమాప్తి పర్యవసానము.**

ఈరీతిగా సర్పరజతాది గోచర భ్రమ యుండినచోట సిద్ధాంతమం దనిర్వచనీయఖ్యాతి చెప్పబడియున్నది. దానిలో నాలుగు పక్షము లున్నవి. (1) నవి తార్కిక చక్రవర్తి నరసింహభట్టోపాధ్యాయమతము; దానియం దధిష్ఠానముతో నింద్రియసంబాధమే యధ్యాసమునకు హేతువై యున్నది. అధిష్ఠానముయొక్క సామాన్య జ్ఞానము హేతువు కాదు. అన్యాచార్యులయొక్క మతములందు అధిష్ఠానముయొక్క సామాన్య జ్ఞానము అధ్యాసమునకు హేతువై యున్నది. సామాన్య జ్ఞానము ధర్మిజ్ఞాన మనంబడును. ఉపాధ్యాయ మతమునకంటె భిన్నములగు మూడుమతములందును సామాన్యజ్ఞానమున కధ్యాస కారణత్వ మంగీకరింపబడి యున్నది. అందువలన మూడు మతములు ధర్మిజ్ఞాన వాదులై యున్నవి. వానిలో నధ్యస్తపదార్థాకారముగానే యవిద్యయొక్క వృత్తిరూప భ్రమజ్ఞానము గలుగుచున్నది, అను నీ పక్షమే సమీచీనమై యున్నది. మఱియు నధిష్ఠాన గోచరేదమాకారమయ్యును, అధ్యస్తాకారమయ్యును, ఉండెడి యవిద్యయొక్క వృత్తి కలుగుచున్నది అను నీపక్షము ఇదమాకార వృత్తిరూపమైన యే సామాన్య జ్ఞానము అధ్యాసమునకు హేతువై యున్నదో దానిచేతనే నిర్వహింపబడుచున్నది. అధ్యస్త గోచరావిద్యయొక్క వృత్త్యనంగీకారపక్షము సమీచీ

నముకాదు. ఈరీతిగానే అధ్యాసమునకు హేతువగు సామాన్యజ్ఞానానంగీకార మగు నుపాధ్యాయులవారి పక్షము సమీచీనము కాదు. ఈరీతిగా ప్రాచీన గ్రంథకారులచేత నేది వ్రాయబడి యున్నదో తదనుసారముగానే మాచేతను దూషణ భూషణములు వ్రాయబడియున్నవి. మఱియు నొకనియొక్క బుద్ధి బలము చేత విచారించిన యెడల ఈనాలుగు మతములందును దూషణ భూషణములు సమానములై యున్నవి. ప్రపంచ మిథ్యాత్వ సాధనమునందు నద్వైత వాదమున కభినివేశ మున్నది. అవాంతర మతభేద ప్రతిపాదనమునందైనను ఖండనము నందైనను అభినివేశములేదు. ఒకటే యగు మతమునం దనుకూల మగు యుక్తి మాచేత వ్రాయంబడియున్నది. అది ప్రాచీనాచార్యులయొక్క మార్గముచేత నుత్పథ గమనమునకు నిరోధార్థముగా వ్రాయంబడియున్నది

శ్లో. దోహా=నిశ్చల బీనకినహుంనలిఖీ; భాషామేయ హారీతీ,
ఖ్యాతి అనిర్వచనీయకీ పేమహు సుజనప్రీతీ ॥

137. శాస్త్రాంతరమునందు నుక్తపంచఖ్యాతియొక్క నామములు.—

శాస్త్రాంతరమునందు భ్రమయొక్క యేలక్షణము, స్వరూపము చెప్ప బడి యున్నవో వానికంటె విలక్షణముగానే భ్రమయొక్క లక్షణస్వరూపములు చెప్పబడియున్నవి. ఈ యర్థమును తెలియుటకొఱకు శాస్త్రాంతర భ్రమయొక్క స్వరూపము భాష్యమునందు చెప్పబడియున్నది. దానియొక్క నిరూపణము, ఖండనముకూడ చేయబడియున్నది. శుక్తియందు రజతభ్రమ గలిగిన చోట సిద్ధాంతపక్షము గాక పంచమతము లున్నవి. (1) సత్ఖ్యాతి; (2) అసత్ఖ్యాతి; (3) ఆత్మఖ్యాతి; (4) అన్యథాఖ్యాతి; (5) అఖ్యాతి. ఇవి భ్రమయొక్క నామములై యున్నవి. సర్వమతములయందును పంచనామములమధ్యలో నన్యతమ నామము భ్రమకు ప్రసిద్ధమై యున్నది.

138. మొదలుకొని 144 వఱకు సత్ఖ్యాతిక్రమము. వానిలో సత్ఖ్యాతి వాదియొక్క సిద్ధాంత మే మనగా, శుక్తియొక్క యవయవముతోకూడ రజతా వయవము సర్వదా యున్నది. ఎట్లు శుక్త్యవయవము సత్యమై యున్నదో అట్లు రజతావయవము కూడ సత్యమై యున్నది, మిథ్యకాదు. ఎట్లు దోష సహిత నేత్రముయొక్క సంబంధముచేత సిద్ధాంతమునందు నవిద్యాపరిణామరూప మగు ననిర్వచనీయరజత ముత్పన్నమగుచున్నదో అట్లు దోషసహిత నేత్ర సంబంధముచేత రజతావయవముచేత సత్యరజత ముత్పన్నమగుచున్నది.

అధిష్ఠానజ్ఞానముచేత నెట్లు అనిర్వచనీయ రజతమునకు నివృత్తి సిద్ధాంతము నందు గలుగుచున్నదో అట్లు శుక్తిజ్ఞానముచేత సత్యరజతమునకు తనయొక్క యవయవమునందు ధ్వంసము గలుగుచున్నది.

139. సత్ఖ్యాతి వాదఖండనము.

ఈ సత్ఖ్యాతి వాదిమతము నిరాకరణీయమై యున్నది. ఎట్లన, శుక్తిరజత దృష్టాంతముచేత ప్రపంచమునకు మిథ్యాత్వానుమితి గలుగుచున్నది. సత్ఖ్యాతి వాదమునందు శుక్తియందు రజతము సత్యమై యున్నది, దానిని దృష్టాంతముగా గ్రహించి ప్రపంచమునందు మిథ్యాత్వము సిద్ధించుటలేదు, అందువలన నీపక్షము నిరాదరణీయమై యున్నది. ఈ పక్షమునందు దోషమేమనగా, శుక్తిజ్ఞానానంత రమునందు కాలత్రయమునందును శుక్తియందు రజతము లేదను నీరీతిగా శుక్తి యందు త్రైకాలిక రజతాభావము ప్రతీతమగుచున్నది. సిద్ధాంతమునందును అనిర్వచనీయరజతము మధ్యకాలమునం దుత్పన్నమైనది. వ్యావహారికరజతాభా వము త్రైకాలికమై యున్నది. సత్ఖ్యాతివాది మతమునందు వ్యావహారిక రజత మున్నది. ఆకాలమునందు వ్యావహారిక రజతాభావము సంభవించుటలేదు. అందు వలన త్రైకాలిక రజతాభావ ప్రతీతికి వ్యావహారిక రజతకథనము విరుద్ధమై యున్నది. అనిర్వచనీయ రజతముయొక్క యుత్పత్తియందు ప్రసిద్ధరజతము యొక్క సామగ్రి యగత్యములేదు, దోషసహితమగు నవిద్యచేత దానియొక్క యుత్పత్తి సంభవించుచున్నది. వ్యావహారిక రజతోత్పత్తి యయిననో రజత ముయొక్క ప్రసిద్ధసామగ్రి లేక సంభవించుట లేదు. శుక్తి దేశమునందు రజత ముయొక్క ప్రసిద్ధసామగ్రి లేదు. అందువలన సత్యరజతముయొక్క యుత్పత్తి శుక్తిదేశమునందు సంభవింపదు.

140. శుక్తియందు సత్యరజతముయొక్క సామగ్రియొక్క యంగీకారము. తత్ఖండనము.

శుక్తి దేశమునందు రజతావయవ మున్నది. అది సత్యరజత సామగ్రియై యున్నదని చెప్పువాని నడుగవలసిన దేమనగా, రజతావయవమునకు నుద్భూత రూప మున్నదా? అనుద్భూతరూప మున్నదా? ఉద్భూతరూప మున్నదని చెప్పిన యెడల రజతావయవమునకును రజతోత్పత్తికంటె పూర్వమునందు ప్రత్యక్షము కావలయును, అనుద్భూతరూప మున్నదని చెప్పినయెడల అనుద్భూతరూప సహితావయవముచేత రజతముకూడ అనుద్భూతరూపసహితముగానే యుత్ప

న్నము కావలయును, అందువలన రజతముయొక్క ప్రత్యక్షము కాకపోవల యును. మఱియును ఉద్భూతరూపవత్ త్ర్యణుకారంభకద్వ్యణుకమునందు అను ద్భూతరూపము లేదు, ఉద్భూతరూప మున్నది ద్వ్యణుకమునందు మహత్త్వము లేదు. అందువలన నుద్భూతరూప ముండినను ద్వ్యణుకప్రత్యక్షము గలుగుట లేదు. మఱియును ద్వ్యణుకమాత్రమునం దేయుద్భూతరూపము లేదు. పర మాణువునందును నైయాయికునిచే నుద్భూతరూప మంగీకరింపబడియున్నది.

మఱియును, ద్వ్యణుకమువలె రజతావయవముకూడ ఉద్భూతరూప సహితమై యుండినను మహత్త్వశూన్యమై యున్నది, అందువలన రజతావయవ మునకు ప్రత్యక్షము కలుగుటలేదు, అని చెప్పినయెడల అదియు కూడ సంభవిం పదు. ఎట్లన, మహత్పరిమాణమునకు నాలుగుభేదము లున్నవి. ఆకాశాదికము నందు పరమ మహత్పరిమాణ మున్నది పరమ మహత్పరిమాణ విశిష్టమే నై యాయికునిచే విభువుగా చెప్పబడుచున్నది. విభువుకంటె భిన్నమగు పటాదిక మునందు నపకృష్టమహత్పరిమాణ మున్నది. మఱియును సర్షపాదికమునందు నపకృష్టతరమహత్పరిమాణ మున్నది. త్ర్యణుకమునందు నపకృష్టతమ మహత్పరి మాణ మున్నది. రజతావయవముకూడ మహత్పరిమాణశూన్యమైనయెడల ద్వ్య ణుకముచేత నారబ్ధమగు త్ర్యణుకమువలె మహత్త్వశూన్యావయవముచేత నారబ్ధ మగు రజతాదికముకూడ నపకృష్టతమ మహత్పరిమాణసహితముగానే కావల యును. అందువలన రజతావయవము మహత్త్వశూన్యమై యున్నది, అని చెప్పుట సంభవింపదు. రజతావయవమునందు మహత్త్వాభావమును జెప్పినయెడల నేరీతి గా సంభవించినను ఎచ్చట వల్మీకమునందు ఘటభ్రమ గలుగుచున్నదో అచ్చటను ఘటావయవములను, కపాలములను అంగీకరింపవలయును. మఱియు నెచ్చట స్థాణువునందు పురుషభ్రమ కలుగుచున్నదో యచ్చట స్థాణువునందు పురుషా వయవమగు హస్తపాదాదికము నంగీకరింపవలయును. కపాలమును, హస్తపా దాదికమును, మహత్త్వశూన్యముగా సంభవింపవు. రజతత్వజాతి అణుసాధారణ మై యున్నది. అందువలన సూక్ష్మావయవమునందును రజత వ్యవహారము సంభవిం చుచున్నది. ఘటత్వ, కపాలత్వ, హస్తపాదత్వ, పురుషత్వాది జాతులు మహా వయవమాత్ర వృత్తులై యున్నవి. దానియొక్క సూక్ష్మావయవమునందు, కపాల త్వాదిజాతి సంభవింపదు, అందువలన భ్రమాధిష్ఠాన దేశమునందు నారోపితము యొక్క వ్యావహారికావయవముండినయెడల దానియొక్క ప్రతీతికావలయును.

అందువలన వ్యావహారికావయవముచేత రజతాదికమున కుత్పత్తికథన మసంగతమై యున్నది.

**141.** సత్ఖ్యాతి వాదికృతోక్త దోషముయొక్క పరిహారము తత్ఖండనము.

సత్ఖ్యాతి వాది చెప్పునది యేమనగా, శుక్తిదేశమునందు రజతముయొక్క సాక్షాదవయవము లేదు. అవయవముయొక్క యవయవ మగు పరమసూక్ష్మద్వ్యణుకము లేక పరమాణువు ఉన్నది. ఈరీతిగనే వల్మీకదేశమునందు ఘటముయొక్కయు, స్థాణుదేశమునందు పురుషునియొక్కయు, సాక్షాదవయవముయొక్క యవయవ మగు పరమసూక్ష్మద్వ్యణుకము లేక పరమాణువు ఉన్నది. దోషసహిత నేత్రముయొక్క సంబంధముచేత ఝుడితి అవయవి ధారోత్పత్తి గలిగి రజతఘట పురుషు లుత్పన్ను లగుదురు. దోషముయొక్క యద్భుతమాహాత్మ్యముచేత నిట్లు వేగముగా త్ర్యణుకాదికముయొక్క ధార యుత్పన్న మగుచున్నది. అందువలన మధ్యావయవి యగు కపాల, హస్త, పాదాదికము ప్రతీత మగుట లేదు. అంత్యావయవి ఘటాదికముయొక్క యుత్పత్త్యనంతరము కపాలాదికముయొక్క ప్రతీతి ఎచ్చట గలుగుటలేదు. అందువలన భ్రమాధిష్ఠానమునందు నారోపితముయొక్క యవయవము ప్రతీతమగుట లేదు. రజతముయొక్కయు, రజతాదికముయొక్కయు వ్యావహారికావయవ మున్నది. అథవా శుక్తిదేశమునందు రజతముయొక్క మహదవయవ మున్నది. మఱియును వల్మీకదేశమునందు ఘటముయొక్క యవయవ మగు కపాల మున్నది. స్థాణుదేశమునందు పురుషునియొక్క యవయవమగు హస్త, పాదాదిక మున్నది. ఈరీతిగా భ్రమాధిష్ఠానమునందు నారోపితముయొక్క యవయవ మున్నది. అయినను నధిష్ఠానముయొక్క విశేషరూపముతో ప్రతీతి యవయవముయొక్క ప్రతీతికి ప్రతిబంధకమై యున్నది. అందువలన విద్యమాన మహదవయవముయొక్క ప్రత్యక్షము గలుగుట లేదు. ఈరీతిగా సత్ఖ్యాదివాదియొక్క సమాధానము సరికాదు. ఎట్లన, శుక్తి దేశమునందు వ్యావహారిక రజతోత్పత్తిని అంగీకరించినను అనుభవానురోధముగా రజతముయొక్క నివృత్తి శుక్తిజ్ఞానముచేతనే యంగీకరింప వలయును

**142.** రజతజ్ఞానముయొక్క నివృత్తిచేత, ప్రాతిభాసిక, వ్యావహారిక, రజతములకు నివృత్తియు, వానిఖండనము

సత్ఖ్యాతివాది చెప్పునదేమనగా, రజతనివృత్తియందు శుక్తిజ్ఞానముయొక్క యపేక్ష లేదు. ఇక నేమనగా, రజతజ్ఞానాభావముచేతనే రజతనివృత్తి గలుగు

చున్నది; ఎంతకాలపర్యంతము రజతజ్ఞాన మున్నదో అంతకాల పర్యంతము రజత మున్నది; రజతజ్ఞానము లేనప్పుడు రజతమునకు నివృత్తి గలుగుచున్నది; శుక్తి జ్ఞానము కొన్ని స్థలములయందు రజతజ్ఞానమునకు నివర్తకమై యున్నది. కొన్ని స్థలములయందు శుక్తిజ్ఞానము లేకయే అన్యపదార్థముయొక్క జ్ఞానముచేత రజత జ్ఞానమునకు నివృత్తిగలుగుచున్నది; ఆరజతజ్ఞానముయొక్క నివృత్త్యుత్తరక్షణము నందు రజతమునకు నివృత్తిగలుగుచున్నది. అథవా రజతజ్ఞానమునకు దేనిచేత నివృత్తి గలుగుచున్నదో దానిచేతనే రజతజ్ఞాననివృత్తి క్షణమునందు రజతమునకు నివృత్తి గలుగుచున్నది. ఈరీతిగా జ్ఞానకాలమునందే రజతమునకు స్థితియుండుట వలన యద్యపి ప్రాతిభాసికముగానే రజతాదిక మున్నది. తథాపి అనిర్వచనీయము కాదు. వ్యావహారిక సత్యమై యున్నది. ఎట్లు సిద్ధాంతమునందు సుఖాదికము ప్రాతిభాసికమై యున్నను స్వప్నసుఖాదికముకంటె విలక్షణమై వ్యావహారికమై యంగీకరింపబడి యున్నదో మఱియును న్యాయమతమునందు ద్విత్వాదికము ప్రాతిభాసికమైనను వ్యావహారిక సత్యముగా నంగీకరింపబడి యున్నదో అట్లు రజ తాదికము ప్రాతిభాసికమైనను వ్యావహారిక సత్యమై యున్నది. ఈరీతిగా రజత జ్ఞానముయొక్క నివృత్త్యుత్తరక్షణమునందు రజతాదికముయొక్క నివృత్తిగలుగు చున్నది. అథవా రజతజ్ఞానమునకు నివర్తక మగు నేశుక్తిజ్ఞాన మున్నదో లేక పదార్థాంతరజ్ఞాన మున్నదో దానిచేతనే రజతజ్ఞాన నివృత్తిక్షణమునందు రజత మునకు నివృత్తి గలుగుచున్నది. శుక్తిజ్ఞానముచేతనే రజతనివృత్తి గలుగవలయు నను నియమము లేదు.

ఇట్లు చెప్పినయెడల లోకానుభవమునకు విరోధమగును, సకలశాస్త్ర మునకును విరోధమగును, సిద్ధాంతమునకు త్యాగ మగును, యుక్తికిని విరోధ మగును. ఎట్లన, శుక్తిజ్ఞానముచేత రజతభ్రమనివృత్తి గలుగుచున్నదని సకల లోకప్రసిద్ధమై యున్నది, సకలశాస్త్రప్రసిద్ధమై యున్నది. సత్ఖ్యాతివాదికిని నిదియు సిద్ధాంతమై యున్నది. సత్ఖ్యాతివాదియొక్క మతమునందు విశేష రూపముతో శుక్తియొక్క జ్ఞానము రజతావయవజ్ఞానమునకు ప్రతిబంధకమై యున్నది. అందువలన రజతావయవజ్ఞానమునకు విరోధిగా శుక్తిజ్ఞానము నిర్ణీత మై యున్నది. రజతావయవప్రతీతికి విరోధి యగు శుక్తిజ్ఞానమే రజతాజ్ఞానమునకు విరోధిగా నంగీకరించుట క్లుప్తకల్పనమై యున్నది. నిర్ణీతము క్లుప్తమనంబడును. శుక్తిజ్ఞానము లేకయే అన్యముచేత రజతజ్ఞానమునకు నివృత్తినంగీకరించినయెడల

అన్య ప్తకల్పనయ యగును, ఈరీతిగా క్లప్తకల్పన యోగ్యమై యున్నది. ఈయుక్తిచే తను కూడ విరోధముగా నున్నది. అందువలన శుక్తిజ్ఞానముచేతనే రజతమునకును, దానియొక్క జ్ఞానమునకును నివృత్తి నంగీకరించుట యోగ్యమై యున్నది.

143. సత్ఖ్యాతివాదమునందు ప్రబలదోషము.

పూర్వోక్తరీతిగా రజతజ్ఞానాభావముచేత రజతమునకు నివృత్తి నంగీకరించి రజతజ్ఞానముయొక్క నివృత్తికి ననేకసాధనము నంగీకరించినను వక్ష్యమాణ దోషముచేత సత్ఖ్యాతివాదమునకు నుద్ధారము గలుగుట లేదు. ఆ దోషము ఎద్దియనగా, ఏశుక్తియందు నేక్షణమునందు రజతభ్రమ గలిగియున్నదో యాక్షణమునందు శుక్తితో నగ్నిసంయోగముగలిగి యుత్తరక్షణమునందు శుక్తినాశము గలిగినదై భస్మీకృతమైయున్నదో అచ్చట రజతజ్ఞానమునకు నివృత్తిసాధనమేదియు లేదు. అందువలన శుక్తిధ్వంసభస్మోత్పత్తికి పూర్వమునందు రజత నివృత్తి లేనందున భస్మదేశమునందు రజతలాభము కావలయును. ఎట్లన, రజతద్రవ్యము తైజసమై యున్నది. దానికి గంధాదిసంబంధములేక ధ్వంసముకలుగుటలేదు, అందువలన భ్రమస్థానమునందు వ్యావహారిక రజతరూపసత్పదార్థముయొక్క ఖ్యాతి యున్నదను నీసత్ఖ్యాతివాద మసంగతమై యున్నది. మఱియు నెచ్చట నేక రజ్జువునందు దశపురుషులకు భిన్నభిన్నపదార్థభ్రమ గలుగుచున్నదో కొందఱకు దండముయొక్క కొందఱకు మాలయొక్క కొందఱకు సర్పముయొక్క కొందఱకు జలధారయొక్క ఇత్యాదిపదార్థములయొక్క యవయవములు స్వల్ప రజ్జుదేశమునందు సంభవింపవు. ఎట్లన, మూర్తద్రవ్యముయొక్క స్థానమునకు నిరోధము చేయబడుచున్నది. అందువలన స్వల్పదేశమునందు ఇంత పదార్థములయొక్క యవయవములు సంభవింపవు. మఱియును భ్రమకాలమునందు దండాద్యవయవి స్వల్పదేశమునందు సర్వదా సంభవింపదు. మఱియును సిద్ధాంతమునందైననో యనిర్వచనీయదండాదికము వ్యావహారిక దేశమునకు నిరోధమును చేయుటలేదు. సత్ఖ్యాతివాదియు కూడ నాదండాదికమునందు శ్వాస నిరోధాదిఫలము నంగీకరింపని యెడల దండాదికమును "సత్" అని చెప్పుట విరుద్ధమై యున్నది, నిష్ఫలమయ్యును ఉన్నది. దండాదికముయొక్క ప్రతీతి మాత్రము కలుగుచున్నది. అన్యకార్యము దానిచేత గలుగుటలేదు, అని చెప్పిన యెడల ననిర్వచనీయవాదమే సిద్ధమగుచున్నది.

మఱియును భ్రమస్థలమునందు సత్పదార్థోత్పత్తిని అంగీకరించినయెడల నంగారసహితోషరభూమియందు జలభ్రమ గలిగినచోట జలముచేత నంగారము శాంతము కావలయును, మఱియును తూలోపరి యుండెడిగుంజాపుంజమునందు నగ్నిభ్రమ గలిగినచోట తూలదాహము కావలయును. ఇక్కడ చెప్పునదేమనగా దోషసహిత కారణముచేత నుత్పన్నమగు పదార్థముకంటె నన్యమునకు బ్రతీతి గలుగుటలేదు. దేనికి దోషముచేత నుత్పత్తి యున్నదో దానికే ప్రతీతి గలుగుచున్నది. దోషకార్యమగు జలముచేత నగ్నిచేత నార్ద్రీభావము దాహము కూడ గలుగనియెడల దానికి సత్యత్వముజెప్పుట కేవల హాస్యహేతువై యున్నది. ఎట్లన అవయవము స్థాన నిరోధాదికమునకు హేతువు కాదు. అవయవిచేత యత్కించిత్కార్యము గలుగుటలేదు. ఇటుల నుండు పదార్థమునకు సత్యత్వమును జెప్పుట బుద్ధిమంతులకు హాస్యముగానున్నది. అందువలన సత్ఖ్యాతివాదియొక్క యుక్తి అసంభవమై యున్నది. సర్వథా యీ పక్షము నిర్యుక్తికమై యున్నది. అందువలన విచారసాగరమునందు సత్ఖ్యాతిలేదు. ఏ పక్షమునకు నేప్రకారముచేత నుపపాదనము జేసి తిరిగియు తర్కాదిబలముచేత ఖండన మున్నదో యా పక్షము వ్రాయవలసినది. సత్ఖ్యాతివాదముయొక్క యుపపాదనము సంభవింపదు. అందువలన నీగ్రంథమునందు లేఖనీయము గాదు. తథాపి సర్వథా లేఖనములేక అధ్యేతలకు భ్రమ గలుగును ఎట్లన గ్రంథకారులకు సత్ఖ్యాతివాదముయొక్క జ్ఞానములేదను నీభ్రమనివృత్తికొఱకు ఈ మాత్రము వ్రాయంబడియున్నది.

**144—148.** త్రివిధాసత్ఖ్యాతిరీతి.

**144.** శూన్యవాదిరీతిగానే అసత్ ఖ్యాతివాదిఖండనము.

అసత్ఖ్యాతివాదముకూడ సర్వథా యుక్త్యనుభవశూన్యమై యున్నది. నిరాకరణలేక ఎవనిబుద్ధియందును నారూఢమగుట లేదు. అందువలన నిరాకరణీయము కాదు. తథాపి యసత్ఖ్యాతివాది వేదమార్గమునకు బ్రతిద్వంద్వియై ప్రసిద్ధుడై యున్నాడు. సూత్రకారులచేత వాని మతము ఖండింపబడి యుండుటచేత ఖండనీయమై యున్నది. అసత్ఖ్యాతివాదులిద్దఱు, ఒకడు శూన్యవాదినాస్తికుడు అసత్ఖ్యాతి నంగీకరించుచున్నాడు. ఆయన మతమునందు పదార్థ మసద్రూపమై యున్నది. అందువలన శుక్తియందు రజతముకూడ అసత్తై యున్నది. శూన్యవాదిమతమునందు నసదధిష్ఠానమునందు రజత మసత్తై యుండుటవలన నిరధిష్ఠానభ్రమ యున్నది. ఈరీతిగానే జ్ఞాతజ్ఞానముకూడ నసత్తై యున్నది. ఈ మత

ఖండనము శారీరకద్వితీయాధ్యాయముయొక్క తర్కపాదమునందు విస్తారము చెప్పబడి యున్నది. అనుభవ విరుద్ధమునయ్యు నున్నది. ఎట్లన, శూన్యవాదము నందు సర్వస్థానమునందును శూన్యమున్నది. అందువలన దేనియొక్క వ్యవహార ము ప్రసిద్ధము కాకపోవలయును. శూన్యముచేత వ్యవహారము కలిగిన యెడల జలముయొక్క ప్రయోజన మగ్నిచేతను, అగ్నియొక్క ప్రయోజనము జలము చేతను కావలయును. అగ్నిజలములు సత్యముగా గాని, మిథ్యగా గాని ఎవ్వరును లేవు, కేవలశూన్యతత్త్వములై యున్నవి. అవి ఏకరసమై యున్నవి. దానియం దే విశేషము లేదు. శూన్యమునందు విశేషము నంగీకరించినయెడల శూన్యవాదము నకు హాని గలుగును. ఎట్లన, ఆ విశేషమే శూన్యముకంటె భిన్నమై యున్నది. ఇక్కడ శంకించునదేమనగా, శూన్యమునందు విశేషమున్నది, దేనికి విలక్షణత చెప్పబడియున్నదో దానిచేత వ్యవహారభేదము గలుగుచున్నది. ఆ విశేషము, వ్యవహారము, వ్యవహారకర్తయుకూడ పరమార్థరూపము శూన్యములై యున్నవి. అందువలన శూన్యతకు హాని లేదు, అని చెప్పినయెడల నదియును సంభవింపదు. ఎట్లన శూన్యమునందు విశేష మున్నది, అని చెప్పుట విరుద్ధమై యున్నది. విశేషసహితముగా జెప్పినయెడల శూన్యతకు హాని కలుగుచున్నది. శూన్య మని చెప్పినయెడల విశేషవత్త్వమునకు హాని కలుగుటవలన వ్యవహార భేదము సంభవింపదు.

**145.** కొందఱు తాంత్రికులరీతిగా నసత్ఖ్యాతివాదము.

కొందఱు తాంత్రికులసత్ఖ్యాదివాదులు, వారిమతమునందు శుక్త్యాదిపదా ర్థ మసత్తుగాలేదు. వ్యావహారికమై యున్నది. భ్రమజ్ఞాన విషయ మగు నేయని ర్వచనీయ రజతాదికము సిద్ధాంతమునం దున్నదో అది యసత్తై యున్నది. అందు వలన వ్యావహారిక రజతాదికము తనయొక్క దేశమునం దున్నది. దానికి శుక్తి దేశమునందు సంబంధము లేదు. అన్యథాఖ్యాతివాదమువలె శుక్తియందు రజత త్వప్రతీతికూడ కలుగుట లేదు. అనిర్వచనీయ రజత ముత్పన్నమగుట లేదు. అఖ్యాతివాదివలె రెండుజ్ఞానములుకూడ లేవు. శూన్యవాదివలె శుక్తి యసత్తు గా లేదు. జ్ఞాతజ్ఞానముకూడ అసత్తుగా లేదు. శుక్తిజ్ఞానము జ్ఞాతిసత్తుగా నున్నది. దోషసహితనేత్రమునకు శుక్తితో సంబంధము కలిగినప్పుడు శుక్తిజ్ఞానముకలు గుటలేదు. శుక్తిదేశమునం దసత్తగు రజతముయొక్క ప్రతీతి గలుగుచున్నది. యద్యపి అన్యథాఖ్యాతి వాదమునందు శుక్తిదేశమునందు రజత మసత్తైయున్నది,

మఱియును కాంతాకరమునందును, అట్టపునందును సద్రజతము రెండుమతము లందున్నది. తథాపి అన్యథాఖ్యాతి వాదమునందు దేశాంతరస్థ సత్యరజతవృత్తి రజతత్వమునకు శుక్తియందు భానమున్నది. అసత్ఖ్యాతి వాదమునందు దేశాంతరమునందు రజతమున్నది. దానిధర్మమగు రజతత్వమునకు శుక్తియందు భానములేదు. అసద్గోచరము రజతజ్ఞానమై యున్నది. శుక్తితో దోషసహిత నేత్రముయొక్క సంబంధముచేత రజతభ్రమ కలుగుచున్నది. దానికి విషయము శుక్తికాదు. శుక్తిని రజతభ్రమవిషయముగా జెప్పినయెడల "ఇదం శుక్తిః" అనుజ్ఞానము కావలయును. శుక్తిత్వరూప విశేషధర్మమునకు దోషబలముచేత భానము కలుగనియెడల సామాన్యాంశమునకు "ఇయం" అని యింతమాత్ర జ్ఞానము కావలయును. అందువలన భ్రమవిషయము శుక్తికాదు, రజతమునుకాదు. ఎట్లన, పురోవర్తిదేశమునందు రజతములేదు. దేశాంతరమునందు రజతమున్నది. దానితో నేత్రసంబంధము. ఈరీతిగా రజతభ్రమవిషయము ఏదియులేదు. శుక్తిజ్ఞానోత్తర కాలమునందు "ఇహ కాలత్రయేపి రజతం నాస్తి" అను నీప్రతీతి గలుగుచున్నది. అందువలన రజతభ్రమ నిర్విషయకమైనందున నసద్గోచరముగా జెప్పబడియున్నది. అసద్గోచర జ్ఞానము కూడ నసత్ఖ్యాతి యనంబడును.

### 146. న్యాయవాచస్పతులప్రకారము అసత్ఖ్యాతివాదము.

కొందఱసత్ఖ్యాతి నిరీతిగా జెప్పెదరు. శుక్తితో నేత్రసంబంధముచేత రజతభ్రమ యగుచున్నది. అందువలన రజతభ్రమకు విషయము శుక్తియై యున్నది. అయిన శుక్తియందు శుక్తిత్వము; శుక్తిత్వసమవాయము, ఈరెండును దోషముచేత భాసించుటలేదు. శుక్తియందు రజతత్వముయొక్క సమవాయము భాసించుచున్నది. రజతత్వముయొక్క సమవాయము శుక్తియందు లేదు. అందువలన నసత్ఖ్యాతియైయున్నది. రజతత్వప్రతియోగిక శుక్త్యనుయోగిక సమవాయమసత్తైయున్నది. దానియొక్క ఖ్యాతి యనగా ప్రతీతి యసత్ఖ్యాతి యనంబడును. రజతత్వప్రతియోగిక సమవాయము రజతమునందు రజతత్వమునకు ప్రసిద్ధమైయున్నది. శుక్త్యనుయోగిక సమవాయము శుక్తియందు శుక్తిత్వమునకు ప్రసిద్ధమై యున్నది. రజతత్వప్రతియోగికసమవాయము రజతానుయోగికమై యున్నదే కాని శుక్త్యనుయోగికముగా లేదు. శుక్త్యనుయోగిక సమవాయము శుక్తిత్వప్రతియోగికమై యున్నది. కాని రజతత్వప్రతియోగికముగా లేదు. ఈరీతిగా రజతత్వప్రతియోగిక, శుక్త్యనుయోగిక సమవాయమప్రసిద్ధమైనందున నసత్తై యు

న్నది. దానియొక్క ప్రతీతి యసత్ఖ్యాతి యనంబడును. శుక్తి దేనికి ననుయోగిగా జెప్పబడియున్నదో ఆధర్మము శుక్త్యనుయోగిక మనంబడును. రజతత్వము దేనికి ప్రతియోగియై యున్నదో అది రజతత్వప్రతియోగిక మనంబడును. ఇచ్చట విశేష మే మనగా కేవలసమవాయము ప్రసిద్ధమై యున్నది. రజతత్వప్రతియోగిక సమవాయము రజతమునందు ప్రసిద్ధమై యున్నది. శుక్త్యనుయోగిక సమవాయము కూడ శుక్తియందు ప్రసిద్ధమై యున్నది. ప్రసిద్ధసమవాయమునందు సమవాయత్వధర్మ మున్నది. రజతత్వప్రతియోగిత్వముకూడ సమవాయమునందు ప్రసిద్ధమై యున్నది. శుక్త్యనుయోగికత్వముకూడ సమవాయమునందు ప్రసిద్ధమై యున్నది. రజతత్వ ప్రతియోగికత్వము, శుక్త్యనుయోగికత్వము, ఈరెండుధర్మములు ఏకస్థానమునందు సమవాయమునందు ప్రసిద్ధమైనందున శుక్త్యనుయోగికత్వ విశిష్ట, రజతత్వప్రతియోగికత్వ విశిష్ట, సమవాయ మప్రసిద్ధ మైనందున అసత్తై యున్నది. దానియొక్క ఖ్యాతి యసత్ఖ్యాతి యనంబడును. ఇది న్యాయవాచస్పతుల మతమై యున్నది. ఈరీతిగా నధిష్ఠానము నంగీకరించి యసత్ఖ్యాతిని ద్విప్రకారముగా నంగీకరించినారు. ఒకటి శుక్త్యధిష్ఠానమునందు నసద్రజత ప్రతీతి రూపమై యున్నది. రెండవది శుక్తియందు నసద్రజతత్వ సమవాయముయొక్క ప్రతీతి రూపమై యున్నది.

147. ద్వివిధాసత్ ఖ్యాతివాదుల ఖండనము.

ఈరెండును నసంగతములై యున్నవి. ఎట్లన, అసత్ఖ్యాతి నంగీకరించు వాని నడుగవలసిన దేమనగా, అసత్ ఖ్యాతి యను నీవాక్యమునందు అబాధ్యవిలక్షణము అసచ్ఛబ్దముయొక్క అర్థమైయున్నదా? లేక అసచ్ఛబ్దముయొక్క యర్థము నిస్స్వరూపమై యున్నదా? అసచ్ఛబ్దార్థమును నిస్స్వరూపముగా జెప్పిన యెడల "ముఖే మే జిహ్వా నాస్తి" యను నీవాక్యమువలె అసత్ ఖ్యాతివాదాంగీకారము నిర్లజ్జపురుషునిదై యుండును. ఎట్లన, సత్తాస్ఫూర్తిరహితము నిస్స్వరూప మనంబడును. అందువలన సత్తాస్ఫూర్తి శూన్యము కూడ ప్రతీతమై యున్నది, అనునీయసత్ఖ్యాతివాదము సిద్ధ మగుచున్నది. సత్తాస్ఫూర్తిశూన్యముయొక్క ప్రతీతి చెప్పుట విరుద్ధమై యున్నది. అందువలన నబాధ్యవిలక్షణము నసత్ శబ్దార్థమునుగా చెప్పినయెడల నబాధ్యవిలక్షణము సాధ్యమై యున్నది. బాధయోగ్యము బాధ్యమనంబడును. ఈరీతిగా బాధయోగ్యముయొక్క ప్రతీతి యసత్ ఖ్యాతి యని ప్రసిద్ధమగుచున్నది. అది సిద్ధాంతిమతమై యున్నది.

అనిర్వచనీయఖ్యాతి సిద్ధాంతమునం దున్నది. బాధయోగ్యమే యనిర్వచనీయ మై యున్నది. ఈరీతిగా సిద్ధాంతమునకు విలక్షణమగు నసత్ఖ్యాతి వాదము చెప్పుట సంభవింపదు.

148.—154. ఆత్మఖ్యాతిక్రమము తత్ఖండనము.

148. ఆంతరపదార్థము నంగీకరించెడి యాత్మఖ్యాతివాదియొక్క యభిప్రాయము.

ఆత్మఖ్యాతి యసంగతమై యున్నది. ఎట్లన, విజ్ఞానవాదిమతమునం దాత్మఖ్యాతి యున్నది. క్షణికవిజ్ఞానము ఆత్మ యనంబడును. ఆయనమతమునందు బాహ్యరజతము లేదు. ఇక నేమనగా, ఆంతరవిజ్ఞానరూపాత్మయున్నది. దానియొక్క ధర్మము రజతమైయున్నది, దోషబలముచేత బాహ్యమునందు ప్రతీతమగుచున్నది. శూన్యవాదియొక్క మతము కాక ఆంతరపదార్థముయొక్క సత్తయందు పసుగతశిష్యులకు వివాదము లేదు. బాహ్య పదార్థమును కొందఱు అంగీకరించినారు. మఱి కొందఱు అంగీకరింపలేదు. అందువలన బాహ్యపదార్థముయొక్క సత్తయందు వారికి వివాద మున్నది. ఆంతరవిజ్ఞానమునకు నిషేధమును శూన్యవాదితప్ప యేనాస్తికుడు చేయుటలేదు, అందువలన నాంతర రజతమునకు విజ్ఞానరూపమగునాత్మ యధిష్ఠానమై యున్నది. దానియొక్క ధర్మమగు రజత మాంతరమై యున్నది. దోషబలముచేత బాహ్యమువలె ప్రతీతమగుచున్నది. జ్ఞానముచేత రజతమునకు స్వరూపముతో బాధ గలుగుటలేదు. ఇక నేమనగా రజతముయొక్క బాహ్యతకు బాధయగును. అనిర్వచనీయ ఖ్యాతి వాదమునందు రజతధర్మికి బాధయున్నది. ఇదంత రూపబాహ్య వృత్తికి బాధ యంగీకరింప నలసినది. ఆత్మఖ్యాతి మతమునందు రజతమునకు బాధ యంగీకరింపబడలేదు. ఎట్లన శూన్యవాదికంటె భిన్నమగు సకలసౌగత మతములందును పదార్థములయొక్క యాంతర సత్తయందు వివాదములేదు. అందువలన స్వరూపముతో రజతమునకు బాధ యంగీకరింపలేదు, కేవల బాహ్యతా రూపేదంతకు బాధ యంగీకరింపబడును. అందువలన ననిర్వచనీయవాదము నంగీకరించిన యెడల ధర్మధర్ములకు రెంటికిని బాధకల్పనము గౌరవమై యున్నది, ఆత్మఖ్యాతి నంగీకరించిన యెడల ధర్మికి బాధలేక ఇదంతారూప ధర్మమాత్రమునకు బాధ కల్పనయందు లాఘవ మున్నది, అని ఆత్మఖ్యాతి వాదియొక్క యభిప్రాయము. ఈమతమునందు రజత మాంతరమై యున్నది, సత్యమైయున్నది. దాని బాహ్య

దేశమునందు ప్రతీతిభ్రమమై యున్నది. అందువలన రజతజ్ఞానమునందు రజతగోచరత్వాంశమునందు భ్రమకాదు, రజతమునకు బాహ్యదేశస్థత్వాంశమునందు భ్రమ యగును.

149. ఆంతరపదార్థము నంగీకరించెడి యాత్మఖ్యాతివాది మతఖండనము.
ఈ మతము కూడ సమీచీనము కాదు. రజతము ఆంతరమై యున్నది, అను నీ యనుభవ మెవరికిని లేదు. భ్రమస్థలమునందు లేక యథార్థస్థలమునందును రజతాదికమునకు నాంతరత్వ మేప్రమాణముచేతను సిద్ధింపదు. సుఖాదికము ఆంతరమై యున్నది, రజతాదికము బాహ్యమై యున్నది, అను నీ యనుభవము సర్వులకు నున్నది. రజతమును నాంతరముగా నంగీకరించినయెడల ననుభవమునకు విరోధ మగుచున్నది. ఆంతరత్వ సాధకప్రమాణమును, యుక్తియును లేవు. అందువలన నాంతరరజతమునకు బాహ్యప్రతీతి యంగీకరించుట యసంగతమై యున్నది.

150. సౌగతుల రెండిటిభేదములో బాహ్యపదార్థవాదియొక్కయు, నాత్మఖ్యాతివాదియొక్కయు అనువాదములు.

యద్యపి సౌగతమతమునందు రెండుమతము లున్నవి. ఒకటి విజ్ఞానవాదము; మఱియు నొకటి బాహ్యవాదము. బాహ్యవాదమునందు రెండు భేదము లున్నవి. ఒకటి బాహ్యపదార్థము అనుమేయమై యున్నది. ప్రత్యక్షము కాదు. జ్ఞానమునకు ప్రత్యక్షమున్నది. జ్ఞానముచేత జ్ఞేయమునకు ననుమితి గలుగుచున్నది. ఈరీతిగా బాహ్యపదార్థమునకు పరోక్షవాదమై యున్నది. మఱియు నొకటి బాహ్యపదార్థముకూడ ప్రత్యక్షజ్ఞానమునకు విషయమై యున్నది. ఈరీతిగా బాహ్యపదార్థమునకు నపరోక్షవాద మున్నది. ఈవిజ్ఞానవాది మతమునందు వ్యావహారికరజతము కూడ బాహ్యముగా లేదు, బాహ్యపదార్థవాది మతమునందు యథార్థజ్ఞానమునకు విషయమగు రజతము బాహ్యమై యున్నది. అందువలన నుక్తానుభవమునకు విరోధము లేదు. భ్రమస్థలమునందు బాహ్యరజతమును అంగీకరించుటకు ప్రయోజనము లేదు. ఎట్లన కటకాదిసిద్ధి యా రజతమువలన గలుగుట లేదు. కేవల ప్రతీతిమాత్రము గలుగుచున్నది. మఱియును విషయము లేక ప్రతీతి గలుగుట లేదు. అందువలన భ్రమప్రతీతియొక్క విషయతాసిద్ధియే ఆరజతమునకు ఫలమై యున్నది. అది ఆంతరముగా నంగీకరించినను భ్రమప్రతీతి సవిషయక మగుచున్నది. బాహ్యముగా నంగీకరించి

ప్రతీతికి సవిషయత్వమును సిద్ధింపజేయు మతమునం దుక్తరీతిగా ధర్మ ధర్మిబాధ యుండుటవలన గౌరవ మున్నది. ఆంతరరజతమునకు దోషబలముచేత బాహ్య ప్రతీతి నంగీకరించినయెడల కేవలేదంతామాత్ర మంగీకరించుటవలన లాఘవ మున్నది. యథార్థజ్ఞానమునకు విషయ మగు రజతము పురోవర్తిదేశమునం దున్నది. భ్రమజ్ఞానమునకు విషయమగు రజతముగూడ పురోవర్తిదేశమునం దుండినయెడల యథార్థజ్ఞానమునకును భ్రమజ్ఞానమునకును విలక్షణత్వము లేకపోవలయును. ఆత్మఖ్యాతి మతమునందు యథార్థజ్ఞానమునకు విషయమగు రజతము కూడ పురోవర్తిదేశమునందున్నది. భ్రమజ్ఞానమునకువిషయమగు రజతము ఆంతరమై యున్నది. అందువలన బాహ్యత్వాంతరత్వరూప విషయముయొక్క వైలక్షణ్యముచేత యథార్థత్వాఽయథార్థత్వభేదములు జ్ఞానమునకు నున్నవి. బాహ్యదేశమునందు భ్రమయొక్క విషయమునకు నుత్పత్తి నంగీకరించినయెడల శుక్తిదేశమునం దుత్పన్నమగు రజతముయొక్క ప్రతీతి సర్వజనులకును కావలయును. ఏకాధిష్ఠానమునందు దశపురుషులకును భిన్నభిన్న పదార్థభ్రమ గలుగుచున్నది. అచ్చట నేకైకపురుషునకు సకలపదార్థప్రతీతి కావలయును. ఆత్మఖ్యాతిమతమునందు నెవరియొక్క యాంతరమునం దేపదార్థ ముత్పన్నమైనదో వారికి పురోవర్తిదేశమునందు నాపదార్థము ప్రతీత మగుచున్నది. అందువలన నన్యులకు దానియొక్క ప్రతీతిశంకలును లేదు. భ్రమవిషయమునకు బాహ్యోత్పత్తి నంగీకరించువాని మతమునందు అన్యపురుషులకు నప్రతీతియందు సమాధానాన్వేషణరూపక్లేశమే ఫలమై యున్నది. ఈరీతిగా బాహ్యపదార్థవాది సౌగతమతమునందు ఆత్మఖ్యాతియొక్క యుక్తిసంభవింపదు. వ్యావహారిక పదార్థమే ఆయనమతమునందు బాహ్యమై యున్నది. ప్రాతిభాసిక రజతాదికము బాహ్యముకాదు, అంతరముగా నున్నది.

**151.** బాహ్యపదార్థము నంగీకరించు నాత్మఖ్యాతివాదియొక్క మతఖండనము.

తథాపి, ఆత్మఖ్యాతివాద మసంగతమై యున్నది. ఎట్లన, రజతాది పదార్థము, స్వప్నము తప్ప జాగరణమునందు నాంతరముగా అప్రసిద్ధమై యున్నది. బాహ్యస్వభావమునకు భ్రమస్థలమునందు నాంతరత్వకల్పనమున కప్రసిద్ధకల్పనాదోష మున్నది. ఆంతరముగా నుండినయెడల "మయి రజతం; అహంరజతం" అను ప్రతీతి కావలయును. "ఇదం రజతం" అను బాహ్యప్రతీతి గలుగుచున్నది.

ఒకడు శంకించున దేమనగా, యద్యపి రజత మాంతరమై యున్నది, బాహ్యదేశమునందు లేదు, తథాపి దోషమాహాత్మ్యముచేత నాంతర పదార్థమునకు బాహ్యప్రతీతి గలుగుచున్నది, బాహ్యతారూపేదంత శుక్తియందున్నది, దోషముయొక్క మాహాత్మ్యముచేత శుక్తియొక్క ఇదంత రజతమునందు భాసించుచున్నది. ఏదోషముచేత నాంతరరజత ముత్పన్నమై యున్నదో ఆ దోషముచేతనే నాంతరమందుత్పన్నమైన రజతమునందు శుక్తియొక్క ఇదంతాప్రతీతి యగుచున్నది. రజతమునకు బాహ్యదేశమునందుత్పత్తి యంగీకరించినయెడల బాహ్యదేశమునందు సత్య రజతము సంభవింపదు. అనిర్వచనీయ రజతమును అంగీకరింపవలయును. ఆ యనిర్వచనీయ వస్తువు లోకమునం దప్రసిద్ధమై యున్నది, అందువలన నప్రసిద్ధకల్పనారూపదోష మగును. ఆంతరముగా సత్య రజత ముత్పన్న మగుచున్నది. ఆంతరమైనందున దానికి హానోపాదానములు శక్యములై యున్నవి. అందువలన సత్యముగా నంగీకరించినను కటకాది సిద్ధిరూప ఫలము సంభవింపదు. అందువలన ననిర్వచనీయ వస్తు కల్పన లేదు. అనిర్వచనీయ ఖ్యాతి కంటె నాత్మఖ్యాతిచేత నీలాఘవ మున్నది.

అదియు నసంగతమై యున్నది. శుక్తియొక్క యిదంత రజతమునందు ప్రతీత మగుచున్నది, అని చెప్పుటవలన అన్యథాఖ్యాత్యంగీకారము సిద్ధించుచున్నది. ఇదంతా ప్రతీతియందు నన్యథాఖ్యాతి నంగీకరించినయెడల శుక్తియందు రజతత్వధర్మియొక్క ప్రతీతియును నన్యథాఖ్యాతిగానే యంగీకరింపవలయును. ఆంతరరజతమున కుత్పత్త్యంగీకారము నిష్ఫలము, రజతపదార్థము శుక్తి కంటె వ్యవహితమై యున్నది. దానియొక్క ధర్మమునకు శుక్తియందు ప్రతీతి సంభవింపదు, అని చెప్పినయెడల నీమతమునందును శుక్తికంటె వవ్యహితమగు నంత ర్దేశమునందు రజత మున్నది. దానియందు శుక్తిధర్మమగు నిదంతయొక్క ప్రతీత్యసంభవము తుల్యమై యున్నది.

152. ఆత్మఖ్యాతివాదముకంటె విలక్షణ మగు నద్వైతవాదముయొక్క సిద్ధాంతము.

మఱియును సిద్ధాంతమునందు శుక్తివృత్తి తాదాత్మ్యముయొక్క యనిర్వచనీయ సంబంధము రజతమునం దుత్పన్న మగుచున్నది. అది సంసర్గాధ్యాస మనంబడును. అధిష్ఠానముయొక్క సంబంధము ఆరోపితమునం దెచ్చట ప్రతీతమగుచున్నదో అచ్చట నధిష్ఠానమునకు సంసర్గాధ్యాస మున్నది. సంసర్గాధ్యాసము

లేక నన్యధర్మమునకు నన్యమునందు ప్రతీతి కలుగుట లేదు. ఈరీతిగా నధ్యాసన్న లేక శుక్తివృత్తి ఇదంతకు నాంతరరజతమునందు ప్రతీతి సంభవింపనందున ఆత్మఖ్యాతివాదిమత మసంగతమై యున్నది. మఱియు ననిర్వచనీయ వస్తువుయొక్క యప్రసిద్ధకల్పనారూపదోష మేది చెప్పబడెనో అదియు గూడ సిద్ధాంతాజ్ఞాన విజృంభితమై యున్నది. ఎట్లన, అద్వైతవాదమునకు ఇది ముఖ్యసిద్ధాంతము. చేతనము సత్యమై యున్నది. దానికంటె భిన్నమగుసకలము మిథ్యయై యున్నది. అనిర్వచనీయము మిథ్యయనంబడును. అందువలన చేతనముకంటె భిన్నమగు 'పదార్థము సత్యమని చెప్పుటయందే అప్రసిద్ధ కల్పన యున్నది. చేతనముకంటె భిన్నమగు పదార్థమునందు ననిర్వచనీయత అతిప్రసిద్ధమై యున్నది యుక్తిచేత విచారించినయెడల ఏ యనాత్మపదార్థమునకును స్వరూపము సిద్ధించుట లేదు. మఱియు ప్రతీత మగుచున్నది. అందువలన సకలానాత్మపదార్థము అనిర్వచనీయమై యున్నది. సిద్ధాంతమునం దనాత్మపదార్థ మేదియును సత్యముగా లేదు. గంధర్వనగరమువలె దృష్టమగు ప్రపంచము నష్టస్వభావముగలదై యున్నది. స్వప్నముకంటె జాగ్రత్పదార్థమునందు కించిద్వైలక్షణ్యమును లేదు. శుక్తి రజతము ప్రాతిభాసికమై యున్నది. కాంతాకరాదికమునందు రజతము వ్యావహారికమై యున్నది. ఈరీతిగా ననాత్మపదార్థమునందు మిథ్యాత్వ, సత్యత్వ, విలక్షణత్వములు పరస్పరముగా చెప్పబడి యున్నవి. అది స్థూలదృష్టి గలవారికి నద్వైత బోధమునందు ప్రవేశముకొఱకు స్థూలారుంధతీ న్యాయముచేత చెప్పబడియున్నది. స్థూలబుద్ధి పురుషులకు ప్రథమమునందె ముఖ్యసిద్ధాంతమును జెప్పినయెడల నద్భుతార్థమును విని అనాత్మసత్యత్వ భావన గల పురుషులు శాస్త్రముతో విముఖులై పురుషార్థభ్రష్టులై పోవుదురని యోచించి యనాత్మపదార్థమునకు వ్యావహారిక, ప్రాతిభాసిక సత్తాభేదముచేత ద్వైవిధ్యము చెప్పబడినది. చేతనమునకు పారమార్థికసత్త యున్నది, చేతనముకంటె ప్రపంచమునకు న్యూనసత్త బుద్ధియుం దారూఢమై సకలానాత్మ పదార్థములకు స్వప్నదృష్టాంతముచేత ప్రాతిభాసిక సత్తను తెలిసికొని నిషేధవాక్యముచేత సర్వానాత్మలకు సత్తాస్ఫూర్తి శూన్యముగా దెలిసికొనవలయును. ఇందుకొఱకు సత్తాభేదము చెప్పబడినది. అనాత్మపదార్థములకు పరస్పరసత్తాభేదమునందు నద్వైతశాస్త్రమునకు తాత్పర్యము లేదు. అందువలన నద్వైతవాదికి అనిర్వచనీయ పదార్థ మప్రసిద్ధమై యున్నదని చెప్పుట విరుద్ధమై యున్నది. ప్రకారాంత

రము సంభవింపదు. అందువలన లాఘవగౌరవకథనము సర్వథా యసంభవమై యున్నది. అనిర్వచనీయ ఖ్యాతి గాక యన్యప్రకారముగూడ సంభవించిన యెడల గౌరవ దోషముచేత నీ పక్షమునకు త్యాగము సంభవించును. మఱియును నత్స్వ మాణరీతిగా సత్ఖ్యాతి యేపక్షము సంభవింపదు. అందువలన గౌరవలాఘవ విచారమే నిష్ఫలమై యున్నది.

153. సిద్ధాంతోక్త గౌరవదోష పరిహారపూర్వక ద్వివిధ విజ్ఞాన వాదముయొక్క యసంభవము.

ఆత్మఖ్యాతి నిరూపణారంభమునందు జెప్పినదేమనగా బాహ్యరజతమున కుత్పత్తి యంగీకరించినయెడల రజతరూప ధర్మికిని, ఇదంత్వరూప ధర్మమునకు ఈ రెంటికిని బాధనంగీకరించుటవలనను గౌరవదోష మున్నది. ఆత్మఖ్యాతి నంగీకరించినయెడల ఇదంతామాత్రమునకు బాధ యుండుటవలన ధర్మికి బాధ లేదు. అందువలన లాఘవ మున్నది. ఇట్లుల జెప్పుటయును వ్యర్థము. ఎట్లన శుక్తిజ్ఞానము గలిగిన తరువాత మిథ్యారజతము నాకు ప్రతీతమైనది అను నీ రీతిగా రజతబాధ సర్వానుభవసిద్ధమై యున్నది. ఆత్మఖ్యాతి రీతిగా రజతము నందు మిథ్యాబాహ్యత ప్రతీతమై యున్నది, అని నిషేధము కావలయును. అగుట వలన ధర్మిబాధకు లాఘవబలముచేత త్యాగము జేసినయెడల పాకాదిఫల సాధక వ్యాపార సముదాయమునందు ఏకవ్యాపారమును జేసి లాఘవబలముచేత నధిక వ్యాపారమును త్యజింపవలయును. భ్రమసహిత పురుషులకు ఆప్తోపదేశము కలిగినప్పుడు "నేదం రజతం; కింతు శుక్తిరియం" అనునీరీతిగా రజతమునకు స్వరూపముతో నిషేధము చేయబడుచున్నది. ఆత్మఖ్యాతి రీతిగా, "నాఽత్ర రజతం" "కింతు తే ఆత్మని రజతం" అను నీ రీతిగా రజతదేశ మాత్రమునకు నిషేధము చెప్పవలయును. అందువలనే నాత్మయం దుత్పన్నమైన దానికి బాహ్య దేశమునందు ఖ్యాతియున్నది, అను నీ యర్థమునందు తాత్పర్యముచేత బాహ్య పదార్థవాదియగు సౌగతునియొక్క యాత్మఖ్యాతివాద మసంగతమై యున్నది. మఱియును విజ్ఞానమునకు భిన్న మగు నే బాహ్యము అంతరపదార్థము కూడ లేదు. విజ్ఞానరూపాత్మాకారముగానే సర్వపదార్థ మున్నది. ఈరీతిగా విజ్ఞానవాది యొక్క విజ్ఞానరూపాత్మకు రజతరూపముతో ఖ్యాతి యున్నది. అను నీ తాత్పర్యము చేతను ఆత్మఖ్యాతివాద మసంగతమై యున్నది. విజ్ఞానమునకు భిన్నమగు రజతము జ్ఞానమునకు విషయమై యున్నది. దానికి విజ్ఞానరూపాత్మకింటె నభేద

మును జెప్పుట సంభవింపదు. విజ్ఞానవాది మతమునందు పదార్థము క్షణిక విజ్ఞాన రూపమై యున్నది. దానియందు ప్రత్యభిజ్ఞా సంభవాద్యనంతదూషణము లున్నవి. అందువలన నాత్మఖ్యాతి సంభవింపదు.

154—161. అన్యథాఖ్యాతిక్రమము తత్ఖండనము.

154. అన్యథాఖ్యాతి వాదియొక్క తాత్పర్యము.

అన్యథాఖ్యాతివాదము కూడ అసంగతమై యున్నది. అన్యథాఖ్యాతి వాదియొక్క తాత్పర్యమేమనగా, ఏపురుషునకు సత్యపదార్థముయొక్క యనుభవ జన్యసంస్కార మున్నదో వానికి దోషసహిత నేత్రమునకు పూర్వదృష్ట సదృశపదార్థముతో సంబంధము కలిగినప్పుడు పురోవర్తి సదృశపదార్థముయొక్క సామాన్యజ్ఞానముచేత పూర్వదృష్టముయొక్క స్మృతి కలుగుచున్నది. కొన్ని వేళలయందు కలుగుటయును లేదు. కలుగని సమయమునందు సదృశజ్ఞానమువలన సంస్కార ముద్భూతమగుచున్నది. ఏపదార్థముయొక్క స్మృతి యున్నదో అథవా దేనియొక్క యుద్భూతసంస్కార మున్నదో ఆసత్యపదార్థముయొక్క ధర్మము పురోవర్తి పదార్థమునందు ప్రతీత మగుచున్నది. ఉ. సత్యరజతముయొక్క యనుభవ జన్యసంస్కార జన్యపురుషులకు రజతసదృశశుక్తితో దోషసహిత నేత్రముయొక్క సంబంధము కలిగి రజతమునకు స్మృతి కలుగుచున్నది ఆస్మరణానంతరము రజతత్వధర్మము శుక్తియందు భాసించుచున్నది. అథవా నేత్రసంబంధము కలిగిన తరువాత రజతభ్రమయందు విలంబము కలుగుటలేదు. అందువలన నేత్రసంబంధరజత ప్రత్యక్షభ్రమలయొక్క యంతరాళమునందు రజతస్మృతి కలుగుటలేదు. రజతానుభవముయొక్క సంస్కార ముద్భూతమై స్మృతి వ్యవధానములేకయే శీఘ్రముగానే శుక్తియందు రజతత్వప్రత్యక్ష మగుచున్నది. స్మృతిస్థలమునందు నెట్లు పూర్వదృష్ట సదృశముయొక్క జ్ఞానముచేత సంస్కారమునకు నుద్భూతమగుచున్నదో అట్లు భ్రమస్థలమునందు పూర్వదృష్ట సదృశపదార్థముతో నింద్రియసంబంధ ముండుటవలననే సంస్కారమునకు నుద్భూతము కలిగి సంస్కారిగోచరధర్మమునకు పురోవృత్తియందు భానము కలుగుచున్నది. ఇది యన్యథాఖ్యాతి యనంబడును. అన్యరూపముతో ప్రతీతికి అన్యథాఖ్యాతి యని పేరు. శుక్తిపదార్థమునందు శుక్తిత్వధర్మమున్నది, రజతత్వము లేదు. శుక్తికి రజతత్వరూపముతో ప్రతీతి యుండుటవలన నన్యరూపముతో ప్రతీతి యున్నది.

155. విచారసాగరోక్త ద్వివిధఖ్యాతివాదమునందు ప్రథమ ప్రాచీన మతముయొక్క ప్రకారము, ఖండనము.

విచారసాగరమునందు నన్యథాఖ్యాతి ద్వివిధముగ వ్రాయబడినది. ద్వితీయప్రకార మేది యనగా, రజతభ్రమ యగుచోటను కాంతాకరాదికమునం దున్న రజతముతో నేత్రమునకు సంబంధము కలిగి దానికి ప్రత్యక్షమగుచున్నది. అందువలన కాంతాకరమునందు, లేక, అట్టమునందు నున్న రజతమునకు పురోవర్తి ప్రదేశమునందు ప్రతీతి యన్యథాఖ్యాతియై యున్నది. ఈమతమునందు స్వరూపస్థల యంశమునందు రజతజ్ఞానము యథార్థమై యున్నది. దేశాంశమునందు నన్యథాజ్ఞానమై యున్నది. యద్యపి అట్టాదికమునకు రజతము వ్యవహితమై యున్నది. దానితో నేత్రమునకు సంబంధము సంభవింపదు. తథాపి దోషసహిత నేత్రమునకు వ్యవహితరజతముతో సంబంధము కలిగి జ్ఞానము కలుగుచున్నది ఇది దోషముయొక్క మాహాత్మ్యమై యున్నది. ఈ యన్యథాఖ్యాతియొక్క యుపలాభము వర్తమాన న్యాయగ్రంథమునందు లేదు. తథాపి అన్యథాఖ్యాతియొక్క ఖండన మనేక గ్రంథములయం దున్నది. దీనియందొకదోష మున్నది. దేశాంతరమునం దున్న రజతముతో నేత్రమునకు సంబంధము కలిగినయెడల అట్టమునందుండెడి రజతమునకు సన్నిహితమగు నన్యపదార్థమునకును ప్రత్యక్షముకావలయును. కాంతాకర రజతమునకు ప్రత్యక్షమైనప్పుడు కాంతాకరమునకును ప్రత్యక్షము కావలయును. యద్యపి అన్యథాఖ్యాతికి కేవలేంద్రియముచేత నుత్పత్తి కలుగుట లేదు. పూర్వానుభవ జనిత సంస్కారసహిత సదోష నేత్రముచేత నన్యథాఖ్యాతిజ్ఞానము కలుగుచున్నది. అందువలన నుద్భూతసంస్కారము నేత్రమునకు సహకారియై యున్నది. రజతగోచర సంస్కార సహితనేత్రముచేత రజతముయొక్కయే జ్ఞానము కలుగుచున్నది. అన్యపదార్థ గోచర సంస్కారమైన నున్నది. ఉద్బుద్ధము కానందున నన్యవస్తుజ్ఞానము కలుగుటలేదు. సంస్కారమునకు నుద్బుద్ధతయును కార్యముచేత ననుమేయమై యున్నది. అందువలన దోషములేదు. తథాపి ఎచ్చట శుక్తియందు రజతభ్రమ యున్నదో అచ్చట శుక్తికి సమానమగు నారోపిత రజతముయొక్క పరిణామము ప్రతీతమగుచున్నది. లఘుశుక్తియందు రజతభ్రమ కలిగినప్పుడు యారోపితరజతమునందును లఘుత్వము భాసించుచున్నది. మహాశుక్తియందు రజతభ్రమ కలిగినప్పుడు మహత్పరిమాణ విశిష్టరజతము భాసించుచున్నది. ఈరీతిగా నారోపిత పదార్థమునందు నధిష్ఠాన

పరిమాణమునకు నియమ ముండుటవలన శుక్త్యాదికమునందు రజతత్వాది ధర్మము యొక్క ప్రతీతి యున్నది. అన్యదేశస్థ రజతమునకు ప్రతీతికలిగినయెడల నారోపిత మునందు నధిష్ఠానపరిమాణముయొక్క నియమము లేకపోవలయును. మఱియును లఘుమహత్పరిమాణము శుక్తికి భాసించుచున్నది. అందువలన దేశాంతర రజతమునకు ప్రతీతిలేదు. రజతసంస్కార సహితపురుషులకు నన్యపదార్థ ప్రతీతి యద్యపి సంభవించుట లేదు. తథాపి దేశముయొక్క యనంతరజతము ప్రతీతి కావలయును. ఈరీతిగా నీపక్ష మనంతదోషగ్రస్తమై యున్నది. దీనికొఱకు వర్తమానగ్రంథమునందు నీపక్షమున కుపలంభము లేదు.

## 156. పూర్వోక్తాన్యథాఖ్యాతియొక్క ఖండనము.

శుక్తియందు రజతత్వధర్మమునకు ప్రతీతి గలుగుచున్నది. ఈయన్యథాఖ్యాతివాదము అనేక గ్రంథకారులగు నైయాయికులచేత వ్రాయంబడియున్నది. తథాపి వారియొక్క లేఖనముకూడ శ్రుతిస్మృతి విరుద్ధమై యున్నది. అందువలన శ్రద్ధాయోగ్యము కాదు. స్వప్నజ్ఞానమును, మానస విపర్యయముగా నైయాయికులచే జెప్పబడి యున్నది. అన్యథాఖ్యాతి విపర్యయ మనంబడును. శ్రుతియందు స్వప్నపదార్థమునకు నుత్పత్తి చెప్పబడి యున్నది. "న తత్ర రథాః, న రథయోగాః, న పంథానో భవంత్యథ రథాన్, రథయోగాన్, రథపథ స్సృజతే" అను నీశ్రుతి యున్నది. దానియందు వ్యావహారిక రథమును, అశ్వ మార్గములను స్వప్నమునందు నిషేధించి, అనిర్వచనీయ రథమునకును, అశ్వమార్గములకు నుత్పత్తి చెప్పబడి యున్నది. ఈరీతిగనే "సంధ్యే సృష్టి రాహ హి" అను నీ వ్యాససూత్రమున్నది. దానియందును స్వప్నమునందు ననిర్వచనీయ పదార్థమునకు సృష్టి చెప్పబడి యున్నది. వ్యాసకృతసూత్రము స్మృతి రూపమై యున్నది. ఈరీతిగా నైయాయికునియొక్క యన్యథాఖ్యాతివాదము శ్రుతిస్మృతి విరుద్ధమై యున్నది. నేత్రముచేత వ్యవహిత రజతత్వముయొక్క జ్ఞానము శుక్తియందు సంభవించుట లేదు. శుక్తి సమీపమునందు రజత ముండినయెడల రెంటికిని నేత్ర సంయోగము గలిగి రజతవృత్తి రజతత్వమునకు శుక్తియందు నేత్ర జన్యభ్రమ ప్రతీతి సంభవించుచున్నది. ఎచ్చట శుక్తియొక్క సమీపమునందు రజతము లేదో అచ్చట శుక్తియందు రజతత్వభ్రమ నేత్రజన్యముగా సంభవింపదు. ఎట్లనగా, విశేషణ విశేష్యములతో నింద్రియముయొక్క సంబంధము గలిగి యింద్రియజన్య విశిష్ట జ్ఞానము గలుగుచున్నది. అచ్చట విశేషణము రజతత్వమై యున్నది, విశేష్యము

రజత వ్యక్తియై యున్నది, రజతవ్యక్తితో నేత్రమునకు సంయోగ సంబంధము మున్నది, రజతత్వముతో నేత్రమునకు సంయుక్త సమవాయ మున్నది. అందువలన "ఇదం రజత"మను రీతిగా రజతత్వ విశిష్టమునకు నేత్రజన్యజ్ఞానము కలుగుచున్నది. ఎచ్చట శుక్తియందు రజతత్వభ్రమ యున్నదో అచ్చట విశేష్య శుక్తితో నేత్రమునకు సంయోగసంబంధ మున్నది. రజతత్వ విశేషణముతో సంయుక్త సమవాయము లేదు. రజతవ్యక్తితో సంయోగ ముండినయెడల రజతత్వముతో సంయోగసమవాయ ముండును, రజతవ్యక్తితో సంయోగము లేనందున రజతత్వముతో సంయుక్త సమవాయము లేదు. అందువలన రజత విశిష్ట శుక్తియొక్క జ్ఞానము సంభవింపదు.

157. ప్రత్యక్షజ్ఞానమునకు హేతువగు షడ్విధలౌకికను, త్రివిధాలౌకికము నను నీరెండు సంబంధములు.

నైయాయికుడు చెప్పున దేమనగా, ప్రత్యక్షజ్ఞానమునకు హేతువగు విషయేంద్రియసంబధము ద్వివిధమై యున్నది. ఒకటి లౌకిక సంబంధము, మఱియొకటి యలౌకిక సంబంధము. సంయోగాది షడ్విధ సంబంధములు లౌకికములనంబడును, సామాన్యలక్షణ, జ్ఞానలక్షణ, యోగజన్యధర్మలక్షణములు నను నీత్రివిధములు అలౌకిక సంబంధములై యున్నవి. లౌకిక సంబంధమునకు నుదాహరణము, దానియొక్క స్వరూపము ప్రత్యక్ష నిరూపణమునందు చెప్పబడి యున్నవి.

అలౌకిక సంబంధమునకు నుదాహరణము.

ఎచ్చట నేకఘటముతో నేత్ర సంయోగమున్నదో అచ్చట నొకటియే ఘటమునకు నేత్రముచేత సాక్షాత్కారము గలుగుట లేదు. ఘటత్వాశ్రయ సకల ఘటములకు నేత్రముచేత సాక్షాత్కారము గలుగుచున్నది. నవీనమతమునందు నేత్ర సంయుక్త ఘటమునకు, దేశాంతరవృత్తి ఘటమునకును, ఒకక్షణమునందు సాక్షాత్కారము గలుగుచున్నది. ప్రాచీనమతమునందు నేత్ర సంయుక్త ఘటమునకు ప్రథమక్షణమునందు సాక్షాత్కారము గలుగుచున్నది. నవీనమతము నందు నేత్ర సంయుక్తఘటమునకు, దేశాంతరవృత్తి ఘటమునకును, ద్వితీయక్షణమునందు సాక్షాత్కారము గలుగుచున్నది. రెండు సాక్షాత్కారములు నేత్రజన్యములై యున్నవి. సంబంధము భిన్నమై యున్నది, అను నీరెండు మతములున్నవి. వీనిలో ప్రాచీనమతము సుగమమై యున్నది. అందువలన ప్రాచీనరీతియె

చెప్పంబడియున్నది. పురోవర్తి ఘటముతో నేత్రమునకు సంయోగము గలిగి "అయం ఘటః" అను నీరీతిగా నేకఘటమునకు సాక్షాత్కారము గలుగుచున్నది. ఈసాక్షాత్కారమునకు హేతువు సంయోగసంబంధమై యున్నది. అందువలన నీ సాక్షాత్కారము లౌకికసంబంధజన్యమై యున్నది. ఈసాక్షాత్కారమునకు విషయము ఘటము, ఘటత్వము నై యున్నవి. వానిలో వ్యక్తి విశేష్యమై యున్నది. ఘటత్వముప్రకారమై యున్నది. విశేషణము ప్రకార మనంబడును. ఈ జ్ఞానము నందు ప్రకార మగు ఘటత్వము యావద్ఘటమునం దున్నది. అందువలన పురోవర్తిఘటముయొక్క జ్ఞానకాలమునందు నేత్రేంద్రియమునకు స్వజన్యజ్ఞానప్రకారీభూతఘటత్వవత్తాసంబంధము సకలఘటమునం దున్నది. ఈసంబంధముచేత నేత్రేంద్రియజన్య సకల ఘటసాక్షాత్కారము ద్వితీయక్షణమునందు గలుగుచున్నది. ఈ సాక్షాత్కారమునకు విషయము పురోవర్తిఘటము కూడ ఐ యున్నది. ఎట్లనగా, ఘటత్వవత్త ఎట్లు అన్యఘటమునం దున్నదో అట్లు పురోవర్తి ఘటమునందు నున్నది. అందువలన ఘటగోచరములుగా నీరెండుజ్ఞానము లున్నవి. ప్రథమక్షణమునందు లౌకికజ్ఞానము గలుగుచున్నది. ద్వితీయక్షణమునం దలౌకిక జ్ఞానముగలుగుచున్నది. ఈసంబంధము లౌకికమై యున్నది. ఆలౌకిక సంబంధజన్య జ్ఞానముకూడ నలౌకికమై యున్నది. ఇంద్రియమునకు సకలఘటముతో స్వజన్య జ్ఞానప్రకారీభూత ఘటత్వవత్తాసంబంధ మున్నది. ఎచ్చట నేకఘటమునకు నేత్ర జన్య సాక్షాత్కార మున్నదో అచ్చట స్వశబ్దము నేత్రబోధకమై యున్నది. ఎచ్చట త్వగింద్రియముచేత నేకఘటమునకు జ్ఞాన మున్నదో అచ్చట స్వశబ్దము నకు త్వగ్బోధకత్వ మున్నది. ఈరీతిగా నేయింద్రియముచేత నేకవ్యక్తియొక్క జ్ఞానము గలుగుచున్నదో ఆయింద్రియజన్యముగానే సకల ఘటముయొక్క యలౌకిక సాక్షాత్కార మున్నది. నేత్రేంద్రియజన్యైకఘట లౌకిక సాక్షాత్కారము గలిగి త్వగింద్రియజన్య సకల ఘటవిషయకాలౌకిక సాక్షాత్కారము గలుగుట లేదు. నేత్రజన్యైకఘటజ్ఞానము గలిగినయెడల ఆచోట స్వమ్మనగా నేత్రము దానిచేత జన్యమైనది "అయం ఘటః" అను నీజ్ఞానము దానియందు ప్రకారీభూతము అనగా దానియొక్క యాధారత ఘటమునం దున్నది. ఈరీతిగా సకల ఘటజ్ఞానమునకు హేతువు ఉక్తసంబంధమై యున్నది. ఏక ఘటవిషయక జ్ఞానము గలిగినప్పుడు నేత్రజన్యజ్ఞానమునందు ఘటత్వము ప్రకారమై యున్నది. పురోవర్తి ఘటముయొక్క లౌకిక జ్ఞానముకంటె పూర్వమునం దుక్తసంబంధ

ము సంభవింపదు. అందువలన లౌకిక జ్ఞానము ప్రథమక్షణమునందు గలుగుచున్నది. అలౌకిక ముత్తరక్షణమునందు గలుగుచున్నది. ఇది ప్రాచీనరీతియై యున్నది. నవీనరీతిగా నొకటేజ్ఞానము సకల ఘటగోచరమై యున్నది. పురోవర్తి ఘటాంశమునందు లౌకికమై యున్నది. దేశాంతరస్థ ఘటమునం దలౌకికమై యున్నది. ప్రసంగప్రాప్తమగు నొకరీతి చెప్పబడినది. గ్రంథవిస్తర భయముచే నవీనరీతి విస్తారముగా చెప్పబడలేను. ఇది సామాన్యలక్షణ సంబంధమై యున్నది. జాతి సామాన్య మనంబడును. సామాన్యమనగా జాతి, లక్షణమనగా స్వరూపము, అందువలన జాతిస్వరూపము సంబంధమై యున్నది. ఇది సిద్ధమై యున్నది. నేత్రజన్య జ్ఞానప్రకారీభూత ఘటత్వవత్తారూప సంబంధము చెప్పుటవలన ఘటత్వమే సిద్ధమగుచున్నది. అందువలన నుక్తసంబంధము సామాన్యస్వరూపమై యున్నది. అథవా, ఘటత్వాధికరణతకు ఘటత్వవత్త యని పేరు. అదియు కూడ సామాన్యలక్షణ సంబంధమై యున్నది. ఎట్లనగా, అనేకాధికరణమునందు నధికరణతాధర్మము సామాన్యమై యున్నది. ఈస్థానమునందు అనేకమందే సమానధర్మ మున్నదో అదే సామాన్య శబ్దముయొక్క అర్థమై యున్నది. కేవల జాతియే సామాన్య శబ్దముయొక్క అర్థము కాదు. అందువలన ననేక ఘటమునందు ఘటముయొక్క యధికరణతయు కూడ సమానధర్మమై యుండుటవలన సామాన్య మనంబడును. ఈరీతిగా నేక వ్యక్తితో నింద్రియమునకు సంబంధము గలిగి ఇంద్రియ సంబంధియగు వ్యక్తియొక్క సమానధర్మసహితేంద్రియ సంబంధి సకల వ్యక్తితో సామాన్యలక్షణమగు నలౌకికసంబంధ మింద్రియమున కుండుటవలన వ్యవహితావ్యవహిత వస్తువులయొక్క యింద్రియజన్యాలౌకిక సాక్షాత్కారము గలుగుచున్నది.

జ్ఞానలక్షణ సంబంధమునకు నుదాహరణ సహితస్వరూపము. ఎచ్చట నింద్రియయోగ్య పదార్థముతో నింద్రియసంబంధ మున్నదో ఇంద్రియ సంబంధ కాలమునందు ఇంద్రియమున కయోగ్య పదార్థముయొక్క స్మృతి జ్ఞానము నున్నదో అచ్చట నింద్రియసంబంధి పదార్థముయొక్కయు, స్మృతిజ్ఞాన గోచర పదార్థముయొక్కయు నేక జ్ఞానము గలుగుచున్నది. అచ్చట నేపదార్థమునకు స్మృతి యున్నదో ఆయంశమునం దాజ్ఞాన మలౌకికమై యున్నది. ఏయంశముయొక్క జ్ఞానము ఇంద్రియసంబంధ జన్యమై యున్నదో ఆయంశమునందు లౌకికమై యున్నది. ఉదాహరణము, చందనముతో నేత్రమునకు సంయోగ మున్నది.

ఆకాలమునందు సుగంధధర్మమునకు స్మృతి గలిగినప్పుడు నేత్రేంద్రియజన్య "సుగంధి చందనం" అను ప్రత్యక్షము గలుగుచున్నది. అచ్చట చందనత్వ విశిష్టచందనము నేత్రమునకు యోగ్యమై యున్నది. చందన ధర్మమగు సుగంధముతో యద్యపి నేత్రసంయుక్త సమవాయ మున్నది. తథాపి సుగంధము నేత్రమునకు యోగ్యము కాదు. ఘ్రాణమునకు యోగ్యమై యున్నది. అందువలన నేత్రసంయుక్త సమవాయ సంబంధముచేత సుగంధధర్మమునకు చాక్షుష సాక్షాత్కారము గలుగుట లేదు. నేత్రసంయోగముచేత చందనవ్యక్తియొక్కయు, నేత్రసంయుక్త సమవాయముచేత చందనత్వముయొక్కయు చాక్షుష జ్ఞానము గలుగుచున్నది. చందనముయొక్క సుగంధగుణముతో నేత్రసంయుక్త సమవాయ సంబాధ ముండినను అకించిత్కరమై యున్నది. తథాపి నేత్రసంయోగ ముండినప్పుడే "సుగంధి చందనం" అను నీరీతిగా చందనగోచర చాక్షుషజ్ఞానము అనుభవసిద్ధమై యున్నది. అందువలన చందనవృత్తి సుగంధగుణముతో నేత్రముయొక్క సంబంధము ఏదైన నొకసాక్షాత్కారమునకు హేతువుగా నంగీకరింపవలసినది. అచ్చట నేదైననొక సంబంధము నేత్రమునకు సుగంధగుణముతో లేదు. నేత్రసంయుక్త సమవాయ మున్నది. అది గంధజ్ఞానమునకు జనకము కాదు. మఱియు నెవరికి చందనముయొక్క సుగంధత ఘ్రాణముచేత ననుభూతమై యున్నదో వారికే నేత్రముచేత చందనవిషయక "సుగంధి చందనం" అను నీజ్ఞానము గలుగుచున్నది. ఎవరికి చందనవిషయక సుగంధవత్త ఘ్రాణముచేత ననుభూతము కాలేదో వారికి చందనముతో నేత్రసంయోగ ముండినను "సుగంధి చందనం" అను జ్ఞానము గలుగుట లేదు. ఈ రీతిగా పూర్వానుభవజన్య సుగంధముయొక్క సంస్కారమునకు 'సుగంధిచందన' మ్మను ప్రత్యక్షముతో నన్వయవ్యతిరేకము లున్నవి. అందువలన 'సుగంధిచందన' మ్మను నీచాక్షుష జ్ఞానమునకు సుగంధానుభవ జన్యసంస్కారము, లేక సుగంధస్మృతియును హేతువులై యున్నవి. సుగంధ సంస్కారమునకును, లేక, స్మృతికిని సుగంధప్రత్యక్షమును గూర్చి స్వతంత్ర కారణత్వమును జెప్పినయెడల సుగంధాంశమునందు ఈ జ్ఞానము చాక్షుషము కాకపోవలయును. మఱియును "సుగంధి చందనం" అను నీజ్ఞానము సుగంధాంశమునందును చందన, చందనత్వములవలె చాక్షుషముగానే యనుభవసిద్ధమై యున్నది. అందువలన నాజ్ఞానమునకు హేతువగు సంస్కారమునకు, లేక, స్మృతికిని నేత్రసంబంధ మంగీకరిం

పవలసినది. నేత్రసంబంధము నంగీకరించినయెడల సుగంధజ్ఞానము లేక సంస్కారము స్మృతిరూప నేత్రసంబంధ జన్యమై యున్నది. అందువలన చాక్షుషమై యున్నది. సంస్కారము స్మృతి నేత్రనిరూపితమైనయెడల నేత్రమునకు సంబంధమగును. ఉ. ఘటనిరూపిత సంయోగము ఘటసంబంధ మనంబడును. పటనిరూపిత సంయోగము పటసంబంధ మనంబడును. ఈరీతిగా సుగంధగోచరస్మృతి, సంస్కారము కూడ నేత్రనిరూపిత మైనయెడల నేత్ర సంబంధము కూడ సంభవించును. అన్యథా నేత్రసంబంధముచే సుగంధ స్మృతినిగాను సుగంధసంస్కారముగాను జెప్పుట సంభవింపదు. అందువలన నీరీతి నేత్ర నిరూపితమై యున్నది. ఎప్పుడు చందనముయొక్క సాక్షాత్కారమున్నదో అప్పుడు, మనస్సునకు నాత్మకును సంబంధము గలిగి, మనో నేత్రములకు సంబంధము గలుగుచున్నది. ఆత్మసంయుక్త, మనస్సంయుక్త నేత్రమునకు చందనముతో సంయోగ మున్నది. ఈరీతిగా నాత్మమనస్సులయొక్క సంయోగము చందన సాక్షాత్కారమునకు హేతువై యున్నది. ఏకాలమునందు నాత్మసంయుక్త మనస్సునకు నేత్రముతో సంయోగ మున్నదో ఆకాలమునందు సుగంధముయొక్క స్మృతి సుగంధసంస్కారము ఆత్మయందు సమవాయ సంబంధముచేత గలుగుచున్నది. దానికి విషయము సుగంధమై యున్నది. అందువలన స్వసంయుక్త మనస్సంయుక్తాత్మసమవేతజ్ఞానము, లేక స్వసంయుక్త మనస్సంయుక్తాత్మసమవేత సంస్కారమును, చందనముయొక్క సుగంధమునందున్నవి. ఎట్లనగా, స్వశబ్దముచేత నేత్రమునకు గ్రహణము, దానితో సంయుక్తమైనది అనగా సంయోగసహితమైనది మనస్సు, దానితో సంయుక్తమనగా సంయోగసహితమగు నాత్మ, దానియందు సమవేతమనగా సమవాయ సంబంధముచేత సుగంధస్మృతివృత్తి యున్నది. సుగంధముయొక్క సంస్కారము కూడ సమవాయ సంబంధముచేత నాత్మవృత్తియై యున్నది. అందువలన నేత్రసంయుక్త, మనస్సంయుక్త ఆత్మసమవేత స్మృతిజ్ఞానము, నేత్రసంయుక్త మనస్సంయుక్త, ఆత్మసమవేత సంస్కారమును, ఈరెండును నేత్రనిరూపితములై యున్నవి. ఈపరంపరయును నేత్రఘటిత స్వరూపముగా నున్నది. అందువలన నేత్రసంబంధమై యున్నది. ఈపరంపరాసంబంధమునకు ప్రతియోగి నేత్రమై యున్నది. అనుయోగి సుగంధమై యున్నది. దేనియందు సంబంధ మున్నదో అది సంబంధమునకు ననుయోగి యనంబడును. స్మృతిరూప - లేక - సంస్కార

రూప - ఉక్తపరంపరచేత నేత్రముయొక్క యేసంబంధ మున్నదో దానికి విషయము సుగంధమై యున్నది. అందువలన నుక్తసంబంధమునకు సుగంధము అనుయోగియై యున్నది. జ్ఞానముయొక్క యధికరణత విషయమునం దనుభవసిద్ధమై యున్నది. అందువలన నాత్మవలె విషయముకూడ జ్ఞానమునకు నధికరణముగా, ననుయోగిగాను జెప్పబడున్నది. ఉ. "ఘటె జ్ఞానం" అను నీవ్యవహారము గలిగినప్పుడు ఘటవృత్తిజ్ఞానము అను నీయుక్తవాక్యార్థము సిద్ధించుచున్నది. ఈరీతిగా విషయముకూడ ఆత్మవలె జ్ఞానమునకు నాధారమైనందున ననుయోగియై యున్నది. సమవాయసంబంధముచేత నాత్మ జ్ఞానమునకు నాధారమై యున్నాడు. సుగంధాదివిషయము విషయతా సంబంధముచేత జ్ఞానమునకు నాధారమై యున్నది. జ్ఞానమునకు నేది యాధారమై యున్నదో అది సంస్కారమునకును నాధారమై యున్నది. ఎట్లనగా, పూర్వానుభవముచేత సంస్కార ముత్పన్న మగుచున్నది. అనుభవముయొక్క సమానవిషయ సహితోత్తర స్మృత్యాదిక ముత్పన్నమగుచున్నది. అందువలన (1) పూర్వానుభవము (2) సంస్కారము (3) స్మృతి ఈమూటికిని, ఆశ్రయము, విషయము, సమానమై యున్నవి. అందువలన సుగంధగోచర సంస్కారముకూడ విషయతాసంబంధము చేత సుగంధమునందున్నది. అందువలన నేత్రప్రతియోగిక సంస్కారమునకు సుగంధ మనుయోగియై యున్నది. ఈరీతిగా స్మృతిరూప - లేక - సంస్కారరూప-సంబంధము నేత్రమునకు సుగంధముతో నున్నది. సంయోగసంబంధము చందనవ్యక్తితో నున్నది. సంయుక్తసమవాయము చందనత్వముతో నున్నది. అందువలన నీమూటిని విషయీకరించు "సుగంధి చందన" మ్మనుసాక్షాత్కారము గలుగుచున్నది. సుగంధిసహితము చందనము అని వాక్యముయొక్క యర్థము. నేత్రముచేత సుగంధ, చందనత్వ, చందనములయొక్క సాక్షాత్కారము గలిగినప్పుడు చందనత్వముతో లౌకికసంబంధ మున్నది. సంయోగాది విషయసంబంధము లౌకికసంబంధ మనంబడును. స్మృతియును, సంస్కారమును లౌకికసంబంధముకంటె భిన్నమైనందున అలౌకిక మనంబడును. ఎచ్చట చందనముతో నేత్ర సంబంధకాలమునందు సుగంధస్మృతి యనుభవసిద్ధమై యున్నదో అచ్చట స్మృతిరూపసంబంధ మున్నది. స్మృతియొక్క యనుభవము లేనియెడల సంస్కారమే సంబంధమై యున్నది. ఈ యలౌకికసంబంధము జ్ఞానలక్షణ సంబంధ మనంబడును. స్మృతియందు జ్ఞానశబ్దముయొక్క ప్రయోగము ప్రసిద్ధముగా నున్నది.

సంస్కారముగూడ జ్ఞానజన్యమై యున్నది. ఉత్తరజ్ఞానమునకు జనకమై యున్నది. అందువలన జ్ఞానమునకు సంబంధియైనందున జ్ఞానముగా జెప్పబడుచున్నది.

ఈరీతిగానే యోగులకు నింద్రియసంబంధియొక్క సాక్షాత్కారమువలె నింద్రియముతో వ్యవహితముయొక్కయు సాక్షాత్కారము గలుగుచున్నది. అచ్చట యోగాభ్యాసముచేత నింద్రియమునందు విలక్షణసామర్థ్యము గలుగు చున్నది. అందువలన యోగజధర్మమే ఇంద్రియముయొక్క సంబంధముగా జెప్పబడును. దీనియందు మతభేదము లున్నవి.

జగదీశభట్టాచార్యుల మత మేమనగా ఏ యింద్రియమున కేపదార్థము యోగ్యమై యున్నదో ఆ యింద్రియముచేత నా పదార్థముయొక్క సాక్షాత్కారము కలుగుచున్నది. యోగికి వ్యవహితముయొక్కయు, భూత, భావియొక్కయు, ఇంద్రియ జన్యసాక్షాత్కారము కలుగుచున్నది. యోగులకంటె నితరులకు వర్తమానేంద్రియసంబంధియొక్క సాక్షాత్కారము కలుగుచున్నది. ఏ యింద్రియమునకు నేపదార్థము యోగ్యముకాదో ఆ యింద్రియముచేత నా పదార్థముయొక్క సాక్షాత్కారము యోగులకును కలుగుటలేదు. ఉ. రూపముయొక్క జ్ఞానము నేత్రముచేతనే కలుగుచున్నది. రసనాదికముచేత కలుగుట లేదు.

కొందఱు గ్రంథకారులయొక్క మత మేమనగా, యోగికి నుద్భూతమహిమ యున్నది. అభ్యాసముయొక్క యుత్కర్షాపకర్షములవలన యోగజ ధర్మము విలక్షణమై యున్నది. కొందఱి పురుషులయందు నభ్యాసముయొక్క యుత్కర్షము చేత నీధర్మము గలుగుచున్నది. ఒక యింద్రియముచేత యోగ్యాయోగ్య మగు సకలవిషయకజ్ఞానము గలుగుచున్నది. కొందఱియందు నభ్యాసముయొక్క యపకర్షముచేత యోగ్యవిషయకజ్ఞానమునకే సామర్థ్య మున్నది. సర్వప్రకారముగా యోగజధర్మముచేత వ్యవహితవిషయకజ్ఞానము కలుగుచున్నది. అందువలన యోగజధర్మము కూడ అలౌకిక సంబంధమై యున్నది.

158. న్యాయమతమునం దలౌకిక సంబంధముచేత శుక్తియందు దేశాంతరస్థ రజతత్వముయొక్క ప్రత్యక్షభానము. ఆభానముకంటె సుగంధి చందనముయొక్క భానమునకు వైలక్షణ్యము.

ఈరీతిగా నింద్రియసంయోగాది సంబంధములేకయే అలౌకిక సంబంధము చేత నింద్రియజన్య సాక్షాత్కార ముండుటవలన దేశాంతరస్థ రజతవృత్తి రజ

తత్వమునకును శుక్తియందు నలౌకిక సంబంధముచేత చాక్షుషసాక్షాత్కారము సంభవించుచున్నది. ఉ. సుగంధిస్మృతి చందనముతో నేత్రసంయోగ మూడిన యెడల ''సుగంధి చందనః'' మ్మను నీ రీతిగా యోగ్యాయోగ్యానుభవ గోచర చాక్షుష జ్ఞానము కలుగుచున్నది. ఈ రీతిగా దోషసహిత నేత్రమునకు శుక్తితో సంయోగ మున్నది. శుక్తివ్యక్తి నేత్రమునకు యోగ్యమై యున్నది. రజతత్వ జాతి యద్యపి ప్రత్యక్షయోగ్యమై యున్నది, తథాపి జాతికి నాశ్రయ మగు వ్యక్తి యెచ్చట ప్రత్యక్షమై యున్నదో అచ్చట జాతి యోగ్యమై యున్నది. ఎచ్చట జాత్యాశ్రయము ప్రత్యక్షయోగ్యము కాదో అచ్చట జాతి అయోగ్యమై యున్నది. ఈ ప్రసంగమునందు రజతత్వమునకు నాశ్రయమగు రజతవ్యక్తి నేత్రముతో వ్యవహితమై యున్నది. అందువలన నేత్రయోగ్యము కాదు. ఎట్లు సుగంధాంశమునందు చందనజ్ఞానము అలౌకికమై యున్నదో అట్లు ''ఇదం రజతం'' అనుజ్ఞానము కూడ రజతత్వాంశమునందు నలౌకికమై యున్నది. అయిన ఇంతమాత్రభేధ మున్నది. ''సుంగధి చందనం'' అను నీజ్ఞానముచేత చందనవృత్తి సుగంధి చందనమునందు భాసించుచున్నది. ''ఇదం రజతం'' అను ని జ్ఞానముచేత నిదంపదార్థమునందవృత్తి యగు రజతత్వము ఇదంపదార్థమునందు భాసించుచున్నది. ఈరీతిగానే మఱియును విలక్షణత్వ మున్నది ''సుగంధిచందనం'' అను నీజ్ఞానముచేత నేత్రమునకు నయోగ్యమగు సుగంధము భాసించుచున్నది. చందనముయొక్క సకల సామాన్య విశేషత్వము భాసించుచున్నది. ''ఇదం రజతం'' అను నీజ్ఞానముచేత రజతము వ్యవహితమైనందున నేత్రమునకు నయోగ్యమగు రజతత్వముయొక్క భానము సుగంధభానమునకు సమానమై యున్నది. అయిన చందనముయొక్క విశేషరూపమగు చందనత్వభానమువలె శుక్తియొక్క విశేషరూపమగు శుక్తిత్వభానము లేదు. మఱియును మలయాచలోద్భూత కాష్ఠవిశేషరూప చందనముయొక్క అవయవము భాసించుచున్నది. శుక్తియొక్క త్రికోణతాది విశిష్టావయవము భాసించుట లేదు. ఈరీతిగా రెండుజ్ఞానములకు భేదమున్నది. ఉక్తభేదకృత మయియే క్రమముగా యథార్థత్వాయథార్థత్వము లున్నవి. యద్యపి ఇంద్రియ సంయోగమును, అయోగ్యధర్మస్మృతిరూప సామగ్రియును రెండు జ్ఞానములయందును సామాన్యమై యున్నవి, సామగ్రీభేదము లేక ఉక్తప్రకారమునకు వైలక్షణ్యము సంభవింపదు. తథాపి సామగ్రియందు దోషసాహిత్యరూప విలక్షణత్వ మున్నది. అందువలన నుక్తవిలక్షణత్వము సంభవించుచున్నది.

ఎట్లు "సురభి చందనం" అను నీస్థానమునందు జ్ఞానవిలక్షణసంబంధ నిరూపకత్వము నేత్రముల కున్నదో అట్లు "ఇదం రజతం" అను నీస్థానమునందును నేత్ర సంయుక్త మనస్సంయుక్తాత్మసమవేత జ్ఞాన మున్నది. దానికి నిరూపకము నేత్రమై యున్నది. విషయము రజతత్వమై యున్నది. అది స్మృతిజ్ఞానమునకు ననుయోగియై యున్నది. ఏవిషయముయొక్క జ్ఞానమున్నదో అది విషయతా సంబంధము చేత జ్ఞానమునకు ననుయోగియై యున్నది. నేత్రముతో సంయోగ సహితముగ నుండుటవలన నేత్రసంయుక్తము మనస్సై యున్నది. దానితో సంయుక్తము అనగా సంయోగసహితము ఏ యాత్మయున్నదో ఆయాత్మయందు సమవేతజ్ఞానము రజతత్వస్మృతియై యున్నది. అది విషయతా సంబంధము చేత రజతత్వమునం దున్నది. ఈరీతిగా నేత్రసంయుక్త మనస్సంయుక్తాత్మ సమవేతజ్ఞాన రూప నేత్రమునకు సంబంధము రజతత్వమునం దుండుటవలన నేత్రసంబద్ధ రజతత్వమునకు భ్రమజ్ఞానము ప్రత్యక్షమై యున్నది.

అథవా జ్ఞానరూప సంబంధము లేదు. జ్ఞానముయొక్క విషయతా సంబంధ మున్నది. అందువలన నేత్ర సంయుక్త, మనస్సంయుక్తాత్మసమవేతజ్ఞాన విషయతా సంబంధము అలౌకిక సంబంధమై యున్నది. "సుగంధి చందనం" అను నీ స్థానమునందు సంబంధరూపోక్త విషయత్వము సుగంధమునం దున్నది. "ఇదం రజతం" అను నీ స్థానమునందు నేత్ర సంయుక్త, మనస్సంయుక్తాత్మ సమవేతజ్ఞానము రజతత్వస్మృతియై యున్నది. దానియొక్క విషయత్వము రజతత్వమునం దున్నది. ఈరీతిగా విషయతాంశమును సంబంధమునందు కలుపుట వలన సంబంధమునకు ననుయోగి యగు సుగంధము, రజతత్వమును, స్పష్టమై యున్నవి. అందువలన నన్యథాఖ్యాతివాదము సంభవించుచున్నది. నేత్రముయొక్క సంబంధములేక రజతత్వజ్ఞానము సంభవించుట లేదు. ఈదోషము అన్యథాఖ్యాతివాదమునందు లేదు. ఈరీతిగా రజతత్వరూప విశేషణముతో నేత్రమునకు నలౌకికసంబంధమును, శుక్తిరూప విశేష్యముతో లౌకిక సంబంధమును అంగీకరించి యన్యథాఖ్యాతి సంభవము చెప్పంబడి యున్నది.

## 159. అనిర్వచనీయ ఖ్యాతియందు న్యాయోక్త దోషము.

అనిర్వచనీయ ఖ్యాతియందు నీదోషము చెప్పబడి యున్నది. అన్యథాఖ్యాతివాదికి భ్రమజ్ఞాన కారణత్వము దోషమునం దంగీకరింపవలసినది. అనిర్వచనీయఖ్యాతివాదికిని రజతాద్యనిర్వచనీయ విషయముయొక్క కారణతా

జ్ఞానముయొక్క కారణతయును అంగీకరింపవలసినది. అందువలన నన్యథా ఖ్యాతి వాదమునందు లాఘవ మున్నది. మఱియు ననిర్వచనీయ ఖ్యాతివాదికి నన్యథాఖ్యాతి లేక నిర్వాహణములేదు. కొన్ని స్థలములయందు నన్యథాఖ్యాతిని అంగీకరింప వలసినది. మఱియు గొన్ని స్థలములయందు ననిర్వచనీయ ఖ్యాతి యంగీకరింపబడి యున్నది. అందువలన నన్యథాఖ్యాతి నంగీకరించుటయే యోగ్యమై యున్నది. అన్యథాఖ్యాతి నంగీకరించినయెడల నద్వైత వాదికి స్వమత గ్రంథముతో విరోధము కలుగదు. కేవలా నిర్వచనీయ ఖ్యాతిచేత నిర్వాహము కలుగుట లేదు. ఎచ్చట ననిర్వచనీయ ఖ్యాతి సంభవించుటలేదో అచ్చట నద్వైత మతముయొక్క గ్రంథమునందు నన్యథాఖ్యాతి వ్రాయబడి యున్నది. ఎచ్చట ననాత్మపదార్థమునందు నబాధ్యత్వరూప సత్యత్వప్రతీతి కలుగుచున్నదో అచ్చట ననిర్వచనీయాబాధ్యత్వమునకు ననాత్మపదార్థమునం దుత్పత్తిని జెప్పిన యెడల నజన్మకు జన్మ కలిగినది, నిత్యమునకు ధ్వంసము కలిగినది, అనునీ వాక్యములతో సమానమై యీకథనము విరుద్ధమగును. అందువలన నాత్మ సత్యత్వమునకు ననాత్మయందు ప్రతీతిరూపాన్యథాఖ్యాతియే సంభవించుచున్నది. ఈస్థానమునందు నన్యథాఖ్యాతియే అద్వైతగ్రంథమునందు వ్రాయబడి యున్నది. పరోక్ష భ్రమస్థలమునందును అద్వైతగ్రంథమునందు అన్యథాఖ్యాతియే చెప్పబడి యున్నది. దీనియొక్క తాత్పర్య మేమనగా, ప్రత్యక్షజ్ఞానము నియమముగా వర్తమాన గోచరమై యున్నది. ఏవిషయమునకు ప్రమాతతో సంబంధ మున్నదో ఆ విషయముయొక్క జ్ఞానము ప్రత్యక్ష మనంబడును. వ్యవహిత రజతముయొక్క రజతత్వమునకు ప్రమాతతో సంబంధము సంభవింపదు. అందువలన పురోవర్తి దేశమునందు రజతమునకు సత్త అవశ్య మంగీకరింప వలసినది. పరోక్షజ్ఞానము అతీతమునకును, భవిష్యత్తునకును కలుగుచున్నది. అందువలన పరోక్షజ్ఞానముయొక్క విషయమునకు ప్రమాతతో సంబంధము అపేక్షితముగా లేదు. మఱియును సంభవింపదు. ఎట్లనగా, ఎచ్చట ననుమాన ప్రమాణముచేత, లేక, శబ్దప్రమాణముచేత, దేశాంతరస్థ, కాలాంతరస్థముల యొక్క యథార్థజ్ఞానము కలుగుచున్నదో అచ్చట భిన్నదేశస్థ, భిన్నకాలస్థములకు ప్రమాతతో సంబంధము లేదు. భ్రమరూప పరోక్షజ్ఞానమునందైననో ప్రమాతతో విషయముయొక్క సంబంధము సర్వథా యసంభావితమై యున్నది. అందువలన పరోక్ష భ్రమస్థలమునందు ననిర్వచనీయఖ్యాతి లేదు, ఇక

నేమనగా, విషయశూన్యదేశమునందు విషయప్రతీతిరూపాన్యథాఖ్యాతి యున్నది. ఈరీతి ననేకస్థలములలో నన్యథాఖ్యాతి నంగీకరించి యపరోక్ష భ్రమయందు నెచ్చట వ్యవహితము ఆరోపితమై యున్నదో ఆస్థానమునందు ననిర్వచనీయఖ్యాతి యంగీకరింప బడియున్నది. ఎచ్చట పూర్వోక్త దేశమునందు నధిష్ఠాన సంబంధి యారోపితమైనయెడల నచ్చటను అన్యథాఖ్యాతి యున్నది. ఎట్లనగా, అధిష్ఠానగోచరవృత్తి కలిగినప్పుడు ఆరోపితవస్తువునకు ప్రమాతతో సంబంధము, అన్యథాఖ్యాతి నంగీకరించినను సంభవించుచున్నది. అనిర్వచనీయ విషయమున కుత్పత్తి నిష్ఫలమై యున్నది. ఈరీతిగా నద్వైతవాదిమతమునందు, ఏకానిర్వచనీయ ఖ్యాతిచేత నిర్వాహము కలుగుట లేదు. మఱియును అన్యథాఖ్యాతి నంగీకరించినయెడల ననిర్వచనీయ ఖ్యాతినిగూడ అంగీకరింపవలసినది. ఎచ్చట వ్యవహితారోప మున్నదో, ప్రత్యక్షభ్రమయును గూడ ఉన్నదో, ఆ స్థానమునం దద్వైతవాదిచే నన్యథాఖ్యాతికి నసంభవము జెప్పబడియున్నది. అచ్చటను ఉక్తరీతిగా నేత్రమునకు జ్ఞానలక్షణ సంబాధము సంభవించుచున్నది. అందువలన ప్రత్యక్షభ్రమ సంభవించుటవలన ననిర్వచనీయ ఖ్యాతియొక్క యంగీకారము ప్రయోజన శూన్యగౌరవ దూషితమై యున్నది.

160. సామాన్య లక్షణాద్యలౌకిక సంబాధములకు ప్రత్యక్షజ్ఞాన హేతుత్వము సంభవింపనందున భ్రమజ్ఞానమునకు నింద్రియాజన్యత్వము.

అనంత నిరర్థకప్రలాపము పూర్వమునందు నైయాయికునిచే వివేకము లేనందున చేయబడి యున్నది. ఎట్లన, సామాన్యలక్షణాది సంబాధము ప్రత్యక్ష జ్ఞానమునకు హేతువుగా జెప్పినయెడల అది సకలానుభవమునకు విరుద్ధముగా నున్నది. ఎవరికి నేకఘట విషయక నేత్రజన్యజ్ఞానము కలుగుచున్నదో ఆతనను అడుగవలసిన దేమనగా, ఎంత ఘటములయొక్క సాక్షాత్కారము నీకు కలిగి యున్నది? అప్పుడు ప్రశ్నకర్తను గూర్చి ద్రష్ట చెప్పున దేమనగా, నా నేత్రమునకు నభిముఖముగా నేక ఘట మున్నది ఎంత ఘటములయొక్క సాక్షాత్కారము గలిగినది? అని నీ యొక్క యీ ప్రశ్న యవివేకముచేత గలుగుచున్నది. ఈరీతిగా ఘటద్రష్ట ప్రశ్నకు నుపాలంభమును పరిహాసమును జేయుచున్నాడు. నైయాయిక రీతిగా లౌకికాలౌకిక భేదముచేత సకల ఘటవిషయక ప్రత్యక్ష సామగ్రియు నుండుటవలన నుపాలంభము సంభవింపదు. ఇట్లు ఉత్తరము చెప్పతగినది. ఏక ఘటమునకు లౌకిక చాక్షుషము కలిగి యున్నది. అలౌకిక చాక్షుష సాక్షాత్కా

రము సర్వథా కలిగి యున్నది. మఱియును వ్యవహిత ఘట విషయక సాక్షా త్కారమును వినిన యందఱకు హృదయమునందు విస్మయము కలుగుచున్నది. అందువలన సామాన్యలక్షణ సంబంధముచేత సాక్షాత్కారము సర్వలోక విరుద్ధమై యున్నది, సర్వతంత్ర విరుద్ధ మయ్యును ఉన్నది. అయినను ఏక ఘట విషయక సాక్షాత్కారము గలిగినప్పుడు ఘటాంతరమునకు సజాతీయత్వముచేత స్మృత్యాదికము సంభవించుచున్నది. ఈరీతిగానే "సురభి చందనం" అను నీప్రతీతి యందు చందనమునందు సుగంధధర్మావగాహి చాక్షుష సాక్షాత్కారము జ్ఞాన రూప సంబంధముచేత నేత్రజన్యమై యున్నది, అను నీకథనముకూడ నైయాయికులకు విరుద్ధమై యున్నది. ఎట్లన, ఏ పురుషునకు చందన సాక్షాత్కారమున్నదో ఆయనను అడుగవలసిన దేమనగా, ఏమి చూడబడినది? అప్పుడు ద్రష్ట యద్యపి 'సుగంధి చందనం దృష్టం' అని చెప్పుచున్నాడు. తథాపి తిరిగి వివేచనములో ఈ చందనమునందు సుగంధ మున్నది అను నీజ్ఞానము నీకు ఏప్రకారముగా కలిగి యున్నది? అని అడిగినయెడల అప్పుడు ద్రష్ట 'యిది శ్వేతచందనము అందువలన సుంగధము దీనియం దవశ్యముగా నుండవలసినది. రక్తచందనమునందు సుగంధ ముండుట లేదు. ఈరీతిగా శ్వేతమునందు గంధ మున్నది.' ఈరీతిగా సుగంధజ్ఞానమునందు ననుమానజన్యతాసూచకము లయిన వచనములు చెప్పుచున్నాడు. నేత్రముచేత సుగంధి విషయక సాక్షాత్కారము నాకు కలిగి యున్నది, అని యుత్తరము చెప్పుట లేదు. అందువలన సుగంధజ్ఞానము నేత్రజన్యప్రత్యక్ష రూపముగా లేదు. ఇక నేమనగా, సుంగధాంశమునందు ఆజ్ఞానమనుమితియై యున్నది. చందనాంశమునందు ప్రత్యక్షమై యున్నది. "సుగంధి చందనం" అను నీవాక్యప్రయోగ సహితచందనద్రష్టను అడుగవలసిన దేమనగా, 'ఈచందనమునం దల్పగంధ మున్నదా? అథవా ఉత్కటగంధ మున్నదా? అప్పుడు ఇట్లుత్తరమును జెప్పుచున్నాడు. నేత్రముచేత శ్వేతచందనము ప్రతీతమగుచున్నది; అందువలన గంధసామాన్యమునకు ననుమితి యున్నది; గంధముయొక్క ప్రత్యక్షము కలిగినయెడల గంధముయొక్క యుత్కర్షాపకర్షజ్ఞానము కలుగును; అందువలన గంధముయొక్క యుత్కర్షాపకర్షములు నాసికముచే న్ఘ్రాణము జేసినయెడల జ్ఞాన మగుచున్నవి; నేత్రముచేత శ్వేతచందన జ్ఞానము కలుగుచున్నది; దానివలన గంధసామాన్యముయొక్క జ్ఞానమగును; అని యుత్తరమును చెప్పుటచేతను సుగంధజ్ఞానమునకు ననుమితి కలుగుచున్నది,

ప్రత్యక్షము కలుగుట లేదు. ఏ యింద్రియములచేత రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములయొక్క జ్ఞానము కలుగుచున్నదో ఆ యింద్రియములచేత రూపాదికముయొక్క యుత్కర్షాపకర్ష జ్ఞానము కలుగుచున్నది. నేత్రేంద్రియముచేత గంధ జ్ఞానము గలిగినయెడల గంధముయొక్క యుత్కర్షాపకర్ష జ్ఞానము కావలయును, అందువలన చందనమునందు సుగంధజ్ఞానము అనుమితి రూపమై యున్నది, ప్రత్యక్షము కాదు. అనుమితిజ్ఞానముచేత నుత్కర్షాపకర్షముల అప్రతీతి అనుభవసిద్ధమై యున్నది. ధూమముచేత వహ్నిజ్ఞానము కలిగినప్పుడు వహ్నియొక్క యల్పత్వ, మహత్త్వములయొక్క జ్ఞానము కలుగుట లేదు. మఱియును లౌకికసంబంధ జన్యప్రత్యక్షముచేత విషయముయొక్క ఉత్కర్షాపకర్షలు భాసించుచున్నవి. అలౌకికముచేత విషయములయొక్క సామాన్యధర్మము భాసించుచున్నది విశేషధర్మము భాసించుటలేదు, అని నైయాయికుడు చెప్పినయెడల అదియును అసంగతమై యున్నది. ఎట్లన, సామాన్యధర్మముతో షష్ఠోక్తజ్ఞానము చేతను విశేషవిషయముయొక్క ప్రకాశము సంభవించుచున్నది. అప్రసిద్ధసంబంధముచేత నప్రసిద్ధప్రత్యక్షకల్పనము నిష్ప్రయోజనమై యున్నది. మఱియును విశేషరూపముతో సుగంధమునకు ప్రకాశము కలుగుటలేదు. సామాన్యరూపముతో సుగంధమునకు ప్రకాశమున్నది. ఈసుగంధజ్ఞానము నేత్రముచేత కలుగుచున్నది అను నీ నైయాయిక వచనముచేత యీావక్ష్యమాణము సిద్ధమగుచున్నది. నేత్రముచేత శ్వేతచందనముయొక్క సాక్షాత్కారము కలిగినప్పుడే సుగంధముయొక్క సామాన్యజ్ఞానరూపానుమితి గలుగుచున్నది. అనుమితికి ప్రయోజకము చందనముయొక్క శ్వేతతాజ్ఞానముద్వారా నేత్రమై యున్నది. ఈరీతిగా సుగంధముయొక్క జ్ఞానము నేత్రజన్యము కాదు, అనుమితియై యున్నది. మఱియు నైయాయికుడు చెప్పునదేమనగా యద్యపి నేత్రజన్యసుగంధ విషయకజ్ఞానము ఉత్కర్షాపకర్షములను ప్రకాశింపజేయుట లేదు. అందువలన ననుమితికి సమానమై యున్నది. తథాపి అనుమితిరూపము దీనికి సంభవింపదు. ఎట్లన, "సుగంధి చందనం" అను నీ జ్ఞానము ఏకమై రెండు కానియెడల నొకటే జ్ఞానమునకు, సుగంధాంశమునం దనుమితిత్వమును చందనాంశమునందు ప్రత్యక్షత్వమును జెప్పినయెడల, అనుమితిత్వ, ప్రత్యక్షత్వరూపవిరోధి ధర్మములకు సమావేశము కలుగును. అందువలన సర్వాంశమునందు ప్రత్యక్షమై యున్నది, అను నీ కథనముగూడ సంభవింపదు. ఎట్లనగా, నీమతమునందు నేక

జ్ఞానమునందు ఎట్లు లౌకికత్వాలౌకికత్వరూప విరోధి ధర్మములకు సమావేశ మున్నదో అనుమితిత్వ, ప్రత్యక్షత్వ ధర్మములకును ఏకజ్ఞానమునందు సమావేశము సంభవించు చున్నది. ప్రత్యక్షత్వానుమితిత్వములకు విరోధము న్యాయశాస్త్ర సంస్కారసహితులకు ప్రతీతమగుచున్నది. లౌకికత్వాలౌకికత్వములు పరస్పరాభావరూపములై యున్నవి. అందువలన వానియొక్క విరోధము అందఱకును భాసించుచున్నది. ప్రతియోగ్యభావములకు విరోధ మున్నదని సకలలోకములయందును ప్రసిద్ధమై యున్నది. అందువలన లోక ప్రసిద్ధ విరోధసహిత ధర్మములకు సమావేశమును నైయాయికు డంగీకరించి యున్నందువలన విరోధిపదార్థములకు సమావేశము కానేరదు, అను నీవాక్యము నిర్లజ్జతామూలకమై యున్నది. మఱియును వేదాంత మతమునం దైననో అంతఃకరణముయొక్క వృత్తిరూపజ్ఞానము సాంశమైనందున ఏకవృత్తియందు నంశభేదముచేత విరోధిధర్మములకు సమావేశము సంభవించుచున్నది. న్యాయ మతమునందు జ్ఞానము జన్యమై యున్నది, ద్రవ్యముగు కాదు. అందువలన సాంశము కాదు. నిరంశజ్ఞానమునందు విరోధిధర్మములకు సమావేశము బాధితమై యున్నది అందువలన "సుగంధి చందనం" అనునీజ్ఞానము సుగంధాంశమునం దనుమితియై యున్నది. చందనాంశమునందు ప్రత్యక్షమై యున్నది. అథవా జ్ఞానమునకు నుపాదాన మగు నంతఃకరణము సాంశమై యున్నది. అందువలన నంతఃకరణ పరిణామము రెండుజ్ఞానములై యున్నవి. సుగంధి యను నీ జ్ఞానము అనుమితి రూపమై యున్నది. చందనం అను నీజ్ఞానము ప్రత్యక్షమై యున్నది. ఈ రెండు పరిణామములును ఏకకాలమునందు కలుగుచున్నవి. అందువలన వానియొక్క ద్విత్వము ఎప్పుడును భాసించుటలేదు. ఏరీతిగా "సురభి చందనం" అను నీ జ్ఞానము సుగంధాంశమునందు చాక్షుషము కాదు. ఈ జ్ఞానమునకు నే దైననొకరీతిగా అలౌకిక జన్యత్వము చెప్పినను, తథాపి "ఇదం రజతం" ఇత్యాది భ్రమస్థలమునందైన ఉక్తరీతిగా సంభవించుటలేదు. ఎట్లనగా శుక్తితో నేత్రము యొక్క సంబంధమునకును, రజతత్వ స్మృతికిని "ఇదం రజతం" అను నీ జ్ఞానముయొక్క కారణత్వము నంగీకరించువాని నడుగ వలసినదేమనగా, శుక్తితో నేత్రమునకు సంబంధము కలిగి శుక్తిరజతసాధారణ ధర్మమగు చాకచక్య విశిష్ట శుక్తియొక్క యిదంరూపముతో సామాన్యజ్ఞానము కలిగి రజత స్మృతి కలుగుచున్నది. తదనంతరము భ్రమకలుగుచున్నదా? అథవా శుక్తియొక్క సామాన్య

జ్ఞానమునకు పూర్వమునందే శుక్తితో నేత్రసంబంధము కలిగి ఆకాలమునందు రజతత్వ విశిష్టరజతమునకు స్మృతి కలిగి "ఇదం రజతం" అనుని భ్రమ కలుగుచున్నదా? ప్రథమపక్షము చెప్పినయెడల సంభవింపదు. ఎట్లనగా ప్రథమమునందు శుక్తిసామాన్యజ్ఞానము, తదుత్తరమునందు రజతత్వ రజతములయొక్క స్మృతి, తదుత్తరమునందు రజతభ్రమయును, అను నీ రీతిగా మూడుజ్ఞానముల యొక్క ధారానుభవముచేత బాధితములై యున్నవి. "ఇదం రజతం" అను న యొకటి జ్ఞానము అందఱకును ప్రసిద్ధమై యున్నది. మఱియును ఒకడు చెప్పిన దేమనగా ప్రథమమునందు శుక్తియొక్క సామాన్యజ్ఞానము కలుగకయే శుక్తితో నేత్రమునకు సంయోగకాలమునందు రజతస్మృతి కలిగి "ఇదం రజతం" అనుని భ్రమ కలుగుచున్నది. అదియు కూడ సంభవింపదు. ఎట్లనగా సకలజ్ఞానము చేతనరూపస్వప్రకాశమై యున్నది. వృత్తిరూపజ్ఞానము సాక్షిభాస్యమై యున్నది. ఏ జ్ఞానము ఏ కాలమునందును అజ్ఞాతము కాలేదు. ఈసంగతి యుత్తరత్ర ప్రతిపాదింపబడును. అందువలన శుక్తితో నేత్రముతో సంయోగకాలమునందు రజతముయొక్క స్మృతి కలిగినయెడల స్మృతికిని ప్రకాశము కావలయును. స్మృతియందు చేతనభాగమైననో స్వయంప్రకాశమై యున్నది. వృత్తిభాగమునకు సాక్ష్యధీనమగు సదాప్రకాశ మున్నది. అందువలన స్మృతియొక్క యనుభవము కావలయును. మఱియును నైయాయికుని శపథపూర్వకముగా నడుగవలసిన దేమనగా శుక్తియందు "ఇదం రజతం" అను నీభ్రమకు పూర్వకాలమునందు రజతస్మృతియొక్క యనుభవము నీకు ఉన్నదా? అప్పుడు యథార్థవక్తవైననో స్మృతియొక్క యనుభవము లేదని చెప్పును. అందువలన శుక్తితో నేత్రసంయోగకాలమునందు భ్రమకు పూర్వమునందు రజతస్మృతి సంభవింపదు.

తిరిగి చెప్పునదేమనగా, రజతానుభవజన్య రజతగోచర సంస్కారసహిత నేత్రసంయోగముచేత రజతభ్రమ కలుగుచున్నది. సంస్కారగుణము ప్రత్యక్షయోగ్యము కాదు. ఇక నేమనగా, అనుమేయమై యున్నది. అందువలన నుక్తదోషము లేదు తథాపి ఆయాన నడుగవలసిన దేమనగా ఉద్బుద్ధసంస్కారము భ్రమజనకమై యున్నదా? లేక ఉద్బుద్ధానుద్బుద్ధము లగు నీరెండు సంస్కారములును భ్రమజనకములై యున్నవా? రెంటికిని జనకత్వము చెప్పినయెడల నసంభవదోషమగును. ఎట్లనగా, అనుద్బుద్ధ సంస్కారముచేత స్మృత్యాదిజ్ఞానము ఎప్పుడును సంభవించుటలేదు. అనుద్బుద్ధ సంస్కారముచేతను స్మృతికలిగినయెడల

అనుద్బుద్ధ సంస్కారముచేత సర్వదా స్మృతి కలిగియుండవలయును. అందువలన నుద్బుద్ధ సంస్కారముచేత స్మృతి కలుగుచున్నది. ఈరీతిగానే భ్రమజ్ఞానముకూడ ఉద్బుద్ధ సంస్కారముచేతనే సంభవించును. అందువలన నుద్బుద్ధ సంస్కారము భ్రమకు జనకమై యున్నది, అని చెప్పినయెడల అదియును సంభవింపదు. ఎట్లనగా, సంస్కారమునకు నుద్బోధకము సదృశదర్శనాదికమై యున్నది. అందువలన శుక్తితో నేత్రముయొక్క సంయోగముచేత చాకచక్య విశిష్ట శుక్తియొక్క జ్ఞానము కలిగి అనంతరమునందు రజతగోచర సంస్కారమునకు నుద్బోధము సంభవించుచున్నది. నేత్ర శుక్తులయొక్క సంయోగకాలమునందు రజతగోచర సంస్కారమునకు నుద్బోధము సంభవింపదు. అందువలన నిది యంగీకరింపవలయును. ప్రథమక్షణమునందు నేత్ర సంయోగము, ద్వితీయక్షణమునందు చాకచక్యధర్మ విశిష్ట శుక్తియొక్క జ్ఞానము, తదుత్తరక్షణమునందు సంస్కారమునకు నుద్బోధము, తదుత్తరక్షణమునందు రజత భ్రమయును సంభవించుచున్నవి. ఈరీతిగా నేత్ర సంయోగముచేత చతుర్థక్షణమునందు భ్రమజ్ఞానమునకు నుత్పత్తి సిద్ధించుచున్నది. అది అనుభవముచేత బాధితమై యున్నది. నేత్ర సంయోగావ్యవహితోత్తర క్షణమునందు చాక్షుష జ్ఞానము కలుగుచున్నది. ఈరీతిగానే యనుభవ మున్నది. అందువలన నుక్తప్రకార మసంగతమై యున్నది.

మఱియును. ఉక్తరీతిగా శుక్తియొక్క జ్ఞానద్వయము సిద్ధమగుచున్నది. (1) ఒకటి సంస్కారమున కుద్బోధకమగు సామాన్యజ్ఞానము. (2) మఱియు నొకటి సంస్కారజన్య భ్రమజ్ఞానము. ఈరీతిగా శుక్తివిషయక జ్ఞానద్వయము అనుభవసిద్ధమై యున్నది. నేత్రసంయోగ ముండుటవలననే "ఇదం రజతం" అను నీ యొకటే జ్ఞానము అనుభవసిద్ధమై యున్నది. అందువలన రజతానుభవజన్య సంస్కార సహిత నేత్ర సంయోగముచేత "ఇదం రజతం" అను నీభ్రమ కలుగుచున్నది, అని చెప్పుటకును సంభవింపదు. మఱియును "సుగంధి చందనం" అనునీ జ్ఞానమునకు నలౌకిక ప్రత్యక్షము నంగీకరించినను "ఇదం రజతం" అనునీజ్ఞానము జ్ఞానలక్షణాలౌకిక సంబంధజన్యముగా సంభవింపదు. ఎట్లనగా, "సుగంధి చందనం" అను నీజ్ఞానము కలిగి గంధముయొక్క యుత్కర్షాపకర్ష విషయక సందేహము కలుగుచున్నది. అందువలన సుగంధముయొక్క ఉత్కర్షాపకర్ష విషయక నిశ్చయరూప ప్రాకట్యము అలౌకిక జ్ఞానముచేత కలుగదని యంగీకరింపవలసినది. అలౌకిక జ్ఞానముచేతను విషయముయొక్క ప్రాకట్యము కలిగిన యెడల

సుగంధముయొక్క యపకర్షాదివిషయక సందేహము సంభవింపదు. “ఇదం రజతం” అనునీ భ్రమచేత సత్యరజతముయొక్క ప్రాకట్యము సమమై యున్నది. భ్రమస్థలమునందు రజతమునకు ప్రాకట్యము లేనియెడల పరిమాణాది సందేహము కావలయును. పరిమాణాది విషయక సందేహము కలుగుట లేదు. అందువలన భ్రమజ్ఞానముచేత రజతముయొక్క ప్రాకట్యము కలుగుచున్నది. మఱియును జ్ఞానలక్షణ సంబంధజన్య జ్ఞానముచేత విషయముయొక్క ప్రాకట్యము కలుగుట లేదు. అందువలన “ఇదం రజతం” అను నీ భ్రమజ్ఞానమునకు హేతువు జ్ఞానలక్షణాసంబంధము కాదు. విచారముచేసినయెడల జ్ఞానరూపసంబంధము ఎక్కడను సంభవించును. ఎట్లన జ్ఞానలక్షణ సంబంధముచేత అలౌకికప్రత్యక్ష మగుచున్నది. ఈ పక్షముయొక్క నిష్కర్ష యేమనగా ఎచ్చట ఏకపదార్థముయొక్క యనుభవజన్య స్మృతి యున్నదో లేక అనుభవజన్య సంస్కార మున్నదో మఱియు పరపదార్థముతో ఇంద్రియముయొక్క సంబంధ మున్నదో అచ్చట ఇంద్రియ సంబంధియందు స్మృతిగోచర పదార్థముయొక్క లేక సంస్కారగోచరపదార్థముయొక్క ప్రతీతి కలుగుచున్నది. ఇంద్రియ సంబంధి పదార్థము విశేష్యరూపముతో ప్రతీత మగుచున్నది. స్మృతిగోచర పదార్థము విశేషణరూపముతో ప్రతీత మగుచున్నది. ‘సుగంధి చందనం’ అను నీజ్ఞానమునందు నేత్రరూపేంద్రియసంబంధి యగు చందనము విశేష్యమై యున్నది, స్మృతిగోచర సుగంధము విశేషణమై యున్నది. ఈ లాగుననే ‘ఇదం రజతం’ అను నీభ్రమజ్ఞానమందును ఇంద్రియ సంబంధమగు శుక్తి విశేష్యమై యున్నది, స్మృతిగోచరమగు లేక సంస్కారగోచరమగు రజతత్వము విశేషణమై యున్నది. విశేషణ విశేష్యములగు నీరెంటియొక్క జ్ఞానము ప్రత్యక్షమై యున్నది, అను నీపక్షమును అంగీకరించినయెడల అనుమాన ప్రమాణమునకు ఉచ్ఛేదమగును ఎట్లన ‘పర్వతో వహ్నిమాన్’ అను నీ యనుమితిజ్ఞానము అనుమాన ప్రమాణముచేత కలుగుచున్నది. హేతువునందు సాధ్యవ్యాప్తియొక్క స్మరణముచేత లేక సాధ్యవ్యాప్తియొక్క ఉద్బుద్ధ సంస్కారముచేత అనుమితి జ్ఞానము కలుగుచున్నది. ఈయర్థము అనుమాననిరూపణమునందు నిర్ణీతమై యున్నది. సాధ్యవ్యాప్తియొక్క స్మృతి కలిగినప్పుడు వ్యాప్తినిరూపకసాధ్యమునకును స్మృతి కలుగుచున్నది. అందువలన పర్వతముతో నేత్రముయొక్క సంయోగముచేతను వహ్నియొక్క స్మృతిచేతను ‘పర్వతో వహ్నిమాన్’ అను నీప్రత్యక్ష జ్ఞానము సంభవించుటవలన పక్షమునందు సాధ్యనిశ్చయ రూపానుమితి జ్ఞాన

మునకు జనకమగు ననుమానప్రమాణాంగీకారము నిష్ఫలమై యున్నది. గౌత
మ కణాద కపిలాది సర్వజ్ఞకృత సూత్రమునందు అనుమానప్రమాణము ప్రత్య
క్షముకంటె భిన్నముగా చెప్పబడియున్నది. అనుమాన ప్రమాణము నిష్ప్రయో
జన మైనయెడల సూత్రమునందు చెప్పబడకపోవును. అందువలన అనుమాన
ప్రయోజనసాధక జ్ఞానరూపసంబంధజాలౌకిక ప్రత్యక్షము అళీకమై యున్నది.
అన్యథాఖ్యాతివాది చెప్పునదేమనగా ప్రత్యక్షజ్ఞానముయొక్క విషయతకంటె
అనుమితిజ్ఞానముయొక్క విషయత విలక్షణమై యున్నది. దానివలకు ప్రత్యక్ష
విషయమునందు పరిమాణాది సందేహము కలుగుట లేదు. మఱియు అనుమితి
విషయమునందు పరిమాణాది విషయక సందేహము కలుగుచున్నది. ఈరీతిగా
పరోక్షతాపరోక్షతారూప మగు విషయతాభేదము అనుమితిజ్ఞాన ప్రత్యక్ష
జ్ఞానములయొక్క భేదముచేత గలుగుచున్నది. అందువలన పరోక్షతారూప
విషయతకు సంపాదకము ప్రత్యక్షజ్ఞానము కాదు. ఇంకేమనగా అనుమితిజ్ఞానమే
అయియున్నది. దానికి హేతువు అనుమాన ప్రమాణమై యున్నది, అను నీకథ
నము కూడ సంభవింపదు. ఎట్లన లౌకిక ప్రత్యక్షముయొక్క విషయత అనుమితి
కంటె విలక్షణమై యున్నది.అయిన'సుగంధి చందనం' ఇత్యాదిజ్ఞానము సుగంధాం
శమునందు అలౌకికమై యున్నది. అచ్చట సుగంధముయొక్క జ్ఞానము అనుమితికి
సమానమై యున్నది. ఎట్లు అనుమితి జ్ఞానముయొక్క విషయమునందు ఉత్క
ర్షాదికము అనిర్ణీతమై యున్నదో అట్లు సుగంధముయొక్క ఉత్కర్ష కూడ
అనిర్ణీతమై యున్నది. అందువలన అలౌకిక ప్రత్యక్షముయొక్క విషయతకు
అనుమితివిషయతకంటె భేదము లేదు. భ్రమరూపాలౌకిక ప్రత్యక్ష విషయత
రజతాదికమునం దున్నది. దానికి యద్యపి అనుమితివిషయతకంటె భేదము అను
భవసిద్ధమై యున్నది. అందువలన రజతముయొక్క అల్పతాది సంశయము కలు
గుట లేదు. తథాపి జ్ఞానలక్షణసంబంధ జన్యాలౌకిక ప్రత్యక్షభ్రమయొక్క విష
యతకంటె భేదము లేదు. ఎట్లు అనుమితి విషయమునందు అప్రాకట్యమున్నదో
అట్లు అలౌకిక ప్రత్యక్షప్రమావిషయమునందు అప్రాకట్య మున్నది. అందు
వలన జ్ఞానలక్షణసంబంధముచేత పర్వతమునందు వహ్నికి అలౌకిక ప్రత్యక్షము
చేత ప్రకాశము సంభవించుచున్నది. అనుమితిజ్ఞానముకొఱకు అనుమాన
ప్రమాణము వ్యర్థమగును. అనుమానప్రమాణము సర్వజ్ఞవచనసిద్ధమై యున్నది.
అందువలన అనుమానమునకు వ్యర్థసంపాదక మగు అలౌకిక ప్రత్యక్షము అసిద్ధ
మై యున్నది.

మఱియు విలక్షణవిషయతా సంపాదకము అనుమితిజ్ఞానమై యున్నది. దానికి ప్రమాణమగు ననుమానప్రమాణము వ్యర్థము కాదు, అని చెప్పినయెడల ఈవచనముకూడ అసంగతమై యున్నది. ఎట్లన ఎచ్చట అనుమానప్రమాణము చేత అనుమితి కలుగుచున్నదో అచ్చట అలౌకిక ప్రత్యక్షసామగ్రి యున్నది. ఉదాహరణము, పర్వతమునందు వహ్నియొక్క యనుమితికి పూర్వము ధూమదర్శనము వ్యాప్తిజ్ఞానము అనుమితిసామగ్రి ఆయి యున్నవి. మఱియు పర్వతముతో నేత్రముయొక్క సంబంధము వహ్నియొక్క స్మృతియును అలౌకిక ప్రత్యక్షసామగ్రిగా యున్నది. ఈ రెండు జ్ఞానములయొక్క రెండు సామగ్రులు ఉండుటవలన పర్వతమునందు వహ్నిప్రత్యక్షరూపజ్ఞానమే కలుగుచు, అనుమితిజ్ఞానము కలుగుట లేదు. అందువలన అనుమానప్రమాణము వ్యర్థమే అగుచున్నది. ఎట్లన ఈవత్ప్రమాణము శాస్త్రనిర్ణీతార్థమై యున్నది. ఎచ్చట ఏకగోచరానుమితి సామగ్రియొక్కయో అపరగోచరప్రత్యక్ష జ్ఞానముయొక్కయో సమావేశ మున్నదో అచ్చట అనుమితిసామగ్రి ప్రబలమై యున్నది. ఉదాహరణము, పర్వతముతో నేత్రసంయోగరూప పర్వతప్రత్యక్షసామగ్రియొక్కయు వహ్న్యనుమితి సామగ్రియొక్కయు సమావేశ ముండినయెడల వహ్నియొక్క యనుమితి కలుగుచున్నది, పర్వతముయొక్క ప్రత్యక్షము కలుగుట లేదు. ఎచ్చట ధూమముతో వహ్నితోను నేత్ర సంయోగము ఉన్నదో ధూమమందు వహ్నివ్యాప్తి జ్ఞానమున్నదో అచ్చట వహ్న్యనుమితి సామగ్రియును వహ్నిప్రత్యక్ష సామగ్రియును ఉన్నవి. అందువలన సమానగోచరోభయజ్ఞానసామగ్రి యుండినచోట ప్రత్యక్షసామగ్రి ప్రబలమై యున్నది. అందువలన వహ్నిప్రత్యక్ష జ్ఞానమే కలుగుచున్నది, వహ్న్యనుమితి కలుగుటలేదు. పురుషులయందు 'పురుషో న వా' అను సందేహము కలిగి 'పురుషత్వవ్యాప్యకరాదిమా నయం' అను ప్రత్యక్షరూప పరామర్శజ్ఞానమును పురుషునితో నేత్రసంయోగమును ఉండినచోట పరామర్శము పురుషవిషయకానుమితిసామగ్రి యయ్యును పురుషునితో నేత్రసంయోగము పురుష ప్రత్యక్షసామగ్రి యయ్యును ఉన్నది. అచ్చట పురుషప్రత్యక్షజ్ఞానమే కలుగుచున్నది. పురుషునియొక్క యనుమితి కలుగుటలేదు. అందువలన ఏకవిషయములైన రెండు జ్ఞానములయొక్క సామగ్రి యుండినయెడల వానిలో ప్రత్యక్షసామగ్రి ప్రబలమై యున్నది. అందువలన వహ్న్యనుమితిసామగ్రి యుండినను అలౌకిక సంబంధరూప సామగ్రిచేత వహ్నిప్రత్యక్షజ్ఞానమే కలుగును. ఈరీతిగా జ్ఞానలక్షణాలౌకిక సంబంధముచేత

ప్రత్యక్షజ్ఞానముయొక్క యుత్పత్తిని అంగీకరించిన యెడల అనుమాన ప్రమాణము వ్యర్థమగును.

నైయాయికులు చెప్పునదేమనగా యద్యపి భిన్నవిషయ ముండినచోట ప్రత్యక్షసామగ్రికంటె అనుమితి సామగ్రి ప్రబలమై యున్నది. సమానవిషయ ముండినచోట అనుమితిసామగ్రికంటె ప్రత్యక్షసామగ్రి ప్రబలమైయున్నది. తథాపి సమానవిషయ ముండుటచేతను లౌకికప్రత్యక్షసామగ్రి అనుమితిసామగ్రికంటె ప్రబలమై యున్నది. అలౌకిక ప్రత్యక్షసామగ్రి అనుమితిసామగ్రికంటె దుర్బలమై యున్నది. అందువలన పర్వతమునందు వహ్న్యనుమితిసామగ్రిచే అలౌకిక ప్రత్యక్షసామగ్రికి బాధ కలుగుటవలన అనుమాన ప్రమాణము నిష్ఫలము కాదు. అను నీ వచనముకూడ సరి కాదు. ఎట్లన ఎచ్చట స్థాణువునందు "స్థాణు ర్వా వా" అను నీ సందేహముకలిగి "పురుషత్వవ్యాప్యకరాదిమా నయం" అను నీ భ్రమ కలిగి 'పురుష ఏ వాయం' అను నీ భ్రమప్రత్యక్షము కలుగుచున్నదో, అచ్చట నైయాయిక వచనరీతిగా అనుమితి కావలయును, ప్రత్యక్షము కాకపోవలయును. ఎట్లన నుక్తస్థలమునందు స్థాణువునందు పురుషత్వప్రత్యక్ష ముండుటవలన భ్రమ ప్రత్యక్ష మున్నది. మఱియు భ్రమప్రత్యక్షముయొక్క యీమతమునందు అలౌకిక సామగ్రి యున్నది. అందువలన అనుమితిసామగ్రికంటె అలౌకిక ప్రత్యక్షసామగ్రిని దుర్బలముగా అంగీకరించినయెడల ఉక్తస్థలమునందు అనుమితి కావలయును. మఱియు ఉక్తస్థలమునందు పురుషభ్రమను అనుమితిరూపముగా అంగీకరించిన యెడల ఉత్తరకాలమునందు 'పురుషం అనుమినోమి' అను నీ యనువ్యవసాయము కావలయును. అందువలన రెండు సమానవిషయ మైనప్పుడు లౌకిక ప్రత్యక్షసామగ్రివలె అలౌకిక ప్రత్యక్షసామగ్రియును ప్రబలమై యున్నది. అనుమితిసామగ్రి దుర్బలమై యున్నది. అందువలన జ్ఞానలక్షణ సంబంధముచేత ప్రత్యక్షముయొక్క యుత్పత్తిని అంగీకరించినయెడల అనుమితిజ్ఞానమును బాధించియే పర్వతాదికమునందు వహ్న్యాదికముయొక్క ప్రత్యక్షజ్ఞానమే కలుగును. అందువలన అనుమాన ప్రమాణము నిష్ఫలమగును. ఈప్రకారముగా అనుమానప్రమాణమును ఎవరు అంగీకరించినారో వారి మతమునందు స్మృతిజ్ఞానసహితేంద్రియ సంయోగముచేత లేక సంస్కారసహితేంద్రియ సంయోగముచేత వ్యవహితవస్తువుయొక్క ప్రత్యక్షజ్ఞానము సంభవింపదు. అందువలన శుక్తికి రజతత్వరూపముతో ప్రతీతిరూపాన్యథాఖ్యాతి సంభవింపదు.

### 161. అనిర్వచనీయ వాదమునందు న్యాయోక్త దోషములయొక్క యుద్ధారము

మఱియు అనిర్వచనీయ ఖ్యాతివాదమునందు ఏదోషము చెప్పబడి యున్నదో అదియేమనగా, అనిర్వచనీయఖ్యాతి మతమునందు విషయముయొక్కయు జ్ఞానముయొక్కయు కారణతాదోషము అంగీకరింపబడి యున్నది. అన్యథాఖ్యాతి వాదమునందు జ్ఞానముయొక్క కారణత యంగీకరింపబడియున్నది, విషయముయొక్క కారణత యంగీకరింపబడ లేదు. అందువలన అన్యథాఖ్యాతివాదమునందు లాఘవ మున్నది. మఱియు అనిర్వచనీయఖ్యాతివాదికి అన్యథాఖ్యాతియును అంగీకరింప వలసినది, అన్యథాఖ్యాతివాదికి అనిర్వచనీయఖ్యాతిని అంగీకరించుట అవశ్యముకాదు. అందువలనను లాఘవ మున్నది, అను నీ వచనముకూడ అవివేకమూలకమై యున్నది. ఎట్లన అన్యథాఖ్యాతివాదిచేత శ్రుతిస్మృతులయొక్క యాజ్ఞానుసారముగా స్వప్నమందైన అనిర్వచనీయఖ్యాతి అవశ్యమని అంగీకరింప వలసినది. వేదోక్తార్థమునకు పురుషమతికల్పితయుక్తి సముదాయముచేత అన్యథాభావ కల్పనము ఆస్తికునకు యోగ్యముకాదు. మఱియు శుక్తిరజతములకు తాదాత్మ్యము ప్రతీత మగుచున్నది. ఎట్లు ఇదంపదార్థమునందు రజతత్వముయొక్క సమవాయము ప్రతీత మగుచున్నదో అట్లు ఇదంపదార్థమునకును రజతమునకును తాదాత్మ్యము ప్రతీత మగుచున్నది. ఇదంపదార్థము శుక్తియై యున్నది. శుక్తిరజతములయొక్క తాదాత్మ్యము అన్యస్థానములయందు ప్రసిద్ధము కాదు. అందువలన పురోవర్తి దేశమునందు శుక్తిరజతములయొక్క తాదాత్మ్యము అనిర్వచనీయముగా ఉత్పన్నమగుచున్నది. అనిర్వచనీయ తాదాత్మ్యమునకు ఉత్పత్తిని అంగీకరింపనియెడల అప్రసిద్ధముయొక్క యపరోక్షప్రతీతి కాక పోవలయును. మఱియుక్త తాదాత్మ్యముయొక్క యపరోక్షప్రతీతి కలుగుచున్నది, మఱియు నైయాయికుడు ఆగ్రహముచేత చెప్పునదేమనగా శుక్తియందు రజతత్వముయొక్క సమవాయమే భాసించుచున్నది. దీని తాత్పర్యమేమనగా, సమవాయసంబంధముచే రజతత్వము భాసించుచున్నది, శుక్తిరజతములయొక్క తాదాత్మ్యము భాసించుట లేదు, అని చెప్పినయెడల శుక్తిజ్ఞానోత్తరకాలమునందు 'నేదం రజతం' అను నీబాధ కలుగుచున్నది. దానికి బాధ్యము ఇదంపదార్థమునందు రజతముయొక్క తాదాత్మ్యమై యున్నది. భ్రమకాలమునందు ఇదంపదార్థమునందు రజత తాదాత్మ్యము భాసింపనియెడల బాధ నిర్విషయము కావలయును. కేవలరజతముయొక్క సమ

వాయమే శుక్తియందు భాసించినయెడల ' నాత్ర రజతం ' అను నీబాధ కావల యును. అందువలన శుక్తియందు రజతముయొక్క తాదాత్మ్యము భాసించు చున్నది. ఆశుక్తిరజతములయొక్క తాదాత్మ్యము ఉభయసాపేక్షమై యున్నది. ఎక్కడను ప్రసిద్ధము కాదు. అందువలన అనిర్వచనీయ తాదాత్మ్యముయొక్క యుత్పత్తి యన్యథాఖ్యాతివాదమునకును ఆవశ్యకమై యున్నది. కేవలాన్యథాఖ్యా తివలన నిర్వాహమగుట లేదు.

మఱియు అనిర్వచనీయఖ్యాతివాదిచేత అన్యథాఖ్యాతి అంగీకరింపవల సినది. అద్వైతగ్రంథకారులచేతను అంగీకరింపబడినది, అను నీ వచనముకూడ అద్వైతగ్రంథాభిప్రాయాజ్ఞానమూలకమై యున్నది. ఎట్లన, అద్వైతవాదము నందు ఎక్కడను అన్యథాఖ్యాతి లేదు, అనిర్వచనీయ ఖ్యాతి యున్నది. విశేషము చెప్పవలసినదేమి యున్నది? ఎచ్చట ప్రమాజ్ఞానము చెప్పబడియున్నదో అచ్చట అద్వైతసిద్ధాంతమునందు విషయముజ్ఞానము అనిర్వచనీయమై యున్నవి. కొన్ని స్థలములయందు అన్యథాఖ్యాతి వ్రాయబడియున్నది. దానికి తాత్పర్యమేమి యనగా ఎచ్చట అధిష్ఠానారోప్యములకు సంబంధ మున్నదో పరోక్షభ్రమయు ఉన్నదో అచ్చట అన్యథాఖ్యాతియు సంభవించుచున్నది. అయిన అన్యథాఖ్యా తి సంభవించుట లేదు. ఎచ్చట ఆరోప్యము వ్యవహితమై యుండి యపరోక్షభ్రమ కలుగుచున్నదో అచ్చట అనిర్వచనీయఖ్యాతి ఆవశ్యకమై యున్నది. అందువలన ఆవశ్యకానిర్వచనీయఖ్యాతినే అంగీకరింపవలసినది. ఈరీతిగా అన్యథాఖ్యాతి కథనము సంభవాభిప్రాయ మూలకమై యున్నది, అంగీకరణీయత్వాభిప్రాయము చేత కాదు. ఎచ్చట ఆత్మసత్తయును అనాత్మయందు అన్యథాఖ్యాతిగా చెప్పబడియున్నదో, అచ్చటను ఆత్మసత్తయొక్క యనిర్వచనీయసంబంధ ముత్పన్న మగుచున్నది. ఈరీతిగా ఎచ్చట అనిర్వచనీయ సంబంధికి ఉత్పత్తి సంభవిం చుట లేదో అచ్చట అనిర్వచనీయసంబంధాధికార మున్నది. ఈలాగుననే పరోక్షభ్రమ యుండినచోటను అనిర్వచనీయ విషయమునకు ఉత్పత్తి బ్రహ్మవి ద్యాభరణమునందు వ్రాయబడియున్నది. అయిన పరోక్షభ్రమ యుండినచోట అన్యథాఖ్యాతిని అంగీకరించినను దోషము లేదు. అందువలన సరళబుద్ధిచే పరో క్షభ్రమ అన్యథాఖ్యాతిరూపము గా చెప్పబడినది.

మఱియు ఒకడు చెప్పునదేమనగా "త దే వేదం రజతం" అనునీరీతిగా శుక్తి యందు రజత ప్రత్యభిజ్ఞాభ్రమ యుండినచోట అనిర్వచనీయ రజతమునందు పురో

న ర్తిదేశమునందు ఉత్ప త్తి నంగీకరించినయెడల సన్నిహితరజతమునందు త త్త సంభవింపదు. అందువలన దేశాంతరస్థరజతవృత్తి రజతత్వమునకును త త్తకును శు క్తిపదార్థమునందు ప్రతీతి కలుగుచున్నది. అథవా తాదాత్మ్యసంబంధముచేత దేశాంతరస్థరజతమునకు ప్రతీతి కలుగుచున్నది. అందువలన శు క్తిస్థలమునందు అన్యథాఖ్యాతి ఆవశ్యకమై యున్నది.

అను నీకథనముకూడ అసంగతమై యున్నది. ఎట్లన, శు క్తిప్రత్యభిజ్ఞయందును అనిర్వచనీయ రజతమే విషయమై యున్నది. దేశాంతరస్థరజతము కాదు. ఎట్లన ప్రమాతతో సంబంధములేక అపరోక్షావభాసము సంభవించుటలేదు. దేశాంతరస్థ రజతమునకు ప్రమాతతో సంబంధము బాధితమై యున్నది. అందువలన దేశాంతరస్థ రజతమునకు ప్రతీతి గలుగుటలేదు. ఎచ్చట యథార్థప్రత్యభిజ్ఞ యున్నదో అచ్చటను తత్తాంశమందు స్మృతియున్నది,అని సిద్ధాంత మున్నది. అందువలన 'త దే వేదం రజతం అను' నీ భ్రమరూపప్రత్యభిజ్ఞకూడ తత్తాంశమునందు స్మృతిరూపమై యున్నది. 'ఇదం రజతం' అను నీయేతావన్మాత్రాంశమునందు అనిర్వచనీయ ప్రత్యక్ష మున్నది. అందువలన ఎక్కడను అన్యథాఖ్యాతి ఆవశ్యకముకాదు. ఎచ్చట అనిర్వచనీయవిషయమున కుత్పత్తి సంభవించుట లేదో అచ్చట అనిర్వచనీయ సంబంధమున కుత్పత్తి యున్నది. ఉదాహరణము, ఆత్మానాత్మలకు అన్యోన్యాధ్యాస ముండినచోట అనాత్మయం దాత్మయును ఆత్మధర్మమును అనిర్వచనీయముగా నుత్పన్నమగుచున్నవి, అని చెప్పుట సంభవింపదు. అందువలన ఆత్మకును ఆత్మధర్మమునకును అనాత్మయందు అనిర్వచనీయ సంబంధముత్పన్న మగుచున్నది. ఈరీతిగా అనిర్వచనీయఖ్యాతిచేత నిర్వాహము గలుగుచున్నది. ఎక్కడను అన్యథాఖ్యాతి యంగీకరింప నవసరములేదు.

మఱియు, అన్యథాఖ్యాతివాదిచే అనిర్వచనీయ ఖ్యాతియందే గౌరవము చెప్పబడి యున్నది. దోషమునకు అనిర్వచనీయ రజతముయొక్కయు అజ్ఞానముయొక్కయు కారణత్వము అంగీకరించుటకంటె కేవలజ్ఞానమునకు కారణత్వమును అంగీకరించుటయందు లాఘవ మున్నది. అన్యథాఖ్యాతివాదమునందు రజతము దేశాంతరమునందు ప్రసిద్ధమై యున్నది. ఆ రజతత్వధర్మమునకు శు క్తియందు జ్ఞానము గలుగుచున్నది, అథవా తాదాత్మ్యసంబంధముచేత రజతమునకు శు క్తియందు జ్ఞానము గలుగుచున్నది. ఈరీతిగా కేవలజ్ఞానమే దోషజన్యమై యున్నది.

మఱియు, అనిర్వచనీయఖ్యాతివాదిమతిమందు విషయము జ్ఞానము ఈరెండు దోషజన్యములే యని చెప్పబడియున్నది. అందువలన గౌరవ మున్నది, అను నీకథనముగూడ అసంగతమై యున్నది. ఎట్లన లాఘవబలముచేత అనుభవసిద్ధపదార్థమునకు లోపమును జేసినయెడల యథార్థజ్ఞానముయొక్క విషయమునుగూడ అంగీకరింపక విజ్ఞానవాద రీతిగా కేవల విజ్ఞానమే అంగీకరించినయెడల అతిలాఘవ మున్నది ఎట్లు అనుభవసిద్ధ ఘటాదికమును అంగీకరించి లాఘవసహాకృతవిజ్ఞానవాదము త్యక్తమైనదో అట్లు అపరోక్షప్రతీతిసిద్ధ రజతాదికమును అంగీకరించి అన్యథాఖ్యాతివాదముకూడ త్యాజ్యమై యున్నది.

మఱియు విచారించిన యెడల గౌరవముకూడ అన్యథాఖ్యాతివాదిమతమం దున్నది. ఎట్లన, దేశాంతరస్థరజతమునకు జ్ఞానమును అంగీకరించు వారి మతమం దీవక్ష్యమాణగౌరవ మున్నది. రజతనేత్ర సంయోగమునకు రజత సాక్షాత్కారమునందు కారణత నిర్ణీతమై యున్నది. అనిర్ణీతమునకు త్యాగము గలుగును. రజతాలోకసంయోగముచేత రజతసాక్షాత్కారము నిర్ణీతమైయున్నది. అన్యథాఖ్యాతివాదమునందు శుక్త్యాలోక సంయోగముచేత రజతభ్రమ సాక్షాత్కారము గలుగుచున్నది. అది అనిర్ణీతమై యున్నది. (అక్లప్తమై యున్నది). అందువలన అనిర్ణీతముయొక్క యంగీకార మున్నది. ఈలాగుననే జ్ఞానలక్షణ సంబంధము అప్రసిద్ధమై యున్నది. అందువలన అప్రసిద్ధాంగీకార మున్నది. జ్ఞానలక్షణసంబంధ మంగీకరించినను ఏపదార్థమునకు అలౌకిక సంబంధముచేత ప్రత్యక్షము గలుగుచున్నదో దానికి ప్రాకట్యము గలుగుట లేదు. దానిచేత 'సుగంధి, చందనం,'అనునీరీతిగా సుగంధమునకు లౌకికప్రత్యక్ష ముండినను 'సుగంధం సాక్షాత్కరోమి,' అను నీ యనువ్యవసాయము గలుగుట లేదు. అలౌకిక సంబంధజన్య రజతభ్రమము గలిగి రజతమునకు ప్రాకట్యము గలుగుచున్నది. అందు నిమిత్తమై భ్రమోత్తరకాలమునందు 'రజతం సాక్షాత్కరోమి' అను నీ యనువ్యవసాయము గలుగుచున్నది. ఈరీతిగా జ్ఞానలక్షణ సంబంధజన్య యథార్థ జ్ఞానమునందు ప్రాకట్యజనకత్వము లేదు. భ్రమస్థలమందు లౌకిక జ్ఞానమునకు ప్రాకట్యజనక ముండినను అప్రసిద్ధికల్పన యున్నది. ఈరీతిగా అనేకప్రకారాప్రసిద్ధి కల్పన అన్యథాఖ్యాతివాదమునం దుండుటవలన ఈపక్షమునందే గౌరవ మున్నది. దోషమునకు అనిర్వచనీయ విషయజనకత్వమైన శ్రుతిస్మృతి బలముచేత స్వప్నమం దున్నది, అప్రసిద్ధకల్పన లేదు. బ్రహ్మానందకృతానిర్వచనీయవాదమందు అన్యథాఖ్యాతి

ఖండనము విశేషముగా చెప్పబడి యున్నది. ఆప్రకారము కఠినమై యున్నది. అందువలన బ్రహ్మవిద్యాభరణముయొక్క సుగమరీతిగా అన్యథాఖ్యాతి వాదము నకు హేయత ప్రతిపాదింపబడినది. అందువలన అన్యథాఖ్యాతి అసంగతమై యున్నది.

## 162—178. అఖ్యాతివాదప్రకారము తత్ఖండనము.

### 162. అఖ్యాతివాదియొక్క తాత్పర్యము.

ఎట్లు అన్యథాఖ్యాతి అసంగతమై యున్నదో అట్లు అఖ్యాతివాదము కూడ అసంగతమై యున్నది. అఖ్యాతివాదము ప్రభాకరునిది. ఈయన తాత్పర్య మేమన అన్యశాస్త్రమందు యథార్థాయథార్థభేదముచేత జ్ఞానము ద్విప్రకార ముగా నంగీకరింపబడియున్నది. యథార్థజ్ఞానముచేత ప్రవృత్తి నివృత్తియును సఫలమై యున్నవి. అయథార్థజ్ఞానముచేత ప్రవృత్తి నివృత్తియును నిష్ఫలమగు చున్నవి, అను నీ సకల శాస్త్రలేఖనము అసంగతమై యున్నది. ఎట్లన అయ థార్థజ్ఞానము అప్రసిద్ధమై యున్నది. జ్ఞానము యథార్థముగానే యున్నది. అయ థార్థజ్ఞానము కూడ ఉండినయెడల పురుషునకు జ్ఞానముండినను జ్ఞానత్వసామా న్యధర్మమును చూచిన తర్వాత ఉత్పన్నమగు జ్ఞానమం దయథార్థ సందేహము గలిగి ప్రవృత్తి నివృత్తియు లేకపోవలయును. ఎట్లన జ్ఞానమునందు యథార్థత్వ నిశ్చయమును అయథార్థతా సందేహముయొక్క యభావమును పురుషునియొక్క ప్రవృత్తి నివృత్తికి హేతువై యున్నవి. అయథార్థతా సందేహ ముండుటవలన, రెండును సంభవింపవు. మఱియు అయథార్థజ్ఞానమును అంగీకరింపనియెడల ఉత్ప న్నమైన జ్ఞానమునం దుక్తసందేహము గలుగుట లేదు. ఎట్లన ఏదైన ఒక జ్ఞానము అయథార్థమై యుండినయెడల దానియొక్క జ్ఞానత్వధర్మముతో సజాతీ యత్వమును తనజ్ఞానమునందు జూచి అయథార్థత్వ సందేహము గలుగుచున్నది. ఆయయథార్థ జ్ఞానము లేదు. జ్ఞానము యథార్థమయియే యున్నది. అందువలన జ్ఞానమునందు అయథార్థ సందేహము గలుగుట లేదు. ఈరీతిగా భ్రమజ్ఞానము అప్రసిద్ధమై యున్నది. ఎచ్చట శుక్తియందు రజతార్థికి ప్రవృత్తి గలుగుచు న్నదో భయహేతుక రజ్జువుతో నివృత్తియు గలుగుచున్నదో అచ్చటను రజత ప్రత్యక్షజ్ఞానమును సర్పప్రత్యక్షజ్ఞానమును లేవు. అచ్చటను రజతప్రత్యక్షజ్ఞాన మును సర్పప్రత్యక్షజ్ఞానమును ఉక్తస్థలమునం దుండినయెడల యథార్థముగా సం భవింపదు. అందువలన అయథార్థమైనయెడల ఆయయథార్థజ్ఞానము లేకమై

యున్నది. అందువలన ఉక్తస్థలమునందు రజతముయొక్కయు సర్పముయొక్కయు ప్రత్యక్షజ్ఞానము లేదు. ఇక నేమనిన రజతముయొక్క స్మృతిజ్ఞాన మున్నది. శుక్తికి ఇదంరూపముతో సామాన్యజ్ఞానము ప్రత్యక్షమై యున్నది. ఈలాగుననే పూర్వానుభూత సర్పమునకు స్మృతిజ్ఞాన మున్నది. సామాన్యమగు నిదంరూపముతో రజ్జువునకు ప్రత్యక్షజ్ఞాన మున్నది. శుక్తితోను రజ్జువుతోను దోషసహిత నేత్రమునకు సంబంధ మున్నది. అందువలన శుక్తియొక్కయు రజ్జువుయొక్కయు విశేషరూపము భాసించుట లేదు. సామాన్యరూపమగు నిదంతయే భాసించుచున్నది. శుక్తితో నేత్రముయొక్క సంబంధజన్య జ్ఞానము కుదిరి రజతముయొక్క సంస్కార ముద్బుద్ధమై శుక్తియొక్క సామాన్య జ్ఞానోత్తర క్షణమునందు రజతస్మృతి గలుగుచున్నది. ఈలాగుననే రజ్జువుయొక్క సామాన్య జ్ఞానోత్తర క్షణమునందు సర్పముయొక్క స్మృతి గలుగుచున్నది. యద్యపి సకల స్మృతి జ్ఞానమునందు పదార్థములయొక్క తత్తయు భాసించుచున్నది తథాపి దోషసహిత నేత్రముయొక్క సంబంధముచేత సంస్కార ముద్బుద్ధమై నప్పుడు దోషముయొక్క మాహాత్మ్యముచేత తత్తాంశమునకు మోసమగుచున్నది. అందువలన ప్రమృష్టతత్తకు స్మృతి యున్నది 'ప్రమృష్టం' అనగా 'లుప్తం' తత్త దేనికి నున్నదో అది ప్రమృష్టతత్తాశబ్దముయొక్క యర్థమై యున్నది.

ఈరీతిగా 'ఇదం రజతం' 'అయం సర్పః' ఇత్యాది స్థలములందు రెండు జ్ఞానములున్నవి. అచ్చట ఒకటి శుక్తియొక్కయు రజ్జువుయొక్కయు సామాన్యమగు నిదంరూపవిషయకప్రత్యక్షజ్ఞానము యథార్థమై యున్నది. మఱియొకటి రజతముయొక్కయు సర్పముయొక్కయు స్మృతిజ్ఞానము కూడ యథార్థమై యున్నది. యద్యపి విశేషమగు శుక్తి రజ్జువులయొక్క భాగములను త్యజించి ప్రత్యక్షజ్ఞానము గలుగుచున్నది. తత్తాభాగరహిత స్మృతి జ్ఞానము గలుగుచున్నది. తథాపి ఏకభాగమును త్యజించుటవలన జ్ఞానము అయథార్థ మగుట లేదు. ఇంకేమనగా అన్యరూపముచేత జ్ఞానము అయథార్థ మనంబడును. అందువలన ఉక్త జ్ఞానము యథార్థమై యున్నది, అయథార్థము కాదు. ఈరీతిగా భ్రమజ్ఞానము అప్రసిద్ధమై యున్నది.

### 163. అఖ్యాతివాది మతమునం దన్యకృతశంకకు నుద్ధారము.

శాస్త్రాంతరమందు చెప్పిన దేమనగా, ఏపదార్థమందు ఇష్ట సాధనతా జ్ఞాన మున్నదో దానియందు ప్రవృత్తి కలుగుచున్నది. దేనియందు అనిష్టసాధనతా

జ్ఞానమున్నదో దానితో నివృత్తి కలుగుచున్నది. అఖ్యాతివాదిమతమందు శుక్తి యందు ఇష్టసాధనతాజ్ఞానమును చెప్పినయెడల భ్రమాంగీకారము కలుగుచు న్నది. అందువలన ఇష్టసాధనతాజ్ఞానము లేనందున శుక్తియందు రజతార్థికి ప్రవృత్తి లేకపోవలయును. ఈలాగుననే రజ్జువునందు అనిష్టసాధనత్వము లేదు. దానియొక్క జ్ఞానమును అంగీకరించినయెడల భ్రమను అంగీకరించిన ట్లగును. అందువలన అనిష్టసాధనతాజ్ఞానము లేనందున నివృత్తి కలుగక పోవలయును. అందువలన భ్రమజ్ఞాన మావశ్యకమై యున్నది. ఆరీతిగా దానికి సమాధానము. అఖ్యాతివాది యీరీతిగా చెప్పుచున్నాడు. ఏపదార్థమునందు పురుషునికి ప్రవృత్తి కలుగుచున్నదో ఆపదార్థమునకు సామాన్యరూపముతో ప్రత్యక్షజ్ఞానమును ఇష్టపదార్థముయొక్క స్మృతియును స్మృతివిషయముతో పురోవర్తి పదార్థముయొక్క భేదజ్ఞానాభావమును స్మృతిజ్ఞానమునకు పురోవర్తి జ్ఞానముతో భేద జ్ఞానాభావమును ఇంతసామగ్రి ప్రవృత్తికి హేతువు లయియున్నవి. అందువలన భ్రమజ్ఞానములేక ప్రవృత్తి సంభవించుచున్నది. విషయములకును జ్ఞానములకును భేదజ్ఞానాభావమే ప్రవృత్తియందు హేతువని చెప్పినయెడల ఉదాసీనదశ యందు ప్రవృత్తి కలుగవలయును. విషయముయొక్క సామాన్యజ్ఞాన సహితేష్టవిషయక స్మృతియే ప్రవృత్తికి కారణ మని చెప్పినయెడల 'దేశాంతరే తద్రజతం కించి దిదం,' అను నీరీతిగా దేశాంతర సంబంధిరూపముతో రజతస్మృతి యును శుక్తికి కించిద్రూపముతో జ్ఞానమును ఎచ్చట నున్నవో అచ్చటను రజతార్థికి ప్రవృత్తి కావలయును. అందువలన ఇష్టపదార్థముతో విషయమునకు భేదజ్ఞానాభావముకూడ ప్రవృత్తికి హేతువయియున్నది. ఉక్తస్థలమునందు ఇష్టరజతమునకు శుక్తితో భేదజ్ఞాన మున్నది. దానియొక్క యభావములేదు. అందువలన ప్రవృత్తి కలుగుటలేదు. ఇష్టపదార్థమునకు పురోవర్తితో భేదజ్ఞానాభావమునే ప్రవృత్తి సామగ్రియందు జేర్చి రెంటియొక్క జ్ఞానములకు భేదజ్ఞానాభావము లేదని చెప్పిన యెడల' ఇదంరజతం'అను నీరీతిగా రెండుజ్ఞానములు కలిగి యిదంపదార్థముయొక్క ప్రత్యక్షజ్ఞానము నాకు కలిగియున్నది, రజతముయొక్క స్మృతిజ్ఞానమునునాకు కలిగియున్నది, అను నీరీతిగా రెండుజ్ఞానములకు భేదజ్ఞాన ముండవలసినది. అథవా ఇదంపదార్థముయొక్క జ్ఞానమును రజతపదార్థముయొక్క జ్ఞానమును నాకు పరస్పరభిన్నమై యున్నవి, అని భేదజ్ఞాన ముండవలసినది. అచ్చటను విషయము యొక్క భేదజ్ఞానము లేదు. అందువలన ప్రవృత్తి కావలయును. అందువలన జ్ఞాన

ములకు భేదజ్ఞానాభావముకూడ ప్రవృత్తి సామగ్రియందు చెప్పవలయును. ఉక్తస్థలమందు పురోవర్తియొక్క సామాన్యజ్ఞానమును ఇష్టరజతముయొక్క స్మృతియును ఉన్నవి. ఈలాగుననే పురోవర్తితో ఇష్టరజతముయొక్క భేదజ్ఞానాభావమును ఉన్నది. అయిన రెండుజ్ఞానములకును భేదజ్ఞాన మున్నది, దానియొక్క యభావములేదు. ఈరీతిగా ఉభయవిధ భేదజ్ఞానాభావసహితేష్టస్మృతి సహిత పురోవర్తియొక్క సామాన్యజ్ఞానము ప్రవృత్తికి హేతువై యున్నది. పురోవర్తి శుక్తియొక్క యిదంరూపముతో సామాన్యజ్ఞానము యథార్థమై యున్నది. అందువలన భ్రమాంగీకారము నిష్ఫలమై యున్నది. ఎచ్చట శుక్తియందు రజతభేదజ్ఞాన మున్నదో అచ్చట రజతార్థికి ప్రవృత్తి కలుగుటలేదు. శుక్తిజ్ఞానమునందు రజతజ్ఞానముయొక్క భేదగ్రహణము ఉండినచోటను ప్రవృత్తి కలుగుటలేదు. అందువలన భేదజ్ఞానము ప్రవృత్తికి ప్రతిబంధకమై యున్నది. ప్రతిబంధకాభావము కారణమై యున్నది. అందువలన భేదజ్ఞానాభావమునందు ప్రవృత్తికారణత్వమును అంగీకరించుటయందు అప్రసిద్ధకల్పన లేదు. మఱియు ఎచ్చట రజ్జుదేశముతో భయహేతువువలని పలాయనము కలుగుచున్నదో అచ్చటను సర్పభ్రమ కలుగుటలేదు. ఇంకేమనగా ద్వేషగోచర సర్పస్మృతియును రజ్జువుయొక్క సామాన్యజ్ఞానమును ఆజ్ఞానములకును విషయములకును ఉండు భేదజ్ఞానాభావముకూడ పలాయనమునకు హేతువై యున్నది. పలాయనముకూడ ప్రవృత్తివిశేషమై యున్నది. అయిన ఆప్రవృత్తి విషయాభిముఖము కాదు. విముఖప్రవృత్తియై యున్నది. విముఖప్రవృత్తియందు ద్వేషగోచరస్మృతి హేతువై యున్నది. సన్ముఖప్రవృత్తియందు ఇచ్ఛాగోచర విషయకస్మృతి హేతువై యున్నది. ఈరీతిగా భయజన్యపలాయనక్రియ కలుగుచున్నది. దానిని ప్రవృత్తియు నివృత్తి యని చెప్పుము. దానికి హేతువు ద్వేషగోచరపదార్థస్మృతియై ఉన్నది. ఎచ్చట శుక్తిజ్ఞానముచేత రజతార్థికి ప్రవృత్త్యభావరూపనివృత్తి కలుగుచున్నదో దానికి హేతువు శుక్తిజ్ఞానమై యున్నది. అదియును భ్రమము కాదు. ఎచ్చట సత్యరజతమందు రజతార్థికి ప్రవృత్తి కలుగుచున్నదో అచ్చటనైన రజతత్వవిశిష్టరజతజ్ఞానమే రజతార్థిప్రవృత్తికి హేతువై యున్నది. పురోవర్తి సత్యరజతమందు రజతముయొక్క భేదజ్ఞానాభావము ప్రవృత్తికి హేతువు కాదు. అందువలన విశిష్టజ్ఞానమందు ప్రవృత్తి జనకతకు సర్వదా లోపము లేదు. ఎట్లన ఎచ్చట సత్యరజత మున్నదో అచ్చట పురోవర్తిరజతమందు రజతముయొక్క భేదజ్ఞానా

భావమే ప్రవృత్తిహేతువుగా చెప్పినయెడల సంభవింపదు. ప్రతియోగి ప్రసిద్ధమైనయెడల దానియొక్క యభావము వ్యవహారగోచర మగుచున్నది. అప్రసిద్ధ ప్రతియోగియొక్క యభావము వ్యవహారగోచరము కాదు. ఉదాహరణము. శశశృంగాభావమునకు ప్రతియోగి అప్రసిద్ధమై యున్నది. అందువలన శశశృంగాభావము కూడ అలీకమై యున్నది. అలీక పదార్థములకు ఏవ్యవహారము కలుగుట లేదు. కేవలశబ్దప్రయోగమును వికల్పరూప జ్ఞానమును అలీక పదార్థమునకు కలుగుచున్నవి. అలీకపదార్థమునందు కారణత, కార్యత, నిత్యత, అనిత్యత అని వ్యవహారము కలుగుట లేదు. అందువలన ప్రసిద్ధపదార్థముల యొక్క యభావమే వ్యవహారయోగ్యమై యున్నది. అప్రసిద్ధము ఏవ్యవహారమునకు యోగ్యము కాదు. అందువలన అలీకమై యున్నది. సత్యరజతమునందు రజతముయొక్క భేదము లేదు. అందువలన సత్యరజతమందు రజతముయొక్క భేదజ్ఞానము సంభవింపదు. భ్రమజ్ఞానమును అంగీకరించిన యెడల సత్యరజతమునందు రజతముయొక్క భేదజ్ఞానము సంభవించుచున్నది. అఖ్యాతివాది మతమందు భ్రమజ్ఞాన మప్రసిద్ధమై యున్నది. అందువలన సత్యరజతమందు రజతముయొక్క భేదజ్ఞానము సంభవించుట లేదు. ఈరీతిగా సత్యరజతమందు రజతప్రతియోగిక భేదజ్ఞానరూప ప్రతియోగి సంభవింపనందున సత్యరజతమందు రజతప్రతియోగిక భేదజ్ఞానాభావము అలీకమై యున్నది. దానియందు ప్రవృత్తిజనకత సంభవించుట లేదు. అందువలన సత్యరజతస్థలమందు పురోవర్తి దేశమందు రజతత్వవిశిష్టరజత మున్నది, అను నీ విశిష్ట జ్ఞానమే రజతార్థిప్రవృత్తికి హేతువై యున్నది. అఖ్యాతివాదివాదమునందు భ్రమజ్ఞానవాదమైన లేదు. జ్ఞానము యథార్థమై యున్నది. తథాపి కొన్నిస్థలములయందు ప్రవృత్తి సఫల మగుచున్నది. దీనికి హేతువు చెప్పవలసినది. దానియందు ఏమనగా విశిష్టజ్ఞానజన్య ప్రవృత్తి సఫలమై యున్నది. భేదజ్ఞానాభావజన్య ప్రవృత్తి నిష్ఫలమై యున్నది. రజతదేశమునందును భేదజ్ఞానాభావజన్యప్రవృత్తి చెప్పిన యెడల సమప్రవృత్తి కలుగవలయును. అందువలన సఫలప్రవృత్తి జనకము విశిష్టజ్ఞానముగా అంగీకరింపవలసినది. ఎచ్చట సత్యరజతమందు రజతార్థికి ప్రవృత్తి కలుగుట లేదో అచ్చట ప్రవృత్త్యభావరూపనివృత్తి యున్నది. దానికి హేతువు రజతత్వవిశిష్టరజతజ్ఞానాభావమై యున్నది. అచ్చటను భ్రమరూపరజత జ్ఞానాభావము లేదు. ఎట్లన ప్రవృత్తినివృత్తులు పరస్పర ప్రతి

యోగ్యభావరూపము లయి యున్నవి. ప్రవృత్తిరూప ప్రతియోగికి హేతువు రజతత్వవిశిష్ట రజతజ్ఞానమై యున్నది. ప్రవృత్త్యభావ రూపనివృత్తికి హేతువు రజతత్వవిశిష్ట రజతజ్ఞానాభావమై యున్నది. ఈరీతిగా అఖ్యాతివాదమునందు విషయము లేక విషయార్థికి ప్రవృత్తి కలుగుచున్నది. దానికి హేతువు ఇష్ట విషయక స్మృత్యాదికమై యున్నది, విశిష్టజ్ఞానము కాదు. ఎచ్చట శుక్తిదేశ మునందు "ఇదం రజతం," అను నీజ్ఞానము కలుగుచున్నదో అది ఏకజ్ఞానము కాదు, శుక్తియొక్క యిదమాకారక సామాన్యజ్ఞానమై యున్నది. రజతమునకు ప్రమృష్టతత్తాకస్మృతి యగుచున్నది. ఈరెండు జ్ఞానములచేత ప్రవృత్తి యగు చున్నది. అయిన భేదజ్ఞానాభావ ముండినపుడు ప్రవృత్తి కలుగుచున్నది, భేద జ్ఞాన ముండినయెడల ప్రవృత్తి కలుగుటలేదు. అందువలన ఉక్తజ్ఞానద్వయ సహిత భేద జ్ఞానాభావము ప్రవృత్తికి హేతువై యున్నది.

మఱియు అనేకగ్రంథములయందు అసంబంధ గ్రహాభావముచేత ప్రవృత్తి చెప్పబడియున్నది. దానియొక్క యర్థమేమనగా శుక్తియందు రజతత్వమునకు అ సంబంధ మున్నది. ఈలాగుననే రజతమునకును ఇదంపదార్థమునందు తాదా త్మ్యసంబంధము అని యెవరికి జ్ఞానమున్నదో వారికి ప్రవృత్తి కలుగుట లేదు. అందువలన అసంబంధగ్రహాభావము ప్రవృత్తికి హేతువైయున్నది. అందు వలన భేదగ్రహాభావమునకు సమానమగు అర్థమే సిద్ధమగుచున్నది. అయిన ఈరీతిగా ప్రవృత్తి కలిగినయెడల అది నిష్ఫలమగుచున్నది. మఱియు విషయ దేశమునందు విషయార్థి ప్రవృత్తికి హేతువు విశిష్టజ్ఞానమై యున్నది. విశిష్టజ్ఞాన ముచేత ఎచ్చట ప్రవృత్తి యున్నదో అచ్చట సఫలమై యున్నది. భ్రమజ్ఞాన మప్రసిద్ధమై యున్నది. సర్వజ్ఞానము యథార్థమై యున్నది. ఎచ్చట జ్ఞానద్వయము చేత నిష్ఫలప్రవృత్తి యగుచున్నదో అచ్చట జ్ఞానద్వయమే భ్రమ యనంబడును. ఇది ప్రభాకరునియొక్క యఖ్యాతివాదమై యున్నది. జ్ఞానద్వయముయొక్క వివే కాభావమును ఉభయవిషయములయొక్క వివేకాభావమును అఖ్యాతి మతము యొక్క పారిభాషికార్థమై యున్నది.

### 164. అఖ్యాతివాదముయొక్క ఖండనము.

ఈమతముకూడ సరికాదు. ఎట్లన, శుక్తియందు రజతభ్రమచేత ప్ర వృత్తి కలిగి పురుషునకు రజత లాభము లేకపోయినప్పుడు పురుషుడు చెప్పున దేమనగా రజతశూన్యదేశమునందు రజతజ్ఞానముచేత 'నాకు నిష్ఫలప్రవృత్తిగలిగి

నది, అను నీరీతిగా భ్రమజ్ఞానము అనుభవసిద్ధమై యున్నది. దానికి లోపము సంభవింపదు. మఱియు మరుభూమియందు జలమునకు బాధ కలిగినప్పుడు ఇట్లు చెప్పును. మరుభూమియందు మిథ్యాజల ప్రతీతి నాకు కలిగినది, అను నీబాధచే తను మిథ్యాజలము దానియొక్క ప్రతీతి సిద్ధించుచున్నవి. అఖ్యాతివాదివాద రీతిగా నైననో రజతస్మృతియొక్కయు శుక్తిజ్ఞానముయొక్క భేదాగ్రహముచేత నాకు శుక్తియందు ప్రవృత్తి గలిగినది అని బాధయుండవలసినది. మఱియు మరుభూమి విషయక ప్రత్యక్షముచేతను జలవిషయకస్మృతిచేతను నాకు ప్రవృత్తి కలిగినది, అను నీ బాధ కావలయును. మఱియు విషయమును జ్ఞానమును ఈరెంటిని త్యజించి అనేకప్రకారముయొక్క విరుద్ధకల్పన అఖ్యాతివాదమం దున్నది. తథాహి నేత్రసంయోగము కలిగి దోషముయొక్క మాహాత్మ్యముచేత శుక్తియందు విశేషరూపముతో జ్ఞానము కలుగుట లేదు, అను నీకల్పన విరుద్ధమై యున్నది. ఈలాగుననే తత్తాంశమునకు ప్రమోషముచేత స్మృతికల్పన విరుద్ధమై యున్నది. మఱియు విషయములకు భేదముండినను భాసించుట లేదు, ఈలాగుననే జ్ఞానమునకును భేద ముండినను ఎప్పుడును భాసించుట లేదు, అను నీకల్పన విరుద్ధమై యున్నది. రజతమునకు ప్రతీతికాలమందు అభిముఖదేశమునందు రజతప్రతీతి కలుగుచున్నది. అందువలన నఖ్యాతివాదము అనుభవవిరుద్ధమై యున్నది. మఱియు విఖ్యాతివాదిమతమందు రజత భేదగ్రహము ప్రవృత్తికి ప్రతిబంధమై యుండుట వలన రజతభేద గ్రహాభావము ఎట్లు రజతార్థప్రవృత్తికి హేతువుగా అంగీకరింపబడినదో అట్లు సత్యరజతస్థలమందు రజతముయొక్క అభేదగ్రహము నివృత్తికి ప్రతిబంధకముగా అనుభవసిద్ధమై యున్నది. అందువలన రజతముయొక్క అభేదగ్రహాభావము నివృత్తికి హేతువు కావలయును. ఈరీతిగా రజతముయొక్క భేదజ్ఞానాభావము రజతార్థిప్రవృత్తికి హేతువై యున్నది. రజతముయొక్క యభేదజ్ఞానాభావము రజతార్థినివృత్తికి హేతువై యున్నది. శుక్తిదేశమునందు "ఇదం రజతం" అను నీరెండవజ్ఞానము కలుగుచున్నది. అచ్చట అఖ్యాతివాదిమతమందు రెండు నున్నవి. ఎట్లన శుక్తియందు రజతభేదమైన ఉన్నది. దోషబలముచేత రజతభేదమునకు శుక్తియందు జ్ఞానము కలుగుటలేదు. అందువలన ప్రవృత్తిహేతువు రజతభేదజ్ఞానాభావమై యున్నది. శుక్తియందు రజతమునకు అభేదము లేదు. అఖ్యాతివాదమందు భ్రమాంగీకారము లేదు. అందువలన శుక్తియందు రజతాభేదజ్ఞానము సంభవించుట లేదు. ఈరీతిగా శుక్తితో రజతార్థి

నివృత్తి హేతువు రజతముయొక్క యభేదజ్ఞానాభావమై యున్నది. రజతార్థి యొక్క సామగ్రులు రెండున్నవి. ప్రవృత్తినివృత్తులు రెండును పరస్పరవిరోధులై యున్నవి. ఏకకాలమునందు రెండునుసంభవింపవు. రెంటికి అసంభవ ముండుటవలన రెంటిని త్యజించినయెడల అనియమము సంభవింపదు. ప్రవృత్తియొక్క యభావమే యీస్థానమునందు నివృత్తిపదార్థమై యున్నది. అందువలన ప్రవృత్తిని త్యజించిన యెడల నివృత్తిప్రాయ మగుచున్నది. నివృత్తికి త్యాగమును చేసినయెడల ప్రవృత్తిప్రాయము అగుచున్నది. ఈరీతిగా ఉభయత్యాగమునందును ఉభయానుష్ఠానమునందును అశక్తుడై అఖ్యాతివాది వ్యాకులుడై లజ్జచేత ప్రాణత్యాగముచేసెనేని అందువలన అఖ్యాతివాదము మరణహేతువై యున్నది. ఈ యర్థమునందు అనేకకోటీ లున్నవి. క్లిష్ట మని యిచ్చట వ్రాయలేదు.

మఱియు అఖ్యాతివాదిమతమునందును ఇచ్ఛలేక భ్రమజ్ఞానమునకు సామగ్రీబలముచేత బలాత్సిద్ధి యగుచున్నది. ఎచ్చట ధూమరహితవహ్నిసహిత పర్వతమందు ధూళీపటలమును చూచి 'వహ్నివ్యాప్యధూమవాన్' అను నీపరామర్శ కలుగుచున్నదో అచ్చట వహ్నిప్రమారూపానుమితి యున్నది. ఎట్లన వహ్ని పర్వతమునందు ఉన్నది. అందువలన ప్రమయే యున్నది. దానికి హేతువు "వహ్నివ్యాప్యధూమవాన్పర్వతః" అను నీరీతిగా పర్వతమునందు వహ్నివ్యాప్యధూమ సంబాధజ్ఞానము అఖ్యాతివాది మతమునందు సంభవించుట లేదు. ఎట్లన, పర్వతమునందు ధూమ సంబంధము లేదు. మఱియు భ్రమజ్ఞానాంగీకార ముండినయెడల ధూమసంబంధరహిత పర్వతమునందు ధూమసంబంధజ్ఞానము కలుగును. భ్రమజ్ఞాన మంగీకరింపబడ లేదు. అందువలన ధూమరహితమునందు ధూమసంబంధజ్ఞానము సంభవింపదు. అందువలన పర్వతమునందు ధూమముయొక్క యసంబాధజ్ఞానాభావరూప పరామర్శమే ఉక్తానుమితికి కారణమైనందున పక్షమునందు హేతువుయొక్క యసంబంధజ్ఞానాభావమే అనుమితికి కారణముగా అంగీకరింపవలసినది. ఎచ్చట పక్షమునందు హేతువుయొక్క సంబంధ మున్నదో అచ్చట పక్షమునందు హేతువుయొక్క అసంబాధజ్ఞానాభావ మున్నది. మఱియు పక్షమునందు హేతువుయొక్క సంబంధజ్ఞానముకూడ ఉన్నది. అయిన ఎచ్చట ఉక్త పర్వతమందు ధూమము లేదో అనుమితి కలుగుచున్నదో అచ్చట పక్షమునందు హేతువుయొక్క సంబంధజ్ఞానము సంభవించుటలేదు, హేతువుయొక్క అసంబంధజ్ఞానాభావము సంభవించుచున్నది. అందువలన పక్షమునందు హేతువుయొక్క

అసంబంధజ్ఞానాభావమే అనుమితికి గారణముగా విఖ్యాతివాదిమతమునందు సిద్ధించుచున్నది. అందువలన వక్ష్యమాణరీతిగ గల్రగ్రహన్యాయముచేత విఖ్యాతివాది మతమునందు అనుమితిరూప భ్రమజ్ఞానమునకు సిద్ధి కలుగుచున్నది. తథాహి ఎచ్చట వహ్ని వ్యాప్యము ధూమమై యున్నదో అట్లు ఇష్టసాధనత్వవ్యాప్యము రజతత్వమై యున్నది "యత్రయత్ర రజతత్వం తత్ర తత్రేష్టసాధనత్వం" ఈరీతిగా రజతత్వమునందు ఇష్టసాధనతావ్యాప్తి యున్నది. దేనియందు దేనియొక్క వ్యాప్తి యున్నదో అది దానికి వ్యాప్యమై యున్నది. దేనియొక్క వ్యాప్తియున్నదో అది వ్యాపకమయి యున్నది. ఈరీతిగా ఇష్టసాధనత్వము వ్యాపకమై యున్నది, రజతత్వము వ్యాప్యమై యున్నది, వ్యాప్యము హేతువై యున్నది, వ్యాపకము సాధ్యము యున్నది, అను నీ ప్రకారము అనుమానమందు వ్రాయబడి యున్నది. అందువలన రజతత్వ హేతువుచేత ఇష్టసాధనత్వరూప సాధ్యవిషయకానుమితి కలుగుచున్నది. ఈ యర్థమైన సర్వమతములయందు నిర్వివాదమై యున్నది. అన్యమతమునందైన పక్షమునందు వ్యాప్యమగు హేతువుయొక్క సంబంధజ్ఞానముచేత వ్యాపకమగు సాధ్యవిషయకానుమితి కలుగుచున్నది. అఖ్యాతివాదమందు పక్షమునందు వ్యాప్యమగు హేతువుయొక్క యసంబంధజ్ఞానాభావముచేత సాధ్యవిషయకానుమితి కలుగుచున్నది. ఈ యర్థము ప్రతిపాదింపబడినది. అందువలన "ఇదం రజతం" అనునీ రీతిగా ఎచ్చట శుక్తిదేశమందు జ్ఞానము కలుగుచున్నదో అచ్చట ఇదంపదార్థము శుక్తియందు రజతత్వజ్ఞానము కలుగుట లేదు. తథాపి రజతత్వముయొక్క యసంబంధజ్ఞానము లేదు. రజతత్వముయొక్క యసంబంధజ్ఞానాభావ ముండుటవలన ఇదంపదార్థరూప పక్షమందు రజతత్వరూప హేతువుయొక్క యసంబంధ జ్ఞానాభావముచేత ఇష్టసాధనత్వరూప సాధ్యవిషయకానుమితి ఇచ్ఛలేకయే సామగ్రీబలముచేత సిద్ధమగుచున్నది. ఇదంపదార్థమునందు ఆయిష్టసాధనత్వ విషయకానుమితి భ్రమరూపమై యున్నది. ఎట్లన ఇదంపదార్థము శుక్తియై యున్నది. దానియందు ఇష్టసాధనత్వము లేదు. ఇష్టసాధనత్వ రహితమందు ఇష్టసాధనత్వానుమితి జ్ఞానము భ్రమరూపమై యున్నది. ఈ రీతిగా గల్రగ్రహన్యాయముచే అఖ్యాతివాదిమతమందు భ్రమజ్ఞానమునకు సిద్ధి యున్నది. ధూమపటల సహిత పర్వతమునందు ఎచ్చట ధూమపరామర్శ చెప్పబడియున్నదో అచ్చట ధూమము యొక్క సంబంధజ్ఞానమును పర్వతమునందు అంగీకరించినయెడల ధూమసంబంధ జ్ఞానమే భ్రమరూపముగా అంగీకరింపవలయును. ఆపర్వతమునందు ధూమము

యొక్క యసంబంధ జ్ఞానాభావమును అనుమితికి హేతువుగా చెప్పినయెడల అస్థానమందయిన భ్రమజ్ఞానానంగీకారముచేతను నిర్వాహమగును అయిన సకలానుమితియందు హేతువుయొక్క యసంబంధ జ్ఞానాభావమును కారణముగా అంగీకరించి శుక్తియందు రజతత్వముయొక్క యసంబంధజ్ఞానాభావముచేత ఇష్టసాధనత్వ విషయక భ్రమరూపానుమతి సిద్ధించుచున్నది. ఈరీతిగా ఉభయతఃపాశరజ్జున్యాయముచేత విఖ్యాతివాది మతమందు భ్రమ సిద్ధ మగుచున్నది.

మఱియు అఖ్యాతివాదిమతమందు దోష మున్నది. ఎచ్చట రంగరజతములను ధరించి యున్నాడో ఆయనకు "ఇమే రజతే" అను నీ జ్ఞానము కలుగుచున్నది. ఈ జ్ఞానము అన్యమతరీతిగా రంగాంశమునందు భ్రమమై యున్నది, రజతాంశమునందు భ్రమమై యున్నది. మఱియు రంగమునందును రజతమునందును రజతత్వధర్మమును విషయీకరించుచున్నందువలన రంగాంశమునందు రజతత్వవిశిష్టజ్ఞాన మున్నది. అఖ్యాతివాది మతమునందు భ్రమజ్ఞానమైన లేదు. ఉక్త జ్ఞానమును సర్వాంశమునందు యథార్థమై యున్నది. అయిన రజతాంశమునందు రజతత్వ సంసర్గగ్రహ మున్నది. రంగాంశమునకు ఇదంరూపముతో జ్ఞాన మున్నది. దానిలో రజతత్వముయొక్క యసంబంధముయొక్క యాగ్రహ మున్నది. ఈరీతిగా భేదకల్పన అనుభవవిరుద్ధమై యున్నది. ఎట్లన రంగమునకును రజతమునకును "ఇమే రజతే" అను నీరీతిగా ఏకరూపోల్లేఖ మున్నది. దానియందు ఉక్తభేదకథన ప్రకారముగా విలక్షణోల్లేఖము ఉండవలయును. మఱియు రంగాంశమునందు రజతత్వముయొక్క సంబంధగ్రహము భ్రమను అంగీకరింపనందున సంభవించుట లేదు. రజతాంశమందును రజతత్వముయొక్క యసంబంధాగ్రహమును అంగీకరించినయెడల సంభవించుచున్నది. ఎట్లన రజతమునందు రజతత్వముయొక్క యసంబంధగ్రహము లేదు, సంబంధగ్రహ మున్నది. అందువలన ఏకరూపోల్లేఖము సంభవించుచున్నది. అయిన ఎచ్చట ప్రవృత్తివిషయ మభిముఖముగా ఉన్నదో అచ్చట సంసర్గవిశిష్టజ్ఞానముచేత ప్రవృత్తి కలుగుచున్నది, అను నీ నియమము పూర్వమందే చెప్పబడినది. దానిని త్యజింపవలయును. మఱియు ఒకడు చెప్పునదేమనగా, ఎచ్చట ప్రవృత్తి విషయమగు నిష్టపదార్థమే యభిముఖమై యున్నదో అనిష్టపదార్థ మభిముఖముగా లేదో, అచ్చట సంసర్గవిశిష్టముయొక్క

జ్ఞానమున్నది. ఉదాహరణము. కేవల రజతమునకు 'ఇదం రజతం' అను నీ జ్ఞానము రజతత్వవిశిష్టముయొక్క జ్ఞానమై యున్నది. ఎచ్చట ఇష్టమగు రజతము అనిష్టమగు రంగము ఈరెండును అభిముఖమై యున్నవో, మఱియు అనిష్టపదార్థమునకును ఇష్టపదార్థములవలె ఇదమాకారజ్ఞాన మున్నదో అచ్చట ఇష్టపదార్థమునందును రజతత్వవిశిష్టజ్ఞానము కలుగుట లేదు. రజతత్వముయొక్క యసంబంధజ్ఞానముయొక్క యభావము కలుగుచున్నది, అని యంగీకరించినయెడల "ఇమే రజతే" అను నీరీతిగా సమానోల్లేఖము సంభవించుచున్నది. రజతమునకును రంగమునకును ఇదమాకారసామాన్యజ్ఞాన మున్నది. ఈలాగుననే రంగమందు రజతత్వమునకు అసంబంధ మున్నది. అసంబంధమునకు దోషముచేత జ్ఞానము కలుగుట లేదు. రంగమునందు రజతత్వముయొక్క యసంబంధజ్ఞానాభావ మున్నది, రజతమునందు రజతత్వముయొక్క యసంబంధము లేదు. అందువలన అసంబంధ జ్ఞానాభావ మున్నది. అందువలన ఏకరసోల్లేఖము సంభవించుచున్నది. అయిన ఉక్తరీతిగా రజతాంశమందు నిష్ఫలప్రవృత్తి కలుగవలయును. అందువలన ఉక్తస్థలమందు రజతాంశమందు రజతత్వ విశిష్టజ్ఞాన మున్నది. ఎట్లన అఖ్యాతివాది మతమునందు భ్రమజ్ఞానమైన లేదు. దీనిచేత నిష్ఫల ప్రవృత్తి కలుగుచున్నది. ఇష్టపదార్థముయొక్క భేదజ్ఞానముచేత ఏప్రవృత్తి కలుగుచున్నదో అది నిష్ఫలమై యున్నది. విశిష్టజ్ఞానముచేత సఫలప్రవృత్తి కలుగుచున్నవి. అందువలన రంగరజతములు పురోవర్తులయి యున్నవి. మఱియు "ఇదం రజతం" అను నీ జ్ఞానమున్నది. అచ్చట రజతరంగములకు ఇదంరూపముతో జ్ఞానము సమానమై యున్నది. అయిన రజతముయొక్క ఇదమంశమునందు రజతత్వవిశిష్టజ్ఞాన మున్నది. రంగముయొక్క ఇదమంశమునందు రజతత్వముయొక్క సంబంధమునకు యగ్రహ మున్నది. అథవా రజతముయొక్క భేదాగ్రహ మున్నది. ఎచ్చట రజతత్వముయొక్క యసంబంధమున్నదో అచ్చట రజతముయొక్క భేదమున్నది. అందువలన రజతత్వముయొక్క యసంబంధముయొక్క యగ్రహము రజతభేదముయొక్క యగ్రహము ఏకమైయున్నవి. ఈరీతిగా అఖ్యాతివాదమందు 'ఇమే రజతే' అను నీ స్థానమందు సమానోల్లేఖము సంభవించుట లేదు. అందువలన అఖ్యాతివాద మసంగతమై యున్నది.

**165.** భ్రమజ్ఞానవాది మతమునందు ఉక్తదోషములయొక్క యసంభవము.

భ్రమజ్ఞానము అంగీకరించు వాదిమతమునందు చెప్పినదోషమే మనగా, భ్రమజ్ఞానము కూడ ప్రసిద్ధమైనయెడల సర్వజ్ఞానములయందును భ్రమత్వసంశయ ముండుటవలన నిష్కంపప్రవృత్తి లేకపోవలయుననిన, అది కూడ సంభవించుట లేదు. ఎట్లన అఖ్యాతివాదిమతమునందు భ్రమజ్ఞానము లేదు. జ్ఞానము యథార్థమై యున్నది. అయిన జ్ఞానముచేత ప్రవృత్తి ఒకప్పుడు సఫల మగుచున్నది. ఒకప్పుడు నిష్ఫల మగుచున్నది. అందువలన ప్రవృత్తియందు సఫలత్వనిష్ఫలతలకు సంపాదకమగు వైలక్షణ్యము జ్ఞానమునందు అఖ్యాతివాదిచేతను అంగీకరింపవలసినది. ఎచ్చట సంసర్గవిశిష్ట జ్ఞానముచేత ప్రవృత్తి యున్నదో అది సఫలమై యున్నది. అందువలన సఫలప్రవృత్తికి జనకమగు సంసర్గవిశిష్టజ్ఞానము భ్రమమైయున్నది. అగృహీత భేదజ్ఞాన ద్వయముచేత నిష్ఫలప్రవృత్తి కలుగుచున్నది. నిష్ఫలప్రవృత్తికి జనకములు రెండుజ్ఞానము లున్నవి. అవి అప్రమయే మైయున్నది. యద్యపి విషయముల యొక్క భావాభావములచేత జ్ఞానములయందు ప్రమాత్వాప్రమాత్వములు లేవు. తథాపి ప్రవృత్తియొక్క విలక్షణతకు హేతువులగు ప్రమాత్వాప్రమాత్వములు అఖ్యాతివాదికి ఇష్టములై యున్నవి. అప్రమాత్వసంజ్ఞచేతను అఖ్యాతివాదికి విద్వేష ముండినను అగృహీత జ్ఞానద్వయమునందు సఫలప్రవృత్తి జనక జ్ఞానముచేత విలక్షణత అనుభవసిద్ధమై యున్నది, అఖ్యాతివాదిచేత అంగీకరింప బడియును ఉన్నది. అందువలన వ్యవహారభేదముకొఱకు సంజ్ఞాంతరము కరణీయమై యున్నది. అందువలన ప్రసిద్ధసంజ్ఞచేతనే వ్యవహారముచేయుట యోగ్యమై యున్నది. ఈరీతిగా భ్రమజ్ఞానముయొక్క యనంగీకారమును భ్రమస్థానమునందు నిష్ఫలప్రవృత్తి జనక-ఏక-అగృహీతభేద పక్షమందును యథార్థజ్ఞానమును సఫల ప్రవృత్తిజనకరజతమునందు రజతత్వవిశిష్ట జ్ఞానము నున్నదో దానియందు జ్ఞానత్వరూపసమాన ధర్మమును చూచి యీసందేహము సంభవించుచున్నది. ఎట్లు అగృహీతభేదములగు రెండుజ్ఞానము లున్నవో వానియొక్కభేదము ప్రతీత మగుట లేదు. ఈజ్ఞానముకూడ అగృహీతభేదజ్ఞానద్వయరూపమై ఏకమై యున్నది. అథవా అగృహీతభేదరహితమై ఏకమై యున్నది. అగృహీతభేదజ్ఞాన ద్వయరూపమై యుండినయెడల రజతలాభము ప్రవృత్తిచేత కాకపోవలయును. ఈసందేహముచేత అఖ్యాతివాదమందును నిష్కంపప్రవృత్తి సంభవించుట లేదు. అందువలన నిష్కంపప్రవృత్తికి అసంభవము రెండు మతములయందును సమానమై యున్నది. ఈరీతిగా అఖ్యాతివాదముకూడ అసంగతమై యున్నది.

166. ప్రమాత్వాప్రమాత్వములయొక్క స్వరూపము ఉత్పత్తియును జ్ఞానప్రకారమును-ప్రమాత్వాప్రమాత్వ స్వరూపోత్పత్తియు జ్ఞానముయొక్క ప్రకారము-ప్రమాత్వాప్రమాత్వములయొక్క స్వరూపము.

అనిర్వచనీయ ఖ్యాతియే నిర్దోషమై యున్నది. తద్భిన్నఖ్యాత్యాది పంచవిధ వాదములయొక్క ఖండనము విస్తరముగా వివరణాది గ్రంథములయందు ఉన్నది. ఇచ్చట రీతిమాత్రము తెలియవలసినది. అఖ్యాతివాదిచేత సిద్ధాంతమునందు నిష్కంప ప్రవృత్తికి నసంభవదోష మున్నది. ఈదోషమునకు అఖ్యాతివాదమునందును సంభవము చెప్పబడియున్నది. మఱియు స్వప్నమున కుద్ధారము చేయబడలేదు. దానికి నుద్ధార మేమనగా ఏపదార్థముయొక్క యే జ్ఞాన మున్నదో తద్విషయక మగు నాజ్ఞానమం దప్రమాత్వనిశ్చయ ముండినయెడల ప్రవృత్తి గలుగుట లేదు. అప్రమాత్వ సందేహ ముండినయెడల సకలప్రవృత్తి గలుగుచున్నది. ప్రమాత్వ నిశ్చయ ముండినయెడల నిష్కంపప్రవృత్తి కలుగుచున్నది. అందువలన ప్రమాత్వాప్రమాత్వస్వరూపము దానియొక్క యుత్పత్తియును దానియొక్క జ్ఞానప్రకారమును చెప్పబడినవి. యద్యపి ప్రమాత్వాప్రమాత్వములయొక్క స్వరూపము పూర్వమునందు చెప్పబడినది. స్మృతికంటె భిన్నమగు అబాధితార్థగోచర మగు నేజ్ఞానమున్నదో అది ప్రమయే యయియున్నది. దానికంటె భిన్నమగు జ్ఞాన మప్రమయే యై యున్నది. ఇట్లు చెప్పుటవలన సిద్ధించిన దేమనగా స్మృతిభిన్నాబాధితార్థగోచర జ్ఞానముయొక్క ధర్మము ప్రమాత్వమై యున్నది. దానికంటె అన్యజ్ఞానము యొక్క ధర్మము అప్రమాత్వమై యున్నది. తథాపి పూర్వోక్త పారిభాషిక ప్రమాత్వము స్మృతియందు లేదు. ప్రవృత్తికి ఉపయోగియగు ప్రమాత్వము స్మృతియందును అంగీకరింపవలసినది.. ఎట్లన స్మృతిజ్ఞానముచేతను పురుషునకు ప్రవృత్తి కలుగుచున్నది. ఏస్థానమందున్న ఇష్టపదార్థమునకు స్మృతియున్నదో ఆ స్థానమునందు పురుషునకు ప్రవృత్తికలుగుచున్నది. స్మృతిజ్ఞానమునందు ప్రమాత్వ నిశ్చయ ముండినయెడల నిష్కంపప్రవృత్తి కలుగుచున్నది. ప్రవృత్తికి ఉపయోగి ప్రమాత్వము స్మృతియందును ఉన్నది. అందువలన ఉక్తస్వరూపప్రమాత్వము కంటె అన్యవిధప్రమాత్వముయొక్క స్వరూపము చెప్పవలసినది. సకలశాస్త్రములయందు స్మృతికంటె భిన్నమగు జ్ఞానమునందు అనుభవవ్యవహారము చేయబడుచున్నది. సంస్కారజన్య జ్ఞానమునందు స్మృతివ్యవహారము చేయబడు

చున్నది. యథార్థానుభవమునందు ప్రమావ్యవహారము చేయబడుచున్నది. దానికంటె భిన్నమునందు అప్రమావ్యవహారము చేయబడుచున్నది. ఈరీతిగా జ్ఞానత్వ ధర్మము సకలజ్ఞానములందు ఉండుటవలన వ్యాపకమై యున్నది. అనుభవత్వము స్మృతిత్వమును జ్ఞానత్వమునకు వ్యాప్యముగా పరస్పరవిరోధిగా జెప్పబడుచున్నవి. ఈలాగుననే ప్రమాత్వధర్మముకూడ అనుభవత్వమునకు వ్యాప్యమై యున్నది. ఎట్లన అనుభవత్వము యథార్థానుభవమునందును అయథార్థానుభవమునందును ఉన్నది. ప్రమాత్వధర్మము యథార్థానుభవమునందే యున్నది. అందువలన అనుభవత్వమునకు వ్యాప్యము ప్రమాత్వమే అయి ఉన్నది. ఈలాగుననే యథార్థత్వమునకును ప్రమాత్వము వ్యాప్యమై యున్నది. ఎట్లన యథార్థత్వము సత్యపదార్థ స్మృతియందును ఉన్నది. స్మృతియందు ప్రమాత్వము లేదు. అందువలన యథార్థత్వమునకును ప్రమాత్వము వ్యాప్యమై యున్నది. ఇది శాస్త్రికారులయొక్క పరిభాషయై యున్నది. ఏతదనుసారముగా స్మృతికంటె భిన్నమగు నబాధితార్థ గోచరమగు జ్ఞానము ప్రమయే అనంబడును. ఇదిలక్షణముగా జెప్పబడినది. ఎట్లు ప్రమాత్వముయొక్క జ్ఞానము చేత పురుషునికి నిష్కంప ప్రవృత్తి కలుగుచున్నదో అట్లు ప్రమాత్వ స్మృతియందును అంగీకరింపవలసినది. అందువలన ఈప్రసంగమునందు యథార్థత్వమునకు వ్యాప్యము ప్రమాత్వము కాదు. ఇంకేమనగా యథార్థత్వముయొక్క నామమే ప్రమాత్వమై యున్నది. పూర్వోక్త పారిభాషిక ప్రమాత్వము స్మృతియందు లేదు. యథార్థత్వమున్నది. అందువలన పూర్వోక్త ప్రమాత్వము యథార్థత్వ రూపము కాదు. దానికంటె భిన్నమై యున్నది. దానికంటె న్యూనదేశవృత్తియైనందున యథార్థత్వమునకు వ్యాప్యమై యున్నది. మఱియు ప్రవృత్తికి ఉపయోగియగు ప్రమాత్వము విచారణీయమై యున్నది. అది స్మృతిసాధారణమై యున్నది. అందువలన యథార్థత్వముకంటె న్యూనదేశవృత్తికాదు. ఇంకేమనగా యథార్థస్వరూపము అయిన ప్రమాత్వము విచారణీయ మైనది. స్మృతిజ్ఞానమునందు ప్రమావ్యవహారముచే సర్వథా విద్వేషముండినయెడల ప్రమాత్వజ్ఞానముచే నిష్కంపప్రవృత్తి కలుగుచున్నది. ఈవాక్యమును త్యజించి యథార్థత్వము జ్ఞానముచే నిష్కంప ప్రవృత్తి కలుగుచున్నది, అను నీవాక్యము చెప్పబడినది. ఈరీతిగా ఈ ప్రసంగమునందు ప్రమాత్వమునకు ఒకటే అర్థ మున్నది. అందువలన ఈప్రసంగమునందు యథార్థత్వరూపమునకు ప్రమాత్వ శబ్దముచే వ్యవహార మున్నది.

167. న్యాయవైశేషికమతమునందు జ్ఞానోత్పాదకసామగ్రిచే బాహ్యసామగ్రిచేతను ప్రమాత్వాప్రమాత్వములకు ఉత్పత్తి. ("పరతః ప్రామాణ్యవాదమును, పరతః అప్రామాణ్యవాదమును") వర్ణనము.

న్యాయశాస్త్రిమతమునందు జ్ఞానమునకు ఉత్పాదకసామగ్రిచే ప్రమాత్వమునకు ఉత్పత్తి కలుగుట లేదు. జ్ఞానమునకు జ్ఞాపకసామగ్రిచే ప్రమాత్వముయొక్క జ్ఞానము కలుగుటలేదు. ఇది పరతః ప్రామాణ్యవాద మనంబడును. ఈ ప్రసంగమునందు ప్రమాత్వమునకు ప్రామాణ్య మని పేరు. 'పరతః' అనగా అన్యముచే ప్రామాణ్యమునకు ఉత్పత్తి కలుగుచున్నది. అన్యముచేతనే ప్రామాణ్యముయొక్క జ్ఞానము కలుగుచున్నది. జ్ఞానసామగ్రికంటె భిన్నసామగ్రి పరశబ్దముయొక్క యర్థమై యున్నది. అందువలన ఈనిష్కర్ష సిద్ధించుచున్నది. జ్ఞానసామగ్రికంటె ప్రమాత్వసామగ్రి భిన్నమై యున్నది. జ్ఞానమునకు ఉత్పత్తిసామగ్రి ఇంద్రియము అనుమానాదికము పూర్వమునందు చెప్పబడినవి. దానిచేత ప్రమాత్వమునకు ఉత్పత్తి యుండినయెడల సకలజ్ఞానము ప్రమ కావలయును. అప్రమాజ్ఞానమునకు లోప మగును. అందువలన జ్ఞానోత్పత్తి సామగ్రికంటె అధిక సామగ్రిచే ప్రమాత్వమునకు ఉత్పత్తి కలుగుచున్నది. ఎచ్చట అధికసామగ్రి లేదో అచ్చట జ్ఞానమునందు ప్రమాత్వధర్మము లేదు. అందువలన భ్రమజ్ఞానమునకు లోపము లేదు. ఆయధికసామగ్రి గుణమై యున్నది. ఎచ్చట గుణసహితేంద్రియానుమానాదికములవలన జ్ఞానము కలుగుచున్నదో అచ్చట ప్రమయే యున్నది. గుణరహితేంద్రియానుమానాదికముచేత జ్ఞానము కలిగినయెడల అది ప్రమ కాదు. ప్రత్యక్ష ప్రమోత్పత్తియందు విషయమునకు అధికదేశమునందు ఇంద్రియసంయోగము గుణమై యున్నది. సాధ్యవ్యాప్య హేతువుకు సాధ్యవత్పక్షమునందు జ్ఞానము అనుమితిప్రమోత్పత్తియందు గుణమై యున్నది. ఎచ్చట వ్యభిచారిహేతువునకు పక్షమునందు జ్ఞానమున్నదో అచ్చట అనుమితిజ్ఞానసామగ్రి పక్షమునందు హేతుజ్ఞానమై యున్నది. అయిన వ్యాప్య హేతువుయొక్క జ్ఞానరూపగుణము లేదు. అందువలన అనుమితిప్రమ కాదు. ఈరీతిగా జ్ఞానవృత్తి ప్రమాత్వధర్మముయొక్క యుత్పత్తియందు జ్ఞానజనకసామగ్రికంటె అన్యగుణముయొక్క అపేక్షయుండుటవలన పరతః ప్రామాణ్యమునకు ఉత్పత్తి కలుగుచున్నది. ప్రమాత్వమువలె జ్ఞానవృత్తి ప్రమాత్వమునకును పరతః ఉత్పత్తియగుచున్నది. అటెట్లన భ్రమజ్ఞానము దోషజన్యమై యున్నది. మఱియు ప్రమాజ్ఞానమునందు దోషము హేతువుకాదు. అందు

వలన జ్ఞానసామగ్రికంటె దోషము బాహ్యమై యున్న ఆదోషము ఆగంతుకప్రకారమై యున్నది. ఈరీతిగా జ్ఞానసామగ్రికంటె దోషము పరమై యున్నది. భిన్నము పర మనంబడును. దానిచేత అప్రమకు ఉత్పత్తి యుండుటవలన పరతః అప్రామాణ్యమునకు ఉత్పత్తి యగుచున్నది. అప్రమాత్వ మప్రామాణ్య మనంబడును. ఈరీతిగా ప్రమాత్వముయొక్క యుత్పత్తియును, అప్రమాత్వముయొక్క యుత్పత్తియును పరతః కలుగుచున్నది.

168 జ్ఞానజ్ఞానత్వముల సామగ్రికంటె అన్యసామగ్రిచేత ప్రమాత్వజ్ఞానమునకు ఉత్పత్తి (పరతః ప్రామాణ్యగ్రహవాదము).

ఈలాగుననే జ్ఞానవిషయక జ్ఞానముయొక్క సామగ్రిచే ప్రమాత్వజ్ఞానము కలుగుట లేదు. జ్ఞానమునకు జ్ఞానత్వమునకును ఏసామగ్రిచే జ్ఞానము కలుగుచున్నదో దానికంటె అన్యకారణముచే ప్రమాత్వజ్ఞానము కలుగున్నది ఈలాగుననే ప్రత్యక్షాది ప్రమాణముచే ఘటాదిజ్ఞానము కలుగుచున్నది. ఈలాగుననే మనస్సంయుక్తసమవాయ సంబంధముచేత ఘటాదిజ్ఞానముయొక్క జ్ఞానముకలుగుచున్నది. నేత్రాదిప్రమాణముచే ఘటముయొక్క జ్ఞానము కలుగుచున్నది. దానికి 'అయం ఘటః' అను నీయాకార మున్నది. మనోరూపప్రమాణముచే ఘటజ్ఞానముయొక్క ప్రత్యక్ష మగుచున్నది. దానికి 'ఘట మహం జానామి' అను నీయాకార మున్నది. "ఘట మహం జానామి" అను నీమానసజ్ఞానమునకు విషయము ఘటజ్ఞానమై యున్నది. ఘటమును విషయమై యున్నది. ఎట్లన జ్ఞానవిషయక జ్ఞానము అనువ్యవసాయ మనంబడును. ఘటాదికముయొక్క జ్ఞానము వ్యవసాయ మనంబడును. అనువ్యవసాయజ్ఞానమునకు ఈస్వభావ మున్నది. వ్యవసాయవిషయమును త్యజించుట లేదు. విషయసహిత వ్యవసాయమును ప్రకాశించుచు ఉన్నది. అందువలన జ్ఞానవిషయక జ్ఞానమునకు అనువ్యవసాయ సంజ్ఞ యున్నది. వ్యవసాయానుసారి అనువ్యవసాయ మనంబడును. ఎట్లన, వ్యసాయమునకు ఘటాదికము విషయమై యున్నది. అందువలన వ్యవసాయానుసారము అనువ్యవసాయమై యున్నది. అనువ్యవసాయ జ్ఞానమునకు ఆత్మకూడ విషయమై యున్నది. ఎట్లన ఈవక్ష్యమాణనియమ మున్నది. జ్ఞానేచ్ఛాకృతి సుఖదుఃఖ ద్వేషములు అనునివి ఆత్మయొక్క విషయములై యున్నవి. వీనిలో ఏదైన నొకగుణమునకు ప్రతీతి కలిగినయెడల ఆత్మకు ప్రతీతి కలుగుచున్నది. దేనికిని ప్రతీతి కలుగనియెడల ఆత్మయొక. ప్రతీతి కలుగుట లేదు. అందువలన సకలవిశేషగుణములను త్యజించి యాత్మ

యొక్క ప్రతీతి కలుగుటలేదు. ఈలాగుననే ఆత్మను త్యజించి కేవలజ్ఞానమునకు ప్రతీతి గలుగుటలేదు. అందువలన ఘటవిషయక జ్ఞానవిషయక జ్ఞానము కలిగి నప్పుడు ఆత్మకును జ్ఞానము కలుగుచున్నది. అందువలన వ్యవసాయ జ్ఞానమును దానికి విషయమగు ఘటమును వ్యవసాయమునకు ఆశ్రయమగు ఆత్మయును "ఘట మహం జానామి" యనునీజ్ఞానమును ప్రకాశించుచున్నది. అందువలన త్రిపుటీగోచరజ్ఞానము అనువ్యవసాయ మనంబడును. ఆనువ్యవసాయ జ్ఞానమునకు కరణము మనస్సైయున్నది. అందువలన సకల విషయములతో మనస్సుయొక్క సంబంధము చెప్పవలసినది. ఎట్లు ఘటము జ్ఞానము ఆత్మయును విషయమైయున్నదో అట్లు ఘటత్వము జ్ఞానత్వము ఆత్మత్వమును, కూడ ఘట జ్ఞానవిషయక జ్ఞానమునకు విషయమై యున్నది. ఘటజ్ఞానముతో మనస్సునకు స్వసంయుక్త సమవాయసంబంధ మున్నది. జ్ఞానత్వముతో స్వసంయుక్తసమ వేతసమవాయ మున్నది. ఆత్మతో స్వసంయోగ సంబంధ మున్నది. ఆత్మత్వముతో స్వసంయుక్త సమవాయసంబంధ మున్నది. ఘటముతో మనస్సుయొక్క సంబంధము ప్రత్యక్షహేతువుకాదు. ఎట్లన బాహ్యపదార్థముయొక్క జ్ఞానము స్వతంత్ర మనస్సుచేత కలుగుటలేదు. అందువలన ఘటముతో మనస్సునకు అలౌకిక సంబంధము చెప్పవలసినది. లౌకికసంబంధముచే బాహ్యపదార్థ విషయకజ్ఞానము మనస్సుచేత గలుగుటలేదు. అలౌకిక సంబంధముచేత బాహ్యపదార్థముయొక్కయు జ్ఞానము మనస్సుచేత గలుగుచున్నది. ఆ యలౌకికసంబంధము జ్ఞానలక్షణమై యున్నది. అనువ్యవసాయజ్ఞానమునకు విషయ మగునేవ్యవసాయ జ్ఞాన మున్నదో అది మనస్సునకు ఘటముతో సంబంధమై యున్నది. దానియొక్క స్వరూపమే దనగా స్వసంయుక్తసమవేతజ్ఞానము లేక స్వసంయుక్త సమవేత జ్ఞానవిషయతయు ఘటముతో మనస్సునకు సంబంధమై యున్నది. జ్ఞానలక్షణ వాక్యమందు లక్షణ శబ్దమునకు స్వరూపము అర్థముగా జెప్పినప్పుడు ఆద్యము సంబంధ మగుచున్నది. లక్షణశబ్దమునకు జ్ఞాపక మర్థ మని చెప్పినయెడల ద్వితీయము సంబంధ మగుచున్నది. స్వశబ్దమున కర్థము మనస్సైయున్నది, దానితో సంయుక్తమగు నాత్మయందు సమవేతము వ్యవసాయజ్ఞానమై యున్నది. అది యీఘటమం దున్నది. అందువలన ఉక్తజ్ఞానమే మనస్సుకు ఘటమునందు సంబంధమై యుండుట వలన ఘటవిషయకమానసజ్ఞానము గలుగుచున్నది. ద్వితీయపక్షమునందు ఉక్త జ్ఞానముయొక్క విషయతారూప సంబంధము ఘటమునం దున్నది. వ్యవసాయజ్ఞాన

మునకు విషయము ఘటము ఘటత్వము ఈరెండున్నై యున్నవి. అందువలన వ్యవసాయరూప సంబంధముచేత ననువ్యవసాయజ్ఞానమునకు రెండువిషయములై యున్నవి. ఈరీతిగా ఘటజ్ఞానాదికము అనువ్యవసాయజ్ఞానమునకు విషయమై యున్నది. జ్ఞానవిషయక జ్ఞానము అనువ్యవసాయమై యున్నది. దాని సామగ్రి మనస్సంయోగాది రూపమై యున్నది. ఈలాగుననే జ్ఞానముయొక్కయు జ్ఞానత్వముయొక్కయు జ్ఞానము గలుగుచున్నది. ప్రమాత్వజ్ఞానము కలుగుట లేదు. జ్ఞానము గలిగి పురుషునికి సఫలప్రవృత్తి గలుగుచున్నది. తదుత్తరకాలమందు ప్రవృత్తిజనకజ్ఞానమందు ప్రమాత్వానుమితిజ్ఞానము కలుగుచున్నది. ఉ. తటాకమునందు జలప్రత్యక్ష జ్ఞానముచేత జలార్థికి ప్రవృత్తి గలిగి జలము లభించినప్పుడు పురుషునకిట్లనుమానము గలుగుచున్నది. "ఇదం జలజ్ఞానం ప్రమా, సఫలప్రవృత్తిజనకత్వాత్; యత్ర సఫలప్రవృత్తిజనకత్వం తత్ర ప్రమాత్వం నిర్ణీతప్రమాయాం." ఇచ్చట వర్తమానజలజ్ఞానము పక్షమై యున్నది. యద్యపి అనుమానకాలమందు జలజ్ఞానము అతీతమై యున్నది, తథాపి వర్తమానమునకు సమీపమగు భూతభవిష్యత్తులును వర్తమానముగానే చెప్పబడుచున్నవి. అందువలన వర్తమానజలజ్ఞానమె పక్షముగా జెప్పబడినది, అతీతముగా జెప్పబడ లేదు. ప్రమాత్వము సాధ్యమై యున్నది, ఉత్తరత్ర హేతువు దృష్టాంతము స్పష్టమగుచున్నవి. వ్యతిరేకదృష్టాంతము చెప్పినయెడల 'యత్ర యత్ర సఫలప్రవృత్తిజనకత్వం నాస్తి తత్ర తత్ర ప్రమాత్వం నాస్తి, యథా శుక్తౌ రజతజ్ఞానం'. ఈరీతిగా వాక్యము చెప్పబడినది. ఈ యనుమానముచేత జలజ్ఞానమునందు ప్రమాత్వ నిశ్చయము గలుగుచున్నది. ఈరీతిగా సకలజ్ఞానములయందు సఫలప్రవృత్తిచేత ప్రమాత్వానుమితి గలుగుచున్నది. జలజ్ఞానగ్రాహక సామగ్రి 'జల మహం జానామి' అను నీ యనువ్యవసాయము యొక్క సామగ్రియై యున్నది. ప్రమాత్వగ్రాహక సామగ్రి ఉక్తానుమానమై యున్నది. అది అనువ్యవసాయసామగ్రికంటె భిన్నమైనందున పరమై యున్నది. అందువలన పరతః ప్రమాత్వగ్రహము కలుగుచున్నది. యద్యపి న్యాయమతమునందు అనుమితివిషయము పక్షము కూడ నగుచున్నది. ఉక్తానుమితియందు జలజ్ఞానము పక్షమై యున్నది. అందువలన ప్రమాత్వానుమానము కూడ జ్ఞానగ్రాహక సామగ్రియై యున్నది. ఈలాగుననే అనువ్యవసాయముకూడ ద్విప్రకారకమై యున్నది. ఒకటి 'జల మహం జానామి' అను నీ యనువ్యవసాయము. ఎచ్చట ప్రమాత్వనిశ్చయో త్తరమునందు అనువ్యవసాయ మున్నదో అచ్చట

'జలం ప్రమినోమి'అను నీయనువ్యవసాయము కలుగుచున్నది. అందువలన ఈ ద్వితీయానువ్యవసాయమునకు
మానరూపజ్ఞానగ్రాహకసామగ్రిచేత ప్రమాత్వనిశ్చయము కలుగుచున్నది.
ద్వితీయానువ్యవసాయముయొక్క సామగ్రియును జ్ఞానగ్రాహకమై యున్నది.
దానిచే ప్రమాత్వనిశ్చయము గలుగుచున్నది. ఈరీతిగా సిద్ధాంతకోటి స్వతః
ప్రామాణ్యగ్రహప్రాప్తిరూపమై యున్నది. తథాపి ఏ యే జ్ఞానగ్రాహకసామగ్రి
యున్నదో అది ప్రమాత్వగ్రాహకమై యున్నది. ఇది సిద్ధాంతకోటియై యున్నది.
జ్ఞానగ్రాహకసకలసామగ్రియందు 'జల మహం జానామి' అను వ్యవసాయము
యొక్క సామగ్రియును అంతర్భూతమై యున్నది. దానిచేత ప్రమాత్వగ్రహము
కలుగుట లేదు. అందువలన సిద్ధాంతకోటి యంగీకరింపబడ లేదు. ఈరీతిగా
ఘటాదిజ్ఞానముచేత ఘటాదికమునకు ప్రకాశ మగుచున్నది. ఘటాదికమునకు
ప్రకాశము గలిగినను ఘటాదివిషయక జ్ఞానమునకును జ్ఞానాశ్రయాత్మకును
ప్రకాశము గలుగుట లేదు. ఏకాలమందు అనువ్యవసాయ మున్నదో అప్పుడు
ఘటాదివిషయసహితాత్మ సహిత ఘటాదిజ్ఞానమునకు ప్రకాశ మగుచున్నది.
అయిన అనువ్యవసాయజ్ఞానముచేత వ్యవసాయత్రిపుటికి ప్రకాశ మగుచున్నది.
అనువ్యవసాయమునకు ప్రకాశము గలుగుటలేదు. ఎప్పుడు అనువ్యవసాయ గోచ
రానువ్యవసాయ మున్నదో అప్పుడు ప్రథమానువ్యవసాయమునకు ప్రకాశ మగు
చున్నది, ద్వితీయానువ్యవసాయము అప్రకాశిత మగుచునే యున్నది. ప్రథమాను
వ్యవసాయము వ్యవసాయ గోచరమై యున్నది. ద్వితీయానువ్యవసాయము అను
వ్యవసాయమై యున్నది. 'ఘటజ్ఞాన మహం జానామి'అను నిది ద్వితీయానువ్యవసా
య స్వరూపమై యున్నది. ద్వితీయానువ్యవసాయముయొక్క వ్యవహార మిష్టమై
యుండినయెడల 'ఘటజ్ఞానస్య జ్ఞాన మహం జ్ఞానామి'అను నీతృతీయానువ్యవసాయ
మున్నది. అయిన న్యాయమతమునందు ఘటజ్ఞానముచేత ఘటమునకు ప్రకాశము
గలిగి ఘటముయొక్క వ్యవహారము సిద్ధమై యున్నది. ఘటవ్యవహారమునందు
ఘటజ్ఞానమునకు ప్రకాశముయొక్క యపేక్ష లేదు. ఘటజ్ఞానముయొక్క వ్యవహార
ము ఇష్టమైనప్పుడు అనువ్యవసాయముచేత ఘటజ్ఞానమునకు ప్రకాశము గలిగి ఘట
జ్ఞానమునకు వ్యవహారము గలుగుచున్నది. అనువ్యవసాయమునకు ప్రకాశము
యొక్క యపేక్ష లేదు. ఈరీతిగా దేనియొక్క వ్యవహార మిష్టమై యున్నదో
తద్విషయక జ్ఞానముయొక్క యపేక్ష యున్నది. విషయప్రకాశక మగునేజ్ఞాన
మున్నదో అది ప్రకాశితమై యున్నది, లేక అప్రకాశితమై యున్నది. దానికి ప్ర

కాశముచే నుపయోగము లేదు. ప్రకాశితజ్ఞానము చేతనే విషయమునకు ప్రకాశ ముండినయెడల న్యాయమతమునందు అనవస్థాదోషము గలుగుచున్నది. ఎట్లన ఏ జ్ఞానము చేత విషయప్రకాశ మగుచున్నదో ఆజ్ఞానము స్వప్రకాశము గాదు. దానికి ప్రకాశకము జ్ఞానాంతర మైనయెడల జ్ఞానము చేత విషయమునకు ప్రకాశము గలిగి ఆ ప్రథమజ్ఞానమునకు ప్రకాశకమగు జ్ఞానాంతరమునకు అన్యజ్ఞానము కావలయును. తృతీయమునకు ప్రకాశకము చతుర్థజ్ఞానము కావలయును. ఈ రీతిగా అనవస్థాదోషమున్నది. పరస్పరసాపేక్ష ప్రకాశమును అంగీకరించినయెడల అన్యోన్యాశ్రయచక్రకదోషము లున్నవి. విషయప్రకాశమునందు తనచేత ప్రకాశమునకు జ్ఞానము అపేక్షించుటలేదు. అయిన స్వవ్యవహారమునందు ప్రకాశముయొక్క యపేక్ష యున్నది. ఎచ్చట ఘటాది విషయముయొక్క వ్యవహార మిష్టమై యున్నదో అచ్చట ఘటజ్ఞానమునకు ఘటముయొక్క ప్రకాశము కొఱకు నపేక్ష యున్నది. అప్రకాశిత జ్ఞానము చేతనే ఘటవ్యవహారము గలుగుచున్నది. ఎట్లు ఎప్పుడు ఘటజ్ఞానము లేదో ఆకాలమునందును జలధారణాది ప్రయోజనముయొక్క సిద్ధిని ఘటము చేయుచున్నదో స్వకార్యమునందు ప్రకాశమును ఘటము అపేక్షింపదో అట్లు జ్ఞానముయొక్క కార్యము విషయ ప్రకాశమై యున్నది. ఆవిషయప్రకాశరూపకార్యమందు తన ప్రకాశమును జ్ఞానము అపేక్షించుటలేదు. ఘటమువలె స్వ వ్యవహారమునందు ప్రకాశముకొఱకు జ్ఞానమును అపేక్షించుచున్నది. ఏ జ్ఞానముయొక్క వ్యవహారము ఇష్టమై యున్నదో ఆజ్ఞానముయొక్క జ్ఞాన ముండవలసినది జ్ఞానజ్ఞానమునకు ప్రకాశముయొక్క యపేక్ష లేదు. ఇచ్ఛావిషయ మిష్టమనంబడును. అందువలన న్యాయమతమునందు అనవస్థాదోషము చెప్పబడినది. అది దానియొక్క అవివేకమూలకప్రలాపమై యున్నది. ఈరీతిగా న్యాయమతమునందు జ్ఞానము స్వప్రకాశము కాదు. అందువలన జ్ఞానముయొక్క జ్ఞానమునకు దేనిచేత నుత్పత్తి యగునో అది జ్ఞానగ్రాహక సామగ్రి యనంబడును. అనువ్యవసాయజ్ఞానసామగ్రి మనస్సంయోగాదికమును జ్ఞానలక్షణాలౌకిక సంబంధము నై యున్నది. అది అనువ్యవసాయభేదముచేత నానావిధమై యున్నది. 'జలజ్ఞానం ప్రమా' అను నీయనుమితియు కూడ జ్ఞానముయొక్క జ్ఞానమై యున్నది. దానికి జనకము అనుమానమై యున్నది. అదియును జ్ఞానగ్రాహకసామగ్రియై యున్నది. దానిచే జలజ్ఞానముయొక్క ప్రమాత్వముయొక్క జ్ఞానము గలుగుట లేదు. 'జలం ప్రమినోమి' అనునీయనువ్యవసాయము

యొక్క సామగ్రికూడ జ్ఞానగ్రాహకసామగ్రియై యున్నది. దానిచేత జలజ్ఞానము యొక్క ప్రమాత్వజ్ఞానము గలుగుచున్నది. అయిన 'జల మహం జానామి' అను సి యనువ్యవసాయము కూడ జలజ్ఞానముయొక్క జ్ఞానమై యున్నది. జలజ్ఞానము యొక్క ప్రమాత్వము ప్రకాశించుట లేదు. అందువలన జ్ఞానగ్రాహకసామ గ్రిచే జలజ్ఞానముయొక్క ప్రమాత్వమునకు అగ్రహ ముండుటవలన జలజ్ఞాన గ్రాహకసకల సామగ్రిచేత జలజ్ఞానముయొక్క ప్రమాత్వమునకు గ్రహణము గలుగనందున స్వతఃప్రామాణ్యగ్రహము గలుగుట లేదు. ఇంకేమనగా పరతః ప్రామాణ్యము గలుగుచున్నది. ఏయేజ్ఞానగ్రాహకసామగ్రి యున్నదో ఆ సర్వ ముచే ప్రమాత్వగ్రహము గలుగుచున్నది. ఇది స్వతఃప్రామాణ్యగ్రహ మనంబ డును. ఈ పక్షమునందు ప్రమాత్వధర్మమును త్యజించి ఏజ్ఞానముయొక్క జ్ఞానము గలుగుటలేదు. ప్రమాత్వము జ్ఞానత్వము అనునీయుభయధర్మవిశిష్ట జ్ఞానము యొక్క జ్ఞానము గలుగుచున్నది. కేవల జ్ఞానత్వధర్మవిశిష్టజ్ఞానముయొక్క జ్ఞా నము గలుగుట లేదు. మఱియు పరతఃప్రామాణ్యగ్రహవాదమందు ప్రథమాను వ్యవసాయముచేత ప్రమాత్వమును త్యజించి జ్ఞానత్వవిశిష్ట జ్ఞానముయొక్క జ్ఞా నము గలుగుచున్నది. ద్వితీయమగు సన్న్యానువ్యవసాయముచేత లేక ఉక్త ప్రకారానుమానముచేత ప్రమాత్వజ్ఞానము గలుగుచున్నది.

169. మీమాంసకులకు సిద్ధాంతులకు సమ్మతమగు స్వతః ప్రా మాణ్య వాదమునందు దోషము.—

మీమాంసామతమునందును సిద్ధాంతమునందును స్వతఃప్రామాణ్య గ్రహ ము అంగీకరింపబడినది. న్యాయవైశేషిక మతమునందు పరతఃప్రామాణ్య గ్రహ మతమున కంగీకార మున్నది. మఱియు స్వతఃప్రామాణ్యగ్రహమునందు ఈ దోషము చెప్పబడినది. ఏకపదార్థమునకు అనేకపర్యాయములు జ్ఞానము కలిగి ప్రవృత్తి కలిగినప్పుడు జ్ఞానముయొక్క ప్రమాత్వమునందు ఎప్పుడును సం దేహము కలుగుటలేదు. ఎట్లన అనేకపర్యాయములు సఫలప్రవృత్తి కలిగి ప్ర మాత్వనిశ్చయము కలుగుచున్నది. ఆప్రమాత్వనిశ్చయము ప్రమాత్వసంశయ మునకు విరోధియై యున్నది. అయిన ఏ పదార్థముయొక్క అపూర్వజ్ఞానము న్నదో దానియొక్క జ్ఞానమునందు ప్రమాత్వసంశయము కలుగుచున్నది. అది లేకపోవలయును. ఎట్లన అద్వైతమతమునందును ప్రభాకరమతమునందును జ్ఞాన ము స్వప్రకాశమై యున్నది. అందువలన జ్ఞానము ఎప్పుడును అగృహీతము కాదు.

గృహీతమయియే యున్నది. అందువలన ప్రమాత్వము కూడ గృహీత మయిన యెడల నిర్ణీత పదార్థమునకు సందేహము కలుగుట లేదు. అందువలన ప్రమాత్వసందేహము సంభవించుట లేదు. సిద్ధాంతపక్షమునందైన ప్రకాశరూపము జ్ఞానమై యున్నది. ప్రకాశపదార్థమునకు జ్ఞానపదార్థతో భేదము లేదు.

170. ప్రభాకరమతమునందు జ్ఞానముచే త్రిపుటియొక్క ప్రకాశము.

ప్రభాకరమతమునందు జ్ఞానవిషయమునందు ప్రకాశ మున్నది. ప్రకాశమునకు హేతువు జ్ఞానమై యున్నది. ఎట్లు ఘటజ్ఞాన ముండినపుడు ఘటజ్ఞానముచే ఘటప్రకాశము కలుగుచున్నదో, అట్లు ఘటజ్ఞానము తమస్వరూపమునకు ప్రకాశము చేయుచున్న తనకు ఆశ్రయమయిన యే ఆత్మయున్నదో దానికి ప్రకాశమును చేయుచును జ్ఞానము త్రిపుటిని ప్రకాశింపజేయుచున్నది. జ్ఞాతృజ్ఞానజ్ఞేయముల యొక్క సముదాయము త్రిపుటి యనంబడును. ఈరీతిగా ప్రభాకరమతమునందు తనయొక్క స్వరూపము కూడ జ్ఞానము విషయముగా చేయుచున్నది. మఱియు తనయొక్క ప్రమాత్వమును విషయీకరించుచున్నది.

171. మురారిమిశ్ర మతము.

మురారిమిశ్రమతమందు జ్ఞానమునకు ప్రకాశము అనువ్యసాయముచే కలుగుచున్నది. ఆజ్ఞానమునకు ప్రకాశకమగు ననుమితియే ప్రమాత్వమునకు ప్రకాశముగా అంగీకరింపబడి యున్నది. అందువలన అనువ్యవసాయోత్తరమునందు ప్రమాత్వముయొక్క సందేహము కాక పోవలయును.

172. భట్టసిద్ధాంతము.

భట్టసిద్ధాంత మేమనగా ఘటాదివిషయక జ్ఞానముయొక్క జ్ఞానము ప్రత్యక్షరూపము కాదు. ఎట్లన జ్ఞానగుణము ప్రత్యక్షయోగ్యము కాదు. అందువలన జ్ఞానముయొక్క జ్ఞానము అనుమితిరూపమై యున్నది, మానసప్రత్యక్షరూపము కాదు, అనుమితిజ్ఞాన మీరీతిగా కలుగుచున్నది. విషయేంద్రియములయొక్క సంయోగముచే ప్రత్యక్ష జ్ఞానము లేక అనుమితి జ్ఞానము కలిగి సకలజ్ఞానములచే ఘటాది విషయమునందు జ్ఞాతతానామక మగు ధర్మముత్పన్న మగుచున్నది. అందువలన జ్ఞానోత్పత్త్యనంతరము "జ్ఞాతో ఘటః" అనునీవ్యవహారము కలుగుచున్నది. జ్ఞానముకంటె పూర్వమందు ఏఘటేంద్రియముల సంయోగ మున్నదో దానిచేత "అయం ఘటః" అనునీప్రత్యక్షము కలుగుచున్నది. ఆప్రత్యక్షజ్ఞానము సమవాయ సంబంధముచేత జ్ఞాతయందున్నది. విషయతాసంబంధముచేత ఘటమందున్నది.

ఎచ్చట విషయతాసంబంధముచేత జ్ఞానమున్నదో అచ్చట సమవాయసంబంధముచేత జ్ఞాతతయుత్పన్నమగుచున్నది. ఈరీతిగా ఘటముయొక్క జ్ఞానముచేత ఘటమునందు జ్ఞాతత ఉత్పన్నమగుచున్నది. ఆజ్ఞాతతకు ఉపాదానకారణము ఘటమై యున్నది. నిమిత్తకారణము జ్ఞానమైయున్నది. అసమవాయ కారణపరిభాష భట్టమతమునందు లేదు. ఉపాదానకారణముకంటె భిన్నము నిమిత్తకారణమని చెప్పబడును. ఈరీతిగా జ్ఞానజన్య జ్ఞాతతారూపధర్మము ఘటమునందున్నది. ప్రథమమునందు "అయం ఘటః" అనునీరీతిగా ఘటమునకు ప్రకాశమగు ప్రత్యక్షముత్పన్నమగుచున్నది. ఆప్రత్యక్షముచేత ఘటమునందు జ్ఞాతతారూప ధర్మముత్పన్నమైనపుడు ఇంద్రియసంయోగముచేత ఆఘటమునకు 'జ్ఞాతోఘటః' అనునీరీతిగా ప్రత్యక్షము కలుగుచున్నది. ఈరీతిగా జ్ఞానజన్యజ్ఞాతతకు బాహ్యేంద్రియముచేత ప్రత్యక్షమగుచున్నది. బాహ్యపదార్థముయొక్క జ్ఞానమునకు బాహ్యేంద్రియముచేత కొందఱమతమునందు ప్రత్యక్షజ్ఞానము కలుగుట లేదు. న్యాయాది మతమునందు జ్ఞానమునకు మానసప్రత్యక్షము కలుగుచున్నది. భట్టమతమునందు ఘటాదివిషయక జ్ఞానమునకు మానసప్రత్యక్షమును కలుగుట లేదు. అయిన ఘటాదిజ్ఞానమునకు అనుమానజన్యానుమితిజ్ఞానము కలుగుచున్నది. అనుమానముయొక్క ప్రకార మేమనగా "అయం ఘటః విషయతాసంబంధేన జ్ఞానవాన్, సమవాయేన జ్ఞాతతావత్త్వాత్; యత్ర యత్ర సమవాయేన జ్ఞాతతా తత్ర తత్ర విషయతాసంబంధేన జ్ఞానం" అను నీస్థానమునందు పురోవర్తి ఘటము పక్షమై యున్నది. విషయతాసంబంధముచేత జ్ఞానము సాధ్యమై యున్నది. ఉత్తరోత్తరమునందు హేతు దృష్టాంతము లున్నవి. అన్యగ్రంథమునందు ప్రకారాంతరముచే అనుమానము వ్రాయబడియున్నది. అది కఠినమై యున్నది. మఱియు భట్టమతమునందుండెడి యనుమానముచేత జ్ఞానము తెలియవలసినది. ఈసుగమరీతి చూపింపబడినది. ఈరీతిగా జ్ఞానగ్రాహకసామగ్రి భట్టమతమునందు అనుమానమై యున్నది.

### 173 న్యాయవైశేషికమతములయొక్క నిష్కర్ష.

ఈ యనుమానముచేతనే ఘటజ్ఞానముయొక్క ప్రమాత్వమునకును జ్ఞానము కలుగుచున్నది. అందువలన జ్ఞానముయొక్క యనుమితి కలిగిన యనంతరము ప్రమాత్వముయొక్క సందేహము భట్టమతమునందు కలుగక పోవలయును. అందువలన జ్ఞానముయొక్క సకలజ్ఞానముచే ప్రమాత్వనిశ్చయము కలుగుట లేదు. ఇంకేమనగా సఫలప్రవృత్తి కలిగిన యనంతరము జ్ఞానముయొక్క ప్రమాత్వనిశ్చయము

కలుగుచున్నది. ఇది న్యాయవై శేషికులయొక్క మతమై యున్నది. ఇది పరతః ప్రామాణ్యవాద మనబడును. జ్ఞానోత్పత్తి సామగ్రిచేత ప్రమాత్వమునకు ఉత్పత్తి కలుగుట లేదు. అధికసామగ్రిచేత ప్రమాత్వమునకు ఉత్పత్తి కలుగుచున్నది. ఆలాగుననే అధికసామగ్రిచేత ప్రమాత్వమునకు జ్ఞానము కలుగుచున్నది. ప్రమాత్వమునకువలె అప్రమాత్వమునకు పరతః ఉత్పత్తియును పరతః జ్ఞానమును ఉన్నవి. జ్ఞానజనకసామగ్రిచేత జ్ఞానముయొక్క ప్రమాత్వ ధర్మముయొక్క యుత్పత్తి యున్నయెడల సకలజ్ఞానము అప్రమ కావలయును. అందువలన జ్ఞానజనక సామగ్రిచేత అప్రమాత్వమునకు ఉత్పత్తి యగుటలేదు. జ్ఞానజనకములు ఇంద్రియానుమానాదికములై యున్నవి. వానియందు దోషముయొక్క సహకార ముండినయెడల అప్రమాత్వసహితజ్ఞానమునకు ఉత్పత్తి యగుచున్నది ఇట్లు దోషము నానావిధమై యున్నది.

ప్రత్యక్షభ్రమ యయినప్పుడు నేత్రాదిగత ప్రమాణదోషమువలె విషయగత సాదృశ్యదోషమునకు హేతువై యున్నది. ఒకప్పుడు ప్రత్యక్షభ్రమయందు విషయగత సాదృశ్యదోషమునకు వ్యభిచారమును ఉన్నది. అయిన సదృశము నందే అనేకవిధములుగా భ్రమ కలుగుచున్నది. అందువలన అనేకస్థలముల యందు సాదృశ్యదోషము భ్రమకు హేతువై యున్నది. ఎచ్చట విసదృశమునందు భ్రమ అనుభవసిద్ధమై యున్నదో అచ్చట సాదృశ్యదోషము భ్రమకు కారణము కాదు. ఏకరూపముతో దోషము హేతువు కాదు. ఇంకేమనగా ఏదోష ముండి యేభ్రమ కలుగుచున్నదో ఆదోషమునకు ఆభ్రమను గుఱించి కారణత్వమున్నది. పరోక్షభ్రమజ్ఞానమందు సాదృశ్యముయొక్క యపేక్ష లేదు. ఇది యనుభవసిద్ధమై యున్నది. అందువలన పరోక్షజ్ఞానమునందు విషయగతదోషము హేతువు కాదు. అనుమితిభ్రమయందు అనుమానదోషము హేతువై యున్నది. వ్యాప్యమగు హేతువుయొక్క జ్ఞానము అనుమాన మనంబడును. హేతువునందు వ్యభిచారాది దోషము న్యాయగ్రంథమునందు ప్రసిద్ధమై యున్నది. శాబ్దభ్రమ కలిగినచోట శ్రోతయందు వాక్య తాత్పర్యముయొక్క యనవధారణము దోషమై యున్న, వక్తయందు విప్రలంభత్వాదికము దోషమై యున్నది. శబ్దమునందు అన్యథాబోధకత్వాది దోషమున్నది. ఈరీతిగా అప్రమాత్వమునకు హేతువు దోషమని యనుభవానుసారముగా తెలియవలసినది.

ఈప్రసంగమునందు ప్రమాత్వమునకును అప్రమాత్వమునకును ఉత్ప

త్తి చెప్పబడి యున్నది. అది విరుద్ధముగా ప్రతీతమగుచున్నది. భూతభవిష్యద్వర్తమాన సకలప్రమయందు ప్రమాత్వధర్మము ఏకమై యున్నది. ఈరీతిగానే సకలాప్రమయందు అప్రమాత్వమును ఏకమై యున్నది. దీనికి ఉత్పత్తిని చెప్పుట సంభవింపదు. తథాపి తనయొక్క కారణముచేత జ్ఞానము ఉత్పన్నమైనప్పుడు కొంతజ్ఞానము ప్రమయే అయియున్నది, కొంతజ్ఞానము అప్రమయే అయియున్నది. ప్రమాత్వవిశిష్టము ప్రమయే అయియున్నది. అప్రమాత్వవిశిష్టము అప్రమయే అయియున్నది. ఈరీతిగా జ్ఞానమునందు ప్రమాత్వాప్రమాత్వధర్మములయొక్క విలక్షణత జ్ఞానజనకసామగ్ర్యధీనమై యున్నది. కొన్నిస్థలములయందు జ్ఞానమునకు ఈసామగ్రి యున్నది. దేనిచేత ప్రమాత్వవిశిష్టజ్ఞానమగుచున్నదో మఱియు కొన్నిస్థలములయందు ఈసామగ్రి యున్న దేనిచేత. అప్రమాత్వవిశిష్టజ్ఞానమునకు ఉత్పత్తి యున్నదో అందువలన ఇట్లు అంగీకరింపవలసినది. ప్రమాత్వ ధర్మమైననో ఏకమై యున్నది. సకలప్రమయందు దాని సంబంధము న్నది, అయిన ప్రమాత్వముయొక్క సంబంధము సామగ్ర్యధీనమై యున్నది. ఈరీతిగా జ్ఞానమునందు ప్రమాత్వమునకు ప్రయోజకసామగ్రి యుండుటవలన ప్రమాత్వమునకు ఉత్పత్తి చెప్పబడినది. ఈలాగుననే అప్రమాత్వమునకు ప్రయోజకము దోషమై యున్నది. అందువలన దోషజన్యము అప్రమాత్వ మనంబడును. దోషజన్య వచనమునకు దోషప్రయోజ్యమునందు తాత్పర్యము దానియొక్క జ్ఞానమునకు ముఖ్యోత్పత్తియును సంభవించుచున్నవి. యద్యపి సిద్ధాంతమునందు ప్రమాత్వము సాక్షిభాస్యమై యున్నది. అందువలన ప్రమాత్వముయొక్క జ్ఞానమునకును ఉత్పత్తిని చెప్పినయెడల సాక్షికి ఉత్పత్తి సిద్ధమగును. అది సంభవింపదు. తథాపి వృత్తియందు ఆరూఢసాక్షి ప్రమాత్వాదికమును ప్రకాశింప జేయుచున్నది. అందువలన వృత్తియును జ్ఞాన మనంబడును. దానికి ఉత్పత్తి సంభవించుచున్నది. ఈవార్త పూర్వమందు చెప్పబడినది. తథాపి ఉక్తార్థకథనముచేత శ్రోతకు అధ్యేతకును బోధము దృష్టమై యున్నది. శాస్త్రీయార్థముయొక్క మందసంస్కారసహితపురుషులకు పునఃపునః చెప్పుటవలన అనాయాసముచేత బోధ యగుచున్నది. అందువలన ఈప్రకరణమునందు అనేకార్థము మాటిమాటికి చెప్పబడినది, పునరుక్తి దోషము లేదు. ఈరీతిగా న్యాయమతమునందు పరతఃప్రామాణ్యము అంగీకరింపబడి యున్నది. మఱియు స్వతః ప్రామాణ్యవాదమందు సంశయమునకు అనుత్పత్తి దోషము చెప్పబడియున్నది.

## 174. న్యాయ వైశేషిక మతములయొక్క ఖండనము.

ఆసకలము అసంగతమై యున్నది. ప్రమాత్వముయొక్క జ్ఞానము ఉత్తరత్ర చెప్పబడును. పూర్వమందు అనువ్యవసాయజ్ఞానముచేత జ్ఞానమునకు ప్రకాశము కలుగుచున్నది, అను నీకథనము అసంగతమై యున్నది. అప్రకాశస్వభావము జ్ఞానమైన యెడల దానియొక్క సంబంధముచేత ఘటాదికమునకు ప్రకాశము కాక పోవలయును. ఘటాదికముయొక్క ప్రకాశమునందు జ్ఞానముచేత ప్రకాశము అపేక్షింపబడదు. ఎట్లు ఘటాదిక మజ్ఞాతమైనను స్వకార్యమును జేయుచున్నదో అట్లు జ్ఞానముకూడ అజ్ఞాతమై విషయప్రకాశరూప స్వకార్యమును చేయుచున్నది, అని చెప్పినయెడల నది సంభవింపదు. ఎట్లన భౌతికజ్యోతి తాను ప్రకాశరూపమై అన్యమును ప్రకాశింప జేయుచున్నది. ప్రకాశహీన జ్యోతిచేత దేనికిని ప్రకాశము కలుగుట లేదు. ప్రకాశము లేక పోయినను స్వభావబలముచే స్వసంబంధికి ప్రకాశము నిచ్చినయెడల సువర్ణసజ్యోతిభాగముచేత సువర్ణ సంబంధి యగు ఘటాదికమునకు ప్రకాశము కావలయును. స్వరూప ప్రకాశముచేత ప్రకాశమాన భౌతికజ్యోతిచే ఘటాదికమునకు ప్రకాశము చూడబడి యున్నది. మఱియు స్వరూపప్రకాశముచేత నప్రకాశ మగు సువర్ణరజతాదిరూపజ్యోతిచేత దేనికిని ప్రకాశము చూడబడలేదు. అందువలన స్వరూప ప్రకాశముచే ప్రకాశమానజ్ఞానముయొక్క సంబంధముచేత ఘటాదికమునకు ప్రకాశమగుచున్నది, అని యంగీకరింపవలసినది. అందువలన జ్ఞానము ప్రకాశస్వభావమై యున్నది. కేవల దృష్టాంతబలముచేత జ్ఞానమునకు స్వప్రకాశత్వము చెప్పబడలేదు. ఇంకేమనగా అనుభవముచేతను స్వప్రకాశత సిద్ధమగుచున్నది. ఎచ్చట దుర్బోధమగు నజ్ఞాతపదార్థముయొక్క జ్ఞానము కలిగి ''జ్ఞాతవ్యం జ్ఞాతం, నావశిష్యతే జ్ఞాతుం''అను నీవాక్యము హర్షముచేత జెప్పబడుచున్నది. ఇట్టివానినిగూర్చి మఱియొకరు చెప్పునదేమనగా''ఏతదజ్ఞానం జ్ఞాతు మవశిష్యతే'' యను నీ వాక్యము విని హాస్యముచేయును. అందువలన జ్ఞానముయొక్క ప్రకాశత అనుభవసిద్ధమై యున్నది. జ్ఞానముయొక్క ప్రకాశమునకు అవశేషత్వమును విని నవ్వును. మఱియు ''ఘటజ్ఞానం జ్ఞాతం నను'' అని చెప్పువానిని చెడువాడనగూడదు. అందువలన నెప్పుడు జ్ఞానమం దజ్ఞాతత లేదు. అజ్ఞాతతయభావముచేత జ్ఞానగోచరానువ్యవసాయ మున్నది, అను నీ కథన మసంగతమై యున్నది కొందఱ కీసందేహము లేదు. ''నాకు ఘటజ్ఞాన మున్నది. అథవా లేదు'' ఘటజ్ఞాన మజ్ఞాత మైనయెడల

సందేహము ఒకప్పుడు కలుగవలయును. అందువలన జ్ఞాన మజ్ఞాతము కాదు. జ్ఞానమునకు ప్రకాశము అనువ్యవసాయమై యున్నది, అను నీ కథన మసంగతము. ఒక్కరు చెప్పునదేమనగా జ్ఞానగోచరజ్ఞానము లేనియెడల "అయం ఘటః, ఘట మహం జానామి." అను నీ రీతిగా జ్ఞానమందు విలక్షణతాప్రతీతి లేకపోవలయును. ఎట్లన న్యాయమతమందు ప్రథమజ్ఞానమునకు విషయము ఘటమై యున్నది, ద్వితీయజ్ఞానమునకు విషయము ఘటజ్ఞానమై యున్నది. అందువలన విషయభేదము చేత జ్ఞానమునకు విలక్షణత సంభవించుచున్నది. స్వప్రకాశజ్ఞానవాదిమతమందు జ్ఞానమునకు విషయము జ్ఞానము కాదు. రెండుజ్ఞానములకును విషయము ఘటమైనందున విషయభేదము లేనందున విలక్షణప్రతీతి కాకపో వలయును, అను నీ శంక సంభవింపదు. ఎట్లు ఒకటేఘటమునకు కదాచిత్ 'అయం ఘటః' అను నీ జ్ఞాన మున్నది, కదాచిత్ 'అనిత్యో ఘటః' అను నీజ్ఞాన మున్నది. అచ్చట విషయముయొక్క భేదము లేక యేజ్ఞానము విలక్షణమై యున్నదో అయిన ప్రథమజ్ఞానమందు ఘటముయొక్క యనిత్యత భాసించుటలేదో, ద్వితీయజ్ఞానమందు ఘటముయొక్క యనిత్యత భాసించుచున్నదో అట్లు 'అయం ఘటః' అను నీ జ్ఞానమందు ఘటముయొక్క జ్ఞాతత భాసించుటలేదు. "ఘట మహం జానామి" అను నీ జ్ఞానమందు ఘటముయొక్క జ్ఞాతత భాసించుచున్నది. జ్ఞానజన్యప్రాకట్యము జ్ఞాతత యనంబడును. ద్వితీయజ్ఞానమునకు విషయము ఘటవృత్తి జ్ఞాతతయై యున్నది. ఘటముయొక్క జ్ఞానముకాదు. అందువలన ఘటజ్ఞానోత్తరకాలమందు కదాచిత్తు "ఘట మహం జానామి" అను నీ జ్ఞానము కలుగుచున్నది, కదాచిత్తు "జ్ఞాతో ఘటః" అను నీ ప్రత్యక్షము కలుగుచున్నది. 'జ్ఞాతో ఘటః' అను నీ ప్రత్యక్షమునకు విషయము ఘటముయొక్క జ్ఞాతతయై యున్నది. ఈ యర్థము భట్టసమ్మతమై యున్నది, అనుభవానుసారియై యున్నది. ఎట్లన "అనిత్యోఘటః" అని చెప్పుటవలన అనిత్యపదార్థమందు విశేషణమగు అనిత్యత్వమునకు ప్రతీతి ఘటమునందు సర్వసమ్మతమై యున్నదో అట్లు "జ్ఞాతోఘటః" అను నీ వాక్యముచేత జ్ఞాతపదార్థమందు విశేషణమగు జ్ఞాతత్వమునకు ఘటమునందు ప్రతీతి సర్వానుభవసిద్ధమై యున్నది "జ్ఞాతో ఘటః" అను నీ జ్ఞానకాలమందు "ఘట మహం జానామి" అను నీ జ్ఞానము కలుగుచున్నది. అందువలన 'ఘట మహం జానామి' యను నీ జ్ఞానము కూడ ఘటముయొక్క జ్ఞాతతను విషయీకరించుచున్నది. ఈరీతిగా జ్ఞాన

గోచరజ్ఞానము నంగీకరింపకపోయినను "అయం ఘటః" "ఘట మహం జానామి" అనునీరీతిగా విలక్షణ జ్ఞానము సంభవించుచున్నది. అందువలన అనువ్యవసాయజ్ఞానమునకు విషయము జ్ఞానమై యున్నది, అను నీ నైయాయికమత మసంగతమై యున్నది.

175. మురారిమిశ్రమతఖండనము.

ఈలాగుననే మురారిమిశ్రమతముకూడ ఈప్రసంగమునందు నైయాయికమతతుల్యమై యున్నది. అందువలన అసంగతమై యున్నది. యద్యపి మురారిమిశ్రమతమునందు జ్ఞానప్రకాశకానువ్యవసాయముచేతనే ప్రమాత్వమునకు ప్రకాశ మగుచున్నది, న్యాయమతముతో నింతవిశేష మున్నది. తథాపి ఈ విశేషము అకించిత్కరమై యున్నది. ఎట్లన అప్రకాశస్వభావ జ్ఞానమునకు వ్యవసాయముచేత ప్రకాశమగుచున్నదను నీయంశమందు న్యాయతుల్యమై యుండుటవలన అసంగతమై యున్నది.

176. భట్టమతఖండనము.

ఈలాగుననే భట్టమతమునందు అనుమితిచేత జ్ఞానమునకు పరోక్ష ప్రకాశ మగుచున్నది, అనునిది న్యాయమతముకంటెను అసంగతమై యున్నది. ఎట్లన ఆయన మతమునందును జ్ఞానమునకు ప్రకాశమగు నేయనుమితి యున్నదో దాని చేత ప్రమాత్వమునకు ప్రకాశ మగుచున్నది; అను నీ నింతయంశము న్యాయముకంటె విలక్షణమై సిద్ధాంతానుకూలమై యున్నది. తథాపి ఘటాదివిషయమును అపరోక్షపక్షముగా విషయీకరించు ప్రత్యక్షజ్ఞానమున కనుమితిరూపపరోక్ష ప్రకాశ మున్నది, అను నీ కథనము హాస్యాస్పదమై యున్నది.

177. ప్రభాకరమతఖండనము.

ఈలాగుననే ప్రభాకరమతమునందును ఘటజ్ఞానాదికము తన ప్రకాశమునందు అనువ్యవసాయాదికమును అపేక్షించుట లేదు. ఇంతయంశమందు సిద్ధాంతమునకు అనుకూల మున్నది. ప్రమాత్వగ్రహమునందు జ్ఞానగ్రాహక సామగ్రికంటె అన్యముగొక్క యపేక్షను గోరదు. ఈయంశమునందును సిద్ధాంతమున కనుకూల మున్నది. తథాపి ప్రభాకరమతమును శ్రద్ధాయోగ్యము కాదు. ఎట్లన, సకలజ్ఞానము స్వప్రకాశమయ్యును త్రిపుటీవిషయకమయ్యును నై యున్నది. కేవల విషయగోచరజ్ఞాన మేదియు లేదు. జ్ఞానము 'ఘట మహం జానామి' యను

రీతిగా త్రిపుటీగోచరమై యున్నది. 'అయం ఘటః' అను నీరీతిగా కేవలవిషయగోచరజ్ఞాన మప్రసిద్ధమై యున్నది. ఘటముతో నింద్రియముయొక్క సంబంధము గలిగి ఘటజ్ఞానము గలుగుచున్నది. అది ఘటమును తనస్వరూపమును తనయాశ్రయమగు నాత్మను విషయీకరించుచున్నది. ఈలాగుననే ఘటముయొక్క జ్ఞానమె తనధర్మమగు ప్రమాత్వమును విషయీకరించుచున్నది. ఈరీతిగా ఘటజ్ఞానము తన ప్రకాశమునందు నన్యము నపేక్షించుట లేదు. ఇంతయంశము సమీచీనమై యున్నది. అయిన తన ప్రకాశమును తాను చేయుచున్నదను నీయంశము విరుద్ధమై యున్నది. ఒకక్రియ కెవను కర్తయో నాతు కర్మయగుట లేదు. అందువలన ప్రకాశకర్త యగు తాను ప్రకాశమునకు కర్మముకూడ తానే యను నీకథనము విరుద్ధమై యున్నది. సిద్ధాంతమునందు జ్ఞానము ప్రకాశరూపమై యున్నది. అందువలన, ఉక్తవిరోధము లేదు. ఈరీతిగా ప్రకాశరూపజ్ఞానమును అంగీకరింపనియెడల ఆమతము సకలాశుద్ధమై యున్నది. అందువలన జ్ఞానమున కనువ్యవసాయముచేత ప్రకాశ మగుచున్నది, అను నినైయాయికమత మసంగతమై యున్నది.

178. స్వతః ప్రామాణ్యవాదాంగీకారమును సిద్ధాంతమునం దుక్త సంశయానుపపత్తి రూపదోషమున కుద్ధారము.

జ్ఞానగ్రహకాలమందు ప్రమాత్వమునకు గ్రహముండినయెడల సంశయానుపపత్తి యున్నదను శంకకు సమాధానమే మనగా, జ్ఞానగ్రాహకసామగ్రిచే ప్రమాత్వమునకు గ్రహము అగుచున్నది. దోషాభావసహిత జ్ఞానసామగ్రిచే ప్రమాత్వమునకు గ్రహమగుచున్నది, అనునిది యుత్తరత్ర చెప్పబడును. ఎచ్చట సంశయ మున్నదో అచ్చట దోషాభావము లేదు. దోష ముండనియెడల సంశయము సంభవింపదు. ఎట్లన సంశయజ్ఞానమును భ్రమమై యున్నది. భ్రమోత్పత్తి యందు దోషము హేతువై యున్నది. అందువలన సంశయస్థలమునందు దోషాభావము సంభవింపదు. ప్రమాత్వజ్ఞానమునందు దోషాభావము హేతువై యున్నది. అందువలన ఎచ్చట సంశయ మున్నదో అచ్చట ప్రమాత్వజ్ఞానము లేదు. అందువలన సంశయము సంభవించుచున్నది. సిద్ధాంతమునందు వృత్తిరూపజ్ఞానమునకు సాక్షిచే ప్రకాశమగుచున్నది. అందువలన జ్ఞానగ్రాహకసామగ్రి సాక్షియై యున్నది. దానిచేతనే వృత్తిజ్ఞానముయొక్క ప్రమాత్వమునకు గ్రహమగుచున్నది. అయిన కొంతస్థానమునందు జ్ఞానము ప్రమయై యున్నది, అను నీ

విలక్షణ దోష ముున్నది. దేనిచేత ననిర్వచనీయ భ్రమమునకు నుత్పత్తి లేదో, అందువలన జ్ఞానము ప్రమయైనయెడల దానియొక్క ప్రమాత్వమునకు ప్రకాశమును సాక్షి చేయుచున్నది. దానియందు ప్రతిబంధక మున్నది. అందువలన జ్ఞానగ్రాహకసాక్షి యుండినను ప్రమాత్వమునకు గ్రహణ ముండుట లేదు. ఈకారణముచేత నుక్తలక్షణమున కతివ్యాప్తి యున్నది. జ్ఞానగ్రాహకసకలసామగ్రిచే ప్రమాత్వముయొక్క గ్రహము స్వతోగ్రహ మనంబడును. ఉక్తస్థలమందు జ్ఞానగ్రాహకసామగ్రిచే ప్రమాత్వగ్రహము గలుగుట లేదు. అందువలన అవ్యాప్తి యున్నది. తథాపి దోషాభావసహిత జ్ఞానగ్రాహకసామగ్రిచేత ప్రమాత్వమునకు గ్రహముండినయెడల అది స్వతఃప్రామాణ్యగ్రహ మనంబడును. ఉక్తస్థలమునందు దోషాభావసామగ్రి లేదు. ఇక నేమనగా దోషసహితసామగ్రి యున్నది. అందువలన ఉక్తస్థలమునందు లక్ష్యము లేనందున అవ్యాప్తి లేదు. ఈరీతిగా జ్ఞానముయొక్క ప్రమాత్వమునకు ప్రకాశకము దోషాభావసహితసాక్షియై యున్నది. అప్రమాత్వమునకు గ్రహము సాక్షిచేత గలుగుటలేదు. ఎట్లన భ్రమమునకు లక్షణము దోషజన్యత్వము లేక నిష్ఫలప్రవృత్తి జనకత్వము అథవా అధిష్ఠానముతో విషమసత్తాసహితముయొక్క యవభాసము అయియున్నది; ఈరీతిగా దోషఘటితము నిష్ఫలప్రవృత్తిఘటితము విషమసత్తాఘటితము భ్రమలక్షణమై యున్నది. ఆదోషాదికము సాక్షికి విషయము కాదు. అందువలన దోషాదిఘటితాప్రమాత్వమును సాక్షికి విషయము కాదు. అందువలన అప్రమాత్వముయొక్క జ్ఞానము నైయాయికమతమువలె నిష్ఫలప్రవృత్తిజనకమై యున్నది. ఈలాగుననే అప్రమాత్వముయొక్క యుత్పత్తియునుగూడ జ్ఞానసామాన్య సామగ్రిచేత గలిగినయెడల సకలజ్ఞానము అప్రమ కావలయును. అందువలన దోషసహిత జ్ఞానోత్పాదకసామగ్రిచేత నప్రమాత్వమునకు నుత్పత్తి యగుచున్నది. దీనికి నర్థమేమనగా దోషసహిత నేత్రానుమానాదికముచేత అప్రమాజ్ఞానమునకు నుత్పత్తియగుచున్నది. అప్రమాత్వవిశిష్టభ్రమజ్ఞానముయొక్క యుత్పత్తియె యీప్రకరణమునందు అప్రమాత్వోత్పత్తి యనంబడును. మఱియు ప్రమాత్వోత్పత్తి జ్ఞానసామాన్యసామగ్రిచేతనే గలుగుచున్నది.

179. న్యాయమతమునందు (పరతః ప్రామాణ్యవాద) దోషము.

ప్రమాత్వోత్పత్తియందు గుణము కారణముగా నేది చెప్పబడి యున్నదో అది సంభవింపదు. ఎట్లన, ప్రత్యక్షస్థలమునందు నధికావయవముతో

నింద్రియసంయోగము గుణముగా జెప్పబడినది. అది నిరవయవ రూపాది ప్రత్యక్షమునందు సంభవింపదు. అనుమితియందు వ్యాప్యమగు హేతువునకు పక్షమునందు జ్ఞానము గుణముగా చెప్పబడియున్నది. అదియును సంభవింపదు. ఎచ్చట వహ్నిసహితపర్వతమునందు ధూమపటలమునందు భ్రమము గలిగి వహ్నిజ్ఞానము గలుగుచున్నదో అచ్చట ఉక్తగుణములేదు. మఱియు వహ్నివిషయకానుమితిప్రమయున్నది. అందువలన ప్రమాత్వోత్పత్తియందు గుణమునకు జనకత్వము చెప్పుట సంభవింపదు. ఇక నేమనగా జ్ఞానసామాన్య సామగ్రిచే ప్రమాత్వమునకు నుత్పత్తి యగుచున్నది.

మఱియు జ్ఞానసామాన్యసామగ్రిచేత ప్రమాత్వమునకు నుత్పత్తి యంగీకరించినయెడల భ్రమస్థలమునందును జ్ఞానసామాన్యసామగ్రి యుండుటవలన ప్రమాజ్ఞానము కావలయు నని శంకించినయెడల దానికి సమాధాన మేమనగా, దోష ముండినచోట ప్రమాజ్ఞానము గలుగుటలేదు. అందువలన ప్రమాత్వోత్పత్తియందు దోషము ప్రతిబంధకమై యున్నది. సకలకార్యోత్పత్తియందు ప్రతిబంధకాభావము హేతువై యున్నది. అందువలన దోషాభావసహిత జ్ఞానసామగ్రిచేత ప్రమాత్వమున కుత్పత్తి యగుచున్నది. ఇచ్చట ప్రమాత్వోత్పత్తి చెప్పుటవలన ప్రమాత్వవిశిష్ట జ్ఞానోత్పత్తియందు తాత్పర్య మున్నది. అందువలన ప్రమాత్వధర్మమునకు నుత్పత్తికథన మసంగతముకాదు. ఈరీతిగా దోషాభావసహిత జ్ఞానోత్పాదకనేత్రాదిరూప మగు నేసామగ్రి యున్నదో దానిచేత ప్రమాజ్ఞానమునకు నుత్పత్తి యుండుటవలన ప్రమాత్వమునకు నుత్పత్తి స్వతః అగుచున్నది.

యద్యపి జ్ఞానసామాన్యసామగ్రి యింద్రియానుమానాదికమై యున్నది. సామాన్యజ్ఞానమునకు కారణము దోషాభావము కాదు. ప్రమాత్వోత్పత్తియందు దోషాభావమును కారణముగా చెప్పబడియున్నది. అందువలన సామాన్యసామగ్రికంటె నధికకారణజన్యమైనందున పరతః ప్రామాణ్యాంగీకారమున్నది. తథాపి జ్ఞానసామాన్యసామగ్రికంటె అధికభావమునకు నపేక్షయుండినయెడల పరతఃప్రామాణ్య ముండును. అభావరూపదోషాభావాపేక్షచేత పరతః ప్రామాణ్యము లేదు. ఈలాగుననే జ్ఞానగ్రాహకసామగ్రి సాక్షియై యున్నది. దోషాభావసహిత సాక్షిచేత జ్ఞానముయొక్క ప్రమాత్వమునకు జ్ఞాన

మగుచున్నది. మఱియు దోషసహితేంద్రియానుమానాదిరూప జ్ఞానోత్పాదక సామగ్రిచేత నప్రమాత్వమునకు నుత్పత్తియగును. జ్ఞానసామాన్య సామగ్రి ఇంద్రియానుమానాదికమై యున్నది. దానికంటె దోషము పరమై యున్నది. అందువలన అప్రమాత్వమునకు నుత్పత్తి పరముచేత గలుగుచున్నది. భ్రమము గలిగి ప్రవృత్తి గలిగి ఫలలాభము కానియెడల అప్రమాత్వానుమితిజ్ఞానము అనుమానముచేత గలుగుచున్నది. జ్ఞానగ్రాహకసామగ్రి యగు సాక్షికంటె వను మానము భిన్నమై యున్నది. అందువలన అప్రామాణ్యగ్రహమును పరముచేత గలుగుచున్నది. అనుమానముయొక్క యాకారమేమనగా "ఇదం జలజ్ఞానం అప్రమా నిష్ఫలప్రవృత్తిజనకత్వాత్. యత్ర యత్ర నిష్ఫలప్రవృత్తిజనకత్వం తత్ర తత్రాప్రమాత్వం, యథా భ్రమాంతరె." ఈరీతిగా జ్ఞానోత్పత్తికాలమందె సాక్షిచేత జ్ఞానముయొక్క స్వరూపమునకు ప్రకాశ మగుచున్నది. జ్ఞానవృత్తి ప్రమాత్వమునకును ప్రకాశ మగును.

### 180. అఖ్యాతివాదియొక్క వచనపరిహారము.

నిశ్చయజ్ఞానమునకు సంశయజ్ఞానముతో విరోధ మున్నది. అందువలన ప్రమాత్వ నిశ్చయానంతరము ప్రమాత్వసంశయము గలుగుట లేదు. అందువలన భ్రమత్వసందేహముచేత నిష్కంపప్రవృత్తికి అభావము గలుగును, అనునీయఖ్యాతివాదియొక్క వచనము అసంగతమై యున్నది. యద్యపి ప్రమాత్వనిశ్చయము ప్రమాత్వ సంశయమునకు విరోధియై యున్నది. భ్రమత్వ సంశయమునకు ప్రమాత్వనిశ్చయము విరోధికాదు. ఎట్లన సమానవిషయమునందు సంశయమును నిశ్చయమును విరోధియై యున్నది. ప్రమాత్వ నిశ్చయమునకును భ్రమత్వ సంశయమునకును విషయమగు ప్రమాత్వ భ్రమత్వములు భిన్నములై యున్నవి. అందువలన అఖ్యాతివాదికథితవచనము సంగతము. తథాపి యేజ్ఞానమందు ప్రమాత్వ నిశ్చయ మున్నదో ఆజ్ఞానమునందు భ్రమత్వ నిశ్చయమును భ్రమత్వ సంశయమును గలుగుట లేదు. ఇది యనుభవసిద్ధమై యున్నది. అందువలన భ్రమత్వ సందేహమునకును విరోధ మున్నది. మఱియు విచారించినయెడల ప్రమాత్వసంశయభ్రమత్వసంశయములకు భేదము లేదు, ఒకటేపదార్థమై యున్నది. ఎట్లన 'ఏతదజ్ఞానం ప్రమా న వా' అనునిది ప్రమాత్వసంశయమునకు నాకారమై యున్నది. దీనియందు విధికోటి ప్రమాత్వమై యున్నది, నిషేధకోటి భ్రమత్వమై యున్నది.

ఎట్లన జ్ఞానమునందు ప్రమాత్వమునకు నిషేధము చేసినయెడల భ్రమత్వమె శేష మగుచున్నది. ఈలాగుననే 'ఏతదజ్ఞానం భ్రమో న వా' అనునిది భ్రమత్వసంశయ మునకు ఆకారమై యున్నది. దీనియందు విధికోటి భ్రమత్వమై యున్నది, నిషేధ కోటి ప్రమాత్వమై యున్నది. జ్ఞానమునందు భ్రమత్వమునకు నిషేధము చేసిన యెడల ప్రమాత్వమె శేషమగుచున్నది. ఈరీతిగా రెండుసంశయములందు భ్ర మత్వప్రమాత్వరూప కోటిద్వయము సమానమై యున్నది. అందువలన ప్రమాత్వ సంశయమునకును భ్రమత్వసంశయమునకును భేదము లేదు. తథాపి దేనియందు విధికోటి ప్రమాత్వమై యున్నదో అది ప్రమాత్వసంశయ మనంబడును. దేనియందు విధికోటి భ్రమత్వమై యున్నదో అది భ్రమత్వసంశయ మనంబడును. ఈ రీతిగా ప్రమాత్వసంశయమునకును భ్రమత్వసంశయమునకును విషయము సమానమై యుండుటవలన ప్రమాత్వనిశ్చయము గలుగుచున్నది. ఎట్లు ప్రమాత్వ సంశ యము గలుగుటలేదో అట్లు భ్రమత్వసంశయమును గలుగుటలేదు. అందువలన సిద్ధాంతమునందు భ్రమజ్ఞానమును అంగీకరించినను నిష్కంపప్రవృత్తి సంభ వించుచున్నది. అనిర్వచనీయనిశ్చయము భ్రమనిశ్చయ మనంబడును.

### 181. భ్రమజ్ఞానమునకు ద్వైవిధ్యము మఱియు వృత్తిభేదమునకు నుద్ధారము.—

ఈరీతిగా సంశయనిశ్చయభేదముచేత భ్రమజ్ఞానము ద్విప్రకారకమై యు న్నది. తర్కజ్ఞానము భ్రమనిశ్చయమునం దంతర్భూతమై యున్నది. ఎట్లన వ్యా ప్యారోపముచేత వ్యాపకారోపము తర్కమనంబడును. ఉ. 'యది వహ్న్యభావః స్యాత్ తర్హి ధూమోఽపి న స్యాత్' అను నీ జ్ఞానము ధూమవహ్నిసహితదేశమునందు గలుగుచున్నది. అది తర్కమై యున్నది. అచ్చట వహ్న్యభావము వ్యాప్యమై యున్నది. ధూమాభావము వ్యాపకమై యున్నది. వహ్న్యభావముయొక్క యా రోపముచేత ధూమాభావమునకు ఆరోపము గలుగుచున్నది. వహ్నిధూమము లుండుటవలన వహ్న్యభావమునకును ధూమాభావమునకును జ్ఞాన ముండుట వలనె అది భ్రమమై యున్నది. బాధయుండుటవలన భ్రమమై యున్నది. అది యా రోప మనంబడును. ఇచ్చట ధూమవహ్నులయొక్క సద్భావ మున్నది. అందువలన వానియొక్క యభావమునకు బాధ యగుచున్నది. ఆ రెండుండినను పురుషునికి నిచ్ఛావశముచేత వహ్న్యభావముయొక్కయు ధూమాభావముయొక్కయు భ్రమజ్ఞానము గలుగుచున్నది. అందువలన ఆరోపమై యున్నది. ఈరీతిగా

ఆరోపస్వరూపమగు తర్కమును భ్రమమునం దంతర్భూతమై యున్నది. పృథ క్కుకాదు. వృత్తియొక్క ప్రసిద్ధభేదము చెప్పబడినది, అవాంతరభేద మనంతమై యున్నది.

ఇతి శ్రీమ న్నిశ్చలదాససాధువిరచితే వృత్తిప్రభాకరే
వృత్తిభేదనిరూపణప్రసంగప్రాప్త సత్ఖ్యాత్యాది
నిరాకరణాగ తాఖ్యాతి నిరాకరణ
ప్రయోజక స్వతఃప్రామాణ్య
నిరూపణం నామ
సప్తమః ప్రకాశః॥



# వృత్తిప్రభాకరము.

## అష్టమప్రకాశము.

---

జీవేశ్వరస్వరూపము వృత్తిప్రయోజనసహిత కల్పితనివృత్తియు, స్వరూప నిరూపణమును అను నష్టమ ప్రకాశప్రారంభము.

182—187. అజ్ఞానవిషయమునందు విచారము.

182. వృత్తిప్రయోజన వచనప్రతిజ్ఞ.

సప్తమప్రకాశమునందు వృత్తిస్వరూపము చెప్పబడినది. ఇప్పుడు అష్టమ ప్రకాశమునందు వృత్తి ప్రయోజనమును చెప్పెదము. అజ్ఞానముయొక్క నివృత్తి వృత్తికి ముఖ్యప్రయోజనమై యున్నది. ఘటాద్యనాత్మాకార వృత్తి చేత ఘటాద్యవచ్ఛిన్న చేతనస్థాజ్ఞానమునకు నివృత్తి కలుగుచున్నది. అఖండ బ్రహ్మాకారవృత్తిచేత నిరవచ్ఛిన్న చేతనస్థాజ్ఞానమునకు నివృత్తి కలుగుచున్నది.

183. అజ్ఞానమునకు నాశ్రయమును విషయమును.

వాచస్పతిమతమునందు వృత్తిచేత నాశ్యమగు నజ్ఞానమునకు నాశ్రయము జీవుడై యున్నాడు. విషయము బ్రహ్మమై యున్నది. వివరణకారాది మతమునందు నజ్ఞానమునకు నాశ్రయమును విషయమును శుద్ధచేతనమై యున్నది. ఎట్లు జ్ఞానకృతమగు ఘటాది ప్రకాశము జ్ఞానవిషయత యనంబడునో అట్లు అజ్ఞానకృతమగు స్వరూపముయొక్క ఆచ్ఛాదనమె యజ్ఞానముయొక్క విషయత యై యున్నది. జీవభావేశ్వరభావములు అజ్ఞానాధీనములై యున్నవి. అందు వలన నజ్ఞానకృత జీవభావము అజ్ఞానమునకు నాశ్రయముగా సంభవింపదు. ఈ యర్థజ్ఞానమునందు ప్రథమోపయోగియగు జీవేశ్వరుల స్వరూపనిరూపణమును జేయుచున్నాను.

184. అజ్ఞాన నిరూపణము.

జీవేశ్వరనిరూపణమునం దుపయోగియగు నజ్ఞాన నిరూపణమును జేయు చున్నాను. అజ్ఞానము, అవిద్య, ప్రకృతి, మాయ, శక్తియను నీ నామములు ఒ

కటే పదార్థమున కున్నవి. మాయావిద్యలకు భేదవాదము ఏకదేశీయుల దై యున్నది. నైయాయికాదికులు జ్ఞానాభావము నె అజ్ఞాన మని చెప్పుచున్నారు. సిద్ధాంతమతమునందు, ఆవరణ విక్షేపశక్తిసహితానాదిభావ పదార్థము అజ్ఞాన పదార్థమై యున్నది. విద్యచే నశించునదియైనందున నవిద్య యనంబడును, ప్రపంచమునకు నుపాదానమై నందున ప్రకృతి యనంబడును, దుర్ఘటమును సంపాదించుట వలన మాయ యనంబడును, స్వతంత్రత లేనందున శక్తి యనంబడును.

185. అజ్ఞానమునకు ననాదిభావరూపతయందు శంక.

అజ్ఞానమునకు ననాదిభావరూపత్వము చెప్పుట సంభవింపదు. ఎట్లన, అద్వైతగ్రంథమునందు వ్రాయబడిన దేమనగా, చేతనముకంటె భిన్నము లేక, అభిన్నము అజ్ఞానమై యున్నదను నీ రెండు పక్షములును సంభవింపవు. ఎట్లన, "నేహ నానాస్తి కించన" ఇత్యాది శ్రుతివచనములచేత చేతనముకంటె భిన్నము నిషేధింపబడినది. జడచేతనములకు నభేదము సంభవింపదు. భిన్నత్వాభిన్నత్వములకు పరస్పరవిరోధము ఉండుటవలన అజ్ఞానము చేతనముకంటె భిన్నాభిన్నమై యున్నది, అను నీవచనముకూడ అసంగతమై యున్నది. ఈలాగుననే అద్వైత ప్రతిపాదకశ్రుతివిరోధమువలన నజ్ఞానమునకు సత్స్వరూపత సంభవించుట లేదు. ప్రపంచకారణత సంభవింపనందున తుచ్ఛతాస్వరూపము, అసత్స్వరూపత్వమును సంభవింపదు. పరస్పర విరోధధర్మములు ఏకమునందు సంభవింపవు. అందువలన సదసదుభయరూపమును చెప్పుట సంభవింపదు. ఈలాగుననే యజ్ఞానమును సావయవమునుగా నంగీకరించినయెడల న్యాయమతమునందు ద్రవ్యారంభకోపాదానము అవయవ మనంబడును. సాంఖ్యాదిమతమునందు ద్రవ్యరూపమగు పరిణామ సహితోపాదానము అవయవ మనంబడును. ఉపాదానమె అవయవ మని చెప్పినయెడల శబ్దమునకు నుపాదానమగు ఆకాశముకూడ శబ్దమునకు నవయవ మగును. ఈలాగుననే గుణక్రియలకు, నుపాదానకారణమగు ఘటాదికముకూడ రూపాదిగుణములకును, చలనరూపక్రియకును, అవయవమగును. అందువలన ద్రవ్యమునకు నుపాదానకారణము అవయవమని చెప్పబడినది. అన్యమునకు నుపాదానము అవయవ మని చెప్పబడదు. అవయవజన్యము సావయవ మనంబడును. ఆవిద్య ద్రవ్యమైనయెడల సావయవత సంభవించును. అవిద్యయందు ద్రవ్యద్రవ్యత్వములు సంభవింపవు. ఎట్లన, నిత్యానిత్యభేదముచే ద్రవ్యము ద్విప్రకారమై యున్నది. అవిద్యను నిత్యద్రవ్యముగా నంగీకరించినయెడల సావయవత్వ

కథన మసంగతమై యున్నది. ఈలాగుననే జ్ఞానముచే సవిన్యాస నాశము లేక పోవల
యును. అనిత్యద్రవ్యరూపముగా నంగీకరించిన యెడల ఆయవయవి యాశ్రకంటె
భిన్నమైనందున అనిత్యమైనది అగును. అవయవముయొక్క యవయవముకూడ
అనిత్యమైనందున అనవస్థయగును. అంత్యావయవము పరమాణువనలె నిత్యమని
యంగీకరించినయెడల అద్వైతప్రతిపాదకశ్రుతివచనమునకు విరోధమగును. న్యా
యమతమునందు,నిత్యపరమాణువునకును, సాంఖ్యమతమునందు నిత్యప్రధానమున
కును, అంగీకారము శ్రుతివిరుద్ధమై యున్నది. ఈరీతిగా ద్రవ్యత్వము లేనందున అజ్ఞా
నమునందు సావయవత్వము సంభవించుట లేదు. ఈలాగుననే ఉపాదానత్వము
సంభవింపనందున అజ్ఞానము నిరవయవమై యున్నది, అను వచనముకూడ సంభ
వింపదు. సావయవమె యుపాదానకారణమై యున్నది. న్యాయమతమునందు
శబ్దమునకు ఉపాదానకారణమగు ఆకాశమును నిరవయవమునుగా నంగీకరించిన
యెడల ''తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" యను శ్రుతివచనము
నకు విరుద్ధమై యున్నది. ఈలాగుననే ద్వ్యణుకమునకు నుపాదానకారణమగు
పరమాణువును నిరవయమునుగా నంగీకరించినను నిరవయవ పరమాణుద్వయ
సంయోగము అసంభవాదిదోషముచేత సూత్రకారులచే శారీరకశాస్త్రము
యొక్క ద్వితీయాధ్యాయ ద్వితీయపాదమునందు నిషేధింపబడినది. అందువలన
ప్రపంచమునకు నుపాదానమగు నజ్ఞానమునకు నిరవయవత్వము సంభవిం
పదు. మఱియు నజ్ఞానమునకు ప్రపంచోపాదానత్వము, ''మాయాం తు ప్రకృతిం
వింద్యా న్మాయినం తు మహేశ్వరం'' అను శ్రుతియందు ప్రసిద్ధమై యున్నది.
మాయాజ్ఞానములకు భేదము లేదు. ఈరీతిగా నజ్ఞానమునందు సావయవత, లేక,
నిరవయవత, సంభవింపదు. ఈలాగుననే పరస్పరవిరుద్ధోభయ రూపత్వమును
సంభవింపదు. ఈరీతిగా నేధర్మముచేతను అజ్ఞానముయొక్క నిరూపణము అశక్య
మైనందున అది యనిర్వచనీయ మనంబడును. ఈప్రకారముగా లేఖనము బహు
గ్రంథములయందున్నది. అందువలన ననిర్వచనీయాజ్ఞానమునకు ననాదిభావరూప
త్వము చెప్పుట సంభవింపదు. భావరూపత చెప్పుటవలన సద్రూపత సిద్ధమగు
చున్నది. మఱియును సద్రూపత నిషేధింపబడియున్నది.

### 186. ఉక్తశంకాసమాధానము.

ఎట్లు అజ్ఞానము సద్విలక్షణమై యున్నదో అట్లు అసద్విలక్షణమయ్యును
ఉన్నది. అందువలన నబాధ్యరూపసత్త్వము అజ్ఞానమునందు లేదు. అయిన తు

ఛ్ఛరూపాసత్తుకంటె విలక్షణతారూపసత్త్వ అజ్ఞానమునందు నంగీకరింపబడి యున్నది. అందువలన సదసత్తులకంటె విలక్షణమై అనిర్వచనీయమై యజ్ఞానము ఉన్నది. సర్వథావచనమునకు నగోచరము అనిర్వచనీయ మని చెప్పబడలేదు. ఇకనేమనగా పారమార్థిక సత్యరూపమగు బ్రహ్మముకంటె విలక్షణమయ్యును సర్వథా సత్తాస్ఫూర్తిశూన్యశశశృంగాదిరూపాసద్విలక్షణ మయ్యును ఉండెడిది అనిర్వచనీయ శబ్దముయొక్క పారిభాషికార్థమై యున్నది. అందువలన ననాది భావరూపత్వకథనము సంభవించుచున్నది. నైయాయికాది మతమునందు ఎట్లు నిషేధముఖ ప్రతీతికి విషయము జ్ఞానాభావరూపాజ్ఞానమై యున్నదో అట్లు అద్వైతగ్రంథమునందు అజ్ఞానశబ్దమునకు అర్థము కాదు. ఇకనేమనగా, జ్ఞానబాధ్యమగు రజ్జుసర్పాదికము ఎట్లు విధిముఖప్రతీతికి విషయమై యున్నదో అట్లు జ్ఞానముచేత నివర్తనీయమగు నజ్ఞానము విధిముఖప్రతీతికి గోచరమై యున్నది. అజ్ఞానశబ్దమునం దుండెడి యాకారమునకు విరోధి అర్థమై యున్నది,అని పూర్వమునందు చెప్పబడియున్నది. అందువలన నజ్ఞానమునందు భావరూపత్వకథనము సంభవించుచున్నది. మఱియును ప్రాచీనాచార్యులగు వివరణకారాదులచే నత్యంతోద్ఘోషముచేత ప్రకాశవిరోధి యగు నంధకారమునకు భావరూపత్వమును ప్రతిపాదించి జ్ఞానవిరోధియగు నజ్ఞానమునకు భావరూపత్వమె ప్రతిపాదింపబడియున్నది. అందువలన నజ్ఞానమునకు భావరూపత్వమును విని ఉత్కర్షమైన యెడల వాఁడు అల్పశ్రుతుఁడై యున్నాఁడు. ఈరీతిగా భావరూపము అజ్ఞానమై యున్నది. ఉత్పత్తిరహితమైనందున అనాదియై యున్నది. ఘటాదికమువలె అవయవ సమవేతరూప సావయవము కాదు. తథాపి అంధకారమువలె సాంశమై యున్నది.

### 187—203. జీవేశ్వరవిచారము.

#### 187. మాయావిద్యాపూర్వక జీవేశ్వరులయొక్క స్వరూపమునందు నాలుగు పక్షములు.

శుద్ధచేతనమునం దాశ్రితమూలప్రకృతియం దుండు చేతనముయొక్క ప్రతిబింబము ఈశ్వరుఁడు. ఆవరణశక్తివిశిష్ట మూలప్రకృతియొక్క యంశ మవిద్య యనంబడును. అవిద్యారూపానంతాంశమునందు చేతనముయొక్క యనంత ప్రతిబింబము జీవుఁ డనంబడును. మఱియును తత్త్వవివేకగ్రంథమునందు నీక్రింద నుదాహరించిన ప్రకారము జీవేశ్వరులయొక్క నిరూపణ మున్నది. జగన్మూల భూత

ప్రకృతికి రెండు కల్పితరూపము లున్నవి. అందువలన మూలప్రకృతి ప్రసంగము నందు "మాయా చావిద్యాచ స్వయ మేవ భవతి" యను శ్రుతి యున్నది. 'స్వయ మేవ' యనగా జగత్తుయొక్క మూలప్రకృతి తానే మాయారూపమై యవిద్యారూపమై యున్నది. శుద్ధసత్త్వప్రధానము మాయయై యున్నది. మలిన సత్త్వసహిత మవిద్యయై యున్నది. రజోగుణ తమోగుణములచేత అభిభూతసత్త్వము మలిన సత్త్వమనంబడును. రజోగుణ తమోగుణములు అభిభూతము లగు నెడల నది శుద్ధ సత్త్వమనంబడును. తిరస్కృత మభిభూత మనంబడును. ఉక్తరూపమాయ యందు ప్రతిబింబితుడు ఈశ్వరుడై యున్నాడు. అవిద్యాప్రతిబింబితుడు జీవుడై యున్నాడు. ఈశ్వరున కుపాధి యగు మాయయొక్క సత్త్వము శుద్ధమైనందున నీశ్వరుడు సర్వజ్ఞుడై యున్నాడు. జీవున కుపాధి యగు నవిద్యయొక్క సత్త్వము మలిన మైనందున జీవుడు అల్పజ్ఞుడై యున్నాడు. కొందఱు గ్రంథకారు లిట్లు చెప్పెదరు. ఉక్తశ్రుతియందు రెండురూపములతో గూడిన ప్రకృతి చెప్పబడినది. దానియందు హేతు వేమనగా విక్షేపశక్తియొక్క ప్రాధాన్యముచేత మాయ యనంబడును. ఆవరణశక్తియొక్క ప్రాధాన్యముచేత నవిద్య యనంబడును. ఈశ్వరున కుపాధి యగు మాయయం దావరణశక్తి లేదు. అందువలన మాయ యందు ప్రతిబింబితు డగు నీశ్వరున కజ్ఞత లేదు. ఆవరణశక్తి విశిష్టావిద్యయందు ప్రతిబింబితుడగు జీవునియం దజ్ఞత యున్నది. సంక్షేపశారీరకమునందు చెప్పబడిన దేమనగా జీవునకు ఉపాధి కార్యమై యున్నది. ఈశ్వరునకు నుపాధి కారణమై యున్నది. ఈప్రకారముగా శ్రుతియందు జెప్పబడినది. అందువలన మాయ యందు ప్రతిబింబితు డీశ్వరుడై యున్నాడు, అంతఃకరణమునందు ప్రతిబింబితుడు జీవుడై యున్నాడు. ఈప్రసంగమునందు ప్రతిబింబితుడు జీవుడై లేక ఈశ్వరుడై చెప్పబడును. అచ్చట కేవల ప్రతిబింబమునకు జీవత్వమును లేక ఈశ్వరత్వమును ఇష్టము కాదు. ఇక నేమనగా ప్రతిబింబత్వవిశిష్టచేతనమున కీశ్వరత్వమును జీవత్వమును తెలియవలసినది. ఎట్లన కేవలప్రతిబింబమునకు జీవత్వమును, ఈశ్వరత్వమును ఉండిన యెడల జీవవాచకేశ్వరవాచకపదములయందు భాగత్యాగలక్షణ కసంభవ మగును. మఱియును పరమార్థతః పూర్వోక్తపక్ష చతుష్టయమునందు బింబప్రతిబింబముల నభేదవాద మున్నది. ఈవాదమునందు ప్రతిబింబము మిథ్య కాదు. ఇక నేమనగా గ్రీవాస్థముఖమునందె ప్రతిబింబత్వ ప్రతీతి యగుచున్నది. అది భ్రమరూపప్రతీతి యగుచున్నది. అందువలన ప్రతి

బింబత్వధర్మము మిథ్య యగుచున్నది. స్వరూపముతో ప్రతిబింబము మిథ్య కాదు, యను నీయర్థము ఉత్తరత్ర స్పష్టమగును.

188. పూర్వోక్తపక్షచతుష్టయమునందును ముక్తజీవులకు శుద్ధ బ్రహ్మముతో నభేదము.

ఉక్తపక్షచతుష్టయమునందును జీవేశ్వరు లుభయులకును ప్రతిబింబత్వ మంగీకరింపబడెను. అందువలన ముక్తజీవులకు ప్రాప్యము శుద్ధబ్రహ్మమై యున్నది. ఈశ్వరుడు కాదు. ఎట్లన, ఏకోపాధికి వినాశము కలిగినచో ఆయుపాధి యొక్క ప్రతిబింబమునకు అపరప్రతిబింబముతో నభేదము కలుగుట లేదు. ఇక నేమనగా, తనయొక్క బింబముతో నభేదము కలుగుచున్నది. ఈశ్వరుడు కూడ ప్రతిబింబమై యున్నాడు. అందువలన జీవరూప ప్రతిబింబముయొక్క యుపాధికి నాశము కలిగినయెడల ప్రతిబింబరూపేశ్వరునితో నభేదము సంభవింపదు. ఇక నేమనగా బింబరూపశుద్ధబ్రహ్మముతోనే అభేదము కలుగుచున్నది.

189. ఉక్తపక్షచతుష్టయమునందును ఆరు అనాదిపదార్థములను జెప్పి త్రివిధచేతనములకు నంగీకారము.

ఈరీతిగా నుక్తపక్షమునందు (1) జీవ (2) ఈశ (3) శుద్ధబ్రహ్మభేదముచే త్రివిధచేతనములకు నంగీకార మున్నది. అందువలన వార్తికమునందు ఆరు పదార్థములు అనాదిగా జెప్పబడినవి.

(1) శుద్ధము. (2) ఈశ్వరచేతనము. (3) జీవచేతనము. (4) అవిద్య. (5) అవిద్యాచేతనములకు పరస్పర సంబంధము. (6) ఈ యైదింటికి పరస్పర భేదము.

ఈయారు పదార్థములు ఉత్పత్తిశూన్యములైనందున అనాదులై యున్నవి. వీనిలో చేతనములకు మూడే భేదములు చెప్పబడి యున్నవి.

190. చిత్రదీపమునందు విద్యారణ్యస్వాములచేత చేతనములకు నాలుగు భేదములు చెప్పబడినవి.

చిత్రదీపమునందు విద్యారణ్యస్వాములచే చేతనములకు నాలుగు భేదములు చెప్పబడినవి. తథాపి ఎట్లు (1) ఘటాకాశము. (2) మహాకాశము. (3) జలాకాశము. (4) మేఘాకాశము, అను నీభేదముచేత నాకాశమునకు నాలుగుభేదము లున్నవో; ఘటావచ్ఛిన్నాకాశము ఘటాకాశ మనంబడును, నిరవచ్ఛిన్నాకాశము మహాకాశ మనంబడును, ఘటజలమునందుండెడి యా

కాశముయొక్క ప్రతిబింబము జలాకాశ మనంబడును, మేఘమందుండెడి సూక్ష్మమగు కణములయం దుండెడి యాకాశప్రతిబింబము మేఘాకాశ మనం బడును, ఈలాగుననే చేతనముకూడ,

(1) కూటస్థము. (2) బ్రహ్మ. (3) జీవుఁడు. (4) ఈశ్వరుఁడు.

అను నీభేదముచేత చతుర్విధమై యున్నది. స్థూలసూక్ష్మశరీరములకు నధిష్ఠాన మగు చేతనము కూటస్థుఁడనంబడును. నిరవచ్ఛిన్న చేతనము బ్రహ్మ మనంబడును. శరీరరూపఘటమునం దుండెడి బుద్ధిస్వరూపజలమునందు నీచేతనములయొక్క ప్రతిబింబ మున్నదో యది జీవుఁడనంబడును. మాయారూపాంధకారస్థమైన మేఘజలకణ సమాన బుద్ధివాసన యున్నదో దానియం దుండెడి ప్రతిబింబము ఈశ్వరుఁడనం బడును. సుషుప్త్యవస్థయందు బుద్ధియొక్క యేసూక్ష్మావస్థ యున్నదో అది వాసన యనంబడును. కేవలబుద్ధివాసనయం దుండెడి ప్రతిబింబము ఈశ్వరుఁడనం బడును. బుద్ధివాసనకు అనేకత్వ ముండుటవలన ఈశ్వరునకు కూడ అనేకత్వము రావలయును. అందువలన బుద్ధివాసనావిశిష్టాజ్ఞానమునం దుండెడి ప్రతిబింబము ఈశ్వరుఁ డనంబడును. ఈరీతిగా విజ్ఞానమయకోశము జీవుఁడై యున్నాఁడు. జాగ్రత్స్వప్నావస్థలయందు స్థూలమగు నంతఃకరణము విజ్ఞాన మనంబడును. దానియం దుండు ప్రతిబింబము విజ్ఞానమయ మనంబడును. 'అహం కర్తా, భోక్తా, స్థూలః, దుర్బలః, కాణః, బధిర శ్చాస్మి' యను నీరీతిగా విజ్ఞానసహితుఁడు జీవుఁడై యున్నాఁడు. మఱియును, సుషుప్త్యవస్థయందు బుద్ధివాసనాసహితాజ్ఞానరూపానందమయకోశము ఈశ్వరుఁడై యున్నాఁడు. ఆనందమయకోశమున కీశ్వరత్వము మాండూక్యోపనిషత్తునందు ప్రసిద్ధమై యున్నది. ఈరీతిగా చేతనమునకు చతుర్విధభేదము చిత్రదీపమునందు జెప్పబడినది.

**191.** బింబప్రతిబింబవాదమునకంటె నాభాసవాదమునకు భేదము.

మఱియును, విద్యారణ్యస్వామిమతమునందు ప్రతిబింబము మిథ్య యై యున్నది. పూర్వోక్తపక్షమునందు బింబప్రతిబింబములకు నభేద ముండుటవలన ప్రతిబింబము సత్యమై యున్నది. ఒకటే పదార్థమునందు ఉపాధియొక్క సన్నిధాన ముండుటవలన బింబత్వప్రతిబింబత్వ భ్రమ కలుగుచున్నది. మఱియును బింబ స్వరూపమే ప్రతిబింబమై యున్నది. విద్యారణ్యస్వామిమతమునందు దర్పణాదికమునందు బింబముయొక్క సన్నిధానముచేత అనిర్వచనీయ ప్రతిబింబమునకు

ఉత్పత్తి కలుగుచున్నది. అందువలన జీవేశ్వరులయొక్క స్వరూపము మిథ్యయై యున్నది.

**192.** ఆభాసవాదరీతిగా జీవబ్రహ్మాభేదవాక్యమునందు బాధసామానాధికరణ్యము.

జీవునికి బ్రహ్మముతో నభేదప్రతిపాదకవాక్యమునందు బాధసామానాధికరణ్యమున్నది. అభేదసామానాధికరణ్యము లేదు. ఎట్లు పురుషునియందు స్థాణుభ్రమ కలిగి పురుషునియొక్క జ్ఞానము కలుగుచున్నదో, "అయం స్థాణుః పురుషః" (ఈస్థాణువు పురుషుడై యున్నాడు.) ఈరీతిగా పురుషునితో స్థాణువునకు అభేదము చెప్పబడినదో, అచ్చట పురుషుడు స్థాణ్వాభావసహితుడై యున్నాడు, అను నీరీతిగా బోధ మగుచున్నది. అధికరణముతో నభావము భిన్నము అను నీమతమునందు స్థాణ్వాభావసహితుడు పురుషుడు అను నీబోధ కలుగుచున్నది. కల్పితముయొక్క యభావము అధిష్ఠానరూపమై యున్నది, అను నీమతమునందు స్థాణువుయొక్క యభావము పురుషుడు అను నీబోధ కలుగుచున్నది, అను నీరీతిగా నయంశబ్దముయొక్క యర్థము జీవబ్రహ్మములయొక్క యైక్యమునకు జీవునియొక్క యభావసహితము బ్రహ్మ మను నీయర్థము లేక జీవునియొక్క యభావము బ్రహ్మమను నీయర్థ మున్నది. అభావము బాధ యనంబడును. ఉక్తరీతిగా కల్పితపదార్థమునకు సత్యాధిష్ఠానముతో నభేదము చెప్పబడినది. అచ్చట బాధాసామానాధికరణ్యమే వివక్షితమై యున్నది.

**193.** కూటస్థునకును, బ్రహ్మమునకును, అభేదస్థలమునందు అభేదముఖ్యసామానాధికరణ్యము.

కూటస్థునకు బ్రహ్మమునకు నభేదము చెప్పినపుడు అభేదసామానాధికరణ్యమున్నది. ఎచ్చట జలాకాశమునకు మహాకాశముతో అభేదము చెప్పబడినదో అచ్చట జలాకాశమునకు మహాకాశముతో బాధసామానాధికరణ్య మున్నది. మఱియును, ఘటాకాశమునకు మహాకాశముతో అభేదము చెప్పినపుడు అభేదసామానాధికరణ్య మున్నది. ఇదియే ముఖ్యసామానాధికరణ్య మనంబడును. ఈరీతిగా విద్యారణ్యస్వామిచే జీవునికి బ్రహ్మమునకు బాధసామానాధికరణ్యమే వ్రాయబడినది.

**194.** ఉక్తబాధసామానాధికరణ్యమునందు వివరణకారవచనముతో విరోధము.

మఱియును వివరణగ్రంథమునందు 'అహం బ్రహ్మాస్మి' యను సిద్ధాంతవాక్యము నందు అహంశబ్దముయొక్క యర్థము జీవునికి బ్రహ్మముతో ముఖ్యసామానాధికరణ మని వ్రాయబడినది. మఱియును, బాధసామానాధికరణ్యమునకు నుదాహరణవాక్యము నందు ఖండనము వ్రాయబడినది. దానికి సమాధానము విద్యారణ్యస్వాములచే నీరీతిగా వ్రాయబడినది. బుద్ధిస్థచిదాభాసునకిని, కూటస్థునకును అన్యోన్యాధ్యాస మున్నది. ఎట్లన, చిదాభాసవిశిష్టబుద్ధికి అధిష్ఠానము కూటస్థుడై యున్నాడు. అహంప్రతీతికి విషయము చిదాభాసవిశిష్టబుద్ధియై యున్నది. మఱియును, స్వయంప్రతీతికి విషయము కూటస్థుడై యున్నాడు. 'అహం స్వయం జానామి' 'త్వం స్వయం జానాసి,' 'సః స్వయం జానాతి,' యను నీరీతిగా సకల ప్రతీతి యందు ననుగత స్వయంశబ్దముయొక్క యర్థ మున్నది. మఱియును, అహం త్వమాది శబ్దములయొక్క యర్థము వ్యభిచారియై యున్నది. స్వయంశబ్ద మునకు నర్థమగు కూటస్థుడు అనుగత మైనందున అధిష్ఠానమై యున్నాడు. అహంత్వమాదిశబ్దములయొక్క యర్థ మగు చిదాభాసవిశిష్టబుద్ధిరూప జీవుడు వ్యభిచారి యైనందున నధ్యస్తుడై యున్నాడు. కూటస్థునియందు జీవునకు స్వరూ పాధ్యాస మున్నది. అందువలన కూటస్థజీవులకు నన్యోన్యాధ్యాస ముండుట వలన పరస్పరవివేకము లేదు. అందువలన బ్రహ్మముతో కూటస్థునియొక్క ముఖ్య సామానాధికరణ్యమునకు జీవునియందు వ్యవహార మున్నది. మఱియును జీవుని యందు కూటస్థధర్మముయొక్క యారోపము లేక మిథ్యాజీవునికి సత్యబ్రహ్మము తో ముఖ్యసామానాధికరణ్యము సంభవించుటలేదు. అందువలన స్వాంతఃకరణమునకు నధిష్ఠాన మగు నేకూటస్థు డున్నాడో ఆయనయొక్క ధర్మవివక్ష చేత జీవునకు బ్రహ్మముతో ముఖ్యసామానాధికరణ్యము చెప్పబడినది. ఈరీతిగా చిత్రదీపమునందు విద్యారణ్యస్వాములచేత వివరణకారవచనముతో అవిరోధ ప్రకారము వ్రాయబడినది.

**195. వివరణోక్తమతమగు జీవునకు బ్రహ్మముతో ముఖ్యసామానాధికరణ్యము, విద్యారణ్యవాక్యమునకు ప్రౌఢివాదత్వము.**

మఱియును, వివరణగ్రంథము పూర్వోత్తరముగా జూచిన మొదల నీ ప్రకారముగా సంభవించును. ఎట్లన వివరణగ్రంథమునందు బింబముయొక్క స్వరూపమే ప్రతిబింబముగా నంగీకరింపవలసినది. అందువలన ఆయనయొక్క మతమునందు ప్రతిబింబత్వరూపజీవత్వము మిథ్యయై యున్నది. ప్రతిబింబరూప

జీవస్వరూపము మిథ్యకాదు. ఇక నేమనగా, ఆయనయొక్క స్వరూపము సత్యమై యున్నది. అందువలన జీవునకు బ్రహ్మముతో ముఖ్యసామానాధికరణ్యము సంభవించుచున్నది. విద్యారణ్యస్వాములచేత వివరణగ్రంథములకు ఉక్తాభిప్రాయము ఏది చెప్పబడినదో యది ప్రౌఢివాదముచేత చెప్పబడినది. ప్రతిబింబమునకు మిథ్యాత్వ మంగీకరించినను జీవునియందు కూటస్థత్వ వివక్షచేత మహావాక్యమునందు వివరణోక్త ముఖ్యసామానాధికరణ్యము సంభవించుచున్నది. అందువలన ముఖ్యసామానాధికరణ్యముయొక్క యనుపపత్తిచే ప్రతిబింబమునకు సత్య మంగీకరణీయము కాదు. ఈ ప్రౌఢివాదముచేత విద్యారణ్యస్వామిచే ఉక్తాభిప్రాయము వివరణమునకు వ్రాయబడినది. వివరణగ్రంథమునం దుక్తాభిప్రాయము లేదు. ప్రౌఢి యనగా నుత్కర్ష, దానిచేత నేవాద మున్నదో (అనగా కథనము) అది ప్రౌఢివాద మనంబడును. ప్రతిబింబమునకు మిథ్యాత్వ మంగీకరించి మహావాక్యమునందు ముఖ్యసామానాధికరణ్యము కూడ ప్రతిపాదించుటకు శక్తులమై యున్నాము, అను నీరీతిగా తనయొక్క యుత్కర్ష బోధచేయబడినది.

### 196. చేతనమునకు విద్యారణ్యోక్త చతుర్విధభేదానువాదము.

ఈరీతిగా నంతఃకరణమందు నాభాస జీవుడై యున్నాడు. ఆయన జ్ఞానమయకోశరూపుడై యున్నాడు. బుద్ధివాసనావిశిష్టాజ్ఞానమునం దుండెడి యవభాస ఈశ్వరుడై యున్నాడు. ఆయన ఆనందమయకోశరూపు డై యున్నాడు. ఉభయులయొక్క స్వరూపము మిథ్యయై యున్నది. కూటస్థజీవులకు అన్యోన్యాధ్యాస మున్నది. బ్రహ్మ చేత నేశ్వరులకు అన్యోన్యాధ్యాసమున్నది. అందువలన జీవునియందు కూటస్థ ధర్మముయొక్క యారోపముచేత కొన్ని స్థలములయందు పారమార్థిక బ్రహ్మత్వము చెప్పబడియున్నది. ఈలాగుననే ఈశ్వరునియందు ఆధ్యాసిక బ్రహ్మత్వముయొక్క వివక్షచేత వేదాంతవేద్యత్వాది ధర్మములు చెప్పబడినవి. అందువలన చేతనములకు నాలుగుభేదము లున్నవి. ఇది చిత్రదీపమునందు చెప్పబడియున్నది.

### 197. బుద్ధివాసనయం దుండు ప్రతిబింబమునకు విద్యారణ్యస్వామ్యుక్తేశ్వరత్వముయొక్క ఖండనము.

అయిన బుద్ధివాసనయం దుండు ప్రతిబింబమునకు నీశ్వరత్వము సంభవించుట లేదు. ఈలాగుననే ఆనందమయకోశమునకు ఈశ్వరత్వవచనము కూడ సంభవించుటలేదు. తథాహి, బుద్ధివాసనావిశిష్టాజ్ఞానమునం దుండు ప్రతిబింబ

మునకు ఈశ్వరత్వము చెప్పువానిని అడుగవలసిన దేమనగా, ఈశ్వరభావమునకు నుపాధి కేవలాజ్ఞానమై యున్నదా? అథవా వాసనాసహితాజ్ఞానమై యున్నదా? అథవా కేవలవాసనయై యున్నదా ? ప్రథమపక్షమును చెప్పిన యెడల బుద్ధివాసనావిశిష్టాజ్ఞానమునందుండు ప్రతిబింబమునకు నీశ్వరత్వవచనముతో విరోధ మగును. ద్వితీయపక్షమును జెప్పిన యెడల కేవలాజ్ఞానమునే ఈశ్వరభావమునకు నుపాధిగా నంగీకరింపవలసినది, బుద్ధివాసనావిశిష్టాజ్ఞానమును ఈశ్వరోపాధిగా జెప్పుట నిష్ఫలమై యున్నది. విద్యారణ్యస్వామిభక్తుడు చెప్పిన దేమనగా, కేవలాజ్ఞానమును ఈశ్వరోపాధిగా నంగీకరించిన యెడల నీశ్వరునియందు సర్వజ్ఞత సిద్ధింపదు. అందువలన సర్వజ్ఞతాలాభార్థము బుద్ధివాసనయును, అజ్ఞానమునకు విశేషణము అంగీకరింపవలసినది, అను నీ వచన మసంగతమగును. ఎట్లన, అజ్ఞానస్థ సత్త్వాంశముయొక్క వృత్తిచేత సర్వజ్ఞత సంభవించుచున్నది. బుద్ధివాసనచేత సర్వజ్ఞత సిద్ధించుట లేదు. ఎట్లన, ఏకైకబుద్ధివాసనకు నిఖిలపదార్థగోచరత్వము సంభవించుట లేదు. సర్వజ్ఞతాలాభముకొఱకు సర్వవాసనలకు అజ్ఞానవిశేషణత్వము అంగీకరింపవలయును. అది ప్రళయకాలమునందు తప్ప యేకకాలమునందు సర్వవాసనలకు సద్భావము సంభవింపదు. అందువలన సర్వజ్ఞతాసిద్ధి వాసనలచే కలుగుట లేదు. ఈరీతిగా ధీవాసనాసహితాజ్ఞానము ఈశ్వరునికి ఉపాధియై యున్నది, అను నీద్వితీయపక్షము కూడ సంభవింపదు. కేవలవాసన ఈశ్వరునకు నుపాధియై యున్నది, అనునది తృతీయపక్షమై యున్నది. తథాపి ఆయనను అడుగవలసిన దేమనగా, ఏకైకవాసనయందు ప్రతిబింబ మీశ్వరుడా? లేక సకలవాసనయందుండెడి యేకప్రతిబింబ మీశ్వరుడా? ప్రథమపక్షమును జెప్పినయెడల జీవులయొక్క బుద్ధివాసన యనంతమైనందున వానిలో ప్రతిబింబమగు నీశ్వరుడు కూడ అనంత మగును. మఱియును, ఏకైకవాసనలకు అల్పగోచరత్వ ముండుటవలన వానిలో ప్రతిబింబరూపానంతేశ్వరుడుకూడ అల్పజ్ఞుడే కావలయును, సర్వవాసనలయందు ఏకప్రతిబింబమును అంగీకరించిన యెడల సర్వవాసనలు ప్రళయమందు తప్ప యుగపత్ సంభవింపవు. అనేకోపాధులయందు అనేకప్రతిబింబములే యున్నవి. అందువలన సర్వవాసనలయందు ఏకప్రతిబింబము సంభవింపదు. ఈరీతిగా కేవలాజ్ఞానమే ఈశ్వరునకు ఉపాధియై యున్నది.

### 198. ఆనందమయకోశమునకు విద్యారణ్యస్వామిచేత చెప్పబడిన యీశ్వరతాఖండనము.

విద్యారణ్యస్వామిచే చిత్రదీపమునందు వాసనకు నిష్ఫలానుసరణము చేయబడియున్నది. ఈలాగుననే ఆనందమయకోశమునకు ఈశ్వరత్వకథనము కూడ అసంగతమై యున్నది. ఎట్లన జాగ్రత్స్వప్నములయందు స్థూలావస్థావిశిష్ట ప్రతిబింబసహితాంతఃకరణము విజ్ఞానమయ మనంబడును. విజ్ఞానమయజీవుడే సుషుప్తికాలమునందు సూక్ష్మరూపముతో లీనుడై ఆనందమయ మనంబడును. ఆయనకు నీశ్వరత్వము సంగీకరించినయెడల జాగ్రత్స్వప్నములయందు అంతఃకరణముయొక్క విలీనావస్థారూప మానందమయ మైనందున ఈశ్వరునకును నభావము కానలయును. అనంతపురుషులయొక్క సుషుప్తులయందు అనంతేశ్వరు లగుదురు. జీవునికి పంచకోశములు సకలగ్రంథకారులచే జెప్పబడినవి. పంచకోశ వివేకమునందు విద్యారణ్యస్వాములచే స్వయముగా జీవునకు పంచకోశములు చెప్పబడినవి. ఆనందమయమునకు నీశ్వరత్వమును జెప్పినయెడల సకల వచనము లసంగతము లగును. అందువలన నానందమయమునకు నీశ్వరత్వమును జెప్పుట సంభవింపదు.

199. ఆనందమయమునకు మాండూక్యోపనిషదుక్తసర్వజ్ఞత్వాదికముయొక్క యభిప్రాయము.

మఱియును మాండూక్యోపనిషత్తునందు ఆనందమయమునకు సర్వజ్ఞత, సర్వేశ్వరత్వము చెప్పబడినవి. దానిచేతను ఆనందమయమునకు నీశ్వరత్వము సిద్ధింపదు. ఎట్లన, మాండూక్యమునందు అర్థ మేమనగా, విశ్వ, తైజస, ప్రాజ్ఞ, భేదములచేత జీవునియొక్క స్వరూపము త్రివిధమై యున్నది. విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృత భేదములచేత నీశ్వరునకును త్రివిధభేదము లున్నవి. యద్యపి హిరణ్యగర్భునకు జీవత్వము సకలోపనిషత్తులయందును ప్రసిద్ధమై యున్నది. హిరణ్యగర్భునియొక్క ప్రాప్తికి హేతువగు నుపాసనము ఉపనిషత్తులయందు ప్రసిద్ధమై యున్నది. మఱియును, ఉపనిషదుపాసన చేయు జీవుడే కల్పాంతరమునందు హిరణ్యగర్భపదవిని బొందును. ఈలాగున విరాడ్భావప్రాప్తికి హేతువగు నుపాసనచేత కల్పాంతరమునందు జీవునకే విరాడ్రూపప్రాప్తి యగును. మఱియును హిరణ్యగర్భుని యైశ్వర్యముకంటె విరాడ్రూపముయొక్క యైశ్వర్యము న్యూనమై యున్నది. ఈశ్వరునియొక్క యైశ్వర్యము సర్వోత్కృష్టమై యున్నది. ఆయనయందపకృష్టైశ్వర్యము సంభవింపదు. ఈలాగున హిరణ్యగర్భునియొక్క పుత్త్రుడు విరాట్టై యున్నాడు. ఆయనకు క్షుత్పిపాసాదిబాధ యున్నది అను నీ

గాధ పురాణప్రసిద్ధమై యున్నది. అందువలన హిరణ్యగర్భవిరాట్టులకు సర్వేశ్వరత్వ కథనము సంభవింపదు. తథాపి సత్యలోకవాసి యగు సూక్ష్మసమష్ట్యభిమాని యగు సుఖభోక్తయగు హిరణ్యగర్భుడు జీవుడై యున్నాడు. స్థూలసమష్ట్యభిమాని యగు విరాట్టు జీవుడై యున్నాడు. సూక్ష్మప్రపంచమునకు ప్రేరకుడగు నంతర్యామియును హిరణ్యగర్భశబ్దమునకు వాచ్యుడై యున్నాడు. ఈలాగున స్థూలప్రపంచమునకు ప్రేరకు డగు నంతర్యామి విరాట్ఛబ్దముయొక్క యర్థమై యున్నాడు. చేతనమగు ప్రతిబింబగర్భితమగు సాక్షిరూపచైతన్యము సూక్ష్మసృష్టికాలమునందు దానికి ప్రేరకమైనప్పుడు హిరణ్యగర్భసంజ్ఞకుడు అగుచున్నాడు. స్థూలసృష్టికాలమునందు స్థూలప్రపంచమునకు ప్రేరకుడైనప్పు విరాట్సంజ్ఞకు డగుచున్నాడు. ఈరీతిగా వ్యష్టియందును, ఈశ్వరుని యందును, హిరణ్యగర్భశబ్దముయొక్కయు, విరాట్ఛబ్దముయొక్కయు ప్రవృత్తి యున్నది. అయిన సూక్ష్మస్థూలములయొక్కయు అభిమాని యగు జీవుని యందు హిరణ్యగర్భశబ్ద విరాట్ఛబ్దములయొక్క శక్తివృత్తి యున్నది. ద్వివిధ ప్రపంచమునకును ప్రేరకుడగు నీశ్వరునియందు ఆ యుభయశబ్దములయొక్క గౌణ వృత్తి యున్నది. ఎట్లు జీవరూప హిరణ్యగర్భ విరాట్టులకు స్వీయతాసంబంధము స్థూలసూక్ష్మప్రపంచముతో నున్నదో, ఈలాగుననే ఈశ్వరునకు సూక్ష్మ స్థూల ప్రపంచములతో ప్రేర్యతాసంబంధ మున్నది. అందువలన సూక్ష్మ సృష్టి సంబంధిత్వరూప హిరణ్యగర్భవృత్తి గుణయోగముచేత నీశ్వరుని యందు హిరణ్యగర్భశబ్దమునకు గౌణవృత్తి యున్నది. ఈలాగుననే స్థూల సృష్టి సంబంధిత్వరూప విరాడ్వృత్తి గుణయోగముచేత నీశ్వరునియందును విరాట్ఛబ్దముయొక్క గౌణవృత్తి యున్నది. ఈరీతిగా హిరణ్యగర్భ విరాట్ఛబ్దములకు జీవేశ్వరులు ఉభయులు అర్థమై యున్నారు. ఏ ప్రసంగమునందు ఏ యర్థము సంభవించుచున్నదో దానికి ఆ ప్రసంగమునందు గ్రహణ మున్నది. మఱియును గురుసంప్రదాయము వినాగా వేదాంతగ్రంథావలోకనము చేసినయెడల ఆయనకు పూర్వోక్తవ్యవస్థాజ్ఞానము కలుగదు. అందువలన హిరణ్యగర్భ విరాట్ఛబ్దముల చేత కొన్నిస్థలములయందు జీవునకు కొన్నిస్థలములయందు ఈశ్వరునకును సంభవము చూచి మోహమును పొందుదురు. మాండూక్యోపనిషత్తునందు త్రివిధ జీవులకును త్రివిధేశ్వరులతో నభేదచింతనము వ్రాయబడినది. ఏ మందబుద్ధి పురుషులకు మహావాక్యవిచారము తత్త్వసాక్షాత్కారము కలుగుటలేదో వారికి

ప్రణవచింతనము మాండూక్యమునందు చెప్పబడినది. దానియొక్క ప్రకారము విచారసాగరముయొక్క పంచమతరంగమునందు స్పష్టమై యున్నది. అచ్చట విశ్వవిరాట్టులకును, తైజసహిరణ్యగర్భులకును, ప్రాజ్ఞేశ్వరులకును అభేద చింతనము వ్రాయబడియున్నది. అందువలన నీశ్వరునియొక్క ధర్మమగు సర్వజ్ఞత్వాదికము ప్రాజ్ఞరూపానందమయునియందు అభేదచింతనము నిమిత్తము చెప్పబడినది. ఆనందమయునకు ఈశ్వరతావివక్ష చెప్పబడినది కాదు. ఎట్లు విరాట్టులయొక్క యభేదచింతనముకొఱకు వైశ్వానరునకు పందొమ్మిది ముఖములు చెప్పబడియున్నవి. చతుర్దశత్రిపుటులును, పంచప్రాణములును యీపందొమ్మిది విశ్వునకు భోగసాధనములైనందున విశ్వునియొక్క ముఖములైయున్నవి. వైశ్వానరుడు ఈశ్వరుడైయున్నాడు. ఆయనకు భోగములేదు. అందువలన విశ్వవిరాట్టులకు అభేదచింతనమువఱకే విశ్వునియొక్క భోగసాధనపదార్థములకు వైశ్వానరునియొక్క భోగసాధనత్వము చెప్పబడినది. విరాట్టు వైశ్వానరు డనంబడును. మాండూక్యవచనమునకు అభేదచింతనమందు తాత్పర్యమై యున్నది. వస్తుస్వరూపానుసారిగాని చింతన మున్నది, అను నీనియమము లేదు. ఇకనేమనగా అన్యరూపముతోను చింతన మున్నది, అను నీయర్థముకూడ విచారసాగరమునందు స్పష్టమై యున్నది. అందువలన మాండూక్యవచనముచేత ఆనందమయునకు నీశ్వరతము సిద్ధించుట లేదు.

200. ఆనందమయునకు ఈశ్వరత్వమునందు విద్యారణ్యస్వాములకు తాత్పర్యాభావము.

మఱియును విద్యారణ్యస్వాములచేతను, బ్రహ్మానందనామకగ్రంథమునందు ఆనందమయకోశము జీవునియొక్క యవస్థావిశేషమై యున్నది, అని వ్రాయబడి యున్నది. అచ్చట నుండు ప్రసంగ మేమనగా, జాగ్రత్స్వప్నముల యందు భోగమును ఇచ్చు కర్మసముదాయమునకు నాశముకలిగి నిద్రారూపముతో విలీనమగు నంతఃకరణమునకు భోగము నిచ్చు కర్మవశతచేత అధీనభావ మున్నది. అది విజ్ఞానమయ మనంబడును. ఆవిజ్ఞానమయము సుషుప్తియందు విలీనావస్థాసహితాంతఃకరణముయొక్క యుపాధిరూపసంబంధముచేత ఆనందమయం బనంబడును. ఈరీతిగా విజ్ఞానమయముయొక్క యవస్థావిశేషమే ఆనందమయ మనంబడును. అందువలన విద్యారణ్యస్వాములకును ఆనందమయకోశమునందు జీవత్వమే యిష్టమై యున్నది. యద్యపి విలక్షణలేఖనమును జూచి పరంపరా

వచనమునందు పరంపరగా నిట్లు చెప్పబడియున్నది. పంచవివేకములును, పంచదీపకములును విద్యారణ్యకృతములై యున్నవి. పంచానందములు భారతీతీర్థకృతములై యున్నవి. తథాపి ఒక గ్రంథమునందు పూర్వోత్తరమునకు విరోధము సంభవించుట లేదు. అందువలన పంచదశిగ్రంథమునందు ఆనందమయమునకు ఈశ్వరత్వము వివక్షితము కాదు. చిత్రదీపమునందు ఆ యానందమయునకు నిశ్వరత్వము చెప్పబడినది. అది మాండూక్యవచనమునకు చింతసియేశ్వరాభేదమునందు తాత్పర్యముచేత జెప్పబడినది. ఆనందమయునకు నిశ్వరత్వమునందు విద్యారణ్యస్వామికి తాత్పర్యము లేదు. ఈరీతిగా విద్యారణ్యస్వాములవారిచేత చేతనమునకు చతుర్విధభేదము చిత్రదీపమునందు చెప్పబడినది.

201. చేతనముయొక్క త్రివిధభేదమునకు విద్యారణ్యస్వామి లోనగు నెల్లరయొక్క యంగీకార మున్నది.

యద్యపి దృగ్దృశ్యవివేకనామక గ్రంథమునందు విద్యారణ్యస్వాములచే కూటస్థునకు జీవునియందంతర్భావము వ్రాయబడి యున్నది. తథాపి పారమార్థిక వ్యావహారిక ప్రాతిభాసిక భేదముచేత జీవునికి త్రివిధభేద మున్నది. స్థూలసూక్ష్మభేదద్వయావచ్ఛిన్నకూటస్థచేతనము పారమార్థిక జీవుడై యున్నాడు. ఆయనకు బ్రహ్మముతో ముఖ్యాభేదమై యున్నది. మాయచే నావృతకూటస్థమునందు కల్పితాంతఃకరణమునందు చిదాభాసు డున్నాడు. వాడు దేహద్వయమునందును అభిమానకర్త యగు వ్యావహారికజీవుడై యున్నాడు. బ్రహ్మజ్ఞానముకంటె పూర్వమునందు ఆయనకు బాధ కలుగుట లేదు. అందువలన వ్యావహారికుడై యున్నాడు. నిద్రారూపమాయచే నావృతవ్యావహారిక జీవరూపాధిష్ఠానమునందు కల్పితప్రాతిభాసికజీవు డున్నాడు. స్వప్నావస్థయందు ప్రాతిభాసిక ప్రపంచమునకు అహంమమాభిమాని ప్రాతిభాసికజీవుడై యున్నాడు. బ్రహ్మజ్ఞానము వినైవ జాగ్రత్ప్రపంచముయొక్క బోధచేత ప్రాతిభాసిక ప్రపంచముయొక్క నివృత్తికాలమునందు వ్యావహారికజీవునియొక్క బోధచేత ప్రాతిభాసికజీవుని నివృత్తి కలుగుచున్నది. ఈరీతిగా కూటస్థునికి జీవునియందంతర్భావ మున్నది. అందువలన, జీవేశ్వర శుద్ధచేతన భేదముచేత త్రివిధచేతనము లున్నవి. ఈపక్షమే సర్వసమ్మతమై యున్నది. మఱియు వార్తికవచనమున కనుకూలముగా నున్నది.

202. జీవునకు మోక్షదశయందు కర్తృపక్షమునందు శుద్ధబ్రహ్మముతోను, వివరణపక్షమునం దీశ్వరునితోను అభేదము.

పూర్వోక్త సకలపక్షమునందు జీవునివలె ఈశ్వరుడుకూడ ప్రతిబింబ రూపుడై యున్నాడు. అందువలన ఈశ్వరునితో మోక్షదశయందు జీవుని కభేదము వీరిమతమునందు సంభవింపదు. ఎట్లన ఉపాధియొక్క యపసరణముచేత ఏకప్రతిబింబమునకు నన్యప్రతిబింబముతో నభేద మనుభవగోచరమై లేదు. ఇక నేమనగా, బింబముతోనె యభేద మున్నది. వివరణకారులమతమునందు బింబచేతన మీశ్వరుడై యున్నాడు. ఆయనమతమునందు నీశ్వరునితోనె జీవుని కభేద మున్నది.

203—210 వఱకు. వేదాంతసిద్ధాంతమునందు ప్రక్రియా భేదము.

203. వివరణకార మతమునందు అజ్ఞానమునందు ప్రతిబింబుడగు జీవునియొక్కయు బింబభూతుడగు నీశ్వరునియొక్కయు నిరూపణము.

వివరణకారమతమునందు జీవేశ్వరులకు ఉపాధి యొకటే అజ్ఞానమై యున్నది. అజ్ఞానమునందు ప్రతిబింబము జీవుడు, బింబము ఈశ్వరుడు. ఎచ్చట దర్పణమునందు ముఖప్రతిబింబము ప్రతీత మగుచున్నదో అచ్చట దర్పణమునందు ముఖచ్ఛాయ లేదు. మఱియును దర్పణమునందు ననిర్వచనీయ ప్రతిబింబమునకు నుత్పత్తి లేదు. ఈలాగుననే వ్యావహారికప్రతిబింబమునకును ఉత్పత్తి లేదు. ఇక నేమనగా, దర్పణగోచరచాక్షుషవృత్తి దర్పణముచేత ప్రతిహతమై గ్రీవాస్థ ముఖమునే విషయీకరించుచున్నది. ఈరీతిగా గ్రీవాస్థముఖమునందే బింబ ప్రతిబింబభావము ప్రతీతిమగుచున్నది, ఆ గ్రీవాస్థ ముఖము సత్యమై యున్నది. అందువలన బింబప్రతిబింబముయొక్క స్వరూపము కూడ గ్రీవాస్థముఖరూప మైనందున సత్యమై యున్నది. అయిన గ్రీవాస్థ ముఖమునందు బింబత్వ, ప్రతిబింబత్వ రూపధర్మములు మిథ్యయై యున్నవి. అనిర్వచనీయ, మిథ్యాబింబత్వ, ప్రతిబింబత్వములకు నధిష్ఠానము ముఖమై యున్నది. ఈరీతిగా బింబమువలె ప్రతిబింబముయొక్కయు స్వరూపము సత్యమై యున్నది. అందువలన మహావాక్యమునందు ముఖ్యసామానాధికరణ్యము సంభవించుచున్నది. అయిన బింబత్వ రూపేశ్వరత్వమును, ప్రతిబింబత్వరూప జీవత్వమును ఈ రెండుధర్మములును మిథ్యయైయున్నవి. దీని కధిష్ఠానము శుద్ధచేతనమై యున్నది. యద్యపి, ఉక్త రీతిగా జీవేశ్వరులయొక్క యుపాధి యొకటే అజ్ఞానమై యున్నది. అందువలన రెంటికిని అజ్ఞత్వము, లేక, సర్వజ్ఞత్వము, కావలయును. తథాపి, దర్పణాదికముయొక్క లఘుత్వ, పీతత్వాది ధర్మములకు ఆరోపము ప్రతిబింబమునందున్నది. బింబము

నందు లేదు. అందువలన నావరణస్వభావాజ్ఞానకృతాల్పజ్ఞత జీవునియందున్నది. బింబరూపేశ్వరునియందు స్వరూపప్రకాశముచేత సర్వజ్ఞత్వ మున్నది. యద్యపి బింబప్రతిబింబములకు నుక్తరీతిగా నభేద మున్నది. అందువలన బింబప్రతిబింబ ములయొక్క ధర్మములకు భేదకథనము సంభవించుటలేదు. బింబప్రతిబింబము లకు భేద ముండినయెడల ఉక్తవ్యవస్థ సంభవించును. తథాపి, దర్పణస్థత్వరూప బింబప్రతిబింబత్వములకు గ్రీవాస్థముఖమునందు భ్రమ యున్నది. భ్రమసిద్ధ ప్రతిబింబముయొక్క యపేక్షచేత బింబత్వవ్యవహారము కలుగుచున్నది. అందు వలన నేకముఖమునందు బింబత్వప్రతిబింబత్వములు రెండును ఆరోపితములై యున్నవి. ఈలాగుననే ఒకటే ముఖమునందు బింబత్వ, ప్రతిబింబత్వరూప ధర్మము చేత ధర్మికి భేదముయొక్క భ్రమ కలుగుచున్నది. భ్రాంతిచేత ప్రతీత మగు నేబింబప్రతిబింబముయొక్క భేద మున్నదో దానిచేత నుక్తవ్యవస్థ సంభవింపదు. ఈరీతిగా వివరణకారమతమునందు అజ్ఞానమునందు ప్రతిబింబుడు జీవుడు, బింబచేతనము ఈశ్వరుడు. అజ్ఞానము అనిర్వచనీయమై యున్నది. అందువలన నజ్ఞానసద్భావకాలమునందును అజ్ఞానమునకు పరమార్థతః అభావ ముండుటవలన బింబప్రతిబింబరూపచేతనమే పరమార్థతః శుద్ధచేతనమై యున్నది. అందువలన నీశ్వరభావముయొక్క ప్రాప్తియును శుద్ధప్రాప్తియై యున్నది.

204. అవచ్ఛేదకవాదికృత మగు నాభాసవాద ఖండనము. స్వమత నిరూపణమును.

కొందఱాచార్యులు చెప్పిన దేమనగా, అంతఃకరణావచ్ఛిన్న చేతనము జీవుడై యున్నాడు. మఱియు నంతఃకరణముతో ననవచ్ఛిన్న చేతనము ఈశ్వరుడు. నీరూపచేతనమునకు ప్రతిబింబము సంభవింపదు. యద్యపి, కూప, తటాకాది జలగతతాకాశమునందు, నీలతావిశాలతాద్యభావ ముండుటవలన 'నీలం నభః విశాలం నభః' అను నీప్రతీతి కలుగుచున్నది. అందువలన విశాలతావిశిష్టమగు నట్టియు, ఆరోపితనీలతావిశిష్టమగునట్టియు ఆకాశముయొక్క ప్రతిబింబము నంగీకరింపవలయును. ఆకాశమునందు రూపము లేదు. అందువలన నీరూపము యొక్క ప్రతిబింబము సంభవింపదు. తథాపి ఆకాశమునందును భ్రాంతిసిద్ధా రోపితనీలరూప మున్నది. చేతనమునందు నారోపితరూపముయొక్కయు, అభావ ముండుటవలన దానియొక్క ప్రతిబింబము సంభవించుట లేదు. ఏపదార్థమునందు ఆరోపితరూపమైన, లేక, అనారోపితరూపమైన నున్నదో దానియొక్క ప్రతి

బింబము సంభవించుచున్నది. సర్వథా రూపరహితముయొక్క ప్రతిబింబము కలుగనేరదు. నీరూపోపాధియందు సర్వథా ప్రతిబింబము సంభవింపదు. ఎట్లన స్వరూపసహితదర్పణాదికమునందే ప్రతిబింబము చూడబడియున్నది. అందువలన నీరూపాంతఃకరణమునందు, లేక నీరూపావిద్యయందు, నీరూపచేతనముయొక్క ప్రతిబింబము సంభవించుట లేదు. మఱియును రూపరహితశబ్దమునకు నీరూపాకాశమునందు నేప్రతిధ్వనిరూపప్రతిబింబము చెప్పబడియున్నదో అదియును అసంగతమై యున్నది. ఎట్లన, ఉక్తరీతిగా, ఆకాశము రూపరహితము కాదు. మఱియు నాకాశమునందు నేప్రతిధ్వని యున్నదో అది శబ్దముయొక్క ప్రతిబింబము కాదు. ఎట్లన, ప్రతిధ్వనిని శబ్దముయొక్క ప్రతిబింబముగా నంగీకరించినయెడల ఆకాశవృత్తి యైనదై శబ్దాభావ ముండును, భేరీదండాదికముయొక్క సంయోగముచేత పార్థివశబ్దము పుట్టును, ఆపార్థివశబ్దముచేత దానియొక్క సమ్ముఖదేశమం దుండు పాషాణాద్యవచ్ఛిన్నాకాశమునందు ప్రతిధ్వనిరూపశబ్ద మున్నది. ఆప్రతిధ్వనిశబ్దమునకు పార్థివశబ్దము నిమిత్తకారణమై యున్నది. అందువలన పార్థివధ్వనికి సమానముగానే ప్రతిధ్వని యున్నది. ప్రతిధ్వనిని శబ్దముయొక్క ప్రతిబింబముగా నంగీకరించినయెడల ప్రతిబింబమును అనిర్వచనీయముగా నంగీకరింపవలసినది. వివరణకారులయొక్క మతానుసారి బింబస్వరూపమునే ప్రతిబింబముగా నంగీకరించినాడు. ఈ రెండుమతములయందును ఆకాశముయొక్క గుణము ప్రతిధ్వని కాకపోవలయును. ఎట్లన వ్యావహారికాకాశముయొక్క గుణము ప్రాతిభాసికమై సంభవింపదు. అందువలన ననిర్వచనీయ ప్రతిబింబవాదమునందు ప్రతిధ్వనిని పార్థివశబ్దమునకు ప్రతిబింబముగా నంగీకరించినయెడల ఆకాశముయొక్క గుణ మని చెప్పుట సంభవింపదు. మఱియును, బింబప్రతిబింబముయొక్క అభేదవాదమునందు పార్థివశబ్దముయొక్క ప్రతిబింబరూపప్రతిధ్వనికి తనయొక్క బింబముతో నభేద ముండుటవలన పృథివియొక్క గుణము ప్రతిధ్వని యగును. అందువలన ప్రతిధ్వనిని శబ్దముయొక్క ప్రతిబింబముగా నంగీకరించినయెడల ఏప్రకారముగాను ఆకాశగుణము ప్రతిధ్వని యగుచున్నది, అను నీకథనము సంభవింపదు. ప్రతిధ్వనికంటె భిన్నమగు శబ్దము పృథివీజలాగ్నులదై యున్నది. ఆకాశమునందు అన్యప్రకారముగ శబ్దము లేదు. అందువలన ఆకాశము శబ్దరహితమే యగును. ఆకాశము శబరహితమై యున్నది, అను నీమతము శాస్త్రీయమై యున్నది.

భూతవివేకమునందు విద్యారణ్యస్వాములచే సెప్పబడిన దేమనఁగా; కటకటా శబ్దము పృథివీ సంబంధియై యున్నది, చులచులశబ్దము జలసంబంధియై యున్నది, భుక్, భుక్ శబ్దము అగ్నిసంబంధియై యున్నది, పి, సీ శబ్దము వాయుసంబంధియై యున్నది. ప్రతిధ్వనిరూపశబ్దము ఆకాశసంబంధియై యున్నది. ఈలాగుననే అన్యగ్రంథమందును ప్రతిధ్వని రూపాకాశముయొక్క గుణముగానే యున్నది. అందువలన ప్రతిబింబము ప్రతిధ్వని కాదు. ఇక నే మన ఆకాశము యొక్క స్వతంత్రశబ్దము ప్రతిధ్వనియై యున్నది. దానికి నుపాదానకారణ మాకా శమై యున్నది. మఱియును భేర్యాదికమునందు పార్శ్వవధ్వని గలిగినయెడల అది ప్రతిధ్వనికి నిమిత్తకారణమై యున్నది. అందువలన రూపరహితప్రతిబింబము సంభవించుట లేదు. ప్రతిబింబవాది చెప్పున దేమనగా, కూపాద్యాకాశమునందు విశాల మాకాశ మను న్ప్రతీతి కలుగుచున్నది. కూపాద్యాకాశమునందు విశాలత లేదు. అందువలన బాహ్యదేశస్థ మగు, రూపరహిత మగు, విశాల మగు, నా కాశమునకు కూపజలమునందు ప్రతిబింబ మగుటవలన రూపరహితచేతన నమునకు ప్రతిబింబము సంభవించుచున్నది. తథాపి, రూపసహితోపాధియందే ప్రతిబింబము కలుగుచున్నది. రూపరహితోపాధియందు ప్రతిబింబము సంభ వింపదు. ఆకాశముయొక్క ప్రతిబింబమునకు ఉపాధి కూపజలమై యున్నది. దాని యందు రూప మున్నది. మఱియు నవిద్యాంతఃకరణాదికము రూపరహితమై యు న్నది. దానియందు చేతనప్రతిబింబము సంభవింపదు. అందువలన అంతఃకరణా వచ్ఛిన్నచేతనము జీవుడై యున్నాడు. అంతఃకరణానవచ్ఛిన్నచేతను డీశ్వరుడై యున్నాడు.

205. అవచ్ఛేదవాదముయొక్క కథనము.

అవిద్యావచ్ఛిన్నచేతనము జీవుడు మాయావచ్ఛిన్నచేతనము ఈశ్వరుడై యున్నాడు.

206. అంతఃకరణముచేత అవచ్ఛిన్నచేతనము జీవుడనియును, అన వచ్ఛిన్నచేతనము ఈశ్వరు డనియు నను సిద్ధాంతఖండనము.

అంతఃకరణావచ్ఛిన్నుని జీవునిగాను, అనవచ్ఛిన్నుని ఈశ్వరునిగాను అంగీకరించినయెడల బ్రహ్మాండముకంటె బాహ్యదేశస్థ చేతనమునందు ఈశ్వరత్వ ముండును. ఎట్లన బ్రహ్మాండమునందు అనంతజీవులయొక్క యనంతాంతఃకరణ ములు వ్యాప్తములై యున్నవి. అందువలన అంతఃకరణానవచ్ఛిన్న చేతన

మునకు బ్రహ్మాండమధ్యమునందు లాభము సంభవింపదు. బ్రహ్మాండముకంటె బాహ్యదేశమునందే ఈశ్వరునియొక్క సద్భావము నంగీకరించినయెడల అంతర్యామి ప్రతిపాదకవచనమునకు విరోధ మగును. "యో విజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానమంతరోఽయ మయత" అను నీవచనమునందు విజ్ఞానపదబోధ్య జీవదేశమునందు ఈశ్వరునియొక్క సద్భావము చెప్పబడినది. అందువలన నంతఃకరణముచే ననవచ్ఛిన్నుడు ఈశ్వరుడు కాడు. ఇక నేమన, మాయావచ్ఛిన్నచేతనమే ఈశ్వరుడై యున్నాడు. అంతఃకరణముచే ననవచ్ఛిన్నమునకు ఈశ్వరత్వ మంగీకరించిన యెడల అంతఃకరణముతో సంబంధాభావమే ఈశ్వరత్వమునకు నుపాధిగా సిద్ధించుచున్నది. ఈశ్వరునియందు సర్వజ్ఞత్వాదిక ముపాధికృతమై యున్నది. అభావరూపోపాధిచేత సర్వజ్ఞత్వాదిధర్మమునకు సిద్ధి యగుట లేదు.

207. తృప్తిదీపమునందు విద్యారణ్యస్వామ్యుక్తమగు నంతఃకరణము యొక్క సంబంధమును తదభావమునకు నుపాధియొక్క యభిప్రాయము.

విద్యారణ్యస్వామిచేత తృప్తిదీపమునందు చెప్పబడిన దేమనగా, ఎట్లు అంతఃకరణముయొక్క సంబంధ ముపాధియై యున్నదో అట్లు అంతఃకరణ సంబంధముయొక్క యభావమును ఉపాధియై యున్నది. ఎట్లు లోహముయొక్క శృంఖలచేత సంచారమునకు నిరోధమగునో అట్లు సువర్ణశృంఖలచేతను సంచారమునకు నిరోధ మగును. ఈరీతిగా నంతఃకరణముయొక్క సంబంధరూపభావోపాధిచేత జీవస్వరూపమునకు బోధ యగును. ఉక్తసంబంధముయొక్క యభావముచేత పరమాత్మత్వ స్వరూపమునకు బోధ మగుచున్నది. ఈరీతిగా విద్యారణ్యస్వాములచే నంతఃకరణరాహిత్యమును నుపాధిగా జెప్పబడియున్నది. దానియొక్క యభిప్రాయ మేమనగా, ఎట్లు అంతఃకరణసంబంధముచే జీవస్వరూపమునకు బోధ యగునో అట్లు అంతఃకరణరాహిత్యముచేత బ్రహ్మస్వరూపమునకు బోధ యుండుటవలన బ్రహ్మబోధోపయోగి అంతఃకరణరాహిత్యమై కూడ ఉన్నది. అందువలన విద్యారణ్యస్వాముల వచనముచేతను, అభావ రూపోపాధిచేతను ఈశ్వరునియందు సర్వజ్ఞత్వాదికమునకు సిద్ధిప్రతీతి యగుట లేదు.

208. అవచ్ఛేదవాదమునకు భేదపూర్వకత్వమునకు సమాప్తి.

అందువలన మాయావచ్ఛిన్నచేతనమే ఈశ్వరుడై యున్నాడు. ఈశ్వరునకు ఉపాధి యయిన మాయ సర్వదేశమందున్నది. అందువలన నీశ్వరునియందు అంతర్యామిత్వము సంభవించుచున్నది. అంతఃకరణావచ్ఛిన్నమును జీవునిగా

నంగీకరించినయెడల కర్తయు, భోక్తయు, చేతనప్రదేశభిన్నుఁ డగును. అందు వలన కృతనాశమును, అకృతప్రాప్తియును అగును. అందువలన నవిద్యా వచ్ఛిన్నచేతనమె జీవుఁడై యున్నాఁడు. అంతఃకరణావచ్ఛిన్నచేతనము జీవుఁడు కాఁడు. ఈరీతిగా కొందఱు గ్రంథకారులు అవచ్ఛేదకవాదమునే యంగీకరించి నారు. ప్రతిబింబప్రతిపాదక శ్రుతిస్మృతివచనములయొక్క విరోధపరిహారము వారియొక్క గ్రంథమునందు స్పష్టమై యున్నది.

209. సిద్ధాంతముక్తావళ్యాదికమునందు ఉక్తైకజీవదృష్టిసృష్టివాదము యొక్క నిరూపణము.

సిద్ధాంతముక్తావళికార మత మే మనగా;—

"దోహా:—జ్యాం అవికృత కౌంతేయమై—రాధాపుత్రప్రతీతి. చిదా నంద బ్రహ్మమెం జీవ భావతిలలహాఁతి." పరమార్థతః కౌంతేయుఁడగు రాజకుమా రునియందు పామరకృత రాధాపుత్రిత్వాది నీచమగు మిథ్యాన్వయాపము ఏ లాగున ఉన్నదో ఆలాగుననే చిదానంద ఘనస్వరూప బ్రహ్మమునందు జీవభావము మిథ్యాప్రతీతిగోచరమై యున్నది-అని శ్లోకార్థము.

సదా అసంగుఁడై నిత్యముక్తుఁడై యుండు బ్రహ్మమునందు కల్పితావిద్య యొక్క సంబంధముచేత, ప్రతిబింబితత్వము, అవచ్ఛిన్నత్వమును, సంభవింపవు. ఉ. మృగతృష్ణాజలముచేత పూరిత మైనటువంటియు వంధ్యాసుత కులాలునిచే శశశృంగదండముచేత రచితమగు ఘటముయొక్క సంబంధముచేత ఆకాశము నందు ప్రతిబింబితత్వ మైనను, అవచ్ఛిన్నత్వ మైనను సంభవింపదు. ఇక నే మనగా, ఆకాశమునకు సమానసత్తాసహిత జలపూరిత ఘటతటాకాదికము యొక్క సంబంధముచేతనే ఆకాశమునందు, ప్రతిబింబత్వము, అవచ్ఛిన్నత్వ మును సంభవించుచున్నవి. అవిద్యయును, దానియొక్క కార్యమును బ్రహ్మచేత నమునకు సమానసత్తాసహితము కావు, స్వతస్సత్తాశూన్య మైనవి. అవిద్యాది కము బ్రహ్మసత్తచేత సత్తాసహితమై యున్నది. అందువలన శశశృంగాదికము వలె అత్యంతాలీకమగు నవిద్యాదికముతో చేతనమునకు సంబంధకథనమె సంభ వించుట లేదు. సంబంధము వినా ప్రతిబింబితత్వాదికము అత్యంతదూరమై యున్నది. అందువలన సదా ఏకరసమై యున్నది. ఆబ్రహ్మమందు అవచ్ఛిన్నత్వ రూప-లేక-ప్రతిబింబితత్వరూప జీవత్వము సంభవించుట లేదు. ఏమనగా, కల్పి తమగు నజ్ఞానముయొక్క కల్పితసంబంధము లేకయే బ్రహ్మమునందు జీవత్వము

ప్రతీతమగుచున్నది. ఎట్లు అవికారి యగు కుంతీపుత్త్రునియందు రాధాపుత్త్రత్వ ప్రతీతి భ్రమరూపమై యున్నది. అట్లు ప్రతిబింబాదివికారము లేకయే బ్రహ్మమునందు జీవత్వభ్రమ కలుగుచున్నది. ప్రతిబింబరూప-లేక-అవచ్ఛేదరూప జీవభావమునకు ప్రాప్తి యగుట లేదు. స్వావిద్యచేత జీవభావాపన్నబ్రహ్మమె ప్రపంచమునకు కల్పితమైనందున నీసర్వజ్ఞత్వాది ధర్మసహితేశ్వరుఁడును ఈపక్షమునందు జీవకల్పితుడై యున్నాఁడు. ఎట్లు స్వప్నకల్పిత రాజుయొక్క సేవచేత స్వప్నమునందు ఫలప్రాప్తి కలుగుచున్నదో అట్లు స్వప్నకల్పితేశ్వరభజనముచేత ఫలప్రాప్తియును సంభవించుచున్నది. ఈరీతిగా ననాద్యవిద్యాబలముచేత స్వకీయ బ్రహ్మభావముయొక్క యావరణముచేత జీవత్వభ్రమ కలుగుచున్నది, తత్త్వమస్యాది వాక్యజన్య సాక్షాత్కారముచేత జీవత్వభ్రమమునకు నివృత్తి కలుగుచున్నది. భ్రమకాలమునందును జీవత్వము లేదు. ఇకనేమనగా, నిత్యముక్త చిదానంద స్వరూపబ్రహ్మమె యున్నది. ఈపక్షమే భాష్యకార, వార్తికకారులచేత బృహదారణ్యక వ్యాఖ్యానమునందు కర్ణదృష్టాంతముచేత ప్రతిపాదింపబడి యున్నది. ఉ. కుంతీపుత్త్రుఁడగు కర్ణునకు హీనజాతి సంబంధముచేత నికృష్టతా భ్రమ కలిగినది. మఱియు ననేకవిధ తిరస్కారజన్యదుఃఖానుభవమును పొందెను. స్వతస్సిద్ధ కుంతీపుత్త్రతానిమిత్తకహర్షముచే ప్రచ్యుతుఁ డాయెను.

కదాచిత్, ఏకాంతమునందు సూర్యునిచే జెప్పబడెను. నీవు రాధాపుత్త్రుఁడవు కావు, నాయొక్క సంబంధముచేత కుంతియుదరమునందు ఉత్పన్నుఁడవై యున్నావు. ఈప్రకారము సూర్యవచనముచేత తనయందు హీనజాతియొక్క భ్రమను త్యజించి స్వతస్సిద్ధ కుంతీపుత్త్రతా నిమిత్తమగు నుత్కర్షను అనుభవించినాఁడో అట్లు చిదానంద బ్రహ్మముకూడ అనాద్యవిద్యాసంబంధముచేత జీవత్వభ్రమను పొంది స్వతస్సిద్ధబ్రహ్మభావమును మఱచిపోయి యనేకవిధదుఃఖమును అనుభవించుచున్నది.

కదాచిత్, తనయొక్క యజ్ఞానముచేత కల్పితస్వప్నమునందు కల్పితాచార్యులగు నాచార్యులవారి మహావాక్యశ్రవణముచేత నుత్పన్నమగు స్వగోచర విద్యవలన అవిద్యకు నివృత్తి కలిగి నిత్యపరమానందస్వరూప చైతన్యముతో నేకత్వమును అనుభవించును. ఈరీతిగా బృహదారణ్యక వ్యాఖ్యానమునందు భాష్యకారులచేతను, వార్తికకారులచేతను వ్రాయబడి యున్నది. ఎట్లు జీవునియొక్క యవిద్యాకల్పితాచార్యులు వేదోపదేశమునకు హేతువై యున్నాఁడో

అట్లు ఈశ్వరుడుకూడ స్వాప్నకల్పితరాజువలె జీవకల్పిత సుఖదుఃఖ భజనఫల మునకు హేతువై యున్నాడు. ఈమతమునందు ఏకజీవవాద మున్నది. అందువలన ఏకజీవకల్పితేశ్వరుడు కూడ ఒకడయియే యున్నాడు. నానేశ్వరులకు ఉపపత్తి లేదు. శుకవామదేవాదులు ముక్తిప్రతిపాదకశాస్త్రములచేతను స్వాప్నకల్పిత నానాపురుషులవలె జీవాభాసమె అనేకవిధముగా సిద్ధమగుచున్నది. నానాజీవ వాదమునకు సిద్ధియగుట లేదు. ఎట్లన, స్వాప్నమునందు ఏకద్రష్ట నానాపురుషులు ప్రతీత మగుచున్నాడో, వారిలో కొందఱు మహావనమునందు శత్రుఘాతములచే వ్యాఘ్రాదిజన్యదుఃఖమును అనుభవించుచున్నారు, కొందఱు రాజమార్గము నందు ఆరూఢులై స్వనగరమును పొందినారు, అచ్చట వనమునందు భ్రమణము స్వనగరప్రాప్తియు, స్వప్నద్రష్టకు లేదు, ఆభాసపురుషున కున్నది. అట్లు అవిద్యా సహిత బ్రహ్మరూపజీవునకు బంధమోక్షప్రాప్తి లేదు. ఇక నేమనగా, ఆభాసరూప జీవునకు బంధమోక్షములు ప్రతీతము లగుచున్నవి.

ఈపక్షమునందు ఎవరియొక్క జ్ఞానముచేత నవిద్యయొక్క నివృత్తిరూప మోక్షమగు నను నీప్రశ్న చేసినయెడల నజ్ఞానముచేత నగును అని యుత్తరము చెప్పవలసినది. లేక ఎవరియొక్క జ్ఞానముచేతను మోక్షము కలుగుట లేదు; అనునీ యుత్తరమును జెప్పవలసినది. ఎట్లన ఈమతమునందు బంధమునకు అత్యంతా సద్భావము ఆత్మయందు దున్నది. నిత్యముక్తాత్మకు మోక్షము కాగలదు, లేక, అయి నది అను నీకథనము సంభవించుట లేదు. ఈయభిప్రాయముచేత మోక్షప్రతి పాదక వాక్యములకు అర్థవాదత్వము చెప్పబడినది. మఱియును బంధ మున్నది. ఇంతపర్యంతము ఒక్కడు ముక్తుడు కాలేదు. ఉత్తరత్ర పురుషార్థముచేత మోక్ష మగును, అను నీయభిప్రాయముచేత వామదేవాదులకు ముక్తిప్రతిపాదకవాక్య ములకు అర్థవాదత్వము చెప్పబడలేదు. ఎట్లన, బంధ ముండి వామదేవాదికులకు ఈవఱకు మోక్షము కానియెడల ఉత్తరత్రమోక్షదశ నిష్ఫలమై యున్నది, అను నీబుద్ధిచేత శ్రవణమునందు ప్రవృత్త్యభావము కలుగును. అందువలన ఆత్మయందు బంధమునకు అత్యంతాసద్భావ మున్నది. నిత్యముక్తబ్రహ్మరూపముగా ఆత్మ యున్నాడు, ఆయనకు మోక్షము సంభవించుట లేదు; అనునిది యుత్తమభూమి కారూఢులగు విద్వాంసులయొక్క నిశ్చయమై యున్నది.

210—216. వేదాంతసిద్ధాంతముయొక్క నానాప్రక్రియా తాత్ప ర్యము.

### 210. సకలాద్వైతగ్రంథములయొక్క తాత్పర్యవిషయము.

నిత్యముక్తాత్మస్వరూపముయొక్క జ్ఞానముచేత దుఃఖపరిహార సుఖప్రాప్తి నిమిత్తము అనేకవిధకర్తవ్యమగు బుద్ధిజన్యక్లేశమునకు నివృత్తియె వేదాంత శ్రవణఫలమై యున్నది. ఆత్మస్వరూపమునందు బంధమునకు నాశరూప-లేశ-పరమానందప్రాప్తిరూప మోక్షము వేదాంతశ్రవణమునకు ఫలము కాదు. వేదాంతశ్రవణమునకు పూర్వమునందు కూడ ఆత్మయందు బంధలేశము లేదు. తథాపి, అత్యంతాసద్బంధమునకు ప్రతీతి యున్నది. అందువలన భ్రమచేతనే వేదాంతశ్రవణమునందు ప్రవృత్తి కలుగుచున్నది. ఎవరికి బంధభ్రమ లేదో వారికి ఆవృత్తి కలుగుటలేదు. సకలాద్వైతశాస్త్రములకును ఈపక్షము నందె తాత్పర్య మున్నది.

### 211. జీవేశ్వరులయందు సర్వగ్రంథకారులయొక్క సమ్మతియొక్క ఏకత్వనిర్ణయము.

ఈరీతిగా జీవేశ్వరులయొక్క స్వరూపనిరూపణము గ్రంథకారులచేత బహువిస్తరముగా వ్రాయబడినది. అచ్చట జీవునియొక్క స్వరూపమునందు ఏకత్వానేకత్వములకు వివాద మున్నది. మఱియును, సర్వమతమునందును ఈశ్వరు డొక్కడై సర్వజ్ఞుడై, నిత్యముక్తుడై యున్నాడు. ఈశ్వరునియం దావరణాంగీకారము అద్వైతగ్రంథమునందు లేదు. ఈశ్వరునియందు ఆవరణమును ఎవడు చెప్పునో వాడు వేదాంతసంప్రదాయముకంటె బహిర్భూతుడై యున్నాడు. అయిన నానాజ్ఞానవాదమునందు జీవాశ్రితమును బ్రహ్మవిషయక మైనదియు నైయజ్ఞాన మున్నది; అనునిది వాచస్పతియొక్క మతమై యున్నది. అచ్చట జీవునియొక్క యజ్ఞానముచేత కల్పితుడగు నీశ్వరుడును, ప్రపంచమును, అనేకముగా నంగీకరింపబడియున్నవి. తథాపి, జీవునియొక్క యజ్ఞానముచేత కల్పితుడగు నీశ్వరుడుకూడ సర్వజ్ఞుడయియే యంగీకరింపబడినాడు. ఈశ్వనిరునియందు ఆవరణాంగీకారము లేదు.

### 212. వివరణకారరీతిగా ప్రతిబింబముయొక్క స్వరూపనిరూపణము.

జీవేశ్వరులయొక్క స్వరూపనిరూపణమునందు ప్రతిబింబముయొక్క స్వరూపము నిరూపింపబడియున్నది. వివరణాకారమతమునందు దర్పణాద్యుపాధిచేత ప్రతిహత నేత్రముయొక్క రశ్మిగ్రీవాస్థముఖమును విషయీకరించుచున్నది. ఎచ్చట ద్రష్టకంటె భిన్నపదార్థమునకును, దర్పణముతో నభిముఖతారూప

సంబంధ మున్నదో అచ్చట దర్పణముతో సంబంధియగు ప్రతిహతనేత్రమునకు ద్రష్టకంటె భిన్నమైనను దర్పణాభిముఖపదార్థముతో సంబంధము కలిగి స్వస్థానమునందె దానియొక్క సాక్షాత్కారము కలుగుచున్నది. ఎచ్చట ననేకపదార్థములు దర్పణాభిముఖములయి యున్నవో అచ్చట ప్రతిహతనేత్రముచే అనేకపదార్థములయొక్క సాక్షాత్కారము కలుగుచున్నది. దర్పణాభిముఖమయ్యును ఉద్భూతరూపసహితమయ్యును అయి యేది యున్నదో దానియందు ప్రతిహతనేత్రజన్య సాక్షాత్కారమును, యోగ్యతయును, ఉన్నవి. అందువలన దర్పణాభిముఖపదార్థమునకు సమ్ముఖనేత్రముయొక్క వృత్తి పోవుచున్నది. స్వగోళకమునందే నేత్రముయొక్క వృత్తివస్తువు ఉన్నది, అని నియమము లేదు. ఈరీతిగా వివరణకార మతమునందు గ్రీవాస్థముఖముయొక్కయే సాక్షాత్కారము కలుగుచున్నది. అయిన పూర్వాభిముఖ గ్రీవాస్థముఖమునందు ప్రత్యఙ్ముఖత్వదర్పణస్థత్వ స్వభిన్నత్వములయొక్క భ్రమ కలుగుచున్నది. అందువలన దర్పణమునందు పూర్వాభిముఖ ప్రతిబింబ మున్నది, అనియును నాముఖముకంటె భిన్నమనియును వ్యవహారము కలుగుచున్నది.

ఈపక్షమునందొకశంక. బింబభూత ముఖాదికముయొక్కయే ప్రతిహత నేత్రముచేత సాక్షాత్కారము కలిగినయెడల సూర్యునియొక్క ప్రకాశముచేత నేత్రమునకు ప్రతిరోధ మున్నది. అందువలన జలముచేత, ప్రతిహత నేత్రము చేతను, సూర్యునియొక్క సాక్షాత్కారమునకు అసంభవ ముండుటవలన, జలదేశమునందు సూర్యునికంటె భిన్నత్వమునకును, ప్రతిబింబమునకును, ఉత్పత్తి యంగీకరింపవలయును. మఱియును బింబసాక్షాత్కారముకొఱకు నుపాధితో సంబంధియగు నేత్రరశ్మికి ప్రతిహతిని అంగీరించినయెడల జలాంతర్గతాదిత్యుని యొక్క సాక్షాత్కారము కాకపోవలయును. ఈ రెండుశంకలకును సమాధానము. కేవలనేత్రమునకు ఆకాశస్థ సూర్యునియొక్క ప్రకాశముచేత అవరోధమున్నది. జలాద్యుపాధిచేత ప్రతిహతనేత్రమునకు సూర్యప్రకాశముచేత అవరోధము కలుగుటలేదు. ఈలాగున నేకొంత నేత్రరశ్మి జలప్రవిష్టమై తదంతర్గత సైకతమును విషయీకరించుచున్నదో ఆనేత్రముయొక్క యన్యరశ్మి ప్రతిహతమై బింబమును విషయీకరించుచున్నది. ఇది దృష్టానుసారమైన కల్పనమై యున్నది. అందువలన బింబమునకు భిన్నమగు ప్రతిబింబము లేదు, అనునిది వివరణకారమతమై యున్నది.

**213. విద్యారణ్యస్వాములయొక్కయు వివరణకారులయొక్కయు మతమునకు వైలక్షణ్యము.**

విద్యారణ్యస్వామిమొదలైనవారిచేత పారమార్థిక, వ్యావహారిక, ప్రాతిభాసికభేదముచేత త్రివిధజీవులు చెప్పబడినారు. వ్యావహారికాంతఃకరణమునందుండు ప్రతిబింబము వ్యావహారిక జీవు డనంబడును, స్వప్నావస్థయొక్క ప్రాతిభాసికాంతఃకరణమునందుండు ప్రతిబింబము ప్రాతిభాసిక జీవు డనంబడును. వివరణకారరీతిగా బింబముకంటె పృథక్ప్రతిబింబ మైనందున జీవునకు త్రివిధభేదము సంభవింపదు. అందువలన త్రివిధజీవవాదమునకు అనుసారియగు బింబప్రతిబింబములయొక్క భేదము అంగీకరింపబడియున్నది. ఆయనయొక్క మతమునందు దర్పణాద్యుపాధియందు అనిర్వచనీయ ప్రతిబింబముయొక్క యుత్పత్తియున్నది. ప్రతిబింబమునకు దర్పణాదికము అధిష్ఠానమై యున్నది. బింబముయొక్క సన్నిధానము నిమిత్తకారణమై యున్నది. యద్యపి నిమిత్తకారణముయొక్క యభావముచేత కార్యాభావము కలుగుట లేదు. బింబాపసరణముచేత ప్రతిబింబాభావము కలుగుచున్నది. తథాపి నిమిత్తకారణము ద్వివిధమై యున్నది. కొంత కార్యముకంటె అవ్యవహిత పూర్వకాలవృత్తియై నిమిత్తకారణ మగుచున్నది. కొంత కార్యకాలవృత్తియై నిమిత్తకారణ మగుచున్నది. ఘటాదికమునకు దండకులాలాదికము నిమిత్తకారణమై యున్నది. అది కార్యపూర్వకాలవృత్తిగా నంగీకరింపవలసినది. ఘటాదికముయొక్క సత్తి కలిగిన తరువాత దానియపేక్ష లేదు. ఈలాగుననే ప్రత్యక్షజ్ఞానమునందు స్వవిషయము నిమిత్తకారణమై యున్నది. అచ్చట విషయసత్త జ్ఞానకాలమునం దపేక్షితమై యున్నది. వినాశాభిముఖఘటముతో నేత్రసంయోగ ముండినను ఘటసాక్షాత్కారము కలుగుట లేదు. అందువలన జ్ఞానకాలమునందు వర్తమానఘటాదికమె తనయొక్క సాక్షాత్కారమునకు నిమిత్తకారణమై యును దూరస్థనానాపదార్థములయందు ఏకత్వభ్రమ కలుగుచున్నది. మందాంధకారస్థరజ్జువునందు సర్పభ్రమ కలుగుచున్నది. అందువలన నేకత్వభ్రమకు నిమిత్తకారణము దూరస్థత్వదోషమై యున్నది. రజ్జువునందు సర్పభ్రమకు నిమిత్తకారణము మందాంధకారమై యున్నది. దూరస్థత్వ మందాంధకారములకు అభావ ముండెడి యేకత్వభ్రమకును, సర్పభ్రమకును అభావ ముండుటవలన కార్యకాలమునందు వర్తమానమగు దూరస్థత్వమును, మందాంధకారమును, ఉక్తద్వివిధాధ్యాసములకును నిమిత్తకారణములై యున్నవి. అనురీతిగా బింబము

యొక్క సన్నిధానముకూడ కార్యకాలమునందు వర్తమానమయినయే ప్రతిబింబా ధ్యాసమునకు హేతువైనందున బింబాపసరణముచేత ప్రతిబింబాభావము సంభవించుచున్నది. అందువలన సన్నిహితబింబము ప్రతిబింబమునకు నిమిత్తకారణమై యున్నది. భ్రమాధిష్ఠానమౌ ఉపాదానకారణం బింబమును. అందువలన ప్రతిబింబమునకు నుపాదానకారణము దర్పణాదికమై యున్నది. వివరణకారమతము నందు ప్రతిబింబముయొక్క స్వరూపము బింబముకంటె భిన్నము కాదు. ఈయన దర్పణస్థత్వ, విపరీతదేశాభిముఖత్వ, బింబభిన్నత్వాదిధర్మములకు గ్రీవాస్థముఖము నందుత్పత్తి కలుగుచున్నది. ఆయాదుధర్మములును అనిర్వచనీయములై యున్నవి. నిమిత్తకారణము దానికి అధిష్ఠానరూపోపాదానకారణము గ్రీవాస్థముఖమును సన్నిహితదర్పణాదికమునై యున్నవి. ఈరీతిగా చేతనమునకు ప్రతిబింబవాదమునందు రెండుమతను లున్నవి. వివరణకారమతమునందు ప్రతిబింబమునకు బింబముతో నభేద ముండుటవలన ప్రతిబింబముయొక్క స్వరూపము సత్యమై యున్నది. విద్యారణ్యస్వామి మతమునందు దర్పణాదికమునందు అనిర్వచనీయముఖమునకు నుత్పత్తి యున్నది. ఇదె ఆభాసవాద మనంబడును. రెండుపక్షములకు పరస్పరఖండనము స్వపక్షముయొక్క మండనము పెద్దగ్రంథములయందు స్పష్టమై యున్నవి. విస్తరభయముచే నిచట వ్రాయబడలేదు.

## 214. రెండుపక్షములకును ఉపాదేయత.

ప్రతిబింబవాదమునందును, లేక, ఆభాసవాదమునందును, అభినివేశము లేదు, చేతనమునందు సంసారధర్మమునకు సంభవము లేదు. జీవేశ్వరులకు పరస్పరభేదము లేదు. ఈ యర్థబోధముకొఱకు అనేకప్రకారములు చెప్పబడినవి. ఏ పక్షముచేత నసంగబ్రహ్మాత్మబోధ మగుచున్నదో ఆపక్షము ఆదరణీయ మగుచున్నది.

## 215. బింబప్రతిబింబములకు అభేదపక్షముయొక్క ప్రకారమునకు అభేదబోధమునందు సుగమత.

తథాపి, బింబప్రతిబింబములయొక్క యభేదపక్షప్రకారముచేత నసంగబ్రహ్మాత్మబోధము అనాయాసముగా గలుగుచున్నది. ఎట్లన దర్పణాదికమునందు ముఖాదికముయొక్క లౌకికప్రతిబింబ మున్నది. అచ్చటను బింబస్వరూపమైననో సదా ఏకరసమై యున్నది. ఉపాధిసన్నిధానముచే బింబప్రతిబింబములయొక్క భేదభ్రమ కలుగుచున్నది. ఈలాగుననే బ్రహ్మచేతనము సదా ఏకరసమై యు

న్నది. అజ్ఞానాద్యుపాధియొక్క సంబంధముచేత జీవభావేశ్వరభావములయొక్క ప్రతీతిరూపభ్రమ మగుచున్నది. ఈరీతిగా నసంగచేతనమునందు జీవేశభేదములకు సర్వథా యభావ మున్నది. జీవత్వేశ్వరత్వధర్మములయిననో పరస్పరభిన్నములై కల్పితములై యున్నవి. ధర్మి పరస్పరభిన్న మైనదియు, కల్పిత మైనదియును కాదు. అందువలన బింబప్రతిబింబములకు అభేదవాదమె అద్వైతమతమునకు నత్యంతానుకూలమై యున్నది.

## 216—237. ప్రతిబింబమునందు విచారము.

### 216. ఆభాసవాదమునకు ప్రతిబింబవాదముతో కించిద్భేదము.

ఆభాసవాదమునందు ఎట్లు అనిర్వచనీయప్రతిబింబ మున్నదో దానికి అధిష్ఠానమై యున్నదో ఈలాగుననే వివరణోక్త ప్రతిబింబవాదమునందు దర్పణస్థత్వ, విపరీతదేశాభిముఖత్వాది ధర్మములు అనిర్వచనీయములై యున్నవి. వానికి నధిష్ఠానము ముఖాదిబింబమై యున్నది. అందువలన రెండుపక్షముల యందును, అనిర్వచనీయమునకు పరిణామ్యుపాదానము అజ్ఞానముగా చెప్పవలసినది.

### 217. ప్రతిబింబమునకు ఛాయారూపత్వ నిషేధము.

మఱియును, కొందఱు గ్రంథకారులు ఛాయను ప్రతిబింబముగా నంగీకరించినారు. అది సంభవించుటలేదు. ఎట్లన శరీరవృక్షాదికముతో నెంతదేశమునందు నాలోకమునకు నవరోధ మున్నదో అంతదేశమునందు ఆలోకవిరోధియగు నంధకార ముత్పన్నమగుచున్నది. ఆయంధకారము ఛాయ యనంబడును. అంధకారమునకు నీలరూప ముండుటవలన ఛాయకును నియమముగా నీల రూపము ఉన్నది. స్ఫటిక మౌక్తికములయొక్క ప్రతిబింబము శ్వేతమై యున్నది. సువర్ణప్రతిబింబము పీతరూపసహితమై యున్నది. రక్తమాణిక్య ప్రతిబింబమునందు రక్తరూప మున్నది. ప్రతిబింబమును ఛాయారూపముగా నంగీకరించినయెడల సకల ప్రతిబింబములకును నీలరూపము కావలయును. అందువలన ప్రతిబింబము ఛాయారూపము కాదు.

### 218. ప్రతిబింబమునకు బింబముతో భిన్న మగు వ్యావహారికద్రవ్యరూపతానిషేధము.

ఒకానొకడు శంకించున దేమనగా, యద్యపి, అంధకారస్వరూపచ్ఛాయతో ప్రతిబింబమునకు భేద మున్నది. తథాపి మీమాంసకమతమునందు ఎట్లు ఆ

లోకాభావము అంధకారముగా నంగీకరింపబడ లేదో అయినను ఆలోకవిరోధి యయి భావరూపమై యంధకార మున్నది. దానియందు క్రియ యుండుటవలనను నీలరూప ముండుటవలనను అంధకారము ద్రవ్యమై యున్నది. క్రియయును, గుణమును ద్రవ్యమునందే యున్నవి. ఎట్లు ఆ యంధకారము దశమద్రవ్యమై యున్నదో, అట్లు ప్రతిబింబమును, పృథివీజలాదికములకంటె భిన్నద్రవ్యమై యున్నది. ఈరీతిగా ప్రతిబింబమును స్వతంత్రద్రవ్యముగా నంగీకరించువానిని అడుగవలసిన దేమనగా, ఆప్రతిబింబము నిత్యద్రవ్యమై యున్నదా? లేక అనిత్యద్రవ్యమై యున్నదా? నిత్యద్రవ్యమై యుండినయెడల ఆకాశాదికమునవలె ఉత్పత్తినాశహీన మైనందున ప్రతిబింబమునకు నుత్పత్తినాశప్రతీతి కాకపోవలయును. అందువలన ప్రతిబింబమును అనిత్యద్రవ్యమునుగా జెప్పినయెడల ఉపాదానదేశమునందు కార్యద్రవ్య మున్నది. అందువలన ప్రతిబింబమునకు నుపాదాన కారణము దర్పణాదిక మని యంగీకరించిన యెడల దర్పణాదికములకు ప్రతిబింబముయొక్క యుపాదానత్వ మంగీకరించుట లేదు. ఎట్లన, దర్పణాద్యుపాదానమునందు రూపహ్రస్వదీర్ఘాదికమగు పరిణామస్వరూపమగు గుణము యవ్యాప్తి యున్నది. తథాపి బింబముకంటె విపరీతాభిముఖత్వాది ధర్మము లున్నవి. మఱియును హస్తపాదాద్యవయవములు ప్రతిబింబమునందు ప్రతీత మగుచున్నవి. అవి ప్రతిబింబమునందు వ్యావహారికములై యున్నవి. అయిన మిథ్యా ప్రతీతమగుచున్నవి. రూపపరిణామాదికమునకు ప్రతిబింబమునందు వ్యావహారికాభావమును అంగీకరించి ప్రతిబింబముయొక్క యుపాధికమును ప్రాతిభాసికముగా నంగీకరించినయెడల వ్యావహారికద్రవ్య స్వరూప ప్రతిబింబమునకు అంగీకారము నిష్ఫలమై యున్నది. మఱియును ప్రతిబింబమునకు రూప పరిమాణాదికమును వ్యావహారికముగా నంగీకరించినయెడల అల్పపరిమాణసహిత దర్పణమునందు మహాపరిమాణసహితానేక ప్రతిబింబములకు నుత్పత్తి సంభవించుట లేదు. మఱియును ప్రతిబింబ మిథ్యాత్వమునందు శరీరముయొక్క మధ్యసంకుచితదేశమునందు స్వప్నముయొక్క మిథ్యాహస్త్యాదికమునకు ఉత్పత్తి యుండుటవలన ఉక్తదోషమునకు సంభవము లేదు. ఈలాగుననే ప్రతిబింబమును వ్యావహారికద్రవ్యమునుగా జెప్పినయెడల ఏకవిధరూపసహిత దర్పణమునందు దర్పణముయొక్క సమానరూపసహిత ప్రతిబింబమునకు ఉత్పత్తి కావలయును. మఱియును అనేకరూపసహితానేక ప్రతిబింబములకు ఏకదర్పణమునం దుత్పత్తి యున్నది. ఏకరూపసహితోపాదానముచేత

అనేకవిధ రూపసహితానేకోపాదేయమునకు నుత్పత్తి సంభవించుట లేదు. దర్పణముయొక్క మధ్యమునందు, లేక, అతిసమీపమునందు అన్యపదార్థము ప్రతీత మగుట లేదు. ఎందుచేత ననగా, అనేకవిధ రూపసహిత ప్రతిబింబమునకు నుత్పత్తి సంభవించుచున్నదో అందువలన ప్రతిబింబమునకు వ్యావహారిక ద్రవ్య రూపమును జెప్పుట సంభవింపదు. ఏమనగా, దర్పణముయొక్క యతిసమీప మునం దైన ప్రతిబింబముయొక్క యేయుపాదానము సంభవించుట లేదు. దర్పణమే ఉపాదాన మైనయెడల అదియును సంభవించుట లేదు. ఎట్లన, పద ఘనావ్య వహిత పూర్వమువలె అవికారి ప్రతీత మైనందున దర్పణమునందు నిమ్నోన్నత ప్రాస్వాద్యనేకవిధావయవసహితద్రవ్యాంతరరూప ప్రతిబింబమునకు నుత్పత్తిని జెప్పుట సర్వదా యుక్తిహీనమై యున్నది. అందువలన బింబముకంటె పృథగ్భూత మగు వ్యావహారిక ద్రవ్యస్వరూపము ప్రతిబింబమై యున్నది, అను నీపక్షము ఛాయావాదిమతమువలె నసంగతమై యున్నది.

219. ఆభాసవాదమునకును, ప్రతిబింబవాదమునకును, యుక్తిసహితత్వమును జెప్పి రెండుపక్షములయందును అజ్ఞానమునకు నుపాదానత్వము.

ఈరీతిగా సన్నిహితదర్పణాదికముచేత ముఖాద్యధిష్ఠానమునందు ప్రతిబింబత్వాద్యనిర్వచనీయధర్మములు ప్రతీత మగుచున్నవి. అథవా సన్నిహిత ముఖాదులచేత దర్పణాద్యధిష్ఠానమునందు అనిర్వచనీయప్రతిబింబ ముత్పన్న మగుచున్నది. ఈ రెండుపక్షములె యుక్తిసహితములై యున్నవి. అందువలన ననిర్వచనీయ ధర్మములకు, లేక, అనిర్వచనీయ ప్రతిబింబమునకు ఉపాదాన కారణము చెప్పవలసినది.

220. మూలాజ్ఞానమునకును, లేక, తూలాజ్ఞానమునకును, ప్రతిబింబముయొక్కయు లేక దానిధర్మముయొక్కయు ఉపాదానత్వ సంభవవిషయకశంక.

అచ్చట జగత్తునకు సాధారణకారణ మగు మూలాజ్ఞానమె ప్రతిబింబత్వాదిధర్మములకును లేక ధర్మికిని ఉపాదానకారణముగా జెప్పినయెడల ఆకాశాదికమువలె మూలాజ్ఞానకార్య ముండుటవలన ప్రతిబింబత్వాదిధర్మము, లేక, ధర్మి యగు ప్రతిబింబమును, సత్యము కావలయును. మఱియును ఉక్తరీతిగా అనిర్వచనీయముగా నంగీకరింపబడియున్నవి, అందువలన మూలాజ్ఞానమునకు

వనిర్వచనీయోపాదానత్వము సంభవించుటలేదు. ఈలాగుననే వివరణకారుల మతమునందు ముఖావచ్ఛిన్న చేతనస్థాజ్ఞానము ప్రతిబింబత్వాదిధర్మములకు నుపాదానముగా సంగీకరింపబడినది. విద్యారణ్యస్వామి మొదలగువారి మతమునందు దర్పణావచ్ఛిన్న చేతనస్థాజ్ఞానము ప్రతిబింబమునకు నుపాదానముగా నంగీకరించినయెడల అవస్థారూపమగు నజ్ఞానకార్యమునకు ననిర్వచనీయత్వముండుటవలన సత్యతాపత్తి యద్యపి సంభవించుట లేదు. తథాపి, అధిష్ఠానజ్ఞానముచేత ననిర్వచనీయమునకు నివృత్తి యున్నది. మఱియును ప్రతిబింబాధ్యాసమునకు అధిష్ఠానము ఉక్తరీతిగా ముఖావచ్ఛిన్న చేతనము, లేక, దర్పణావచ్ఛిన్న చేతనమై యున్నది. ముఖముయొక్క లేక దర్పణముయొక్క జ్ఞానమె అధిష్ఠానజ్ఞానమై యున్నది. తదుత్తరకాలమందును ప్రతిబింబముయొక్క ప్రతీతి సర్వానుభవ సిద్ధమై యున్నది. అందువలన ముఖావచ్ఛిన్న చేతనమునకు, లేక, దర్పణావచ్ఛిన్న చేతనమునకు ఆవరకమగు నవస్థాజ్ఞానమె ప్రతిబింబాధ్యాసమునకు నుపాదానముగా సంభవించుట లేదు.

221. ఉక్తశంకకు కొందఱు గ్రంథకారులరీతిగా సమాధానము.

ఈస్థానమునందు కొందఱు గ్రంథకారులు ఈరీతిగా సమాధానము చెప్పుచున్నారు. యద్యపి శుక్తిరజతాద్యధ్యాసమునందు నధిష్ఠానముయొక్క విశేషజ్ఞానముచేత ఆవరణశక్తిరూపమయ్యును, విక్షేపశక్తిరూపమయ్యును ఉండెడి యజ్ఞానముయొక్క రెండంశములకు నివృత్తి కలుగుచున్నది. తథాపి అనుభవానుసారముగా ప్రతిబింబాధ్యాసముయొక్క యధిష్ఠానజ్ఞానముచేత నజ్ఞానముయొక్క యావరణశక్త్యంశమునకే నివృత్తి కలుగుచున్నది. అందువలన నధిష్ఠానజ్ఞానముచేత ఆవరణశక్తి రూపాంశమునకు నివృత్తి యుండినను, ప్రతిబింబాదిరూప పదార్థముయొక్క జ్ఞానరూపవిక్షేపమునకు హేతువైన యజ్ఞానాంశము ఉండుటవలన అధిష్ఠానజ్ఞానోత్తరకాలమునందును ప్రతిబింబాదికము ప్రతీతమగుచున్నది. అందువలన నుపాధ్యవచ్ఛిన్న చేతనస్థ తూలాజ్ఞానముయొక్క కార్యము ప్రతిబింబాధ్యాసమై యున్నది; అను నీపక్షము సంభవించుచున్నది.

222. ఉక్తశంకకు అన్యగ్రంథకారరీతిగా సమాధానము.

అన్యగ్రంథకారులమతమే మనగా, దర్పణాదికమునకు నుపాదానమగు మూలాజ్ఞానమే ప్రతిబింబాధ్యాసమునకు నుపాదానమై యున్నది. అందువలన దర్పణాదివిషయకజ్ఞానము ముండినను ప్రతిబింబమునకు ప్రతీతి గలుగుచున్నది. బ్రహ్మ

జ్ఞానముచేత బ్రహ్మచేతనమునకు ఆవరకమగు నజ్ఞానమునకును దానియొక్క కార్యమునకును, నివృత్తి కలుగుచున్నది. దర్పణజ్ఞానముచేత దర్పణావచ్ఛిన్న చేతనమునకు నావరకమగు నజ్ఞానమునకు నివృత్తి యుండినను బ్రహ్మస్వరూపావరకాజ్ఞానమునకు నివృత్తి లేదు. బ్రహ్మాత్మస్వరూపమునకు ఆచ్ఛాదకమగు నజ్ఞానము మూలాజ్ఞాన మనంబడును. ఉపాధ్యవచ్ఛిన్న చేతనమునకు నావరకమగు నజ్ఞానము అవస్థాజ్ఞాన మనంబడును. మూలాజ్ఞానముకంటె తూలాజ్ఞానమునకు భేదమున్నది, లేక యభేద మున్నది. ఈవిచారము ఉత్తరత్ర వ్రాయబడును.

223. మూలాజ్ఞానమునకును, తూలాజ్ఞానమునకును భేదవిషయమునందు కించిద్విచారము.

యద్యపి మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసముయొక్క యుపాదానత్వమును అంగీకరించినయెడల దర్పణాదికమువలె వ్యావహారికమయియే ప్రతిబింబాదికమును కావలయును. మఱియును, బ్రహ్మజ్ఞానము లేకయే ప్రతిబింబత్వాది ధర్మమునందును, ప్రతిబింబమునందును, మిథ్యాత్వబుద్ధి యుండుటవలన ప్రాతిభాసికమై యున్నది. మూలాజ్ఞానమునకు ఉక్తాధ్యాసముయొక్క ఉపాదానత్వము నంగీకరించినయెడల ప్రాతిభాసికత్వము సంభవింపదు. తథాపి, బ్రహ్మజ్ఞానముచేత నివర్తనీయమగు నజ్ఞానముయొక్క కార్యము వ్యావహారిక మనంబడును. బ్రహ్మజ్ఞానము లేకయే నివర్తనీయమగు నజ్ఞానముయొక్క కార్యము ప్రాతిభాసికమై యున్నది. ఈరీతిగా వ్యావహారికప్రాతిభాసికములకు భేదమును జెప్పినయెడల ఉక్తశంక కలుగుచున్నది. అజ్ఞానముకంటె నతిరిక్తదోష జన్యము కాదు. ఇక నేమనగా కేవలాజ్ఞానజన్యమైనది యేదియో అది వ్యావహారిక మనంబడును. అజ్ఞానముకంటె నతిరిక్తదోష జన్యమేదియో అది ప్రాతిభాసిక మనంబడును. ఈరీతిగా వ్యావహారిక ప్రాతిభాసికములకు భేదము జెప్పినయెడల ఉక్తశంక సంభవింపదు. ఎట్లన, దర్పణాద్యుపాధితో ముఖాసంబంధము కలిగి బ్రహ్మచేతనస్థమూలాజ్ఞానముయొక్క ప్రతిబింబత్వాది ధర్మరూపమును పరిణామమగుచున్నది. ఈరీతిగా రెండుపక్షములయందును అధిష్ఠానము బ్రహ్మచేతనమై యున్నది.

224. ఆభాసవాద ప్రతిబింబవాదములయందు ధర్మియొక్క, లేక, ధర్మముయొక్క యధ్యాసోత్పత్తికి ఉపాదానము తూలాజ్ఞానము నంగీకరించి యధిష్ఠానములకు భేదము.

విద్యారణ్యస్వామి మతమునందు ప్రతిబింబమునకు నుత్పత్తి నంగీకరించిన

యెడల దర్పణాద్యవచ్ఛిన్న చేతనము, అధిష్ఠానమైయున్నది. మఱియును, దర్పణాద్యవచ్ఛిన్న చేతనస్థాజ్ఞానము ఉపాదానమై యున్నది. ఈలాగుననే వివరణకార మతమునందు ప్రతిబింబత్వాది ధర్మములకే ఉత్పత్తి యంగీకరింపబడినది. బింబావచ్ఛిన్న చేతనము అధిష్ఠానమై యున్నది. బింబావచ్ఛిన్న చేతనస్థాజ్ఞానము ఉపాదానమై యున్నది. ఈరీతిగా ధర్మాధ్యాసపక్షమునందును, ధర్మ్యధ్యాస పక్షమునందును, అధిష్ఠానమునకును, ఉపాదానమునకును, భేద మున్నది. ఆ యవస్థాజ్ఞానమునకు ఉక్తాధ్యాసోపాదానత్వము నంగీకరించి చెప్పబడినది.

225. రెండుపక్షములయందును మూలాజ్ఞానమునకు నుపాదానత్వమును, అంగీకరించినయెడల నధిష్ఠానమునకు భేదమును, మూలాజ్ఞానమునకు నుక్తాధ్యాసముయొక్క ఉపాదానతాయోగ్యత్వమును.

మూలాజ్ఞానమున కుపాదానత్వము నంగీకరించినయెడల రెండుమతముల యందును నధిష్ఠానమునకు భేదము సంభవించుట లేదు. మఱియును మూలాజ్ఞానమునకే ఉక్తాధ్యాసోపాదానత్వమును అంగీకరింపవలసినది. ఎట్లన, అవస్థాజ్ఞానమునకు నుక్తాధ్యాసోపాదానత్వము నంగీకరించినయెడల దర్పణాదిజ్ఞానముచేత లేక, ముఖాదిజ్ఞానముచేత అజ్ఞానముయొక్క యావరణశక్తికి నివృత్తి గలిగి విక్షేపశక్త్యంశమునకు స్థితిని నంగీకరించినయెడల బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మస్వరూపావరకమగు మూలాజ్ఞానాంశమే నష్టమగును. ఈలాగుననే శుక్త్యాదిజ్ఞానముచే శుక్త్యవచ్ఛిన్న చేతనములకు నానావరకమగు మూలాజ్ఞానాంశమె నష్టమగును. మఱియును, వ్యావహారిక ప్రాతిభాసికవిక్షేపమునకు హేతువగు ద్వివిధాజ్ఞానాంశమునకును శేష ముండుటవలన విదేహకైవల్యమునందును, వ్యావహారిక ప్రాతిభాసికవిక్షేపములకు సద్భావ ముండుటవలన సర్వసంసారమునకును అనుచ్ఛేద మగును. అందువలన నావరణహేతువగు నజ్ఞానాంశమునకు నివృత్తి గలిగి విక్షేపహేతువగు నజ్ఞానాంశమునకు శేషమును జెప్పుట సంభవింపదు.

226. మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసమును గుఱించి యుపాదానత్వవాదిమతము.

మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసమునుగుఱించి యుపాదానతావాది చెప్పున దేమనగా, ఆవరణహేతువగు నజ్ఞానాంశమునకు నివృత్తి గలిగి విక్షేపహేతువగు నజ్ఞానాంశమునకు శేషము స్వాభావికముగా నుండదు. ఇక నేమి

నగా, విక్షేపహేతువగు నజ్ఞానాంశముయొక్క నివృత్తికి ప్రతిబంధక మున్నది. అచ్చట విక్షేపమునకు హేతువగు నజ్ఞానాంశకమునకు శేష మున్నది. బ్రహ్మాజ్ఞానముచే నావరణహేతువగు నజ్ఞానాంశమునకు నివృత్తి యుండినను విక్షేపహేతువగు నజ్ఞానాంశముయొక్క నివృత్తియందు ప్రతిబంధకమగు ప్రారబ్ధకర్మ మున్నది. అంత కాలము విక్షేపహేతువగు నజ్ఞానాంశమునకు శేష మున్నది. ప్రారబ్ధరూపప్రతిబంధకాభావము గలిగినయెడల విక్షేపహేతువగు నజ్ఞానాంశమునకు నివృత్తి గలుగును. ఇంతమాత్రము భేద మున్నది. ఆవరకాజ్ఞానాంశమునకు నివృత్తి మహావాక్యజన్యాంతఃకరణముయొక్క ప్రమారూపవృత్తిచేత గలుగుచున్నది. ప్రారబ్ధబలముచేత నెంతకాలము జీవించియున్నాడో అంతపర్యంతము పూర్వవృత్తి యుండుట లేదు. మఱియును, విక్షేపనివృత్తికొఱకు మరణావ్యవహితపూర్వకాలమునందు మహావాక్యవిచారముయొక్క నిధానము విద్వాంసులకు లేదు. మరణమూర్ఛాకాలములయందు మహావాక్యవిచారసంభవముకూడ లేదు. అందువలన విక్షేపశక్తినాశమునకు హేతువగు తత్త్వజ్ఞానసంస్కారసహితచేతనమై యున్నది. ఆవరణశక్తినాశమునకు హేతువు తత్త్వజ్ఞానమై యున్నది. ఎట్లు మూలాజ్ఞానముయొక్క విక్షేపశక్తినివృత్తియందు ప్రారబ్ధకర్మము ప్రతిబంధకమై యున్నదో అట్లు ప్రతిబింబాధ్యాసమునందు విక్షేపశక్తినివృత్తిని గుఱించి ముఖాదిబింబముతో దర్పణాద్యుపాధియొక్క సంబంధమె ప్రతిబంధకమై యున్నది. దానియొక్క సద్భావమునందు ఆవరణశక్తియొక్క నివృత్తి యుండినను ప్రతిబింబాదివిక్షేపముయొక్క నివృత్తి గలుగుట లేదు. బింబోపాధులయొక్క సంబంధరూపప్రతిబంధమునకు నివృత్తి గలిగినయెడల విక్షేపమునకు నివృత్తి గలుగుచున్నది. శుక్తిరజతాద్యధ్యాస ముండినయెడల అచ్చట నావరణముయొక్క నాశానంతరము విక్షేపముయొక్క నివృత్తియందు ప్రతిబంధకాభావ ముండుట వలన విక్షేపశేష ముండుట లేదు. ఈరీతిగా విక్షేపనివృత్తియందు ప్రతిబంధకాభావసహితాధిష్ఠానజ్ఞానమునకు హేతుత్వ ముండుటవలన మోక్షదశయందు ప్రారబ్ధరూపప్రతిబంధకము లేనందున సంసారమునకు నవలంబము సంభవింపదు. అందువలన ఆవరణశక్తినాశోత్తరమునందును విక్షేపశక్తియొక్క సద్భావమును అంగీకరించినయెడల ఉక్తదోషము లేనందున అవస్థాజ్ఞానమునకును ప్రతిబింబాధ్యాసోపాదానత్వమును అంగీకరించుట యుక్తమై యున్నది.

227. ఉక్తమతమునకు నిషేధపూర్వకమూలాజ్ఞానమునకే ప్రతిబింబాధ్యాసమును గుఱించి యుపాదానత్వము.

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఎట్లన, ఎచ్చట దేవదత్తముఖము యొక్కయు, దర్పణాద్యుపాధియొక్కయు యథార్థసాక్షాత్కారము యజ్ఞదత్తునకు కలుగుచున్నది, తదుత్తరకాలమునందును దేవదత్తముఖమునకు దర్పణముతో సంబంధము గలిగి యజ్ఞదత్తునకు దేవదత్తముఖమునందు ప్రతిబింబత్వాదిధర్మాధ్యాసము వివరణకారమతమునందున్నది. ఈలాగుననే విద్యారణ్యస్వామి మతమునందు దేవదత్తముఖముయొక్క ప్రతిబింబాధ్యాసము దర్పణమునందున్నది, అను నియమము కాకపోవలయును. ఉక్తాధ్యాసనివృత్తియందు బింబోపాధులయొక్క సంబంధమే ప్రతిబంధకమై యున్నది. ముఖముయొక్క లేక దర్పణరూపాధిష్ఠానముయొక్క జ్ఞానకాలమునందును ఆప్రతిబంధకాభావముండుటవలన ప్రతిబంధకాభావసహితాధిష్ఠానమున్నది. వివరణకారమతమునందు దేవదత్తముఖమునకు దర్పణస్థత్వము ప్రత్యఙ్ముఖత్వాదికము లేదు, అనునిజ్ఞానము అధ్యాసమునకు విరోధమై యున్నది. విద్యారణ్యస్వామిమతమునందు 'దర్పణే దేవదత్తముఖం నాస్తి' యను నిజ్ఞానము ఉక్తాధ్యాసమునకు విరోధమై యున్నది. ఎట్లన రెండుమతములయందును క్రమముగా దేవదత్తముఖే దర్పణస్థత్వం ప్రత్యఙ్ముఖత్వం, దర్పణే దేవదత్తముఖం,' అనునిరీతిగా నధ్యాసముయొక్క యాకారమునకు భేదమున్నది. దానికి హేతువగు విక్షేపశక్తివిశిష్టాజ్ఞానాంశమునకు నివృత్తి యున్నది. అందువలన నుపాదానాభావముచేత ఉక్తస్థలమునందు యజ్ఞదత్తునకు దేవదత్తముఖముయొక్క ప్రతిబింబభ్రమము లేకపోవలయును. బ్రహ్మచేతనస్థమూలాజ్ఞానమునకే ప్రతిబింబాధ్యాసోపాదానత్వము నంగీకరించినయెడల ఉక్తోదాహరణమునందు దేవదత్తుని ముఖముయొక్కయు దర్పణముయొక్కయు జ్ఞానముండినను బ్రహ్మరూపాధిష్ఠానజ్ఞానము లేనందున ఉపాదానముండుటవలన ఉక్తాధ్యాసము సంభవించుచున్నది. అందువలన మూలాజ్ఞానమే ప్రతిబింబాధ్యాసమునకు నుపాదానమై యున్నదను నిపక్షమే సమీచీనమై యున్నది.

228. మూలాజ్ఞానమునకు నుపాదానతాపక్షమునందు శంక.

అయినను, ఈపక్షమునం దొకశంక యున్నది. బ్రహ్మచేతనస్థ మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసోపాదానత్వమును అంగీకరించినయెడల బ్రహ్మజ్ఞానము లేక ప్రతిబింబభ్రమమునకు నివృత్తి లేకపోవలయును. ఎట్లన, అధిష్ఠానముయొక్క యథార్థజ్ఞానముచేత అజ్ఞానముయొక్క నివృత్తిద్వారా భ్రమమునకు నివృత్తి గలుగుచున్నది. ప్రతిబింబాధ్యాసమున కధిష్ఠానము ఉక్తపక్షమునందు

బ్రహ్మచేతనమై యున్నది. దర్పణావచ్ఛిన్నచేతనము, లేక, ముఖావచ్ఛిన్నచేతనము, అధిష్ఠానము కాదు. ముఖదర్పణాదిజ్ఞానముచేత మూలాజ్ఞానమునకు నివృత్తిని అంగీకరించినయెడల ఉపాదాననాశముచేత ముఖదర్పణాది వ్యావహారిక పదార్థమునకును అభావము కావలయును. అందువలన మూలాజ్ఞానమునకు నుపాదానత్వము నంగీకరించినయెడల ముఖాదికముతో బింబోపాధులయొక్క వియోగకాలమునందును ప్రతిబింబాధ్యాసమునకు నివృత్తి సంభవించుట లేదు.

229. ఉక్తశంకకు సమాధానము.

ఈశంకకు సమాధానమేమనగా, ఆవరణశక్తి, విక్షేపశక్తి, భేదము చేత నజ్ఞానమునకు రెండు అంశము లున్నవి. ప్రతిబంధకరహితాధిష్ఠానజ్ఞానముచే నశేషాజ్ఞానమునకును నివృత్తి యగును. ప్రారబ్ధకర్మరూపప్రతిబంధక ముండుటవలన బ్రహ్మరూపాధిష్ఠానజ్ఞాన ముండినను విక్షేపహేతు వగు నజ్ఞానాంశమునకు నివృత్తి గలుగుట లేదు. ఘటాద్యనాత్మ పదార్థగోచరజ్ఞాన ముండినయెడల దానిచేత నజ్ఞానమునకు నివృత్తి గలుగుట లేదు. అయిన ఎంతకాలము ఘటాది విషయకస్ఫురణ యున్నదో అంతకాలము అంధకారముచే నావృతమగు గృహముయొక్క యేకదేశమునందు ప్రభాప్రకాశముచేత అంధకారసంకోచమువలె అజ్ఞానజన్యావరణమునకు సంకోచ మగుచున్నది. ఈలాగుననే ముఖదర్పణాది సాక్షాత్కారముచేత బ్రహ్మాచ్ఛాదకమూలాజ్ఞానమునకు నివృత్తి యద్యపి కలుగుట లేదు. తథాపి అజ్ఞానజన్యప్రతిబింబాధ్యాసరూపవిక్షేపమునకు ముఖదర్పణాదిజ్ఞానముచే నుపాదానమునందు విలయరూపసంకోచము కలుగుచున్నది. ఉపాదానమునందు విలయమే కార్యముయొక్క సూక్ష్మావస్థ యనంబడును. ఈరీతిగా నధిష్ఠానజ్ఞానముయొక్క యభావముచేత అజ్ఞాననివృత్తి వినాగా ప్రతిబింబాధ్యాసమునకు బాధరూపనివృత్తి యద్యపి సంభవింపదు; తథాపి ముఖదర్పణాదిజ్ఞానముచేత ప్రతిబంధకాభావ ముండినయెడల కార్యమునకు నుపాదానమునందు విలయరూపనివృత్తి గలుగుచున్నది.

230. ఏకదేశరీతిగా బాధలక్షణము.

ఈరీతిగా సంసారదశయందు ప్రతిబింబాధ్యాసమునకు బాధ గలుగుట లేదని కొందఱేకదేశులమతమై యున్నది. ఈమతమునందు అభావనిశ్చయము బాధ యని చెప్పబడలేదు. ఎట్లన, "ముఖే దర్పణస్థత్వం, నాస్తి" "దర్పణే ముఖం నాస్తి" యనునీరీతిగా వివరణకార విద్యారణ్యస్వాములయొక్క మతభేదము

చేత నుభయవిధాధ్యాసముయొక్క యభావనిశ్చయము సర్వవిద్వాంసులకును అనుభవసిద్ధమై యున్నది. దానికి సంసారదశయందు బాధాభావమును జెప్పుట సంభవింపదు. బ్రహ్మజ్ఞానముచేత, లేక, ప్రతిబింబాధ్యాసమునకు బాధ యంగీకరింపబడలేదు. వారిమతమునందు కేవలాధిష్ఠానావశేషము బాధ యనంబడును. ప్రతిబింబాధ్యాసముయొక్క యభావనిశ్చయము ఉక్తరీతిగా నుండినను సంసారదశయందు అజ్ఞానమునకు సత్త యుండుటవలన కేవలాధిష్ఠానశేషము లేదు. ఇకనేమనగా అజ్ఞానవిశిష్టాధిష్ఠాన మున్నది. ఈరీతిగా ప్రతిబంధకరహితమును దర్పణాదిసాక్షాత్కారముచేత అధిష్ఠానజ్ఞానము లేక బాధరూపాజ్ఞాననివృత్త్యభావ ముండినను తనయొక్క యుపాదానమునందు విలయరూపకార్యమునకు సంకోచ మున్నది. ఉపాదానరూపముతో కార్యముయొక్క స్థితియే సూక్ష్మావస్థ యనంబడును.

**231. అనేకగ్రంథకారరీతిగా బాధలక్షణము బ్రహ్మజ్ఞానము లేకయె ప్రతిబింబాధ్యాసమునకు ఉపాధిసిద్ధి.**

అనేకగ్రంథకారమతమునందు బ్రహ్మజ్ఞానము లేక మూలాజ్ఞానము లేకయే మూలాజ్ఞానజన్యప్రతిబింబాధ్యాసమునకు బాధమగుచున్నది. ఇది వారియొక్క యభిప్రాయమై యున్నది. మిథ్యాత్వనిశ్చయము లేక యభావనిశ్చయము బాధ యనంబడును. ఇది సర్వగ్రంథకారులయొక్క నిష్కర్షమై యున్నది. అనేకస్థలములయందు మిథ్యాత్వనిశ్చయమును అభావనిశ్చయపదార్థమై యున్నది. అచ్చట అధిష్ఠానమాత్రము శేషమై యున్నది. అజ్ఞానము శేషము కాలేదు. ఈయభిప్రాయముచేత గ్రంథకారులచేత అధిష్ఠానమాత్రముయొక్క శేషము బాధకు లక్షణము కాదు. బాధకు ఇదె లక్షణమైనయెడల స్ఫటికమందు లౌహిత్యభ్రమాదిసోపాధికాధ్యాస మున్నది. అచ్చట అధిష్ఠానజ్ఞానముచేత ఉత్తరకాలమందును జపాకుసుమస్ఫటికములకు పరస్పరసంబంధరూప ప్రతిబంధక ముండుటవలన లౌహిత్యాధ్యాసమునకు నివృత్తి కలుగదు. ఈలాగునే విద్వాంసులకు ప్రారబ్ధకర్మరూప ప్రతిబంధక ముండుటవలన శరీరాదికమునకు నివృత్తి కలుగుట లేదు. అందువలన అజ్ఞానకార్యవిశిష్టాధిష్ఠానము రెండుస్థానములయందుండుటవలన కేవలాధిష్ఠానశేషముయొక్క యభావ ముండుటవలన బాధవ్యవహారము లేకపోవలయును. శ్వేతస్ఫటికసాక్షాత్కారముచేత లౌహిత్యాధ్యాసమునకు బాధ యున్నది. బ్రహ్మసాక్షాత్కారముచేత జీవన్ముక్తవిద్వాంసులకు సంసారబాధ యున్నది. ఈరీతిగా

విక్షేపరూపాధిష్ఠానమునందు బాధవ్యవహారము సకలగ్రంథకారులచేత వ్రాయ బడియున్నది. అచ్చట సత్యస్తపదార్థమునందు మిథ్యాత్వనిశ్చయము లేక యభావ నిశ్చయమే బాధస్వరూపముగా సంభవించుచున్నది. మఱియును ప్రతిబంధక రహితముఖదర్పణాదిజ్ఞానముచేత ముఖమునందు ప్రతిబింబత్వాది ధర్మము కును దర్పణమునందు ప్రతిబింబాది ధర్మికిని మిథ్యాత్వనిశ్చయ మున్నది. ఈ లాగుననే అభావనిశ్చయమును ఉన్నది. అందువలన బ్రహ్మజ్ఞానమువినా ప్రతిబింబా ధ్యాసమునకు బాధ యగుట లేదు; అను నీకథన మసంగతమై యున్నది.

232. ముఖదర్పణాద్యధిష్ఠానజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసనివృత్తి హేతుత్వము.

ఎట్లు అధిష్ఠానజ్ఞానముచేత అధ్యాసమునకు బాధరూపనివృత్తి యగుచున్న దో అట్లు ముఖదర్పణాదియొక్క యపరోక్షజ్ఞానముచేతను ప్రతిబంధకరహిత కాలమునందు ప్రతిబింబాధ్యాసముయొక్క నివృత్తి యనుభవసిద్ధమై యున్నది. అందువలన ప్రతిబంధకాభావసహిత ముఖదర్పణాదిజ్ఞానముకూడ అధిష్ఠానమువలె అధ్యాసనివృత్తికి హేతువై యున్నది. ఈరీతిగా నంగీకరించుట యోగ్యమై యున్నది. ముఖదర్పణాదిజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాస నివృత్తికారణత్వము సం భావితము కూడ. ఎట్లన, సమానవిషయక జ్ఞానముచేత నజ్ఞానమునకు విరోధ మున్నది, భిన్నవిషయకజ్ఞానము అజ్ఞానమునకు విరోధము కాదు. అందు వలన ముఖదర్పణాదిజ్ఞానమునకు ముఖదర్పణాద్యవచ్ఛిన్నచేతనస్థావస్థాజ్ఞానము తోనె విరోధ మున్నది. బ్రహ్మాచ్ఛాదకమూలాజ్ఞానముతో బ్రహ్మజ్ఞానము తప్ప అన్యజ్ఞానమునకు విరోధము లేదు. అందువలన బ్రహ్మజ్ఞానవిరోధి యగు మూలా జ్ఞానముతో దర్పణాదిజ్ఞానమునకు విరోధము లేనందున ప్రతిబింబాధ్యాసమునకు ఉపాదాన మగు మూలాజ్ఞానమునకు యద్యపి కలుగుట లేదు. తథాపి, అజ్ఞాన నివృత్తి లేకుండ విరోధిజ్ఞానముచేత పూర్వజ్ఞానమునకు నివృత్తి యనుభవసిద్ధమై యున్నది.

233. ముఖదర్పణాదిజ్ఞానమునకు మూలాజ్ఞాననివృత్తి లేక ప్రతిబిం బాధ్యాసనాశకత్వము.

ఎచ్చట రజ్జుజ్ఞానముచేత సర్పభ్రమోత్తరమునందు దండభ్రమ గలుగు చున్నదో అచ్చట దండజ్ఞానముచేత సర్పోపాదానావస్థాజ్ఞానమునకు నివృత్తి కలుగుట లేదు. ఎట్లన అధిష్ఠానముయొక్క తత్త్వజ్ఞానముచేతనె అజ్ఞానమునకు

నివృత్తి గలుగుచున్నది. అందువలన రజ్జుజ్ఞానము లేకయే రజ్జుచేతన స్థాజ్ఞానము యొక్క నివృత్తి సంభవించుట లేదు. మఱియును దండభ్రమచేతనే రజ్జుచేతన స్థాజ్ఞానమునకు నివృత్తి కలిగినయెడల ఉపాదానముయొక్క యభావముచేత దండాధ్యాసముయొక్క స్వరూపముచేతనే సిద్ధము కాకపోవలయును. అందు వలన దండజ్ఞానముచేత అజ్ఞాననివృత్తి లేక యెట్లు సర్పాధ్యాసమునకును నివృత్తి కలుగుచున్నదో అట్లు 'ముఖే ప్రతిబింబత్వం నాస్తి, దర్పణే ముఖం నాస్తి' అను నీప్రకారముగా ముఖదర్పణములయొక్క జ్ఞానము ప్రతిబింబాధ్యాస మునకు విరోధి యైనందున దానిచేతను గూడ ప్రతిబింబాధ్యాసమునకు నివృత్తి కలుగుచున్నది. ప్రతిబింబాధ్యాసమునకు నుపాదానమగు మూలాజ్ఞానమునకు ఉక్తజ్ఞానముచేత నివృత్తి సంభవించుట లేదు. ఉక్తజ్ఞానముచేత మూలాజ్ఞానము నకు నివృత్తి చెప్పినయెడల మూలాజ్ఞానముయొక్క కార్యమగు ముఖదర్పణా దివ్యావహారికపదార్థముకూడ నష్టము కావలయును. అందువలన ముఖదర్పణాది జ్ఞానము విరోధివిషయక మైనందున అజ్ఞాననివృత్తి లేకయే ప్రతిబింబాధ్యాసము యొక్క నాశకత్వ మున్నది. భావాభావములకు పరస్పరవిరోధ మున్నది. అందు వలన వానియొక్క జ్ఞానముకూడ పరస్పరవిరోధియై యున్నది. ఎచ్చట స్థాణువు నందు స్థాణుత్వజ్ఞానోత్తరము పురుషత్వభ్రమ మున్నదో అచ్చట 'స్థాణుత్వం నాస్తి' యను నీవిరోధిభ్రమజ్ఞానముకంటె పూర్వమునందు ప్రమాజ్ఞానమునకు నివృత్తి యున్నది. ఘటసహితభూతలమునందు ఘటాభావభ్రమ జ్ఞానోత్తరమునందు ఘటముతో ఇంద్రియసంయోగము గలిగి 'ఘటవ ద్భూతలం' అనునీవిరోధిప్ర మాజ్ఞానమునకు పూర్వమునందు భ్రమజ్ఞానమునకు నివృత్తి గలుగుచున్నది. ఎచ్చట రజ్జువునందు సర్పభ్రమోత్తరదండభ్రమ మున్నదో అచ్చట దండభ్రమచేత సర్పభ్రమకు నివృత్తి కలుగుచున్నది. ఈరీతిగా ఒకప్పుడు భ్రమజ్ఞానముచేత ప్రమా జ్ఞానమునకు నివృత్తి, యొకప్పుడు ప్రమాజ్ఞానముచే భ్రమజ్ఞానమునకు నివృత్తి, ఒకప్పుడు భ్రమజ్ఞానముచే భ్రమజ్ఞానమునకు నివృత్తి యున్నవి. ఎచ్చట భ్రమ చేత ప్రమానివృత్తియును, భ్రమచేత భ్రమనివృత్తియును ఉన్నదో అచ్చట భ్రమోపాదానమగు నజ్ఞానముయొక్క సద్భావమునందే పూర్వజ్ఞానమునకు నివృత్తి యున్నది. ఎచ్చట ప్రమాజ్ఞానముచేత భ్రమమునకు నివృత్తి యున్నదో అచ్చట నధిష్ఠానముయొక్క యథార్థజ్ఞానప్రమ యుత్పన్నమగుటవలన అజ్ఞానసహితభ్ర మకు నివృత్తి గలుగుచున్నది. ఈప్రకారముగా నధిష్ఠానజ్ఞానము లేక మూలా

జ్ఞానమునకు నివృత్తి లేకపోయినను ముఖదర్పణాదిజ్ఞానముచేత ప్రతిబింబాధ్యాసమునకు నివృత్తి సంభవించుచున్నది.

విరోధిజ్ఞానముచేత పూర్వజ్ఞానమునకు నివృత్తి కలుగుచున్నది; అను నీ నియమ మున్నది. అధిష్ఠానముయొక్క యథార్థజ్ఞానముచేతనే పూర్వభ్రమకు నివృత్తి యగుచున్నది, అను నీనియమము లేదు. అందువలన నజ్ఞానముయొక్క నివృత్తి కేవలాధిష్ఠానముయొక్క విశేషప్రమచేత కలుగుచున్నది, అను నీనియమ మున్నది. వివరణకారమతమునందు 'ముఖే ప్రతిబింబత్వం, దర్పణస్థత్వం, ప్రత్యఙ్ముఖత్వం' అను నీయధ్యాస మున్నది. దానికి విరోధి 'ముఖే ప్రతిబింబత్వాదికం నాస్తి' అను నీజ్ఞాన మున్నది. మఱియును, విద్యారణ్యస్వామి మతమునందు 'దర్పణే ముఖం' అను నీయధ్యాసము కలుగుచున్నది. 'దర్పణే ముఖం నాస్తి' యను నీజ్ఞానము విరోధియై యున్నది. నైయాయికమతమునందును భావాభావములకు పరస్పరవిరోధము నంగీకరించి వానియొక్క జ్ఞానములకును, విషయవిరోధముచేత విరోధము అంగీకరింపబడియున్నది. ఈప్రకారముగా మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసోపాదానత్వము నంగీకరించినయెడల బింబోపాధులయొక్క సన్నిధానరూపప్రతిబంధకరహితకాలమునందు ముఖదర్పణాదిజ్ఞానముచేత అజ్ఞాననివృత్తి లేకపోయినను ఉక్తాధ్యాసమునకు నివృత్తి సంభవించుచున్నది.

234. ఉక్తపక్షమునందు పద్మపాదాచార్యకృత పంచపాదికారీతిగా తూలాజ్ఞానమునకు అధ్యాసహేతుత్వావాదియొక్క శంక.

ఈపక్షమునం దొకశంక. శారీరకభాష్యముయొక్క టీక యగు పంచపాదిక పద్మపాదాచార్యులచేత చేయబడినది. ఆయనకు భాష్యకారవచనానుసారముగా సర్వజ్ఞత్వ మున్నది. ఆసర్వజ్ఞవచనము పంచపాదికయం దిట్లు వ్రాయబడియున్నది. ఎచ్చట సర్పరజతాదిభ్రమ యున్నదో అచ్చట రజ్జుశుక్తిజ్ఞానముచేత సర్పరజతాదికమునకు నుపాదానమగు నజ్ఞానమునకు నివృత్తి గలుగుచున్నది; రజ్జుశుక్త్యాదికముయొక్క జ్ఞానమును సర్పరజతాదినివృత్తినిగుఱించి సాక్షాత్కారముగా నంగీకరించినయెడల ఉపాదానముయొక్క నాశనముచేత భావకార్యమునకు నాశము కలుగుచున్నది, అను నీ నియమమునకు హాని కలుగును. అధిష్ఠానజ్ఞానముచేత నజ్ఞానమునకు నాశన మగుచున్నది; అజ్ఞానముచేత నధ్యాసమునకు నాశ మగుచున్నది; అనురీతిగా నంగీకరించినయెడల ఉక్తనియమమునకు వ్యభి

చారము లేదు. యద్యపి అంధకారమువలె అజ్ఞానముకూడ భావరూపమై యున్నది. తథాపి, అజ్ఞాన మనాది యైనందున కార్యము కాదు. అందువలన నజ్ఞానమునకు నివృత్తి యధిష్ఠానజ్ఞానముచేతను సంభవించుచున్నది. అయిన భావకార్యమగు సర్వాద్యధ్యాసమునకు నివృత్తి యుపాదాననాశము లేక కలుగుట లేదు. ఘటధ్వంసముయొక్క నివృత్తియును వేదాంతమతమునం దున్నది. మఱియు నభావపదార్థమునకు నుపాదానకారణము లేదు. అందువలన నుపాదాననాశము లేకపోయినను ఘటధ్వంసరూపకార్యమునకు నాశ మున్నది. అయిన ఘటధ్వంసభావము కాదు. అందువలన నుపాదాననాశమునకు భావకార్యనాశమునందు నియతహేతుత్వముయొక్క సంరక్షణముకొఱకు పంచపాదికయందు అజ్ఞాననివృత్తిద్వారా అధిష్ఠానజ్ఞానమునకు అధ్యాసనివృత్తి హేతుత్వము చెప్పబడినది. అజ్ఞాననివృత్తిని త్యజించి అధిష్ఠానజ్ఞానమునకు అధ్యాసనివృత్తినిగుఱించి సాక్షాద్ధేతుత్వము నిషేధింపబడియున్నది. మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసోపాదనత్వమును అంగీకరించినయెడల ఉక్తరీతిగా నజ్ఞాననివృత్తి లేకయే ప్రతిబింబాధ్యాసమునకు నివృత్తి యంగీకరింపవలసినది. అందువలన పంచపాదికావచనముతో విరోధమగును. అవస్థాజ్ఞానమునకు ఉక్తాధ్యాసోపాదానత్వమును అంగీకరించినయెడల విరోధము లేదు. ఎట్లన, అవస్థాజ్ఞానమునకు ఉక్తాధ్యాసోపాదానత్వము చెప్పబడినది. ఆయనయొక్క మతమునందు వివరణకారరీతిగా ముఖావచ్ఛిన్నచేతనస్థాజ్ఞానమునకు ధర్మాధ్యాసోపాదానత్వము సిద్ధమగుచున్నది. విద్యారణ్యస్వామిరీతిగా దర్పణావచ్ఛిన్నచేతనస్థాజ్ఞానమువలన ధర్మ్యధ్యాసహేతుత్వము సిద్ధమగుచున్నది. ప్రతిబంధకరహితకాలమునందు ముఖజ్ఞానముచేత లేక దర్పణజ్ఞానముచేత ఆయజ్ఞానములకు క్రమముగా నివృత్తి కలుగుచున్నది. అజ్ఞాననివృత్తిద్వారా ప్రతిబింబాధ్యాసమునకు నివృత్తి కలుగుచున్నది. అందువలన నవస్థాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసోపాదానత్వమును అంగీకరించుట పంచపాదికావచనమునకు ననుకూలమై యున్నది. మూలాజ్ఞానమునకు ఉక్తాధ్యాసోపాదానత్వమును జెప్పుట పంచపాదికావచనమునకు విరుద్ధమై యున్నది. ఈరీతిగా నుక్తాధ్యాసహేతుత్వమును, అవస్థాజ్ఞానమున అంగీకరించినయెడల దానికి ఈపూర్వపక్షమై యున్నది.

### 235. ఉక్తశంకకు అయుక్తత.

అయిన నవస్థాజ్ఞానమునకు హేతుత్వమును అంగీకరించినను పంచపాదికా

వచనముతో విరోధపరిహారము కలుగుట లేదు. తథాహి, ఎచ్చట దర్పణసంబంధ రహితదేవదత్తముఖముయొక్క, లేక దేవదత్తముఖవియుక్తదర్పణముయొక్క సాక్షాత్కారము యజ్ఞదత్తునకు కలుగుచున్నదో మఱియును ఉత్తరక్షణము నందు దేవదత్తముఖమునకు దర్పణముతో సంబంధ మున్నదో అచ్చటను ప్రతిబింబాధ్యాసము గలుగుచున్నది. మూలాజ్ఞానమునకు ఉపాదానత్వము నంగీకరించినయెడల ముఖదర్పణాదిసాక్షాత్కారముచేత దానికి నివృత్తి లేకపోవలయును. ముఖజ్ఞానముచేత ముఖావచ్ఛిన్న చేతనస్థాజ్ఞానమునకును దర్పణజ్ఞానము చేత దర్పణావచ్ఛిన్న చేతనస్థాజ్ఞానమునకును నివృత్తి అవశ్యము అగుచున్నది. ముఖదర్పణ సాక్షాత్కారోత్తరకాలమునందును ముఖదర్పణసన్నిధానముచేత ప్రతిబింబాధ్యాసము కలుగుచున్నది. అందువలన ముఖదర్పణసాక్షాత్కారముచేత అవస్థాజ్ఞానముయొక్క యావరణశక్తి విశిష్టాజ్ఞానాంశమునకు నాశము లేనందున విక్షేపరూపముతో జ్ఞానాధిష్ఠానమునందును అధ్యాసము సంభవించుచున్నది. అచ్చట దర్పణముఖములకు పరస్పరవియోగ ముండి ప్రతిబంధకాభావసహితాధిష్ఠానముచేత నజ్ఞాననివృత్తిద్వారా అధ్యాసమునకు నివృత్తి చెప్పుట యవస్థాజ్ఞానవాదికిని సంభవించుట లేదు. ఇక నే మనగా జ్ఞానముచేత సాక్షాదధ్యాసమునకు నివృత్తి చెప్పుటయే సంభవించుచున్నది. ఎట్లన, రజ్జుజ్ఞానముచేత శుక్త్యజ్ఞానమునకు నాశము కలుగుట లేదు. అందువలన నజ్ఞానమాత్రమునకు నాశము కలుగుట లేదు. ఇక నే మనగా, సమానవిషయకాజ్ఞానమునకు జ్ఞానముచేత నాశమగుచున్నది. జ్ఞానముచేత దేనికి ప్రకాశ మున్నదో అది జ్ఞానమునకు విషయమనంబడును. అజ్ఞానముచేత ఏది ఆవరకమై యున్నదో అది అజ్ఞానవిషయ మనంబడును. యజ్ఞదత్తునకు నధ్యాసపూర్వకాలమునందు ఏదర్పణసాక్షాత్కారము కలిగి యున్నదో దానిచేత నావరణనాశ ముండుటవలన అజ్ఞానకృతావరణరూపాజ్ఞానముయొక్క విషయమునకు ముఖదర్పణములయం దభావ మున్నది. అందువలన జ్ఞానాజ్ఞానములకు విరోధసంపాదకమగు సమానవిషయకత్వమునకు భంగ ముండుటవలన నుక్తస్థలములయందు అజ్ఞాననివృత్తి లేక యధ్యాసమాత్రమునకు నివృత్తి అవస్థాజ్ఞానవాదికినిగూడ అంగీకారము కావలసినది. ఈరీతిగా నవస్థాజ్ఞానమునకు నధ్యాసోపాదానత్వమును అంగీకరించినను పంచపాదికావచనముతో విరోధపరిహారము కలుగుట లేదు.

236. తూలాజ్ఞానమునకు ఉక్తాధ్యాసహేతుత్వమును అంగీకరించిన యెడల పంచపాదికావచనముతో విరోధమును, మూలాజ్ఞానమునకు హేతుత్వమును అంగీకరించినయెడల అవిరోధమును.

మఱియును, సూక్ష్మరీతిగా విచారించినయెడల అవస్థాజ్ఞానమునకు నుక్తాధ్యాస హేతుత్వమును అంగీకరించినయెడల పంచపాదికావచనముతో విరోధ మగుచున్నది. మూలాజ్ఞానమునకు హేతుత్వము నంగీకరించినయెడల విరోధము లేదు. తథాహి, జ్ఞానముచేత కేవలాజ్ఞానమునకు నివృత్తి గలుగుచున్నది. అజ్ఞాన నిరూపాధ్యోపాదాన నివృత్తిచేత అజ్ఞానకార్యమునకు నివృత్తి యగుచున్నది. ఈరీతిగా పంచపాదికావచన మున్నది. దానికి నీయభిప్రాయము కాదు. భావకార్యముయొక్క నాశమునందు ఉపాదానముయొక్క నాశము నియతహేతువైనందున జ్ఞానముచేత నధ్యాసనివృత్తి సంభవించుట లేదు. ఎట్లన, ఉపాదాననాశము లేక భావకార్యనాశము గలుగనియెడల భావకార్యనాశమునందు ఉపాదాన నాశము నియతహేతు వగును. మఱియును భావకార్యము ద్వ్యణుకమై యున్నది. దాని కుపాదానము పరమాణువై యున్నది. దానికి నిత్యత యుండుట వలన నాశము సంభవించుట లేదు. అందువలన పరమాణుసంయోగనాశము చేత ద్వ్యణుకాదినాశము గలుగుచున్నది. అచ్చట భావకార్య నాశమునందు ఉపాదాననాశమునకు హేతుతానియమసంరక్షణాభిప్రాయముచేత పంచపాదికోక్తి కాదు. కేవలాగ్రహముతో పంచపాదికావచనమునకు నుక్తనియమ సంరక్షణమునందు అభిప్రాయము జెప్పినయెడల దండభ్రమముచేత సర్పాధ్యాసమునకు నివృత్తి కాకపోవలయును. మఱియును, నైయాయికమతమునందును ద్వ్యణుకభిన్నద్రవ్యముయొక్క నాశమునందు ఉపాదాననాశమునకు హేతుత్వ మంగీకరింపబడియున్నది. సకలభావకార్యనాశమునందు ఉపాదాననాశమునకు హేతుత్వము జెప్పినయెడల పరమాణువు మనస్సును నిత్యమై యున్నవి. వానియొక్క నాశము సంభవింపనందున వానియొక్క క్రియానాశము కలుగక పోవును. ఈలాగుననె నిత్యమగు నాత్మయొక్క జ్ఞానాదిగుణమునకు, నిత్యమగు నాకాశముయొక్క శబ్దాదిగుణమునకు నాశము లేకపోవలయును. అందువలన భావకార్యనాశమునందు ఉపాదాననాశము నియతహేతువై యున్నది, అనునీకథన మసంగతమై యున్నది. అయిన కొన్నిస్థలములయందు ఆశ్రయనాశము కలిగినయెడల కార్యమునకు స్థితి యుండదు. అచ్చట నుపాదాననాశముకూడ కార్య

నాశమునకు హేతువై యున్నది. తథాపి కార్యనాశమునందు నుపాదాననాశము నియతహేతువు కాదు. ఉపాదానముయొక్క సద్భావమునందు అన్యకారణము చేత కార్యమునకు నాశన మగుచున్నది. ఈరీతిగా నుక్తనియమసంరక్షణమం దభిప్రాయముచేత పంచపాదికోక్తి కాదు. అధిష్ఠానజ్ఞానముచేత నధ్యాసమునకు నివృత్తి కలిగినయెడల నచ్చట నధిష్ఠానజ్ఞానమునకు నధ్యాసనివృత్తియందు కారణత్వము లేదు. అధిష్ఠానజ్ఞానమైన అజ్ఞాననివృత్తికి కారణమై యున్నది. ఎట్లు కులాలజనకుడు ఘటమునందు అన్యథాసిద్ధుడైనందున కారణమై కాడో అట్లు అధ్యాసనివృత్తియందు అధిష్ఠానజ్ఞానము అన్యథాసిద్ధమైనందున కారణము కాదు. ఈరీతిగా నధిష్ఠానజ్ఞానముచేత నధ్యాసమునకు నివృత్తిగలిగినప్పుడు జ్ఞానముచేత నజ్ఞానమునకు నివృత్తి గలుగుచున్నది. అధ్యాసమునకు నివృత్తి ఉపాదానమగు నజ్ఞాననాశముచేత గలుగుచున్నది. ఇది పంచపాదికావచనాభిప్రాయము. సర్వత్ర అధ్యాసనివృత్తియందు నజ్ఞాననివృత్తికి హేతుత్వ మున్నది, అను నీయభిప్రాయము చేత పంచపాదికోక్తి యుండినయెడల దండభ్రమచేత నజ్ఞాననివృత్తి కానందున సర్పభ్రమకు నివృత్తి లేకపోవలయును. అందువలన నధిష్ఠానముయొక్క యథార్థజ్ఞానముచేత నధ్యాసనివృత్తి గలుగుచున్నది. అచ్చట నజ్ఞాననివృత్తియే యధ్యాసనివృత్తికి హేతువై యున్నది, అనునీనియమము పంచపాదికాగ్రంథమునందు వివక్షితమై యున్నది. మఱియును అవస్థాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసహేతుత్వమును అంగీకరించువాని మతమునందు ముఖదర్పణాదిజ్ఞానమే యధిష్ఠానమై యున్నది. దానిచేత నజ్ఞాననివృత్తిద్వారా అధ్యాసనివృత్త్యంగీకరణము పంచపాదికానుసారమై యున్నది. మఱియును యజ్ఞదత్తునకు పూర్వజ్ఞానముచేత నావరణనాశస్థలమునందు దేవదత్తముఖమునకు నుపాధిసన్నిధాన ముండినయెడల ప్రతిబింబాధ్యాసము గలుగుచున్నది. ఉపాధివియోగకాలమునందు నధిష్ఠానజ్ఞానముచేత నధ్యాసనివృత్తి గలుగుచున్నది. అచ్చట నజ్ఞాననివృత్తిద్వారా అధ్యాసమునకు నివృత్తి సంభవించుటలేదు. అధిష్ఠానజ్ఞానముచేత సాక్షాదధ్యాసమునకు నివృత్తి గలుగుచున్నది. అందువలన పంచపాదికతో విరుద్ధమై యున్నది. మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసోపాదానత్వమును, అంగీకరించినయెడల ముఖదర్పణాదిజ్ఞానముచేత ప్రతిబింబాధ్యాసమునకు నివృత్తి గలుగును. అచ్చట ముఖదర్పణాదికమునకు ఈపక్షమునందు నధిష్ఠానత్వము లేనందున అధ్యాసనివృత్తి అధిష్ఠానజ్ఞానజన్యము కాదు. ఇక నేమనగా విరోధివిషయకజ్ఞానమునకు

విరోధి యుండుటవలన ముఖదర్పణాదివిషయకజ్ఞానమునకు అధ్యాసనివర్తకత్వమున్నది. పంచపాదికయందు నధిష్ఠానజ్ఞానజన్యాధ్యాసనివృత్తియే యజ్ఞాననివృత్తిద్వారా వివక్షితమై యున్నది. అధిష్ఠానజ్ఞానము లేక ప్రకారాంతరముచే నధ్యాసనివృత్తియందజ్ఞాననివృత్తికి ద్వారత వివక్షితము కాదు. ఈరీతిగా మూలాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసోపాదానత్వమును అంగీకరించినయెడల ముఖదర్పణాదిజ్ఞానజన్యాధ్యాసనివృత్తి యధిష్ఠానజ్ఞానజన్యము కాదు. అవస్థాజ్ఞానమును ఉక్తాధ్యాసోపాదానమునుగా నంగీకరించినయెడల ముఖదర్పణాదిజ్ఞానజన్యమగు నధ్యాసనివృత్తి అధిష్ఠానజ్ఞానజన్యమై యున్నది. అధిష్ఠానముచేత నధ్యాసనివృత్తి గలిగినయెడల అది యజ్ఞాననివృత్తిద్వారానే గలుగుచున్నది; అని పంచపాదికయందు వివక్షితమై యున్నది. పూర్వజ్ఞాతాధిష్ఠానమునం దధ్యాసము గలిగి నివృత్తి గలిగినయెడల అచ్చట నుక్తరీతిగా నజ్ఞాననివృత్తిద్వారా అధ్యాసనివృత్తి సంభవింపదు. అందువలన నవస్థాజ్ఞానమునకు ప్రతిబింబాధ్యాసోపాదానత్వమును అంగీకరించినయెడల పంచపాదికావచనమునకు విరోధ మగును. మూలాజ్ఞానమునకు నుక్తాధ్యాసోపాదానత్వమును అంగీకరించినయెడల విరోధము లేదు.

237. ప్రతిబింబాధ్యాసమునకు వ్యావహారికత్వమును, ప్రాతిభాసికతా విచారపూర్వక స్వప్నాధ్యాసోపాదానముయొక్క విచారప్రతిజ్ఞ.

ఈరీతిగా నాకాశాదిప్రపంచమువలె మూలాజ్ఞానజన్యము ప్రతిబింబాధ్యాసమై యున్నది. అయిన ఏకదేశిరీతిగా బ్రహ్మజ్ఞానము లేక దానికి బాధరూపనివృత్తి గలుగనందున ప్రతిబింబాధ్యాసమునందు వ్యావహారికశంక యద్యపి యున్నది. తథాపి బింబోపాధులయొక్క సంబంధరూపాగంతుకదోషజన్యమై యున్నది. ఆకాశాది ప్రపంచకముయొక్క యధ్యాసము అవిద్యామాత్రజన్యమై యున్నది. అందువలన వ్యావహారికమై యున్నది. మఱియు ననంతరోక్తరీతిగా అధిష్ఠానజ్ఞానము లేక విరోధిజ్ఞానముచేత బాధరూపనివృత్తికి సంభవ ముండుట వలన సంసారదశయందు బాధ్యత్వరూపప్రాతిభాసికత్వము కూడ సంభవించుచున్నది. ఎట్లు ప్రతిబింబాధ్యాసమునందు మతభేదముచేత అవస్థాజ్ఞానమును, మూలాజ్ఞానమును ఉపాదానముగా జెప్పబడియున్నవో అట్లు స్వప్నాధ్యాసము కూడ కొందఱిమతమునందు అవస్థాజ్ఞానజన్యమై యున్నది. మతాంతరమునందు మూలాజ్ఞానజన్యమై యున్నది.

238—247. స్వమతమందు వివాదము.

238. తూలాజ్ఞానమునకు స్వప్నోపాదానత్వప్రకారము.

అవస్థాజ్ఞానమునకు స్వప్నోపాదానత్వము ఈరీతిగా జెప్పబడినది. అజ్ఞానముయొక్క యవస్థావిశేషము నిద్రయై యున్నది. ఎట్లన ఆవరణవిక్షేపశక్తియుక్తత్వము అజ్ఞానమునకు లక్షణమై యున్నది. స్వప్నకాలమునందు జాగ్రద్ద్రష్టృదృశ్యములకు ఆవరణము అనుభవసిద్ధమై యున్నది. దేవదత్తనామక బ్రాహ్మణజాతి జాగ్రత్కాలమునందుండు పితామహాది మరణోత్తరమునందు దాహశ్రాద్ధాదికమును జేసి ధనపుత్త్రాది సంపత్తుతో కూడినవాడై యుండును. తాను యజ్ఞదత్తనామకుడు క్షత్త్రియజాతి గలవాడై బాల్యావస్థావిశిష్టుడై అన్నవస్త్రాద్యలాభముచేత క్షుధాశీతములచే పీడితుడై స్వప్నపితృపితామహులయొక్క యంకమునందు రోదనము చేయుచు అనుభవించుచున్నాడు. అచ్చట జాగ్రత్కాలముయొక్క వ్యావహారిక ద్రష్టృదృశ్యములకు మూలాజ్ఞానముచేత నావరణమును జెప్పినయెడల జాగ్రత్కాలమందును వారికి ఆవరణము కావలయును. అన్యమగు నేయావరకము ప్రతీత మగుట లేదు. అందువలన స్వప్నకాలమునందు నిద్రయైయే ఆవరకమై యున్నది. స్వప్నపదార్థాకారపరిణామము కూడ నిద్రాసంబంధమై యున్నది. ఈరీతిగా నావరణవిక్షేపశక్తివిశిష్టము నిద్రయై యున్నది. అందువలన నజ్ఞానలక్షణము నిద్రయం దుండుటవలన అజ్ఞానముయొక్క యవస్థావిశేషము నిద్రయై యున్నది. అయిన అవస్థాజ్ఞానము సాదియై యున్నది. ఎట్లన మూలాజ్ఞానమే ఆగంతుకాకారవిశిష్టమై కించిదుపాధ్యవచ్ఛిన్నచేతనమునకు ఆవరణమును చేయుచున్నది. అది యవస్థాజ్ఞాన మనియును తూలాజ్ఞాన మనియును చెప్పబడును. ఈరీతిగా నాగంతుకాకారవిశిష్టమైనందున అవస్థాజ్ఞానము సాదియై యున్నది. దాని యుత్పత్తియందు నిమిత్తకారణము జాగ్రద్భోగమునకు హేతువగు కర్మయొక్క ఉదయమై యున్నది.మూలాజ్ఞానముయొక్కయే యాకారవిశేషమైనందున మూలాజ్ఞానము ఉపాదానకారణమై యున్నది. నిద్రారూపావస్థాజ్ఞానముచేత నావృతవ్యావహారికద్రష్టయందు ప్రాతిభాసికద్రష్ట యధ్యస్తుడై యున్నాడు. ఆ నిద్రచేత నావృతవ్యావహారిక దృశ్యమునందు ప్రాతిభాసిక దృశ్యము అధ్యస్తమై యున్నది. అందువలన ప్రాతిభాసిక ద్రష్టకు అధిష్ఠానము వ్యావహారికద్రష్టయై యున్నాడు. ప్రాతిభాసిక దృశ్యమునకు నధిష్ఠానము వ్యావహారికదృశ్యమై యున్నది. భోగాభిముఖకర్మ

ముండినపుడు జాగ్రత్త కలుగుచున్నది. ఆకాలమునందు బ్రహ్మజ్ఞానరహిత పురుషులకు కూడ వ్యావహారిక ద్రష్టృదృశ్యములయొక్క జ్ఞానమే యధిష్ఠానజ్ఞానమై యున్నది. దానిచేత నవస్థాజ్ఞానరూపోపాదానముయొక్క నివృత్తిద్వారా ప్రాతిభాసికద్రష్టృదృశ్యములకు నివృత్తి గలుగుచున్నది. వ్యావహారిక ద్రష్టయొక్క జ్ఞానముచేత ప్రాతిభాసికద్రష్టకును వ్యావహారికదృశ్యముయొక్క జ్ఞానముచేత ప్రాతిభాసికదృశ్యమునకును వృత్తి గలుగుచున్నది.

**239. ఉక్తపక్షమునందు శంక.**

ఈపక్షమునం దొకశంక. ఉక్తరీతిగా జాగ్రద్ద్రష్టకును స్వప్నద్రష్టకును, భేద మున్నది. అన్యద్రష్టచేత ననుభూతముయొక్క స్మృతి అన్యునకు కలిగిన యెడల దేవదత్తానుభూతముయొక్క స్మృతి యజ్ఞదత్తునకు కావలయును. అందువలన స్వప్నకాలమునందు అనుభూతప్రపంచముయొక్క స్మృతి జాగ్రత్కాలమునందు కలుగుచున్నది. ద్రష్టలకు భేదమును అంగీకరించినయెడల స్మృతి సంభవింపక పోవును.

**240. ఉక్తశంకకు సమాధానము.**

దానికి సమాధానము. యద్యపి అన్యానుభూతముయొక్క స్మృతి అన్యునకు కలుగుట లేదు, తథాపి స్వానుభూతముయొక్క స్మృతి తనకు కలుగుచున్నది. ఆలాగుననే స్వతాదాత్మ్యసహితునిచేత ననుభవించిన దానియొక్క యు స్మృతి తనకు కలుగుచున్నది. అందువలన దేవదత్త యజ్ఞదత్తులకు పరస్పర తాదాత్మ్యము లేదు. జాగ్రద్ద్రష్టయందు స్వప్నద్రష్టకు నధ్యస్తముండినందున ఆయనయందు ఆయనకు తాదాత్మ్య మున్నది. అధ్యస్తపదార్థమునకు నధిష్ఠానమునందు తాదాత్మ్యము కలుగుచున్నది. ఈరీతిగా జాగద్ద్రష్టయొక్క తాదాత్మ్యసహితుడు స్వప్నద్రష్టయై యున్నాడు. ఆయనచేత ననుభూతముయొక్క స్మృతి జాగ్రద్ద్రష్టకు కలుగుచున్నది. యజ్ఞదత్తునియందు దేవదత్తునియొక్క తాదాత్మ్యము లేనందున దేవదత్తానుభూతముయొక్క స్మృతికి యజ్ఞదత్తునియందు నాపత్తి లేదు. ఈరీతిగా స్వప్నాధ్యాసమునకు నుపాదానము నిద్రారూపావస్థాజ్ఞానమై యున్నది.

**241. వ్యావహారికమగు జీవునకును, జగత్తునకును, స్వాప్న, ప్రాతిభాసిక జీవులయొక్క యధిష్ఠానత.**

స్వప్నకాలమునందు దృశ్యమాత్రమునకు జ్ఞానముచేత నుత్పత్తి నంగీ

కరించి వ్యావహారిక జాగ్రత్కాలీనజీవుని ద్రష్టగా నంగీకరించినయెడల నది సంభవించుట లేదు. ఎట్లన, వ్యావహారిక జీవునియొక్క స్వరూపము నిద్రారూపాజ్ఞానముచేత ఆవృతమై యున్నది. అజ్ఞానావృత జీవునియొక్క సంబంధముచేత విషయాపరోక్షము గలుగుట లేదు. అందువలన స్వప్నప్రపంచముయొక్క యపరోక్షజ్ఞానమునకు అసంభవ మగును. అందువలన దృశ్యమువలె ద్రష్టయునుగూడ జీవునియందు నధ్యస్తుడై యున్నాడు. వాడు అనావృతుడై యున్నాడు. ఆయనయొక్క సంబంధముచేత ప్రాతిభాసిక దృశ్యముయొక్క యపరోక్షజ్ఞానము సంభవించుచున్నది. ఈరీతిగా, పారమార్థిక, వ్యావహారిక, ప్రాతిభాసికభేదముచేత జీవత్రివిధవాదిగ్రంథకారునిచేత స్వప్నమునకు నధిష్ఠానము వ్యావహారికజీవజగత్తు చెప్పబడినది. అయినను,

**242.** ఉక్తపక్షమునకు అయుక్తత, చేతనమునకు స్వప్నాధిష్ఠానత్వము.

ఈమత మయుక్తమై యున్నది. ఎట్లన, వ్యావహారికద్రష్టయుకూడ దృశ్యమువలె అనాత్మయైనందున జడమై యున్నాడు. అందువలన సత్తాస్ఫూర్తిప్రదానరూపాధిష్ఠానత వ్యావహారిక ద్రష్టృదృశ్యములయందు సంభవించుట లేదు. ఏమనగా, చేతనమునకు స్వప్నప్రపంచాధిష్ఠానత్వమును జెప్పుట యుచితమై యున్నది. అందువలన రజ్జుశుక్తులకు సర్పరూప్యాధిష్ఠానతావచనమునకు రజ్జ్వవచ్ఛిన్నచేతనాధిష్ఠానమునందు తాత్పర్యము చెప్పబడినది. అనేకగ్రంథములయందును చేతనమే స్వప్నప్రపంచాధిష్ఠానముగా జెప్పబడినది. అందువలన నహంకారావచ్ఛిన్నచేతనము స్వప్నాధిష్ఠానమై యున్న దని యీ రెండుమతములు సమీచీనములై యున్నవి.

**243.** అహంకారావచ్ఛిన్నచేతనమును, స్వప్నాధిష్ఠానముగా నంగీకరించి, తూలాజ్ఞానమునకు దానియొక్క యుపాదానత్వమును, జాగ్రద్బోధముచేత తన్నివృత్తియును.

దానినిగురించి యహంకారావచ్ఛిన్నచేతనమునకు నధిష్ఠానత్వము నంగీకరించినయెడల మూలాజ్ఞానముచేత దానికి నావరణము సంభవించుట లేదు. అందువలన నహంకారావచ్ఛిన్నమునకు నాచ్ఛాదకమగు నవస్థాజ్ఞానమే స్వప్నోపాదానముగా సంభవించుచున్నది. జాగ్రద్బోధముచేత బ్రహ్మాజ్ఞానములేక దానికి నివృత్తియును సంభవించుచున్నది.

244. అహంకారానవచ్ఛిన్న చేతనమును స్వప్నాధిష్ఠానముగా నంగీకరించి మూలాజ్ఞానమునకు దానియొక్క యుపాదానత్వమును, ఉపాదానమునందు విలయరూపనివృత్తియును.

అవిద్యయందు ప్రతిబింబచేతనము, లేక, బింబరూపేశ్వరచేతనము, అహంకారానవచ్ఛిన్న చేతనమై యున్నది. దానికి నధిష్ఠానతయం దైననో దానికి నాచ్ఛాదకమగు మూలాజ్ఞానమే స్వప్నోపాదానముగా నంగీకరింపవలసినది. జాగ్రద్బోధముచేత దానికి బాధరూపనివృత్తి గలుగుట లేదు. ఇక నేమనగా నుపాదానమునందు విలయరూప నివృత్తి స్వప్నమునకు జాగ్రత్తయందు కలుగుచున్నది

245. అహంకారానవచ్ఛిన్న చేతనమే అధిష్ఠానముగా నంగీకరించిన యెడల విరోధిజ్ఞానముచేత అజ్ఞానముయొక్క యేకవిక్షేపరూప శక్తియొక్క నాశాంగీకారము.

అథవా ప్రతిబింబాధ్యాసనిరూపణమునందు నుక్తరీతిగా జాగ్రద్బోధము విరోధిజ్ఞాన మైనందున స్వప్నాధ్యాసమునకు నివృత్తి చెప్పబడియున్నది. అయిన విరోధిజ్ఞానముచేత ఆవరణహేతు వగు నజ్ఞానాంశమునకు నివృత్తి గలుగుట లేదు. ఇక నేమనగా, విక్షేపహేతువగు నంశమునకు నివృత్తి గలుగుచున్నది. విరోధిజ్ఞానముచేత నశేషాజ్ఞానమునకు నివృత్తి జెప్పిన యెడల దండభ్రమచేత సర్పభ్రమ నివృత్తిస్థలమునందు నుపాదానహేతువు లేనందున దండభ్రమకే యసంభవము గలుగును. విక్షేపాంశమునకు కూడ అశేషనివృత్తి గలిగినయెడల దండముగూడ విక్షేపరూపమై యున్నది. దానికి నుపలంభము కాకపోవలయును. అందువలన వక్ష్యమాణరీతిగా నంగీకరించుట యుచితమై యున్నది. ఏకాజ్ఞానమునందు అనేక విక్షేపమునకు హేతువగు ననంతశక్తి యున్నది. విరోధిజ్ఞానముచేత ఏకవిక్షేపమునకు హేతువగు శక్తికి నాశ మగుచున్నది, అపరవిక్షేపహేతువగు శక్తి యున్నది. అందువలన కాలాంతరమునందు ఆయధిష్ఠానమునందు తిరిగి యధ్యాసము గలుగుచున్నది. అందువలన నతీతస్వప్నమునకు జాగ్రద్బోధముచేత బాధ యుండినను ఆగామిస్వప్నరూపవిక్షేపమునకు హేతు వగు శక్తికి అవశేష ముండుటవలన దినాంతరమునందు స్వప్నము గలుగుచున్నది. అందువలన నహంకారావచ్ఛిన్న చేతనమునకు స్వప్నాధిష్ఠానమును సంభవించున్నది. అయిన,—

**246.** ఉక్తచేతనమునకు స్వప్నాధిష్ఠానవాదమునందును, శరీరము యొక్క యంతర్దేశస్థచేతనమునకే అధిష్ఠానత్వసంభవము.

ఉక్తచేతనమునకు స్వప్నాధిష్ఠానతావాదమునందును శరీరముయొక్క యంతర్దేశస్థచేతనమే అధిష్ఠానముగా సంభవించుచున్నది. బాహ్యదేశస్థమును అధిష్ఠానముగా నంగీకరించినయెడల ఘటాదికమువలె ప్రైకైకస్వప్నముయొక్క ప్రతీతి యందఱకు కలుగవలయును. ఘటాదికముయొక్క యపరోక్షతయందును సర్పరజతాదికముయొక్క యపరోక్షతయందును ఎట్లు ఇంద్రియవ్యాపారాపేక్ష యున్నదో అట్లు స్వప్నముయొక్క యపరోక్షతయందును ఇంద్రియవ్యాపారాపేక్ష కావలయును. శరీరముయొక్క యంతర్దేశస్థ చేతనమునందు స్వప్నాధ్యాసమును అంగీకరించినయెడల ప్రమాతతో సంబంధియైనందున సుఖాదికమువలె ఇంద్రియ వ్యాపారములేకయే అపరోక్షత సంభవించుచున్నది. ఈరీతిగా నహంకారావచ్ఛిన్న - లేక - అహంకారానవచ్ఛిన్న చేతనమే స్వప్నాధిష్ఠానమై యున్నది. ఈ రెండు మతములు ప్రామాణికములై యున్నవి.

**247.** అంతర్దేశస్థాహంకారానవచ్ఛిన్న చేతనమునకు స్వప్నాధిష్ఠానతా యోగ్యత్వము.

అహంకారానవచ్ఛిన్నము ఏది చెప్పబడినదో దానియందును రెండు భేదములున్నవి. అవిద్యయందు ప్రతిబింబమగు జీవచేతనము లేక అవిద్యయందు బింబమగు నీశ్వరచేతనము రెండు అహంకారానవచ్ఛిన్నములై యున్నవి. రెండును వ్యాపకములైనందున శరీరాంతరములై యున్నవి. ఎట్లన చేతనమునందు బింబప్రతిబింబభేదము స్వాభావికమైనయెడల విరుద్ధధర్మాశ్రయత్వము, అంతరస్థిక చేతనమునకు సంభవించుట లేదు. ఆ బింబప్రతిబింబతారూపేశ్వర జీవత్వములు ఉపాధికృతములై యున్నవి. ఒకటేచేతనమునందు అజ్ఞానసంబంధముచేత బింబత్వ ప్రతిబింబత్వములు కల్పితములై యున్నవి. అందువలన శరీరస్థిక చేతనమునందే ఉభయవిధవ్యవహారము గలుగుచున్నది. అలాగుననే అంతర్దేశస్థమునందు స్వప్నాధ్యాసాధిష్ఠానత్వమునకు అంతఃకరణమును అవచ్ఛేదకముగా నంగీకరించినయెడల నహంకారావచ్ఛిన్నమునకు అధిష్ఠానత్వము సిద్ధమగుచున్నది. ఆచేతనమునందు స్వప్నాధిష్ఠానత్వమునకు అంతఃకరణమును అవచ్ఛేదకముగా నంగీకరించినయెడల అహంకారానవచ్ఛిన్నమునకు అధిష్ఠానత్వము సిద్ధమగుచున్నది. ఒక్కదేవదత్తునియందే పుత్రాదిదృష్టిచేత వివక్ష యుండిన

యెడల పిత యనంబడును. దేవదత్తజనకునియొక్క దృష్టిచేత వివక్షు యుండిన యెడల పుత్రుఁడనంబడును. వివక్షాభేదముచేత ఏకదేవదత్తునియందు పితృత్వ పుత్రత్వరూపకవిరుద్ధ ధర్మములయొక్క వ్యవహారమువలె శరీరములయొక్క అంతర్దేశస్థికచేతనమునందు అవచ్ఛిన్నత్వ బింబత్వ ప్రతిబింబత్వరూప విరుద్ధ ధర్మములయొక్క వ్యవహారమునకు అసంభవము లేదు. ఈరీతిగా నవిద్యాప్రతిబింబరూప జీవచేతనమునందు లేక బింబరూపేశ్వరచేతనమునందు స్వాప్నాధిష్ఠానతను అంగీకరించి యహంకారానవచ్ఛిన్నమునందు స్వాప్నాధ్యాసమును అంగీకరించినను శరీరదేశస్థాంతరచేతనప్రదేశమునందె స్వాప్నాధిష్ఠానత్వ ముచితమై యున్నది.

248. బాహ్యాంతరసాధారణ దేశస్థ చేతనమునందు స్వాప్నాధిష్ఠానతాకథమునందు గౌడపాదభాష్యకారాదులయొక్క వచనమునకు విరోధము.

బాహ్యాంతరసాధారణ దేశస్థమునందు స్వాప్నాధిష్ఠానత్వమును జెప్పిన యెడల గౌడపాదాచార్యవచనముతోను భాష్యకారాది వచనముతోను, విరోధ మగును. ఎట్లన మాండూక్యకారికయొక్క వైతన్యప్రకరణమునందు గౌడపాదాచార్యులచేత జెప్పబడిన దేమనగా స్వాప్నికహస్తిపర్వతాద్యుత్పత్తికి యోగ్య మగు దేశకాలాదికము లేనందున స్వప్నపదార్థము మిథ్యయై యున్నది, అను నీ గౌడపాదాచార్యవచనమునకు వ్యాఖ్యానమునందు భాష్యకారాదులచేత జెప్పబడిన దేమనగా, క్షణఘటికాదికాలమునందు సూక్ష్మనాడీదేశమునందును వ్యావహారిక హస్త్యాదికమునకు నుత్పత్తి సంభవించుటలేదు. అందువలన స్వాప్నపదార్థములు వితథములై యున్నవి. ఈరీతిగా శరీరముయొక్క యంతర్దేశమునందు స్వప్నమున కుత్పత్తి చెప్పబడినది. సాధారణచేతనమునందు నధిష్ఠానత్వము నంగీకరించినయెడల సూక్ష్మదేశమునందు నుత్పత్తికథనము అసంగత మగును. అందువలన శరీరముయొక్క యంతర్దేశస్థాహంకారానవచ్ఛిన్న చేతనమునందు స్వాప్నాధ్యాస మున్నది.

249. అహంకారానవచ్ఛిన్నచేతనముకూడ అవిద్యయందు ప్రతిబింబమును బింబమును, యీయుభయమై యున్నది. వానిలో ప్రతిబింబరూప జీవచేతనమునకు అధిష్ఠానత్వసంభవము.

అహంకారానవచ్ఛిన్నచేతనము కూడ అవిద్యాప్రతిబింబమయ్యును బింబమయ్యును ఈ యుభయస్వరూపమై యున్నది. మతభేదముచేత ను

భయమునకు స్వప్నాధిష్ఠానత్వ మున్నది. తథాపి అవిద్యయందు ప్రతిబింబరూప జీవచేతనమునకు అధిష్ఠానత్వము జెప్పుటయే యుచితమై యున్నది. ఎట్లన అప రోక్షాధిష్ఠానమునందు అపరోక్షాధ్యాసము గలుగుచున్నది. శుద్ధబ్రహ్మమువలె ఈశ్వరచేతనముయొక్క జ్ఞానము కేవలశాస్త్రముచేత గలుగుచున్నది. స్వప్నా ధ్యాసమునకు నీశ్వరచేతనమును అధిష్ఠానముగా నంగీకరించినయెడల శాస్త్ర రూప ప్రమాణము లేనందున అధిష్ఠానమునకు నపరోక్షత వినాగా అధ్యాసమున కు నపరోక్షత్వము సంభవింపక పోవును. మఱియును అవిద్యయందు ప్రతిబింబ రూప జీవచేతనము అహంకారావచ్ఛిన్నమై యహమాకారవృత్తికి గోచరమై యున్నది. అహంకారావచ్ఛిన్నమగు నవిద్యయందు ప్రతిబింబరూప జీవచేతన ముకూడ అహమాకారవృత్తికి గోచరము కాదు. అయిన జీవచేతనము ఆ వృతము కాదు. అందువలన స్వతః అపరోక్షతయందు నపరోక్షాధ్యాసము సంభవిం చుచున్నది.

250. ఉక్తపక్షమునందు సంక్షేపశారీరకమునందు ఉక్తాధ్యాసమునకు నపరోక్షతానిమిత్తము అధిష్ఠానమునకు త్రివిధాపరోక్షత్వము.

సంక్షేపశారీరకమునందు అధ్యాసమునకు నపరోక్షత్వముకొఱకు అధిష్ఠానమునకు త్రివిధాపరోక్షత్వము చెప్పబడినది. సర్పరజతాద్యపరోక్షత్వము నకు నుపయోగి యగు రజ్జుశుక్త్యాద్యపరోక్షత్వము ఇంద్రియముచేత కలుగు చున్నది. గగనమునందు నీలతాద్యధ్యాసాపరోక్షత్వమునకు నుపయోగియగు గగనాపరోక్షత్వము మనస్సుచేత గలుగుచున్నది. స్వప్నాపరోక్షత్వమునకు నుపయోగి యగు నధిష్ఠానాపరోక్షత్వము స్వభావసిద్ధమై యున్నది. ఈరీతిగా సంక్షేపశారీరకమునందు సర్వజ్ఞాత్మమునులచేత స్వతః అపరోక్షత్వమునందు స్వప్నాధ్యాసము చెప్పబడినది. అందువలన జీవచేతనమే స్వప్నమునకు నధిష్ఠానమై యున్నది.

251. ఉక్తపక్షమునందు శంకాసమాధానపూర్వక జీవచేతనరూపాధిష్ఠానము యొక్క స్వరూపప్రకాశముచేత స్వప్నమునకు ప్రకాశము.

యద్యపి, జీవచేతనము అనావృత మైనందున స్వతః ప్రకాశ స్వభావముగా నంగీకరించినయెడల అవిద్యకు వ్యాపకత్వ ముండుటవలన దానియందు ప్రతిబింబ రూప జీవచేతనము కూడ వ్యాపకమై యున్నది. దానికి ఘటాదికముతో సదా సంబంధ మున్నది. అందువలన నేత్రాదిజన్యవృత్తియపేక్షలేకయే ఘటాదికము

నకు నపరోక్షత్వము కావలయును. జీవచేతనముతో సంబంధి యొక్క యపరోక్ష త్వమందును, వృత్త్యపేక్షను అంగీకరించినయెడల స్వతః అపరోక్ష జీవచేతనము చేత స్వాప్నాధ్యాసమునకు అపరోక్షత్వమును జెప్పుట యసంగత మగును. తథాపి, స్వాప్నాధ్యాసమునకు జీవచేతనము అధిష్ఠానమై యున్నది. ఘటాదికమునకు నధి ష్ఠానము జీవచేతనము కాదు. ఇక నేమనగా బ్రహ్మచేతనమై యున్నది. అందువలన స్వప్నపదార్థమునకు తన యధిష్ఠాన మగు జీవచేతనమునందు తాదాత్మ్య సంబంధి మున్నది. ఘటాదికమునకు నధిష్ఠానము బ్రహ్మచేతన మైనందున దానికి తాదాత్మ్య సంబంధము బ్రహ్మచేతనముతో నున్నది, జీవచేతనముతో లేదు. నేత్రాదిజన్య వృత్తిద్వారా జీవచేతనమునకు ఘటాదికముతో సంబంధి మున్నది. వృత్తికి పూర్వకాలమునందు ఘటాదికమునకు ఏసంబంధ మున్నదో అది యపరోక్షత్వ సంపాదకము కాదు. అందువలన ఘటాదికముతో జీవచేతనముయొక్క విలక్షణ సంబంధములకు హేతువగు వృత్తియొక్క యపేక్షతచే నపరోక్షత్వము గలుగుచు న్నది. స్వాప్నాధ్యాసమునందు నధిష్ఠానతారూప సంబంధముచేత జీవచేతనమునకు సదా సంబంధి యగు పదార్థములకు వృత్తిలేకయే ప్రకాశ మగుచున్నది. ఈరీతిగా ప్రకాశాత్ము లగు శ్రీచరణనామకాచార్యులచేత చెప్పబడినది. మతభేదముచేత వృత్తికి ప్రయోజనము ఉత్తరోత్తరా చెప్పబడును. ఈప్రకారముగా నవిద్యయందు ప్రతిబింబమగు జీవచేతనము స్వప్నమునకు నధిష్ఠానమై యున్నది. దానియొక్క స్వరూపప్రకాశముచేత స్వప్నమునకు ప్రకాశమగుచున్నది. అయిన,—

252. అద్వైతదీపికయందు నృసింహాశ్రమాచార్యోక్తాకాశగోచర చాక్షుషవృత్తియొక్క నిరూపణపూర్వక సంక్షేపశారీరకోక్తా కాశగోచర మానసవృత్తియొక్క యభిప్రాయము.

ఈ ప్రసంగమునందు నాకాశగోచర మానసవృత్తి చెప్పబడినది.అచ్చట నృసింహాశ్రమాచార్యుల చేత నద్వైతదీపికయందు జెప్పబడిన దేమనగా, యద్యపి నీలరూపాకాశగోచర చాక్షుషవృత్తి సంభవించుట లేదు, తథాపి ఆకాశ మునందు ప్రవృత్తాలోకము రూపసహిత మైనందున ఆలోకాకారచాక్షుష వృత్తి కలుగుచున్నది. ఆలోకావచ్ఛిన్న చేతనమునకు ఎట్లు వృత్తిద్వారా ప్ర మాతతో అభేద మున్నదో అట్లు ఆలోకదేశవృత్తి ఆకాశావచ్ఛిన్న చేతనమున కును అభేద మున్నది. ఈరీతిగా నాలోకాకారచాక్షుషవృత్తికి విషయ ముం డుటవలన ఆకాశముయొక్క యపరోక్షతయును గూడ నేత్రేంద్రియజన్యముగానే

చెప్పబడినది. సంక్షేపశారీరమునందు మానసాపరోక్షత చెప్పబడినది. దానియొక్క యభిప్రాయ మేమనగా ఆకాశమైన నీలరూపమై యున్నది. అందువలన నాకాశాకారవృత్తి సంభవించుట లేదు. అన్యాకారవృత్తిచేత సమానదేశస్థాన్యమునకు ప్రత్యక్ష మంగీకరించినయెడల ఘటరూపాకార వృత్తిచేత ఘటరూపమునయొక్క హ్రస్వదీర్ఘపరిమాణముయొక్క ప్రత్యక్షము కావలయును. ఆలోకాకారవృత్తి చేత ఆలోకదేశస్థవాయువునకును చాక్షుషప్రత్యక్షము కావలయును. ఆలోకాకార చాక్షుషవృత్తిచేత ఆకాశమునకు అపరోక్షత్వము సంభవింపనందున మానసాపరోక్షత్వమె సంభవించుచున్నది.

253. ఉభయమతములకు అంగీకారపూర్వకాద్వైతదీపికోక్తరీతిగా సమీచీనత.

సూక్ష్మముగా విచారించినయెడల అద్వైతదీపికరీతిగా అన్యాకారవృత్తి చేత అన్యముయొక్క యపరోక్షత్వము అప్రసిద్ధమై యున్నది. దానికి నంగీకారము దోషమై యున్నది. తథాపి, ఫలబలముచేత కొన్నిస్థలములయందు అన్యాకార వృత్తిచేత అన్యమునకు నపరోక్షత్వమును, అంగీకరించినయెడల ఉక్తదోషమునకు నుద్ధార మగుచున్నది. మఱియును సంక్షేపశారీరకప్రకారముగా బాహ్యపదార్థమునందు అంతఃకరణగోచరత్వము అప్రసిద్ధమై యున్నది. దానికి అంగీకారము దోషమై యున్నది. ఫలబలముచేత నన్యాకారనేత్రవృత్తిసహాకృతాంతఃకరణవృత్తి గోచరత్వమును బాహ్యపదార్థమునందు నంగీకరించినయెడల కేవలాంతఃకరణమునకు బాహ్యపదార్థ గోచరత్వము లేదు; అనునీనియమమునకు భంగరూపదోషము లేదు. ఈప్రకారముగా నుభయథాలేఖనము సంభవించుచున్నది. తథాపి అద్వైతదీపికారీతియే సమీచీనమై యున్నది. ఎట్లన, ఆలోకాకారవృత్తి సహకారితారూపకారణత్వము నంగీకరించి. యంతఃకరణమునందు బాహ్యపదార్థ గోచర సాక్షాత్కారముయొక్క కరణత్వము అధికముగా నంగీకరింపవలసినది. అద్వైతదీపికారీతిగా నంతఃకరణమునకు బాహ్యసాక్షాత్కారకరణత్వ మంగీకరింపబడ లేదు. అందువలన లాఘవ మున్నది. నేత్రమునకు సహకారిత్వము నంగీకరింపక కేవలాంతఃకరణమునకు ఆకాశప్రత్యక్షహేతుత్వము నంగీకరించినయెడల నిమీలితనేత్రులకునుగూడ ఆకాశముయొక్క మానసప్రత్యక్షము కావలయును. మఱియును అంతఃకరణమునకు జ్ఞానోపాదానత్వ ముండుటవలన కరణతాకథనము సర్వథా అయుక్తమై యున్నది. అందువలన సంక్షేపశారీరకమునందు ఆకాశ

ప్రత్యక్షమునకు మానసత్వకథనము ప్రౌఢివాదము. ఈరీతిగా నధ్యాసముయొక్క యపరోక్షత్వమునకు హేతువగు నధిష్ఠానాపరోక్షత్వము ఇంద్రియముచేత, లేక, స్వరూపప్రకారముచేత అని ఇంతమాత్రము చెప్పుట యుక్తమై యున్నది. ఈరీతిగా మతభేదముచేత స్వప్నమున కుపాదానము అవస్థాజ్ఞానమై యున్నది, లేక మూలాజ్ఞానమై యున్నది.

254. రజ్జుసర్పాదికమునకు సర్వమతములందు మూలాజ్ఞానమునకే యుపాదానత్వము.

రజ్జుసర్పాదికమునకు సర్వమతములందును అవస్థాజ్ఞానమే యుపాదానమై యున్నది. మఱియును రజ్జ్వాదికముయొక్క జ్ఞానముచేత దానికి నివృత్తి గలుగుచున్నది. రజ్జుజ్ఞానముచేత అజ్ఞాననివృత్తిద్వారా సర్పనివృత్తి గలుగుచున్నది. అందువలన నేకపర్యాయజ్ఞాతరజ్జువునందు కాలాంతరమునందు నుపాదానము లేనందున సర్పభ్రమ కాకపోవలయును; అనుశంకకు సమాధానము వృత్తి ప్రయోజన నిరూపణమునందు జెప్పబడును.

255. స్వప్నాధిష్ఠానమగు నాత్మకు స్వయంప్రకాశత్వమునందు ప్రమాణభూత బృహదారణ్యకశ్రుత్యభిప్రాయము.

స్వప్నాధిష్ఠానమునకు స్వతఃఅపరోక్షముచేత స్వప్నమునకు నపరోక్షత్వము పూర్వమునందు జెప్పబడినది. మఱియును స్వయంజ్యోతిర్బ్రాహ్మణవాక్యమునందు గూడ "అత్రాయం పురుష స్స్వయంజ్యోతి ర్భవతి" అను నీరీతిగా స్వప్న ప్రసంగమునందు చెప్పబడినది. దానికి అభిప్రాయ మే మనగా, యద్యపి మూడు అవస్థలయందును ఆత్మ స్వయంప్రకాశుడై యున్నాడు. తథాపి తనయొక్క ప్రకాశమునందు అన్యప్రకాశాపేక్షారహితుడై సకలమునకు ప్రకాశమై యేది యున్నదో అది స్వయంప్రకాశ మనంబడును. జాగ్రదవస్థయందు సూర్యాదికమును, నేత్రాదికమును ప్రకాశక మైనందున అన్యప్రకాశముయొక్క యపేక్షారహితత్వము ఆత్మయందు నిర్ధారిత మగుట లేదు. స్థూలదృష్టికి సుషుప్తినే జ్ఞానము ప్రకాశమగుట లేదు. అందువలన సుషుప్తియందు జ్ఞానసామాన్యాభావము నైయాయికునిచేత నంగీకరింపబడియున్నది. అందువలన నాత్మప్రకాశమునకు సుషుప్తియందుచు నిశ్చయ మగుట లేదు. ఈ యభిప్రాయముచేత శ్రుతిచేత స్వప్నావస్థయందు ఆత్మకు స్వయంప్రకాశము చెప్పబడినది.

256. స్వప్నమునందు నింద్రియమునకు అంతఃకరణమునకును జ్ఞానసాధనత్వముజెప్పి స్వతఃఅపరోక్షమగు నాత్మచేత స్వప్నమునకు నపరోక్షత్వము.

స్వప్నావస్థయందును నేత్రాదీంద్రియములకు సంచార ముండినయెడల ఆత్మకు ప్రకాశాంతరనిరపేక్షత్వము లేనందున స్వయంప్రకాశతానిర్ధారణ మశక్యమగును. ఈరీతిగా నింద్రియవ్యాపారము లేక స్వప్నమునందు నాత్మప్రకాశమున్నది. స్వప్నమునందు హస్తమునందు దండమును తీసికొని ఉష్ట్రమహిషాదికమును కొట్టుచు నేత్రముచేత నామ్రాదికమును చూచుచు తిరుగుచున్నాడు. మఱియును హస్తనేత్రపాదములయొక్క గోళకము నిశ్చలముగా ప్రతీత మగుచున్నది. అందువలన స్వప్నమునందు వ్యావహారికేంద్రియవ్యాపారము లేదు. మఱియును ప్రాతిభాసికేంద్రియములయొక్క యంగీకారమును లేదు. స్వప్నమునందు ప్రాతిభాసికేంద్రియము లుండినయెడల స్వప్నమునందు ప్రకాశాంతరము లేనందున స్వయంప్రకాశత్వము ఆత్మకు శ్రుతియందు చెప్పబడియున్నది. దానికి బాధయగును. మఱియును విచారసాగరమునందు స్వప్నమునందు ఇంద్రియము ప్రాతిభాసికముగా జెప్పబడినది. అది ప్రౌఢివాదమై యున్నది. స్వప్నమునందు ప్రాతిభాసికేంద్రియము నంగీకరించినను జ్ఞానసమానకాలమునందు వానికి ఉత్పత్తి యుండుటవలన జ్ఞానసాధనత్వము వానికి సంభవించుట లేదు. ఈరీతిగా తనయొక్క యుత్కర్షబోధనమునిమిత్తమై పూర్వవాదియొక్క వచనము నంగీకరించి సమాధానము. అందువలన స్వప్నమునందు జ్ఞానసాధనము ఇంద్రియము కాదు. మఱియును ఇంద్రియవ్యాపారము లేక కేవలాంతఃకరణమునకు జ్ఞానసాధనత్వము లేనందున తత్త్వదీపికామతముచేత నంతఃకరణమునకు స్వప్నమునందు గజాదిపరిణామ ముండుటవలన జ్ఞానకర్మమునకు జ్ఞానసాధనత్వము సంభవింపనందున అంతఃకరణవ్యాపారము లేక ఆత్మప్రకాశ మున్నది. అందువలన స్వతః అపరోక్షమగు నాత్మచేత స్వప్నమునకు నపరోక్షత యున్నది. స్వప్నావస్థయందు గజాదికమునందు చాక్షుషత ప్రతీత మగుచున్నది. అదియును గజాదికమువలె అధ్యస్తమై యున్నది. జాగ్రత్తయందు ఘటాదికముయొక్క చాక్షుషత్వము వ్యావహారికమై యున్నది. రజ్జుసర్పాదికముయొక్క చాక్షుషత యధ్యస్తమైనందున ప్రాతిభాసికమై యున్నది.

### 257—259. దృష్టిసృష్టివాదమునకు, సృష్టిదృష్టివాదమునకును, భేదము.

**257.** దృష్టిసృష్టివాదమునందు సకలానాత్మలకును జ్ఞాతసత్తను (సాక్షిభాస్యత) చెప్పి దృష్టి సృష్టి, సృష్టి దృష్టి, అర్థద్వయము.

దృష్టిసృష్టివాదమందైన ఏ యనాత్మపదార్థమునకును, అజ్ఞాతసత్త లేదు, జ్ఞాతసత్త యున్నది. అందువలన రజ్జుసర్పాదికమువలె సకలానాత్మవస్తువులును సాక్షిభాస్యములై యున్నవి. వానియందు ఇంద్రియజన్యజ్ఞానవిషయత్వము ప్రతీత మగుచున్నది. అవి అధ్యస్తములై యున్నవి. దృష్టిసృష్టివాదమునందు రెండుభేదము లున్నవి. సిద్ధాంతముక్తావళ్యాదిగ్రంథములయందు చెప్పబడినదే మనగా, దృష్టి యనగా జ్ఞానస్వరూపము. అదియే సృష్టియై యున్నది; జ్ఞానముకంటె భిన్నమగు సృష్టి లేదు. మఱియును ఆకరగ్రంథమునందు చెప్పబడినదే మనగా, దృష్టిసృష్టి యనగా జ్ఞానసమయమునందు అనాత్మపదార్థమునకు సృష్టి యగుచున్నది. జ్ఞానముకంటె పూర్వమునందు ఏయనాత్మపదార్థమును కలుగుట లేదు. అందువలన సకలదృశ్యమునకును జ్ఞాతసత్తయున్నది. అజ్ఞాతసత్త లేదు. ఈరీతిగా ద్వివిధదృష్టిసృష్టివాద మున్నది. సకలాద్వైతశాస్త్రమునకు నిదియె అభిమతమై యున్నది.

**258.** సృష్టిదృష్టివాద (వ్యావహారికపక్ష)మునొక్క కథనము.

కొందఱు గ్రంథకారులచేత స్థూలదర్శిపురుషానుసారముగా సృష్టిదృష్టివాద మంగీకరింపబడినది. ప్రథమమునందు సృష్టియై యుత్తరకాలమునందు ప్రమాణ సంబంధముచే దృష్టి యగుచున్నది. సృష్ట్యుత్తరమునందు దృష్టి కలుగుచున్నది; అనునిది సృష్టిదృష్టియొక్క యర్థమై యున్నది. ఈపక్షమునందు అనాత్మపదార్థమునకు కూడ అజ్ఞాతసత్త యున్నది. అనాత్మఘటాదికమునకు రజ్జుసర్పాదికముకంటె విలక్షణవ్యావహారికసత్త యున్నది. మఱియును దృష్టిసృష్టివాదమునందు ఏయనాత్మవస్తువును ప్రమాణమునకు విషయము కాదు. ఇక నేమనగా, బ్రహ్మమే వేదాంతరూపశబ్దప్రమాణమునకు విషయమై యున్నది. అచేతనపదార్థము సాక్షిభాస్యమై యున్నది. వానియందు చాక్షుషతాదిప్రతీతి భ్రమరూపమై యున్నది. ప్రమాణప్రమేయభాగముకూడ స్వప్నమువలె నధ్యస్తమై యున్నది. సృష్టిదృష్టివాదమునందు అనాత్మపదార్థమగు ఘటాదికము ప్రమాణమునకు విషయమై యున్నది. ఆలాగుననే గురుశాస్త్రాదికమునుగూడ వ్యావహారికమై యున్నది. శుక్తిరజతాదికముకంటె

విలక్షణమై యున్నది. వ్యావహారికరజతాది పదార్థముచేత కటకాదిరూపప్రయోజనసిద్ధి యగుచున్నది. ప్రాతిభాసికముచేత ప్రయోజనసిద్ధి యగుట లేదు. తథాపి అధిష్ఠానజ్ఞానముచేత నివృత్తి రెంటికిని సమానమై యున్నది. సదసద్విలక్షణత్వరూపానిర్వచనీయత్వముకూడ రెండుమతములయందును సమానమై యున్నది. ఈలాగుననే స్వాధికరణమునందు త్రైకాలికాభావము కూడ రెంటికిని సమానమై యున్నది. అందువలన ప్రాతిభాసికమువలె వ్యావహారికపదార్థము కూడ మిథ్యయై యున్నది. అందువలన సృష్టిదృష్టివాదమందునుగూడ అద్వైతమునకు హాని లేదు.

259—266. మిథ్యాప్రపంచముయొక్క మిథ్యాత్వమునందు శంకాసమాధానములు.

259. ఉక్తోభయపక్షములయందును మిథ్యాపదార్థముయొక్క మిథ్యాత్వమునందు ద్వైతవాదియొక్క యాక్షేపము.

ఈపక్షమునం దొకశంక యున్నది. దృష్టిసృష్టివాదమునందును సృష్టిదృష్టివాదమునందును సకలానాత్మలు మిథ్యగా నున్నవి. దీనియందు వివాదములేదు. అయిన మిథ్యాపదార్థమునందు మిథ్యాత్వధర్మ మున్నది. దానియందు ద్వైతవాదియొక్క యాక్షేప మే మనగా ప్రపంచమునందు మిథ్యాత్వధర్మము సత్యమై యున్నదా, లేక, మిథ్యయై యున్నదా? సత్య మని చెప్పినయెడల చేతనభిన్నానాత్మధర్మమునకు సత్యత్వ ముండుటవలన అద్వైతహాని యగును. మఱియును మిథ్యాత్వమును మిథ్యగా జెప్పిననుగూడ అద్వైతమునకు హాని యగును. తథాహి,మిథ్యాపదార్థమునకు స్వవిరోధి పదార్థముయొక్క ప్రతిక్షేపకత్వ ముండుటవలన ప్రపంచముయొక్క మిథ్యాభూతమిథ్యాత్వముయొక్క సత్యత్వమునకు ప్రతిక్షేపము లేకపోవలయును. ఒకటే బ్రహ్మమునందు సప్రపంచత్వ, నిష్ప్రపంచత్వధర్మములున్నవి. మిథ్యాభూతసప్రపంచత్వ ధర్మముచేత నిష్ప్రపంచత్వమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు ఇక నేమనగా, సప్రపంచత్వనిష్ప్రపంచత్వ ధర్మసహితముగా బ్రహ్మ మున్నది. కల్పిత సప్రపంచత్వమును, పారమార్థికనిష్ప్రపంచత్వమును, ఎట్లు ఉన్నవో అట్లు ప్రపంచమునందు, కల్పితమిథ్యాత్వమును, పారమార్థిక సత్యత్వమును ఉన్నవి. ఈరీతిగా ప్రపంచముయొక్క పారమార్థిక సత్యత్వధర్మమునకును సద్భావ ముండుటవలన అద్వైతమునకు హాని లేదు,

## 260. ఉక్తాక్షేపమునకు అద్వైతదీపికోక్తసమాధానము.

ఈ యాక్షేపమునకు నద్వైతదీపికయందు చెప్పబడిన సమాధానమేమనగా, 'సన్ ఘటః' అను నీరీతిగా ఘటాదికమునందు సత్యత్వము ప్రతీత మగుచున్నది. మఱియును అధిష్ఠానగతసత్యత్వమునకును ఘటాదికమునందు భాన మగుచున్నది. అథవా అధిష్ఠానగతసత్యత్వమునకు ఘటాదికమునందు ననిర్వచనీయసంబంధ ముత్పన్న మగుచున్నది. ఘటాదికమునందు సదసద్విలక్షణతారూపమిథ్యాత్వధర్మము శ్రుతిసిద్ధమై యున్నది. సద్విలక్షణమునందు మిథ్యాత్వ ముండుటవలన మిథ్యాత్వమునకు సత్యత్వముతో విరోధ మున్నది. అందువలన ఘటాదికమునందు దానియొక్క సత్యత లేదు. దానికి మిథ్యాత్వముచేత ప్రతిక్షేప మున్నది. మఱియు నద్వైతవాది చెప్పున దేమనగా, మిథ్యాత్వధర్మమునకు సత్యత్వాంగీకారమువినా మిథ్యాభూత మిథ్యాత్వముచేత ప్రపంచముయొక్క సత్యత్వమునకు ప్రతిక్షేపము సంభవించుట లేదు. మిథ్యాభూతధర్మముచేత గూడ స్వవిరోధి ధర్మమునకు ప్రతిక్షేపము జెప్పినయెడల మిథ్యాభూతసప్రపంచత్వముచేత బ్రహ్మముయొక్క నిష్ప్రపంచత్వమునకును గూడ ప్రతిక్షేపము కావలయును; అను నీవచనము యుక్తమైనది. ఎట్లన, ఈ నియమ మున్నది. ప్రమాణాసిద్ధైకధర్మముచేత స్వసమానసత్తాసహితమగు ధర్మియొక్క స్వవిరోధి ధర్మమునకు ప్రతిక్షేపము కలుగుచున్నది. ఎచ్చట ధర్మికి విషయసత్త యున్నదో అచ్చట దానియొక్క విరోధిధర్మమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు. బ్రహ్మముయొక్క సప్రపంచత్వము వ్యావహారికమై యున్నది. బ్రహ్మము పారమార్థికమై యున్నది. అందువలన సప్రపంచమునకు సమానసత్తాసహితధర్మి బ్రహ్మము కాదు. దానియొక్క నిష్ప్రపంచత్వమునకు సప్రపంచత్వముచేత ప్రతిక్షేపము కలుగుట లేదు. మఱియును వ్యావహారికప్రపంచమునందు మిథ్యాత్వము కూడ వ్యావహారికమై యున్నది. ఎట్లన, ఆగంతుకదోషరహితకేవలావిద్యాజన్య ప్రపంచమును మిథ్యాత్వమై యున్నది. అందువలన రెండును వ్యావహారికము లైనందున మిథ్యాత్వమునకు సమానసత్తాసహితము ప్రపంచమై యున్నది. దానియొక్క సత్యత్వమునకు మిథ్యాత్వముచేత ప్రతిక్షేపము గలుగుచున్నది. మఱియును సత్యధర్మత్వముచేతనే విరోధి ధర్మమునకు ప్రతిక్షేపము జెప్పినయెడల 'రజతం సత్' అను నీరీతిగా శుక్తిరజతమునందు సత్యత్వము ప్రతీతమై రజతముయొక్క మిథ్యాత్వము

చేత ప్రతిక్షేపము కాకపోవలయును. ఎట్లన, కల్పితరజతమునందు మిథ్యాత్వధర్మముకూడ కల్పితమై యున్నది, సత్యము కాదు. అందువలన విరోధిధర్మముయొక్క ప్రతిక్షేపమునందు (నిషేధమునందు) ప్రతిక్షేపకధర్మమునకు సత్యత యపేక్షితమై లేదు. ఇక నేమనగా, ఏధర్మియొక్క ధర్మము విరోధమై యున్నదో ఆధర్మి ప్రతిక్షేపకధర్మసమానసత్తాసహితముగా నుండవలసినది. అందువలన బ్రహ్మముయొక్క సప్రపంచత్వముచేత నిష్ప్రపంచముయొక్క ప్రతిక్షేపమునకు నాపత్తి లేదు. ప్రపంచముయొక్క వ్యావహారికమిథ్యాత్వముచేత సత్యత్వమునకు ప్రతిక్షేపము సంభవించుచున్నది.

261 మిథ్యాప్రపంచముయొక్క మిథ్యాత్వధర్మమునందు ప్రకారాంతరముగా ద్వైతవాదియొక్క యాక్షేపము.

మఱియును, ప్రకారాంతరముగా ద్వైతవాదియొక్క యాక్షేపమేమనగా, ప్రపంచమునందు మిథ్యాత్వధర్మమును మిథ్యగా నంగీకరించినను గూడ ప్రపంచముయొక్క పారమార్థిక సత్యత్వమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు. ఎట్లన, సమానసత్తాసహితధర్మములకు విరోధ మున్నది. విషమసత్తాసహితపదార్థములకు విరోధము లేదు. విషమసత్తాసహిత పదార్థములకు విరోధ ముండినయెడల శుక్తియందు ప్రాతిభాసికరజత తాదాత్మ్యముచేత రజతభేదమునకు ప్రతిక్షేపము కావలయును. ఈప్రకారముగా ప్రపంచముయొక్క వ్యావహారిక మిథ్యాత్వము పారమార్థిక సత్యత్వమునకు ప్రతిక్షేపము సంభవింపనందున ప్రపంచము సత్యమై యున్నది. అందువలన నద్వైతమునకు హాని కలుగును.

262. ఉక్తాక్షేపమునకు నుక్తసమాధానముయొక్క ఘటన.

ఈ శంకకునుగూడ సమాధానము ఉక్తమైయే యున్నది. ఎట్లన, పూర్వోక్తరీతిగా సర్వరజతాదికముయొక్క మిథ్యాత్వముచేత దానియొక్క సత్యత్వమునకు ప్రతిక్షేపము లేకపోవలయును. అందువలన ప్రమాణనిర్ణీతధర్మముచేత విరోధిధర్మముయొక్క ప్రతిక్షేపకత్వమునందు ప్రమాణనిర్ణీతత్వము ప్రయోజకమై యున్నది. రజతమునకు మిథ్యాత్వము ప్రమాణనిర్ణీతమై యున్నది. దానికి విరోధియగు సత్యత్వమునకు ప్రతిక్షేపము చెప్పబడినది. ఈలాగుననే ప్రపంచముయొక్క మిథ్యాత్వముకూడ శ్రుత్యాదిప్రమాణముచేత నిర్ణీతమై యున్నది. దానిచేత ప్రపంచసత్యత్వమునకు ప్రతిక్షేపము గలుగుచున్నది. శుక్తియందు రజత తాదాత్మ్యము భ్రమసిద్ధమై యున్నది. ప్రమాణనిర్ణీతము కాదు, దానిచే

రజతభేదమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు. పైగానుక్తియందు రజతభేదము ప్రమాణనిర్ణీతమై యున్నది. దానిచేత రజతతాదాత్మ్యమునకు ప్రతిక్షేపము కలుగుచున్నది. మఱియును ప్రపంచమిథ్యాత్వముయొక్క మిథ్యాత్వమును వ్యావహారికముగా నంగీకరించి దానికి ధర్మియగు ప్రపంచమును సత్యముగా జెప్పుట సర్వథా విరుద్ధమై యున్నది. ఎట్లన, వ్యావహారిక ధర్మమున కాశ్రయము వ్యావహారికమైయే సంభవించుచున్నది. అందువలన ద్వైతవాదియొక్క ద్వితీయాక్షేపముకూడ అసంగతమై యున్నది.

263. అద్వైతదీపికోక్తసమాధానమునకు సత్తాభేదము నంగీకరించిన యెడల సంభవమును, ఏకసత్తి నంగీకరించినయెడల అసంభవమును.

ఈరీతిగా నద్వైతదీపికాగ్రంథప్రకారముగా ప్రతిక్షేపకధర్మమునకు సమానసత్తాసహితము ధర్మి యయినయెడల దానియొక్క విరోధిధర్మమునకు ప్రతిక్షేపము కలుగుచున్నది; అను అనీనియమమును అంగీకరించినయెడల ప్రపంచముయొక్క మిథ్యాభూతమిథ్యాత్వముచేత ప్రపంచముయొక్క సత్యత్వమునకు ప్రతిక్షేపము సంభవించుచున్నది. బ్రహ్మముయొక్క సప్రపంచత్వము చేత నిష్ప్రపంచత్వమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు. అయిన సత్తాభేదమును అంగీకరించినయెడల అద్వైతదీపికోక్తసమాధానము సంభవించుచున్నది. మఱియును బ్రహ్మరూపసత్తకే ఘటాదికమునందు భాస మున్నది. వ్యావహారిక ప్రాతిభాసికపదార్థమునందు భిన్నసత్త లేదు. ఈ పక్షమునందు ఏకసత్తను అంగీకరించినయెడల ఉక్తసమాధానము సంభవించుట లేదు.

264. ఉక్తాక్షేపమునకు నిశ్చలదాసుచేత జెప్పబడిన సమాధానము.

ఇక నేమనగా, మాభావనచేత ఈ సమాధాన మున్నది. ప్రమాణనిర్ణీత ధర్మముచేత స్వవిరోధిధర్మమునకు ప్రతిక్షేప మున్నది. రెండు ధర్మములు ప్రమాణ నిర్ణీతములై యున్నవి. అచ్చట నపరధర్మమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు. ప్రపంచముయొక్క మిథ్యాత్వము శ్రుత్యాది ప్రమాణముచేత నిర్ణీత మగుచున్నది. ప్రపంచముయొక్క సత్యత్వమునందు శ్రుతివచనరూప ప్రమాణ మేదియు లేదు. పైగా శ్రుతివాక్యముచేత సత్యత్వముయొక్క యభావము ప్రతీత మగుచున్నది. అందువలన ప్రపంచముయొక్క మిథ్యాత్వముచేత సత్యత్వమునకు బాధ కలుగుచున్నది. ప్రత్యక్షప్రమాణమువలన యద్యపి ప్రపంచముయొక్క సత్యత్వము ప్రతీత మగుచున్నది. తథాపి అపౌరుషేయ శ్రుతివచనముకంటెను పురుష

ప్రత్యక్షము దుర్బలమై యున్నది. అందువలన ప్రపంచమునకు సత్యత్వము కాదు. బ్రహ్మమునకు సప్రపంచత్వ నిష్ప్రపంచత్వరూపములగు రెండు ధర్మములు ప్రమాణ సిద్ధములై యున్నవి. అందువలన ఏకధర్మముచేత నపరధర్మమునకు బాధ కలుగుట లేదు. అయిన నిష్ప్రపంచత్వ జ్ఞానముచేత పరమపురుషార్థప్రాప్తి యున్నది. అందువలన నిష్ప్రపంచత్వ ప్రతిపాదనమునందు శ్రుతికి తాత్పర్య మున్నది. నిష్ప్రపంచ బ్రహ్మముయొక్క బోధమునకు నుపయోగి సప్రపంచనిరూపణమై యున్నది. అందువలన సప్రపంచత్వ నిరూపణమునందు శ్రుతి తాత్పర్యము లేనందున సప్రపంచత్వము పారమార్థికము కాదు. ఇక నేమనగా కల్పితమై యున్నది. అయిన దోషాదిరహిత కేవలావిద్యాజన్యమైయున్నందున ప్రాతిభాసికముగా లేదు. వ్యావహారికమై యున్నది. ఈరీతిగా నిష్ప్రపంచత్వముచేత సప్రపంచత్వమునకు బాధ సిద్ధమగుచున్నది. ఎట్లన, సప్రపంచత్వప్రతిపాదనవచనములకు వ్యావహారికసప్రపంచత్వమునందు తాత్పర్యము చెప్పుటవలన సప్రపంచత్వమునకు సంకోచము కలుగుచున్నది. బ్రహ్మమునకు సప్రపంచత్వము సదా లేదు. ఇక నేమనగా, విద్యకంటె పూర్వమునం దవిద్యాకాలమునం దున్నది. అందువలన నిష్ప్రపంచత్వధర్మముచేత బాధ్యము సప్రపంచత్వమై యున్నది. దానిచేత నిష్ప్రపంచత్వమునకు ప్రతిక్షేపము సంభవించుట లేదు. అందువలన ద్వైతవాదియొక్క యాక్షేపము అసంగతమై యున్నది.

**265. ఉక్తాక్షేపమునకు అన్యగ్రంథకారులచేత జెప్పబడిన సమాధానము.**

మఱియు నన్యగ్రంథకారోక్తాక్షేపమునకు నృసింహాశ్రమాచార్యులచేత జెప్పబడిన సమాధాన మేమనగా, స్వాశ్రయగోచర తత్త్వసాక్షాత్కారముచే నేధర్మమునకు బాధ యగుట లేదో ఆధర్మముచేత విరోధిధర్మములకుప్రతిక్షేపమగుచున్నది. స్వాశ్రయతత్త్వసాక్షాత్కారముచేత నేధర్మమునకు బాధ యగుచున్నదో దానిచేత స్వవిరోధధర్మములకు ప్రతిక్షేపముకలుగుట లేదు. మిథ్యాత్వాశ్రయ మగు నేప్రపంచ మున్నదో దానికి నధిష్ఠానమగు బ్రహ్మగోచర తత్త్వసాక్షాత్కారముచేత ప్రపంచముయొక్క మిథ్యాత్వమునకు బాధ గలుగుట లేదు. పైగా బ్రహ్మసాక్షాత్కారముచేత ప్రపంచమునందు దృఢతరమిథ్యాత్వ ప్రతీతి గలుగుచున్నది. అందువలన ప్రపంచమిథ్యాత్వముచేత దానికి విరోధి సత్యత్వమునకు ప్రతిక్షేప మగుచున్నది. సప్రపంచత్వమునకు స్వాశ్రయమై యున్నది.

దానియొక్క సాక్షాత్కారముచేత సప్రపంచత్వమునకు బాధ యగుచున్నది. అందువలన బ్రహ్మముయొక్క నిష్ప్రపంచత్వముచేత సప్రపంచత్వమునకు బాధ యున్నది. ఎట్లు శుక్తియందు స్వతాదాత్మ్య మున్నది, మఱియును కల్పితమునకు గూడ స్వాధిష్ఠానమునందు తాదాత్మ్యముండుటవలన రజతతాదాత్మ్య మున్నదో అచ్చట శుక్తిసాక్షాత్కారముచేత శుక్తితాదాత్మ్యమునకు బాధ కలుగుట లేదు. అందువలన శుక్తితాదాత్మ్యముచేత స్వవిరోధి శుక్తిభేదమునకు ప్రతిక్షేపము గలుగుచున్నది. శుక్తిసాక్షాత్కారముచేత రజతతాదాత్మ్యజ్ఞానమునకు బాధ యున్నది. అందువలన రజతతాదాత్మ్యముచేత స్వవిరోధి రజతభేదమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు. ఈలాగుననే ప్రపంచముయొక్క మిథ్యాభూత మిథ్యాత్వముచేత సత్యత్వమునకు బాధ గలుగుచున్నది. బ్రహ్మముయొక్క సప్రపంచత్వముచేత నిష్ప్రపంచత్వమునకు ప్రతిక్షేపము కలుగుట లేదు. ఈరీతిగా ద్వైతవాదియొక్క యాక్షేపమునకు ననేకసమాధానము లున్నవి. ఆయనయొక్క వచనమునుండి జిజ్ఞాసునకు వైముఖ్యము చేయుట యోగ్యమై యున్నది.

266—271. మతభేదముచేత పంచప్రకారమగు ప్రపంచముయొక్క సత్యత్వమునకు ప్రతిక్షేపము. (తిరస్కారము)

266. తత్త్వశుద్ధికారరీతిగా ప్రపంచసత్యత్వమునకు ప్రతిక్షేపము.

ప్రపంచముయొక్క మిథ్యాత్వముచేత దానియొక్క సత్యత్వమునకు ప్రతిక్షేపము కలుగుచున్నది. సత్యత్వమునకు ప్రతిక్షేపము మతభేదముచేత పంచప్రకారమై యున్నది. తత్త్వశుద్ధికారమతమునందు 'ఘటః సన్' ఇత్యాది ప్రత్యక్షజ్ఞానమునకు విషయమగు ఘటాదికమునకు అధిష్ఠానము సద్రూపమై యున్నది. మఱియును సద్రూపచేతనమునందు అధ్యస్తఘటాదికము తనయొక్క యధిష్ఠానముతో నభిన్నమై భ్రమవృత్తికి విషయ మగుచున్నది. ఎట్లు శుక్తిరజ్జ్వాదికమును విషయీకరించెడి యిదమాకార చాక్షుషవృత్తి యున్నదో మఱియును రజతసర్పాదికము చాక్షుషవృత్తికి విషయము కాదో భ్రమవృత్తికి విషయమై యున్నదో అట్లు నేత్రాది ప్రమాణజన్య సకలజ్ఞానములకును విషయము అధిష్ఠానసత్తయై యున్నది. ఘటాదిగోచరము ప్రమాణజన్యవృత్తి యగుట లేదు. ఎట్లన, అజ్ఞానగోచరము ప్రమాణమై యున్నది. జడపదార్థమునకు అజ్ఞానకృతావరణము సంభవింపనందున అజ్ఞాతత్వాభావముచేత ప్రమాణగోచరత సంభవించుట లేదు. అందువలన రజతసర్పాదికమువలె భ్రమవిషయము ఘటాదికమై యున్నది.

దానికి నధిష్ఠానము సద్రూపమై యున్నది. అది నేత్రాదిప్రమాణజన్య వృత్తికి విషయమై యున్నది. ఈరీతిగా సకలప్రమాణములకు విషయము సద్రూపచేతనమై యున్నది. సద్రూపచేతనమునందు తాదాత్మ్యసంబంధముచేత అనేకభేదవిశిష్టఘటాదికముయొక్క ప్రతీతి భ్రమరూపమై యున్నది. అందువలన ఘటాదికమునందుండెడిసత్త యేప్రమాణమునకును విషయము కాదు. అందువలన ఘటాదికముయొక్క మిథ్యాత్వమును అనేకశ్రుతిస్మృతు లనువదించుచున్నవి. తత్త్వశుద్ధికారులచేత నీరీతిగా నేత్రాదిప్రమాణమునకు గోచరము అధిష్ఠానసత్త యని చెప్పబడినది. ఘటాదిసత్త నేత్రాదిప్రమాణమునకు గోచరము కాదు. అందువలన ప్రపంచసత్యత్వమునకు ప్రతిక్షేపము చెప్పబడినది.

267. అన్యగ్రంథకారరీతిగా ప్రపంచసత్యత్వమునకు ప్రతిక్షేపము.

కొందఱుగ్రంథకారులు చెప్పిన దే మనగా, 'ఘటోస్తి' ఇత్యేతత్ప్రతీతికి గోచరము ఘటాదిసత్త్వమై యున్నది. శ్రుతియుక్తులచేతను, జ్ఞానియొక్క యనుభవముచేతను ఘటాదికమునందు మిథ్యాత్వముతో విరోధ ముండుటవలన ఘటాదికమునందు జాతిరూపసత్త్వ మున్నది. ఎట్లు సకలఘటములయందు ననుగతధర్మము ఘటత్వమై యున్నదో అట్లు 'సన్ ఘటః, సన్ పటః' అనునీయేకాకారప్రతీతికి గోచరము సకలపదార్థములయందు ననుగతధర్మమగు జాతిరూపసత్త్వమై యున్నది. అథవా దేశకాలములయొక్క సంబంధము లేక ఘటాదికమునకు ప్రతీతి కలుగుట లేదు. దేశకాలములయొక్క సంబంధవిశిష్టఘటాదివిషయకప్రతీతి గలుగుచున్నది. "ఇహ ఘటోఽస్తి, ఇదానీం ఘటోఽస్తి" అను నీరీతిగా దేశసంబంధమును, కాలసంబంధమును, ఘటాదిప్రతీతి విషయీకరించుచున్నది. ఆదేశసంబంధరూపకాలసంబంధరూపమే ఘటాదికమునందు సత్యమై యున్నది. అథవా ఘటాదికముయొక్కస్వరూపమే "ఘటోఽస్తి" యను నీప్రతీతికి విషయమై యున్నది. ఘటాదికముకంటె పృథక్సత్త్వమును ఉక్తప్రతీతి విషయీకరించుట లేదు. ఎట్లన, నశబ్దరహితవాక్యముచేత దేనికి ప్రతీతి యగుచున్నదో నశబ్దసహితవాక్యము దానికి నిషేధమగుచున్నది. 'ఘటో నాస్తి' యనునీవాక్యముచేత ఘటస్వరూపమునకు నిషేధ మగుచున్నది ; అనునిది సర్వసమ్మతమై యున్నది. అందువలన 'ఘటోస్తి' యను నీ నశబ్దరహితవాక్యముచేత ఘటముయొక్క స్వరూపమాత్రబోధయే యంగీకరించుట యుచితమై యున్నది. ఈరీతిగా 'ఘటోస్తి'యను నీప్రతీతికి గోచరము ఘటస్వరూపమై యున్నది.

అందువలన స్వరూపముకంటె అతిరిక్తఘటాదికమునందు సత్త్వము లేనందున దానికి ప్రతిక్షేపము చెప్పబడియున్నది.

268. న్యాయసుధాకరరీతిగా ప్రపంచసత్యత్వముయొక్క ప్రతిక్షేపము.

మఱియును న్యాయసుధాకరమతమునందు అధిష్ఠానగతసత్తయొక్క సంబంధము ఘటాదికముయొక్క ఉక్తప్రతీతికి గోచరమై యున్నది. తత్త్వశుద్ధికారమతమునందైననో ఘటాద్యనాత్మగోచరప్రతీతి ప్రమాణమై యున్నది. ఈ మతమునందు అధిష్ఠానసత్తాసంబంధవిశిష్టఘటాదికము ప్రమాణమునకు విషయమై యున్నది. ఇంతమాత్రము భేద మున్నది. ఈరీతిగా ఘటాదికమునందు అధిష్ఠానసత్తాసంబంధ ముండుటవలన ఘటాదికమునందు సత్త్వము ప్రతీత మగుచున్నది. ఘటాదికమునందు సత్త్వముయొక్క యభావ ముండుటవలన దానికి ప్రతిక్షేపము చెప్పవలసినది. మఱియు నధిష్ఠానసత్తయొక్క ప్రతీతిని ఘటాదికమునందు అంగీకరించినయెడల అన్యథాఖ్యాతికి అంగీకార మగుచున్నది. అందువలన నధిష్ఠానసత్తయొక్క యనిర్వచనీయసంబంధము ఘటాదికముతో నుత్పన్నమై యున్నది.

269. అన్యాచార్యరీతిగా ప్రపంచసత్యప్రతిక్షేపము.

కొందఱాచార్యులచే వక్ష్యమాణప్రకారముగా సత్యత్వప్రతిక్షేపము చెప్పబడిన దేమనగా, శ్రుతియందు చెప్పబడిన దేమనగా. "ప్రాణా వై సత్యం తేషా మేష సత్యం" ప్రాణశబ్దమునకు అర్థము హిరణ్యగర్భుడై యున్నాడు. ప్రాణ మనగా హిరణ్యగర్భుడు సత్యమై యున్నాడు. తదపేక్షచేత పరమాత్మ యుత్కృష్టసత్యమై యున్నాడు. అని శ్రుత్యర్థము. "సత్యస్య సత్యం" ఈరీతిగా అన్యశ్రుతి యున్నది. అనాత్మసత్యతకంటె నాత్మసత్యత యుత్కృష్టమై యున్న దని శ్రుత్యర్థము. ఎట్లు రాజుయొక్క యపేక్షచేత ఉత్కృష్టరాజు రాజరా జనంబడునో అట్లు ఉత్కృష్టసత్యము సత్యమునకు సత్య మనంబడును. ఈరీతిగా శ్రుతివాక్యమునందు సత్యమునకు నుత్కర్షాపకర్ష చెప్పబడియున్నది. ఇచ్చట నన్యవిధోత్కర్షాపకర్షలు సంభవించుట లేదు. అబాధ్యతయును, కించిత్కాలాబాధ్యత్వమైయె ఉత్కర్షాపకర్షములు సత్యత్వమం దున్నవి. అనాత్మ పదార్థమునందు జ్ఞానపూర్వకాలమునందు అబాధ్యత్వరూపసత్యత్వ మున్నది. పరమాత్మవస్తువునందు సర్వదా అబాధ్యత్వరూపసత్యత్వ మున్నది. అందువలన హిరణ్యగర్భుడైననో అపకృష్టసత్యమై యున్నాడు. పరమాత్మ యుత్కృష్టసత్యమై

యున్నారు. ఈరీతి ద్వివిధసత్యత్వము శ్రుతిసమ్మతమై యున్నది. కించిత్కాలాబాధ్యత్వరూపసత్యత్వమునకు మిథ్యాత్వముతో విరోధము లేదు. అయిన సర్వదా అబాధ్యత్వరూపసత్యత్వమునకు మిథ్యాత్వముతో విరోధ ముండుటవలన దానికి ప్రపంచమిథ్యాత్వముచేత ప్రతిక్షేపము కలుగుచున్నది.

270. సంక్షేపశారీరకరీతిగా ప్రపంచసత్యత్వప్రతిక్షేపము.

సంక్షేపశారీరకమునందు చెప్పిన దేమనగా, యద్యపి ప్రత్యక్షాదిప్రమాణముచేత ఘటాదికమునందు సత్యత్వము ప్రతీతమగుచున్నది. తథాపి బ్రహ్మబోధక వాక్యమునందే ప్రమాణత యున్నది. అనాత్మగ్రాహకప్రత్యక్షత్వాదికము ప్రమాణాభాసమై యున్నది, ప్రమాణము కాదు. ఎట్లన అజ్ఞాతార్థబోధజనకము ప్రమాణమై యున్నది. అజ్ఞానకృతావరణము జడపదార్థమునందు సంభవించినందున చేతనభిన్నమునందు అజ్ఞాతత్వము లేనందున తద్బోధక ప్రత్యక్షాదికమునకు ప్రమాణత్వము సంభవించుట లేదు. ఈరీతిగా ప్రమాణాభాసముచేత ఘటాదికమునందు సత్యత్వసిద్ధి యగుచున్నది. శ్రుతిరూపప్రమాణముచేత ఘటాదికమునందు మిథ్యాత్వసిద్ధి యున్నది. ముఖ్యప్రమాణముచేత ప్రమాణాభాసమునకు బాధద్వారా సత్యత్వమునకు ప్రతిక్షేప మున్నది. ఈరీతిగా ప్రపంచమునందు అత్యంతాబాధ్యత్వరూపసత్యత్వమునకు పంచప్రకారముగా ప్రతిక్షేపము చెప్పంబడియున్నది. అందువలన ప్రపంచము మిథ్యయై యున్నది.

271—280. కర్మకు జ్ఞానసాధనతావిషయమునందు విచారము.

271. మిథ్యాప్రపంచనివృత్తియందు కర్మయం దనుపయోగానువాదపూర్వకసిద్ధాంతమునొక్క ద్వివిధసముచ్చయమునకు నిర్ధారణము.

మిథ్యానివృత్తియందు కర్మకు ఉపయోగము లేదు. అందువలన కేవలకర్మచేత, కర్మసముచ్చితజ్ఞానముచేత అనర్థనివృత్తి సంభవించుట లేదు. కేవలజ్ఞానముచేత ననర్థనివృత్తి కలుగుచున్నది; అను నీయర్థము అద్వైతగ్రంథమునందతిప్రసిద్ధమై యున్నది. మఱియును భాషయందును గూడ విచారసాగరముయొక్క షష్ఠతరంగమునందు స్పష్టమై యున్నది. అందువలన నిచ్చట వ్రాయబడలేదు. ఈస్థానమునందు సిద్ధాంతమేమనగా, అనేక శ్రుతిస్మృతులయందు కర్మసముచ్చితజ్ఞానముచేత మోక్షప్రాప్తి జెప్పబడియున్నది. మఱియు భాష్యకారులచేత ననేకస్థలములయందు సముచ్చయవాదమునకు నిషేధము ప్రతిపాదింప

బడియున్నది. అచ్చట నిర్ధారణ మేమనగా, సమసముచ్చయ క్రమసముచ్చయ భేదముచే సముచ్చయము ద్విప్రకారకమై యున్నది. జ్ఞానమును, కర్మయును, ఈరెండును పరస్పరము కలసి మోక్షసాధన మని తెలిసికొని యేకకాలము నందు రెంటికిని అనుష్ఠానము సమసముచ్చయ మనంబడును. మఱియును ఒక యధికారికే పూర్వమునందు కర్మానుష్ఠానము, ఉత్తరకాలమునందు సకలకర్మములను త్యజించి జ్ఞానహేతువగు శ్రవణాదికముయొక్క యనుష్ఠానము క్రమసముచ్చయ మనంబడును. వీనిసమసముచ్చయమునకు నిషేధ మున్నది. మఱియును శ్రుతిస్మృతులయందు జ్ఞానకర్మలకు నెచ్చట సముచ్చయము వ్రాయబడినదో దానికి పూర్వోక్తక్రమ సముచ్చయమునందు తాత్పర్యము.

272. భాష్యకారోక్తికి సాధనత్వము.

భాష్యకారులయొక్క సిద్ధాంత మేమనగా, మోక్షమునకు సాక్షాత్కారణము కర్మ కాదు. ఇక నేమనగా కేవలమోక్షమునకు సాక్షాత్సాధనము జ్ఞానమై యున్నది. జ్ఞానమునకు సాధనము కర్మయై యున్నది. కాని,

273. వాచస్పత్యుక్త జిజ్ఞాసకు సాధనత.

భామతీనిబంధనమునందు వాచస్పతిచేత చెప్పబడిన దేమనగా, జ్ఞానమునకు సాక్షాత్సాధనము కర్మ కాదు. ఇక నేమనగా, జిజ్ఞాసకు సాధనము కర్మయై యున్నది. ఎట్లన కైవల్యశాఖయందు సకలాశ్రమకర్మ, వివిదిషాసాధన మని స్పష్టముగా చెప్పబడినది. వేదనేచ్ఛ వివిదిష యనంబడును. తృతీయాధ్యాయమునందు సర్వకర్మాపేక్షాజ్ఞానమునందు సూత్రకారులచేత చెప్పబడినది. అచ్చట సూత్రవ్యాఖ్యానమునందు భాష్యకారులచేత జెప్పబడిన దేమనగా, శమదమాదిసాధనము జ్ఞానమునకే సాధనమై యున్నది. అందువలన జ్ఞానమునకు సమీపమై యున్నది. జిజ్ఞాసకు సాధనము కర్మయై యున్నది. అందువలన శమదమాద్యపేక్షచేత జ్ఞానమునకు కర్మ దూరమై యున్నది. ఈరీతిగా శ్రుతివచనముచేతను, భాష్యవచనముచేతను జిజ్ఞాసకు సాక్షాత్సాధనము కర్మయై యున్నది. జిజ్ఞాసద్వారా జ్ఞానమునకు కర్మ సాధనమై యున్నది. జ్ఞానమునకు సాక్షాత్సాధనముగానే కర్మను జెప్పినయెడల జ్ఞానోదయపర్యంతము కర్మానుష్ఠానమునకు ప్రాప్తి యుండుటవలన జ్ఞానసహితకర్మత్యాగరూపసన్యాసమునకు లోప మగును. అందువలన జిజ్ఞాసకు సాధనము కర్మయై యున్నది; అనునది వాచస్పతియొక్క మతము.

**274. వివరణకారోక్తకర్మకు జ్ఞానసాధనత్వము:**

వివరణకారోక్తమత మే మనగా, యద్యపి 'వేదానువచనేన వివిదిషంతి' అను నీరీతిగా శ్రుతియందు చెప్పబడినది. అచ్చట నక్షురమర్యాదచేత వేదార్థజ్ఞానాది ధర్మములకు వివిదిషాసాధనత్వము ప్రతీత మగుచున్నది. తథాపి, ఇచ్ఛావిషయ జ్ఞానమునకు సాధనత్వమునందే శ్రుతి తాత్పర్య మున్నది. కర్మకు నిచ్ఛాసాధనత్వమునందు శ్రుతితాత్పర్యము లేదు. ఉ. ''అశ్వేన జిగమిషతి'' అను నీవాక్యము చేత నక్షురమర్యాదచేత గమనగోచరేచ్ఛాసాధనత్వము అశ్వమునకు ప్రతీత మగుచున్నది. 'శస్త్రేణ జిఘాంసతి' అను నీవాక్యముచేత హననగోచరేచ్ఛాసాధనత్వము శస్త్రమునకు ప్రతీత మగుచున్నది. అచ్చట నిచ్ఛాగోచరమగు నేగమన మున్నదో తత్సాధనత్వము అశ్వమునందు నభిప్రేత మయి, ఇచ్ఛావిషయక హననసాధనత్వము శస్త్రమునందును, అభిప్రేతమయి యున్నటులే ఇచ్ఛావిషయకజ్ఞానసాధనత్వము కర్మకు నభిప్రేతమై యున్నది. ఈపక్షము నందు దోషము చెప్పబడియున్నది. కర్మకు జ్ఞానసాధనత్వము నంగీకరించిన యెడల జ్ఞానోదయపర్యంతకర్మానుష్ఠానాపత్తి యుండుటవలన సన్యాసమునకు లోప మగును. దానికి సమాధాన మే మనగా, ఎట్లు బీజప్రక్షేపమునకు పూర్వము భూమికి కర్షణ మగుచున్నది. బీజప్రక్షేపోత్తరకాలమునందు భూమి కాకర్షణము కలిగి వ్రీహ్యాదికమునకు సిద్ధి, కర్షణాకర్షణములచే నెటులు గలుగుచున్నదో అట్లు కర్మచేతను, కర్మసన్యాసముచేతను జ్ఞానము నకు సిద్ధియగుచున్నది. అంతఃకరణమునకు శుద్ధిద్వారా ప్రత్యక్త్వవిషయకతీవ్రజిజ్ఞాస వైరాగ్యసహిత మగుచున్నదో తావత్పర్యంతము కర్మ కర్తవ్యమై యున్నది. వైరాగ్యసహిత తీవ్రజిజ్ఞాసోత్తరకాలమునందు సాధనసహితకర్మకు త్యాగరూపసన్న్యాసము కర్తవ్యమై యున్నది. ఈరీతిగా జ్ఞానమునకు సాధనము కర్మమై యున్నది. తథాపి తీవ్రజిజ్ఞాసకు పూర్వమునందే కర్తవ్యమై యున్నది. తీవ్రజిజ్ఞాసోత్తరకాల మునందు సన్న్యాసాంగమగు శమాదికమే కర్తవ్యమై యున్నది. కర్మ కాదు. అందువలన కర్మాపేక్షచేత శమాదికమునకు అంతరంగతాప్రతిపాదక తృతీయాధ్యాయస్థభాష్యవచనముతో విరోధము లేదు. ఈరీతిగా వివరణకారమతమునందు జ్ఞానసాధనము కర్మమై యున్నది. వాచస్పతిమతమునందు వివిదిషసాధనమై యున్నది.

రెండుమతములయందును వివిదిషాపూర్వకాలమునందు కర్మానుష్ఠానమును, ఉత్తరకాలమునందు శమాదిసహిత సన్న్యాసపూర్వక శ్రవణాదుల

యొక్క యనుష్ఠానము నున్నది. వివిదిషోత్తరకాలమునందు ఏమతముచేతను కర్మ కర్తవ్యముగా లేదు.

275. వాచస్పతిమతమునకును, వివరణకారమతమునకును, విలక్షణత యందు శంక.

ఈస్థానమునం దొకశంక యున్నది. రెండుమతములయందు వివిదిషా పూర్వకాలమునందే కర్మ కర్తవ్యమైనయెడల మతభేద నిరూపణము నిష్ఫల మగును. ఎట్లన, వాచస్పతిమతమునందు కర్మకు ఫలము వివిదిషయై యున్నది. వివరణకారమతమునందు కర్మకు ఫలము జ్ఞానమై యున్నది. ఫలమునకుసిద్ధి అయిన యెడల సాధనమునకు త్యాగము కలుగుచున్నది. అందువలన వాచస్పతిమతము నందు వివిదిషాసిద్ధిపర్యంతము కర్మానుష్ఠానము నంగీకరించి వివరణకారమతము నందు వివిదిషోత్తరకాలమునందును జ్ఞానసిద్ధిపర్యంతము కర్మానుష్ఠానము నంగీక రించినయెడల రెండుమతములందును విలక్షణత సంభవించుచున్నది. వాచస్పతి మతానుసారి యగు జిజ్ఞాసువు కర్మత్యాగము చేసినయెడల మఱియును వివరణకా రమతానుసారియగు జిజ్ఞాసువు జ్ఞానపూర్వమునందు కర్మానుష్ఠానము చేసినయెడల మతభేదనిరూపణము సఫల మగును. మఱియును పూర్వోక్తరీతిగా రెండుమతము లయందును వివిదిషాసిద్ధిచేత కర్మకు త్యాగ మంగీకరించినయెడల పరస్పర విలక్షణత్వము ప్రతీత మగుట లేదు. అందువలన మతభేదనిరూపణము నిష్ఫల మై యున్నది.

276. ఉక్తశంకకు సమాధానము.

దానికి సమాధాన మేమనగా, యద్యపి రెండుమతములయందును వివిది షాపర్యంతమే కర్మానుష్ఠాన మున్నది. తథాపి మతభేదముచేత కర్మఫలమునందు విలక్షణత యున్నది. తథాహి, వాచస్పతిమతమునందు కర్మఫలము వివిదిషయై యున్నది. వివిదిషకు నుత్పత్తి గలిగి కర్మజన్యాపూర్వమునకు నాశముగ లుగుచు న్నది. వివిదిష యుండినను ఉత్తమగురులాభాదిసామగ్రి యుండినయెడల జ్ఞానము చున్నది. ఏదైన నొకసాధనమునకు వైకల్య ముండినయెడల జ్ఞానము కలు గుటలేదు. వ్యాపారము వివిదిషోత్పత్తియం దున్నది. తత్త్వజ్ఞానము కర్మఫలము కాదు. అందువలన జ్ఞానోత్పత్తియందు కర్మముయొక్క వ్యాపారములేదు. ఈరీ తిగా వాచస్పతిమతమందు వివిదిషాహేతువగు కర్మానుష్ఠానమును జేసియుండి నను జ్ఞానసిద్ధి నియమముగా గలుగుట లేదు. కాని ఉత్తమభాగ్యముచే సకల

సామగ్రి సిద్ధి అయినయెడల జ్ఞానము కలుగుచున్నది. అందువలన జ్ఞానమునకు ప్రాప్తి అనియతమై యున్నది. వివరణకారమతమునందు వివిదిషకంటె పూర్వమునందు అనుష్ఠితకర్మకు కూడ జ్ఞానము ఫలమై యున్నది. అందువలన ఫలమున కుత్పత్తిలేక కర్మజన్యాపూర్వమునకు నాశము లేనందున జ్ఞానోత్పత్తిపర్యంతము కర్మజన్యాపూర్వ మున్నది. ఎంతసామగ్రిలేక కర్మఫలమగు జ్ఞానము గలుగుట లేదో అంతసామగ్రి కర్మచేత సంపాదకమై యున్నది. ఈరీతిగా నీపక్షమునందుజ్ఞానహేతువగు కర్మానుష్ఠానమును జేసినయెడల వర్తమానశరీరమునందు, లేక, భావి శరీరమునందు జ్ఞాన మవశ్యమగుచున్నది. అందువలన జ్ఞానమున కుత్పత్తి నియతమై యున్నది. ఈప్రకారముగా వాచస్పతిమతమునందు శుభకర్మలచేత వివిదిష నియతముగా గలుగుచున్నది. జ్ఞానసిద్ధి అనియతమై యున్నది. వివరణకారమతమునందు ఆకర్మచేత జ్ఞానమున కుత్పత్తి నియతమై యున్నది అందువలన రెండుమతములకును పరస్పరభేద మున్నది, సంకరములేదు. వివిదిషకు హేతువుకర్మయై యున్నది, అథవా జ్ఞానమునకు హేతువై యున్నది. ఉభయరీతిగా వేదాధ్యయన, యజ్ఞ, దాన, కృచ్ఛ్రచాంద్రాయణాద్యాశ్రమకర్మలకే విద్యయం దుపయోగ మున్నది.

277. కొందఱ యాచార్యులప్రకారముగా వర్ణమాత్రధర్మమునకు విద్యయం దుపయోగము.

వర్ణమాత్రధర్మమునకు విద్యయం దుపయోగములేదని కొందఱు ఆచార్యులు చెప్పుదురు.

278. కల్పతరుకారప్రకారముగా సకల నిత్యకర్మములకును విద్యయం దుపయోగము.

మఱియును, కల్పతరు కారమత మేమనగా, సకలనిత్యకర్మలకును విద్యయం దుపయోగ మున్నది. ఎట్లన, సూత్రకారులచేతను, భాష్యకారులచేతను, ఆశ్రమరహితపురుషులకును గూడ విద్యాహేతువగు కర్మయందు, శ్రవణాదికమునందును, అధికారము చెప్పబడినది. ఈలాగుననే రైక్వ, వాచక్నవ్యాద్యాశ్రమరహితులయందును గూడ బ్రహ్మవిద్యాశ్రుతియందు జెప్పబడియున్నది. వాచక్నవీపుత్త్రిగార్గి' వాచక్నవి యనంబడును. ఆశ్రమధర్మములకే విద్యయం దుపయోగ ముండినయెడల ఆశ్రమరహితపురుషులయందు జ్ఞానసాధక కర్మలేనందున జ్ఞానము కాకపోవలయును. అందువలన జప, గంగాస్నాన దేవతాధ్యానాది

సకలశుభకర్మలకును విద్యయం దుపయోగ మున్నది. ఇది కల్పతరుకారమతమై యున్నది. కాని కల్పతరుకారమతమునందు కూడ కామ్యకర్మలకు విద్యయం దుపయోగము లేదు. అయినను నిత్యకర్మలకే విద్యయం దుపయోగ మున్నది. ఎట్లన, అన్యప్రకారముగా విద్యయందు కర్మ కుపయోగము సంభవించుట లేదు. విద్యాప్రతిబంధకపాపములకు నివృత్తిద్వారా విద్యయందు కర్మకుప యోగ మున్నది. మఱియును కామ్యకర్మలచేత స్వర్గపుత్త్రాది ప్రాప్తిరూప ఫలము గలుగుచున్నది. దానిచేత పాపమునకు నివృత్తి గలుగుటలేదు. నిత్య కర్మచేత పాపమునకు నివృత్తి గలుగుచున్నది. అందువలన సకలనిత్యకర్మలకు విద్యయం దుపయోగ మున్నది.

279. సంక్షేపశారీరక కర్తలయొక్క ప్రకారముగా కామ్యనిత్యసకల కర్మలకును విద్యయం దుపయోగము.

మఱియును సంక్షేపశారీరక కర్తలచేత జెప్పబడిన దేమనగా, కామ్య నిత్యసకలశుభకర్మలకును విద్యయం దుపయోగ మున్నది. ఎట్లన, 'యజ్ఞేన వివిది షంతి' అను నీరీతిగా కైవల్యశాఖయందు చెప్పబడియున్నది. అచ్చట నిత్యకామ్య సాధారణము యజ్ఞశబ్దమై యున్నది. "ధర్మేణ పాప మపనుదతి" ఇత్యాది వాక్య ముచేత సకలశుభకర్మలకు పాపనాశకత్వము ప్రతీతమై యున్నది. అందువలన జ్ఞానప్రతిబంధకపాపములయొక్క నివృత్తిద్వారా నిత్యకర్మవలె, కామ్యకర్మ లకు కూడ విద్యయం దుపయోగ మున్న దనునది సంక్షేపశారీరకకర్త లగు సర్వజ్ఞాత్మమునులయొక్క మతమై యున్నది.

280—283. సన్న్యాసమునకు జ్ఞానసాధనతావిషయమునందు విచా రము.

280. పాపనివృత్తిద్వారా జ్ఞానమునకు హేతువైనందున క్రమముగా కర్మయు, సన్న్యాసమును, ఈ రెంటికి కర్తవ్యత.

అందువలన తీవ్రజిజ్ఞాసాపర్యంతము సకలశుభకర్మలు కర్తవ్యములై యు న్నవి. దృఢతరవైరాగ్య సహిత తీవ్రజిజ్ఞాసకలిగిన యనంతరము సాధనసహితకర్మ యొక్క త్యాగరూపసన్న్యాసము కర్తవ్యమై యున్నది. ఎట్లు శుభకర్మలచే పాపనివృత్తి గలుగుచున్నదో అట్లు సన్న్యాసముచేతను జ్ఞానమునకు ప్రతిబంధక మగు పాపనివృత్తి గలుగుచున్నది. జ్ఞానప్రతిబంధకపాపము వివిధమై యున్నది. వానిలో కొన్ని పాపములకు నివృత్తి కర్మచేతను, కొన్ని పాపముల నివృత్తి

సన్న్యాసముచేతను కలుగుచున్నది. అందువలన జ్ఞానప్రతిబంధకపాప నివృత్తి ద్వారా కర్మయు సన్న్యాసమును, ఈరెండును జ్ఞానహేతువులైనందున అవశ్య కర్తవ్యములై యున్నవి.

**281. కొందఱి మతమునందు సన్న్యాసమునకు ప్రతిబంధకపాప నివృత్తి యును, పుణ్యోత్పత్తిద్వారా శ్రవణసాధనత్వమును**

మఱియును కొందఱి యాచార్యులమత మేమనగా,

కేవలపాపనివృత్తిద్వారా సన్న్యాసమునకు జ్ఞానసాధనత్వము లేదు. ఇక నేమనగా, సన్న్యాసజన్యాపూర్వసహితపురుషులకే శ్రవణాదికముచే జ్ఞానము కలుగుచున్నది. అందువలన శ్రవణాంగము సన్న్యాస మైనందున సర్వథానిష్పాపులకు కూడ సన్న్యాసము కర్తవ్యమై యున్నది.

**282. వివరణకారమతమునందు సన్న్యాసమునకు జ్ఞానప్రతిబంధక విక్షేప నివృత్తిరూప దృష్టఫలహేతుత్వము.**

వివరణకారమత మేమనగా, సన్న్యాసము లేక విక్షేపమునకు నభావము లేదు. అందువలన జ్ఞానప్రతిబంధక విక్షేపముయొక్క నివృత్తిరూపదృష్టఫలమే సన్న్యాసమున కున్నది. "అందువలన జ్ఞానప్రతిబంధకపాపనివృత్తికిని జ్ఞాన హేతువగు ధర్మముయొక్క ఉత్పత్తిరూపాదృష్టఫలమునకును హేతువు సన్న్యాసమై యున్నది" అను నీకథన మయోగ్యమై యున్నది. ఎచ్చట దృష్ట ఫలము సంభవించుట లేదో అచ్చట నదృష్ట ఫలకల్పన యున్నది. మఱియును విక్షేపనివృత్తిరూప దృష్టఫలము సన్న్యాసమునకు సంభవించుచున్నది. దానికి అదృష్టఫలకథనము సంభవించుట లేదు. ఒకానొక ప్రధానపురుషునకు ఆశ్రమాంతరమునందు కామక్రోధాదిరూప విక్షేపమునకు అభావ ముండినయెడల కర్మచ్ఛిద్రమునందు వేదాంతవిచారము సంభవించినయెడల, యద్యపి ఉక్తరీతిగా సన్న్యాస మగుచున్నది. తథాపి, 'ఆసుప్తేరామృతేః కాలం నయే ద్వేదాంతచింతయా' అను నీగౌడపాదీయవచనముచేతను, 'తచ్చింతనం తత్కథనం మన్యోన్యం తత్ప్రబోధనం,' అను నీభగవద్వచనముచేతను "బ్రహ్మ సంస్థోఽమృతత్వమేతి" అను నీశ్రుతివచనము చేతను, నిరంతరక్రియమాణబ్రహ్మశ్రవణాదికముచేత జ్ఞానము కలుగుచున్నది. ఎవనికి బ్రహ్మమందు 'సంస్థ' అనగా అనన్యవ్యాపారత్వముచేత స్థితి యున్నదో ఆపురుషుడు జ్ఞానద్వారా అమృతభావమును పొందునని శ్రుత్యర్థము. కర్మచ్ఛిద్రకాలమునందు కదాచిత్క్రియమాణశ్రవణాదికము

చేత జ్ఞానము కలుగుట లేదు. మఱియును నిరంతర శ్రవణాద్యభ్యాసమునకు హేతువు సన్న్యాసమై యున్నది. అందువలన సదృష్టము లేకయే దృష్టఫలమునకు హేతువు సన్న్యాసమై యున్నది. అదియును గూడ వ్యర్థము కాదు.

283—291. క్షత్త్రియులకును, వైశ్యులకును, సన్న్యాసమునందును, శ్రవణమునందును అధికారవిచారము.

283. క్షత్త్రియవైశ్యులకు సన్న్యాసమందును శ్రవణమునందును అధికారవిచారప్రతిజ్ఞ.

ఈప్రసంగమునందు క్షత్త్రియులకును వైశ్యులకును సన్న్యాసమునందును, శ్రవణమునందును, అధికార మున్నదా లేదా? అనువిచారము మతభేదముచేత వ్రాయబడుచున్నది.

284. కొందఱు గ్రంథకారులు చెప్పినరీతిగా సన్న్యాసమునందును, బ్రహ్మశ్రవణమునందును, బ్రాహ్మణులకే అధికారము. క్షత్త్రియవైశ్యుల కనధికారము.

కొన్నిగ్రంథకారులు చెప్పున దేమనగా సన్న్యాసవిధాయకానేకవాక్యములందు బ్రాహ్మణపద ముండుటవలన బ్రాహ్మణమాత్రులకు సన్న్యాసమునం దధికార మున్నది. సన్న్యాసము లేక గృహస్థాదులకు బ్రహ్మవిచారాధికారము లేదు. అందువలన సన్న్యాసమునందును బ్రహ్మశ్రవణమునందును క్షత్త్రియవైశ్యులకు నధికారము లేదు.

285. అన్యగ్రంథకార రీతిగా సన్న్యాసమునందు కేవలబ్రాహ్మణుల కధికారము. క్షత్త్రియవైశ్యులకు సన్న్యాసమును వదలిపెట్టి కేవల బ్రహ్మశ్రవణమునం దధికారము.

అన్యగ్రంథకారులు చెప్పున దేమనగా యద్యపి సన్న్యాసమునందు కేవల బ్రాహ్మణుల కధికార మున్నది. తథాపి బ్రహ్మశ్రవణమునందు క్షత్త్రియవైశ్యుల కధికార మున్నది. కాని జన్మాంతరసంస్కారముచేత నేయుత్తమపురుషులకు విషయములందును దీనతాదిదోషము లేదో ఆ శుద్ధబుద్ధి గలిగినవారలకు సన్న్యాసములేకయే జ్ఞానము గలుగుచున్నది. అందువలన గృహస్థాశ్రమమునందే యనేకరాజర్షులు బ్రహ్మవేత్తలుగా జెప్పబడియున్నారు.

286. వారికంటె నన్యమగు గ్రంథకారులు చెప్పినరీతిగా క్షత్త్రియవైశ్యులకు బ్రహ్మశ్రవణాదికమువలె విద్వత్సన్న్యాసమందును గూడ అధికార మున్నది.

కొందఱు గ్రంథకారులు చెప్పున దేమనగా ఎట్లు బ్రహ్మశ్రవణాదికము నందు క్షత్త్రియవైశ్యుల కధికార మున్నదో అట్లు సన్న్యాసమునందును గూడ క్షత్త్రియవైశ్యులకు నిషేధము లేదు. జ్ఞానోదయముచేత కర్తృత్వభోక్తృత్వ బుద్ధికిని, జాతివర్ణాశ్రమాభిమానమునకును అభావము గలుగుచున్నది. కర్తృత్వ భోక్తృత్వ బుద్ధియును జాత్యాశ్రమాద్యభిమానమును లేక కర్మాధికారము సంభ వింపనందున సర్వకర్మపరిత్యాగపూర్వకాక్రియాసంగాత్మరూపముతో స్థితిరూప విద్వత్సన్న్యాసమునందునుగూడ క్షత్త్రియవైశ్యులకు నధికార మున్నది. కేవల వివిదిషాసన్న్యాసమునందు వారి కధికారము లేదు.

287. వార్తికకారమతమునందు వివిదిషాసన్న్యాసమునందు కూడ క్షత్త్రియవైశ్యుల కధికారము.

వార్తికకారులమత మేమనగా, వివిదిషాసన్న్యాసమందును గూడ క్షత్త్రియవైశ్యుల కధికార మున్నది. మఱియు ననేక శ్రుతివాక్యములందు యద్యపి బ్రాహ్మణులకు సన్న్యాసము జెప్పబడినది. తథాపి సన్న్యాసవిధాయక జాబాల శ్రుతియందు బ్రాహ్మణపదము లేదు. కేవల వైరాగ్య సంపత్తిచే సన్న్యాసము చెప్పబడినది. అందువలన ననేక శ్రుతివాక్యములందు బ్రాహ్మణపదము ద్విజోప లక్షకమై యున్నది. మఱియును స్మృతియందు చెప్పబడిన దేమనగా, ""బ్రాహ్మణః క్షత్త్రియో వాపి వైశ్యో వా ప్రవ్రజే ద్గృహా' దితి త్రయాణాం వర్ణానాం వేద మధీత్య చత్వార ఆశ్రమా" అను నీస్మృతి వచనములచేతను క్షత్త్రియవైశ్యులకు సన్న్యాసమునం దధికార మున్నది. ఇది వార్తికకారులగు సురేశ్వరాచార్యుల యొక్క మతమై యున్నది.

288. మఱియు కొందఱు గ్రంథకారులు చెప్పిన రీతిగా బ్రాహ్మణులకు జ్ఞానమునందు సన్న్యాసాపేక్షయును, క్షత్త్రియ వైశ్యులకు సన్న్యాసమునం దధికా రమును, విద్యోపయోగి కర్మలంనును వేదాంతశ్రవణమునందును క్షత్త్రియుల కధికారము.

కొందఱు గ్రంథకారులు చెప్పునదేమనగా, సన్న్యాసవిధాయక శ్రుతివాక్య మునందు బ్రాహ్మణపద మున్నది. దానికి ద్విజమాత్రోపలక్షకత్వమును జెప్పుటయందు ప్రమాణము లేదు. జాబాలశ్రుతియందు యద్యపి బ్రాహ్మణ పదము లేదు. బహు శ్రుత్యనుసారముగా అచ్చటను గూడ బ్రాహ్మణకర్తకు నధ్యాహార మున్నది. అందువలన క్షత్త్రియవైశ్యులకు సన్న్యాసమునం దధి

కారము లేదు. కాని అనేక స్థానములందు 'గృహస్థరాజ్ఞాఙ్ఞానవాన్' అని చెప్పబడియున్నది. అందువలన నిది యంగీకరింపవలసినది. బ్రాహ్మణులకు బ్రహ్మ విచారాంగభూతమైన సన్న్యాస మున్నది. సన్న్యాసము లేక గృహస్థాద్యాశ్రమస్థ బ్రాహ్మణులకు బ్రహ్మవిచారమునం దధికారము లేదు. సన్న్యాసి బ్రాహ్మణులకే బ్రహ్మ విచారమునం దధికార మున్నది. క్షత్త్రియ వైశ్యులకు సన్న్యాసము లేకయే బ్రహ్మ విచారమునం దధికార మున్నది. ఎట్లన సన్న్యాస విధాయక వచనమునందు బ్రాహ్మణపద ముండుటవలన క్షత్త్రియ వైశ్యులకు సన్న్యాసవిధి లేదు. మఱియు నాత్మకాములకు నాత్మశ్రవణాభావముజెప్పుట సంభవింపదు.అందువలన క్షత్త్రియ వైశ్యులకు జ్ఞానోపయోగియగు నదృష్టము కేవలకర్మచేతనే గలుగుచున్నది. సన్న్యాసజన్యాదృష్టమునకు క్షత్త్రియ వైశ్యులకు జ్ఞానమునం దపేక్ష లేదు. అందు వలన గీతయందు "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః" అను నీరీతిగా పరమేశ్వరునిచే జెప్పబడినది. ఈ వాక్యమునందు అంతఃకరణముయొక్క శుద్ధి అథవా జ్ఞానము సంసిద్ధి శబ్దమున కర్థమై యున్నది. భాష్యకారులచే చెప్పబడిన దేమనగా, సన్న్యాసరహిత కేవలకర్మముచేత నంతఃకరణశుద్ధిని జనకాదులు పొంది నారు. అథవా సన్న్యాసరహిత కేవలకర్మముచేతజ్ఞాన ప్రతిబంధకపాప నివృత్తిద్వారా శ్రవణముచేత జ్ఞానమును బొందిరి; అను నిది గీతార్థమై యున్నది. ఉభయరీతిగా క్షత్త్రియవైశ్యులకు సన్న్యాస నిరపేక్ష కేవల కర్మయే జ్ఞాన ప్రతిబంధకపాప నివృత్తికి హేతువై యున్నది. బ్రాహ్మణులకు సన్న్యాససహిత కర్మచేత జ్ఞాన ప్రతిబంధక పాపనివృత్తి గలుగుచున్నది. మఱియును శ్రవణాంగము సన్న్యాసమై యున్నది. ఈ పక్షమునందు కూడ బ్రాహ్మణులకు శ్రవణాంగమైన సన్న్యాస మున్నది. క్షత్త్రియ వైశ్యులకు శ్రవణాంగము కాదు. ఇక నేమనగా, ఫలాభి లాషరహిత,క్రోధాది దోషరహితమగు నీశ్వరార్పణబుద్ధిచే స్వవర్ణాశ్రమధర్మము యొక్క యనుష్ఠానసహిత కర్మయొక్క యవకాశ కాలమునందు శ్రవణము చేతనే క్షత్త్రియ వైశ్యులకు జ్ఞానము గలుగుచున్నది. సర్వథా విద్యోప యోగికర్మయందును, శ్రవణమునందును, క్షత్త్రియవైశ్యులకు గూడ నధికార మున్నది. ఎట్లన బ్రాహ్మణులవలె జ్ఞానార్థిత్వము క్షత్త్రియ వైశ్యులకు కూడ సమమై యున్నది. మఱియు ఫలార్థికి సాధనమునం దధికార మున్నది. అందువలన నాత్మకామ క్షత్త్రియ వైశ్యులకు వేదాంత శ్రవణమునం దధికార మున్నది.

289. కొందఱు గ్రంథకారుల మతమునందు శూద్రులకు శ్రవణాధి కారము.

యద్యపి మనుష్యమాత్రునకు నాత్మకామన సంభవించుటవలన క్షత్త్రియ వైశ్యులవలె జ్ఞానార్థిత్వ ముండుటవలన శూద్రులకును గూడ ఉక్తరీతిగా వేదాంత శ్రవణాధికారము కావలయును. తథాపి 'నశూద్రాయ మతిం దద్యా' దిత్యాదివచనముచేత శూద్రుల కుపదేశనిషేధ మున్నది. సర్వథా యుపదేశరహిత పురుషులకు వివేకాదికము సంభవింపనందున జ్ఞానార్థిత్వము సంభవించుట లేదు. ఈలాగుననే శూద్రులకు యజ్ఞాదికర్మనిషేధ ముండుటవలన విద్యోపయోగి కర్మ లేనందున వారికి జ్ఞానహేతుశ్రవణమునందు అధికారము లేదు. ఇది కొందఱు గ్రంథకారుల మతమై యున్నది.

290. అన్యగ్రంథకారరీతిగా శూద్రులకు కూడ వేదభిన్నపురాణేతి హాసాదిరూపాధ్యాత్మ గ్రంథశ్రవణమునం దధికారము.

అన్యగ్రంథకారుల మత మేమనగా, ఉపనయనపూర్వకముగా వేదాధ్యయనము చెప్పబడియున్నది. శూద్రుల కుపనయనము చెప్పబడ లేదు. అందువలన వేదశ్రవణమందైన శూద్రులకు నధికారము లేదు. తథాపి ''శ్రావయే చ్చతురో వర్ణాన్'' ఇత్యాదివచనముచేత ఇతిహాసపురాణాదిశ్రవణమునందు శూద్రులకు అధికార మున్నది. పూర్వోక్తవచనమునందు శూద్రులకు నుపదేశ నిషేధము చెప్పబడినది. దాని కభిప్రాయ మేమనగా వైదికమంత్రసహిత యజ్ఞాదికర్మోపదేశము శూద్రులకు లేదు. ఈలాగుననే వేదోక్తప్రాణాది సగుణోపాసనోపదేశము శూద్రులకు చేయబడ లేదు. ఉపదేశమాత్రమునకు నిషేధము లేదు. ఉపదేశమాత్రనిషేధ ముండినయెడల ధర్మశాస్త్రమునందు శూద్రజాతికి ధర్మనిరూపణము నిష్ఫల మగును. మఱియును విద్యోపయోగికర్మము లేనందున విద్యయందనధికారమును జెప్పినయెడల దానికి సమాధాన మే మనగా, సాధారణాసాధారణ సకలశుభకర్మములకు విద్యయం దుపయోగ మున్నది. మఱియును, సత్యాస్తేయ, క్షమా, శౌచ దాన విషయములతో వైముఖ్యమును, భాగవతనామోచ్చారణ, తీర్థస్నాన, పంచాక్షరమంత్రరాజాదిక జపమును మొదలుగా గల సకలవర్ణ సాధారణ ధర్మమునందును శూద్రకమలాకరోక్త చతుర్వర్గాసాధారణధర్మమందును శూద్రుల కధికార మున్నది. ఆకర్మానుష్ఠానముచేత అంతఃకరణమునకు శుద్ధిద్వారా విద్యాప్రాప్తి సంభవించుచున్నది. అందువలన ఇతిహాసపురాణాది.

శ్రవణముచేత వివేకాదికము సంభవించుచున్నందున శూద్రులకు కూడ జ్ఞానార్థిత్వ ముండుటవలన వేదభిన్నాధ్యాత్మగ్రంథాది శ్రవణమునందు శూద్రులకు కూడ నధికార మున్నది. మఱియును భాష్యకారులచేతనుకూడ ప్రథమాధ్యాయ తృతీయపాదమునందు చెప్పబడిన దేమనగా, ఉపనయన పూర్వక వేదాధ్యయనము చెప్పబడినది. శూద్రులకు ఉపనయనము లేనందున యద్యపి వేదమునం దధికారము లేదు. తథాపి పురాణాదిశ్రవణముచేత శూద్రులకు కూడ జ్ఞానము గలిగిన యెడల జ్ఞానసమకాలమే శూద్రులకు కూడ ప్రతిబంధరహితమోక్షము గలుగుచున్నది. ఈరీతిగా భాష్యకారవచనముచేత కూడ వేదభిన్న జ్ఞానహేతు వగు నధ్యాత్మగ్రంథశ్రవణమునందు శూద్రుల కధికార మున్నది.

**291—293. మనుష్యమాత్రులకు భక్తిజ్ఞానాధికారము.**

**291. అంత్యజాతి మనుష్యమాత్రులకు తత్త్వజ్ఞానాధికారము.**

జన్మాంతరసంస్కారముచేత నంత్యజాతులకు కూడ జిజ్ఞాస కలిగినయెడల పౌరుషేయవచనముచేత వారికి కూడ జ్ఞానము గలిగి కార్యసహితావిద్యానివృత్తి రూపమోక్షము గలుగుచున్నది. దేవానుసారమువలె సకలమనుష్యులకు తత్త్వజ్ఞానాధికార మున్నది. ఆత్మస్వరూపముయొక్క యథార్థజ్ఞానము తత్త్వజ్ఞాన మనంబడును. ఆత్మహీనమగు నేదైన నొకశరీర ముండినయెడల జ్ఞానమునకు ననధికారము గలుగును. అందువలన నాత్మజ్ఞానసామర్థ్యము మనుష్యమాత్రుని యందె యున్నది.

**292. తత్త్వజ్ఞానమునందు దైవసంపదపేక్షాపూర్వకమనుష్యమాత్రులకు భగవద్భక్తియును, తత్త్వజ్ఞానాధికార నిర్ధారణయును.**

ఏశరీరమునందు దైవసంపత్తు ఉన్నదో దానికి తత్త్వజ్ఞానము గలుగుచున్నది. ఆసురసంపత్తుండినయెడల తత్త్వజ్ఞానము గలుగనేరదు. మఱియును సర్వభూతములయందును దయ, క్షమ, సత్యము, ఆర్జవము, సంతోషాదికమగు దైవసంపత్తు బ్రాహ్మణునియం దున్నది. మఱియు క్షత్రియులకు ప్రజాపాలనార్థప్రవృత్తి రూపధర్మ ముండుటవలన బ్రాహ్మణులకంటె కించిన్న్యూనమైన దైవసంపత్తు సంభవించుచున్నది. ధర్మబుద్ధిచేత ప్రజాసంరక్షణార్థము దుష్టప్రాణిహింసయుకూడ అహింసయై యున్నది. అందువలన దైవసంపత్తికసంభవము లేదు. ఈలాగుననే వైశ్యులకు కూడ కృషివాణిజ్యాది శారీరవ్యాపారము, క్షత్రియులకంటె నధికమైనందున ఆత్మవిచారమునం దవకాశము సంభవింపనందున వారికి సామర్థ్యాసంభవమున్నది.

తథాపి ఒకానొక భాగ్యశాలి వైశ్యునకు శారీరవ్యాపారము లేకయే సకలవ్యవహారమునకు నిర్వాహ మగుచున్నది. వారికి దైవసంపల్లాభరూపసామర్థ్యము గలుగుచున్నది. ఏయాచార్యమతమునందు క్షత్రియవైశ్యులకు సన్న్యాసాధికార మున్నదో వారిమతమునందైననో అనాయాసముగానే దైవసంపత్తు సంభవించుచున్నది. మఱియును చతుర్థవర్ణమునందును అంత్యజాతియందును యద్యపి దైవసంపత్తు దుర్లభమై యున్నది. తథాపి కర్మఫలము అనంతవిధమైనందున కొందఱకు జన్మాంతరకర్మముచేత దైవసంపల్లాభము గలిగినయెడల పురాణాది విచారముచేత చతుర్థవర్ణమునకు భాషాప్రబంధాది శ్రవణముచేత అంత్యజులకు కూడ భగవద్భక్తియును తత్త్వజ్ఞానలాభద్వారా మోక్షలాభమును నిర్విఘ్నముగా గలుగగలదు. ఈరీతిగా భగవద్భక్తియును,తత్త్వజ్ఞానాధికారమును సకలమనుష్యులకు నున్నది. ఇది శాస్త్రనిర్ధారణమై యున్నది.

**293—295.** తత్త్వజ్ఞానముచేత స్వహేత్వజ్ఞాననివృత్తియందు శంకాసమాధానము.

**293.** అజ్ఞానకార్యమగు నంతఃకరణముయొక్క వృత్తిరూప తత్త్వజ్ఞానముచేత దానికి కారణమగు నజ్ఞానముయొక్క నివృత్తియందు శంక.

తత్త్వజ్ఞానముచే కార్యసహితాజ్ఞాననివృత్తి యగుచున్నదని యద్వైతగ్రంథసిద్ధాంతము. మఱియును, జీవబ్రహ్మాభేదగోచరాంతఃకరణవృత్తి తత్త్వజ్ఞానమనంబడును. అంతఃకరణమునకు అజ్ఞానకార్యత యుండుటవలన నివృత్తిరూపతత్త్వజ్ఞానము కూడ అజ్ఞానకార్యమై యున్నది. మఱియును కార్యకారణములకు పరస్పరావిరోధమె లోకమునందు ప్రసిద్ధమై యున్నది. అందువలన తత్త్వజ్ఞానముచే నజ్ఞాననివృత్తి చెప్పుట సంభవింపదు.

**294.** ఉక్తశంకకు సమాధానము.

ఈశంకకు సమాధానమేమనగా కార్యకారణములకు పరస్పర మవిరోధము ఉన్న దను నీ నియమము సామాన్యమై యున్నది. మఱియును సమానవిషయక జ్ఞానాజ్ఞానములకు పరస్పరవిరోధ మున్నది; అనునిది విశేషనియమమై యున్నది. అందువలన విశేషనియమముచేత సామాన్యనియమమునకు బాధ యగును. పటాగ్నిసంయోగముచేత పటమునకు నాశమగుచున్నది. అచ్చట సంయోగమునకుపాదానకారణము ఉభయమై యున్నది. అందువలన పటము

కూడ ఉపాదానకారణమై యున్నది. తథాపి అగ్నిసంయోగమునకును పటమునకును పరస్పరనాశ్యనాశకభావరూపవిరోధ మున్నది. అవిరోధము లేదు. అందువలన కార్యకారణములకు పరస్పరావిరోధ మున్నదను నీ నియమము సంభవించుట లేదు. యద్యపి వైశేషికశాస్త్రరీతిగా నగ్నిసంయోగముచేత పటమునకు నాశము గలుగుటలేదు. ఎట్లన, అగ్నిసంయోగముచేత పటారంభకతంతువునందు క్రియ గలుగుచున్నది. క్రియచేత తంతువిభాగముచేత పటాసమవాయికారణ మగు తంతుసంయోగము నాశ మగుచున్నది. తంతుసంయోగనాశముచేత పటమునకు నాశముకలుగుచున్నది. ఈరీతిగా వైశేషికమతమునందు అసమవాయికారణముచేత ద్రవ్యమునకు నాశము కలుగుచున్నది. అందువలన పటనాశమందు తంతుసంయోగనాశమునకు హేతుత్వమున్నది. పటాగ్నిసంయోగమునకు పటనాశమందు హేతుత్వము లేదు. తథాపి పూర్వోక్తక్రమముగా పటనాశ మైనయెడల అగ్నిసంయోగముచేత పంచమక్షణమునందు పటనాశము సంభవించుచున్నది. అగ్నిసంయోగముచేత అవ్యవహితోత్తరకాలమునందు పటనాశము ప్రతీతమగుచున్నది. అందువలన వైశేషికమతము అసంగతమై యున్నది. మఱియును అగ్నిసంయోగముచేత భస్మీకృతపటముయొక్క యవయవము సంశ్లిష్టమైయే ప్రతీత మగుచున్నది. ఈలాగుననే ముద్గరముచేత చూర్ణీభూతఘటము కపాలవిభాగజన్యసంయోగనాశము లేకయే నాశ మగుచున్నది. అందువలన అవయవసంయోగనాశమునకు అవయవినాశమునందు గారణత్వము సంభవింపనందున తంతుసంయోగనాశమునకు పటనాశమునందు కారణత్వము లేదు. ఇక నేమనగా పటాగ్నిసంయోగమె పటనాశమునందు కారణమై యున్నది. మఱియును పటాగ్నిసంయోగమునకు అగ్నిసహితపటము ఉపాదాన కారణమై యున్నది. అందువలన కార్యకారణములకు గూడ నాశ్యనాశకభావరూప విరోధము ప్రసిద్ధ మైనందున వానికి పరస్పరావిరోధ మున్నదను నియమము సంభవించుటలేదు. ఈరీతిగా నవిద్యాజన్యవృత్తిజ్ఞానముచేత కార్యసహితావిద్య నాశ మగుచున్నది. అయిన,—

295—303. అవిద్యాలేశసంబంధవిచారము.

295. తత్త్వజ్ఞానముచేత అవిద్యారూపోపాదానమునకు నాశము గలిగి జీవన్ముక్తవిద్వాంసులకు దేహస్థితిశంక.

సకలావిద్యకు తత్త్వజ్ఞానముచే నాశ మయినయెడల జీవన్ముక్తవిద్వాంసుల

యొక్క దేహామునకు తత్త్వజ్ఞానకాలమునందు అభావము కానలయును. ఎట్లన ఉపాదానకారణమగు నవిద్యకు నాశము గలిగినయెడల కార్యమునకు స్థితి సంభవింపదు.

**296. ఉక్తశంకకు కొందఱాచార్యులు చెప్పినరీతిగా సమాధానము.**

కొందఱు చెప్పు సమాధాన మే మనగా, ఎట్లు ధనుస్సునకు నాశమైనను ప్రక్షిప్తబాణముయొక్క వేగముయొక్క స్థితి యున్నదో అట్లు విద్వాంసుల యొక్క శరీరమునకు స్థితి కారణనాశము గలిగినను, సంభవించుచున్నది.

**297. ఉక్తసమాధానమున కసంభవము.**

ఈ సమాధానముకూడ సంభవించుట లేదు. ఎట్లన నిమిత్తకారణము నాశమైన యెడల కార్యమునకు స్థితియు సంభవించుచున్నది. ఉపాదానముయొక్క నాశమైనయెడల కార్యమునకు స్థితి సంభవించుట లేదు. బాణవేగమునకు నుపాదానకారణము బాణమై యున్నది. దానికి నిమిత్తకారణము ధనుస్సైయున్నది. దానియొక్క నాశముచేత బాణవేగమునకు స్థితి సంభవించుచున్నది. అందువలన నవిద్యారూపోపాదానమునకు నాశము గలిగినను విద్వాంసుల శరీరమునకు స్థితి సంభవింపనందున తత్త్వజ్ఞాన ముండినను అవిద్యాలేశ మున్నది; అని గ్రంథకారులచేత వ్రాయబడియున్నది.

**298. అవిద్యాలేశమునకు త్రైవిధ్యము.**

అచ్చట మతభేదముచేత అవిద్యాలేశముయొక్క స్వరూపము త్రిప్రకారకమై యున్నది. ఎట్లు ప్రక్షాళిత లశునభాండమునందు గంధ మున్నదో అట్లు అవిద్యాసంస్కారము అవిద్యాలేశ మనంబడును. అథవా అగ్నిదగ్ధపటమువలెను, స్వకార్యమునం దసమర్థమగు జ్ఞానబాధితావిద్య, యవిద్యాలేశ మనంబడును. యద్వా ఆవరణవిక్షేపశక్తిరూపాంశద్వయముగలది అవిద్యయై యున్నది. తత్త్వజ్ఞానముచేత నావరణశక్తివిశిష్టావిద్యాంశమునకు నాశము కలుగుచున్నది. మఱియును ప్రారబ్ధకర్మరూపప్రతిబంధకముండుటవలన విక్షేపశక్తివిశిష్టావిద్యాంశమునకు నాశముకలుగుట లేదు,తత్త్వజ్ఞానోత్తర కాలమందును గూడ దేహవిక్షేపమునకుపాదానమగు నవిద్యాంశమునకు శేష మున్నది. దానిచేత స్వరూపావరణము గలుగుటలేదు. అదియె అవిద్యాలేశ మనంబడును.

**299. ప్రకృతార్థమునందు సర్వజ్ఞాత్మమునులయొక్క మతము.**

సర్వజ్ఞాత్మమునులయొక్క మతి మే మనగా; తత్త్వజ్ఞానోత్తరమునందు శరీరాది ప్రతిభాసము గలుగుటలేదు. జీవన్ముక్తిప్రతిపాదకశ్రుతివచనమునకు

స్వార్థమునందు తాత్పర్యము లేదు. ఎట్లన శ్రవణవిధికి అర్థవాదరూపజీవన్ముక్తి ప్రతిపాదకవచన మున్నది. ఏశ్రవణప్రతాపముచేత జీవత్పురుషులకు ముక్తిగలుగుచున్నదో అది యుత్తమాత్మశ్రవణమై యున్నది. ఈరీతిగా నాత్మశ్రవణమునకు స్తుతియందు తాత్పర్య ముండుటవలన జీవన్ముక్తిప్రతిపాదకవచనమునందు జ్ఞానికి దేహాదిప్రతిభాసము చెప్పుట సంభవింపదు. ఈరీతిగా తత్త్వజ్ఞానావ్యవహితోత్తర కాలమునందే విదేహమోక్షము గలుగుచున్నది. ఈమతమునందు అవిద్యాలేశ ముండుట లేదు. అయిన,—

300. ఉక్తమతమునకు జ్ఞానియొక్క యనుభవమునకు విరోధము.

ఈమతము జ్ఞానియొక్క యనుభవమునకు విరుద్ధమై యున్నది. ఏతత్త్వజ్ఞానముచే కార్యసహితావిద్యకు నివృత్తి గలుగుచున్నదో ఆతత్త్వజ్ఞానముయొక్క నివృత్తిప్రకారము చెప్పబడినది. తత్త్వజ్ఞానముచేత నవిద్యానివృత్తి. తత్త్వజ్ఞానమునకు నివృత్తి యుత్తరకాలమునందు గలుగుచున్నది. ఈక్రమముచేత తత్త్వజ్ఞాననివృత్తి కలుగుట లేదు. ఎట్లన, తత్త్వజ్ఞానముచేత నితరానాత్మవస్తువులకు శేష ముండుటలేదు. కేవలచేతనమునకు నసంగిత్వ ముండుటవలన నాశకత్వము సంభవించుటలేదు. తత్త్వజ్ఞానమునకు స్వనాశకత్వమును సంభవించుట లేదు. అందువలన తత్త్వజ్ఞానమునకు నాశము లేకపోవలయును.

301. అవిద్యానివృత్తికాలమునందు తత్త్వజ్ఞాననివృత్తిప్రకారము.

ఈరీతిగా అవిద్యానివృత్త్యుత్తరకాలమునందు తత్త్వజ్ఞాననివృత్తి సంభవింపనందున అవిద్యానివృత్తి కాలమునందే జ్ఞాననివృత్తి యీరీతిగా గలుగుచున్నది. ఎట్లు జలమునందు ప్రక్షిప్తకతకరేణువుచేత జలగతపంకమునకు విశ్లేషము గలిగి దానితో కతకరజస్సునకుగూడ విశ్లేషము గలుగుచున్నను కతకరజస్సుయొక్క విశ్లేషమునందు సాధనాంతరాపేక్ష లేదు; తృణకూటమునందు సంగారాపేక్షచేత తృణకూటము భస్మమగుచున్న దానితోనే అంగారముకూడ భస్మమగుచున్నది. ఈలాగుననే కార్యసహితావిద్యకు నివృత్తి గలిగి దానితోనే తత్త్వజ్ఞానమునకు గూడ నివృత్తి గలుగుచున్నది. అందువలన తత్త్వజ్ఞాననివృత్తియందు సాధనాంతరాపేక్ష లేదు.

302. ప్రకృతార్థమునందు పంచపాదికాచార్యులయొక్క మతము.

పంచపాదికాచార్యులగు పద్మపాదాచార్యులయొక్క మత మేమనగా; జ్ఞానమునకు నజ్ఞానముతో విరోధ మున్నది. అజ్ఞానకార్యముతో జ్ఞానమునకు విరో

ధము లేదు. అందువలన తత్త్వజ్ఞానముచేత కేవలాజ్ఞాననివృత్తి యగుచున్నది. అజ్ఞానముయొక్క నివృత్త్యుత్తరకాలమునందు ఉపాదానము లేనందున కార్యమునకు నివృత్తి గలుగుచున్నది. అయిన దేహాదికార్యముయొక్క నివృత్తియందు ప్రారబ్ధకర్మము ప్రతిబంధకమై యున్నది. అందువలన ఉక్తరీతిగా అవిద్యాలేశమున్నది. ఎందఱు జీవన్ముక్తులకు దేహాదిప్రతీతియును సంభవించుచున్నదో వారికి ప్రారబ్ధరూపప్రతిబంధకాభావము గలిగి దేహాదికమునకును తత్త్వజ్ఞానమునకును నివృత్తి గలుగుచున్నది. ఈమతమునందు ప్రారబ్ధాభావ సహితావిద్యానివృత్తియే తత్త్వజ్ఞాననివృత్తికి హేతువై యున్నది.

303—309. తత్త్వజ్ఞానమునకు కరణవిషయమునందును, సహకారిసాధనవిషయమునందును, విచారము.

303. ఉత్తమమధ్యమాధికారిభేదముచేత తత్త్వజ్ఞానమునకు ద్వివిధసాధనకథనము.

ఏ తత్త్వజ్ఞానముచేత నవిద్యానివృత్తి కలుగుచున్నదో ఆ తత్త్వజ్ఞానమునకు ద్వివిధసాధనము లున్నవి. ఉత్తమాధికారులకైననో శ్రవణాదికమే సాధనమై యున్నది. మధ్యమాధికారులకు నిర్గుణబ్రహ్మవిషయకాహంగ్రహోపాసనమే సాధనమై యున్నది. ఇది సకలాద్వైతశాస్త్రసిద్ధాంతమై యున్నది. అయిన,—

304. ఉక్తపక్షద్వయమునందును ప్రసంఖ్యానమునకు తత్త్వజ్ఞానముయొక్క కరణతారూపప్రమాణత.

రెండుపక్షములయందును తత్త్వజ్ఞానమునకు కరణరూప ప్రమాణము ప్రసంఖ్యానమై యున్నది. ఇది కొందఱియొక్క మతమై యున్నది. వృత్తిప్రవాహము ప్రసంఖ్యాన మనంబడును. ఎట్లు మధ్యమాధికారులకు నిర్గుణబ్రహ్మాకారనిరంతరవృత్తిరూపోపాసన కర్తవ్యమై యున్నది, అది ప్రసంఖ్యానమై యున్నది; ఈలాగుననే ఉత్తమాధికారులకు గూడ మననోత్తరమునందు నిదిధ్యాసనరూప ప్రసంఖ్యానమే బ్రహ్మ సాక్షాత్కారమునకు కరణమై యున్నది. యద్యపి షడ్విధప్రమాణమునందు ప్రసంఖ్యానమునకు నంతర్భావము లేనందున దానికి ప్రమాకరణత్వము సంభవించుట లేదు. తథాపి సగుణబ్రహ్మధ్యానమునకు సగుణబ్రహ్మసాక్షాత్కారకరణత్వమును, నిర్గుణబ్రహ్మధ్యానమునకు నిర్గుణబ్రహ్మసాక్షాత్కారకరణత్వమును సకలశ్రుతి స్మృతులయందును ప్రసిద్ధమై యున్నది. ఈలాగుననే వ్యవహితకామినియొక్క ప్రసంఖ్యానమునకు కామినీసాక్షాత్కారకరణత్వము

లోకమునందు ప్రసిద్ధమై యున్నది. అందువలన నిదిధ్యాసనరూపప్రసంఖ్యానము కూడ బ్రహ్మసాక్షాత్కారమునకు కరణముగా సంభవించుచున్నది. యద్యపి ప్రసంఖ్యానజన్య బ్రహ్మజ్ఞానమునకు ప్రమాణజన్యత్వము లేనందున ప్రమాత్వము సంభవించుట లేదు తథాపి సంవాదభ్రమవలె విషయమునకు సబాధ ముండుట వలన ప్రమాత్వము సంభవించుచున్నది. మఱియును నిదిధ్యాసనరూప ప్రసంఖ్యానమునకు మూలకారణము శబ్దప్రమాణమై యున్నది. అందువలనను గూడ బ్రహ్మజ్ఞానమునకు ప్రమాత్వము సంభవించుచున్నది.

305 భామతీకారవాచస్పతిమతమునందు ప్రసంఖ్యానమునకు మనస్సహకారిత్వమును, మనస్సునకు బ్రహ్మజ్ఞానకారణత్వమును.

భామతీకారులగు వాచస్పతిమత మేమనగా, ప్రసంఖ్యానము మనస్సునకు సహకారియై యున్నది. మనస్సు బ్రహ్మజ్ఞానమునకు కరణమై యున్నది. ప్రసంఖ్యానమునకు జ్ఞానకరణత్వము అప్రసిద్ధమై యున్నది. సగుణనిర్గుణబ్రహ్మల యొక్క ధ్యానముకూడ మనస్సునకు సహకారియై యున్నది. వానియొక్క సాక్షాత్కారమునకుధ్యానము కరణముకాదు. ఇకనేమనగా, మనస్సే కరణమై యున్నది. ఈలాగుననే వ్యవహితకామినియొక్క ధ్యానముకూడ కామినీ సాక్షాత్కారమునకు కరణము కాదు. ఇక నేమనగా కామినీచింతనసహిత మనస్సే దానియొక్క సాక్షాత్కారమునకు కరణమై యున్నది. ఈప్రకారముగా మనస్సే బ్రహ్మజ్ఞానమునకు కరణమై యున్నది.

306. అద్వైతగ్రంథముయొక్క ముఖ్యమతము. (ఏకాగ్రతాసహిత మనస్సునకు సహకారిత్వమును, వేదాంతవాక్యరూప శబ్దమునకు బ్రహ్మజ్ఞానకరణత్వమును.)

మఱియును అద్వైతగ్రంథముయొక్క మతమేమనగా వాక్యజన్య జ్ఞానానంతరమునందు ప్రసంఖ్యానముయొక్క యపేక్ష లేదు. ఇకనేమనగా, మహావాక్యముచేతనే అద్వైతబ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. సకల జ్ఞానమందును మనస్సు సహకారియై యున్నది. మఱియును వేదాంతవాక్యరూపశబ్దప్రమాణమే బ్రహ్మజ్ఞానమునకు కరణమై యున్నది. మనస్సుకాదు. ఎట్లన, వృత్తిరూపజ్ఞానమునకు ఉపాదానమైనందున ఆశ్రయము అంతఃకరణమై యున్నది. అందువలన జ్ఞానమునకు కర్త మనస్సై యున్నది. దానికి జ్ఞానకరణత్వము సంభవించుటలేదు. మఱియును జ్ఞానానంతరమునందు మనస్సునకు కరణత్వము నంగీకరించి

ననుగూడ బ్రహ్మజ్ఞానకరణత్వము సర్వథా విరుద్ధమై యున్నది. ఎట్లన, "యన్మనసా న మనుతే" ఇత్యాది శ్రుతియందు బ్రహ్మమునకు బ్రహ్మజ్ఞానవిషయత్వము నిషేధింపబడియున్నది. మఱియు బ్రహ్మమునకు ఔపనిషదత్వము చెప్పబడినది. అందువలన నుపనిషద్రూపశబ్దమే కరణమై యున్నది. మఱియును బ్రహ్మమును, మనస్సుచేత లోకము తెలిసికొనుటలేదు, అని శ్రుత్యర్థమై యున్నది. యద్యపి కైవల్యశాఖయందు ఎచ్చట మనస్సునకు బ్రహ్మజ్ఞానకరణత్వము నిషేధింపబడియున్నదో ఆస్థానమునందు వాక్కునకు బ్రహ్మజ్ఞానకరణత్వము నిషేధింపబడియున్నది. అందువలన శబ్దమునకుగూడ బ్రహ్మజ్ఞానకరణత్వము శ్రుతివిరుద్ధమై యున్నది. తథాపి శబ్దమునకు బ్రహ్మజ్ఞానకరణత్వములేదు; అను నీయర్థమునందు శ్రుతితాత్పర్యముండినయెడల బ్రహ్మమునకు నుపనిషద్వేద్యత్వరూప ఔపనిషదత్వ కథన మసంగత మగును. అందువలన శబ్దముయొక్క లక్షణావృత్తిచేత బ్రహ్మగోచరజ్ఞానము గలుగుచున్నది. శక్తివృత్తిచేత బ్రహ్మజ్ఞానము శబ్దముచే కలుగుటలేదు. ఈ రీతిగా శ్రుతితాత్పర్యమై యున్నది. అందువలన శక్తివృత్తిచేత శబ్దమునకు బ్రహ్మజ్ఞానకరణతానిషేధ మున్నది. మఱియును లక్షణావృత్తిచేత శబ్దమునకు బ్రహ్మజ్ఞానకరణత్వ ముండుటవలన బ్రహ్మమునకు నౌపనిషదత్వము సంభవించుచున్నది. బ్రహ్మసాక్షాత్కారము మానస మని యంగీకరింపబడియున్నది. వారిమతమందును గూడ బ్రహ్మపరోక్షజ్ఞానము శబ్దముచేతనే యంగీకరింపబడియున్నది. అందువలన బ్రహ్మజ్ఞానమునందు శబ్దమునకు కరణత్వము రెండుమతములయందు ఆవశ్యకమై యుండుటవలన బ్రహ్మసాక్షాత్కారమునకు కరణము శబ్దమై యున్నది. ఈరీతిగా బ్రహ్మసాక్షాత్కారమునకు కరణము శబ్దమై యున్నది.

307. శబ్దముచేత నపరోక్షజ్ఞానోత్పత్తియందు శంకా సమాధానములు.

యద్యపి శబ్దమునందు పరోక్షజ్ఞానోత్పాదనసామర్థ్య మున్నది. శబ్దముచేత నపరోక్షజ్ఞానమునకు నుత్పత్తి సంభవించుటలేదు. తథాపి శాస్త్రోక్తశ్రవణమననపూర్వక బ్రహ్మగోచరపరోక్షజ్ఞానసంస్కారవిశిష్టైకాగ్రచిత్త సహిత శబ్దముచేత నపరోక్షజ్ఞానము గలుగుచున్నది. ఎట్లు ప్రతిబింబబింబములకు అభేదవాదమునందు జలపాత్రదర్పణాదిసహకృతనేత్రముచేత సూర్యాదిసాక్షాత్కారమగుచున్నదో, అచ్చట కేవలనేత్రమునకు సూర్యాదిసాక్షాత్కారమునందు సామర్థ్యములేదు. మఱియును చంచలమగు, లేక, మలినమగు ఉపాధి

యొక్క సన్నిధానముచేతనుగూడ సామర్థ్యములేదో, మఱియును నిశ్చల నిర్మ లోపాధిసహాకృత నేత్రమునందు సూర్యాదిసాక్షాత్కారసామర్థ్య మున్నదో అట్లు సంస్కారవిశిష్ట నిర్మల నిశ్చలచిత్తరూప దర్పణ సహాకారమువలన శబ్దము చేతనుగూడ బ్రహ్మాపరోక్షజ్ఞానము సంభవించుచున్నది. అన్యదృష్టాంతము. ఎట్లు లౌకికాగ్నియందు కృతహోమముచేత స్వర్గహేతువగు నపూర్వమునకు నుత్పత్తి యగుటలేదో వైదిక సంస్కారసహితాగ్నియందు చేయబడినహోమముచేత స్వర్గజనకాపూర్వమున కుత్పత్తి యగుచున్నది. హోమమునకు స్వర్గసాధనత్వము శ్రుతియందు చెప్పబడియున్నది. ద్వితీయక్షణమునందు వినాశియగు హోమమునకు కాలాంతరభావిస్వర్గ సాధనత్వము సంభవించుటలేదు. అందువలన స్వర్గసాధనత్వమునకు అనుత్పత్తిరూపార్థాపత్తిప్రమాణముచేత ఎట్లు అపూర్వమునకు సిద్ధి యున్నదో అట్లు బ్రహ్మజ్ఞానముచేత అధ్యాసరూపసకలదుఃఖములకు నివృత్తి శ్రుతియందు చెప్పబడియున్నది. మఱియును కర్తృత్వాద్యధ్యాసము అపరోక్షమైయున్నది. ఆయపరోక్షాధ్యాసమునకు నివృత్తి పరోక్షజ్ఞానముచేత సంభవించుటలేదు. అపరోక్షజ్ఞానముచేతనే అపరోక్షాధ్యాసమునకు నివృత్తి గలుగుచున్నది. అందువలన బ్రహ్మజ్ఞానమునకు నపరోక్షాధ్యాసనివర్తకత్వానుపపత్తిచేత, ప్రమాణాంతరాగోచరబ్రహ్మమునకు శబ్దముచేత, నపరోక్షజ్ఞానము సిద్ధమగుచున్నది. ఎట్లు శ్రుతార్థాపత్తిచేత అపూర్వమునకు సిద్ధి యగుచున్నదో అట్లు శబ్దజన్యబ్రహ్మవిషయాపరోక్షజ్ఞానముయొక్క సిద్ధియునుగూడ శ్రుతార్థాపత్తిచేత కలుగుచున్నది.

308. అన్యగ్రంథకారరీతిగా శబ్దమునకు నపరోక్షజ్ఞాన జనకత్వము.

అన్యగ్రంథమునందు శబ్దమునకు అపరోక్షజ్ఞానజనకత్వము ఈ దృష్టాంతముచేత జెప్పబడినది. ఎట్లు బాహ్యపదార్థసాక్షాత్కారమునందు మనస్సు అసమర్థమై యున్నది. తథాపి భావనాసహితమగు మనస్సుచేత నష్టవనితయొక్క సాక్షాత్కారమగుచున్నదో అట్లు కేవలశబ్దమైననో అపరోక్షజ్ఞానమునం దసమర్థమై యున్నది. కాని, పూర్వోక్త మనస్సహితశబ్దముచేత బ్రహ్మాపరోక్షజ్ఞానము కలుగుచున్నది.

309.-325. విషయమునకును, జ్ఞానమునకును, అపరోక్షత్వమునందు విచారము.

309. అన్యగ్రంథకార రీతిగా జ్ఞానము, విషయము, యీ యుభయమునందు నపరోక్షత్వ వ్యవహారకథనము.

అన్యగ్రంథకార రీతిగా చెప్పబడిన దేమనగా జ్ఞానమునందును, విషయము నందును, ఈ రెంటియందును అపరోక్షత్వవ్యవహార మున్నది. ఎట్లన, నేత్రాదీంద్రియముచేత, ఘటము జ్ఞాత మగుచున్నది. అచ్చట ఘటమునకు ప్రత్యక్షజ్ఞాన మున్నది. మఱియు ఘటముచు ప్రత్యక్షమై యున్నది. ఈరీతిగా నుభయవిధవ్యవహారము అనుభవసిద్ధమై యున్నది. అచ్చట జ్ఞాతమునందు అపరోక్షత్వము కరణాధీనము కాదు. ఎట్లన, ఇంద్రియజన్య జ్ఞాన మపరోక్షమై యున్నది. అనుమానాదిజన్య జ్ఞానము పరోక్షమై యున్నది. ఆజ్ఞానములయందు పరోక్షత్వమును,అపరోక్షత్వమును, కరణాధీనమై యున్నవి. ఆ యింద్రియజన్య జ్ఞానములకు అపరోక్షత్వము గ్రంథకారులచేత ఖండితమై యున్నది. అందువలన అపరోక్షార్థ గోచరజ్ఞానము అపరోక్షముగా చెప్పబడినది. ఈరీతిగా జ్ఞానమునం దపరోక్షత్వము విషయాధీనమై యున్నది. అందువలన అపరోక్షవిషయముయొక్క జ్ఞానము అపరోక్షముగానే కలుగుచున్నది. ఇంద్రియజన్యమైనను, లేక ప్రమాణాంతర జన్యమైనను, కానిచ్చును. దీనియం దభినివేశము లేదు. అందువలన సుఖాదిజ్ఞానమును, ఈశ్వర జ్ఞానమును,స్వప్నజ్ఞానమును, ఇంద్రియజన్యము కాదు. తథాపి, ప్రత్యక్షమై యున్నది. అందువలన జ్ఞానమునందు ఇంద్రియజన్యత్వరూపాపరోక్షత్వము లేదు. అపరోక్షార్థరూపజ్ఞానమే అపరోక్షజ్ఞాన మనంబడును.

### 310. ఉక్తార్థమునందు శంకాసమాధానములు.

యద్యపి అపరోక్షజ్ఞానవిషయ మపరోక్ష మనంబడును. అందువలన నపరోక్షార్థగోచరజ్ఞానమునకు అపరోక్షత్వమును జెప్పుటయందు అన్యోన్యాశ్రయ దోష మున్నది. ఎట్లన, జ్ఞానగతాపరోక్షత్వనిరూపణయందు విషయగతాపరోక్షత్వముయొక్క జ్ఞానము జ్ఞానగతాపరోక్షత్వముయొక్క జ్ఞానమునకు హేతువై యున్నది. తథాపి, విషయమునందు అపరోక్షత్వమును అపరోక్షజ్ఞానవిషయతారూప మని యంగీకరించినయెడల అన్యోన్యాశ్రయ దోషమున్నది. అందువలన విషయనిష్ఠాపరోక్షత్వము ఉక్తస్వరూపము కాదు. ఇక నేమనగా ప్రమాతృచేతనముతో అభేదమే విషయాపరోక్షత్వమై యున్నది. అందువలన జ్ఞానముయొక్క యపరోక్షత్వ నిరూపణమునందు విషయగతాపరోక్షజ్ఞానాపేక్ష యుండినను విషయగతాపరోక్షత్వనిరూపణమునందు జ్ఞానగతాపరోక్షత్వ జ్ఞానమునకు నుపయోగము లేనందున అన్యోన్యాశ్రయ దోషము లేదు,

311. విషయమునందు పరోక్షత్వాపరోక్షత్వసంపాదక ప్రమాతృచేతనములయొక్క భేదమును, అభేదసహిత విషయగతపరోక్షత్వాపరోక్షత్వములయొక్క యధీనమైయే జ్ఞానగతపరోక్షత్వాపరోక్షత్వ నిరూపణము.

సుఖాదికము అంతఃకరణధర్మమై సాక్షిచేతనమునం దధ్యస్తమై యున్నది. మఱియును అధిష్ఠానముకంటె పృథక్సత్త యధ్యస్తములకు లేదు. అందువలన సుఖాదికమునకు ప్రమాతృచేతనముతో సదా యభేద ముండుటవలన వానియందు సదా యపరోక్షత్వ మున్నది. మఱియును అపరోక్షసుఖాదిగోచర జ్ఞానము కూడ, అపరోక్షమైయే యున్నది. మఱియును బాహ్యఘటాదికము యద్యపి బాహ్యచేతనమునం దధ్యస్తమైనందున ప్రమాతృచేతనముతో సర్వదా వానికి అభేదము లేదు. తథాపి, వృత్తిద్వారా బాహ్యచేతనమునకు ప్రమాతృచేతనముతో నభేద మున్నది. ఆకాలమునందు ప్రమాతృచేతనమె ఘటాదికమునకు అధిష్ఠానమై యున్నది. ఆకాలమునందే ఘటాదికమునందు అపరోక్షత్వ ధర్మ మున్నది. అపరోక్షత్వవిశిష్ట ఘటాదికముయొక్క జ్ఞానము కూడ అపరోక్షముగా చెప్పబడుచున్నది. మఱియు ఘటాదిగోచరానుమితిచే వృత్తి యుండిన యెడల ఆకాలమునందు ప్రమాతృచేతనముతో ఘటాదికమునకు నభేదము లేనందున వానియం దపరోక్షత్వధర్మము లేదు. అందువలన ఘటాదికము యొక్క యనుమిత్యాది జ్ఞానము అపరోక్షముగా చెప్పబడ లేదు. పరోక్షమై చెప్పబడి యున్నది. బ్రహ్మచేతనమునకు ప్రమాతృ చేతనముతో సదా యభేద ముండుటవలన బ్రహ్మచేతనము సదా యపరోక్షమై యున్నది. అందువలన మహా వాక్యరూప శబ్దప్రమాణజన్య బ్రహ్మజ్ఞానము కూడ అపరోక్షముగానే చెప్పబడినది. ఈప్రకారముగా జ్ఞానమునకు పరోక్షత్వాపరోక్షత్వములు ప్రమాణాధీనములు కావు. ఇక నేమనగా, విషయగతపరోక్షాపరోక్షాధీనములైయే జ్ఞానగతపరోక్షత్వాపరోక్షత్వము లున్నవి. మఱియును విషయమునందు పరోక్షత్వాపరోక్షత్వములకు సంపాదకము ప్రమాతృ చేతనముయొక్క భేదమును, అభేదమును, అయి యున్నవి. అందువలన శబ్దజన్యబ్రహ్మజ్ఞానము కూడ అపరోక్షమై యున్నది. ఈకథనము సంభవించుచున్నది.

312. ఉక్తమతమునందు అవాంతరవాక్యజన్యబ్రహ్మజ్ఞానమునకు అపరోక్షతాప్రాప్తిరూపదోషము,

అయిన ఈమతమునందు అవాంతరవాక్యజన్య బ్రహ్మజ్ఞానము కూడ అప రోక్షము కావలయును. ఎట్లన, ఉక్తరీతిగా ప్రమాతృచేతనస్వరూపమైనందున బ్రహ్మము సదా అపరోక్షమై యున్నది. అపరోక్షవస్తుగోచరజ్ఞానము అపరోక్ష ముగానే యున్నది. అందువలన నిత్యాపరోక్షస్వభావబ్రహ్మమునకు పరోక్షజ్ఞా నము సంభవించుట లేదు. మఱియును అవాంతరవాక్యముచేత సకలగ్రంథ కారులచే బ్రహ్మముయొక్క పరోక్షజ్ఞానము అంగీకరింపబడి యున్నది. ఈలా గుననే 'దశమోఽస్తి' యను నీవాక్యముచేత దశమముయొక్క పరోక్షజ్ఞానమే కలుగుచున్నది. మఱియును పంచదశ్యాది గ్రంథములయందును, ఉక్తవాక్యము చేత దశమముయొక్క పరోక్షజ్ఞానమే చెప్పబడియున్నది. మఱియును ప్రమాతృ చేతనముతో అభిన్నుడు దశముడై యున్నాడు. అందువలన దశమవిషయము నకు అపరోక్షత్వ ముంకుటవలన ఆయనయొక్క జ్ఞానము కూడ అపరోక్షము కావలయును.

### 313. ఉక్తదోషముచేత అపరోక్షత్వమునకు అన్యలక్షణము.

అందువలన వక్ష్యమాణరీతిగా అంగీకరింపవలసినది. ఎట్లు సుఖాదికము ప్రమాతృచేతనమునం దధ్యస్తమై యున్నదో అట్లు ధర్మాధర్మములు గూడ ప్రమాతృచేతనమునం దధ్యస్తములై యున్నవి. అందువలన సుఖాదికమువలె ధర్మాదికము కూడ ప్రమాతృచేతనముతో అభిన్నమైనందున అపరోక్షము కావలయును. తథాపి యోగ్యవిషయమునకు ప్రమాతృచేతనముతో అభేదమే విషయగతాపరోక్షత్వసంపాదకమై యున్నది. ధర్మాదికము యోగ్యము కాదు. అందువలన దానికి ప్రమాతృచేతనముతో అభేద ముండినను, దానియం దప రోక్షత్వము లేదు. ఎట్లు విషయగతయోగ్యత్వము విషయగతాపరోక్షతయం దపేక్షితమై యున్నదో అట్లు ప్రమాణగతయోగ్యత్వము జ్ఞానముయొక్క యపరోక్షతయందు అపేక్షితమై యున్నది. అవాంతరవాక్యమందును అపరోక్ష జ్ఞానజనన యోగ్యత లేదు. ఇక నేమనగా మహావాక్యమునందును 'త్వం దశమః' అను నీవాక్యమునందును అపరోక్షజ్ఞానజనన యోగ్యత యున్నది. ఎట్లు విషయ యోగ్యత, ప్రత్యక్షవ్యవహారముచేత తెలియవలసినదో ఏవిషయమునకు ప్రమాతృచేతనముతో అభేద ముండుటవలన ప్రత్యక్షవ్యవహార మున్నదో ఆ విషయము యోగ్య మనంబడును. ఏవిషయమునకు ప్రమాతృచేతనముతో అభేద ముండినను గూడ ప్రత్యక్షవ్యవహారము కలుగుట లేదో ఆవిషయ మయోగ్య

మనంబడును. ఉ. ధర్మాధర్మసంస్కారములు అయోగ్యములై యున్నవి. విష యమువలె ప్రమాణమునందును గూడ యోగ్యతాదికము అనుభవానుసార ముగా తెలియవలసినది. బాహ్యేంద్రియమునందు ప్రత్యక్షజ్ఞానయోగ్యతయు న్నది. అనుమానాదికమునందు పరోక్షజ్ఞానజనన యోగ్యత యున్నది. అనుపలబ్ధి యందును, శబ్దమునందును, ఉభయవిధజ్ఞానజనన యోగ్యత్వ మున్నది. అయిన,

314. అపరోక్షజ్ఞానమునందు సర్వజ్ఞాత్మమునులయొక్క మతాను వాదము.

ఇంత మాత్రము విశేష మున్నది. ప్రమాతతో అసంబాధి పదార్థము నకు శబ్దముచేత కేవల పరోక్షజ్ఞానము కలుగుచున్నది. మఱియును ఏపదార్థ మునకును ప్రమాతతో తాదాత్మ్యసంబంధ మున్నదో దానియందు యోగ్యత యుండినను ప్రమాతతో నభేదబోధకశబ్దము లేనియెడల శబ్దముచేత పరోక్ష జ్ఞానమే కలుగుచున్నది. అపరోక్ష జ్ఞానము కలుగుట లేదు. ఉ. ఇట్లు "దశమో ఽస్తి" యను నీవాక్యమునందు ప్రమాతతో నభేదబోధకశబ్దము లేనందున ఉక్త వాక్యశ్రోతలకు స్వాభిన్నదశమునియొక్క పరోక్షజ్ఞానమే కలుగుచున్నది. అప రోక్షజ్ఞానము కలుగుట లేదు. ఏవాక్యమునందు ప్రమాతతో అభిన్న యోగ్య విషయమునకు ప్రమాతతో అభేదబోధకశబ్ద మున్నదో ఆవాక్యముచే పరోక్ష జ్ఞానము కలుగుట లేదు. ఇక నేమనగా అపరోక్షజ్ఞానమే కలుగుచున్నది. ఇది సర్వజ్ఞాత్మ మునులయొక్క మతమై యున్నది. ఈమతమునందు కేవలశబ్దమే అపరోక్షజ్ఞానమునకు హేతువై యున్నది. మఱియును పరోక్షజ్ఞాన జనితసంస్కా రవిశిష్టైకాగ్రచిత్తసహిత శబ్దముచేత నపరోక్షజ్ఞానము గలుగుచున్నదను నీ మతము ప్రథమమునందు చెప్పబడియున్నది.

315. పూర్వమునందే దూషిత మగు విషయగతాపరోక్షత్వాధీనము జ్ఞానగతాపరోక్షత్వమై యున్నది; అను నీమతమునకు అను వాదము.

అపరోక్షార్థగోచర జ్ఞానమునకు అపరోక్షత్వము నంగీకరించి బ్రహ్మజ్ఞాన మునకు అపరోక్షత్వము సంభవించుచున్న దనునిది మధ్యమునందు తృతీయ మతముగా చెప్పబడినది. ఈమతమునందు నిత్యాపరోక్షబ్రహ్మగోచరమగు అవాం తరవాక్యజన్యబ్రహ్మజ్ఞానముకూడ అపరోక్షము కావలయును; అను నీదూష ణము చెప్పబడినది.

316. అద్వైతవిద్యాచార్యులరీతిగా విషయగత జ్ఞానగతమగు నప రోక్షత్వములకు ప్రకారాంతరముచేత కథనము. మఱియును దూషితోత్తరమతమునందు దూషణాంతరకథనమును ;

అద్వైతవిద్యాచార్యులచే అర్థగతాపరోక్షత్వమును, జ్ఞానగతాపరోక్షత్వ మును, ప్రకారాంతరము చెప్పబడియున్నది. మఱియును, దూషితోత్తమతము నందు దూషణాంతరము చెప్పబడినది. తథాహి ప్రమాతతో నభిన్నార్థమును అపరోక్షస్వరూపముగా నంగీకరించి యపరోక్షార్థగోచరజ్ఞానమునకు అపరోక్ష త్వము చెప్పినయెడల స్వప్రకాశాత్మ సుఖరూపజ్ఞానమునందు అపరోక్షజ్ఞానలక్ష ణమునకవ్యాప్తి యగును. ఎట్లన, అపరోక్ష మర్థమై యున్నది. గోచర మనగా విష యము. దేనికి అజ్ఞానమును అపరోక్షముగా జెప్పినయెడల జ్ఞానవిషయములకు పరస్పరభేదసాపేక్షవిషయవిషయిభావసంబంధ మున్నదో ఆస్థానమునందు జ్ఞాన గతాపరోక్షలక్షణ ముండును. మఱియును, స్వయంప్రకాశసుఖమునకు జ్ఞాన ముతో నభేద ముండుటవలన విషయవిషయిభావము సంభవింపనందున దాని యందుత్తరలక్షణము సంభవించుట లేదు. యద్యపి ప్రభాకరమతమునందు జ్ఞానము స్వయంప్రకాశ మనంబడును. మఱియును, తనయొక్క స్వరూపమును, జ్ఞాత యును, జ్ఞేయమగు ఘటాదికమును, జ్ఞానము విషయీకరించుచున్నది. అందు వలన సకలజ్ఞానము త్రిపుటీగోచరమై యున్నది; అనునది ప్రభాకరమతమై యున్నది. ఆయనమతమునందు అభేద ముండినను, విషయవిషయిభావములకు అంగీకార మున్నది. అందువలన స్వప్రకాశజ్ఞానరూపసుఖమునందు విషయవిషయి భావ మసంగతము కాదు. స్వ మ్మనగా తాను (తనస్వరూపము) ప్రకాశ మనగా విషయి దేనికో అది స్వప్రకాశ మనంబడును. ఈరీతిగా స్వప్రకాశమతముయొక్క యర్థముచేతను గూడ అభేదమునందు విషయవిషయిభావము సంభవించుచు న్నది. తథాపి ప్రకాశ్యప్రకాశములకు భేదానుభవము సిద్ధమైనందున భేదము లేక ప్రభాకరునియొక్క విషయవిషయిభావకథన మసంగతమై యున్నది. అందు వలన స్వప్రకాశపదమునకు ఉక్తార్థము కాదు. ఇక నేమనగా, 'స్వం' అనగా తన యొక్క సత్త, దానిచేత ప్రకాశ మనగా సంశయాదిరాహిత్యము; అది స్వప్రకాశ పదముయొక్క యర్థ మని అద్వైతగ్రంథమునందు చెప్పబడియున్నది.

317. అపరోక్షముయొక్క ఉక్తలక్షణమునకు అసంభవానువాదము.

ఈరీతిగా స్వప్రకాశజ్ఞానముతో అభిన్నస్వరూపసుఖమునందు విషయ,

విషయీభావము సంభవింపనందున అపరోక్షమునకు ఉత్తరక్షణము దానియందు సంభవించుట లేదు.

### 318. ఉక్తదోషముచే రహితమగు నపరోక్షలక్షణము.

అపరోక్షమునకు లక్షణ మే మనగా, స్వవ్యవహారమునకు అనుకూలమగు చైతన్యముతో అభేదము అపరోక్షవిషయమునకు లక్షణమై యున్నది. అంతఃకరణమును సుఖాదికమును సాక్షిచేతనమునం దధ్యస్తమైనందున ధర్మసహితాంతఃకరణమునకు సాక్షిచేతనముతో నభేదమున్నది. సాక్షిచేతనముతో దానికి ప్రకాశముండుటవలన దానియొక్క వ్యవహారమున కనుకూలము సాక్షిచేతనమైయున్నది. అందువలన స్వమనగా అంతఃకరణముయొక్కయు సుఖాదికముయొక్కయు వ్యవహారానుకూలమగు నేసాక్షిచేతన మున్నదో దానితో నభేదరూపమగు నపరోక్షముయొక్క లక్షణము సుఖాదిసహితాంతఃకరణమునందు సంభవించుచున్నది. మఱియును ధర్మాదికమునకు సాక్షిచేతనమునకు అభేదమున్నది. కాని, దానియందు యోగ్యత్వము లేనందున దానియొక్క వ్యవహారమున కనుకూలము సాక్షిచేతనము కాదు. అందువలన స్వవ్యవహారానుకూలచైతన్యముతో ధర్మాదికమున కభేదము లేనందున దానియం దపరోక్షత్వము లేదు. ఈలాగుననే ఘటాది గోచరవృత్తి కాలమునందు ఘటాదికమున కధిష్ఠానమగు చేతనమునకు వృత్త్యుపహితచేతనముతో నభేదమున్నది. అందువలన ఘటాదిగోచరవృత్తికాలమునందు ఘటాదిచేతనము ఘటాది వ్యవహారమున కనుకూలమైయున్నది. దానితో నభిన్నమగు ఘటాదికము అపరోక్షమై చెప్పబడును. ఘటాదిగోచర వృత్త్యభావ కాలమునందుకూడ తనకు నధిష్ఠానమగు చేతనముతో ఘటాదిక మభిన్నమైయున్నది. కాని, ఆకాలమునందు దానియొక్క వ్యవహారమున కనుకూలము అధిష్ఠానచేతనము కాదు. ఎట్లన, వృత్త్యుపహితముతో నభిన్నమై వ్యవహారమున కనుకూలమగుచున్నది. అందువలన ఘటాదిగోచరవృత్త్యభావకాలమునందు ఘటాదిక మపరోక్షముకాదు. ఈలాగుననే బ్రహ్మగోచర వృత్త్యుపహితసాక్షిచేతనమే బ్రహ్మవ్యవహారమున కనుకూలమై యున్నది. దానితో నభిన్నమగు బ్రహ్మమున కపరోక్షత్వము సంభవించుచున్నది. ఎట్లు వ్యవహారానుకూలచైతన్యముతో విషయమున కభేదము విషయగతప్రత్యక్షత్వమునకు ప్రయోజకమై యున్నదో అట్లు ఘటాదివిషయముతో ఘటాది వ్యవహారానుకూలచైతన్యమున కభేదము జ్ఞానగతప్రత్యక్షత్వమునకు ప్రయోజకమై యున్నది.

**319.** వృత్తిరూపప్రత్యక్షజ్ఞానమునందు ఉక్తాపరోక్షత్వలక్షణము నకు అవ్యాప్తి.

యద్యపి, చేతనమునందు ఘటాదికము అధ్యస్తమై యున్నది. విషయా కార వృత్తి కాలమునందు వృత్తిచేతన విషయచేతనముల కేకత్వముండుట వలన స్వాధిష్ఠానవిషయచేతనముతో నభిన్నమగు ఘటాదికమునకు వృత్తి చేతనముతో నభేదముండినను వృత్తితో ఘటాదికమున కభేదము సంభవించుటలేదు. ఎట్లు రజ్జువునందు కల్పితములగు సర్పదండ మాలలకు రజ్జువుతో నభేద ముండినను సర్పదండమాలలకు, పరస్పరభేదమే యున్నది. అభేదము లేదు. మఱియును బ్రహ్మమునందు కల్పిత సకల ద్వైతమునకును బ్రహ్మముతో నభేద ముండినను పరస్పరాభేదము లేదు. ఈలాగున వృత్తిచేతనముతో వృత్తికిని ఘటాదికమునకును అభేదములేదు. అందువలన వృత్తిరూప ప్రత్యక్ష జ్ఞానమునందు ఉక్తలక్షణమునకు అవ్యాప్తి యున్నది.

**320.** ఉక్తావ్యాప్తికి అద్వైతాచార్య ప్రకారముగా నుద్ధారము.

తథాపి అద్వైతాచార్య రీతిగా నపరోక్షత్వధర్మము చేతనమున కున్నది. వృత్తికిలేదు. ఎట్లు అనుమితిత్వ, ఇచ్ఛాత్వాదికము, అంతఃకరణవృత్తియొక్క ధర్మమైయున్నదో అట్లు అపరోక్షత్వధర్మము వృత్తియందు లేదు. ఇక నే మనగా విషయాకారవృత్త్యుపహితచేతనమున కపరోక్షత్వధర్మముండుట వలన చేతనముయొక్క యపరోక్షత్వము ఉపాధివృత్తియై యున్నది. అందువలన వృత్తి యందు అపరోక్షత్వా రోపము గలిగి వృత్తిజ్ఞాన మపరోక్షమై యున్నది; అను నీవ్యవహారము చేయబడుచున్నది. ఈరీతిగా వృత్తిజ్ఞానము లక్ష్యముకాదు. అందువలన అవ్యాప్తిలేదు. వృత్తిజ్ఞానమునం దపరోక్షత్వ ధర్మమిష్టమై అపరోక్ష లక్షణము లేనట్టైన నవ్యాప్తి సంభవించును. వృత్తిజ్ఞానము లక్ష్య ముకాదు. ఇక నేమనగా వృత్త్యుపహితచేతనమే లక్ష్యమైయున్నది. అందు వలన అవ్యాప్తి శంకలేదు. చేతనధర్మము అపరోక్షత్వమని యంగీకరించుట చేతనే సుఖాదిజ్ఞానమునందు అపరోక్షత్వము సంభవించుచున్నది. వృత్తిధర్మ ముగా అపరోక్షత్వము నంగీకరించిన యెడల సుఖాదిగోచరవృత్త్యనంగీకార పక్షమునందు, సాక్షిరూప సుఖాదిజ్ఞానమునందు, అపరోక్షత్వ వ్యవహారము లేక పోవలయును. అందువలన నపరోక్షత్వ ధర్మము చేతనమునందున్నది. వృత్తికి లేదు.

321. ఉక్తపక్షమందు శంక.

ఈపక్షమం దొక శంకయున్నది. సంసారదశయందును గూడ జీవునకు బ్రహ్మముతో నభేదముండుటవలన సర్వపురుషులకు బ్రహ్మ మపరోక్షమై యున్నది, అను నీ వ్యవహారముకావలయును. మఱియును అవాంతరవాక్యజన్యబ్రహ్మజ్ఞానముగూడ అపరోక్షము కావలయును. ఎట్లన, అవాంతరవాక్యజన్య వృత్త్యుపహితసాక్షిచేతనమునకు బ్రహ్మరూపవిషయముతో అభేదమున్నది. తథాపి.

322. ఉక్తశంకాసమాధానము.

సమాధానమేమనగా, స్వవ్యవహారానుకూలచేతనముతో అనావృత విషయమునకు అభేదము అపరోక్షవిషయ లక్షణమైయున్నది. అనావృత విషయముతో స్వవ్యవహారానుకూల చేతనమునకు అభేదము అపరోక్షజ్ఞానలక్షణమై యున్నది. సంసారదశయందు ఆవృతబ్రహ్మమునకు స్వవ్యవహారానుకూల చేతనముతో నభేదముండినను, అనావృతవిషయమునకు అభేదము లేనందున బ్రహ్మమునం దపరోక్షత్వము లేదు. ఈలాగుననే అవాంతరవాక్యజన్య జ్ఞానమునకును ఆవృతవిషయముతో నభేదముండుటవలన ఆజ్ఞానమునకు, అపరోక్షత్వము లేదు. అందువలన నుక్తశంక సంభవించదు.

323. ఉక్తపక్షమునం దన్య శంక.

అన్యశంకయేమనగా. ఉక్తరీతిగా అనావృతవిషయమునకు అభేదముచేత అపరోక్షత్వము నంగీకరించినయెడల అన్యోన్యాశ్రయరూప దోషమగును. ఎట్లన, సమానగోచరజ్ఞానమాత్రమును ఆవరణనివర్తకముగా నంగీకరించినయెడల పరోక్షజ్ఞానముచేతనుగూడ అజ్ఞానమునకు నివృత్తికావలయును. మఱియును సిద్ధాంతమునందు అసత్త్వాపాదకాజ్ఞానశక్తికి తిరోధానము, లేక, నాశము పరోక్షజ్ఞానముచేత గలుగుచున్నది. అభానాపాదకశక్తివిశిష్టాజ్ఞానమునకు పరోక్షజ్ఞానముచేత నాశము కలుగుటలేదు. అపరోక్షజ్ఞానముచేతనే అజ్ఞానమునకు నాశము కలుగుచున్నది. ఈరీతిగా జ్ఞానముయొక్క అపరోక్షత్వసిద్ధ్యధీనము అజ్ఞాననివృత్తియై యున్నది. మఱియును, అనావృతవిషయముతో స్వవ్యవహారానుకూల చేతనమునకు అభేదముకలిగి జ్ఞానమునకు అపరోక్షత్వ లక్షణమును జెప్పుటవలన అజ్ఞాన నివృత్త్యధీనమగు జ్ఞానముయొక్క అపరోక్షత్వసిద్ధి చెప్పబడినది. అందువలన అన్యోన్యాశ్రయ దోషమున్నది.

### 324. ఉక్తశంకకు సమాధానము.

దానికి సమాధానమేమనగా. యద్యపి పూర్వోక్తరీతిగా అజ్ఞాననివృత్త్యపేక్ష, జ్ఞానగతాపరోక్షత్వమునం దున్నది. తథాపి అజ్ఞాననివృత్తియందు అపరోక్షత్వాపేక్ష లేదు. ఎట్లన, జ్ఞానమాత్రముచేత అజ్ఞాననివృత్తి నంగీకరించినయెడల పరోక్షజ్ఞానముచేతగూడ అజ్ఞాననివృత్తికావలయును. ఈదోషపరిహారనిమిత్తమై అపరోక్షజ్ఞానముచే అజ్ఞాననివృత్తి చెప్పబడినది. దానియం దన్యోన్యాశ్రయత్వ దోషమున్నది. అందువలన జ్ఞానమాత్రముచేత అజ్ఞాన నివృత్తియును, మఱియును, అపరోక్షజ్ఞానముచేత అజ్ఞాననివృత్తి చెప్పబడఁలేదు. ఇకనేమనగా ప్రమయొక్క మహిమచేత ఎచ్చట విషయముతో జ్ఞానమునకు తాదాత్మ్య సంబంధమున్నదో ఆజ్ఞానముచే నజ్ఞాననివృత్తి కలుగుచున్నది. ప్రమాణ మహిమ చేత బాహ్యేంద్రియజన్య ఘటాదివిషయకజ్ఞానము విషయముతో తాదాత్మ్య సంబంధసహితమైయున్నది. శబ్దజన్య బ్రహ్మజ్ఞానముకూడ మహావాక్యరూప ప్రమాణముయొక్క మహిమచేత విషయముతో తాదాత్మ్య సంబంధసహితమైయున్నది. అందువలన ఉక్తోభయజ్ఞానముచేత అజ్ఞాననివృత్తి కలుగుచున్నది. యద్యపి సర్వమునకు ఉపాదానము బ్రహ్మమైనందున బ్రహ్మగోచరసకలజ్ఞానములకును తాదాత్మ్యసంబంధ మున్నది. అందువలన ననుమితిరూపబ్రహ్మజ్ఞానముచేత అవాంతరవాక్యజన్యబ్రహ్మవిషయక పరోక్షజ్ఞానముచేతగూడ అజ్ఞాననివృత్తి కావలయును. తథాపి ఉక్తజ్ఞానమునకు విషయముతో తాదాత్మ్యసంబంధమున్నది. అదివిషయ మహిమచేత నున్నది. ప్రమాణమహిమచేతకాదు. ఎట్లన, మహావాక్యముచే జీవబ్రహ్మములకు అభేదగోచరజ్ఞానము కలుగుచున్నది. దానికి విషయముతో తాదాత్మ్యసంబంధము ప్రమాణమహిమచేత జెప్పబడినది. అన్యజ్ఞానములకు బ్రహ్మముతో తాదాత్మ్యసంబంధమున్నది. అది బ్రహ్మమునకు వ్యాపకత్వ ముండుటవలనను సకలోపాదానత్వ ముండుటవలనను విషయమహిమచేత జెప్పబడినది. ఈరీతిగా విలక్షణప్రమాణజన్య విషయసంబంధిజ్ఞానముచే అజ్ఞాననివృత్తిగలుగుచున్నది. ఇట్లు చెప్పుటయందు జ్ఞానమాత్రముచేత నజ్ఞాననివృత్తికి ఆపత్తిలేదు. జ్ఞానగతాపరోక్షత్వముయొక్క అపేక్షయు అజ్ఞాననివృత్తియందు లేనందున అన్యోన్యాశ్రయదోషముగూడ లేదు. ఈరీతిగా వ్యవహారానుకూలానావృతచైతన్యముతో విషయమున కభేదము అపరోక్షవిషయలక్షణమైయున్నది. ఉక్తచైతన్యమునకు విషయముతో అభేదము అపరోక్షజ్ఞానలక్షణమైయున్నది. అందువలన శబ్దజన్యబ్రహ్మజ్ఞానమందుగూడ అపరోక్షత్వము సంభవించుచున్నది.

325. శబ్దముచేత నపరోక్షజ్ఞానోత్పత్తియందు నిరూపణము చేయబడి యున్నది. ఆమూడు మతములలో ప్రథమ మతమునకు సమీచీనత్వము.

ఈప్రకారముగా శబ్దముచేత నపరోక్ష జ్ఞానోత్పత్తియందు మూడు మతములు చెప్పబడి యున్నవి. వానిలో నాద్యమతమే సమీచీనమై యున్నది. ఎట్లన, జ్ఞానగతపరోక్షత్వాపరోక్షత్వములు ప్రమాణాధీనములై యున్నవి. సహకారిసాధన విశిష్టశబ్దమందును కూడ అపరోక్షజ్ఞాన జననయోగ్యత యున్నది. అను నిది ప్రథమమతమై యున్నది. జ్ఞానగతాపరోక్షత్వాది ధర్మము విషయాధీనమైయే యున్నది. ప్రమాణాధీనము కాదు. అను నీ యభిప్రాయముచేత ద్వితీయ మతమును, అద్వైతాచార్యులయొక్క తృతీయమతముగూడ నున్నవి. రెండు మతములయందు కూడ కేవల విషయాధీనముగానే అపరోక్షత్వాదికము నంగీకరించినయెడల అవాంతరవాక్యముచేతఁ గూడ బ్రహ్మాపరోక్షజ్ఞానము కావలయును. అందువలన జ్ఞానాపరోక్షత్వమునందును ప్రమాణాధీనత్వము ఆవశ్యకముగానే కావలసియున్నది. అందువలన ప్రథమమతమే సమీచీనమై యున్నది.

326—342. వృత్తిప్రయోజనకథనము.

326. గ్రంథారంభమునందు ఉక్తప్రశ్నత్రయముయొక్కయు వానిలోనుక్తోత్తరద్వయముయొక్కయు అనువాదము.

గ్రంథారంభమునందు వృత్తియొక్క స్వరూపమును, కారణమును, ఫలమును, యీమూటియొక్క ప్రశ్న చేయబడి యున్నది. వానిలో నంతఃకరణముయొక్కయు, అవిద్యయొక్కయు, ప్రకాశరూప పరిణామము వృత్తి యనబడును. ఇట్లు చెప్పుటవలన వృత్తియొక్క సామాన్య స్వరూపము చెప్పబడినది. తదనంతరము యథార్థత్వాఽయథార్థత్వాదిభేదకథనముచేత వృత్తియొక్క విశేష స్వరూపము చెప్పబడినది. మఱియును ప్రమాణ నిరూపణముచేత వృత్తియొక్క కారణ స్వరూపము చెప్పఁబడినది.

327. వృత్తియొక్క ప్రయోజనసంబంధి తృతీయ ప్రశ్నోత్తరము యొక్క యారంభము.

వృత్తి ప్రయోజన విషయ ప్రశ్న చేయబడినది. వృత్తి ప్రయోజన మేమనగా, జీవునకు నవస్థాత్రయ సంబంధము వృత్తిచేత గలుగుచున్నది. పురుషార్థ ప్రాప్తియు గూడ వృత్తిచేత గలుగుచున్నది. అందువలన సంసార

ప్రాప్తికి హేతువు వృత్తియై యున్నది. మోక్షప్రాప్తికి హేతువు వృత్తియై యున్నది. ఎట్లన, అవస్థాత్రయ సంబంధముచేత జీవునికి సంసారము గలుగుచున్నది.

328. వృత్తి ప్రయోజనకథనావసరమునందు జాగ్రత్తయొక్క లక్షణము.

అచ్చట ఇంద్రియజన్య జ్ఞానముయొక్క యవస్థ జాగ్రదవస్థ యనబడును. అవస్థాశబ్దము కాలవాచకమై యున్నది. యద్యపి సుఖాదిజ్ఞాన కాలమును, ఉదాసీన కాలమును గూడ జాగ్రదవస్థ యని చెప్పవలసివచ్చును. మఱియును సుఖాదిజ్ఞానము ఇంద్రియజన్యము కాదు. ఎట్లన, సుఖాదిజ్ఞానకాలమునందు అన్యవిషయక జ్ఞానమును గూడ ఇంద్రియజన్యమెట్లు కాదో అట్లు ఉదాసీనకాలమునందు ఇంద్రియజన్య జ్ఞానము లేదు. తథాపి దానియొక్క సంస్కారమున్నది. మఱియు నింద్రియజన్య జ్ఞానముయొక్క సంస్కారము స్వప్నావస్థయందును, సుషుప్త్యవస్థయందును గూడ నున్నది. అందువలన స్వప్నావస్థకంటెను, సుషుప్త్యవస్థకంటెను భిన్నమగు కాలము చెప్పబడి యున్నది. ఈరీతిగా జాగ్రదవస్థ యను నీ వ్యవహారము ఇంద్రియజన్య జ్ఞానాధీనమై యున్నది. ఆ ఇంద్రియజన్య జ్ఞానము అంతఃకరణముయొక్క వృత్తిరూపమై యున్నది. ఆయంతఃకరణ వృత్తికి మతభేదముచేత వక్ష్యమాణ ప్రయోజన మున్నది.

329. కొందఱయొక్క గ్రంథరీతిగా ఆవరణయొక్క అభిభవము వృత్తిప్రయోజనమై యున్నది.

కొందఱచే నావరణముయొక్క యభిభవము వృత్తిప్రయోజనమై చెప్పబడినది. యద్యపి, ఆవరణాభిభవమునందు గూడ ననేక మతము లున్నవి. ఎట్లు ఖద్యోత ప్రకాశముచేత మహాంధకారముయొక్క యేకదేశమునకు నాశము కలుగుచున్నదో అట్లు అజ్ఞానముయొక్క యేకదేశమునకు నాశము ఆవరణాభిభవ శబ్దార్థమై యున్నది. ఇది సాంప్రదాయిక మతమై యున్నది.

330. సమష్ట్యజ్ఞానమునకు జీవోపాధిత్వపక్షమునందు బ్రహ్మముయొక్క లేక, ఈశ్వరునియొక్క, లేక, జీవచేతనముయొక్క సంబంధము చేత ఆవరణాభిభవమున కసంభవము.

సమష్ట్యజ్ఞానము జీవోపాధియై యున్నది. అను నీ పక్షమునందు ఘటాది విషయముతో చేతనమునకు సదా సంబంధమున్నది. అందువలన చేతనసంబంధముచేత ఆవరణాభిభవము సంభవించుట లేదు. ఎట్లన, బ్రహ్మచేతనము ఆవర

ణమునకు సాధకమై యున్నది. విరోధి కాదు. మఱియును ఈశ్వరచేతనముతో నావరణాభిభవము గలిగినయెడల 'ఇదం మయా అవగతం' అను నీవ్యవహారము జీవునకు కలుగక పోవలయును. ఇక నేమనగా 'ఈశ్వరేణావగతం' అను నీవ్యవహారము కావలయును. ఎట్లన, ఈశ్వర జీవులకు వ్యావహారిక భేద మున్నది. అందువలన ఈశ్వరావగతవస్తువు జీవావగతము కాదు. అందువలన జీవచేతనము యొక్క సంబంధముచేత ఆవరణమున కభిభవము జెప్పినయెడల ఈపక్షమునందు జీవచేతనమునకు ఘటాదికముతో సదా సంబంధ మున్నది. ఎట్లన జీవచేతనమునకు నుపాధిమూలాజ్ఞానమై యున్నది. దానియందు నారోపితమగు ప్రతి బింబత్వ విశిష్ట చేతనము జీవ మనంబడును. మూలాజ్ఞానమునకు, ఘటాదికమునకు, సదా సంబంధ ముండుటవలన జీవచేతనమునకు సదా సంబంధ మున్నది. అందువలన ఘటాద్యావరణమునకు సదా అభిభవము కావలయును. అందువలన వృత్తిచేత ఆవరణాభిభవమును జెప్పినయెడల పరోక్షవృత్తిచేతను గూడ ఆవరణాభిభవము కావలయును.

**331.** ఈపక్షమునందు పరోక్షవృత్తిచేత, లేక, అపరోక్షవృత్తివిశిష్ట చేతనముచేత నావరణాభిభవమునకు సంభవము.

అపరోక్ష వృత్తిచే నావరణాభిభవము గలుగుచున్నది. అథవా అపరోక్షవృత్తి విశిష్టచేతనముచే ఆవరణాభిభవము గలుగుచున్నది. ఎట్లు ఖద్యోత ప్రకాశము మహాంధకారముయొక్క యేకదేశమునకు నాశకారణమగుచున్నదో ఖద్యోతాభావ కాలమునందు మహాంధకారమునకు పునర్విస్తారము గలుగుచున్నదో అట్లు అపరోక్ష వృత్తి సంబంధముచేత అథవా అపరోక్ష వృత్తివిశిష్ట చేతనముయొక్క సంబంధముచేత మూలాజ్ఞానముయొక్క యంశమునకు నాశము కలుగుచున్నది. వృత్త్యభావదశయందు అజ్ఞానమునకు ప్రసరణము గలుగుచున్నది. ఇది సాంప్రదాయ మతమై యున్నది.

**332.** ఉక్తపక్షరీతిగా ఆవరణ నాశరూప వృత్తియొక్క ప్రయోజన కథనము.

దానిచేతనజ్ఞానాంశముయొక్క నాశము అపరోక్షవృత్తికిప్రయోజనమైయున్నది. అసత్త్వాపాదకాజ్ఞానాంశముయొక్క నాశము పరోక్ష వృత్తియొక్క ప్రయోజనమై యున్నది. ఈరీతిగా నావరణ నాశము వృత్తి ప్రయోజనమని చెప్పఁబడినది,

౩౩౩. ద్వితీయ పక్షరీతిగా జీవచేతనముతో విషయమునకు సంబంధ రూపమగు వృత్తి ప్రయోజనముయొక్క కథనము

జీవచేతనముతో విషయమునకు సంబంధము వృత్తియొక్క ప్రయోజనము. అనునది మఱియు నొక పక్షమైయున్నది. సమష్ట్యజ్ఞానమునందు ప్రతిబింబము జీవుఁడై యున్నాఁడు. అను నీపక్షమునందు జీవచేతనమునకు ఘటాదికముతో సర్వదా సంబంధమున్నది. కాని జీవునియొక్క సామాన్య సంబంధముచే విషయప్రకాశము గలుగుట లేదు. అందువలన విషయ ప్రకాశమునకు హేతువగు జీవునితో విజాతీయసంబంధము వృత్తి ప్రయోజనమై యున్నది. జీవచేతనమునకు విషయముతో సంబంధము సర్వదా యున్నది. కాని ఆసంబంధము విషయప్రకాశ హేతువు కాదు. వృత్తివిశిష్టజీవునకు విషయముతో సంబంధ ముండిన యెడల విషయమునకు ప్రకాశ మగు చున్నది. అందువలన ప్రకాశహేతువగు సంబంధము వృత్త్యధీనమై యున్నది. ప్రకాశ హేతువగు జీవునకు విషయముతో నాసంబంధము అభివ్యంజకాభి వ్యంగ్యభావమై యున్నది. విషయమునందు అభివ్యంజకత యున్నది. జీవచేతనమునందు అభివ్యంగ్యతయున్నది. దేనియందు ప్రతిబింబము కలుగుచున్నదో అదిఅభివ్యంజక మనంబడును. దేనియొక్క ప్రతిబింబ మున్నదో అది అభివ్యంగ్యమనంబడును. ఎట్లు దర్పణమునందు ముఖప్రతి బింబ మున్నది. అచ్చట దర్పణము అభివ్యంజకమై ముఖము అభివ్యంగ్యమైయున్నదో అట్లు ఘటాదివిషయమునందు చేతనముయొక్క ప్రతిబింబము గలుగుచున్నది. అందువలన ఘటాదికము అభివ్యంజకమైయున్నది. చేతనము అభివ్యంగ్యమైయున్నది. ఈరీతిగా ప్రతి బింబగ్రహణరూపవ్యంజకత ఘటాదివిషయమునందున్నది. ప్రతిబింబసమర్పణోపవ్యంగ్యత చేతనమునందున్నది. ఘటాదికమునందు స్వభావముగా ప్రతిబింబగ్రహణ సామర్థ్యము లేదు. ఇక నే మనగా స్వాకారవృత్తి సంబంధముచేత చేతనప్రతిబింబముయొక్క గ్రహణము యోగ్యమై యున్నది. ఎట్లుదర్పణసంబంధము లేక కుడ్యమునందు సూర్యప్రతి బింబముగలుగుట లేదో, దర్పణసంబంధముచేత గలుగుచున్నదో, అందువలనసూర్యప్రతిబింబగ్రహణయోగ్యత కుడ్యమునందు దర్పణసంబంధముచేత గలుగు చున్నది. ఎట్లుదృష్టాంతమునందు సూర్యప్రభకుడ్యముతో సర్వదాసామాన్యసంబంధ మున్నదో మఱియును అభివ్యంజకాభివ్యంగ్యభావ సంబంధము దర్పణాధీనమై యున్నదో అట్లు జీవచేతనమునకు సర్వదా సంబంధ

మున్నది. అయిన వృత్తిసంబంధముచేత ఘటాదికమునందు జీవచేతనమునొక్క ప్రతిబింబగ్రహణయోగ్యత యున్నది. అందువలన జీవచేతనమునకు ఘటాదికముతో అభివ్యంజకాభివ్యంగ్యభావసంబంధము వృత్త్యధీనమై యున్నది. ఈరీతిగా జీవచేతనముతో ఘటాదికమునొక్క విలక్షణసంబంధమునకు హేతువు వృత్తియై యున్నది. ఆసంబంధముచే విషయప్రకాశ మగుచున్నది. జీవచేతనము విభువై యున్నది. ఈపక్షమునందు విలక్షణసంబంధజనకము వృత్తియై యున్నది.

334. అంతఃకరణ విశిష్టచేతనము, జీవుడు, అను నీపక్షమునందు విషయసంబంధార్థము వృత్త్యపేక్ష.

అంతఃకరణవిశిష్టచేతనము జీవుడు, అనునీపక్షమునం దైనను వృత్తి లేక, జీవచేతనముతో ఘటాదికమునకు సర్వథా సంబంధములేదు. ఇంద్రియ విషయములనొక్క సంబంధముచేత అంతఃకరణమునొక్క వృత్తి ఘటాది దేశమునకు బోవుచున్నది. అప్పుడు జీవచేతనమునకు ఘటాదికముతో సంబంధము గలుగుచున్నది. వృత్తికి బాహ్యాగమనమువినాగా ఆంతరజీవునకు బాహ్యఘటాదికముతో సంబంధము గలుగుట లేదు. ఈరీతిగా అంతఃకరణావచ్ఛిన్న పరిచ్ఛిన్నుడు జీవుడై యున్నాడు. ఈపక్షమునందు విషయసంబంధార్థము వృత్తియై యున్నది. అను నీయర్థము స్పష్టమైయే యున్నది.

335. ఉక్తపక్షమునకు వైలక్షణ్యము.

ఈరీతిగా అజ్ఞానోపాధికుడు జీవుడు అను నీపక్షమునందు జీవచేతనమునకు విషయముతో సంబంధము సదా ఉన్నది. అభివ్యంజకాభివ్యంగ్యభావ సం[illegible]ధము సదా లేదు. ఏతదర్థము వృత్తి యున్నది. మఱియును, అంతఃకరణావచ్ఛి[illegible]డు జీవుడను నీపక్షమునందు జీవునకు విషయముతో సర్వదా సంబంధము లేదు. [illegible]ర్థము వృత్తి యున్నది. ఈరీతిగా వృత్తినొక్క ఫలసంబంధమునందు వైలక్షణ్యము గ్రంథకారులచే జెప్పబడినది. అయిన,—

336. మతభేదముచేత సంబంధమునందు వైలక్షణ్యకథనమునకు అసంగతత్వము.

మతభేదముచే సంబంధమునందు వైలక్షణ్యకథన మసంగతమై యున్నది. ఎట్లన, అంతఃకరణము జీవునకు ఉపాధియై యున్నది. అను నీపక్షమునందు కూడ అజ్ఞానమైన జీవభావమునకు ఉపాధిగా ఆద్యము ఇష్టమై యున్నది. అన్యథా ప్రాజ్ఞరూపజీవునకు అభావము గలుగును. అందువలన జీవభావమునకు ఉపాధి సర్వ

మతమునందు జ్ఞానమై యున్నది. కర్తృత్వాద్యభిమానము అంతఃకరణవిశిష్టము నందు గలుగుచున్నది. అందువలన నంతఃకరణావచ్ఛిన్నుఁడు జీవుఁ డనంబడును. మఱియును అజ్ఞానప్రతిబింబితుఁడు జీవుఁడై యున్నాఁడు. ఈపక్షమునందు కూడ అజ్ఞానవిశిష్టుఁడు ప్రమాత కాఁడు. ఇక నేమనఁగా, అంతఃకరణవిశిష్టుఁడై ప్రమాతనై యున్నాఁడు. మఱియును, జీవచేతనమునకైననో విషయముతో సంబంధము సర్వదా యున్నది. అయిన ప్రమాతృచేతనమునకు విషయముతో సంబంధము లేదు. ప్రమాతృచేతనముయొక్క సంబంధముచేతనే విషయప్రకాశ మగుచున్నది. జీవచేతనముయొక్క సంబంధముచేత విషయప్రకాశము కలుగుట లేదు. ఎట్లు బ్రహ్మచేతనమును, ఈశ్వరచేతనమును అజ్ఞానమునకు సాధకమై యున్నదో అట్లు అవిద్యోపాధికజీవచేతన మున్నది. దానియొక్క సంబంధముచేత విషయమునందు జ్ఞాతతాదివ్యవహారము కలుగుట లేదు. మఱియును జీవచేతనమునకు జ్ఞాతతాదియొక్క యభిమానముకూడ కలుగుట లేదు. ప్రమాతయొక్క సంబంధముచేతనే విషయమునందు జ్ఞాతతాది వ్యవహారము గలుగుచున్నది. మఱియును, వ్యవహారముయొక్క యభిమానముకూడ ప్రమాతకు కలుగుచున్నది. ఆప్రమాత విషయమునకంటె భిన్నదేశమునం దున్నాఁడు. అందువలన ప్రమాతకు విషయముతో సదా సంబంధము లేదు. ప్రమాతతో విషయమునకు సంబంధము వృత్త్యధీనమై యున్నది. ఈరీతిగా జీవునియొక్క యుపాధిని వ్యాపకముగా, లేక, పరిచ్ఛిన్నముగా అంగీకరించినయెడల రెండుపక్షములయందును ప్రమాతతో విషయసంబంధము వృత్త్యధీనమై సమానమై యున్నది. దానియందు విలక్షణతావిలక్షణతాకథనము బుద్ధిప్రవీణతాఖ్యాపనార్థమై యున్నది. మఱియును ప్రమాతకు విషయముతో సంబంధము లేదు. అందుకొఱకు అప్రవీణత సాధకమై యున్నది.

337. చతుర్విధచేతనములయొక్క కథనపూర్వకోక్తార్థ కథనసిద్ధి.

ప్రమాతృచేతనము, ప్రమాణచేతనము, విషయచేతనము, ఫలచేతనము అనునీభేదముచేత చతుర్విధచేతనములు చెప్పబడియున్నవి. ప్రమాతకు విషయముతో సంబంధ ముండినయెడల ప్రమాతృచేతనముతో విషయచేతనముతో విభాగకథన మసంగత మగును. అంతఃకరణాదివిశిష్టచేతనము ప్రమాతృచేతనమై వృత్త్యవచ్ఛిన్నచేతనము ప్రమాణచేతనమై, ఘటాద్యవచ్ఛిన్నచేతనము విషయచేతనమై యున్నది. మఱియును వృత్తిసంబంధముచేత ఘటాదికమునందు చేతన

ప్రతిబింబము గలుగుచున్నది. అది ఫలచేతన మనంబడును. మఱియు నొకా నొకరు జెప్పునదేమనగా, ఘటావచ్ఛిన్న చేతనము అజ్ఞాత మైనప్పుడు విషయ చేతన మనంబడును. జ్ఞాత మైనప్పుడు ఘటావచ్ఛిన్న చేతనము ఫలచేతన మనం బడును. అదియే ప్రమేయచేతన మనంబడును. అయిన విద్యారణ్యస్వాముల చేతను, వార్తికకారులచేతను, ప్రమాణవృత్త్యుత్తరకాలమునందు ఘటాదికము నందు ఏచేతనాభాసమున్నదో అది ఫలచేతనముగా చెప్పబడియున్నది. ఈరీతిగా ప్రమాతృచేతనము పరిచ్ఛిన్న మైయున్నది. దానియొక్క సంబంధముచేతనే విషయమునకు ప్రకాశ మగుచున్నది. జీవచేతనమును విభువునుగా నంగీకరించి ప్రమాతతో విషయమునకు సంబంధము వృత్తికృతమై యున్నది. అందువలన రెండుమతములయందును విషయసంబంధమునందు వైలక్షణ్యము లేదు.

338. జాగ్రత్కాలమందే వృత్తియొక్క అనువాదపూర్వక స్వప్నావస్థాలక్షణము.

ఉక్తప్రయోజనసహితేంద్రియాజన్యమగు నంతఃకరణముయొక్క వృత్తి జాగ్రదవస్థయం దున్నది. ఇంద్రియముచే నజన్యమగు విషయగోచరమగు నంతఃకరణముయొక్క ఏ అపరోక్షవృత్తియున్నదో దానియొక్క అవస్థ స్వప్నావస్థ యనంబడును. స్వప్నమునందు జ్ఞేయమును జ్ఞానమును, అంతఃకరణ పరిణామము లై యున్నవి.

339. సుషుప్త్యవస్థాలక్షణము.

సుఖగోచరమయి, అవిద్యా గోచరమునై, ఉండు నజ్ఞానముయొక్క సాక్షాత్పరిణామరూప వృత్తియొక్క అవస్థ సుషుప్త్యవస్థ యనంబడును.

సుషుప్తియందు అవిద్యయొక్క వృత్తి సుఖగోచరము, అజ్ఞాన గోచరమునై ఉన్నది. యద్యపి అవిద్యాగోచరవృత్తి జాగ్రత్కాలమునందు 'అహం నజానామి' అనునీరీతిగా గలుగుచున్నది. తథాపి, ఆవృత్తి అంతఃకరణ సంబంధియై యున్నది. అవిద్యాసంబంధముకాదు. అందువలన సుషుప్తిలక్షణ మునకు జాగ్రత్తయందు అతివ్యాప్తిలేదు. ఈలాగుననే ప్రాతిభాసికరజతాకార వృత్తి జాగ్రత్తయందు అవిద్యాపరిణామమై యున్నది. అది అవిద్యాగోచరము కాదు. ఈలాగుననే సుఖాకారవృత్తి జాగ్రత్తయం దున్నది. అది యవిద్యాపరిణామముకాదు. ఈరీతిగా సుఖగోచరము, అవిద్యాగోచరమునై ఉండు నవిద్యా వృత్తియొక్క యవస్థ సుషుప్త్యవస్థ యనంబడును.

340. సుషుప్తిసంబంధియగు అర్థముయొక్క నిరూపణము.

సుషుప్తియందు అవిద్యావృత్తియందు నారూఢసాక్షి యవిద్యను ప్రకాశింపజేయుచున్నది. మఱియును స్వరూపసుఖమును ప్రకాశింపజేయుచున్నది. సుషుప్త్యవస్థయందు సుఖాకారావిద్యాకారపరిణామము, ఏ యజ్ఞానాంశ సంబంధమైయున్నదో ఆ యజ్ఞానాంశమునందు ఆపురుషులయొక్క అంతఃకరణము లీనమగుచున్నది. జాగ్రత్కాలమునందు ఆ యజ్ఞానాంశముయొక్క పరిణామము అంతఃకరణమైయున్నది. అందువలన అజ్ఞానముయొక్క వృత్తిచే ననుభూతమగు సుఖమునకు జాగ్రత్కాలమునందు స్మృతియగుచున్నది. ఉపాదానమునకును, కార్యమునకును, భేదము లేనందున అనుభవస్మరణములకు వైయధికరణ్యము లేదు. ఈరీతిగా మూడవస్థలున్నవి. మరణమునకును, మూర్ఛకును, కొందఱు సుషుప్తియం దంతర్భావమును జెప్పిరి. కొందఱు భేదమును జెప్పెదరు.

341. ఉక్తావస్థాభేదములకు వృత్త్యధీనత్వము.

ఈ యవస్థాభేదము వృత్త్యధీనమైయున్నది. జాగ్రత్స్వప్నములయందైనను అంతఃకరణవృత్తియున్నది. అంతఃకరణవృత్తి జాగ్రతయందు ఇంద్రియజన్యమై స్వప్నమునందు ఇంద్రియాజన్యమైయున్నది. సుషుప్తియందు అజ్ఞానముయొక్క వృత్తియున్నది.

342. వృత్తియొక్క ప్రయోజన కథనము.

అవస్థయొక్కయభిమానమే సంబంధమైయున్నది. భ్రమకు జ్ఞానమభిమాన మనంబడును. అదియును వృత్తివిశేషమై యున్నది. అందువలన వృత్తికృతసంబంధమే సంసారమై యున్నది. వేదాంతవాక్యముచే "అహంబ్రహ్మాస్మి" అనునీ యంతఃకరణవృత్తి గలిగి దానిచేత ప్రపంచసహితాజ్ఞానమునకు నివృత్తి కలుగుచున్నది. అది మోక్షమైయున్నది. అందువలన సంసారదశ, వ్యవహారసిద్ధి ప్రయోజనమై యున్నది. పరమప్రయోజనము మోక్షమైయున్నది.

343—352. కల్పిత నివృత్తియందు విచారము.

కల్పితముయొక్క నివృత్తి అధిష్ఠానరూపమైయున్నది. అందువలన సంసారనివృత్తి మోక్షమై యున్నది. ఇట్లు చెప్పుటవలన బ్రహ్మరూపము మోక్ష మని సిద్ధించుచున్నది. అందువలన కల్పితముయొక్కనివృత్తిని కల్పితముయొక్క ధ్వంసముగా నంగీకరించి, మోక్షమునందు ద్వైతాపత్తిదోషకథనము అజ్ఞానప్రయుక్తమై యున్నది.

### 344. న్యాయమకరందకారోక్తాధిష్ఠానరూపమగు కల్పితముయొక్క నివృత్తిపక్షమునందు దూషణము.

న్యాయమకరందకారునిచే కల్పితముయొక్క నివృత్తి అధిష్ఠానరూపముగా నంగీకరింపబడలేదు. ద్వైతాపత్తికిని గూడ సమాధానము చెప్పబడినది. కాని ఆయన లేఖనము అనుభవానుసారముకాదు. ఎట్లన ఆయన లేఖన మేమనగా కల్పితముయొక్క నివృత్తి అధిష్ఠానముకంటె భిన్నమై, యున్నది. అధిష్ఠానరూపముగా చెప్పినయెడల అధిష్ఠానమును, కల్పిత నివృత్తియును ఒకపదార్థమై యున్నది, రెండుపదార్థములు కావు, అని సిద్ధించుచున్నది. అచ్చట నడుగవలసిన దేమనగా అధిష్ఠానమునందు అంతర్భావము నంగీకరించి కల్పితనివృత్తికి లోప మిష్టమైయున్నదా? లేక, కల్పిత నివృత్తియందు అంతర్భావము నంగీకరించి పృథగధిష్ఠానము ఇష్టమై యున్నదా? అన్యప్రకారముగ సంభవించుటలేదు. ఒకదానియందు మఱియొకదానికి అంతర్భావమే చెప్పవలసినది. ప్రథమపక్షమును జెప్పినయెడల సంభవించుటలేదు. ఎట్లన, సంసారమున కధిష్ఠానము బ్రహ్మమైయున్నది. సంసారముయొక్క నివృత్తి బ్రహ్మముకంటె భిన్నము కానియెడల సంసారనివృత్తియొక్క సాధనమునందు ప్రవృత్తి కలుగకపోవును. ఎట్లన సంసారనివృత్తి బ్రహ్మముకంటె భిన్నము కాదు. మఱియును బ్రహ్మముసిద్ధమై యున్నది. వ్యాపారసాధ్యములగువాటికు ప్రవృత్తి కలుగుచున్నది. స్వభావసిద్ధ బ్రహ్మనిమిత్తము జ్ఞానసాధక శ్రవణాదికమునందు ప్రవృత్తి సంభవించుటలేదు. అందువలన సంసారనివృత్తికి నిత్యసిద్ధబ్రహ్మమునందు అంతర్భావము సంభవించుటలేదు. మఱియు నివృత్తియందు బ్రహ్మమున కంతర్భావము జెప్పినను సంసారభ్రమమునకు సంభవ ముండుటవలన దాని నివృత్తిజనకజ్ఞానముయొక్క సాధనమగు శ్రవణాదికమునందు ప్రవృత్తి లేకపోవలయును. ఎట్లన సంసారముయొక్క నివృత్తి జ్ఞానోత్తరకాలమునందు కలుగుచున్నది. జ్ఞానమునకు పూర్వమునందు కల్పితముయొక్క నివృత్తి కలుగుట లేదనునిది అనుభవసిద్ధమై యున్నది. మఱియును బ్రహ్మము సంసారనివృత్తికంటె భిన్నము కాదు. అందువలన జ్ఞానమునకు పూర్వమునందు బ్రహ్మరూపాధిష్ఠానము లేనందున సంసారభ్రమము సంభవించుట లేదు. అందువలన అనుభవసిద్ధసంసారమునకు అభావమును జెప్పుట యుక్తము కాదు. సత్య మని చెప్పుట యుక్తమగును. దానికి జ్ఞానముచేత నివృత్తి సంభవించుటలేదు. అందువలన సంసారనివృత్తియందు బ్రహ్మమునకు నంతర్భావము

సంభవింపదు. సంసారనివృత్తి జ్ఞానమునకు పూర్వకాలమునందు లేదు. జ్ఞానోత్తరకాలమునం దుండుటవలన సాదియై యున్నది. బ్రహ్మము అనాదియై యున్నది. సాదిపదార్థమునందు అనాదిపదార్థమునకు నంతర్భావకథన మయుక్తమై యున్నది. ఈ రీతిగా రెంటికిని పరస్పరము అంతర్భావము సంభవింపదు. అందువలన కల్పితనివృత్తి అధిష్ఠానరూపమై యున్నదను నీపక్షము సంభవించుట లేదు. మఱియు నొకరు చెప్పునదేమనగా, పరస్పరాంతర్భావము దేనికిని చెప్పబడ లేదు. తథాపి కల్పితనివృత్తి అధిష్ఠానముకంటె పృథక్కు కాదు. అధిష్ఠానముయొక్క యవస్థావిశేషమె కల్పితనివృత్తియై యున్నది. జ్ఞాతమనియును, అజ్ఞాతమనియును రెండు అవస్థలు అధిష్ఠానమునకున్నవి. జ్ఞానమునకు పూర్వమునందు జ్ఞాతతావస్థ యున్నది. జ్ఞాతాధిష్ఠానరూపము కల్పితముయొక్క నివృత్తియై యున్నది. జ్ఞాతాధిష్ఠానము సాదియై యున్నది. అందువలన జ్ఞానసాధనశ్రవణాదికము నిష్ఫలము కాదు. మఱియును, సంసారనివృత్తి బ్రహ్మముకంటె పృథక్కు కాదు. ఈరీతిగా జ్ఞాతాధిష్ఠానరూపముగానే కల్పితనివృత్తిని అంగీకరించినయెడల అదియును సంభవించుట లేదు. ఎట్లన, జ్ఞానవిషయము జ్ఞాత మనంబడును, అజ్ఞానవిషయ మజ్ఞాత మనంబడును. అజ్ఞానకృతావరణమే అజ్ఞానవిషయత యనంబడును. ఎప్పుడు జ్ఞానముచేత నజ్ఞానమునకు నభావము కలుగుచున్నదో అప్పుడు అజ్ఞాతవ్యవహారము గలుగుట లేదు. ఈలాగుననే విదేహదశయందు దేహాదికమునకు అభావముండుటవలన, జ్ఞానమునకు అభావ ముండుటవలన జ్ఞాతత్వమునకు నభావము గలుగుచున్నది. అందువలన విదేహదశయందు అజ్ఞాతావస్థవలె జ్ఞాతావస్థయును కూడ లేనందున జ్ఞాతాధిష్ఠానరూప కల్పితనివృత్తికి మోక్షమునం దభావము కావలయును. మోక్షమునం దభావము నంగీకరించినయెడల కల్పితనివృత్తికి అనంతత్వము లేనందున ఔషధజన్య రోగనివృత్తివలె పరమపురుషార్థత్వమునకు అభావమగును.

345. న్యాయమకరందకారునిరీతిగా అధిష్ఠానముకంటెను భిన్నమగు కల్పితముయొక్క నివృత్తినిరూపణము.

కల్పితనివృత్తి అధిష్ఠానరూపము కాదు. దానికంటె భిన్నమై యున్నది. మఱియును అధిష్ఠానముకంటె భిన్నమైనను కల్పితనివృత్తి ద్వైతసంపాదకము కాదు. ఎట్లన అధిష్ఠానముకంటె భిన్నము సత్యమైనయెడల ద్వైత మగును. సత్యముకంటె విలక్షణ పదార్థము ద్వైతమునకు హేతువైన యెడల సిద్ధాంతమునందు సదా అద్వైతమున్నదను నీయర్థమునకు బాధయగును. అందువలన

సత్యపదార్థముయొక్క భేదమే ద్వైతమునకు సాధకమై యున్నది. కల్పిత నివృత్తి అధిష్ఠానముకంటె భిన్నమైనను సత్యముకాదు. అందువలన ద్వైతసిద్ధి యగుటలేదు. (స్వసమానసత్తాకద్వితీయరాహిత్యం).

346. న్యాయమకరందకారరీతిగా కల్పితనివృత్తియొక్క స్వరూప నిర్ణయము కొఱకు అనేకవికల్పములయొక్క లేఖనము.

కల్పితనివృత్తియొక్క స్వరూపనిర్ణయముకొఱకు వక్ష్యమాణరీతిగా వికల్పములు వ్రాయబడుచున్నవి. అధిష్ఠానముకంటె భిన్నమగు కల్పిత నివృత్తి సద్రూపమై యున్నదా? అసద్రూపమై యున్నదా? సదసద్రూపమై యున్నదా? లేక సదసద్విలక్షణమై యున్నదా? సద్రూపమని చెప్పినయెడల వ్యావహారిక సత్తయి యున్నదా? పారమార్థిక సత్తయియున్నదా? వ్యావహారికసత్తని చెప్పిన యెడల బ్రహ్మజ్ఞానోత్తరమునందు వ్యావహారిక సత్త సంభవింపనందున బ్రహ్మజ్ఞానోత్తరమునందు సంసారనివృత్తికి అభావము కావలయును. ఎట్లన, బ్రహ్మజ్ఞానముకంటె పూర్వమునందు దేనికి బాధ కలుగుట లేదో మఱియును బ్రహ్మజ్ఞానోత్తరమునందు దేనికి సత్తస్ఫూర్తి యగుట లేదో అది వ్యావహారిక సత్త యనంబడును. కల్పితనివృత్తిని వ్యావహారిక సత్తగా నంగీకరించిన యెడల జ్ఞానోత్తరమునందు దానికి సంభవము కలుగుటలేదు. అందువలన అధిష్ఠానము కంటె భిన్నమగు కల్పితనివృత్తిని పారమార్థిక సద్రూపముగా జెప్పినయెడల ద్వైతమగును. ఈరీతిగా అధిష్ఠానముకంటె భిన్నమగు కల్పితనివృత్తిని అసత్తుగా జెప్పిన యెడల అసచ్ఛబ్దముయొక్క యర్థము అనిర్వచనీయమై యున్నదా? అథవా తుచ్ఛమై యున్నదా? అనిర్వచనీయ మని చెప్పినయెడల ఉత్తరత్ర చతుర్థ వికల్పఖండనమునందు దోషము చెప్పబడును. తుచ్ఛమని చెప్పినయెడల సంసార నివృత్తికి పురుషార్థము లేక పోవలయును. అందువలన ద్వితీయవికల్పము సంభవించుటలేదు. మఱియును అధిష్ఠానముకంటె భిన్నమునకు సదసద్రూపత్వము జెప్పినయెడల, ఏకపదార్థమునకు సద్రూపత్వమును, అసద్రూపత్వమును విరోధి యైనందున సంభవించుటలేదు. మఱియును సద్రూపముగా నంగీకరించినయెడల పూర్వోక్త సత్పక్షముయొక్క దోష మగును. అసద్రూపముగా నంగీకరించినయెడల అసత్పక్షముయొక్క దోష మగును. ఎట్లన, కల్పిత నివృత్తియందు సదంశ ముండుటవలన ద్వైతమగును. అసదంశము చేత నపురుషార్థమయ్యెడి. మఱియును సదసచ్ఛబ్దములకు నీరీతిగా నర్థము చేయబడు చున్నది. సత్తనగా వ్యావహారిక సత్తాశ్రయము. అసత్తనగా పారమార్థికసత్త

కంటె భిన్నము. అందువలన సదసత్తులకు విరోధములేదు. ఎట్లన ఘటాదికము వ్యావహారిక సత్తాశ్రయమయ్యును పారమార్థికసత్తుకంటె భిన్నముగా ప్రసిద్ధమైయున్నది. అందువలన నుక్తవిరోధము లేదు. పారమార్థిక సత్తునకు నిషేధమును చేయుటవలన ద్వైతము లేదు. వ్యావహారికసత్త యున్నది. తుచ్ఛము కాదు. అందువలన అపుపుషార్థమును లేదు. ఈరీతిగా నధిష్ఠానముకంటె భిన్నమగు కల్పిత నివృత్తి పారమార్థికసత్తాశూన్యమై యున్నది, వ్యావహారికసత్తాసహితమై యున్నది. ఈరీతిగా నీయభిప్రాయముచే సదసద్రూపమని చెప్పినయెడల, ప్రథమ వికల్పమునందు వ్యావహారిక సత్తుగా నంగీకరించిన యెడల, జ్ఞానోత్తరమునందు వ్యావహారికపదార్థమునకు అసంభవ మున్నది; అను నీ యేదోషము చెప్పబడియున్నదో ఆదోషముచేత నీయర్థముకూడ సంభవించుటలేదు. అందువలన తృతీయ వికల్పము కూడ సంభవింపదు. అధిష్ఠానముకంటె భిన్నమగు కల్పితనివృత్తి సదసద్విలక్షణమై యున్నదను నీచతుర్థపక్షము నంగీకరించినయెడల సద్విలక్షణ మని చెప్పుటవలన ద్వైతము లేదు. అసద్విలక్షణ మని చెప్పుటవలన అపురుషార్థత్వము కూడలేదు. తథాపి సంభవించుటలేదు. ఎట్లన, సదసద్విలక్షణము అనిర్వచనీయమై యున్నది. అందువలన కల్పితముయొక్క నివృత్తి అనిర్వచనీయమై యున్నది. అని సిద్ధించును. మఱియును మాయ, లేక దానియొక్క కార్యము, అనిర్వచనీయమై యున్నది. అందువలన నజ్ఞానసహిత సంసారనివృత్తియునుగూడ అనిర్వచనీయమైన యెడల, మాయారూప- లేక- మాయాకార్యరూపోక్త నివృత్తిని చెప్పిన యెడల, ఘటముయొక్క నివృత్తి ఘటరూపమై యున్నది, అనునీకథనమువలె ఉక్తకథనము హాస్యాస్పదమగును. మఱియును జ్ఞానముచేత అజ్ఞానసహిత ప్రపంచమునకు నివృత్తి కలిగినయెడల తదనంతరము పురుషార్థ సామగ్రి యేదియును లేదు, అని సిద్ధాంత మున్నది. బ్రహ్మజ్ఞానమునకు ఫలమగు కల్పితముయొక్క నివృత్తి మాయారూపమై లేక మాయాకార్యరూపమై యున్నది దానికి నివర్తకము ఏదియు లేదు. అందువలన మోక్షదశయందును గూడ మాయకును లేక దానియొక్క కార్యమునకు, నిత్యసంబంధ ముండుటవలన నిర్విశేష బ్రహ్మముయొక్క ప్రాప్తిరూప మోక్షమున కభావము కలుగును. అందువలన చతుర్థపక్షముకూడ సంభవించుటలేదు. ఈరీతిగా అజ్ఞానతత్కార్యములయొక్క నివృత్తి బ్రహ్మముకంటె భిన్నమై యున్నది, సద్రూపముకాదు. అందువలన ద్వైతాపత్తి లేదు. అసత్తు కానందున అపురుషార్థత్వములేదు. సదసద్రూపము కానందున ఉభయపక్షోక్తదోషములేదు. అనిర్వచనీయము కానందున మోక్

దశయందు అజ్ఞానమునకు తత్కార్యములకు శేషము లేదు. అందువలన ఉక్త చతుర్విధ ప్రకారముకంటెను విలక్షణమగు అజ్ఞానముయొక్క, తత్కార్యముయొక్క నివృత్తి బ్రహ్మముకంటె భిన్నమై యున్నది.

347. న్యాయమకరందకారరీతిగా ఉక్తచతుర్విధ ప్రకారముకంటె విలక్షణమయ్యును, బ్రహ్మముకంటె భిన్నమగు పంచమప్రకారరూప కల్పితనివృత్తియొక్క స్వరూపము.

పంచమప్రకారము దానికి చెప్పబడియున్నది. ఎట్లన, సదసద్విలక్షణ పదార్థములకు అద్వైతమతమునందు అనిర్వచనీయపరిభాష యెట్లున్నదో అట్లు (1) సద్రూపము, (2) అసద్రూపము, (3) సదసద్విలక్షణము,(4)అనిర్వచనీయ మను నీచతుర్విధప్రకారముకంటె విలక్షణప్రకారసహితమై అజ్ఞానతత్కార్యనివృత్తి యున్నది. చతుర్విధప్రకారముకంటె విలక్షణప్రకారమునకు పంచమప్రకార మని పేరు. అందువలన, అజ్ఞానతత్కార్యనివృత్తి బ్రహ్మముకంటె భిన్నమైయున్నది. ఆనివృత్తియందు పంచమప్రకార మున్నది. ఇది న్యాయమకరందమునందు వ్రాయబడి యున్నది.

348. న్యాయమకరందకారమతమునకు అసమీచీనత్వము.

అది సమీచీనముకాదు. ఎట్లన వ్యావహారిక సత్పదార్థము లోకమునందు ప్రసిద్ధమై యున్నది. అనిర్వచనీయపదార్థముకూడ ఇంద్రజాలకృతలోకమునందు ప్రసిద్ధమై యున్నది. ఈలాగుననే పారమార్థికసద్రూపపదార్థమగుబ్రహ్మము శాస్త్రమునందు ప్రసిద్ధమైయున్నది. మఱియును విద్వాంసులయొక్క యనుభవసిద్ధమై బ్రహ్మము ఆత్మయై యున్నది. ఈసర్వముకంటె విలక్షణమగు ఏవస్తువు లోకమందు శాస్త్రమునందు ప్రసిద్ధము కాదు: అత్యంతాప్రసిద్ధరూపాజ్ఞానసహితసంసారమునకు నివృత్తిని అంగీకరించినయెడల పురుషార్థత్వాభావము గలుగును. ఎట్లన పురుషుని యొక్క యభిలాషావిషయము పురుషార్థ మనంబడును. అత్యంతాప్రసిద్ధమునందు పురుషునియొక్క అభిలాష గలుగుటలేదు. ప్రసిద్ధమునం దభిలాష గలుగుచున్నది. అందువలన ప్రసిద్ధపురుషార్థము కల్పితనివృత్తికాదు. యద్యపి కల్పితనివృత్తిని అధిష్ఠానముగా నంగీకరించినను,సంసారమున కధిష్ఠానమగు బ్రహ్మము ప్రసిద్ధముకాదు. తథాపి, పూర్వానుభూతమునం దభిలాష గలుగుచున్నది, అను నీనియమము లేదు. ఇక నేమనగా, అనుభూతముయొక్క సజాతీయమునం దభిలాష గలుగుచున్నది. ఎట్లుభయరూపానర్థహేతువగు సర్పముయొక్క నివృత్తి, అధిష్ఠానరజ్జువైయున్న

దో, అట్లు జన్మమరణాదిరూపానర్థహేతువగు సంసారముయొక్క నివృత్తి అధిష్ఠానబ్రహ్మరూపమైయున్నది. ఈరీతిగా నధిష్ఠానత్వధర్మముతో బ్రహ్మరూపమగు సంసారముయొక్క నివృత్తి అనుభూతసజాతీయమైనందున పురుషునియొక్క యభిలాష సంభవించుచున్నది. పంచమప్రకారవాదియొక్క మతమునందు అనుభూత సజాతీయము లేనందున ప్రవృత్తిసంభవించుట లేదు. మఱియును అధిష్ఠానముకంటె భిన్నము నంగీకరించినయెడల భాష్యకారవచనమునకు విరోధమగును. భాష్యకారులచే కల్పితనివృత్తి అధిష్ఠానరూపముగానే చెప్పబడినది.

**349. న్యాయమకరందకారోక్త జ్ఞాతాధిష్ఠానరూపకల్పితనివృత్తి పక్షమునందు దోషమున కుద్ధారప్రసంగమునందు విశేషణోపాధులయొక్కయు ఉపలక్షణముయొక్కయు లక్షణము.**

జ్ఞాతాధిష్ఠానరూపకల్పితముయొక్క నివృత్తిని అంగీకరించుటయందు మోక్షదశయందు జ్ఞాతత్వము లేనందున, కల్పితనివృత్తికి అభావ ముండుటవలన, కల్పితమునకు నుజ్జీవన మగును, అను నేదోషము చెప్పబడినదో దానికి సమాధాన మేమనగా, జ్ఞాతత్వవిశిష్టమైనను, జ్ఞాతత్వోపహితమయినను, ఉండు బ్రహ్మము మోక్షకాలమునందు లేదు. ఎట్లన, జ్ఞాతత్వవిశేషణసహితము జ్ఞాతత్వవిశిష్టమనంబడును. జ్ఞాతత్వోపాధిసహితము జ్ఞాతత్వోపహితమనంబడును. కార్యమునందు సంబంధియై ఏవివర్తమాన వ్యావర్తకమై యున్నదో అది విశేషణ మనంబడును. ఉ. నీలరూపసహితమగు ఘట ముత్పన్నమైనది. ఈస్థానమునందు నీలరూపము విశేషణమై యున్నది. ఎట్లన, ఉత్పత్తిరూపకార్యముతో సంబంధి యయ్యును ఘటమునందు వర్తమానమై పీతఘటమునకు వ్యావర్తకమై యున్నది. మఱియును, కార్యమునం దసంబంధియై వర్తమానవ్యావర్తకము ఉపాధి యనంబడును. ఉ. భేర్యుపహితాకాశమునందు శబ్ద మున్నది. ఈస్థానమందు భేరి ఉపాధియై యున్నది. శబ్దముయొక్క యధికరణత్వమునందు భేరియొక్క సంబంధము లేదు. వర్తమానమగు భేరి, బాహ్యాకాశమునకు వ్యావర్తకమై యున్నది. మఱియును కార్యమునందు అసంబంధియై వ్యావర్తకమై యుండినయెడల, అది ఉపలక్షణ మనంబడును. ఉపలక్షణమునందు వర్తమానత్వాపేక్ష లేదు. అతీతముగూడ నుపలక్షకమగుచున్నది. ఉపాధి యయిననో విశేష్యముయొక్క సర్వదేశమునం దున్నది. ఉపలక్షణము ఏకదేశమునం దున్నది. ఉ. 'కాకవ ద్గృహం గచ్ఛ' అనునీ వ్యవహారమున్నది. ఏగృహమునందు కాకసంయోగము చూడబడినదో ఆగృహము

తో కాకము చలించిపోయిననుకూడ గమ్యము చేయబడుచున్నది. ఇచ్చట గృహమునకు కాక ముపలక్షణమై యున్నది. ఎట్లన, గమనరూపకార్యమునందు అసంబంధియై యున్నది. గృహముయొక్క ఏకదేశమునం దున్నది. ఈలాగుననె వర్తమానమయి మఱియు ప్రతీతమయి యున్నకాకము అన్యగృహమున కవ్యావర్తమై యున్నది. ఈరీతిగా విశేషణమును, ఉపాధియును వర్తమానములై యున్నవి. అందువలన విశేష్యముయొక్క సర్వదేశమునందు విశేష్యముయొక్క ఏదేశ- ఏకాలమునందు లేదో ఆదేశమునందు ఆకాలమునందు విశిష్టవ్యవహారము కలుగుటలేదు. ఉపహితవ్యవహారముకూడ కలుగుటలేదు.

ఇక నేమనగా, ఎంత కాలమునందు ఎంత దేశమునందు వ్యావర్తక మున్నదో, అంత దేశమునందు అంతకాలమునందు విశిష్ట వ్యవహారము, ఉపహిత వ్యవహారము, గలుగుచున్నది. అది మోక్షదశయందు జ్ఞాతత్వముయొక్క సంబంధము కాదు. ఇక నేమనగా, పూర్వజ్ఞాతత్వమై యున్నది. అందువలన జ్ఞాతత్వవిశిష్ట మయ్యును, జ్ఞాతత్వోపహితమయ్యును అధిష్ఠానము లేదు. వ్యావర్తక మాత్రము ఉపలక్షకమని చెప్పబడుచున్నది. వర్తమానమునం దభినివేశము లేదు. అందువలన విశేష్యముయొక్క ఏకదేశమందును, ఏకకాలమునందును సంబంధముండినను కూడ వ్యావర్తక ముపలక్షక మనంబడును. ఇతర పదార్థముతో భేదజ్ఞానము వ్యావృత్తి యనంబడును. విశేషణోపాధ్యుపలక్షణములు మూడును ఇతరముతో వ్యావృత్తిని చేయుచున్నవి. వీనిలో విశేషణము, ఏదేశకాలములయందు తాను ఉన్నదో ఆదేశకాలస్థ స్వవిశిష్ట విశేష్యమునకు వ్యావృత్తిని చేయుచున్నది. దేనికి వ్యావృత్తి విశేషణముచేత గలుగుచున్నదో అది విశిష్టమని చెప్పబడును. మఱియును ఏదేశకాలములయందు వ్యావర్తక మున్నదో, ఆదేశకాలస్థ వ్యావర్తనీయమునకు వ్యావృత్తినిచేసి తాను బహిర్భూతమై యున్నదో, అది ఉపాధి యనంబడును. దేనికి వ్యావృత్తి ఉపాధిచే గలుగుచున్నదో అది ఉపహిత మనంబడును. వ్యావర్తనీయముయొక్క ఏకదేశమునకు 'కదాచిత్' ఉండి వ్యావృత్తిని చేసి ఉపాధివలె తాను బహిర్భూతమై-ఏది యున్నదో అది ఉపలక్షక మనంబడును. దేనికి వ్యావృత్తియు ఉపలక్షణముచే గలుగుచున్నదో అది ఉపలక్షిత మనంబడును. అందువలన నిది సిద్ధమగుచున్నది. వ్యావర్తకము, వ్యావర్తనీయము, అను నీయుభయమునందును విశిష్ట వ్యవహారమున్నది. ఏదేశమునందు వ్యావర్తక మున్నదో అంత దేశమునందు నున్న

వ్యావర్తనీయ మాత్రమునందు ఉపహిత వ్యవహారము గలుగుచున్నది. కాని వ్యావర్తక సద్భావకాలమునందు వ్యావర్తకమును త్యజించి ఉపహిత వ్యవహారమగుచున్నది. వ్యావర్తనీయముయొక్క ఏకదేశమునందు 'కదాచిత్' వ్యావర్తకముండినయెడల అచ్చట వ్యావర్తనీయ మాత్రమునందు ఉపలక్షిత వ్యవహారమున్నది. ఇచ్చట వ్యావర్తక సద్భావాపేక్ష లేదు. ఈరీతిగా విశేషణాది భేదముచే అంతఃకరణ విశిష్టము ప్రమాతయై యున్నది. అంతఃకరణోపహితము జీవసాక్షియు, అంతఃకరణోపలక్షితము ఈశ్వరసాక్షియునై యున్నవి. ఇచ్చట ప్రసంగమేమనగా, మోక్షదశయందు జ్ఞాతత్వము లేనందున జ్ఞాతత్వ విశిష్టమయ్యు జ్ఞాతత్వోపహితమయ్యును, అధిష్ఠానము సంభవించుట లేదు. తథాపి జ్ఞాతత్వోపలక్షితాధిష్ఠానము మోక్షదశయందును కూడ ఉన్నది.

350. అధిష్ఠానరూప నివృత్తియొక్క పక్షమునందు పంచమ ప్రకారవాదియొక్క శంక.

పంచమ ప్రకారవాదియొక్క శంక ఏమనగా, దేనియందు 'కదాచిత్' జ్ఞాతత్వ మున్నదో దానియందు జ్ఞాతత్వాభావ కాలమునందు కూడ జ్ఞాతత్వోపలక్షితము నంగీకరించినయెడల జ్ఞాతత్వమునకు పూర్వ కాలమునందును గూడ భావియగు జ్ఞాతత్వము నంగీకరించి జ్ఞాతత్వోపలక్షితము చెప్పవలయును. పూర్వకాలమునందు జ్ఞాతత్వోపలక్షితము నంగీకరించినయెడల సంసారకాలమునందునుగూడ జ్ఞాతత్వోపలక్షితాధిష్ఠానరూప సంసార నివృత్తి యుండుటవలన అనాయాసముచేత పురుషార్థప్రాప్తియగును. అందువలన జ్ఞాతత్వాభావకాలమునందు జ్ఞాతత్వోపలక్షితాధిష్ఠానరూపకల్పిత నివృత్తిని చెప్పుట యోగ్యముకాదు.

351. ఉక్తశంకకు సమాధానము.

దానికి సమాధాన మేమనగా, వ్యావర్తకసంబంధోత్తర కాలమునందు ఉపలక్షిత వ్యవహారము కలుగుచున్నది. పూర్వకాలమునందు కలుగుట లేదు. ఎట్లు కాకసంబంధోత్తరకాలమునందు కాకోపలక్షితవ్యవహారమున్నదో జ్ఞాతత్వోత్పత్తికి పూర్వమగు సంసారదశయందు జ్ఞాతత్వోపలక్షితాధిష్ఠానము లేదు. ఉత్తరకాలమునందును కూడ జ్ఞాతత్వోపలక్షితాధిష్ఠాన మున్నది. దానియొక్క స్వరూపమే సంసార నివృత్తియై యున్నది.

352. న్యాయమకరందముకంటె నన్యరీతిగా అధిష్ఠానముకంటె భిన్నము సకల్పిత నివృత్తియొక్క స్వరూపము.

కల్పితముయొక్క నివృత్తి అధిష్ఠానముకంటె భిన్నమై యున్నది. అను నీ పక్షమునం దాగ్రహముండినయెడలకూడ న్యాయమకరంద గ్రంథమునందు అత్యంతా ప్రసిద్ధపంచమ ప్రకారాంగీకారము నిష్ఫలమై యున్నది. ఎట్లన, అనిర్వాచనీయముయొక్క నివృత్తి అనిర్వచనీయమై యున్నది. ధ్వంసమునకు నివృత్తియని పేరు. ఆధ్వంసమును అనంతా భావరూపముగా నంగీకరించి మఱి యును అధిష్ఠానముకంటె భిన్నముగా నంగీకరించినయెడల మోక్షదశయందు ద్వైతమగును. ఆధ్వంసము అనంతాభావరూపము కాదు. మఱియేమనగా క్షణిక భావ వికారమై యున్నది. యాస్కనామకమునులచే వేదాంగమగు నిరుక్తము చేయబడి యున్నది. దానియందు, జన్మసత్తా, వృద్ధి, విపరిణామ, అపక్షయ, వినాశము లని యీషడ్భావ వికారములు చెప్పబడియున్నవి. భావమనగా ననిర్వచనీయవస్తువు. దానియొక్క వికారము అవస్థావిశేషమై యున్నది. అని ర్వచనీయమునకు అవస్థా విశేషముండుటవలన జన్మాదిక నాశపర్యంతము అని ర్వచనీయమై యున్నది. ఎట్లన, ఈ. జన్మక్షణికమై యున్నది. ఎట్లన, ఆద్యక్షణ సంబంధము జన్మ మనంబడును. ప్రథమక్షణమునందు 'జాయతే' అను నీవ్యవహా రము గలుగుచున్నది. ద్వితీయక్షణమునందు 'జాతః' అను నీవ్యవహారము గలుగుచున్నది. 'జాయతే' అను నీవ్యవహారము కలుగుట లేదో అట్లు ముద్గ రాదికముచేత ఘటాదికమునకు చూర్ణభావము కలిగినప్పుడు ఏకక్షణమునందు 'ఘటోనశ్యతి' అను నీవ్యవహారము కలుగుచున్నది. ద్వితీయాదిక్షణమునందు 'నష్టో ఘటః' అను నీవ్యవహారముకలుగుచున్నది. 'నశ్యతి' అను నీ వ్యవహారము గలుగుట లేదు. అందువలన జన్మనాశములు క్షణికములై యున్నవి. వర్త మానజన్మఘటమున కున్నది. 'జాయతే ఘటః' అను నీవాక్యముచేత ప్రతీత మగుచున్నది. అతీత జన్మముఘటమున కున్నది. 'జాతోఘటః' అను నీవాక్యము చేత నదిప్రతీత మగుచున్నది. అదేప్రకారముగా ఘటమునకు వర్తమాననాశ మున్నది. "నశ్యతిఘటః" అనునీవాక్యముచేత నదిప్రతీత మగుచున్నది. మఱి యును 'నష్టోఘటః' అను నీవాక్యముచేత ఘటముయొక్క అతీతనాశము ప్రతీత మగుచున్నది. ఆధ్వంసరూప నాశ మనంతమైనయెడల నాశమునం దతీతత్వ వ్యవహారము లేకపోవలయును. అందువలన నాశమనంతము కాదు. ఇకనే మనగా క్షణికమును, భావవికారమునై, ఉన్నది. అందువలన అభావ రూపము కాదు. మఱియును అనుపలబ్ధి నిరూపణమునందు అనంతాభావధ్వం సము చెప్పబడినది. అది న్యాయరీతిగా చెప్పబడినది. వేదాంతమతమునందు ఏకాత్మ్యాంతాభావమే అభావపదార్థమై యున్నది. ఈరీతిగా కల్పితముయొక్క

నివృత్తి క్షణికమై యున్నది. అనిర్వాచనీయమైయున్నది. ఎట్లు విద్వాంసులయొక్క అనిర్వాచనీయ శరీరాదికము జ్ఞానోత్తరమునందును కూడ ప్రారబ్ధబలముచేత కించిత్కాలముండి ద్వైతమునకు సాధకము కాదో అట్లు జ్ఞానోత్తరకాలము నందును కల్పితముయొక్క నివృత్తి ఏకక్షణ మున్నది. అందువలన ద్వైతమునకు సాధకము కాదు. ఏకక్షణోత్తరమునందు కల్పితముయొక్క నివృత్తికి అత్యంతాభావ మున్నది. అది బ్రహ్మరూపమై యున్నది.

353. ఉక్తమతమునందు పురుషార్థస్వరూపము. దుఃఖాభావము లేక, కేవలసుఖము.

ఈమతమునందు దుఃఖనివృత్తి క్షణికభావ మైనందున పురుషార్థము కాదు. ఇకనేమనగా, దుఃఖాభావమే పురుషార్థమైయున్నది. అథవా దుఃఖాభావముకూడ పురుషార్థముకాదు. ఇకనేమనగా కేవలసుఖమే పురుషార్థమై యున్నది. ఎట్లన, అనంతదుఃఖసహిత గ్రామ్యధర్మములకు సుఖమున్నది. దానియందు స్వభావముచేత సకలజీవులకు ప్రవృత్తి కలుగుచున్నది. దుఃఖాభావముకూడ పురుషునియొక్క అభిలాషవిషయ మైనయెడల సర్వథాదుఃఖగ్రసితసుఖమునందు పురుషాభిలాష లేకపోవలయును. మఱియును, ఎచ్చట దుఃఖాభావమునందు అభిలాషయున్నదో అచ్చటనుగూడ స్వరూపసుఖానుభవమునకు ప్రతిబంధకమగు దుఃఖమున్నది. దానియొక్క యభావకాలమునందు స్వరూపసుఖమునకు ప్రాదుర్భావమున్నది. అందువలన దుఃఖాభావమునందు పురుషాభిలాష స్వరూపసుఖమునకు నిమిత్తమై యున్నది. ఈరీతిగా ముఖ్యపురుషార్థము సుఖమైయున్నది. దుఃఖాభావము కాదు. అందువలన దుఃఖాత్యంతాభావము కూడ బ్రహ్మరూపముగా నంగీకరింపక అనిర్వాచనీయ మని యంగీకరించినగూడ దానికిగూడ నీబాధ సంభవించుచున్నది. కాని అనిర్వాచనీయముయొక్క బాధరూపాభావము అధిష్ఠానరూపముగా అనుభవసిద్ధమై యున్నది. అందువలన నజ్ఞానసహితభావాభావరూప ప్రపంచమును, దానియొక్క నివృత్తియును, సకలమును అనిర్వాచనీయమై యున్నవి. ఆసమస్తమునకు అధిష్ఠానరూపబాధ కలిగి నిర్ద్వైతస్వరూప పరమానందరూప పరమపురుషార్థము మోక్షమై యున్నది.

ఇది శ్రీమన్నిశ్చలదాసాహ్వాయసాధువిరచితమగు వృత్తిప్రభాకరమునందు
జీవేశ్వరస్వరూప నిరూపణపూర్వక వృత్తిప్రయోజన నిరూపణ
సహితకల్పితనివృత్తి స్వరూపనిరూపణ మను
నష్టమ ప్రకాశము సమాప్తము.
వృత్తిప్రభాకరము సమాప్తము.

శ్రీరామాయనమః.

# బ్రహ్మానందద్వాదశమంజరీ.

వందే బ్రహ్మానందం ప్రత్యాహాగజేన్ద్ర పంచాస్యం।
ఆనందావిర్భావం సంభావితసర్వభూమానం॥

వసంతతిలకవృత్తమ్.

బ్రహ్మాదిదేవపరిచిహ్నితభద్రమూర్తిం
జన్మాదిషడ్విధవికారవిహీనమీశం।
నందాత్మజార్పితనవీన మనోవిభూతిం
సర్వాత్మకం మమ గురుం శరణం వ్రజామి॥

మందాక్రాంతావృత్తమ్.

బ్రహ్మానందం విషయవిధురం వేదవేదాంగవేద్యం
విశ్వాత్మానం విమలయశసం వీతరాగాదిదోషం।
శాంతాకారం శతమఖముఖప్రాప్తవిద్యావిభూతిం
ధీరం వందే మమ గురువరం దివ్యబోధాధిరూఢమ్॥

ద్రుతవిలంబితవృత్తమ్.

సకలలోకశివంకరశంకర-ప్రభుదయార్జితభాష్యరసోదయమ్।
జితహిమాచలసేతుగతాఖిల-ప్రబలపండితజాలసమాహితం॥ 1
హరిహరాబ్జభవాఖిలదేవతా - నివహకల్పితకౌతికవిగ్రహం।
గ్రహణమాత్రసుభాషితబుక్కిభో-ద్గతరహస్యవిశేషవినోదితం॥ 2
కలితసద్దరహాసముఖాంబుజో-ద్గళితతత్త్వరసామృతవాగ్యుతం।
సుమనసాజితసర్వసుధీవరం - శరణమాత్మవిచారవతాం సదా॥ 3
రదనపఙ్క్తిసముద్భవసుప్రభా-హసిత శారదచంద్రమరీచికం।
పరమహంససమాజవిభూషణం - నిజపరాత్మకభేదవిభేదకమ్॥ 4
యువతిజాలమహాహ్రదశోషణ - క్షమనిదాఘవిభాయుతభాస్కరం।
విషయవర్జితపూరుషరక్షణ - ప్రసరహస్తకృతాభయదం భృశమ్॥ 5

భవమహాగ్రహపీడితమానుష - ప్రకరశిక్షణపాటవమాంత్రికం।
పరమహంససమార్జితపావన - ప్రవిమలాశ్రమసారసషట్పదం॥ 6
కుజనగర్వతమోహతిభాస్కరం-కుహకవాదిమదేభమృగాధిపం।
కలితశిష్యనదీనివహార్ణవం-కమలజాధవసుస్థితిసాధకం॥ 7
విషయజాలలతా వినికృంతన-ప్రబలయోగిపరశ్వధసంయుతం
మునిజనస్తుతసత్త్వనికేతనం-మురహరార్పితసంతతమానసమ్॥ 8
నిగమబృందశిఖోక్తిభిరీడితం-గహనకల్మషబృందదవానలం
నతజనప్రియకామదకల్పకం-భవమహాంబుధితారణసుప్లవమ్॥ 9
విజయసూతసమర్పితమానసం- మనసిజాతవికారవికర్తనం
కరణకర్తృవిశిష్టవిలాసినం-లసదపాంగకృతాఖిల శోభనమ్॥ 10
నిరుపమం నిరయస్థితిభంజకం-నిబిడదోషమహాభ్రసమీరణం
ప్రకటభూరియశోవిభవార్జితం-ప్రళయకాలకృతాంతకృతాంతకమ్॥ 11
సమధికం సచరాచరవిగ్రహం-ప్రియతమం సదయం మహిమాన్వితం
సకలలోకసమావనదీక్షితం-మమ గురుం నితరాం హృది భావయే॥ 12

# శ్రీకృష్ణస్తవపఞ్చకమ్

వ్రజయువతి చకోరీబృంద రాకాశశాంకే
వరజనిత యశోదావల్లవీ భాగధేయే
సకలవిషయదూరే సచ్చిదానందసారే
భవతు మమపరస్మిన్ శేముషీ భాగ్యరూపా ౧
విజితమదనవేషే వీతరాగాదిదోషే
శ్రుతిశిరసివిదీప్తే సంయమిస్తోమగుప్తే
భవభయపరిహారే భక్తబృందానుసారే । భవతు ... ౨
మునిజనవరలోలే మోక్షమార్గానుఖేలే
విగతవిషయజాలే విశ్వజన్మాదిలీలే
నతజనపరిపాలే నందగోపాలబాలే । భవతు ... 3

నిఖిలభువనగేహే నిర్జితాశేషమోహే
విహితకలుషదాహే విశ్వవంద్యాద్రివాహే
దహర వివరగూహే దర్శితానందదోహే । భవతు ... ౪
వదనహసితచంద్రే వల్లవీమోహతంద్రే
పుషితమదగజేంద్రే పుణ్యకీర్తిప్రసాంద్రే
విజితవచసిమంద్రే విశ్రుతాలోకకేంద్రే । భవతు ... ౫

# శ్రీకృష్ణస్తవ పఞ్చకమ్ - ద్వితీయమ్.

సంసారదుష్టగహనస్థదవానలోయః
కృత్వాభువం విగతకంటక రాజధానీం
మోదం చకార మునిభూప సమాజభాజాం
కష్ణ స్స మే భవతు కామదకల్పభూజః. ౧
బ్రహ్మాండభాండ పరిపూర్ణవపుర్విశేషో
యో దేవకీసదనకల్పితవాసయుక్తః
అంబాసముద్ధృతకరస్థ జలాభిషేకః । కృష్ణః ... ౨
మోహాదిముక్త మునిమానస రాజహంసః
కామీ సదాకలిత గోపవధూసమాజే
వేదాంతవిశ్రుత విశేషజగద్విలాసః । కృష్ణః ... ౩
భీష్మాదిధన్వనికరార్ణవబాడబస్సః
భూత్వార్జునస్యచ మనోరథసారథిర్యః
నిన్యే కృతాంత సదనం ప్రతి ధార్తరాష్ట్రాన్ । కృష్ణః ... ౪
కూపస్థభేకవదమాన్యకుమానవైర్యో
దుష్ప్రాపణో దురితజాలతమః ప్రభానుః
శ్రీవత్సచిహ్నిత రమాయుత దివ్యవక్షాః
కృష్ణ స్స మే భవతు కామదకల్పభూజః. ౫

# శ్రీ కృష్ణ స్తవః.

నందగోప వరమందిరాజిరో - త్తుంగహర్మ్యవిలసచ్ఛ్రియం భజే,
నందనందన మవాప్తకామితం - నారదాది మునిబృందసేవితమ్. ౧
చండదీధితి మఖండవిగ్రహం - భండనే కృతసురారిఖండనం,
పుండరీక సమలోచనం భజే - పండితప్రకర హేమ మండనమ్. ౨
కామాది దోషార్దిత మానుషాంచ
త్కల్యాణ కృద్గోపవధూ కిశోరం,
సర్వాంతరం దేవ మపేతమోహం
స్మరామి కృష్ణం మమ మానసాబ్జే. 3
ప్రభుం సకలకామదప్రథితకల్పభూజం సతాం
నితాంత కరుణామృతప్రసర పోషితాఖండలం
విరించిముఖ దేవతానివహ వంద్య పాదాంబుజం
నమామి సతతం హరిం సకలదైత్య లుంటాకినమ్. ౪

---

ఇతి శ్రీవాడపల్ల్యన్వయపారావారరాకాసుధాకరుండును, కౌండిన్యస గోత్రుండును రంగేశ్వరామాత్య ప్రపౌత్రుండును, కొమ్మనామాత్య పౌత్రుండును, వేంకటరామేశ్వరామాత్యపుత్రుండును, స్వయంప్రకాశ బ్రహ్మానందాశ్రమపరమహంసపరివ్రాజకాచార్యవర్య ప్రియశిష్యుండును నగు పట్టాభిరామ శర్మచే పండితానంతనారాయణశాస్త్రి సాహాయ్యంబున నిశ్చలదాసాహ్వాయ సాధు విరచితంబగు వృత్తిప్రభాకరనామక హిందీగ్రంథం బాంధ్రీకరణంబు శ్రీకృష్ణపరబ్రహ్మార్పణంబుగ నొనర్పంబడి నిర్విఘ్నంబుగా సమాప్తం బయ్యెను.

ఓం శ్రీమత్స్వయంప్రకాశ బ్రహ్మానందగురుపరబ్రహ్మణేనమః.

